ప్రథమ ముద్రణ మార్చి 1986
ప్రతులు : 3000
ద్వితీయ ముద్రణ జూలై 1998
ప్రతులు : 1000



ఈ గ్రంథము ద్వితీయముద్రణ :
**సర్వార్థ సంక్షేమ సమితి,** ఆధ్యాత్మిక సేవా సంస్థ,
హైదరాబాదు, వారిచేత ముద్రించబడినది.



ప్రతులకు :
**పి. వి. మనోహరరావు**
105, సిరాజ్ ప్లాజా అపార్ట్‌మెంట్స్,
వీధి నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : ~~7618541~~, 7603308 : 7627284
మరియు
**సర్వార్థ సంక్షేమ సమితి,** 501, ప్రదీప్ అపార్ట్‌మెంటు,
వీధి నెం. 8, బాకారం, గాంధినగర్, హైదరాబాద్ - 500 380.

మూల్యము : **రూ॥ 300/- ($15/-)**

ముద్రణ :
సూర్య ప్రింటర్స్
సెకండ్ బజార్, సికింద్రాబాద్.
ఫోన్ : 7706611

---

ఈ గుర్తు యాత్రా సంబంధము

ఈ గుర్తు తాత్పర్య మరియు విషయ సంబంధము



# వినతి

''శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్న వదనం ధ్యాయే త్సర్వ విఘ్నోప శాంతయే''

ఓం శన్నోమిత్రః శం వరుణః । శన్నోభవత్వర్యమా
శన్న ఇన్ద్రోబృహస్పతిః

శన్నోవిష్ణురురుక్రమః । నమోబ్రహ్మణే నమస్తే వాయో
త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి ।

త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి,
ఋతం వదిష్యామి

సత్యం వదిష్యామి । తన్మామవతు, తద్వక్తారమవతు,
అవతు మా మవతువక్తారమ్

ఓం శాన్తిః శాన్తిః శాన్తిః

ఓంకార శబ్దము పరమాత్ముని సర్వోత్తమమైన నామము. ఇందలి అ, ఉ, మ్ యను పక్షరముల కలయికయే ''ఓమ్'' యొక్క సమూహము. ఈ 'ఓమ్' నుండియే

పరమేశ్వరుని యనేక నామోచ్చరణలుద్భవించుచున్నవి 'అ'కారము 'విరాట్' అగ్ని విశ్వాది నామములకు 'ఉ' కారము హిరణ్యగర్భ వాయుమున్నగు నామములకు 'మ' కారము ఈశ్వర ఆదిత్య ప్రాజ్ఞాది నామములకు, వాచక గ్రాహకములుగానున్నవి. ఇట్లు వేదము, సత్యము, శాస్త్రములు స్పష్టముగా ఆ పరమాత్మ సార్థక నామములేయని వ్యాఖ్యానించు చున్నవి.

ప్రథమ నామమగు ఈ 'ఓమ్' సమస్త ధర్మానుష్ఠాన, తపశ్చరణ, బ్రహ్మచర్యాశ్రమమును జరుపుచు నెల్ల వేళల నెవనిని గోరుచున్నామో అతడే 'ఓమ్'. ఎవడు సూక్ష్మాతి సూక్ష్ముడో, సర్వప్రకాశకుడో, సమాధిచే తెలియబడునో యాతడే 'ఓమ్' యని, పరమాత్మ యని తెలియవలెను.

సర్వప్రకాశకుడు కాన 'అగ్ని' విజ్ఞానుడగుటచే 'మనువు' లోకములు బాలించుగాన 'ప్రజాపతి', ఐశ్వర్యయుతుడగుటచే 'ఇంద్రుడు ', ఎల్లరకు జీవాధారమగుటచే ''ప్రాణము'', నిరంతర వ్యాపకుడుగనుక 'విష్ణు' జగత్ సృష్టికర్తగాన 'బ్రహ్మ', దుష్టుల దండించునుగాన 'రుద్రుడు', సర్వకళ్యాణ కారకుడగుటచే 'శివుడు', సర్వదాయవినాశి కావున 'అక్షరుడు', స్వయం ప్రకాశకుడుగాన 'స్వరాట్టు', ప్రళయకాలమందెల్లరకు కాలుడు గాన ''కాలాగ్ని'' యని అనేకానేక నామములు ఆ పరమేశ్వరునికి గలవు. ఇవి దేవతామూర్తులకే గాక అయా దైవీతత్వములకు కూడ చెందియున్నవి.

ఓంకార తత్వములోని మిత్రాది అనేకనామములు ఆ పరమేశ్వరునివే. స్తుతి, ప్రార్థన, ఉపాసన, శ్రేష్ఠులగు వారి గుణకర్మ స్వభావమందు, సత్య వ్యవహారమందు, అన్నింటికిని మిన్నయగువానిచే శ్రేష్ఠులలోకెల్ల పరమశ్రేష్ఠుడందురు. అయనకు సములెవరుండరు. సర్వజ్ఞత, సామర్థ్యము మున్నగు అనంత గుణములు ఆ పరమేశ్వరునికి తప్ప వేరెవరికుండును? కావున అయన స్తుతి, ప్రార్థన ఉపాసనలే మానవుల కాచరణీయము, పూర్వపు విద్వాంసులు, ఋషులు, దైత్యులు, దానవులు, మానవులు ఆ పరమేశ్వరుని, స్తుతించి, విశ్వసించి ఉపాసించి మోక్షముల వడసిరి.

సర్వశ్రేష్ఠుడు, విరాజమానుడు, అనంతబల సంపన్నుడు ఆ పరమాత్మకు నమస్కరింతును. ''ఓ పరమేశ్వరా ! సకలవ్యాపక ప్రత్యక్ష బ్రహ్మవు, నిత్యప్రాప్తుడవు, వేదస్థుడవు, నీ యాజ్ఞశిరోధార్యము, సత్యము చెప్పి సత్యమును నమ్మిన నన్ను రక్షింపుము. ధర్మస్థుడనగునట్లు కరుణింపుము. అధ్యాత్మిక, రాగద్వేషాది ఆధిదైవిక ప్రమాదముల నుండి మమ్ముగాపాడి, సదా కళ్యాణకారకములయందు, ప్రవర్తింప బురిగొల్పుము. సమస్త జీవకోటి హృదయ కవాటములలో సదా ప్రకాశించు చుందువు గాక!'' అన్నిటికి మూలమగు ఆ పరమాత్మయే 'విరాట్' శక్తిగ నున్నను, లోకములో జనులు వివిధ రూపములలో వివిధ నామములతో పూజించుచున్నారు.

కొందరు విష్ణువును, సర్వగతుడు, సర్వపాలకుడు, విరాట్‌స్వరూపుడు, పరాత్పర, నారాయణ, హృషీకేశ, జనార్ధన వాసుదేవమున్నగు పలునామములతో పేర్కొనుచు నుపాసించుచున్నారు.

కొందరు మహాదేవుని శంకర, పంచవక్త్ర, త్రినేత్ర, కైలాసవాస, మొదలైన పేర్లతో నుపాసించుచున్నారు. అట్లే సూర్యుని, వాయువును, అగ్నిని, వరుణుని, గణపతిని, స్కంధుని మున్నగు వారిని మరికొందరు స్తోత్రము చేయుచు ఆరాధించుచున్నారు.

తోడ్తో ప్రకృతికి ఆధారభూతమగు నాది శక్తియే సర్వమునకు మూలా ధారమనుటయు కలదు. ఆ శక్తియే త్రిమూర్తులకు సృజన, పాలన, సంహార శక్తులకు ప్రతీక. అంతేకాక సూర్య, చంద్ర ఇత్యాది బ్రహ్మాది స్థంభ పర్యంతమున గల నీ చరాచర ప్రచంచముప 'శక్తి' యే ధర్మ ప్రతీకయనియు తెలియును, ధర్మార్ధ, కామమోక్ష పథముల కధికారిణియగు ఆ 'పరాశక్తి' కల్ప వృక్షము మాదిరిగా, సర్వశక్తి, యుక్తి, రక్తులను కల్పించి, యిచ్చువది యని సర్వశాస్త్ర సమ్మతము కావున మానవ జన్మనెత్తినందులకు, జన్మసాఫల్యమునకు, ఆ పరాశక్తిని ప్రార్థనోపాసనాదులచే ధ్యానించుట యెంతేని యోగ్యము. ఏ నామముతో పిలిచినను ''సర్వదేవనమస్కారః కేశవంప్రతిగచ్ఛతి'' యన్నట్లు చివరికి ఆ కేశవుడగు పరమాత్మకే చెందును. ఆ విధంగా భారతదేశంలో అనేక సంప్రదాయములు, ఆచారములు కొనసాగుచున్నవి.

శ్రీమంతంబగు భరతవర్షము, సకల కళ్యాణభాసురమై సర్వ సంపద సమృద్ధమై, కర్మభూమియై, ధర్మావలంబనమైనది. ఇది అనాదినుండియు, ఆధ్యాత్మిక, తత్వ, జిజ్ఞాసలకు, ఆలవాలమై నేటి నాగరిక ప్రపంచమున కూడ ధర్మభక్తి, ప్రవత్తుల, వేద, విజ్ఞాన, పఠన, పాఠన, ఆగమ, కర్మల, యధావిధి, ననుసరించు, నిష్ణాతులకు నిలయమై నొప్పుచున్నది.

''ఏతద్ధర్మ సనాతనః'' యను ఆర్యోక్తిచే, మన ధర్మము, సంస్కృతి, సనాతనము నుండియు, అమృతభాషయగు సంస్కృతము ద్వారా లుప్తము కాకుండ నిలిచియున్నది. ముందు ముందు కూడ నిలచియుండును. మన హిందూధర్మము ఏదోనొక ప్రవక్త మూలకముగా వ్యాప్తి చెందినదిగాదు. అందుచేతనే, ''భారతం నామ తద్వర్షం, భారతీ యత్ర సంతతీ'' యని నుడివిరి. కారణరహితముగా మనకు సుఖ దుఃఖాదులు లభించవని, మన ధర్మశాస్త్రము నిర్దేశించుచున్నది. అంతేకాక, మనధర్మము సనాతనమైనందున మన అనుకూల అననుకూలతల ననుసరించియు కాలాను గుణ్యముగను మారునది కాదు. అది నిరంతరము ఒకే మాదిరిగా విరాజిల్లుచునే యుండును.

కావున మన ధర్మమును, సంస్కృతిని, భారతీయతను, జాతీయ సమేకతను, కాపాడుకొనుట ప్రతి భారతీయునికి కర్తవ్యమైయున్నది. నేటి యువతరము ఆందోళనలకు,

అలజడులకు, అసంతృప్తికి, మన సనాతన ధర్మమును విస్మరించుటయేగాక, అనేక ఆర్థిక, సాంఘిక లోపభూయిష్ట ప్రవర్తన, కార్యాచరణ ''మాకాయ్ఘుష్యం మాకారోగ్యం'' యను భావన, యని చెప్పవచ్చును. మన కర్మ సిద్ధాంతము నెంతగ బోధించినను అణగద్రొక్క-బడుచున్న సజ్జన సౌశీల్యవంతుడు కూడ ఒకానొక సందర్భమున పిల్లియే పులిలా విజృంభించు మాదిరి ఎదురు తిరుగు ప్రమాదము లేక పోలేదు. ప్రతి పౌరుడు శాంతి సుఖ జీవనమునే కోరుకుంటాడు. కావాలని ఆందోళనల అవాంతరముల లేవదీయ సంకల్పించరు. కావున ''స్వల్ప మవస్య ధర్మస్య'' యను భగవత్ వాక్కుచే అత్యవసర, ఆర్థిక, సాంఘిక, చట్ట సమ్మత మార్పులు చేసికొనియైనా, పై వానిని కాపాడుకొనుట సమంజస మనుటలో భిన్నాభిప్రాయ ముండబోదు. అందుచే ధార్మిక రాజనీతిజ్ఞ ప్రభుత్వ ఇతర రంగములలోని పెద్దలు, మేధావులు, కృషి జరుపవలసిన అవశ్యకత ఎంతేని కలదు.

యుగ ప్రవర్తనానుసారము ''కలి'' తన ఉధృతముతో ధర్మ, కర్మలను రూపుమాపుటకు బూనుకొనుటయే నేటి దశయై యున్నది. అయినను మన ఋషిపుంగవులు బలీయమగు 'కలి' ప్రభావమును తిరస్కరించుచు, సద్ధర్మాచరణను పాటించుచు, సదాచార సంపన్నులుగా వెలసియుండుటయును సంస్కృతీ పరిణామమే. పూర్వము శౌనకాది మహామునులు 'కలి' సామర్థ్యమును దూరీకృత మొనరింప నిశ్చయించి, బ్రహ్మను గూర్చి ధ్యానతపము లాచరించిరి. పరమేష్ఠి సంతసించి ప్రత్యక్షమై ఆ మునులకొక 'చక్రము' నిచ్చి, దానిననుసరించి పొండు, అది యెచట నిలుచునో, అచట ఆశ్రమముల నిర్మించుకొని మీమీ విధుల నిర్వర్తింపుడు. అచట 'కలి' ప్రవేశించనలవిగాదు'' అని నుడివెనట. మునులు అలాగే చక్రము వెంట పోగా 'నేమిశీర్ణ' మనుతావున ఆ చక్రమాగిపోయెనని అచటనే మునులు పర్ణశాలలు నెలకొల్పుకొని, తపోయాగాదులు జరుపుకొనుచుండుటచే నది 'నైమిశారణ్య', మను నామముతో విఖ్యాత మైనది.ఇట్టి పవిత్ర స్థలమున ''కలి''కి తావులేక, కలి పురుషుడు ప్రవేశించ వీలులేకనేటికిని మన భరత వర్షమున ల అనేక క్షేత్రములు, ధర్మనిరతితో నడుచుచున్న విషయము సువిదితమే.

అందుచే నేటి కాలమున కూడ జిజ్ఞాసువులు జ్ఞాన ధర్మ మార్గములను గుర్తించి, శిష్ఠ హిందూ ఆచార సాంప్రదాయములను కడుజాగరూకతతో, కాపాడుకొని సాంఘిక జీవితములను సుఖ సంతోష నిలయములుగా గావించుకొనుట యెంతేని అవసరము.

శ్రీ కైవల్యముతో ఆరంభమగు 'భాగవతము ' శ్రీ కృష్ణార్జునులచే నడుపబడిన గారతము' శ్రీరాముని శౌర్యోదారాది గుణములు తెలియచేయు 'రామాయణము' కోనే కాక వేద పురాణాల్లోను కైలాస మానససరోవర విశేషములు వర్ణింపబడియున్నవి. నిదంపతులగు సాక్షాత్ పార్వతీ పరమేశ్వరుల నిలయమే ఈ కైలాసమని కైవల్యమును ను యోగి, ఋషి పుంగవులు పలు గ్రంథములలో చాటి చెప్పియున్నారు.

సులభ రవాణా సదుపాయములున్న ఈ రోజులలో కూడ కైలాస యాత్ర అత్యంత కఠినమై, సాహసోపేతమై, ప్రమాదభరితమై యున్నది. తగుపాటి మనోధైర్యము, కార్యదీక్ష, దేహదార్ఢ్యము, ఆరోగ్యము, ధనము, గల వారే గాక, నుదుట వ్రాయబడినవారుమాత్రమే ఈ యాత్రను జయప్రదముగా సమర్థతగా చేయుదురని గ్రహించాలి. దీనిని బట్టి మన పూర్వీక యాత్రీకులు ఏలాటి సాధన సదుపాయములు లేని నాటి స్థితిలో ఎంతగా సాహసించెడివారో, ఎన్నెన్ని ఇక్కట్లు బడెడి వారో ఊహించవచ్చును. ఎలాగైనను ఇది కఠిన పరీక్షలతో కూడిన యాత్ర యనక తప్పదు. అందుకేనేమో ఎవరైన హఠాన్మరణము జెందితే వ్యంగ్యముగా ''కైలాసము'' న కేగెనని 'టపే' మని చెప్పుట వాడుకలో యున్నది. అయినను భక్తిపరులకు పుణ్యతీర్థ సందర్శన ప్రకృతి శోభల నాస్వాదించు కాంక్షా పరులకు, సాహసోపేతులకు ఇలాంటి కఠిన పరీక్షలు, ఇడుములు, ఆటంకములు, గణనకు రానేరవు.

బహుజన్మాంతర పుణ్య విశేషముచే ఆ పరమాత్ముడు మానవజన్మ ప్రసాదించినది ఈ సంసారకూపములోబడి కొట్టుమిట్టాడుటకే కాదు కదా ! జన్మ సాఫల్యమునకు మోక్ష సాధనకు గల ఎన్నో మార్గ ములలో యాత్రలు, క్షేత్ర దర్శనములు ఒక భాగమైయున్నవి. యాత్రల వలన ఎనలేని ఇతర ఫలములును పెద్దలు నిర్దేశించిరి. ఆ యా రాష్ట్ర ప్రజల, పాలకుల, భావనా పాలనా రీతులు అధ్యయనమగును. ఆ యా ప్రదేశముల, సాంస్కృతిక, ధార్మిక సాంఘిక, ఆచారవ్యవహారముల విధిగా పాటింపవలసి వచ్చుటచే భిన్నత్వములో ఏకత్వము, సహజీవనము, జాతీయ సమేకత, మరియు విశ్వసౌభ్రాతృత్వ భావము పెంపొందును. సాధు, సజ్జన సాంగత్యముచే తెలియని విషయములు తెలిసి మేథో సంపత్తి పెంపొందును. దేహదార్ఢ్యము, మనోనిబ్బరము పెరుగును. గురువుల, పుణ్యపురుషుల, విద్వాంసుల, దీనజనుల సాంగత్యము లభించును. ఇంద్రియ నిగ్రహము కష్టసహిష్ణుత అలవడి, భగవద్భక్తి ధ్యాన సమాధులందు శ్రద్ధాసక్తులు పెరుగును. అందుకే బమ్మెర పోతనామాత్యులు భాగవతములో ''చేతులారంగ శివుని పూజింపడేని'' యను పద్యమున దైవపూజ భక్తిలేని మానవుని జననము తమ తల్లుల కడుపుచేటుకే యని నిందించాడు.

కష్టసాధ్యమైన యాత్రలలో మనము, ప్రకృతి సౌందర్య నిసర్గ శోభల నాస్వాదించునప్పుడు గులాబీలలో ముండ్లలాగ, మొగలిరెకులలో నాగుల లాగ, పట్టుపరుపులలో కంటకములలాగ, గాఢ నిద్రలో పీడకలలలాగ, కొన్ని ప్రమాదములు అవరోధములు యెదురగుచుండును. అందుకే ఒక మహానుభావుడు '' **The natures breath taking beauty is accompanied by death taking duty** " అన్నాడు. ప్రకృతి సౌందర్య, సందర్శ, నాభిలాషి, ప్రకృతిసిద్ధ, మరణమును, కూడ వెంట నిడుకొనియే పోవుననుట యధార్థమైయున్నది.

మాలో మంచి కండపుష్టిగలిగి, వేయిట్‌లిఫ్టర్‌గా పేరుగాంచిన కీ.శే. శ్రీరామక్రిష్ణన్‌గారు పది రోజులపాటు పర్వతముల గడచి యెక్కుచు దిగుచు ప్రతిదినము

డ్క్టరు పరీక్షలో నుత్తీర్ణుడగుచు పదకొండవరోజు లిపులేఖ్ దాటగనే ఏ రోగబాధలేక నడుస్తూ నడుస్తూ క్రింద పడి హఠాన్మరణము బొందుట చూచినచో ఆ అనుభవము పై యధార్ధమునకు దృష్టాంతరమే యై యుండుననిపించక మానదు.

ప్రపంచములో శారీరక, మానసిక, ఐశ్వర్యములతో, పలుసౌఖ్యములతో జీవించే వారెందరోయున్నారు. వారిలో ఎందరు ఆధ్యాత్మికానందమును సాధించగలుగుతారు? కైలాస మామస సరోవరములలాటి పుణ్య హిమాలయ క్షేత్రముల దర్శించి ప్రకృతి సందర్శనచే దివ్యానుభూతుల నోచు కొంటారు? కీ. శే. పండిత్ జవహర్‌లాల్ నెహ్రూగారు కైలాస మానస యాత్ర జరుపుటకు ఉబలాటపడ్డారని, కాని అంతటి మహానుభావునికి ఆ కోరిక నెరవేర లేదని స్వయముగా వ్రాసికొన్నారు. అట్టి సందర్భములను విచారించివచో ఎంతటి వారికైనను ప్రాప్తము, ప్రారబ్దము కూడ తోడ్పడవలసి యుండు నునది యధార్ధమని తోచకమానదు.

కావున ఈశ్వరానుగ్రహమున ఈ పవిత్ర యాత్రను ది.19-7-83 నుండి 17-8-83 వరకు పూర్తిచేసిన నేను, నాచూచిన దృశ్యములు, పొందిన అనుభూతులు, ఏరోజుకారోజు 'డైరీ' లో వ్రాసుకొనుట జరిగినది. ఇల్లు చేరగనే ఇవన్నియు ఒక వ్యాస రూపములో పత్రికాముఖంగా పాఠకులకు తెలియ చేయవలయునను ఉత్సుకత మాత్రమే యుండెను. కాని నేను నాయాత్రముగించి స్వస్థలము చేరగనే నా అనుభవములను నాల్గైదు రోజులవరకు గ్రామఫోను రికార్డులా చెప్పినదే పలువురు మిత్రులకు బంధువులకు చెప్పుట జరిగినది. అది విన్న ముఖ్యులలో మా మాతృమూర్తి పేరగల 'రుక్మిణీ సీతరామారావు స్మారక విద్యాలయ ' ప్రిన్సిపాల్ కీ॥ శే॥ శ్రీ కనకయ్యగారి ప్రోద్భలము నే నీ పుస్తకము వ్రాయుటకు ప్రేరేపించినది.

దీనికి తోడుగా జీవితములో పదిమంది కుపకరించు ఏవో శాశ్వతమైన మంచి పనులు చేయవలయునను చిరకాల సంకల్పముండి యున్నందున, ఈ విధముగా ఆ ధ్యేయము నెరవేరబోవుచున్నదేమో యను ఆకాంక్షయు తోడైనది. లోగా నేను జనించిన గ్రామమునకు కొన్ని సత్కార్యములు చేయు, నవకాశము ఆ భగవంతుడు కల్పించినందున నా శక్తివంచన లేకుండా, అలాంటి ప్రజోపయోగ మంచి పనులు ఎన్నో చేసియు నాలోఏదో అసంతృప్తి మిగిలియుండెను.

నాకు తెలిసినంతలో కైలాస మానసయాత్ర సంబంధ సవివర తెలుగు రచన వెలువడలేదు. అందుచే నేను పండితుడను కాకున్నను, రచయితనుకాకున్నను లోగా రచనానుభవము లేకున్నను, ఈ పుస్తక రచనా వ్యాసంగమునకు సాహసించి, ఈ గ్రంధమను సువర్ణమును 'మూస' యను పాఠక మహాశయుల 'తప్త ' మను పఠనము ద్వారా ఇది

నిజమైన బంగారమో, ఇత్తడియో తేల్చగలందులకు 'కవి యే మెరుగు రసజ్ఞుడెరుగు' యన్నట్లు మీ ముందుంచుచున్నాను.

మా యాత్ర ఒక నియమిత పంథా గలది. మేము నియమిత సమయములో ప్రతిరోజు గమ్యస్థానము చేరాలి. నియమిత కాలములో తిరుగు ప్రయాణముద్వారా స్వస్థలములకు రావాలి. అలాగే జరిపితిమి. కావున అచటి ఆచార వ్యవహారములు సాంఘిక, చారిత్రిక, భౌగోళిక, విషయములను సంపూర్ణముగా నధ్యయనము చేసి గ్రహించే వీలులేదు. అందుకై అనేక గ్రంధముల పరిశీలనావశ్యకత కలిగినది. యాత్రానుభవములతోపాటు పౌరాణిక గాథలను, సందర్భానుసారముగ పొందుపరుచుటయు జరిగినది. లేనిచో ఎంత సేపు పర్వతారోహణ, అవరోహణ, నదీ, దృశ్య సందర్శన తప్ప పుస్తకములో నేమియు నుండకపోయెడిది. దీనిచే పాఠకులలో పఠనాసక్తి, విషయాసక్తి, కలుగునని తలచాను.

ఈ పుస్తకములో సందర్భానుసారముగా పొందుపరచుటకు ఈ క్రింద వివరించిన పుస్తకముల అధ్యయనము తోడ్పడినది. శ్రీమద్భాగవతము, భారతము, రామాయణము, దేవిభాగవతము, మేఘసందేశము, కుమార సంభవము, భర్తృహరి, సత్యార్థ ప్రకాశ, భగవత్ స్తుతి, దాసబోధ, హిందూధర్మము, మనుచరిత్ర, శ్రీమత్‌భగవద్గీత, భారతీయశకములు, కైలాస్ మానససరోవర్(ఆంగ్లము)వాండరింగ్స్ ఇన్ హిమాలయాస్ (ఆంగ్లము) బుద్ధిజమ్ (ఆంగ్లము) జై కైలాష్ జైమానస్(హిందీ) ఇత్యాది అనేక గ్రంథముల పరిశీలించి ఆయా విషయముల సేకరించి పొందుపరచుట జరిగినది.ఈ సందర్భమున ఆయా గ్రంథకర్తలకు నాయొక్క కృతజ్ఞతాభివందనములు సమర్పించుకొనుట సమంజసమని భావిస్తాను.

ఈ పుస్తకరచన పూర్తిచేసిన తరువాత మున్ముందుగా నాకు సర్వ విధాల ఆప్తులు, శ్రేయోభిలాషులు, సాహిత్య ప్రియులగు కీ॥ శే॥ శ్రీ పాములపర్తి సదాశివరావు అన్నగారికి నా వ్రాతప్రతిని ఇచ్చి ముద్రణ యోగ్యమగునాయని తిలకించ కోరితిని. వారు దానిని పూర్తిగ పఠించి సంస్కరించి ప్రోత్సహించిరి. అంతేకాక ఈ పుస్తకమున కొక ప్రామాణికత తేగోరి, ఓరుగల్లులో గల ప్రముఖ సాహితీవేత్తలు, సంస్కృత, తెలుగు, పండితులగు శ్రీమాన్ డా॥ కోవెల సుప్రసన్నా చార్యులు, డా॥ మృత్యుంజయ శర్మగారు, డా॥ శ్రీ భాష్యం విజయసారధి గారలు, శ్రీ శాస్త్రుల భార్గవ రామశర్మ గారలు ఇత్యాది పెద్దలను కలసి, వారితో ఈ పుస్తక ప్రచురణ ప్రస్తావించి, వారివారి అమూల్య రచనలను కోరి సేకరించుట జరిగినది. ఇంతటి మహోన్నత సౌశీల్య సోదరులగు శ్రీ సదాశివ రావుగారు ఈమధ్య దివంగతులగుట నా మనసును ఎంతగానో కలచివేసినది. - వారి ఆత్మకు శాంతి చేకూరాలని ఈ సందర్భంగా ప్రార్థిస్తాను.

పిదపటి దశలో శుద్ధ ప్రతిని తయారుచేయుటకుగాను శ్రీమతి శ్యామలా కృష్ణారావుగారలు, కీ॥ శే॥ శ్రీ అర్. సుదర్శనంగారును తోడ్పడి, కోరినదే తడవుగా శుద్ధ

ప్రతిని వ్రాసి యిచ్చినారు. మరి కొన్ని రోజులకు మా ఆప్తమిత్రులు, పండితులు, కళాకారులు; జ్ఞానవృద్ధులు కీ॥ శే॥ శ్రీ నెమలికంటి జగన్నాధంగారి సహాయముతో ఈ పుస్తకములో ఆయా సందర్భములలో వలయు శ్లోకములు పద్యములు పౌరాణికములనుండి ఎన్నుకొని జతపరచుట జరిగినది. అంతేగాక శ్రీ సదాశివరావు అన్నగారును 'బుద్ధిజమ్ ' లాంటి, పలుగ్రంథముల నుండి మరికొంత అమూల్య సమాచార మందించగా పొందు పరచుట జరిగినది. ఈసందర్భమున పై పెద్దలందరు నాపై చూపిన అనురాగ, అభిమాన, సహకారములకు హృదయ పూర్వక కృతజ్ఞతాభివందనములు సమర్పించుకొనుటయే తక్షణ కర్తవ్యము.

మనశ్శాంతియే కరువైన నేటి పరిస్థితులలో పుస్తకరచనే కష్టమనుకుంటే దానిని ముద్రించుట ఒక యజ్ఞములాంటిది.. ముద్రణానంతరము పాఠకులకు ఎంతవరకు రుచించునో, ఎంత ఉపయుక్తమగునోయనునది మరొకజిజ్ఞాస. పుస్తకము పాఠకుల చేతికందుట మరొక ఆర్థికగడ్డు సమస్య. ఏది యేమైనా పుస్తక రచనా, ప్రచురణా వ్యాసంగము, నాలాటి వారందరికి బహువ్యయ ప్రయాసలమయమై యున్నదనుట నిర్వివాదాంశము.

నా చిన్ననాట ఏడవ యేటనే మా తండ్రిగారు దివంగతులగుచు బాల్య ప్రాయులమగు మా ఇరువురు తమ్ములను మాఅగ్రజుల చేతిలో అప్పగించి కన్నుమూసిరి. తదాదిగా మా అగ్రజులనే తండ్రికన్న దైవముకన్న మిన్నగా భావించుచు, వారి ప్రతి ఆజ్ఞను శిరసావహించుచు, భయ భక్తులతో గౌరవాభిమానములతో నేటికిని మసలుచున్నాము. తెలిసి యేనాడును వారి కీర్తి ప్రతిష్ఠలకు కళంకమాపాదించు నేలాటి కార్యము తలపెట్టలేదు. భవిష్యత్తులో కూడ అలాటి అవకాశము కలుగదనే నా విశ్వాసము.

అందుకే

శ్లో॥ ''అతి దాక్షిణ్య యుక్తానాం, శంకితానాం పదే పదె
పరాపవాద భీరూనాం, దూరతో యాంతి సంపద''

అన్నారు గదా !

మా అగ్రజులు, మా ఔన్నత్యమును గోరి, ఎనలేని ఆదరభావముతో ప్రేమానురాగములతో సదా మాకు మార్గదర్శకత్వము వహించి, సహకరించినారు. వారి రుణ విముక్తి ఈ జన్మకు సాధ్యపడదేమో.

నిజ జీవితములో ఏమైనా సత్కార్యములు సాధించగలనో తెలియని నాకు పెద్దగా అడియాసలు లేకున్నను, మా సంతానమునకు చేయవలసిన కనీస విద్యుక్త ధర్మములు కొన్ని మిగిలియుండెను. కాని వేడి రక్తము ప్రవహించు మా బిడ్డలకు ఆశలు, ఆశయాలుండుట సమర్థనీయములే. వారి ఆశలు మాత్రము అడియాసలు కాకూడదని ఒక తండ్రిగా కోరుకొనుటయు అసమంజసము కాదని భావిస్తాను.

పదునెనిమిది సంవత్సరముల క్రితము దివంగతురాలైన మా మాతృమూర్తి ''రుక్మిణీదేవి'' స్మరణను, మా అగ్రజులు శ్రీ పి.వి. నరసింహారావుగారు నాటి భారత విదేశాంగశాఖామాత్యులు, నే నా నాడు తెచ్చిన మానస జలమును వారికీయగనే ''మన అమ్మవుండి వుంటే ఎంతగా సంతసించెడిదో'' అని మా మాతృమూర్తి స్మృతి సంకల్పమును తలపించినారు.

''అమ్మలగన్నయమ్మ ముగురమ్మల మూలపుటమ్మ'' అన్నట్లుగా, శతాధిక సంతతికి మూలము మా అమ్మ. ఆమె భగవద్భక్తి, పుణ్యతీర్థాభిలాష, బ్రాహ్మణసేవ అన్నదానాదులందభిరుచి, మున్నగు ఆమె మహోన్నత ఆదర్శములు మాకు అవిస్మరణీయములు. మా అగ్రజులంతటి సరస్వతీ పుత్రుని గని పెంచిన అమ్మ మా అమ్మ. ప్రపంచమున ధనకనక వస్తు వాహనములన్నియు లభించును, కాని అపారమగు సంపదలను వెచ్చించినా అమ్మ మాత్రము లభించదు. అందుచే ఈ శుభ సందర్భమున అమ్మకు అంజలి ఘటించుట నా ప్రథమ కర్తవ్యము.

'అక్కరకు రాని చుట్టము' అని పద్యము నేర్పిన అయ్యవారి నాటి నుండి నేను చేసిన ప్రతి అల్లరిని భరించి, అన్నము మాని అలిగితే ఆదరించి అల్లారు ముద్దుగా తినిపించిన మా అమ్మ, అడుగడుగునా, ''ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధిరస్తు'' అంటు మనసార దీవించిన మా అమ్మ, నా చేతులార తెచ్చిన ఆ పవిత్ర మానససరోవర జలమును ఆవేదనతో అమ్మ ఆత్మకు అంకిత మొనర్చి ఊరడిల్ల గోరుచు, ''మాతృదేవోభవ'' అను నానుడిచే అమ్మ ఈ చిరుకానుక స్వీకరించి, ధన్యత చేకూర్చాలని ఆకాంక్షిస్తూ హృదయ కుసుమాంజలి సహస్రములు అర్పిస్తున్నాను.

ఈ పుస్తక ముద్రణకు సహృదయతతో ఆర్థిక సహాయమందించిన సాంస్కృతిక వ్యవహారముల శాఖ కేంద్ర ప్రభుత్వము వారికి, శ్రీ రాజ రాజేశ్వరస్వామి దేవస్థానము వేముల వాడ నాటి పాలక వర్గమునకు, ఇ.ఓ. గారికి, మంజూరి యిచ్చిన నాటి దేవాదాయ కమీషనరుగారికి, శ్రీ తిరుపతి తిరుమల దేవస్థాన పాలక వర్గమునకు, ఇ.ఓ. గారికి, మరియు ఎడిటర్ 'సప్తగిరి' కె. సుబ్బారావుగారికి, మరియు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారముల శాఖ వారికిని, సిర్పూరు పేపరు మిల్స్ యాజమాన్యమునకు తదితర ప్రదేశ మిత్రులకు హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేయుచున్నాను. అలాగే ఈ ద్వితీయముద్రణను స్వీకరించిన **సర్వార్థ సంక్షేమ సమితి** ట్రస్టు వారికి కృతజ్ఞతలు తెల్పుచున్నాను.

సకాలములో ముద్రణ జరిపించి యిచ్చిన సహజ ప్రింటర్స్ అధినేత శ్రీ ఆర్.ఎస్. కృష్ణమూర్తిగారికి, వారి సిబ్బందికి, రంగు చిత్రములు ముద్రించిన కోదండా ప్రింటర్స్ అధినేత శ్రీ నవీన్‌గారికి, వారి సిబ్బందికి, అచ్చుతప్పులను సవరించి అందించిన

శ్రీ సీతారామాంజనేయులుగారికి, తన ఫోటో నెగిటివ్‌లు అందించిన యాత్రిక మిత్రుడు శ్రీ కిశోర్ గారికి, కంప్యూటరు కంపోజిటర్ శ్రీ ఎ. దయానంద్ గారికి, కవర్ పేజి సమకూర్చిన వారికి మరియు ఇతర విధాల ప్రచురణకు తోడ్పడిన ఎల్లరకు కృతజ్ఞతా పూర్వక వందనము లర్పించు చున్నాను. ఈ రెండవ ముద్రణను ప్రత్యేక శ్రద్ధ వహించి పొల్లులు లేకుండా ముద్రించి ఇచ్చిన ''సూర్యప్రింటింగ్ ప్రెస్'' అధినేత శ్రీ సంజీవరావుగార్కి, వారి సిబ్బందికి, పొల్లులు సవరించిన శ్రీ మూర్తిగార్కి కలర్ ఫోటోలు ముద్రించిన వారికి ప్రత్యేక కృతజ్ఞతలు తెల్పుకుంటున్నాను.

అంతేగాక ఎన్నెన్నో రాచకార్య బాధ్యతలలో నిమగ్నమై యుండియు నాపై ఆప్యాయతతో ''తొలి పలుకు'' వ్రాసి పంపిన మాఅన్నగారు శ్రీ పి. వి. నరసింహారావు గారికి, ఎన్నో ధార్మిక కార్యములలో నిమగ్నమై ఆశీస్సులు పంపించిన శ్రీశ్రీశ్రీ భారతీ తీర్థస్వాములు జగద్గురు శృంగేరి శారదా పీఠాధిపతులకు, మరియు కీ॥ శే॥ శ్రీశ్రీశ్రీ త్రివిక్రమ రామానంద భారతీస్వామి కురుతాళం శ్రీ సిద్ధేశ్వరీ పీఠాధిపతులకు, స్వహస్తములతో ఆశీర్వదించిన కీ॥ శే॥ శ్రీశ్రీశ్రీ చంద్రశేఖర సరస్వతీస్వాములు కాంచికామకోటి పీఠాధిపతులు పెద్దస్వాముల వారికి, ఎన్నెన్నో సాహిత్య ఉద్యోగ బాధ్యతలలో నిమగ్నమై యుండియు అభినందనలు వ్రాసి పంపించిన శ్రీ డా. సి. నారాయణరెడ్డి నాటి వైస్. ఛాన్సలర్ మరియు నేటి M.P. గారికి, ప్రొ. కోవెల సుప్రసన్నాచార్యులుగారికి, ప్రొ. లక్ష్మణమూర్తిగారికి, మరియు ఎల్లవేళల నా భవితవ్యమున్కై నా పుస్తకమున్కై తపనపడుచు, సంస్కరించి, కృషించి, పరిచయ వాక్యములు వ్రాసియిచ్చిన కీ॥ శే॥ శ్రీ పాములపర్తి సదాశివరావు అన్నగారికి, సర్వులకు నా యొక్క కృతజ్ఞతాపూర్వక సహస్రాంజలులు ఘటించుచున్నాను-

చివరి మాటగా ఈ గ్రంథ ప్రచురణ సమయమున నాడు ఊహలకందని అవాంతర విపత్తుల సుడిగుండములు అకస్మాత్తుగా ఎదురగుట వలన కొంత ఆలస్యము జరుగుట ప్రథమ కారణము. ముద్రణ నిమిత్తమై ఆర్థిక సంబంధ సహకారములో పలువురు మాటలతో మభ్య పెట్టి రిక్తహస్తములు చూపుట ద్వితీయము. ఇక తప్పనిసరిగా రంగుచిత్రముల ముద్రణకు పెద్దల ఆశీస్సులు, అభినందలకు ఎదిరి చూచుట తృతీయ కారణము: ఈ పుస్తకమున కొన్ని అచ్చుతప్పులు, ఇతరత్రా దోషములు, అనివార్యమై యున్నందున పాఠక రసజ్ఞులు పొల్లులు మన్నించి, సహృదయతతో సదంశములను స్వీకరించి, నాకు ప్రోత్సాహము నొసంగుదురని విశ్వసించుచున్నాను. ఇందలి స్ఖాలిత్యములను ఈ ద్వితీయ ముద్రణలో సాధ్యమైనంత సవరించ యత్నించగలిగితిని. అంతేగాక, ఈ గ్రంథములో అచటచట కొన్ని సందేశములు, లేదా ఉపదేశాత్మకముగా దొర్లిన మాటలను నా స్వంతమని భావించక, నేనంతటి మహోన్నతుడను కాదని సవినయముగా మనవి చేయుచు అవి కేవలము పెద్దల ఉపదేశ పునరుక్తములుగానే ఎంచగలరని ప్రార్థన.

ఈ ద్వితీయ ముద్రణలో మరికొన్ని శ్లోకాలు పద్యాలు, ఫోటోలు చేర్చుట జరిగినది. మరియు ప్రధమముద్రణలోని, వర్తమాన భాషా ప్రయోగమును భూతకాలముగా మార్చనైనది. మరియు ఈ పుస్తకావిష్కరణ సభ ఏర్పాటు చేసిన శ్రీ వి. బి. ఎన్. శర్మగార్కి వారి జ్యోతిష పీఠ సభ్యులకు, సభకేతెంచి దిగ్విజయపరచిన పెద్దలకు మిత్రులకు, లేఖల ద్వారా ఆకాంక్షించిన శ్రేయోభిలాషులకు తదితరముగా సహకరించినవారికెల్లరకు, గ్రంధముఖంగా ధన్యవాదములు తెల్యచేయుచున్నాను.

దాదాపు 2 సం॥ క్రితం ఈ గ్రంధం గురించి శ్రీ పాత్తూరు వెంకటేశ్వరరావుగారిచే నాకు ఇంటర్వ్యూ, దూరదర్శన్‌లో యేర్పాటు చేయబడినది. ఆ కార్యక్రమము చూచిన ప్రేక్షక మహాశయులెల్లరు స్పందించారు. ఆనందించారు. అభినందించారు. దూరదర్శన్‌వారికి, శ్రీ వెంకటేశ్వరరావుగార్కి, తిలకించిన ప్రేక్షక మహాశయులకు, కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. అలాగే ఈ ద్వితీయముద్రణకు ఆశీఃపూర్వక అభిప్రాయము పంపిన శ్రీ మాడుగుల నాగఫణి శర్మగార్కి అభివాదములు. ఈ గ్రంథము వలన భారతీయుల ముఖ్యాతిముఖ్య క్షేత్రమగుకైలాసయాత్ర వివరణచే ఆ యాత్రీకులకు, యాత్రచేయ స్తోమత, ప్రాప్తములేని వారికి తదితర రసజ్ఞులకు, జిజ్ఞాసువులకు ఉపయుక్తము కాగలదని ఆశిస్తున్నాను. ఈ నా గ్రంథమునకు పాఠక మహాశయుల ఆదరణ, అభినందనలు లభించినందులకు నాకృషి సఫలీకృతమైనట్లుగా భావిస్తూ మనవిచేయుచు ఈ నాలుగు మాటలచే ఆ గౌరీసహితకైలాస వాసుని మనసార ప్రార్థిస్తూ, సర్వులకు, సదా సద్బుద్ధులు, సకల సంపదలు, సదాయురారోగ్యములను సద్వృష్టిని సమకూర్చుగాక యని సవినయంగా ఆకాంక్షిస్తూ ప్రార్థిస్తూ ముగిస్తున్నాను.

బుధజన విధేయుడు

**పాములపర్తి వెంకట మనోహరరావు**

( వంగర, కరీంనగరం జిల్లా. )

హైదరాబాదు.




''సర్వేజనాః స్సుఖినో భవంతు''



''ఓం నమో గౌరీ కైలాస నాథాయ''

శ్లో. వందే శంభు ముమాపతిం సురగురుం వందే జగత్కారణమ్
వందే పన్నగ భూషణం శశిధరం వందే పశూనాం పతిమ్
వందే సూర్యశశాంక వహ్నినయనం వందే ముకుంద ప్రియమ్
వందే భక్త జనాశ్రయం చ వరదం వందే శివం శంకరమ్.

# కృతికర్త



పి. వి. మనోహరరావు

చేతులారంగ శివుని పూజింపడేని
నోరునొవ్వంగ హరికీర్తి నుడువడేని
దయయు సత్యంబు నిసుమంత దలపడేని
పుట్టనేటికి తల్లుల పొట్టచేటు.

# సమర్పణము - అమ్మకు



**కీ. శే. రుక్మిణీదేవి గారు**

ఎన్ని జన్మలపున్నెమో ఈ తనువున
తల్లి ! నీ యనురాగ సంతర్పితుడగు
చిన్ని కొడుకీయనున్న యీచిన్ని యుపద
నీ పదాబ్జములందున నిలుచుగాక !!
మీ ప్రేమామృత సేకమై పెరిగనే డీకొమ్మ పుష్పించె వి
ద్యా ప్రేయస్సుమమై, మనోహరము యాత్రారూపమై తల్లి! పు
త్ర ప్రారంభములెట్టివో తెలియరాదానీకు ఈ గ్రంధమం
తః ప్రజ్ఞానిధి, నీ పదాబ్జముల నర్పాస్విద్గమున్ జేయుతన్ !!
నన్నెట నుండియో యిటకు నాడతి ప్రీతిగమోసి తెచ్చియే
జన్నముతోడమిమ్మె నిట శాశ్వతమూర్తుల జేయగోరితో
వెన్నలతోడగారముల పెట్టిన చేతికి నిత్తునమ్మ! యీ
పున్నెములన్నియుంగురియు పాత్తముకొమ్మిదె రుక్మిణీసతీ.!!

శ్రీ పి.వి. నరసింహారావు
మానవ వనరుల అభివృద్ధి శాఖామాత్యులు
భారత ప్రభుత్వము - న్యూఢిల్లీ.

తేది :11-6-1986



# తొలిపలుకు

కైలాస మానస సరోవర యాత్రను గురించిన, ఈ గ్రంథంలో భారతీయ ప్రాచీన సంస్కృతికి చెందిన కొన్ని ముఖ్యాంశాల వివరణకు పూనుకొనడం జరిగింది. హిమాలయ మేరు పర్వతాలు, గంగా, యమునా, సింధూ నదులు, హిందూ దేవీ దేవతా గాధలకు, చెందే పలు ప్రదేశాలు, అనేక ఋషుల, ఆశ్రమ కేంద్రాలు, హిమాచల పరిసరాలలోని ఎన్నో

పవిత్ర స్థలాలు పేర్కొనబడ్డాయి. మన పండితులు, భారతీయ దేవీ దేవతలు, ఉత్తర ప్రాంత భూములకు, భారపతీయ ఆచార్యులు, దక్షిణ సీమకు చెందినట్లుగా, ఉద్ఘాటించియున్నారు.

వైదిక సంస్కృతి, జైన, బౌద్ధ సంస్కృతి, పౌరాణిక సంస్కృతి అనే మూడు శాఖలు కూడ భారతదేశానికి చెందినవే. ఈ మూడు సంస్కృతులు కూడ విశ్వవ్యాప్తంగా ప్రభావం వేసినవి. మానవ నాగరికతావ్యాప్తిలో అసాధారణ పాత్ర వహించినవి. ఆర్యులు మధ్య ఆసియా నుండి భారతదేశానికి.వలస వచ్చారనియు భారతీయ ఆదిమవాసులైన ద్రావిడులపై ఆధిపత్యం వహించారనియు, కొందరు చరిత్రకారులు భావిస్తున్నారు. మరికొందరు అలా కాక ఆర్య వైదిక సంస్కృతి, ఆదినుండి భారతదేశానికి చెందియున్నదేనని అభిప్రాయ పడుతున్నారు. ఈ సుదీర్ఘ వివాదంపై ఇతోధిక పరిశోధన కావలసివుంది.

గత రెండు శతాబ్దాలలో, పాశ్చాత్య విద్వాంసుల, ఆధిక్యత, మన విజ్ఞాన విద్యా రంగాలలో విరివిగా కొనసాగినది. ఆ ప్రభావం నేటికీ కొనసాగుతూనే వుంది. విదేశీ పరిపాలనలో, సంస్కృతీ విజ్ఞాన రంగాలలో కొన్ని నియంతృత్వ ధోరణులు అమలైనవి. దివ్య జ్ఞాన సమాజానికి చెందే, మేడం బ్లావైట్స్కీ, అనీ బిసెంటు, మిస్టర్ జడ్జి లాంటి వారు; తమకు విశ్వాంతరాళాలనుండి, కుతుమి, మోర్యాయనే ( బౌద్ధ) దివ్యాత్మలనుండి, దివ్య సందేశాలు వస్తుంటాయని చెపితే, నిజమే కాబోలు ననుకొని విశ్వసించినవారు అనేకులున్నారు. తుదకు అదంతా బూటకమని, కీ.శే. జిడ్డు కృష్ణమూర్తి గారు ఖండించిన విషయం సువిదితాంశమే. బ్రిటీషు హయాంలో, ఇలాంటి ఉదంతాలు అనేకం జరిగినవి.

సింధులోయకు చెందే హరప్పా మొహంజదారో సంస్కృతి ద్రావిడులకు చెందినదా, ఆర్యులకా అంటూ వాదవివాదా లిప్పటికీ కొనసాగుతున్నవి.

ఇక్ష్వాకు మహారాజు సరస్వతీ నదీ తీరంలో ఒక యజ్ఞం జరిపినట్లు, పిదప అచట నుండి అగ్నిని వెంట తీసుకొని అయోధ్యకు తరలి పోయినట్లు సరయూ గంగానదీ తీరాల మధ్యగల అడవులను కాల్చివేసి, అక్కడ స్థిరపడినట్లు మన వేదం చెపుతుంది. అలాగే ఋగ్వేదంలో పేర్కొనబడిన దాశరాజు యుద్ధప్రసక్తిలాంటి విషయాలలో, ఇతోధిక, పరిశోధన అవసరమవుతుందని కొందరు పురాతత్వవేత్తలు, భావిస్తున్నారు. భూగర్భంలో గల అనేక పురాతత్వ రహస్యాలను మన మింకా వెలుగులోకి తేవడం, మరికొన్ని త్రవ్వకాలకు పూనుకొనడం వాంఛనీయము. అప్పుడు మాత్రమే సమగ్రమైన హైందవ సంస్కృతీ వివరణ సాధ్యపడుతుంది.

అలాగే బౌద్ధ సంస్కృతీ విలోకనకు కూడ, ఇతోధిక ప్రాధాన్యత నివ్వవలసి వుంటుంది. హైందవ మత సాంప్రదాయ ఆచార విహారాల వికాసక్రమంలో, బౌద్ధము కూడ యెంతో ప్రాధాన్యత కలిగి వుంది. బౌద్ధమతంలో, బుద్ధుని అనంతరకాలంలో,

అనేక మార్పులు, కూర్పులు, చేర్పులు జరిగినవి. మహాయాన సాంప్రదాయాలలో విగ్రహారాధన, అవతారతత్వం, పునర్జన్మవాదం లాంటి, హిందూమత భావాలు చోటు చేసుకున్నవి. మంత్రయానం వజ్రయానం, సహజయానం (జెన్) అనే ధ్యానమార్గంలాంటి సాంప్రదాయాలు అమలులోకి వచ్చినవి. అవి ఆసియా ఖండాన్నంతా, ఆవరించి ఈనాటికీ అమలులో ఉంటున్నవే. ఈ విషయాలలో విశ్వ విద్యాలయ స్థాయిలో ఇతోధిక పరిశోధనలను ప్రోత్సహించడం వాంఛనీయమౌతుంది. ఆదిశంకరుల గురువైన గౌడపాదాచార్యులు బౌద్ధ సాంప్రదాయంచే ప్రభావితులైనట్లుగా చెప్పబడుట సువిదితాంశమే. ఆయన బుద్ధుని హైందవావతారంగా గుర్తించి ప్రస్తుతించారు. నాగార్జునుని మాధ్యమిక వాద భావాలను తన కోరికలతో ప్రచ్ఛన్నంగా ఆమోదించారు. ఆ విధంగా వేదాంత విలోకనలో, బౌద్ధంకూడ పాత్ర వహించింది. ఎలాగైనను బౌద్ధ, జైన, హిందూ సంస్కృతీ సాంప్రదాయాలు, ఆచార వ్యవహారాలు, చిరకాల సహజీవనం జరిపి ఎన్నెన్నో ఆదాన ప్రదానాలకు లోనైనవి. ఆయా వివరాల వైజ్ఞానిక పరిశోధన ఆసక్తిదాయకం కాగలదనడంలో సందేహం లేదు.

మన చరిత్రలో, అశోకుడు, కనిష్కుడు, హర్షుడు మున్నగు రాజులు, నాగార్జునుడు, వసుబంధుడు, అశ్వఘోషుడు, దీపంకరుడు, పాహియాన్, యువాన్‌సాంగ్, ఇత్సింగ్ మున్నగు అసంఖ్యాక విద్వాంసులు, యాత్రికులు బౌద్ధ సాంప్రదాయ విస్తరణకు కృషి చేశారు. నలందా, విక్రమశిల, వల్లభి, విశ్వ విద్యాలయాలు, రాజగృహ, వైశాలి, పాటలీపుత్ర జాలంధర, అనూరాధపుర, బౌద్ధ విశ్వ మహాసభలు, చరిత్ర ప్రఖ్యాతమై ఉన్నాయి. సారనాథ, అజంతా, వల్లభి, సాంచి, గయ, అమరావతి మున్నగు బౌద్ధ పీఠాల వైజ్ఞానిక ప్రాభవం విశ్వవ్యాప్తి చెందినది. ఈ కేంద్రాల ద్వారా భారతదేశం శాంత్యభ్యుదయ స్వాంతంత్ర్య సందేశాలను యావత్ప్రపంచానికి అనుగ్రహించింది. అలా దేశదేశాంతరాలలో సుఖ, శాంతి సమృద్ధులను పంచిపెట్టింది. ఆ సముజ్వల ఉదంతాలు మనకు అవిస్మరణీయాలు. పిదప ఆదిశంకరుల అనంతరకాలంలో, బౌద్ధ, జైనమతాలు, రక్తపాత రహితంగా హిందూమత సాంప్రదాయాలతో సమరసమై పోవడం కూడ ఒక అద్భుతావహ అనుభవము. ఇలాంటి సముజ్జ్వల, సాంస్కృతిక చరిత్ర మనభారతదేశానికి చెంది యుండడం అపురూప విషయం. అంతేకాక భారతదేశం నాటికీ నేటికీ శాంత్యభ్యుదయ పంథాలోనే పయనిస్తూ వుందని, మన ఇటీవలి స్వాతంత్ర్యోద్య మానుభవాలు నిరూపిస్తున్నాయి. ఆ ప్రాతిపదిక పైనే మనం, అలీన, పంచశీల, విధానాలను ప్రతిపాదిస్తున్నాము.

ఇతర రంగాలలో వలెనే, మత, ఆధ్యాత్మిక వేదికలలో కూడ, మంచి చెడు అనే రెండు ధోరణులు యెదురౌతుంటవి. అతీతశక్తులను గూర్చి, మహిమలను గూర్చి,

స్వకపోలకల్పనలుగా, స్వప్నాలుగా రూపొందుతుంటాయి. కొన్ని క్షుద్రధోరణుల నలా వుంచి, మన ప్రాచీన గ్రంథాలలో తరచు ధార్మిక, నైతిక న్యాయ విలువలకు చెందే విశిష్ట విలోకన ప్రతిబింబిస్తుంటుంది. వీటితోబాటు, సాహిత్య కళారంగాలలో, అమూల్య ఉత్తేజనతో కూడిన, సృజనాత్మకత; ప్రముఖ పాత్ర వహిస్తుంది. మన చిత్రకళ, మూర్తికళ, వాస్తుకళ, చైత్య, ఆరామ, విహార నిర్మాణకళ, అద్భుతావహ విలువలతో కూడుకొని, సాంస్కృతిక పరంగా, జగద్విఖ్యాతమైనవి. బౌద్ధ ధర్మసందేశం ద్వారా, అవి బర్మా, సిలోన్, టిబెట్, చైనా, జపాన్, నేపాల్, కొరియా, మలయా సయాం, ఇండోనేషియా, జావా మున్నగు ప్రదేశాలలో అపూర్వ సాంఘికోన్నతిని నిర్మించాయి. అనేక భాషా సంస్కృతుల వికాసానికి, ఉత్తేజం కల్పించి, శాంతియుత, సహజీవనానికీ, సాంస్కృతిక ఆదాన ప్రదానానికీ, దోహదం చేసినవి. ఆ ఉదాత్త చారిత్రికాంశాల అధ్యయనం నేడెంతేని ఆవశ్యకం.

మన దీర్ఘకాలిక జాతీయ వికాసక్రమంలో, విభిన్న సాంప్రదాయాలకు చెందే అమూల్య రచనలు వెలువడ్డవి. శ్రుతి, స్మృతులు, వ్యాకరణం, తర్కం, విజ్ఞాన శాస్త్రాలు, ఇతిహాసాలు, గాథలు, సాహిత్యం, కళలు, శిల్పం, ఆయా మత సాంప్రదాయాలు, ఆచార వ్యవహారాలు, బహుముఖ స్వభావ స్వరూపాలతో, జీవన ప్రగతికి, వెలుగుబాటలు వేసినవి. వాటిలోని నిర్మాణశీలతను, సమైక్యతాశీలతను, సహకారశీలతను, నేటి యువమేధావులు, అవగాహన చేసికొనడం వాంఛనీయమౌతుంది. అలాగే ఇస్లాం, క్రీస్తు, పారశీక మతాలు, భారతీయతను సంతరించుకున్నవి. భాషా, ప్రాంత, మతమూలకమైన భావ వైవిధ్యాన్ని సమన్వయపరచి, జాతీయ సమైక్యతలో, వినియోగపడే దిశలో వాటిని మలుచుకునే ప్రక్రియ ఈ దేశానికి, అనాదినుండి అలవడిందే. ఇందులో కొత్తదేమీ లేదనే అనాలి. అలా జాతీయ పునరుజ్జీవనను, సక్రియ సృజనశక్తిగా, సాధించుకొన్నపుడే మనం ఆధునిక విజ్ఞానశాస్త్ర వికాసాన్నీ, ప్రగతినీ, ప్రాచీన సంస్కృతితో సమన్వయ పరుస్తూ, ముందుకు సాగ గలుగుతాము. స్వాతంత్ర్యాన్ని, స్వావలంబనను, శాంతిని, సహకారాన్ని, బలపరచు కొనగలుగుతాము.

ఈ 'కైలాస దర్శనం' పుస్తకంలో, కైలాస మానస సరోవర ప్రాంతాలకు చెందే, ఆయా సాంఘిక వివరాలను, పొందుపరచడం జరిగింది. టిబెట్‌లోని బౌద్ధమత సంస్కృతికి, భారతీయ సంస్కృతితో గల సాన్నిహిత్యాన్ని రచయిత ప్రస్తావించాడు. టిబెటు ప్రాంతపు వజ్రయాన బౌద్ధ సాంప్రదాయానికి, శైవ, శాక్త, తంత్రాలతో గల సమన్వయాన్ని వివరించాడు. ఆయా ఉపాసనాక్రమాలలో అనుసరించబడే పలు ఆగమ శాస్త్ర సంకేతాలను, సంకల్పాలను, ఆరాధనా విధులను గూర్చి పరిచయం చేశాడు హిమాచల ప్రాంత బౌద్ధంలో, జ్ఞానబుద్ధులు, మానుషీబుద్ధులు, భైషజ్యబుద్ధులు, ధ్యాన బుద్ధులు, తార, మారీచ, కాపాల, జంభాలాది, పలు సిద్ధదేవతాగణాలు, వాటి ప్రసక్తి

గోచరిస్తుంది. గురుశిష్య పరంపరా సమన్వయంతో కూడిన గుహ్య సాంప్రదాయం లాంటివి ఆచరణలో ఉన్నవి. బౌద్ధ వాఙ్మయంలో వీటికి సంబంధించిన వేలాది గ్రంథాలు అనేక భాషలలో అగుపడుతవి. వాటికి చెందిన కొన్ని వివరణలు ఇటీవలి కాలంలో ప్రచారానికి వచ్చినవి. అయినను మరింత విపులంగా పరిశోధనలు జరుగవలసిన ఆవశ్యకత ఉందని తోస్తుంది. అందుకు అనేక ఆసియా భాషల అధ్యయనం మరియు ఆయా విషయాల తులనాత్మక పరిశీలనలాంటి బాధ్యతలను యువ విద్వాంసులు స్వీకరించాలి. లను

ఈ పుస్తక సంపాదకత్వంలోనూ, ముద్రణలోనూ కొన్ని లోపాలు కనిపిస్తున్నవి. మరుముద్రణలో వాటిని సంస్కరించుకోవలసి యుంటుంది. కాగా కైలాస మానస సరోవర యాత్రకు చెందిన ప్రత్యక్ష అనుభవాల వివరణ పాఠకులకు ఆసక్తిని కలిగిస్తుంది. అనేక దేవతాస్తోత్రాలు ఆయా గ్రంథాలనుండి సేకరించిన కొన్ని ఆధ్యాత్మిక వివరాలు, జిజ్ఞాసువులకు, ఉపకరించగలవు. ముఖ్యంగా అనుబంధంలో ప్రచురించబడిన ఆయా పండితుల వ్యాసాల ద్వారా, విశిష్ట విషయాలను విపులీకరించినందువల్ల, గ్రంథానికి ప్రామాణికత చేకూరింది. తెలుగు భాషలో ముఖ్య యాత్రా గ్రంథమొకటి ఈ రూపంలో పె. .వడుతున్నందుకు హర్షిస్తున్నాను. ఈ రచనను పాఠకులు ఆదరించగలరని ఆశిస్తాను. ఈ సందర్భంగా రచయిత చి. మనోహరుని అభినందన పూర్వకంగా ఆశీర్వదిస్తున్నాను.

పి. వి. నరసింహారావు

# ఆశీస్సులు

## శ్రీశ్రీశ్రీ జగద్గురు శంకరాచార్య మహాసంస్థానము
## దక్షిణామ్నాయ శ్రీ శారదా పీఠము

పర్సనల్ సెక్రెటరీ

శ్రీ జగద్గురు శంకరాచార్య దక్షిణామ్నాయ

శ్రీ శారదా పీఠము

శృంగేరి 577 139 తేది : 6-6-1986



శ్రీశ్రీశ్రీ అభినవ విద్యాతీర్థస్వాములు మరియు

శ్రీశ్రీశ్రీ భారతీ తీర్థస్వాములు

శ్రీ పి. వి. మనోహరరావు గారికి ఆశీర్వాదములు

తమరు రచించిన కైలాస దర్శనం- బ్రహ్మ మానస సరోవర యాత్రయను గ్రంథమును శ్రీ జగద్గురు మహాస్వాములవారు తిలకించినారు.

తీర్థయాత్ర మానవుని జీవితమందు అత్యంత స్మరణీయము, పుణ్యప్రదమునగు పవిత్రఘట్టము. అందుకే మన ప్రాచీనులు ఎన్ని కష్టములనైననూ సహించి తీర్థయాత్రలను చేయుచుండిరి. తీర్థయాత్రలలో అత్యంత సాహస పూర్ణము కైలాస మానస సరోవర యాత్ర. ఈ యాత్రను చేసిన వ్యక్తి చాలా పుణ్య పురుషుడు అని చెప్పవలయును. తమరు ఈ యాత్రను స్వయముగా చేసి తమ యనుభవములను లిపిబద్ధము చేసి ఈ గ్రంథ రూపమున వెలువరించుట మిక్కిలి ముదావహముగనున్నది. ఈ గ్రంథము కేవలము మీ యాత్రానుభవములను ప్రతిపాదించుటయేగాక అనేక ప్రదేశముల చరిత్రలు, వేదాంత విషయములు, దేవతా స్తోత్రములు మున్నగు విషయములను కలిగియుండి చదువరులకు ఆకర్షకముగ నున్నది. మీ యొక్క యీ ప్రయత్నము ప్రశంసనీయముగ నున్నది.

ఈ గ్రంథము జనాదరణీయమగుగాక యనియు, ముఖ్యముగా కైలాస మానస సరోవర యాత్ర చేయువారలకు దారి దీపముగా నుండుగాక యనియు ఇట్టి యుత్తమ గ్రంథమును వ్రాసి ఆంధ్ర ప్రజానీకమునకు అందించుచున్న తమరు శ్రీ శారదా చంద్ర మౌళీశ్వరుల యనుగ్రహమున దీర్ఘాయురారోగ్యాది సంపత్సమృద్ధులగుదురుగాక·యనియు శ్రీ జగద్గురు మహాస్వాములవారాశీర్వదించినారు.

టి. దక్షిణామూర్తి

# ఆశీస్సు

శ్రీ కాంచీ కామకోటి పీఠాధిపతి జగద్గురు
శ్రీ శంకరాచార్య స్వామి మఠము
కాంచీపురము



శ్రీ శ్రీ శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వాములు
(పరమపదమందినారు)

శ్రీ శ్రీ శ్రీ జయేంద్ర సరస్వతీ స్వాములు

శ్రీ శ్రీ శ్రీ శంకరానందేంద్ర సరస్వతీ స్వాములు

దైవాంశ సంభూతులు, శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్య జగద్గురు శ్రీ శ్రీ శ్రీ చంద్రశేఖర సరస్వతీ స్వాములు తే. 23-3-1986 రోజున కాంచీ పురములో స్వయముగా వారి కరకమలములచే గ్రంథమును స్పృశించి, శ్రీ కామాక్షీ సహిత అమరేశ్వరుల అనుగ్రహ పాత్రుడవగుదువని నన్ను ఆశీర్వదించిరి.

వారికి సహస్ర సాష్టాంగ ప్రణామములు

# ఆశీస్సు - అభిప్రాయము

శ్రీ త్రివిక్రమ రామానంద భారతీస్వాములు
(పరమపదమందినారు)

శ్రీ సిద్ధేశ్వరీ పీఠాధిపతి
కుర్తాళం- 627 802
టెంకాశి - తమిళనాడు. 3-5-1986



శ్రీరస్తు చిరంజీవులు పి. వి. మనోహర్‌రావు గారిని నారాయణ స్మరణ పూర్వకముగా ఆశీర్వదించి వ్రాయునది.

తమరు అత్యంత భక్తితో పంపిన ''కైలాస దర్శనము'' బ్రహ్మమానస సరోవర యాత్ర'' అను గ్రంథము అందినది. ఆనందమైనది.

గ్రంథ ప్రారంభము మహాగణపతి ప్రార్థన. ఆ వెంటనే ''ఆ పాతాళ నభస్థలాంత'' అన్న శ్లోకము చదువగానే భూమ్యాకాశముల నంతటనున్న మహాజ్యోతిని చూపనున్నట్లు ఉన్నదీ గ్రంథము. పుస్తకము యొక్క నామమే ''కైలాస దర్శనము''. బాగున్నది. బదరీ, గంగోత్రియును హిమాలయ ప్రాంతయాత్రలు, మహాకష్ట ప్రాణనష్టములతో కూడిన కఠిన యాత్రలు. వీటి మాట ఎత్తగానే వ్యంగ్యముగా 'కైలాసమునకు'' వెళ్ళినట్లే అని పూర్వులు చెప్పుచుండెడివారు.

ఈ గ్రంథము నలుబది ఐదు అధ్యాయములుగా విభజింపబడి వర్ణింపబడినది. కైలాస మానస సరోవర యాత్రానుభవములను, ప్రకృతి సౌందర్యములను చిత్రించుచు సందర్భానుసారముగా ఆయా పౌరాణిక, చారిత్రిక గాథలను పొందుపరచుట అనునది గ్రంథ కర్తయొక్క నైపుణ్యమును, వేద ప్రమాణబుద్ధిని తెలుపుచున్నది.

బహుప్రయాసలతో కూడిన దుర్ఘటనమైన ఉన్నతోన్నత హిమాలయ శిఖర ప్రాంత ములయందు చేయు పర్యటనము కడు ఇడుములకు ప్రాణాపత్తులకు కూడా లోను కావలసి యుండును. ఈ గ్రంథమందు ఇట్టి అనుభవములను కూడా తెలిపిరి.

చంద్రవంశీయుల చరిత్ర వివరణ, క్షత్రియ రాజులయొక్క సత్ సాంప్రదాయముల గూర్చి తెలుపుట, స్నాన సంధ్యాది వివరణలు తెలుపుట, ప్రస్తుత కాలమునకు ఎంతేని అవసరము. పుణ్య తీర్థయాత్రలు చేయదలచిన వారలకు ఈ గ్రంథము చాలా సహాయ కరముగా నుండును.

'' విశ్వామిత్ర పరాశర ప్రభుతయో వాతాంబు పర్ణాశినాః'' అన్న శ్లోకము చదివిన సర్వసామాన్యులకు కామమోహాదులను జయించుట సాధ్యమా అనిపించక తప్పదు. సాధన చతుష్టయ సంపాదనకు ఈ గ్రంథ పఠనము సహాయకరము కాగలదు. ప్రతి అధ్యాయము ప్రారంభమున ముగింపున భక్తి, జ్ఞానార్జనకు శ్లోకములు, పద్యములు పొందు పరచిరి. కాళిదాసు, అల్లసాని పెద్దన, భర్తృహరి మొదలగు మహాకవుల రచనల ఉదాహరణలు, ప్రశంసలు పెక్కు గలవు. దాదాపు ఆరువందల పేజీలుగల పుస్తకము ఇది. అయినను వ్రాతయొక్క నడక, పోకడ, చదువరులను ఆకర్షించునట్లుగనే కవితా ధోరణి సాగిపోయినది.

కొన్ని పేజీలు చదివిన తరువాత ప్రతి అధ్యాయమునందున్న, తట్టిన ముఖ్యాంశములను గూర్చి చెప్పవలెనని బుద్ధి పుట్టినది. ఈ సమయములో పన్నెండవ అధ్యాయమును చదువుచుంటిని. ఇందు దర్శనము శ్రీ భువనేశ్వరి అమ్మవారి వర్ణన శ్రీ దేవీభాగవతమునుండి ఉటంకించుట ముదావహము. శ్రీ సరస్వతీ లక్ష్మీ పార్వతులను

మహాకవి పోతనామాత్య విరచిత పద్యములతో సమన్వయపరచి చదువరులకు ఉత్సాహము, ఆసక్తి కల్పించుట విశేషము.

13వ అధ్యాయమున ప్రారంభమే ''శ్రీ పీఠ్యామ్ శివ వామ భాగ నిలయామ్'' అని ఆదిశంకరుల మీనాక్షి స్తోత్రము. మహాభయంకరలోయ. నభిడాంగ్ సముద్రమునకు 4,600 మీటర్లు ఎత్తున నున్నదట. భరించలేని చలి. నదీ సంగమముల సంయోగములను, వాటివాటి ప్రాశస్త్యములను గూర్చి ఎంతో నిపుణతతో విపులీకరింపబడినది.

14వ అధ్యాయము చెప్పుకోదగినది. ప్రతీ భారతీయుడు ఆస్తిక్య బుద్ధిగల అనగా వేద ప్రమాణ బుద్ధిగలవారు ఈ అధ్యాయము చదువనగును. వేదములు అపౌరుషేయములని, శబ్దము నిత్యమని, విద్‌వేద్ అనే ధాతువు నుండి వేదశబ్దము ఉద్భవిల్లినదని, వేదమనగా ''జ్ఞానమే''నని ఏదో పుస్తకముగాదని, సాంప్రదాయకముగా గ్రంథకర్త రచన సాగిపోయినది. చతుర్వేదముల, దశోపనిషత్తుల, షడంగముల, ఇంకా పురాణాదుల గూర్చి వివరముగా తెలిపిరి. భాస్కర రామాయణమును స్ఫురణకు తెచ్చిరి. ''దృశ్యమాన ప్రపంచ మంతయు'' దేవీ నివాసమే అన్న సత్యమును స్పష్టపరచిరి. వేరువేరు నామములతో వెలసిన, ఉన్న ఆ ఆదిశక్తి, పరాశక్తి స్వరూపమును కనులకు కట్టినట్లు, గుగుర్పాటు చెందునట్లు, ఆ దృశ్యములను చూచి ఆనందించునట్లు, ఆ ఆదిశక్తిని వర్ణించి చిత్రించిరి. దేవీ ఉపాసకుల గూర్చి, ఉపాసనల గూర్చి చెప్పిరి. ఈ అధ్యాయము ఆస్తికులకు బాగా ఉపయోగకరము కాగలదు. సామాన్య కవియొక్క కల్పనాశక్తి, చాకచక్యము, భావకవిత్వము, ఆడంబరము ఇందు కాన్పించవు. ఈ మన భరతఖండము కర్మభూమి జీవులు నిత్యులు అన్న విజ్ఞానము కేనోళ్ళ చాటుచున్నది. ఈ అధ్యాయమంతటిని వేరుగా అచ్చువేయించి ఈ కాలపు యువతర మునకు ప్రతులను పంచిపెట్టిన బాగుండునని యత్కించిత్ సర్వసామాన్య ధర్మములను తెలుసుకోగలరని నాకు తోచుచున్నది.

15వ అధ్యాయమునందు పర్వతారోహణము పలు పాట్లకు, పెక్కు బాధలకు లోనైనను అచటగల ప్రకృతి సౌందర్యములను దర్శించుచు ఆనందించుచు, శ్రమకోర్చి, మిత్రులతో సంభాషణ లొనర్చుచు, భజనల చేయుచు మైమరచి ముందుకు సాగుటయే కర్తవ్యమునట్లున్నది.

16వ అధ్యాయము మహాభయంకరమైన మంచుపై దిగుడుగల దారులలో ప్రయాణము, 400 అడుగుల ఎత్తు నుండి పడి దొర్లుకుపోయిన శ్రీ రంగాచార్యులుగారు ఎట్టి ప్రమాదమునకు లోనుకాకుండుట విచిత్రము. 10 అడుగుల ఎత్తునుండి జారిపడిన వ్యక్తి శ్రీ రామకృష్ణన్‌గారు మృత్యుముఖము చూచుట ఆశ్చర్యము. ''ప్రారబ్దం పుష్యతి వపుః'' అని చెప్పినట్లు ''విధి'' ననుసరించియే మృత్యువు సంభవించును. ఇదే ఈశ్వరాజ్ఞ.

ఈ సందర్భమున గ్రంథకర్త ''భగ్నా శస్య కరండ పండిత'' అన్న భర్తృహరి సుభాషితము తెలియచెప్పుట సమంజసము : నిపుణత్వము కూడా

17,18,19 అధ్యాయములు ఎత్తైన లోతైన మంచుగడ్డలు, మృత జీవుల శరీరములు, వాటి వాటి రక్షణలు, చైనీయులతో రాయబారములు, భేద వివరణ వగైరా విషయములు విపులీకరింపబడినవి.

కైలాస దర్శనము ఆనందానుభూతి ''అంగజ గర్వభంగ శరణాగతరంగ'' యను పద్యమును, ''నమో భగవతే రుద్రాయ'' మొదలగు మంత్రములను మదిందలంచి, ప్రార్థించి పొందిన అనుభూతి మెచ్చుకోదగినది. ''అసతోమా సద్గమయా'' మున్నగు మహామహుల వాక్యములను సమన్వయించి దివ్యానుభూతిని కొన్పించిరి.

మాంధాత పర్వతము, మాంధాత చరిత్ర అతిచక్కగా చిత్రించిరి. సువిశాల 'మానస సరోవరము' రాక్షస సరోవరముల గూర్చి కూడా వర్ణించిరి. అమాయక అవిద్య గల స్త్రీ స్వభావముల గూర్చి గ్రంథకర్త వివరించిరి. ఈ కాలపు స్త్రీలు తెలుసుకోవలసిన విషయములు ఇందు పెక్కు గలవు.

20వ అధ్యాయమునందు మహాపవిత్ర మానస సరోవర ప్రథమ పరిక్ర మానుభూతులు, సావిత్రీ గాయత్రి ప్రాశస్త్యము, ధ్యాన ఉపాసనాది విధులు, గాయత్రీ కవచము మున్నగునవేక విషయములు దేవీ భాగవతాధారములతో సమంజసముగా సలక్షణ ముగా, సాంగోపాంగముగ వివరింపబడినవి. భారతములో తెలిపిన కలియుగ ధర్మములను గూర్చి చెప్పుట, ప్రస్తుత పరిస్థితులతో సరిపోల్చి చూపుట, భవిష్యత్తులో ఇంకెంత నైతికముగా భూమండలమంతయు దిగజారిపోవునో చదువరులు ఊహించుటకు అవకాశ మిచ్చునట్లు రచయిత రచించిరి.

21వ అధ్యాయమందు హంస పరమహంస యొక్క అర్థమును ఆయా పదముల వర్ణనలను మనుచరిత్ర పద్యము ద్వారా నచటగల నానావిధ క్రూర, భయంకర జంతువు లున్నట్లు దృశ్యమును చూపించిరి. వాల్మీకి రామాయణ ప్రస్తావన ద్వారా యథాతథ వచనము నుటంకించబడినది. ''దౌంశవ్రాతములున్ బిపీలికలు'' యను పద్యముచే ఈగల, దోమల కూటములచే విధాత హిరణ్యకశ్యపుని గురించి నుడివిన మాటలు ఎంతో గగుర్పాటు కలిగించునట్లుగా రచనాధార సాగిపోయినది.

22వ అధ్యాయమునందు ''మానస సరోవర పురాణ గాథా విశేషములు'' అని అధ్యాయమును ప్రారంభించుచునే ''ప్రాతస్మరామి'' అని ప్రార్థనా శ్లోకములను లిఖించుటలో కవియొక్క ప్రపత్తులు తెలియుచున్నవి. జీవితమంతయు మహా కామాంధ కార పూరితమైన అతిభయంకరమైన జనన మరణములను మొసళ్ళతో నిండియున్న

సముద్రము నుండి బయటపడుటకు, మార్గములను ఇందు సూచించుట జరిగినది. పుణ్య పురుషులు, మహాఋషులు, యోగి పుంగవులు అత్యంత వైరాగ్యముతో జపతపము లాచరించుచు పర్యటనము చేసిన పర్వత ప్రాంతములనంతను కన్నులకు కట్టినట్లు కాన్పింప చేసిరి. వారివారి ఇష్టదేవతలను స్మరించి ప్రార్థించి తరించుటకు తగు నవకాశములను తెలియపరచిరి. దేవీ విశ్వరూప సందర్శన భాగ్యమును, అనేకానేక సమయాచార, కౌలాచార ములతో కూడిన రహస్యాతిరహస్యములను తెలిపిరి. ఈ అధ్యాయము పాఠకుల నుత్తేజ పరచును. అయితే ఆశ, జిజ్ఞాస, సత్ శీలము, దుశ్శీలములనుండి విరమించుట మున్నగు సద్గుణములు తప్పక కావలయును.

23వ అధ్యాయమందు ''నిదురాదేవి''ని గూర్చి వర్ణించుచు భారతములో విదురుడు ధృతరాష్ట్రునకు తెలిపిన రహస్య ఉదంతమును పద్యములతో చదువరులకు తెలియజేసిరి. అనా బలవద్విరోధము గలవానికిని, పేదయై ధనమును పోగొట్టుకొన్నవానికిని, దొంగతనము చేయకోరువానికిని కామాంధునికిని, లోకములో నిదురరాక బాధపడుదురు యని విదురుడు తెలిపెను.

ఈ గ్రంథము కైలాసయాత్రను గూర్చియేకాక దైనందిన జీవితములో ధర్మార్థ కామమోక్షములందాసక్తి పుట్టుటకు కావలసిన సాధన సామగ్రిని, కూడా చదువరులకు సమకూర్చులాగున సమయానుకూలముగ, సంగ్రహముగ, సారాంశములను సమకూర్చి పెట్టుటలో చిత్ర విచిత్రముగ చిత్రించి చమత్కరించుచు కవి రచన సాగిపోయినది.

''ప్రవృత్తే భైరవీచక్రే'' శ్లోకముద్వారా శాక్తేయము గురించి తెలిపిన వివరణ బాగున్నది. టిబెటనుల గూర్చి వారి ఇష్టదేవతా, విగ్రహారాధనల, వివరములగూర్చి నుడివిరి. హిందువులమని చెప్పుకొనుట తప్ప హిందువుల గూర్చియే తెలియదు. ఇక తదితర మతముల వారియొక్క సదాచారముల గూర్చి దురాచారములగూర్చి తెలియనగునా? బహుజన ప్రీతికి శ్రమ తీసుకొని, అందరికి ఈ గ్రంథ పఠనయందు అభిలాష చేకూరవలెనన్న ఉద్దేశము వ్రాతలలో పోకడలలోకల ధోరణిచే కాన్పించుచున్నది.

24వ అధ్యాయమందు కైలాస పర్వతపరిక్రమ, రావణబ్రహ్మ విహరించిన ఉదాహరణలు, ప్రయాసతో కూడిన ప్రయాణములు. యాకుల వివరణ జంతువులలో రక రకములుండుట నుద్దేశించి క్లుప్తముగాను, స్పష్టముగాను తెలిపిరి.

''యద్ధాత్రా నిజఫాలపట్ట లిఖితం'' అన్న శ్లోకము నుదహరించి మనుజులకు ధనధాన్య సంపదలు, సుఖదుఃఖాదులు, ఎవరు ఎచటకేగినను వారివారి వెంట నంటునను యదార్థమును నిర్దిష్టముగా కవిగారు వర్ణించిరి బాగున్నది.

25వ అధ్యాయమందు 19000 అడుగుల ఎత్తునగల ''డోల్మాలా పాస్'' ఎక్కుట అనునది మృత్యుముఖము చూచినట్లుగా వర్ణించిరి. గౌరీకుండ్ దర్శనము హిందూ బౌద్ధ

స్వర్గనరక వివరణ, కార్తికేయ జనన ప్రస్తావన, సాష్టాంగదండ ప్రణామ ప్రాశస్త్యము పరిక్రమ వివరాలు మొదలగు అనేక విషయములగూర్చి ఇందు ప్రస్తావించిరి.

26,27 అధ్యాయములలో కైలాసాచల పురాణగాధా ప్రస్తావన ఉపయుక్తముగా నున్నది. జన్మరాహిత్యము సాధన సంపదల గురించి నుడివిరి. బౌద్ధ మతముయొక్క అహింసా ధర్మముల గూర్చి చెప్పిరి. చింతనధ్యానాదుల గూర్చి వివరించిరి.

28వ అధ్యాయమందు చాతుర్వర్ణాశ్రమములగూర్చి, అందులో బ్రాహ్మణులకుండ వలసిన నిత్య కర్మానుష్ఠానములగూర్చి, యత్యాశ్రమ స్వీకార అర్హతలగూర్చి, వారి ధర్మముల గూర్చి, పరమ హంసల ప్రాముఖ్యత గూర్చి తేటతెల్లముగా సామాన్యులకు కూడ బోధపడు రీతిని వర్ణించి తెలియచెప్పిరి.

సర్వమునకు వైరాగ్యసంపత్తు అత్యంత అవసరమని సమర్ధించి సహేతుకముగా నిర్ణయించిరి. ఈ సందర్భములో భర్తృహరి తెలిపిన ''భోగే రోగ భయమ్'' అన్న శ్లోకము నుదహరించి బహునేర్పుతో ''వైరాగ్య మేవాభయమ్'' అని నిర్దిష్టముగా వక్కాణించిరి. అంతేగాక గృహస్థాశ్రమ ధర్మములను గూర్చి పెక్కు వివరములను పాఠకులకు పరిచయము చేసిరి.

29, 30 అధ్యాయములందు టిబెటు చరిత్ర, వారల జీవిత విశేషములు వారి దినచర్యలు, నైసర్గిక స్వరూపము, ఆహారవిహారముల గూర్చి, సాంఘికాచార, దురాచారముల గూర్చి, వివాహాదులగూర్చి మున్నగుననేక విషయములను సాకల్యముగా తెలియచెప్పిరి. టిబెటునందలి పాఠశాలలు, బౌద్ధ గ్రంథముల, పంచాంగముల, మణిమంత్రము, గణితము ఇత్యాదుల గూర్చియు, ఇంకను అనేక వివరణలు ఈ అధ్యాయములయందు చూడనగును.

31వ అధ్యాయమున శివధర్మముల వివరణ, మహన్యాస పూర్వక ఏకాదశ రుద్రాభిషేకముల గురించి విపులముగా చెప్పబడినది. రావణబ్రహ్మ కైలాస పర్వతమెత్తి భంగపడు ఉదంతమును గలదు.

32, 33వ అధ్యాయములందు ''సాలగ్రామ'' మహాత్మ్యము గూర్చి శంఖచూడుని వృత్తాంతము, భస్మధారణ, రుద్రాక్షధారణ, ఖేచర్‌నాథ్, దేవాలయము మొదలగువాని ప్రాముఖ్యము చెప్పబడినది. తర్వాత సత్ సాంప్రదాయ సదాచారముల సూత్రముల ప్రస్తావించిరి. వాచికకాయక, మానసిక తపస్సుల గూర్చి చెప్పిరి. ''సత్యమే'' సర్వదా సకల సంపత్తులను సమకూర్చగలదని గట్టిగా నుడివిరి.

ఆస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము మొదలగు సద్గుణములు సత్పురుష లక్షణములని, వీనిని ప్రతిఒక్కరు ఆర్జించవలెనని తెలియజెప్పిరి. యువతకు కావలసిన నీతిబోధలు ఇందు పెక్కులు కానసగును.

34, 35 అధ్యాయములలో ప్రకృతియొక్క సత్వ, రజస్తమో గుణములగూర్చి చెప్పిరి. పాఠకులు గ్రహించవలసిన విషయములిందు పెక్కులుగలవు. చదివి కంఠస్థము చేయనవసరమున్న పద్య, శ్లోకములు కడుంగడు గలవు. భరతఖండము కర్మభూమియని, ప్రజలు స్వయంకృత కర్మబద్ధులని బాగానొక్కి వక్కాణించిరి. భక్తులకు, భగవంతునికై శరణాగతులు కావటమే కావలసినదని తేటతెల్లముగా తెలియజెప్పిరి.

36 నుండి 45 అధ్యాయములయందు వేదవ్యాసుని గూర్చి, ఋషి మండలమును గూర్చి, మహాపతివ్రతలగూర్చి, పరమేశ్వరుని లీలలగూర్చి, పంచభూతాత్మక శరీరముల గూర్చి మున్నగుననేక విషయములు సవివరముగా చెప్పబడినవి.

ఇంతేగాక ఈ గ్రంథము అతిపవిత్ర యాత్రకు సంబంధించినదగుటచే అతి కఠినాతి కఠిన యాత్ర కారణముగా ఎంతో సహనము, సాహసము, ఓర్పు, నేర్పు, కూర్పు అంతకు మించి ధైర్యము, మనోస్థైర్యము, వజ్ర సంకల్పము, భల్లూకపుపట్టు, భక్తిప్రపత్తులు, నిత్యానిత్య వివేక జ్ఞానము మొదలగు లక్షణములన్నియుండియు, వ్యయప్రయాసలకోర్చిగాని ఈ యాత్ర చేయజాలరని రచయిత ప్రకటము చేసి యున్నారు.

ఆ పైన వంశ పరంపరాదిగా వచ్చు పండిత కుటుంబములో జన్మించిన వారుగనుక శ్రీ చి. పి.వి. మనోహరరావుగారు ఈ గ్రంథమును ఈ రీతిగ రచించగలిగిరి. వీరు తరించిరి. ధన్యులు కాగలిగిరి.

పూర్తిగ ఈ గ్రంథమును చదివిన సమస్త యాత్రలు చేసినంత ఫలము లభించును. ఈ గ్రంథమునకు మరింతగా వన్నెతెచ్చినది శ్రీశ్రీ భాష్యం విజయసారథిగారు, డా. సుప్రసన్నాచార్యులుగారు, డా. మృత్యుంజయ శర్మ గారు, శ్రీ భార్గవరామశర్మగారు రచించిన వ్యాసములతో కూడిన అను బంధములు ''ముఖేముఖే'' సరస్వతి అన్నట్లు ప్రతి వ్యాసము పాండిత్య ప్రకర్షణయే. ఆనందదాయకమే.

'కైలాస దర్శనం'' బ్రహ్మ మానస సరోవరయాత్ర అను నీపుస్తకమును భక్తులకు, స్వేచ్ఛగా ఉత్తరాదియాత్రలు చేయుటకు ఉపయుక్తముగా నుండుటయేగాక, గ్రంథకర్త యొక్క రచనావిధానము, చివరగల పండితుల వ్యాసములు జతచేరి, గ్రంథమునకు, ఉత్కృష్టమైన ఔన్నత్యమును తెచ్చి ఇది ''ప్రబంధమా'' అని ప్రశ్నించి గణింపుకు తెచ్చునట్లుగా నున్నది.

మన హిందూమతము ఒక మతకర్తద్వారా ఉద్భవిల్లినదికాదు. ఇది సనాతనమతము. అనగా ఉపనిషత్ మతము. మనలను ఎవరు సృష్టించలేదు. మనము జీవులము. నిత్యులము. వెనుకనున్నాము. ఇప్పుడున్నాము. ముందుంటాము. ధర్మాధర్మములకు స్వతంత్ర కర్తలము, భోక్తలము. ఈశ్వరుడున్నాడు. ఆయన కర్మఫలప్రదాత జీవులు, అనగా సర్వ

భూతములు సర్వప్రాణులుకూడ, అనగా పిపీలికాది బ్రహ్మపర్యంతము 'జీవ' అని అందురు. జీవులు మనుష్యులు. ధర్మాధర్మముల గూర్చి ఆలోచించి విచక్షణతో మంచి చెడులు పుణ్యపాపములు తెలిసికొనే శక్తిగల విజ్ఞానులు. మనుష్యులు పౌరుషముబూని స్వతంత్రముగా కర్మల ననుష్ఠించి కర్మఫల ప్రదాత ఈశ్వరునిద్వారా ఆయా పుణ్యపాప కర్మఫలములను జన్మజన్మలనెత్తి అనుభవించే శక్తి గలవారుగా నున్నారు.

భక్తి ప్రపత్తులతో ప్రతివ్యక్తి ఆయా వారివారి ఆచారములకు తగినట్లు ఇష్టదేవతలను ఆరాధించుచు తీర్థయాత్రలు భజనలు పురాణాదిశ్రవణములు ధ్యానములు జిజ్ఞాసతో జరుపుచూ పోగాపోగా తమలో తమకే ఆత్మాన్వేషణకు ఆలోచనలుద్భవిల్లును.

ఎప్పుడో ఏ పూర్వజన్మ సుకృతమువలననో సాక్షాత్ ఆ భగవంతుడే ఏదో ఒక రూపములో అనగా గురువుగనో మిత్రుడుగనో వచ్చి

ఏమోయి ! ఎంత అపరాధము చేయుచుంటివి.

ఈ శ్లోకమును విని అర్థము చేసికొన్న త్రివిధాపరాధములను నీవు చేయుచున్నట్లు గ్రహించగలవు. ఏమన

''త్వద్యాత్రయా వ్యాపకతాహతాతే

స్తుత్యుక్తి భిర్వాక్పరతా హ తాతే

ధ్యానేన చేతః పరతాహతాతే

క్షమస్వ నిత్యం త్రివిధాపరాధాన్

ఓ భగవంతుడా ! సర్వవ్యాపియై నీవుండగా, నీవెచటనో అంతర్గతుడై ఉన్నట్లు భావించి, తీర్థయాత్రలు చేయుటచేత, నీ వ్యాపకత్వమును భగ్న మొనరించుచున్నాను.

మనోవాక్కాయ కర్మలకందని నిన్ను ధ్యానించి, కీర్తించి నీకు దోషమును ఆరోపించు చుంటిని. మనస్సుకు పట్టుబడని నిన్ను ధ్యానించి మరొక అపరాధమును ఒనరించితిని.

ఈ విధముగా ఎల్లప్పుడు త్రివిధాపరాధములను చేయుచునే యుంటిని. కాన నా తప్పులను ఒప్పులుగా భావించి క్షమించవలెను. ప్రౌఢముగా అర్థ గంభీరముగా, గడుసుగ, అమాయకముగ, సూటిగ, తానే అంతర్యామిగా యున్నట్లు తెలుపు పూర్వులు మహాపురుషులు తెలిపిన పైన చెప్పిన శ్లోకమును చదువుచు జీర్ణము చేసికొన్న చాలును.

ముక్తికి, మోక్షమునకు అనగా జన్మరాహిత్యమునకు శ్రీ రాజరాజేశ్వరి అమ్మవారిని ప్రార్థించి, గ్రంథకర్త అయిన శ్రీ పి. వి. మనోహరరావుగారిని నారాయణ స్మరణ పూర్వకముగ ఆశీర్వదించుచున్నాను.

తీర్థయాత్రలు చేయదలచిన ప్రతి ఒక్కరికి ఈ గ్రంథము చాలా ఉపయోగపడగలదని మా ఆశయము. ఇవియే నారాయణ స్మృతులు.

ఇట్లు

శ్రీ త్రివిక్రమ రామానంద భారతీస్వామి

శ్రీ సిద్ధేశ్వరీ పీఠాధిపతులు

కుర్తాళం

తిరునల్వేలి- జిల్లా- టెంకాశి తాలూకా

తమిళనాడు - 3-5-1986



# పరిచయ వాక్యములు

పాములపర్తి సదాశివరావు
(దివంగతులైనారు)
ఓరుగల్లు

తేది : 20-4-86

చి॥ పి. వి. మనోహర్ 'కైలాస మానసరోవర' తీర్థయాత్ర జరుపడము ఒక అసాధారణ విషయమే. ఆ సరోవరమును గూర్చి అనేక గ్రంథములలో చదువుటే కాని, అచటికి మనవారు యాత్ర జరుపడం సంభవమని అనుకోలేదు. కనుక ఈ యాత్ర యెంతేని అపురూపవిషయమే. అపురూపమేకాక అభినందనీయ విషయమని కూడ చెప్పవచ్చును. మేఘసందేశములో కాళిదాస మహాకవి యక్షుని ద్వారా

చ. ఘన హిమవంతమందునొక కల్లున శంకరుపాద రేఖయిం
పొనరును సిద్ధసేవితము, ఉత్తమభక్తుల కిల్బిషాపనో
దనకరమంతమందు ప్రమథత్వము నిచ్చెడు, దానికీవునుం
వినయముతో ప్రదక్షిణము పెట్టుము భక్తిపురస్సరంబుగన్

అని మేఘునితో అంటాడు. ఇది కైలాసాచల విషయము. అలాగే,

శా. ''ఆ మార్గమ్ము నతిక్రమించి, యలబ్రహ్మావర్త దేశంబు ఛా
యామాత్రంబుగజొచ్చి చాటిచని క్షాత్రాయోధనప్రత్యయ
ప్రాముఖ్యంబగునాకు, రుక్షితినిజేరంబొమ్ము''

యని బ్రహ్మావర్త పదాన్ని ప్రయోగిస్తాడు. మరియు

బంధు సంప్రీతిచేమాని భండనమ్ము
ప్రీతిమైబ్రియకాంతయొరేవతి యిడు
హితమధురసంబు గూడ వర్జించివేసి
యే సరస్వతీ జలము సేవించిమున్ను
ఆంహలాతకుడు కృతకృత్యుడయ్యెనట్టి
ఆ నదీతోయామాని నీవాత్మశుద్ధిగాంతువో మిత్ర

అని మేఘునకు సూచన చేస్తాడు. ఇంకను,

పరశురాముని కీర్తి బహిరంతరవ్యాప్తి
మార్గంబనంగ సమ్మతి వహించి,
రాజహంసలకు విభ్రాజిత మానస
కాసారమార్గమౌక్రౌంచరంధ్ర
మందు ప్రవేశించి యరుగు ముత్తరముగా
పొడుగు గానప్పుడు పొనరుదీవు

ఉ. ఆ పయిజేరు మిశ్రమదమై తగు నాదశకంఠబాహు వి
స్థాపిత సంధికోటి విబుధ ప్రమథాముఖ దర్పణంబు, స
ద్వ్యాపిసితోన్నతాగ్రము మహానటదేవు దినందినాట్టహా
సోపచయంబు నామెరయు నుత్పల శోభము రాజతాగముః

ఇలా మానససర, కైలాస నగదృశ్యాలను వివరించి చెపుతాడు. కాళిదాస మహాకవి స్వయంగా మానససరమును చూచాడో లేక ఊహామాత్రంగానే వర్ణించాడో తెలియదు. అలాగే అనేక పురాణాలలో, ఇతిహాసాలలో, కావ్యాలలో, హిమాచల, కైలాస, మానససర వర్ణనలు అసంఖ్యాకంగా ఉంటూ వున్నవి. ఆ యా కవులు ఆ యా ప్రదేశాలను, స్వయంగా తిలకించారో లేదో ననేది సందేహాస్పదమూ సమాలోచనీయమూ అవుతుంది.

చి. మనోహర్ చూచి చెప్పినట్లు ఆ ప్రదేశాల్లో కల్పవృక్షము, రాజ హంసలు, సుందర ఉద్యానవనాలు కానరాలేదు. యక్ష, కిన్నెర, కింపురుషుల వీణావేణు నాదాలు వినపడలేదు. ఐనను దివ్యసుందర ప్రకృతి గాంభీర్యము, మనస్సునకు అద్వితీయోత్తేజన కలిగించినట్లు అనుభవమైనది. అలా మొత్తానికి చి. మనోహర్ వివరించిన విశేషాలను వింటుంటే ఎంతో ఆశ్చర్యం కల్గినది.

పోతే, మానససరోవర యాత్రను గూర్చి తానొక పుస్తకాన్ని వ్రాసినట్లుగా కూడ చి. మనోహర్ చెప్పాడు. దాంతో మరింత ఆశ్చర్యం కల్గినది. ఆయన పండితుడు, రచయిత అని నేను వినలేదు. మరి పుస్తకం వ్రాయడం యెలాగ? అనుకొన్నాను. కాని అతనొక లిఖితప్రతిని నాముందుంచి, దానిని ఒకమారు చూడాలని కోరాడు. ఆ విధంగా ఈ గ్రంథ ప్రచురణతో నాకు సక్రియ సంబంధమేర్పడటం జరిగింది.

కైలాస మానససర ప్రాంతాలు ఇపుడు చైనావారి ఆధీనంలో ఉంటున్నాయి. ఒకప్పుడు అవి మనకు పొరుగు ప్రాంతమైన స్వతంత్ర టిబెటులో ఉన్నట్లు అనుకునేవాళ్లం. మొత్తానికి ఈ పవిత్ర, దివ్య ఆర్ష ప్రదేశాలిప్పుడు పరులచేతిలో పడిపోయినవి. అంతేగాదు, హిమాచల సీమలోగల సిక్కిం, మేఘాలయ, అస్సామ్, పంజాబు, కాశ్మీరు మరియు నేపాల్, భూటాన్ భూభాగాలలో మన ప్రజాపలుకుబడి కొంతవరకు సన్నగిల్లుతున్నదేమోనని

అనిపిస్తుంది. ఆ ప్రాంతాల్లో కేంద్ర ప్రభుత్వం, ఇతోధిక ప్రజాసానుభూతిని సాధించుకొనే దిశలో ఆలోచించాలేమోయని కూడ తోచినది. అయినా అవన్నీ బాధ్యులైన అగ్ర నాయకులకు చెందే రాజనీతి అంశాలని సరిపెట్టుకొనడం కంటే మనబోంట్లు చేయగలిగేదేమో కనపడదు.

రాజకీయ పరిణామాలెలావున్నా, మానసికంగా హిమాలయాలు, కైలాస, మానస ప్రాంతాలు, భారతీయులకెంతో ప్రీతిపాత్రమై యుంటాయనడంలో సందేహంలేదు. హిందూ మతరీత్యా దేవాసుర సంగ్రామం, బ్రహ్మాండ సృష్టి, మహాభారత యుద్ధం, బ్రహ్మ ఋషుల చరిత్రలు, రాజఋషుల జీవితాలు, దేవీ దేవతలు పలు అవతార విశేషాలు, బ్రహ్మావర్త ఆర్యావర్త సీమలలో జరిగినవే. వైదిక, పౌరాణిక, రచనలు, స్మృతులు, శాస్త్రాలు అచ్చట రూపొందినవేనని అందరికీ తెలిసినదే. అందువల్ల ఈ మానస సరోవర యాత్ర ప్రసక్తి భారతీయాత్మలను కదిలించగల ప్రబల అనుభవంగా, ఉండటం యెంతేని సహజ విషయమే.

గ్రంథ రచనాబాధ్యత ఎలా వున్నా, ఆ సంకల్పం మాత్రం అభినందించదగిందే ననుకొన్నాను. చి. మనోహర్ పరిశీలనార్థం యిచ్చిన పుస్తక పాఠాన్ని చదివి చూచుటకు ఆమోదించాను. రచనను పూర్తిగా చదివాను. కొన్ని విషయాలు మాటలతో చెప్ప సాధ్యపడనివి ఉంటాయి. వాటిని మనవు ఆవాఙ్మనస గోచరాలని అనుకోవాలి. సూక్ష్మమానసిక అనుభూతులు, ప్రకృతి సౌందర్యోత్తేజనలాంటి అనుభవాలు ఆ కోవకు చెందినవిగానే ఉంటాయేమో. ఈ మానస సరోవర యాత్రానుభవాలు, అందలి ప్రకృతి సౌందర్య దృశ్యమూలక మానసిక అనుభూతులు, మాటలకు అందాలంటే కష్టమే ననిపించింది. కాని ఆయా క్షేత్రాలకు చెందిన గాథలు, ఘటనలు వాటి పవిత్ర స్మృతులు కల్గించే ఉత్తేజనలో రసస్ఫూర్తి రూపుదాల్చుకొని, సృజనాత్మక భావాలు పెల్లుబికి, బహిర్గతమౌతాయి. ఆ రూపంలో ఈ రచన, సందేశాన్నందించడం సాధ్యమేనని కూడ తోచింది. ఆ దృష్ట్యా రచనను చదివి ఆనందించాను. ప్రచురణకు ఆమోదించాను కూడా అయినను ఇందలి సౌందర్య అనుభూతి వివరాలు, భావనాత్మక మానసికోద్వేగాలు, మానసిక ఆధ్యాత్మిక కల్పనామూల్యాలు, వాటి అవగాహన, పాఠకమహాశయుల సహృదయ శీలసంస్కారంపై ఆధారపడి యుంటాయేమోననియు భావిస్తున్నాను. రచయిత అదృశ్యుడు. పుస్తకము మూగది. కనుక నిర్ణాయక పాత్రవహించేది పాఠక సహృదయతే కావలసి యుంటుంది.

పవిత్ర మానససరోవర యాత్ర ఆధ్యాత్మిక ఆకాంక్షా అనుభవ భూమికను కలిగి యుంటుంది. అనేక స్థల పురాణాలు, చారిత్రికాంశాలు, ప్రాకృతిక సుందర దృశ్యాలు, యాత్రానుభవాలను ఆవరించి ఉంటాయి. అంతేకాక అనేక ధార్మిక, నైతిక

ఉద్దేశాలు, భావనలు, విశ్వాసాలు ఇలాంటి రచనలో స్ఫూర్తిని కల్గిస్తాయి. దేవుడు, మతం, సంప్రదాయం, సంస్కారం మున్నగు ఆత్మీయ అభిరుచులు ఇలాంటి యాత్రా వివరణలో, చిత్రణాపరికరాలుగా ప్రాధానుభూతుల వ్యక్తీకరణ సాధనాలౌతుంటాయి. అవి మహోన్నత మానసీయ విలువల ఉత్తేజనగా పాత్రవహించడం జరుగుతుంది. ఈ దృష్ట్యా మానస సరోవర యాత్రను ప్రచురింప పూనుకోవడం వాంఛనీయమే అవుతుంది.

ఈ తీర్థాలవలన అనేక ఫలితములున్నవి. సత్యరూపము గుర్తించుట, ప్రకృతి సౌందర్యవిలోకన, వివిధ ప్రాంతీయ మానవుల ప్రవృత్తుల, అవగాహన జరుగును. సాధు సజ్జన సాంగత్యముచే ఆధ్యాత్మిక రహస్యములు తెలియును. ప్రకృతి శృంగార విశేషముల గాంచవీలగును. అందుచేత పూర్వకాలమునుండియు మన పెద్దలు ఎంతో కఠిన పుణ్యతీర్థ యాత్రలను సంస్కారములలో చేర్చియున్నారు.

మన భారతీయ సంస్కృతి 'అనాది' కి చెందినట్లుగా పెద్దలు నిర్ణయించినారు. వేదం అపౌరుషేయం అన్నారు. విశ్వం అనంతమని చెప్పారు. ధర్మశాస్త్రం సనాతనమైనదని ఉద్ఘాటించారు. సృష్టిక్రమాన్ని కాలగమనాన్ని, జీవిత పరిణామాన్ని, నిర్గుణతత్వపు సగుణ క్రియగా, సాపేక్షముగా విలోకించారు. ఆ రూపంలో మానవ జీవితయాత్ర కూడ ఒక పవిత్ర దివ్య యాత్రయే కావలసియుంటుంది. సంకల్ప దేవతల, వికల్పదేవతల మధ్య జరుగుతున్న నాటకమే మానవుని 'జీవిత నాటకమని' ఆర్షతత్వం బహుముఖాల నిరూపిస్తూ వుంది. ఆపద సమయంలో స్వయంగా భగవంతుడే భూమిపై అవతరించగలడనీ, తద్వారా భూభారాన్ని నిర్మూలించి సత్యధర్మ కర్మాచరణను, పునరుద్ధరించడం జరుగుతుందనీ, మన ఆప్త ఆచార్యులు సుఖశాంతుల ఆశావాదాన్ని ప్రబోధించారు. కనుక యెన్ని ప్రళయాలు వచ్చినా మరల మరల నవ్యపునఃసృష్టి జరుగక తప్పదని భారతీయ తాత్వికులు జన్మజన్మాంతర రహస్య పరిణతిని బహుముఖాలుగా వివరించి చెప్పగలిగినారు.

కావున ఆస్తిక ఆశావాదం ఒక జీవిత దృక్పథంగా భారతీయుల సంస్కృతిగా, హృదయాలలో చోటుచేసికొని వుంది. ఈ విలోకనకు అనుగుణంగా, ఆత్మ సుఖంకొరకై, హైందవులు దైవీశక్తులను ఉపాసించాలనియు తద్వారా భావ ఔన్నత్యాన్ని సాధించాలనియు గురుజనులు ఆదేశించారు. అందుకుగాను అనేక సాంప్రదాయాలను నెలకొల్పారు. పలు ఆచార విహారాదులను నిర్ధరించారు. ఆ విషయాలన్నీ ఎంతో మహత్తరమై, కేవలశుష్క ప్రమాణాలతో తేల్చి చెప్ప సాధ్యపడని విలువలతో కూడియున్నాయి. భక్తి జ్ఞానమోక్ష మార్గాలు అలాంటి గహన విషయాలే.

సరి దానికేంగాని 'ఈ మానస యాత్రానుభవ' వివరణలో చి. మనోహర్ తన అనేక భౌతిక, ఆధ్యాత్మిక భావనలను, గుదిగ్రుచ్చుటకై యత్నించాడు. కావున ఈ పుస్తకంలో

యాత్రల విశేషకథనంతోబాటు కొన్ని ఆధ్యాత్మిక, నైతిక, ధార్మిక, చారిత్రిక వివరణలు కూడ ఆయా సందర్భాలలో గోచరిస్తాయి. ధర్మతత్వశాస్త్రాలకు, ఉపసనాకాండకు, వేదాంతానికి, సంస్కృతికి, కళకుచెందే కొన్ని ఉద్ధరణలు ఈ రచనలో చోటుచేసుకొని యున్నాయి. హిందూ బౌద్ధ మతాలకు చెందే ఆ యా ప్రతీకల వివరణకు కూడా చి. మనోహర్ కొంతవరకు ప్రయత్నించాడు. తోడ్తో ఆయా పురాణ కథలనుండి కొన్ని ఉద్ధరణలు కూడ ఇందులో చేర్చబడియున్నాయి. అలాంటి విషయాలు పాఠకులకు ఆసక్తిని రేకెత్తించుటకై తోడ్పడగలవని భావించడం జరిగినది.

గ్రంథాన్ని ఆసక్తిదాయకం చేయాలనే తలంపుతోనే యథావకాశముగా అనేక ఉద్ధరణలను ఆయా సందర్భాలలో పొందుపరచుట జరిగినను, అందులో కొన్ని అంశాలు 'ఉపదేశాత్మక' విలువలను కలిగియున్నవి. అవి ఆప్తవాక్య పునరుద్ఘాటనలే కాని, రచయిత అధికార సత్తాకు చెందిన ప్రబోధాలుగా పరిగణింపరాదని పాఠక మహాశయులకు సవినయంగా విజ్ఞప్తి.

ప్రాచీన తత్వశాస్త్ర విలోకనలో, భావనాత్మక విశ్లేషణ ప్రధాన పాత్ర వహిస్తుంది. ఆ రీతిలో పలు మనస్తత్వ నిరూపణలు; వివరణలు జరుగుతవి. మనస్తత్వరీత్యా, ఆ యా సంకల్పాలు, ఉపాసనాక్రమాలు నిర్ధారితమై యుంటాయి. వాటన్నిటి ప్రేరణయు, మానవీయ ఆత్మసుఖ సాధనేనని గమనార్హమౌతుంది. ఇటీవలి కాలంలో భౌతిక శాస్త్రాల విలోకన, అధిక ప్రాధాన్యతను సంతరించుకొనియుంది. ప్రాచీన దృక్పథాల ప్రాధాన్యతను గూర్చిన ఆసక్తి సన్నగిలుతూ వుంది. మత విశ్వాసాలను యువకులు మూఢనమ్మకాలుగా త్రోసిపుచ్చడం, భౌతిక లక్ష్యసాధనకు అధికతర ప్రాధాన్యత నివ్వడం జరుగుతూవుంది. అలా జీవన విలోకనలో సరిక్రొత్త చేర్పులు, మార్పులు అనివార్య మౌతున్నాయి. పలు నూతన సంస్కరణలు అమలౌతున్నవి. దీన్ని ఈనాటి సైన్సు' యొక్క అభివృద్ధి శీల ప్రభావమని గమనించకతప్పదు. తోడ్తో ఇది విదేశీ పరిపాలన మూలక విషయంకూడ.

పై స్థితిలో బాహ్యగతమగు, భౌతికవాద విలోకనకు అంతర్ముఖమైన ఆదర్శవాద విలోకనకూ, సముచిత సమన్వయాన్నేర్పరచుకొనుటకు గాను, ప్రయత్నించవలసి యుంటుంది. సార్వజనీనమైన సంక్షేమ దృక్పథానికి, అగ్రప్రాధాన్యతనిస్తూ జీవిత సమస్యలను చూడవలసి యుంటుంది. అలాంటి సాంఘిక వీక్షణకు ఉపకరించగల నవ్య అన్వేషణకు ప్రోత్సహించవలసి యుంటుంది.

ఒకదిశ దారుణ అణుబాంబు మారణాయుధాలు, మరోదిశన ఆయువు నిచ్చే అంటి బయాటిక్ ఔషధాలు ఉంటున్నాయి. అలాగే ఒకవంక ఆకలి అజ్ఞానం, దైన్యం, దౌర్బల్యం తో అలమటించేవారు, మరోవంక అధిక ఐశ్వర్య అధికార ఆడంబరాలతో అహంకరించేవారు

నేటి సమాజంలో చలామణి అవుతున్నారు. కొందరు వి.ఐ.పి.లైతే మిగిలినవారంతా అతి అప్రధానులుగా పరిగణించటంలాంటి అసమ సాంఘిక సంబంధాలు సమాజంలో అవులౌతూ వున్నాయి. అలా భౌతిక శాస్త్రాలలోను, సాంఘిక శాస్త్రాలలోను ద్వంద్వవైరుధ్యతల ప్రభావం యెదురై పలు మానసిక ఒత్తిడులకు దారితీస్తూ వుంది. ఇలాంటి స్థితిలో సమస్త మానవుల శరీరావశ్యకతలు, మానసికావశ్యకతలు రెండునూ నెర వేరాల్సిన సమస్యలే. భౌతిక శాస్త్రానికిని, సాంఘిక శాస్త్రానికిని ఉమ్మడి లక్ష్యం కావలసి వస్తూవుంది. మన ఆధ్యాత్మిక లక్ష్యం కూడ 'సర్వేజనాః సుఖినోభవంతు' అని అఖిల మానవాళి సంక్షేమాన్ని సాధించటమే కాని వేరేమియుకాదు.

కాబట్టి మరింతగా సమ్యక్ దృక్పథం ఆవశ్యకమౌతూ వుందని తోస్తోంది. అలాంటి సాంఘిక సమాలోచనను పెంపొందించుటకై నేటి మేధావులు కనీసం తమ తీరిక సమయా న్నైనా వినియోగింపబూనడం వాంఛనీయమని తోస్తోంది. పరస్పరాధారంగల ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక స్వాతంత్ర్యాల సామూహిక విస్తరణ లక్ష్యమే ఆధ్యాత్మిక మోక్ష సాధనకు కూడ ఆధారంగా ఉంటుందనునది కూడ సువిదితాంశమే.

ఈ గ్రంథంలోని విభిన్న విషయాలు పాఠకులలో ఆసక్తిని కలిగించగలవని అనుకుంటాను. పాఠక మహాశయులు తీరా విప్పి స్వయంగా చదవనున్న సందర్భంలో ఆయా విషయాలను గూర్చి అధికంగా వ్రాయబూనడం అనుచితమే ఔతుంది. ఐనా రెండుమాటలు ముఖ్యంగా టిబెటు భూభాగ పరిచయం, అక్కడి సాంఘికాచారాలు, లామాయిజంవ్యవస్థలాంటి విషయాలు మరియు టిబెటు వజ్రయాన బౌద్ధ సాంప్రదాయానికి, హిందూ శైవశాక్త ఆగమాలు ఇచ్చిన ఈ యాత్రా గ్రంథానికి ప్రాధాన్యత కల్పించాయని తోస్తుంది. శైలిసు బోధకంగా యుండటం కూడ విశేషమే. సమర్థరామదాస ప్రణీతమైన 'దాసబోధ' నుండి స్వీకరించి ఆ యా సందర్భాలలో చేర్చియున్న వేదాంత బోధనా విషయాలు దేవీ భాగవతం నుండి తీసికొని అక్కడక్కడ చేర్చియున్న శాక్తోపాసనా వివరాలు పాఠక మహాశయులలో ఆలోచనలను ప్రేరేపించగలవని తోస్తుంది. ఈ రచనలో విరివిగా పొందుపరచబడియున్న స్తోత్రములు భారత రామాయణాది పద్యశ్లోకములు యువకులకు పఠనయోగ్యమనుకొంటాను.

ఈ గ్రంథానికి అనుబంధంగా కోరినంతనే మానససరోవర, కైలాస పౌరాణిక విశిష్ఠత, కావ్యములలో హిమాచల సౌందర్య ప్రసక్తి, కైలాస మానసప్రశంస, శాక్తాది సాంప్రదాయము, సృష్టిక్రమము మున్నగు అమూల్య విద్వద్రచనలను సమకూర్చి యిచ్చిన మాననీయ మిత్రులు డా. శ్రీ భాష్యం విజయసారధి, డా. కోవెల సుప్రసన్నాచార్య, డా. అత్తలూరి మృత్యుంజయ శర్మ మరియు శాస్త్రుల భార్గవరామశర్మ గారలకు ఈ సందర్భంలో వినమ్ర కృతజ్ఞతలను సమర్పించుకొంటున్నాను.

ఈ గ్రంథ ప్రచురణ కార్యక్రమ మధ్యలో కొన్ని బాహ్య అవాంతరాలు సంఘటించి అకస్మాత్తుగా పైబడి యెంతగానో మనోవేదనకు గురికావలసి వచ్చినను పట్టుదల వీడక ధైర్యముగా స్థిర సంకల్పముతో వలసిన నిధులను సేకరించుకొని ముందునకుపోగి, జయ ప్రదంగా ప్రచురణను వెలుగులోకి తెచ్చిన చి. మనోహర్‌ను ఎంతేని అభినందిస్తూ వున్నాను.

మహాకవి కాళిదాసు కైలాసనగ విశేషములను గూర్చి మేఘుని ద్వారా దిగువ మాటలు చెప్పాడు.

సీ. ఆ వెన్క నూత్న జపారుణ సాంధ్య రా
గమ్మునీ నెమ్మేన గలయ బూని,
పశుపతి తాండవ ప్రారంభమున రక్త
సిక్తగజాజినాసక్తిమాన
చుండీశు భుజ తరు మండలంబున కుత్త
రీయంబు చుట్టిన రీతి యగుము,
నీ యొనర్చెడి భక్తి నియమ ప్రపత్తుల
కా భవానీ దేవియాత్మ నలరి

గీ. భయము తొలగంగ హర్షిత స్వాంతయగుచు
కరుణ నిశ్చల దృష్టితో గాంచు నిన్ను
ఇట్లు పార్వతీ పరమేశ కృపను గాంచి
సులభముగ నీవు తమ్ముడా శుభము గనుము

అన్నట్లే కైలసనగ సందర్శనముచేసి, ఆ ఉత్తేజనతో ఈ గ్రంథమును ప్రకటించే సందర్భములో చి. మనోహర్ కూడ శుభములు గనగలడని ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ వున్నాను.

ఇట్లు,

పాములపర్తి సదాశివరావు

వరంగల్

# అభినందన

డా॥ సి. నారాయణ రెడ్డి
ఎం. ఏ.; పిహెచ్.డి; డి. లిట్.

వైస్-ఛాన్సెలర్,

సార్వత్రిక విశ్వవిద్యాలయము, ఆం.ప్ర. తేది : 12-5-1986

శ్రీ పి. వి. మహోనరరావు గారికి,

మీరు ఆప్యాయంగా పంపిన ''కైలాస దర్శనం'' అందింది. మీ కలంలో కెమెరా ఉంది. లేకుంటే మీరు చూసిన దృశ్యాలను అంత స్పష్టంగా మనోనయనాలకు రూపు కట్టించడం ఎలా సాధ్యం. యాత్రలోని చిన్న చిన్న విషయాలను కూడా మీరు పూస గుర్చినట్లు చెప్పి, పాఠకులకు కుతూహలాన్ని రేకెత్తించారు. అన్నీ ఒక ఎత్తు. మీరు వర్ణించిన దృశ్యాలకు కొన్ని శ్లోకాలు మూలభిత్తికలుగా ఉన్నాయి. మరికొన్ని మీరు దర్శించిన ప్రశాంత వాతావరణాన్ని చిత్రించడానికి దోహదకరంగా వున్నాయి.

ఎంతో ఉల్లాసంగా, సాక్షాత్ కృత కైలాసంగా జరిగిన మీ యాత్రలో పరమవిషాద శ్రుతి రామకృష్ణన్ గారి నిర్యాణం. అది హృదయవిదారకం.

పాఠకులలో తాత్త్వికతను పెంచే యాత్రాకృతిగా మీ ''కైలాస దర్శనం'' ఉత్తమశ్రేణికి చెందింది. అందుకు మీకు నా అభినందన.

మీ

సి. నారాయణ రెడ్డి

# అభినందన

ప్రొఫెసర్ కోవెల సుప్రసన్నాచార్య
డీన్, ఫ్యాకల్టీ ఆఫ్ ఆర్ట్స్,
కాకతీయ యూనివర్సిటీ, వరంగల్.

తే॥ 20-5-1986

'కైలాస దర్శనం'ను గురించి మా మిత్రులు శ్రీ పి. వి. మనోహరరావు గారు వ్రాసిన ఈ గ్రంథం విస్తృతమైంది. ఈ గ్రంథం యాత్రాంశాలను చెప్పటమే కాకుండా, ఆ యా స్థలాలను వర్ణించే సందర్భంలో, ఆ యా స్థలాల వైశిష్ట్యాన్ని, అవి ప్రాతినిధ్య వహించే దేవతల, ధర్మాల, ఆచారాల విశిష్టతనూ వివరించడం జరిగింది. అత్యంత సాహస పూర్ణమూ, దుర్గమమూ అయిన ఈ యాత్రను శ్రీ మనోహరరావుగారు నిర్వహించి కైలాస పర్వతములను మానస సరోవరాన్ని దర్శించారు.

భారతదేశ సంస్కృతిలో యాత్ర అనేది విలక్షణమైన అంశం. పురాణాలు యాత్రా ప్రాధాన్యాన్ని విస్తృతంగా వివరించాయి. బహు క్షేత్రములు, బహు తీర్థములు, బహు దేవతా స్థలములు దర్శనీయాలై, భారతదేశంలో ప్రతి వ్యక్తి ఆసేతు శీతాచలమూ పరిభ్రమిం చేందుకు వీలు కలిగించాయి.

కేదారేశు భజించితిన్ శిరమునన్ గీలించితిన్ హింగుళా
పాదాంభోరుహముల్ ప్రయాగనిలయున్ పద్మాక్షు సేవించితిన్
యాదోనాధసుతాకళత్రు బదరీ నారయణున్ గంటి, నీ
యాదేశంబననేల చూచితి సమస్తాశావకాశంబులన్.

అని మనుచరిత్రలో సిద్ధుడు పేర్కొంటాడు. ప్రయాణ సౌకర్యాలు లేని ఆ రోజుల్లో కూడా దుర్గమాలైన హిమాచల క్షేత్రాలను దర్శించే సాంప్రదాయం ఉండేది. కాశిలో విశ్వేశ్వరుని దర్శనం చేసి, గంగాజలాన్ని తెచ్చి రామేశ్వరంలో అభిషేకం చేయవలెనని ఒక విశిష్ట భావం ఉన్నది.

అట్లాగా రామేశ్వరాలయంలో అభిషేకం స్వయంగా చేసే అవకాశం నేపాల రాజులకే ఉండేదని విన్నాము. పరిశీలిస్తే బదరిలో పూజారులు కేరళలోని నంబూద్రి బ్రాహ్మణులు.

పురాణాల్లో యాత్రలు రెండు ప్రయోజనాలను ఉద్దేశించి విధించబడినాయి. ఒకటి పుణ్య సంపాదన కోసం సామాన్యంగా అందరూ చేసేదే యిది. అయితే కొన్ని ప్రత్యేకమైన అపచారాలు జరిగినపుడు యాత్రలు పాప పరిహారానికి విధించబడ్డాయి. మహా భారతంలో

అర్జునుడు చిన్ని అపచారానికి యాత్రకు బయలుదేరుతాడు. పురాణాలలో ఆయా యాత్రలు తత్తత్పాప పరిహారానికి ఎలా తోడ్పడ్డదీ తెలియవస్తుంది.

ఈ విధంగా యాత్రలు జాతీయ సమైక్యతను రాజకీయ పరిస్థితులకంటె అతీతంగా సనాతనంగా నిలబెట్టుతూ వచ్చాయి. దేశాన్ని అంతటినీ సాంస్కృతికంగా ఏకసూత్రంలో బంధించాయి. శైవులకు ద్వాదశ జ్యోతిర్లింగాలు కానీ శాక్తులకు పంచాశత్ దేవీక్షేత్రాలు గానీ, వైష్ణవులకు అష్టోత్తర శతతిరుపతులు గానీ, దేశం అంతటా వ్యాపించి ఉన్నాయి. ఈ విధంగా దేశంలోని అన్ని సాంప్రదాయాలు జాతీయ సమైక్యతను దృష్టిలో ఉంచుకునే ఈ విధమైన ఏర్పాటు చేశారని భావించవలసి ఉన్నది.

యాత్రా సందర్భంలో భిన్న భౌగోళిక పరిస్థితులూ, వాతావరణ పరిస్థితులూ, ఆహార విహార విధానాలు ఇవన్నింటితో యాత్రికునకు పరిచయం అయ్యేది. అనుభవం విశాల మయ్యేది.

ఆధ్యాత్మిక స్థాయిలో బ్రహ్మాండమూ, పిండాండమూ ఒక సామ్యము కలిగి ఉన్నవి. బ్రహ్మాండములో ఉండే అంశాలన్నీ అండాండములో బీజరూపంగా ఉంటవి. ఈ విషయం గ్రహించితే యాత్రాచరణం సాధకుని యోగ మార్గ పురోగమనంగా కనిపిస్తుంది. కాశీ ఖండంలో ఆగస్త్యుడు లోపాముద్రతో.

భ్రూఘ్రాణంబుల సంధి యవిముక్త స్థానంబు - అది అభ్యంతర క్షేత్రంబు - తీర్థంబులు బాహ్యాభ్యంతర భేదంబున ద్వివిధంబై యుండు.

సీ. శీర్షంబునందలి శ్రీశైల తీర్థంబు
మల్లికార్జునదేవు మనికి పట్టు
ఫాలభాగమునందు ప్రాలేయమయమైన
విమల కేదార తీర్థము వసించు
కుచ చూచుకములందు గురుజాంగలమ్మల
తీర్థరాజము సంప్రతిష్ఠనొందు
భ్రూవల్లరీ యుగ్మమునకు మధ్యంబున
ఆనందవన తీర్థ మతిశయిల్లు

తే. గీ. నంతరంగంబున ప్రయోగ మాశ్రయించు
నిమ్మహా తీర్థములు పార్వతీశ్వరునకు
విహరణ స్థానములు వేదవిశ్రుతములు
వెలుపలను లోపలను నుండు తలిరుబోడి. (కాశీఖండము II 115, 117)

అభ్యంతర బాహిర క్షేత్రాలు రెండుగా శ్రీశైలము, కేదారము, ప్రయాగ, కాశి - ఈ నాల్గింటినీ శైవ మహాత్మ్య ప్రతిపాదికమైన కాశీఖండం చెప్పింది. సహస్రారము శ్రీశైలంగా, ఫాల చంద్రస్థానం కేదారముగా, అనాహతము ప్రయాగగా, భ్రూమధ్యమందలి ఆజ్ఞాచక్రము కాశిగా చెప్పబడ్డవి. దీనిని బట్టి యాత్రలు అభ్యంతరాలైనా, బాహిరములైనా, సాధకుని మనో లక్షణాన్ని బట్టి వర్తిస్తవి. ''భావే హి విద్యతే దేవః'' అన్నచోట మనం భావన చేయడాన్ని బట్టి దైవ సాక్షాత్కారం ఉంటుందని చెప్పడం జరిగింది.

జీవునికి బహుజన్మ పరంపరల సూత్రం పరమాత్మ దర్శన పర్యంతం సాగిపోవటం కూడా ఒక యాత్రాంశమే. ఈ దృష్టిలో భౌతికమైన యాత్రలు భౌతిక, వాచిక, మానసిక పరిశుద్ధిని సాధించేందుకు ఏర్పాటు చేయబడ్డవి. ఈ యాత్రలలో అనేక నియమాలు ఉండేవి. పూర్వకాలం యాత్రలలో ఏకభుక్తము, ధరాశయ్య, బ్రహ్మచర్యము మొదలైన నియమాలు యాత్రికులు పాటించేవాళ్లు. అనేక పరిస్థితులలో తన భౌతిక జీవనస్థాయిని, అధికారాన్నీ, ధనవత్త్వాన్నీ మరచి అందరిలో కలసిమెలసి జీవించవలసి వచ్చేది. ఈ విధంగా అహంకార త్యాగం కలిగేది.

అట్లాగే కొన్ని కొన్ని ప్రత్యేక తీర్థ స్థలాలలో కొన్ని కొన్ని సంస్కారాలు విధింప బడినవి. ప్రయాగలో, గయలో, బ్రహ్మకపాలంలో శ్రాద్ధము నియతము. అట్లాగే స్కంద క్షేత్రాలలో కావళ్ళు తీసుకువెళ్ళడం నియతమే. బాసర సరస్వతీ క్షేత్రంలో సాధకులకు మాధుకరవృత్తి విధింపబడినది.

కొన్ని కొన్ని క్షేత్రాలలో క్షేత్రాధి దైవతము ఆజ్ఞ అయ్యే వరకూ నియమనిష్ఠలతో ఉండి కొలువు- సేవ చేయడం కూడా ఉన్నది.

'కైలాస దర్శనం' - ఈ గ్రంథంలో నలభైయ్యైదు అధ్యాయాలు ఉన్నవి. సందర్భాన్ని అనుసరించి ఆ యా పురాణాలలో ఇతర యాత్రా గ్రంథాలలోని అంశాలు విపులంగా ప్రస్తావింపబడ్డాయి. ఆ యా దేవీ దేవతల మహాత్మ్యము, రహస్యాంశములు రచయిత విపులంగా పేర్కొన్నారు. ఈ యాత్ర గ్రంథపఠనంవల్ల అనేక సాంస్కృతికాధ్యాత్మికాంశా లతో పాఠకునకు పరిచయం ఏర్పడుతుంది. ఈ ఉద్దేశ్యంతోనే ఈ గ్రంథంలో ఆరు అనుబంధ వ్యాసాలు ఆయా విషయాలు విస్తృత వివరణను ఉద్దేశించి సమకూర్చడం జరిగింది.

కైలాస మానస సరోవర యాత్ర చాలా దుర్గమమైంది. అతిక్లిష్టమైన మార్గాలలో, పర్వత సానువులలో, అడవులలో, నదీ మార్గాలలో కొనసాగవలసింది. అత్యంత ప్రమాద భూయిష్టమైంది. ఇంత శ్రమకు ఓర్చి రచయిత నూటా ఐదు కిలోమీటర్లు చుట్టు కొలతగల మానస సరస్సును సందర్శించడమే కాక దానిచుట్టూ పరిక్రమ సలిపినారు. అట్లాగే

22,000 అడుగుల ఎత్తుగల కైలాస పర్వతమును, 15,000 అడుగుల ఎత్తున నుండి 19,000 అడుగుల ఎత్తువరకు ఎక్కుతూ పరిక్రమ చేయవలసి ఉంటుంది. ఈ పర్వతాన్ని రచయిత అర్ధచంద్రా కారముగా నున్నదని, శిఖరము లింగాకారముగా నున్నదని వర్ణించాడు. చుట్టూ పర్వతములు పద్మపత్రమువలె రుద్రమాలగా ఉన్నవని ఆ పర్వత సౌందర్యమును వర్ణించాడు.

కైలాస మానస సరోవర ప్రాంతము, అక్కడి నదీ సరః పర్వతములు వీనిని గూర్చి తెలుసుకోవడం వల్ల మన పురాణములలోని సంస్కృతి పరిణామ దశలు వివరంగా బోధ పడుతాయి. ఒక విధంగా మన సంస్కృతికి ఆ ప్రదేశాన్ని ఉద్గమ ప్రదేశంగా పేర్కొన వచ్చును.

పురాణ సాహిత్యాన్ని అనుసరించి సృష్ట్యుద్గమ వికాసాలు అన్నీ మానస పర్వత ప్రాంతాలలోనే జరిగాయి. మేరు పర్వతం అక్కడే ఉన్నది. అది దేవతా స్థానం. ఈ హిమాలయం అనాదినుంచి నేటి దాకా అధ్యాత్మిక ధార్మికాంశాలకు ప్రేరణను కలిగిస్తూనే వున్నది. మానస సరస్సు, మేరువు, హంస మొదలైనవి బహిరములైన అంశాలే కాకుండా అభ్యంతర దశలో, తంత్రయోగ శాస్త్రాలలో ప్రతీకలుగా, తాత్త్విక రహస్య భాషలో ప్రధానాంశాలు అవుతూ వున్నవి.

నిజమైన ఆధ్యాత్మిక జీవనం - భౌతిక జీవనానికి భిన్నమైనది కాదు దాన్నించి పారిపొమ్మనేదీ కాదు. భారతీయుల దృష్టిలో ఈ రెండూ ఒకే అంశం యొక్క రెండు పార్శ్వాలు. భౌతిక జీవనం జీవిస్తూనే దాన్ని నిర్దుష్టంగా - సమగ్రంగా - సుష్టుగా నిర్వహించడం ఆధ్యాత్మిక జీవనంలో భాగమే. ఈ సుష్ఠులక్షణం అది దుష్టమైన స్వార్థాన్నీ, లౌల్యాన్నీ, దురాశనూ, పదార్థాభిలాషనూ పరిత్యజించినపుడే సాధ్యమవుతుంది. ''యోగః కర్మసుకౌశలమ్''. జీవనమంతా ఈశ్వరార్పిత చైతన్యంతో నిర్వహించినపుడు అది దివ్యీక రింపబడుతుంది. ఈ కరణత్రయానికే కాకుండా దానితో అంతఃకరణానికీ ఐక్యం ఏర్పడుతుంది. ఈ అభ్యంతర బాహిర జీవనాల సమన్వయము ఏకీ కరణము భారతీయుల జీవన దృష్టిని వ్యక్తం చేస్తుంది. జ్ఞాన, కర్మలు రెంటినీ జీవితం ఆనరిస్తుంది.

ఈ గ్రంథంలో ఆయా సందర్భాలలో వివరింపబడిన తాత్త్వికాంశాలు పాఠకులకు చాలా ఉపయోగకరంగా ఉన్నాయి. రచయిత బహుగ్రంథ పఠనమూ, పరిశీలనమూ దీనిలో వ్యక్తమౌతున్నాయి.

ఇంతటి భావ భారంతో కూడిన గ్రంథాన్ని మనకు అందించినందుకు రచయిత శ్రీ పి. వి. మనోహరరావు గారికి నా అభినందనలు.

# అభిప్రాయము

డా. ఎస్. లక్ష్మణమూర్తి

ప్రొఫెసర్ అండ్ హెడ్

డిపార్ట్‌మెంట్ ఆఫ్ ఇంగ్లీష్

కాకతీయ యూనివర్సిటీ

వరంగల్ - 506 009

తే॥ 26-5-1986 86

ఆప్తులు శ్రీ పాములపర్తి వేంకట మనోహరరావుగారు కైలాస మానస సరోవర తీర్థ యాత్రా సందర్శన విశేషాలని సులభశైలిలో హృదయంగమంగా వ్రాసినారు.

విభిన్న భారతీయ సంప్రదాయాలలో అనాదిగా కైలాస మానస సందర్శనం పరిక్రమం అతి పవిత్రంగా భావింపబడుతూ ఉన్నవి. వేదోపనిషత్తులలో కావ్యపురాణాలలో హిమవత్పర్వత ప్రాంతాలు దేవభూములుగా ఉపాసనా కేంద్రాలుగా ప్రస్తుతింపబడ్డాయి. భారత సంప్రదాయాన నిష్ఠాప్రత్యయాలు ఉన్నవారికి కైలాస మానస దర్శనం అనేక జన్మ సముపార్జిత సుకృత ఫలంగా భాసిస్తుంది.

శ్రీ మనోహరరావు గారు భక్తిశ్రద్ధలతో నిరంతర మానసిక పంచాక్షరీ జపంతో కైలాస మానస తీర్థయాత్ర చేసినారు. భారత ప్రభుత్వం వారు కల్పించిన సదుపాయాలతో 1983 సంవత్సరాన వీరి యాత్ర సాధ్యపడింది. అనేక రాజకీయ దుస్థితుల మూలాన రెండు దశాబ్దాలుగా భారతీయులకు కైలాస మానస దర్శనం అసాధ్యమై ఆధ్యాత్మ విధులకు మనస్తాపకారణమైంది. ఇంతకాలానికి తిరిగి సాధ్యపడటం పుణ్య విశేషం.

శ్రీ రావుగారి కైలాస దర్శనం వాస్తవ రూపాన కైలాస మానసయాత్ర ఎంత కష్టసాధ్యమో, దుర్లభమో వివరించింది. స్వభావోక్తిగా సహజంగా ఉన్న వర్ణనలు హిమవత్పర్వత గాంభీర్యాన్ని మార్గ కాఠిన్యాన్ని ప్రకృతి సౌందర్యాన్ని కన్నులకు కట్టినట్లు ప్రదర్శించినాయి. యధార్థ విషయాలని ప్రస్తావిస్తూ యాత్రా గ్రంథాన్ని వ్రాయడం సులభ మనుకున్నా, ఇందులో ఒక విశేషం ఉన్నది. వైదిక సంప్రదాయం రక్తనిష్ఠమై మనస్సు కైలాసనాథుని సమాశ్రయించి ముముక్షుడైన సాధకుడు దుర్గమ ఆధ్యాత్మ శిఖరాధిరోహణం చేస్తున్నట్లు అనుభూతమౌతుంది. వివిధ స్తోత్రాలు పురాణేతిహాస శ్లోకాలు కథా సందర్భాలు ఉపాసనా విశేషాలు సమృద్ధంగా ఈ యాత్రా గ్రంథంలో నిక్షేపింపబడ్డాయి. అతి సున్నితమైన మనస్సు భౌతిక పరిసరాల్లో ఉన్న ప్రతి వస్తువులోనూ ఆధ్యాత్మిక సంకేతాన్ని దర్శించినట్లు ఈ గ్రంథం స్పష్టం చేస్తుంది. హిమాద్రి ప్రాంతాన, శిఖర భాగాల్లో, ఉపత్యకలలో, లోయలలో, వృక్షచ్ఛాయల్లో, నదీనదాల్లో, శిలోచ్చయాల్లో, శిథిలాలలో, సరోవరాల్లో,

సర్వోపాసనామార్గాలు ఒక్కుమ్మడిగా సముజ్జీవితములైనట్లు అపౌరుషేయమైన, ఉపనిషద్వాణిమంత్రమై, పరివ్యాప్త మైనట్లు స్ఫురిస్తుంది. కాలవశాన లుప్తమైపోయిన సంప్రదాయ విషయాలను ఎన్నింటినో శ్రీ రావుగారు అతి ప్రయాసంతో సేకరించి గ్రంథస్థం చేసి పునః ప్రాణ ప్రతిష్ఠ చేసినారు. వారికి భారతీయ సంప్రదాయ విషయ జిజ్ఞాసువులందరూ ఋణపడి ఉన్నారు. వేదర్షుల నుండి ఆధునాతనులైన శ్రీ శ్రీ శ్రీ ప్రణవానంద స్వామి చరణులవరకూ నిరంతరం గవేషింపబడిన హిమవత్పర్వత పవిత్ర భూభాగం కైలాస మానస క్షేత్రాలు. ఇతిహాస ప్రమాణా లతో ఈ గ్రంథాన సాక్షాత్కరిస్తాయి. ఇది అమూల్యమైన ఆకర గ్రంథం. ఆత్మనూ మనస్సునూ పరమేశ్వరాధీనం చేయడానికి ఇది చక్కని మార్గదర్శక గ్రంథం. దీనికి కాలదోషము పట్టదు.

ఈ నాల్గు మాటలు వ్రాసే అవకాశాన్ని వాత్సల్యంతో ప్రసాదించిన శ్రీ రావుగారికి నమస్సులు.

శుభం భూయాత్

--- శ్రీ లక్ష్మణమూర్తి



# KAKATIYA UNIVERSITY

**DR. S. LAXMANA MURTHY**
PROFESSOR AND HEAD

**DEPARTMENT OF ENGLISH**
VIDYARANYAPURI
WARANGAL - 506 009.

26-5-1986

Sri P. V. Manohar Rao garu has kindly asked me to read through his unique travelogue **Kailasa darsanam**. The book gives us a sincere acoount of the author's long journey to Mt Kailas and Manasa Sarovar. We learn with surprise that despite many facilities provided by the government of India, the journey is still 'hazardous and wearisome'. It must have been in days bygone a real test of **Tapasya** for those pious souls who went up the way to the holy lake traversing the almost uninhabitable Himalayan terrain. Yet they pursued and accomplished the most difficult and cherished feat in their spiritual quest. The Holy Mount and the lake continue to beckon us in their timeless glory. The travelogue bears the stamp of authenticity. It is impossible to resist the charm of quiet narration and moving presentation of facts in the book. Sri Rao garu has rendered great service to the spiritually inclined by providing a rich fare of traditional lore relating to **Sadhana** and **Upasana** in the travelogue. He has made it a useful book of significant referential value.

I am sure that **Kailasa Darsanam** will receive wide popularity and scholarly recognition which it richly deserves.

**DR. S. LAXMANA MURTHY**

# Avadhana Saraswati Peeththam

**Avadhana Sahasraphani**
**Brahmasri Dr. Madugula Nagaphani Sarma**

యాత్రలు నిరంతరం అనేకులు చేస్తూ వుంటారు. కానీ దానికొక కావ్యత్వం కల్పించి అనుభవాల అక్షర దర్శనం చేయించడం ''మనుష్యాణాం సహస్రేషు కశ్చిత్'' చేసే పని. కైలాస దర్శనం అని ఉదాత్తంగా పేరు పెట్టడం, మానస సరోవరాన్ని ''బ్రహ్మ మానస సరోవరం'' అని పూర్తిగా పేరుతో పిలవడం, ప్రసిద్ధ గ్రంథ శ్లోకోట్టంకనం, తత్తత్ ప్రదేశ-భాషా-సంస్కృతి-సన్నివేశ ప్రకృతి వర్ణనం, తత్ర తత్ర సంప్రదాయ నిర్దేశనం, క్వాచిత్కంగా వేదశాస్త్ర విషయ విచార చర్చా సమన్వయం - మొదలైన విషయాలవలన శ్రీ పి.వి. మనోహరరావుగారి యొక్క సూక్ష్మదర్శిత, రచనాసక్తత, దర్శనానురోధ కథన నిపుణత ప్రస్ఫుటమౌతున్నాయి.

కైలాస దర్శనాహ్వాయ
లీలాలావణ్య కథన రీతి ప్రథిత
శ్రీ లలితమనోహరమయి
కేలన్ సర్వార్థమొసఁగు కృతి పఠితలకున్

– మాడుగుల నాగఫణి శర్మ

24-6-1998.

# విషయానుక్రమణిక

## అనుబంధములు



# కైలాస దర్శనం

## ఒకటవ అధ్యాయము

### బ్రహ్మమానస సరోవరయాత్ర

ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే ।
కవిం కవీనా ముపమశ్రవస్తమమ్ ।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత
ఆనశ్శృణ్వ న్నూతిభి స్సీద సాదనమ్.

### హస్తినాపురి చంద్రలోక భవనము

శ్లో॥ ఆ పాతాళ నభఃస్థలాన్త భువన బ్రహ్మాండ మావిః స్ఫుర
జ్జ్యోతిస్ఫాటికలింగ మౌళి విలసత్పూర్ణేందు వాన్తామృతైః ।
అస్తోకాప్లుత మేక మీశ మనిశం రుద్రానువాకాఞ్జపేత్ ।
ధ్యాయే దీప్సితసిద్ధయే ధ్రువపదం విప్రోఽభిషించేచ్ఛివమ్ ॥

ఆరోజు 17వ ఆగష్టు 1983. సమయం సాయంకాలం 6-45 గం. క్రొత్త డిల్లీలోని జనపథ్‌లోగల చంద్రలోకభవనము. ఆ మహా నగరములో వాహనముల, మనుష్యుల హోరు సముద్ర తరంగాలను తలపిస్తూవున్నది. ఎవరెటు పోవుచున్నారో, ఏ వాహనములు ఎటునుండి వస్తున్నవో, ఎటు పోవుచున్నవో అంతుపట్టదు. ఈ నగర జీవన యాత్ర ఎంతేని అగమ్య గోచరము. సాయం సమయము కావున చాలావరకు గృహోన్ముఖులగు చున్నట్లు మాత్రము భావించవచ్చును. ఆ వెడల్పాటి రోడ్లకిరువైపుల గల పెద్ద పెద్ద విద్యుద్దీపములు ఇరువంకలగల ఆకాశ హర్మ్యాలు, ఆ నగరశోభ వర్ణనాతీతము. ఆ రోజు ఉదయం 5 గం. లకు ''చంపావతి'' నుండి బస్సులో బయలుదేరిన మాకు ఆ 'చంద్రలోక భవనము' ఆ ఢిల్లీ నగరము ఎపుడు

వచ్చునాయని, ఎపుడు బస్సు దిగుదుమాయని ఒకటే ఆతురత, అంతగా ఎదురు తెన్నులు చూచిన ఆ భవనము రాగానే మాలో పెల్లుబికిన ఆనందమునకు అవధులు లేవు. ఎందుకని ?

సరిగ్గా ఒక మాసము రోజుల క్రితము ఆ స్థలము నుండే బయలుదేరిన మా 22 మంది యాత్రిక బృందము 19 మందితో మాత్రమే తిరిగి చేరుకున్న ఢిల్లీ రాజధాని అదే ! వారివారి రాష్ట్ర రాజధానుల సమాచారమే కాక స్వగ్రామ, స్వగృహ సమాచారము కూడా తెలియక మరో ప్రపంచమునుండి వార్తాహీనులమై వచ్చి చేరుట మొదటిది. మరియు భార్య పిల్లల క్షేమం, ఆదాయ, వ్యయముల గొడవలు అతివృష్టి అనావృష్టుల కలతలు మున్నగు సాంసారిక గందర గోళములెన్నో అచట చేరుకొనేసరికి మరొకమారు అగ్గలమై కనుల ముందు తిరుగాడగా ఉద్వేగము కాక మరేమి అనిపించును? ఇది రెండవ కారణం.

మేము బస్సు దిగగానే మాకై వేయికనులతో ఎదురు చూచుచున్న వారిలో కీ॥ శే॥ రామకృష్ణన్‌గారి ఇరువురు కుమారులున్నారు. వెంటనే మాకు వారు ఎదురువడిరి. వారి కనులలో ఆవేదన, దుఃఖము, దీనత్వము వారి మనసులలో గల జ్వాలాముఖిలాంటి ప్రగాఢ తపన మాకు ప్రస్ఫుటముగా గోచరించెను. వారు గత మూడు రోజుల నుండియు మారాక కొరకు నిరీక్షించుచుండిరి. వారి తండ్రిగారి మరణ కారణము మరణ వివరములు మృతదేహ పరిస్థితి మరియు ఆయన చివరి కోరికను గూర్చిన విషయములు మా నుండి వినుటకై వారు వేయి కళ్లతో యెదరు చూచుచుండిరి. వారు తమ పరిచయ వివరములు మాకు తెలియపరిచిరి. నేనూ మా లీడరు 'డా॥ గోడ్బోలే' ఆ విషాద వృత్తాంతమంతయూ వారికి వివరించి ఓదార్చి ఆ దుర్ఘటన హృదయస్పందన తీవ్రతవల్ల కలిగిన సహజ మరణమని తెలిపితిమి. మృతదేహము చెడిపోకుండా గైకొన్న జాగ్రత్తల గురించి కూడా వివరించితిమి. ఆ తర్వాత మృతదేహమునకు ఐదవ రోజున ''కాలాపానీ''లో సైనిక మర్యాదలతో దహన సంస్కారములు జరుపబడిన వృత్తాంతమంతయూ తెలిపితిమి. కుమాయున్ మండల్ వికాస్‌నిగమ్ వారు భద్రముగా కొని తెచ్చిన వారి వస్తు సామాగ్రితోపాటు, కీ॥ శే॥ రామక్రిష్ణన్ గారి అస్థికలనుకూడ అందజేసిరి. మరియు మేము తెచ్చిన పవిత్ర 'మ్మానస సరోవర' జలమునుకూడా వారి కుమారులకు అప్పగించి ఆశీర్వదించితిమి.

తిరిగి ఢిల్లీ చేరుకున్న మాలోనుండి ఒకరొకరు సెలవు తీసుకొని వారివారి స్థావరములకు వెడలి పోవుచుండిరి. వ్యాధి గ్రస్తులైన చొక్కారావుగారి నొక టాక్సీలో శ్రీ కిశోర్‌ను తోడిచ్చి ఇంటికి పంపించితిని. తర్వాత విదేశాంగ శాఖా అండర్ సెక్రెటరీ శ్రీ చక్రవర్తిగారు రాగా వారితో మాట్లాడి వారికికూడా పైన తెలిపిన

విషయములన్నీ వివరించి డా॥ గోడ్బోలేతో సెలవు తీసుకొనేవరకు దాదాపుగా అందరును వెడలి పోయినారు. నేనొక టాక్సీ కుదుర్చుకొని 9వ నెంబరులోగల మోతీలాల్ నెహ్రూ మార్గ్‌లోని మాఅగ్రజుల వారి ఇంటి కి దాదాపు 7-30 కల్లా చేరుకుంటిని. కారు దిగగానే అక్కడ నా గడ్డమును చూచి ముందుగా ఎవరును గుర్తించలేదు. పైగా ఆరోజు నేను అచటికి వస్తాననికూడా ఎవరుమా ఊహించలేదు. నేను 'పండిత్‌జీ' అని పిలువగానే ఆయన ఆశ్చర్యముతో నా చెంతకు వచ్చిచూచి నమస్కరించెను. ముందుగా గుర్తించనందుకు పశ్చాత్తాపము వ్యక్తీకరించెను. నా సామానులను లోనికి తీసుకొని వెళ్ళెను. అప్పటికి ఇంకా మా అన్నగారు ఇంటికి రాలేదు. నేను లోనికి వెళ్ళి కాఫీత్రాగి స్నానముచేసి విశ్రమించిన కొంతసేపటికి మా అన్నగారు ఇంటికి వచ్చిరి.

## మామాతృమూర్తి స్మరణ :

నేను ముందుగా అన్నగారి గదిలోనికి వెళ్ళివారికి పాదాభివందనమూగావించితిని. వారు కుశల ప్రశ్నలు అడిగి క్షేమముగా యాత్ర ముగించుకొని ఇంటికి చేరినందులకు సంతసించిరి. పిదప నేను ఇచ్చిన ''పవిత్ర మానసోదకము''ను సేవించి ఆయా రంగురంగుల రాళ్ళను పూజా ప్రసాదమును స్వీకరించి వెంటనే ''అమ్మ ఉంటే ఎంత సంతోషపడెడిదో'' యని కన్నులు చెమ్మగిల్లగా వారు మా మాతృమూర్తిని స్మరణకు తెచ్చిరి.

తల్లిని గురించి వేదములో నీ విధముగా చెప్పబడెను :

''మాతృమాన్ పితృమా నాచార్యవాన్ పురుషోవేద''

మరియు

గీ ॥ తల్లి యధికురాలయ్యె ఈ ధరణికంటె
తండ్రి యధికుండు విష్ణు పదంబుకంటె
వీరి సేవించి పూజించి విమలయశులు
ఐహికాముష్మికంబుల నలర గలరు.

(చాంధోగ్యోపనిషద్) తెనుగుసేత

మా అమ్మగారికి పుణ్యక్షేత్రములను దర్శించే అభిలాష మెండుగా నుండెను. ఆమె దైవభక్తి పరురాలు; నిష్ఠాగరిష్ఠ. మా అన్నగారు ఆంధ్రప్రదేశ్ దేవాదాయ ధర్మాదాయ శాఖామాత్యులుగా నున్నపుడు ఆంధ్రప్రదేశ్ యాత్రలన్నియేగాక పండరీపురము, రామేశ్వరము మొదలుగాగల ఇతర పుణ్యక్షేత్రములను ఆమెచే దర్శింపజేసిరి. ఆమెకు మరొక్కసారి కాశీవిశ్వేశ్వరుని దర్శించాలని వీలయితే బదరీ కేదారములకుకూడా

పోవాలనే కాంక్ష మెండుగా యుండెను. కాని 1980 జూన్ మాసములో ఆమెకు "ఊపిరి తిత్తుల క్యాన్సర్" వ్యాధి రావటంవల్ల ఉస్మానియా మరియు క్యాన్సర్ ఆస్పత్రులలో మూడుమాసములపాటు చికిత్స బొందె ను. రెండు మాసములకు పైబడి ఆస్పత్రిలో కూడా ఆమె మడి కట్టుకోకుండా భోజనము చేసెడిదికాదు. ఆస్పత్రిలో ఆమెను చూడవచ్చిన వారందరికి టీకాని మధ్యాహ్నమైతే భోజనముకాని అచటనే చేయాలని పట్టు పట్టుచుండెడివారు. మాఅన్నగారు ఆమె చివరిరోజులలో అమెరికాలో నుండిరి. వ్యాధి ముదిరినట్లు తెలియగానే హైదరాబాదుకు వచ్చి ఆమె చెంత చేరిరి. ఆరోజు ఆమె మాట్లాడే పరిస్థితి లేకున్నా ఆమె మా అన్నగారికి అన్నము పెట్టాలనే సంజ్ఞను తెలియచేయగా అర్ధరాత్రి ఇంటినుండి టిఫిన్ క్యారియర్ తెప్పించి ఆమెయెదుట మా అక్కగారు భోజనము వడ్డించుచుండగా ఆమె ఎంతో తృప్తిచెందిన దివ్య మానసిక చిత్రము వీక్షించుచుండగా మాఅన్నగారు దుఃఖము భరింపలేక భోజనము నామ మాత్రముగనే చేయుచూ కన్నీరు మున్నీరుగా విలపించిన ఆ నాటి అనుభవము ఆవిస్మరణీయము. మా అన్నగారికి 60 సం॥ లు నిండిననూ చంటి పిల్లవానిగా భావించి ఆకలిని పరామర్శించే ఆ మహాతల్లి ఇక ఏ లోకములో దొరుకును. అందుకేనేమో, "ఢిల్లీకి రాజయినా తల్లికి కొడుకే"యను సామెత ఏర్పడియున్నది.

ఆ పైన చివర పదిరోజులు ఆమె ఆచార నిష్ఠ అసాధ్యమై ఆరోగ్యము పూర్తిగా క్షీణించి చివరకు ఆగస్టు 3వ తేది మధ్యాహ్నము 2గం॥ లకు స్వర్గస్థురాలయ్యెను.

అలాంటి పుణ్యమూర్తి మా కన్న తల్లి స్మరణ ఆ శుభ సమయములో స్ఫురణకి రావటం ఎంతేని సహజము. మరియు సమంజసమే కదా! ఆ తర్వాత అచటనే యున్న మా పింగళి రంగారావు బావగారికికూడా (కీ॥ శే॥) నమస్కరించి తీర్థ ప్రసాదము లిచ్చితిని. పిదప 8 గం॥ ల ప్రాంతములో 'హనుమకొండ' ఫోన్ చేసి మా అక్కగారి మనుమడు చి॥ వెంకటేశ్‌తో మాట్లాడి అందరు పిల్లలు క్షేమసమాచారము తెలిసికొనగనే నాలోని ఆతురత అనుక్షణ నిరీక్షణ మూలకమగు గుండె బరువు దిగిపోయి మనసు నిశ్చింతనొంది ఆత్మశాంతి లభించి హృదయస్పందన స్వస్థానమునకు చేరుకొని ఎంతో ప్రశాంతత చేకూరినది.

నేను ఢిల్లీ నుండి చి॥ వెంకటేశ్‌తో ఫోన్‌లో మాట్లాడగా నిజంగా నేనే మాట్లాడుతున్నానా అనే సందేహము వానికి కలిగెను. త ర్వాత ఒక్క గంటులో వాడు ఇంటి కి పరుగెడి (ఫోన్ 150 గ॥ దూరములో వున్నది.) ఎగపోస్తూ మాపిల్లలకు చెప్పగా యెవరునూ నమ్మక అంతయు కట్టు కథగా భావించిననూ తర్వాత నిజమును

గ్రహించి నేనేదో వేరే ప్రపంచమునుండి మరో జన్మనెత్తి వచ్చి వారి మధ్యలో చేరినట్లుగా ఊహించి పొందినట్టి వారి ఆనందమునకు పరవశత్వమునకు అంతులేనట్లుగా తర్వాత తెలిసెను. వారందరును నేను ఇంకో వారము రోజుల తర్వాతకాని ఢిల్లీ చేరనని తలచియుండిరి.

ఆ రోజు మా యితర మిత్రులతోనూ సహచరులతోనూ మాట్లాడి 9 గం॥ లకు భోజనముచేసి టి. వి. కార్యక్రమాములను చూసి హాయిగా నిశ్చింతగా నిదురించితిని. ఇట్లు మా ప్రయాణపు చివరిరోజు చివరి సంఘటనతో ఈ కైలాస మానస సరోవర యాత్రా స్మృతుల గాథను ప్రారంభిస్తూవున్నాను.

శ్లో॥ బ్రహ్మాండ వ్యాప్త దేహా భసితహిమరుచా
భాసమానా భుజం గైః।
కంఠేకాలాః కపర్దాః కలితశశికలా
శ్చండకోదణ్డ హస్తాః ।
త్ర్యక్షా రుద్రాక్షమాలా సులలితవపుష
శ్శాంభవా మూర్తిభేదా ।
రుద్రాః శ్రీరుద్రసూక్తప్రకటిత విభవాః
నః ప్రయచ్ఛన్తు సౌఖ్యమ్ ॥
(ఇతి శ్రీ రుద్రాభిషేక ధ్యానమ్)



## రెండవ అధ్యాయము

శ్లో॥ రత్నైః కల్పిత మాసనం హిమజలైః
స్నానంచ దివ్యాంబరమ్ ।
నానారత్న విభూషితం మృగమదా-
మోదాంకితం చందనమ్ ।
జాతీచంపక బిల్వపత్ర రచితం
పుష్పం చ ధూపం తథా ।
దీపం దేవ! దయానిధే! పశుపతే!
హృత్కల్పితం గృహ్యతామ్ ।

## హన్మకొండనుండి హస్తినాపురికి- అచట నాల్గు దినములు

శ్లో॥ ''దృష్టిపూతం న్యసేత్పాదం; వస్త్రపూతం జలం పిబేత్ ।
సత్యపూతాం వదే ద్వాచం, మనః పూతం సమాచరేత్. ''

అంటే యోగుడు దిగుడుల యందు నడుచునపుడు దృష్టి క్రింద యుంచవలెను. నీటిని వస్త్రముచే శోధించి త్రాగవలెను. సత్యముచే పవిత్రమగు వాక్కులు నీతులు చెప్పవలయును. తమ సంతానమునకు తల్లిదండ్రులు ఇలాంటి వెన్నో మంచి విషయములను వుపదేశించవలెను.

''మాతా శత్రుః పితా వైరీ, యేన బాలో న పాఠితః ।
న శోభతే సభామధ్యే, హంసమధ్యే బకో యథా ''.

''విద్యలేనివాడు వింత పశువు'' అను సామెత అందరికీ తెలిసినదే. విద్యా విహీనుడు హంసలలో కొంగవలె లోకములో అవమానింపబడును. విద్యగరపని తల్లిదండ్రులు తమ సంతానమునకు బద్ధవైరులు. తమ సంతానమును విద్యావంతులుగ ధార్మికులుగ యోగ్యులుగ చేయుట తల్లిదండ్రుల ప్రథమ కర్తవ్యము మరియు కీర్తిదాయకము.

శ్లో ॥ విద్యా నామ నరస్య రూప మధికం ప్రచ్ఛన్నగుప్తం ధనమ్ ।
విద్యా భోగకరీ యశస్సుఖకరీ విద్యా గురూణాం గురుః ।
విద్యా బంధుజనో విదేశగమనే విద్యా పరా దేవతా ।
విద్యా రాజసు పూజితా న హి ధనం విద్యా విహీనః పశుః॥

తా॥ మానవులకు విద్యయే దాచుకొనిన ధనము, విద్యయే రూపమును కీర్తిని దెచ్చును. సుఖింపజే యును. అదియే గురువు. దేశాంతరములకేగునపుడు నదియే బంధువు, విద్యకు దగిన ధనము ప్రపంచమున నెక్కడను లేదు. విద్యయున్న దైవసహాయమున్నట్లే. పండితులు రాజులును విద్యను విద్వాంసుని, పూజింతురు. విద్య నెరుగని వాడు ద్విపాద పశువునకు సమమని చెప్పుదురు.

కావున మా పూర్వీకులు సంపాదించిన ఆస్తి, ఇల్లు, భూములు మా స్వగ్రామమగు 'వంగర'లో నున్ననూ కేవలము పిల్లల చదువుల నిమిత్తమై మాకు 30 kms. దూరములో సకల సదుపాయములు గల హనుమకొండ పట్టణములో మా కుటుంబ సభ్యుల మందరము వాసము చేయుచుంటిమి. మధ్య మధ్య నేను వంగర గ్రామమునకు వెళ్ళి మా వ్యవసాయ పనులు గ్రామ అభివృద్ధి, ఇతర వ్యవహారములు చూచుకొనుచు ఒకటి రెండు రోజులు గ్రామములో వున్నా తిరిగి హనుమకొండకు చేరుకొనుచుంటిని.

ఆరోజు 9వ తేది; నేను హనుమకొండలోనే వున్నాను. మా గ్రామము నుండి మా గుమాస్తా ఒక టెలిగ్రాము ఒక కవరు తీసుకొని వచ్చెను. అవి ఢిల్లీలోని విదేశాంగ శాఖ కార్యాలయము నుండి వచ్చినవి. అందులో నేను కైలాస మానసరోవర యాత్రకు నాలుగవ బృందములో ఎంపికయ్యెనట్లుగాను, జూలై 14వ తేదీన పై కార్యాలయమునకు చేరవలసినదిగాను, మాబ్యాచ్ జూలై 19న బయలుదేరగల దనియు తెలుపబడియుండెను. మరియు లేఖలో మాకు కావలసిన దుస్తులు మందులు ఇతర సంభారములు విపులముగా విశదీకరించి పంపిరి.

లోగడ నేను ఢిల్లీలో యున్నపుడు 18వ జూన్ రోజు ఆ యాత్ర చేయవలయుననే కాంక్షతో ఒక అభ్యర్థన పత్రము నిచ్చియుంటిని. ఆ రెండవ రోజు శ్రీ చొక్కారావు గారు కూడా అచట నాకు తటస్థించుటచే ఆ విషయము వారికి తెలియచేయగా వారును ఈ యాత్రకు సుముఖత వ్యక్తీకరించగా మరో అభ్యర్థన పత్రముపై వారి చేవ్రాలును తీసుకొని ఫారమును నింపి సంబంధిత కార్యాలయమునకు పంపియుంటిని. ఇంత త్వరగా మెరుపుతీగలా ఆ ప్రయాణము ఘ్రిపడునని వూహించలేదు. నేను అంత తక్కువ వ్యవధిలో ప్రయాణమై దాదాపు 8 వేల రూపాయలు సమకూర్చుకొనగలననే ఆశకూడా కన్పించలేదు. పైగా శని, ఆదివారముల సెలవులు కూడా తోడుపడెను.

నాకు కరీంనగర్ జిల్లా పరిషత్తులో ఒక బిల్లు రావలసియుండెను. పై సెలవుల వల్ల ఆ ఒక ఆశా కిరణమునకు కూడా అవరోధము ఏర్పడెను. అందువలన

నేను 4 వ బ్యాచ్‌లో పోలేనను నిర్ణయమునకు వచ్చితిని. అందుచే 5 వ బృందములో నా యాత్రను నిర్ణయించమని ఫోన్ ద్వారా తెలుప ప్రయత్నించితిని. కానీ ఆ సమయములో ఫోన్ కూడా సరిగా పని చేయక తగు సమాధానము పొందలేక పోయితిని. ఏమి చేయుటకు పాలుపోలేదు. అయిననూ పోవలయుననే దీక్షను మాత్రము వీడలేదు. చివరి ప్రయత్నముగా సోమవారము కరీంనగరం పోయినాను. సెలవులో వెళ్ళిన E. E.గారు తిరిగి రాకపోవటం వల్ల మరీ చీకాకు కలిగెను. ఎందుకిలా ప్రయత్నములు వ్యర్ధమగు చున్నవో బోధపడక యాత్ర చేయించే అభీష్టము ఆ కైలాసవాసునికి లేదేమోయను సందేహము కూడా కలిగినది. నాకు బంధువుల చెంత ఇతరుల చెంత డబ్బు అడిగే అలవాటు లేదు. అయినను మిత్రుల నడగక తప్పలేదు. ఎలా గైతేనేమి, ఏవేవో అవస్థలు పడి చివరకు 4000 రూ॥ లు సమకూర్చుకొని 13వ తేది ఉదయం A.P. ఎక్స్‌ప్రెస్ లో ఢిల్లీకి బయలుదేరుటకు ముందు నా పెద్ద కుమారుడు మదన్ మోహనునికొక పుత్తరము వ్రాసియిచ్చి కరీంనగరం వెళ్ళి బిల్లు బాపతు డబ్బు రాబట్టుకొని నేను యాత్రకు బయలుదేరుటకు ముందు ఢిల్లీ పంపించాల్సిందిగా ఆదేశించితిని. నేను 14వ తేది ఉదయానికల్లా ఢిల్లీ చేరినాను.

ఆ రోజుననే విదేశాంగశాఖ కార్యాలయమునకు వెళ్ళి ఏయే పనులు పూర్తి చేయవలయునో తెలుసుకొంటిని. మరునాడు 15వ తేదీ ఉదయం రామ్‌మనోహర్ లోహియా ఆసుపత్రికి వెళ్ళి గుండె ఇతర కావలసిన వైద్య పరీక్షలన్నియు చేయించుకొంటిని. కాని ఉద్వేగమువల్ల గుండె దడదడ లాడుచుండెను. నా శరీరములో ఏలాంటి ఆరోగ్యలోపమున్నను ప్రయాణము ఆగిపోవచ్చుననే భయము ఒకవైపు డబ్బు పూర్తిగా సమకూర్చుకొందునా లేదా యనే దిగులు మరోవైపు ఆవహించియుండెను. కాని తర్వాత కొంతసేపటికి వైద్య బృందము నాకు ఏ లోపము లేదని ''యాత్ర''కు సన్నద్ధుని కావల్సినదిగా మాట ద్వారా చెప్పి ధృవీకరణ పత్రమును మరునాడు పంపుదుమని సెలవిచ్చిరి. నాకు ప్రాణము లేచివచ్చినది. ఎందుకనగా, మొత్తం 25 మంది వ్యక్తులలో 22 మంది మాత్రమే ఆ యాత్రకు అర్హులని మాముందే ముగ్గురు తృణీకరింపబడిరి.

ఆ రోజు సాయంకాలము బజారు వెళ్ళి హంటర్ బూట్లు బ్యాగులు మరికొన్ని సామానులు కొంటిని. తెల్లవారి 16వ తేదీ ఉదయమే మా అల్లుడు చి॥ ప్రసాదరావు వరంగల్లు నుండి వచ్చెను. తన వెంట నాకు కావలసిన ఫలహారములు, పిండి వంటలు మున్నగునవి తెచ్చెను. అదేరోజు ''కుమాయున్ మండల్ వికాస్ నిగమ్'' వారికి 2,750/- రూ॥లు పంపించి రశీదు తెప్పించుకొంటిని. అవి నా యొక్క రానుపోను భోజన వసతి బస్సు మరియు 25 kg. ల సామానును''లిపుపాస్''

వరకు చేర్పించుటకగు రవాణా ఖర్చుల గురించియని వారు రశీదులో వివరించిరి. అదనపు సామాను వుంటే అందుకు ప్రతి ఒకకిలోకు రు. 7-50 ల చొప్పున తర్వాత చెల్లించవలసియుండును. నేను ఆశించిన బిల్లు డబ్బు మాత్రము అందలేదు. సాయంత్రము ఫోన్‌లో నాకుమారుడు మాట్లాడి తాను కరీంనగరం పోయివచ్చినట్లు ఏవో కొన్ని A. E.గారి సంతకాలు కావల్సినందున బిల్లు పాస్ కాలేదని, కావున ఇంత త్వరగా డబ్బు అందుట అసంభవమని తెలిపెను. అందువల్ల నాకు మరల దిగులు మొదలాయెను. పైగా ఆరోజు నుండే ఆంధ్రప్రదేశ్‌లో N.G.O.ల సమ్మెకూడా మొదలాయెను. అందుచే నాకు మిగతా డబ్బుకై వేట ప్రారంభించవలసి వచ్చెను. ఎచటెచటనో తిరిగి అప్పులుచేసి మొత్తానికి రేపటిలోగా సర్దుబాటు జరుగున ని నిర్ధారణచేసికొంటిని. మరునాడు 17వ తేదీ ఆదివారం కాన కార్యాలయములో ఏ పనియు లేకుండెను. ఆ రోజు మధ్యాహ్నము మొదటి బృందములో యాత్ర సల్పి వచ్చిన శ్రీ మంజుల్ కుమార్ అను ఒక మిత్రుడు అచటికిరాగా వారితో దాదాపు ఒక గంటసేపు మాట్లాడి యాత్రా విషయములు, (యాత్రలో) రాబోవు ప్రమాద విషయములు సాకల్యంగా తెలిసికొంటిని.

18వ తేదీ ఉదయం మరల విదేశాంగశాఖ కార్యాలయమునకు వెళ్ళి అచట మా బృందములో వచ్చు వారిని కొందరిని కలిసితిని. వారితో పరిచయానంతరం కార్యాలయంలో నా పాస్‌పోర్టు 11 రోజుల చైనా వీసాతోపొంది రు. 3,800/- లు రిజర్వుబ్యాంకునకు పంపించి 370U. S. డాలర్లు తెప్పించుకొంటిని. తరునాత 30 రోజులయాత్ర ప్రయాణ సందర్భంలో దారిలో ఏ ప్రమాదము జరిగినను ప్రభుత్వ బాధ్యత ఉండదనే నిబంధనా పత్రములపై 10రు.లు స్టాంపు దస్తావేజుపై నా సంతకాల కార్యక్రమము పూర్తిచేసి ఇంటికి చేరితిని.

సాయంత్రం వేళ మార్కెటుకు వెళ్ళి తినుబండారములు మందులు, ఇతర ముఖ్యవస్తువులు మిత్రుడు కమల్‌శర్మతో కూడి కొనుగోలు చేసితిని. స్లీపింగ్‌బ్యాగ్, విండ్‌చీటర్ మున్నగునవి మిత్రుడు శ్రీ N.K. శర్మగారు సమకూర్చిరి. మా అన్నగారి నుండి ఉలన్‌పాంట్లు ఓవర్‌కోటు గ్లౌజులు తీసుకొంటిని. కమల్ శర్మగారు నాకు ఒక కౌబాయ్‌టోపి కొనితెచ్చిరి. కానీ అది యేబ్యాగులోను సర్దిపెట్ట వీలుగాక అవసరము లేదని చెప్పితిని. రాత్రికి పై శర్మ మిత్రులలో మధ్యముడు జుగల్‌శర్మగారి సహాయంలో సామానంతయూ నాలుగు బ్యాగులలో సవరించిపెట్టి ఉదయం ప్రయాణమునకు పూర్తిగా సిద్ధపడితిని.

అదేరోజు ఉదయం మా అన్నగారు ఇరాన్ వెళ్ళియుండిరి. నేను అన్ని ప్రయాణ సన్నాహములను పూర్తిచేసుకొని మిత్రులు శర్మలను పంపించి భోజనం ముగించి పడుకొంటిని.

నాకు చాలారోజుల నుండి వెన్నుపోటునొప్పి కారణముగా ఉదయమే ప్రక్కనుండి లేచుట చాలా కష్టముగా వుంటుండెను. అందుచే ఇంతచేసి ఉదయం లేవగలనా? ప్రయాణము సాధించగలనా? ప్రయాణము మధ్యలో ఏఏ బాధలు పడతానేమో? అనే శంకలు ఆలోచనలలో మొదలాయెను. డాక్టర్ల సలహాపై రోజూ నేలపైకానీ గట్టిబల్లపైకానీ పడుకొనుచుంటిని. ఉదయము లేచునపుడే ఈ బాధ విపరీతముగా నుండును. అన్నిటికి భగవంతునిపై భారమువేసి కనులుమూసికొంటిని. కానీ నిదుర రావటంలేదు. ఎందుకో మనసులో బెంగగాను రక రకాల ఆలోచనలు రేకెత్తుచుండెను. మా పిల్లలు ఇంకనూ కాలేజీ చదువులలో యుండటవల్ల నా యొక్క బాదరబందీలు ఆదాయవ్యయాలు తీర్చాల్సిన అప్పులు, ఉన్న భూవసతి, అమ్మాయిల వివాహప్రయత్నములు ఈ ఆలోచనలన్నీ మూకఉమ్మడిగా మనస్సులో తిరుగాడుటవల్ల నిదురరాక ఏమియు తోచకుండెను. చివరకు కాగితాలు పెన్ను తీసుకొంటిని. నా మనస్సుకు తోచిన విధంగా నాఆలోచనలన్నియు ఆ కాగితాలపై వెలసెను. దాదాపు 2 గం. లు వ్యవధి తర్వాత అది ఒక వీలునామా లాగున తయారయ్యెను. అందులో రావల్సినవి, ఇవ్వాల్సినవి ఉన్న వసతి ఏఏ విధంగా ఆడపిల్లల వివాహాది కార్యక్రమములు తల్లియొక్క పోషణాదులు జరపాలో మగపిల్లలకు మిగిలేవి మున్నగునవన్నియు సవివరంగా (వ్రాయటం మాత్రం బాగానే) వ్రాశాను. కాని అదేమిటని దానిని తిరిగి పఠించగనే గుండె భారమై కళ్ళనిండా నీరునిండి కడుపులో ఆవేదన చెలరేగి ప్రేగులన్నియు మెలివేయుచున్నట్లుగా అనిపించి ఎంతో మనోదౌర్బల్యము చెందితిని.

శ్లో ॥ ''సీదంతి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి
వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే ॥''

అన్న విషాదయోగచ్ఛాయలు నాలో నిండి హృదయము దౌర్బల్యమునకు లోనై పరిపరి విధాలోచనలచే రోమములు గగుర్పాటుజెంది గుండె బరువై మనస్తాపముచే దుఃఖము రాదొడగెను.

ఎవరి బలవంతముపై ఈ ప్రయాణమునకు సిద్ధమైతివి. నేను ఆ ప్రయాణము చేయక మానుకుంటే మునిగిపోవున దేమిటను భావనయూ కల్గినది. కానీ తర్వాత కొంత సేపటికి గీతలోని సాంఖ్యయోగమున గల ఈ శ్లోకము జ్ఞప్తికి వచ్చెను.

శ్లో॥ క్లైబ్యం మా స్మ గమః పార్థ నైతత్త్వ య్యుపపద్యతే
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప!

శ్రీ కృష్ణ పరమాత్మ అర్జునునకు అధైర్యము బొందుట తగదని అట్టి హీనమైన పిరికితనమును వదలి పెట్టుమని ప్రేరేపించును. ఈ మాటలు నాతలపునకు రాగా చాలాసేపటి తర్వాత యధాస్మృతికి రాగలిగితిని. కాగితాలన్నిటినీ మడచి ఢిల్లీలో విడిచివచ్చిన సూట్‌కేస్ నందు బంధించి వ్యర్థాలోచనలన్నిటి నీ విరమించి ఆ కైలాస వాసుని ప్రార్థించి యధాస్థితికి రావటం జరిగెను. ఇందుకు కారణము కరుణామూర్తి భాగవతోత్తమురాలగు మా మాతృమూర్తి ఆశీ స్సే కారణమేమో!

శ్లో॥ సౌవర్ణే మణిఖండరత్నరచితే పాత్రే ఘృతం పాయసమ్
భక్ష్యం పంచవిధం పయోదధియుతం రంభాఫలం పానకమ్
శాకానా మయుతం జలం రుచికరం కర్పూరఖండోజ్జ్వలం
తాంబూలం మనసా మయా విరచితం భక్త్యా ప్రభో స్వీకురు



# మూడవ అధ్యాయము

## చంద్ర వంశీయుల పురాతన రాజధానికి

శ్లో॥ ఛత్రం చామరయో ర్యుగం వ్యజనకం చాదర్శకం నిర్మలమ్
వీణాభేరి మృదంగ కాహళ కళాగీతం చ నృత్యం తథా
సాష్టాంగం ప్రణతిః స్తుతి ర్బహువిధా హ్యేత త్సమస్తం మయా
సంకల్పేన సమర్పితం తవ విభో। పూజాం గృహాణ ప్రభో

భారతదేశములో పూర్వము సూర్య చంద్ర వంశముల రాజుల చరిత్ర ప్రాధాన్యము కలిగియున్నది. వీరిలో సూర్య వంశీయులు ఇక్ష్వాకు మహారాజుతో ప్రారంభమై అవతార పురుషుడైన శ్రీ రామచంద్రుని కాలము వరకు చెందిన వారుగా యున్నారు.

కాగా చంద్రవంశీయులు పురూరవశ్చక్రవర్తితో ప్రారంభమై, మహా భారతమునకు ఆది పురుషుడైన, భరత మహారాజుతో, ఇతిహాస యుగమునకు, సంక్రమించియున్నారు. ఈ వంశమునందు ప్రఖ్యాతి వహించిన రాజులు నహుషుడు, దివోదాసుడు మొ॥వారు. పిదప యయాతి కుమారులగు యదువు నుండి యదువంశము పురు మహారాజు నుండి పౌరవవంశము ముందుకు కొనసాగును. ప్రఖ్యాతులగు దుష్యంతుడు భరతుడు, యుధిష్టిరుడు మున్నగు చంద్రవంశ రాజుల చరిత్రములు మన పురాణేతిహాసములలో ఎంతో ప్రాముఖ్యము కలిగియున్నవి.

ఆ రోజు జూలై 19వ తేదీ రాత్రి పరిపరివిధముల ఆలోచనల అనంతరము ఆలస్యముగా నిదురించినా ఉదయము 6 గం. లకే మా ప్రయాణము ఆరంభము కనుక 4 గంటలకే మేలుకొంటిని. కాలకృత్యములు తీర్చుకొంటిని. అపుడే నాకన్నా కొద్దిముందుగా లేచిన శ్రీ పెళ్ళకూరు రామచంద్రారెడ్డిగారును (కీ॥ శే॥) ఇంతవరకూ నల్లాలలో నీరురాలేదని వారుకూడా స్నానమాచరించ గోరుచుండిరి. వారు 6 గం. లకు విమానములో మదరాసునకు పోయి అచటినుండి వారి స్వగ్రామమగు నెల్లూరుకు ప్రయాణమైరి. వారు ప్రతిరోజు స్నానానంతరము పూజానంతరము మాత్రమే కానీ యే పనినికానీ యే ప్రయాణమును కానీ తలపెట్టరు. కానీ ఆ రోజు ఎంతవరకు నీరు లభించనందున విధిలేక వారు స్నానము ముగింపకనే వెళ్ళిపోయిరి. ఇంటిలో బోరింగుబావి-దానికి పంపుకూడా యుండెను. కాని తోటమాలి పంపు తాళపుచెవి ఎచట పెట్టెనో ఎంత వెతికిననూ లభించలేదు. శౌచ ప్రాధాన్యత స్నానముచే కలుగునని మన శాస్త్రములు తెల్పుచున్నవి.

''అద్భి ర్గాత్రాణి శుద్ధ్యంతి, మనః సత్యేన శుద్ధ్యతి।
విద్యాత పోభ్యాం భూతాత్మా, బుద్ధిర్ జ్ఞానేన శుద్ధ్యతి. ''

నీటిచే శరీర బాహ్యావయములు సత్యాచరణచే మనస్సు, సర్వావస్థలయందు ధర్మాచరణచే జీవాత్మ , జ్ఞానముచే పృధ్వీ మొదలుకొని పరమేశ్వర పర్యంత పదార్థములు వివేకముచే ధృఢ నిశ్చయము, బుద్ధియు, పవిత్రములగు చున్నవి. అందుచే ప్రతినిత్యం మానవునికి స్నానము ఆవశ్యకమై యున్నది. మనస్సును శుద్ధి పరచుకొనుటను అంతరశుద్ధిగా పేర్కొనబడును.

''ఓం భూర్భువః సువః
తత్సవితుర్వరేణ్యం
భర్గోదేవస్య ధీమహి
ధియో యోనః ప్రచోదయాత్. ''

సమస్త జగత్తులకూ జీవనాధారుడైన ప్రాణములకంటే ప్రియుడైన స్వయంభువగు ఆ పరమేశ్వరుని నామమును నిత్యము స్మరించుట సమంజసము. ఆ పరమేశ్వరుడు దుష్కార్యములనుండి మనలను మరల్చి, సత్కారముల వైపు ప్రవర్తింపజేయుగాక ! పరమేశ్వరా ! సచ్చిదానందరూపా ! సర్వాంతర్యామి, సర్వాధారా జగత్పతే, సకల జగతుత్పాదకా, అనాదీ, విశ్వంభ రా, సర్వ వ్యాపీ, కరుణామృతా! మా యొక్క ఆత్మలకు అంతర్యామివై శ్రేష్ఠాచారమందు సత్య మార్గమందు, మమ్మ ప్రవర్తింప జేయుటకు, సర్వ సమర్థుడవు సచ్చిదానంద స్వరూపుడవు; కృపాసాగరుడవు, న్యాయము చేయువాడవు, సమస్త మెరిగిన వాడవు, సర్వస్వము నుత్పన్నముచేసి అన్నాదులచే విశ్వమును పోషించువాడవు. జగన్నిర్మాతవు,యోగ్యుడవు, శుద్ధ చైతన్య స్వరూపుడవు, అగు ఓ పరమాత్మ! మమ్ముద్ధరింతువు గాక! నీ కరుణా కటాక్షవీక్షణములు ఎల్ల వేళల మాపై యుండుగాక ! ఇట్టి ధ్యాన విషయక సంధ్యావందన సంకల్పము కొందరికి నిత్యవిధి. సంధ్యావందనములో శౌచము, ఆసనము, ధ్యానము, ప్రాణాయామము, అంగన్యాసకరన్యాసములు, ముద్రలు, అర్ఘ్యప్రదానము, మంత్ర ఉచ్చారణ, ప్రవర, పశ్చాత్తాపము, శాంతి పాఠము మొదలగునవి ఆచరించవలయును. వీనిని గురువు ద్వారా నేర్చుకోవాలి. ఉపనయనమునందు కన్నతండ్రి ద్వారా ఈ గాయత్రి మంత్రోపదేశము కలుగును.

అందువల్ల నేను 6 గంటల వరకు వేచియుండి 6 గంటలకు నీటి పంపు రాగా స్నానము ముగించి సంధ్యావందనాది పూజల నాచరించి ప్రయాణమునకు సన్నద్ధమైతిని. ఈ లోగా శ్రీ చక్రవర్తిగారు ( అండర్ సెక్రటరీ) నాకు ఫోన్ చేసిరి. తిమ్మావారందరును వచ్చిరనియు నాకై నిరీక్షించుచున్నారనియు బస్సు బయలుదేర బోవుచున్నదనియు తెలిపిరి. నేను టాక్సీని తెప్పించి సామానంతయు నెక్కించి

ఇంటిలోనున్న వారితో సెలవు తీసుకొని ఢిల్లీ జనపథ్‌లో గల చంద్రలోక, భవనముకడగల బస్సు వద్దకు చేరితిని. బస్సులో మిగతావారి సామానంతయును సర్దియుండి సిద్ధముగా నుండెను. నా సామానంతయు పైకెక్కించి మిగతా మిత్రులతో బాటు బస్సెక్కితిని. అందులోనే శ్రీ చొక్కారావు గారితోబాటు మరొక హైదరాబాదు వాస్తవ్యుడు బ్యాంక్ ఉద్యోగియగు యువకుడు శ్రీ కిశోర్‌కూడా చేరియుండెను. మా బస్సు ఉదయం 6 గం. లకు బదులు నా ఆలస్యంవల్ల సరిగ్గా 7 గం. లకు ''జై బోలో కైలాస్‌నాథ్‌కీ జై'' అను పెద్ద నినాదముతో బయలుదేరెను. మా బృందములో మొత్తము 22 మందిమి వుంటిమి. బస్సు ఢిల్లీ నగరమును పరిసరములను శరవేగముతో దూసుకొని పోవుచున్నది. దాదాపు ఉదయం 9 గం. లకు మురాదాబాద్ దాటితిమి. ఈ మురాదాబాద్ ఇత్తడి నగిషీ పనికి ప్రసిద్ధి చెందినదిగా చెప్పబడును. ఆ సమయంలో మా బస్సు రోడ్డు ప్రక్కగా నిలువబడెను. దగ్గరలోనే కల ఒక హోటలులో ఫలహారములు కాఫీలు తీసుకొంటిమి. నిగమ్‌వారే డబ్బు చెల్లించిరి. అరగంటలో మళ్లీ ప్రయాణమైతిమి. బస్సులోనుండి పరిసరములను చూచుచూ ఎదురుగా వస్తూ దూసుకొని పోవుచున్న మితిమీరిన వాహనముల నుండి తప్పుకొనుచు ప్రక్కవారితో మాట్లాడుచు మా బస్సు ప్రయాణము సాగుచుండెను. 12 గంటల ప్రాంతములో రాంపూర్‌ను అధిగమించితిమి. అచట బస్సును ఆపలేదు. కానీ అది ఒక పెద్ద పట్టణము. శాస్త్రీయ సంగీతమునకు ప్రసిద్ధి చెందినదిగా చెప్పబడెను. దాదాపు 1 గంటకు 'రుద్రపూర్' చేరితిమి. అచ్చట ప్రక్కనేగల ఒక హోటలులో మా భోజన ఏర్పాటు చేయబడెను. అంతలోబస్సుకు ఏదో చిన్న రిపేరు వచ్చినందువలన రెండు గంటలు ఆలస్యమాయెను. దాదాపు 3 గంటలకు మళ్ళీ అందరము బస్సెక్కి ప్రయాణము కొనసాగించితిమి. దాదాపు 4.30 గంటలకు రోడ్డుకు ఒక కిలోమీటరు దూరమున గల ''నానక మఠము'' నకు మా బస్సు చేరుకొనెను. దాని పేరు అరతా సాహెబ్ నానక్ మఠమని చెప్పబడెను.

గురునానక్ గొప్ప జ్ఞాని. సిక్కు మతాచార్యుడు. వారి తత్వబోధనలు, కీర్తనలు, కవితలు భాగవత సాంప్రదాయమునకు సన్నిహితముగా యుండును. అలాగే కబీర్‌దాసు, మీరాబాయి, పురందరదాస్, అన్నమాచార్యులు భారత దేశములో భక్తి ప్రేమ తత్వములను దివ్యగాథా సంకీర్తనముల ద్వారా పుణ్యక్షేత్రయాత్రలను ఎంతగానో ప్రోత్సహించియున్నారు. సాహిత్య సంగీత నాట్య నాటక రంగాల అభివృద్ధికివి ఎంతగానో తోడ్పాటు నిచ్చుచున్నవి.

ఆ నానక్ మఠమునకు పై పేరు వచ్చుటకు ఒక చిన్న గాథ కలదు. ఒకసారి గురునానక్‌గారు అడవిలో పయనిస్తుండగా శిష్యులకు చాలా ఆకలివేసెను. వారంతా దగ్గరలోగల (అరాతేలను) దోసకాయలను త్రెంపి తినబోయిరి. కాని అవి అన్నియును చేదుగా నుండటచే ఎవరునూ తినలేక ఆకలిచే దహించిపోయిరి. అది గమనించిన

నానక్‌గారు శిష్యులను అవే కాయలు మరల త్రెంపి తినవలసినదిగా ఆజ్ఞాపించిరి. వారందురునూ మరల కాయలను భుజించిరి. వారియొక్క ఆశ్చర్యానందములకు అంతులేకుండెను. కాయలన్నియు తీయగా మారినవి. వారందరూ కడుపారగ ఆ కాయలను భుజించి ఆకలి బాధను తీర్చుకొనిరి. అంతటి మహత్తు కలిగిన ఆ ప్రదేశమును ఆ మఠమును మేమందరమును దర్శించితిమి. అచటనే ఒక సుందరమైన పెద్దకొలను కలదు. చాలా పెద్దదియు అతి పురాతనమునగు మర్రివృక్షము క్రింద గురుద్వారా భవన మున్నది. అందులో ఒక యువకుడు గ్రంథ పఠనము గావిస్తూ కన్పించెను. మేము మరల ప్రయాణము సాగించితిమి.

మా బస్సు ''కిచ్చా'' ''సితార్‌గంజ్'' ''భాటియా'' గ్రామాలను దాటికొని 5.30 గంటలకు 'టనక్‌పూర్' చేరెను. అచట కొద్దిసేపు ఆగితిమి. కాఫీలు కూల్‌డ్రింకులు అవసరమున్న వారు పాలు తీసుకొనిరి. నేను దగ్గరలో గల ఒక దుకాణములో రెండు బుష్‌షర్టులు కొనుగోలు చేసితిని. ఎందుకనగా నేను ఎప్పుడూ ధోవతులు లాల్చీలు మాత్రమే ధరిస్తాను. పైకి వెళ్ళిన తర్వాత పాంట్ పై వేసుకొనుటకు లాల్చీలు సరిగా వుండవని భావించితిని.

మరల 6 గంటలకు మా బస్సు బయలుదేరెను. 15 నిమిషములలో మా బస్సు విశాలమైదానమును వీడి దట్టమైన అడవిలోనికి చొచ్చుకొనిపోయెను. మరొక 3 నిమిషములలో బస్సు పర్వతములెక్కుట మొదలిడెను. ఎటుచూచినను ఆకాశాన్నంటుచున్న నిటారు నిలువు దేవదారు వృక్ష సముదాయమే తప్ప మరేమియు కానరాలేదు. కొంత సేపటికి మరింత ఎత్తునకు వెళ్ళిన తర్వాత మా బస్సు మలుపు తిరుగుతుండగా దూరాన మైదానములో ప్రవహించుచున్న ''సరయూనది'' తెల్లగా వంకర వంకరలుగా మెరయుచు కన్పించ సాగెను. ఆ చీకటిలోనే మా బస్సు కుడి ఎడమలకు ఎన్నో మలుపులు తిరుగుచు ఎన్నో కొండల నెక్కుచు దిగుచు ఎన్నో వంతెనలను దాటుచు రాత్రి 9 గంటలకల్లా చంద్రవంశీయుల పురాతన రాజధాని యగు ''చంపావతి'' మజిలీ చేరెను. బస్సు ప్రయాణం చేయుచుండగా మధ్య మధ్యన మా ''జై శంకర్'' ''ఓం నమ శ్శివాయ'' ''జై కైలాస్‌నాధ్'' మొదలగు నినాదములు పరిసర పర్వతములలో ప్రతిధ్వనించినవి. టనక్‌పూర్ నుండి మేము దారిలో ''బడేచీనా'', ''ధవళ్ చీనా'', ''కనారి చీనా'', ''సేర్‌ఘాట్ మల్లా'', ''షాల్హా'', ''గంజి'', ''బనస్పతమ్'' మున్నగు గ్రామములను పర్వతముల పైన నదులయంచులపైన నున్నవాటిని దాటివేసి పయనించితిమి. 1962లో జరిగిన చైనా దాడికి తదుపరి 20 సంవత్సరముల తర్వాత 1981 వ సంవత్సరమున బయలుదేరిన మొదటి బృందమునకు ప్రతి గ్రామములో ఎన్నోస్వాగత సత్కారములు జరిపినట్లూ వారికి ఈ చంపావతిలో కూడ పెద్ద ఎత్తున స్వాగతము లభించినట్లు ఆ బృందములో ప్రయాణించిన శ్రీ మహేశ్ శర్మ తన ''జై కైలాస్ జై మానస్'' పుస్తకములో పేర్కొనెను.

నాడు మా బస్సు ఢిల్లీ నుండి 455 కి.మీ. దూరమున గల ఆ 'చంపావతి' పర్వతముపై గల సుందర ప్రదేశమున యున్నది. దాని ఎత్తు సముద్రమట్టమునుండి 1638 మీ.లు. పూర్వము ఆ ప్రదేశము చంద్రవంశీయుల ప్రాచీన రాజధానిగా చెప్పబడుచున్నది. అది కుమాయున్ క్షేత్రమునకు కూడా రాజధానిగా నుండెను. తర్వాత ఆ రాజధాని అల్మోరాకు మారెను. దాదాపు 6000 జనాభాగల ఆ చంపావతిలో ఒక డిగ్రీ కళాశాల, ఆస్పత్రి, టెలిఫోన్ కేంద్రముల సౌకర్యములున్నవి. అచటినుండే ''నోటిఫయిడ్'' భూభాగములు ఆరంభమగుటచే యాత్రీకులు జిల్లా మేజిస్ట్రేటు గారి నుండి అనుమతి పొందుట అవసరము. అందుకై అచట ఒక ఫారం నింపితిమి. మా పాస్‌పోర్టులన్నియు పరిశీలన చేయబడెను. ఆ చంపావతి ఎత్తు ప్రదేశమున నున్నందున కొద్దిగా చలిచలిగా వాతావరణములో మాకు మార్పు కనిపించి ఎంతో ఆహ్లాదముగా తోచెను.

మా బస్సు చంపావతిలోని గెస్ట్‌హౌస్ చేరగనే సామానులన్నియు దింపి భవనములోగల గదులలో సర్దుకొంటిమి. ఆ భవనములో క్రింద పైన కూడా గదులు మంచములు పరుపులు బాత్‌రూంలు కొళాయిలు కూడా వున్నవి. కానీ కొళాయిలలో నీరు రాలేదు. పని మనుష్యులచే క్రిందనుండి పైకి నీరు తేబడెను. మేము కాళ్ళు చేతులు కడుగుకొని కాఫీలు సేవించితిమి. తర్వాత కొంత సేపటికి క్రిందనే గల భోజనశాలలో అందరమును భోజనములు చేసితిమి. నేను శ్రీ చొక్కారావు, శ్రీ కిశోర్, శ్రీ చౌదరి నలుగురము ఒకే గదిలో కొంతసేపు మాట్లాడుకొని 10.30 గంటలకు నిదరలో మునిగితిమి. నాటి సుదూర ప్రయాణములో టనక్‌పూర్ నుండి 75 కి.మీ. ఘాట్‌రోడ్డు ఉండుటచే కలిగిన బడలిక వలన త్వరలోనే నిదురలోనికి జారితిమి.

## మా నాల్గవ బృందములో గల సహ యాత్రికులు

1. ముగ్గురు ఆంధ్రప్రదేశ్ నుండి : (1) పి.వి. మనోహర్‌రావు (48 సం.లు) (2) జె. చొక్కారావు (60 సం.లు) మాజీ మంత్రి కరీంనగర్ జిల్లా (3) శ్రీ కిశోర్ (24 సం.లు) హైదరాబాద్.
2. ఏడుగురు మహారాష్ట్రము నుండి (1) డా॥ గోడ్బోలే (30 సం.లు) మా బ్యాచ్ లీడరు-బొంబాయి (2) దుష్యంత్ ద్వివేది (25 సం.లు) (3) యోగేశ్ (25) (4) డా॥ కులకర్ణి (60) బొంబాయి (5) కె.ఎన్. శిర్సాద్-సావంత్‌వాడి (6) డా॥ కె. మోఖా (స్త్రీ) (30) మరియు (7) చౌదరి (30) నాగపూర్.
3. ఒకరు తమిళనాడు నుండి : (1) షణ్ముగ సుందరమ్ (40)

4. ఒకరు కర్ణాటక ప్రస్తుతము U.S.A. నుండి : (1) డా. రంగాచారి (60)
5. ముగ్గురు ఢిల్లీనుండి : (1) మాధుర్ (30), (2) శ్రీమతి రశ్మి (25) (3) దిలీప్ కుమార్ (25)
6. ముగ్గురు కలకత్తా (ప.బెంగాల్) నుండి : (1) S.K. ఘోష్ (62) (2) A.K. బండోపాధ్యాయ (50) ఉపాధ్యాయ (62)
7. ఒకరు లక్నో (U.P.) నుండి : S.K. అగ్రవాల్ (45)
8. ఒకరు కేరళ ప్రస్తుతము బొంబాయి నుండి : కీ॥ శే॥ రామకృష్ణన్ గారు (55) (రామకృష్ణన్‌గారు ఈయాత్ర మధ్యలోనే దివంగుతలైనారు)
9. ఒకరు గుజరాత్ నుండి : V.M. ధావే (60) బరోడా.
10. ఒకరు రాజస్థాన్ నుండి కుమారి చంచల్ చడ్డా (24)

ఇట్లు మా యాత్రిక బృందములో 22 మంది వివిధ భాషలకు వివిధ రాష్ట్రములకు చెందిన వారు వున్నారు. అయినా మేమందరము ఒకరితో నొకరము సహకరించుకొనుచు పాత మిత్రులవలె స్నేహముతో వ్యవహరించుచూ యుండుట యనువింతచే నాకీ క్రింది పద్యము జ్ఞప్తికి వచ్చి స్నేహముయొక్క ప్రాముఖ్యత తెల్యజేయుచు మా రోజువారీ ప్రయాణము ముందుకు సాగించితిమి.

ఉ. తల్లియు తండ్రి సోదరులు దక్కిన బంధులకంటె గూర్మి భా
సిల్లిన సుందరీమణులు శ్రీలొనగూర్చుజనాళికంటె ను
త్పుల్ల మనోజ్ఞషట్పదము బోలిన సంగడికాడు జూడ పై
నెల్లరకంటె మిన్న ధర నెన్నగ శక్యమె మైత్రి బంధముల్.

తా॥ తనను కనిపెంచిన తల్లిదండ్రులకన్న ప్రేమాస్పదులైన కాంతలకన్న ధనధాన్య సంపదలిచ్చు వారికన్న మనస్సనే వికసించిన తామరపూవుపైనుండు తుమ్మెదవలె స్నేహితుని స్నేహబంధము, ధరలోమిన్నగా నెన్నబడునని భావము.

శ్లో॥ ఆత్మా త్వం గరిజా మతిస్సహచరాః
ప్రాణా శ్శరీరం గృహమ్ ।
పూజా తే విషయోపభోగరచనా నిద్రా సమాధిః స్థితిః ।
సంచారఃపదయోః ప్రదక్షిణ విధిః స్తోత్రాణి సర్వా గిరో ।
యద్య త్కర్మ కరోమి త త్త దఖిలం శంభో తవారాధనమ్ ।
కరచరణకృతం వా కర్మ వాక్కాయజం వా ।
శ్రవణ నయనజం వా మానసం వాఽపరాధమ్ ।
విహిత మవిహితం వా సర్వ మేతత్ క్షమస్వ ।
శివశివ కరుణాబ్దే శ్రీ మహాదేవ శంభో ॥

(ఇతి శివమానసపూజా స్తోత్రమ్)

# నాల్గవ అధ్యాయం

## ధార్చులాకు ప్రయాణం

శ్లో॥ అదౌ కర్మప్రసంగాత్కలయతి కలుషం మాతృకుక్షౌ స్థితం మామ్।
విణ్మూత్రామేధ్య మధ్యే క్వథయతి నితరాం జాఠరో జాతవేదాః ॥
యద్యద్వై తత్ర దుఃఖం వ్యథయతి నితరాం శక్యతే కేన వక్తుమ్ ॥
క్షన్తవ్యో మేఽపరాధ శ్శివ! శివ! శివ! భోః! శ్రీమహాదేవ! శంభో!॥

20వ జూలై 1983న ఉదయమే 5 గంటలకు మేల్కొని కాలకృత్యములు పూర్తిచేసి స్నానము సంధ్యావందనము మొదలగు కార్యక్రమములు ముగించుకొంటిని. శ్రీ చొక్కారావుగారు కూడా స్నాన పూజాదులు పూర్తి చేసుకొనిరి. మాలోని తమిళుడైన శ్రీ షణ్ముగ సుందరంగారు కూడా స్నానము పూజలనాచరించుట గమనించితిమి. కాని మిగతావారికి స్నాన పూజాది కార్యక్రమములు తప్పక చేయవలెననే పట్టింపు ఉన్నట్లుగా గోచరించలేదు. శ్రీ డా॥ గోడ్బోలే గారు మాత్రము అభిషేకము మున్నగు పూజా విధానములు ఎరిగివున్నట్లు తర్వాత గమనించితిమి. ఇంతలో ఫలహారములు తయారుచేసి పిలచిరి. మేమంతా వెళ్ళి ఫలహారములు చేసి టీలు సేవించి దగ్గరలో నున్న ఒక శివాలయమును చూచుటకు వెళ్ళితిమి. ఈలోగా సామానులన్నియు బస్సుపై కెక్కించబడెను. దగ్గరలోనే గల స్థలములో ఒక శివాలయముగలదు. చిత్రశైలి అజంతాను బోలియున్నది. దీని మరమ్మత్తు 1000 A.D. లో ఒక రాజుచే జరుపబడినట్లుగా తెలుపబడెను. అచట ఒక శాసనము కలదు. ఆలయము శిధిలావస్థలో వున్నది. ఆలయములో శివపార్వతుల విగ్రహములతో పాటు నంది విగ్రహము కూడా కలదు. దర్శనము చేసుకొని యాత్రాఫలసిద్ధికై స్వామిని వేడి ప్రక్కనే గల 'మహాకాళి' మందిరమునుకూడా దర్శించి దీనికి ముందుగాగల చంపాదేవి మందిర దర్శనమును గావించి ఈ విధముగా ప్రార్థించితిని.

శ్లో॥ స్నాత్వా గాంగైః పయోభిశ్శుచికుసుమఫలై రర్చయిత్వా విభో త్వామ్ ।
ధ్యేయే ధ్యానం నియోజ్య క్షితిధరకుహర గ్రావపర్యంకమూలే ।
ఆత్మారామః ఫలాశీ గురువచనరతస్త్వత్ప్రసాదా త్స్మరారే ।
దుఃఖం మోక్ష్యే కదాఽహం సమకరచరణే పుంసి సేవాసముత్థమ్ ॥

తా॥ గంగాజల స్నానమాచరించి ఫలపుష్పాదులచే నిన్ను బూజించి నీ పదారవిందము ధ్యానించుచు పర్వతగుహ రాతిపై సుఖముగా గూర్చుండి విషయవాంఛలవీడి ఆత్మస్వరూపానందము బొందుటకు కందఫలమూలముల

నాహారముగా గొని గురూపదేశమున ధ్యానించుచు ఓ మన్మథాంతకా! ఎన్నడు ఈ దేహమునకుగల తాపములను వీడుదునో కదా! (భర్తృహరి)

శ్లో॥ గంగాతీరే హిమగిరిశిలాబద్ధపద్మాసనస్య ।
బ్రహ్మధ్యానాభ్యసన విధినా యోగనిద్రాం గతస్య ।
కిం తై ర్భావ్యం మమ సుదివసై ర్యత్ర తే నిర్విశంకాః ।
కండూయంతే జఠరహరణా స్స్వాంగ మంగే మదీయే.

తా॥ గంగాతీర ప్రదేశమున నొక శిలపై పద్మాసనము వేసికొని కూర్చుండి బ్రహ్మచింతనజేయ సమాధియందుండగా నందలి ముసలి జింకలు కదలకుండా నిశ్చలముగా నున్న నా శరీరమును నాకుచుండు దినములింకెన్నడు ప్రాప్తించునో స్వామీ!

శ్లో॥ మాణిక్యవీణా ముపలాలయంతీమ్।
మదాలసాం మంజుల వాగ్విలాసామ్।
మహేంద్ర నీలద్యుతికోమలాంగీమ్।
మాతంగకన్యాం మనసా స్మరామి.

చతుర్భుజే చంద్రకళావతంసే! కుచోన్నతే కుంకుమరాగశోణే
పుండ్రేక్షు పాశాంకుశ పుష్పబాణ హస్తే! నమస్తే జగదేకమాతః ।

మాతా మరకత శ్యామా మాతఙ్గీ మధుశాలినీ।
కుర్యాత్కటాక్షం కళ్యాణీ కదంబవనవాసినీ
జయ మాతంగతనయే జయ నీలోత్పలద్యుతే।
జయ సంగీత రసికే జయ లీలా శుకప్రియే (శ్యామలా దండక స్తుతి)

✍ ఆ తరువాత కొన్ని ఫోటోలను కూడా తీసికొంటిమి.

భారతదేశములో శివాంశచే జ్యోతిర్లింగములును, మరియు దేవీ అంశచే అనేక దైవక్షేత్రములు ప్రాచీనకాలమునుండి ప్రసిద్ధములై యున్నవి. ఆయా శైవ శాక్తక్షేత్ర వివరములు ఈ గ్రంథమున చివరన డా॥ అత్తలూరి మృత్యుంజయశర్మగారి వ్యాసమున పేర్కొనబడినవి.

ఆలయ ప్రాంగణములో రకరకాల కలుపుమొక్కలు పెరిగి అశుభ్రముగా నుండెను. ఆలయాభివృద్ధికై తగిన నిధులుగానీ అభిరుచిగానీ చూపుచున్నట్లు తెలియదు. పూజారిచే నిత్యపూజ మాత్రము జరుగుచున్నది. తర్వాత అందరమును మెదిరిగి రేస్టహౌస్కు చేరుకొని తయారుగా నున్న బస్సును ఎక్కితిమి. కైలాసనాథుని నినాదములతో సరిగా ఉదయం 8 గంటలకు మా బస్సు బయలుదేరెను.

నాటి ప్రయాణమగు ధార్చులా 175 కి.మీ. దూరమున నున్నది. మొత్తము ప్రయాణము పర్వతముల ఆరోహణ అవరోహణలతో సాగుచున్నది. క్రిందుగా కన్పించే నదులు గ్రామములు వ్యవసాయ క్షేత్రములు మున్నగునవెంతో రమణీయ దృశ్యముల తిలకించుచు 'మంగ్రోలి' 'గార్తిల్', 'ధల్' 'సండిప్' గ్రామాల మీదుగా 'గుర్నా'యను గ్రామమునకు చేరితిమి. దీని ఎత్తు 1315 మీ.లు అచట రోడ్డు ప్రక్కనే ఒక ''ఇగ్యార్'' దేవీ మందిరమున్నది. అచట మా బస్సు రోడ్డు ప్రక్కన ఆగెను. వచ్చేపోయే వాహనములన్నీ ఇచ్చట తప్పక ఆగుతాయి. ప్రయాణీకులు ఆ దేవిని దర్శించి వారివారి మనోవాంఛాఫల సిద్ధికేగాక పర్వతాల్లో సుఖప్రయాణము కొరకు ప్రార్థించి ప్రసాదములు స్వీకరించి ముందుకు కొనసాగెదరు. ఆ మందిరమున కొక పురాతన గాథ వున్నట్లుగా చెప్పబడినది.

పూర్వము ఆ మందిరము 50 మీ.లు ఎత్తునగల నడకదారిలో నుండెను. ప్రభుత్వమువారు రోడ్డును వేయునపుడు గ్రామస్థులు ఆ కంట్రాక్టరును రోడ్డు ప్రక్కన ఒక ఆలయము ను నిర్మింపుమని దానివలన వచ్చేపోయే వారందరు దేవిని దర్శించగలరని గోరిరి. కాని అతడు అట్టి నిర్మాణమును గావించలేదు. అందుచే రోడ్డు వేయునపుడు నాలుగుసార్లు ఆ ప్రదేశమున భూస్ఖలనము జరిగి 5గురు కూలీలు సజీవ సమాధియైరి. తర్వాత ఆ కంట్రాక్టరునకు కలలో దేవి దర్శనమునిచ్చి ఆ ఆలయ నిర్మాణమును రోడు ప్రక్కనే జరుపుమని ఆజ్ఞాపించుటచే అతడీ ఆలయమును నిర్మించి దేవిని అచట స్థాపించెను. అచటి మరొక విశేషము ఏమనగా చాలామంది భక్తులు ఆలయమునకు ముందు 'గంటలు' కట్టుచుందురు. అందుచే ఆ దేవికి ''గంటల దేవి'' యను నామాంతరము కూడా కలదు. మేమును ఆ ''గంటలదేవి'' దర్శనము చేసుకొని సఫలయాత్రకై వేడుకొని ప్రసాదమును స్వీకరించి 10 నిమిషములలో బయలుదేరి 18 కి.మీ. ల దూరమున గల''పిథోరాగడ్''కు ప్రయాణమైతిమి. దేవతార్చనలో గంటానాదము ప్రాముఖ్యత కల్గియున్నది. ప్రతి ఆలయములోను, గృహములలోను నైవేద్యమిడునపుడు, హారతి చూపునపుడు, గంటను మ్రోగించు ఆచారము, అనాదిగా వస్తున్నది. పూజ ఆరంభించినపుడును, శంఖమును, గంటను పూజించుటయు ఆచారమే. ఈ గంటానాదముచే దుష్టశక్తులు పారిపోవునను భావన కలదు.

మళ్ళీ ప్రయాణము పర్వతముల నెక్కుచూ దిగుచూ ఎన్నో ప్రమాదకరమైన మలుపులు తిరుగుచూ సాగెను. ఆ రోడ్డు ప్రయాణములలో ముఖ్యముగా బస్సుడ్రైవరు ఎంతో జాగ్రత్త వహించవలసియుండును. స్వల్ప అజాగ్రత్తగా నున్ననూ వాహనములో నున్న వారందరి ప్రాణములకు ముప్పు వాటిల్లును. వాహనము యొక్క నామరూపములు కూడా కాన్పించవు. అట్లే ఒక గంట ప్రయాణము చేసి 12.30 గంటల వరకు

పిథోరాగఢ్ జిల్లా కేంద్రమును చేరితిమి. పట్టణము మధ్యనుండి సాగుతూ బయట ఎత్తైన ప్రదేశమునగల రెస్టుహౌస్‌కు చేరితిమి. బస్సుదిగి ముఖములను కడిగికొని ముందుగా మాకై తయారుచేయబడిన భోజనాదులు ముగించితిమి. ఆ బంగళా కూడా విశాలముగా సకల సదుపాయములుకలిగియున్నది.

**పిథోరాగఢ్ :**

నాటి ప్రయాణములో 100 కి.మీ. పూర్తి చేసితిమి. ఇంకను 75 కి.మీ. పూర్తి చేయవలసి యుండెను. ఆ పిథోరాగఢ్ ఢిల్లీకి 555 కి.మీ. దూరములో నున్న ఉత్తరప్రదేశ్ రాష్ట్రములోని ఒక జిల్లా కేంద్రము. మధ్యలో దేవదారు మున్నగు గగన స్పృశ్య వృక్షము లున్నవి. అచటనుండి దూరంగా నేపాల్ కొండల మంచు శిఖరముల దృశ్యములు, ఆ రెస్ట్ హౌస్ నుండి పూర్తి పట్టణము కాన్పించుచు ఎంతో మనోహరముగా నుండెను. మా యాత్రలోని నయనానందకర ప్రకృతి దృశ్యముల ప్రథమ వీక్షణము అచటి నుండియే ఆరంభమయినది. ఆ పట్టణము వీరుల భూమిగా ప్రసిద్ధమైనది. పట్టణ జనాభా 15 వేల పైబడి యున్ననూ జిల్లా జనాభాలోని దాదాపు 25 వేలమంది మిలటరీలోని వివిధ శాఖలలో చేరి దేశసేవలు చేయుచున్నారు. వారిలో చాలామంది విశిష్ట సేవా పతకముల బడసినారు. ఆ రెస్టుహౌజ్ 1610 మీ. ఎత్తుపైన నిర్మించుటవలన విశేషాకర్షణతో నున్నది. అచటికి ప్రక్కనేగల అమ్మవారి సుందర మందిరమును దర్శించితిమి. అచటనుండి కొన్ని దృశ్యముల ఫోటోలు కూడా తీసికొంటిమి. అచట ప్రక్కనే 'మృతవీరుల' చిహ్నముగా ఒక ఎత్తైన స్థూపమును నిర్మించిరి. ఆలయము ప్రక్క ఒక పెద్దహాలు వున్నది. అందులో అనేక శిల్పులు రాబోవు దసరా (దుర్గాష్టమి) సందర్భములో జరుపుకొను ఉత్సవములకై వివిధ దేవతా విగ్రహములను ఎంతో చక్కగా కళాత్మకముగా అప్పటినుండే తయారు చేయుచుండిరి.

కైలాస మానసములను 23 సం॥ లు ప్రతియేడు తప్పకుండా దర్శించివరుసగా అనేక పరిక్రమలు సలిపిన పుణ్యపురుషుడు శ్రీ ప్రణవానందస్వామిగారు పిథోరాగఢ్‌లోనే స్థిరనివాసమేర్పరచుకొని యుండుట మరియొక విశేషము. ఆ పట్టణమున కళాశాల పోస్టాఫీసు, హైస్కూళ్ళు, వివిధ ప్రదేశములకు ఘాట్‌రోడ్లు కలిగి పెద్ద రవాణా కేంద్రముగా విలసిల్లినది. ఎన్నో బస్సులు ఆ పట్టణమునుండి ప్రతిరోజు మారు మూలలకు పర్వతముల గుండా ప్రయాణముచేసి తిరిగి వచ్చుచుండును. అది పెద్ద వ్యాపార కేంద్రముకూడలి. జిల్లా కేంద్రము కావున కావలసిన కార్యాలయములన్నియు ఉన్నవి.

మేము మధ్యాహ్నము 2 గంటలకు మళ్ళీ బస్సులో బయలుదేరి పట్టణమధ్యగల కూడలిలో నిలిచి శ్రీ ప్రణవానందస్వామివారి దర్శనము చేయ సంకల్పించి ఆగితిమి. కాని వారు గ్రామాంతరమునకు వెళ్ళినట్లు తెలిసికొని ముందుకు ప్రయాణము సాగించితిమి.

**తెలుపు నలుపు నదుల వెంట :**

మా ప్రయాణము మళ్ళీ కొండలెక్కుచు దిగుచు సుందర దృశ్యముల తిలకించుచు నదులు వంతెనలు దాటుచు మలుపులు తిరుగుచు 'ఓల్గా' మీదుగా 'నైనిపాతల్' అనే గ్రామము మీదుగా ''కనాలిఛీనా'' నుండి గడచి 20 కి.మీ. తర్వాత దాదాపు 3 గంటలకు ''ఆస్కోట్'' చేరుట వరకు కొనసాగినది. అచటనే కీ.శే. శ్రీ పండిత జవహర్ లాల్ నెహ్రూ గారిని స్వాతంత్ర్య సంగ్రామ సమయంలో జైలులో నుంచిరి. అది 1141 మీ.ల ఎత్తు ప్రదేశమున గలదు. అచట ఒక డిగ్రీకాలేజి ఆస్పత్రి యున్నవి. ప్రక్కనే పర్వతాగ్రము పై ఒక మందిరము కన్పించును. కాని అందు ప్రత్యేకముగాఏ విగ్రహమును ప్రస్తుతము లేనట్లు చెప్పబడినది. అయినా పర్వతప్రాంత ప్రజలు ఒక పెద్దరాతి పై చిన్నరాతిని వుంచి అచట రిబ్బనులాంటి ఒక గుడ్డముక్కను వ్రేలాడతీసి మొకరిల్లుట ఆచారము. అట్లు ఒక రాతి పై మరొక రాతినుంచి (అవి పానవట్టము లింగము కాబోలు!) ప్రణమిల్లు చుండుటవల్ల దారి వెంట చాలాచోట్ల అలాంటి రాళ్ళు కుప్పలుగా కన్పించుచుండును.

అటునుండి కొంతదూరాన ''కాళి గంగా'' యొక్క మెలికలు తిరుగుచున్న నదీ ప్రవాహము చూడముచ్చటగా కాన్పించుచుండును. ఆ కాళీగంగా యే భారత నేపాల్ సరిహద్దులను విభజించును. నదికి ఆవల నేపాల్ భూభాగము ఈవల భారత భూభాగము. ఆ ఆస్కోట్ గ్రామమొక పర్వతముపై అర్ధ చంద్రాకారములో నున్నది. అటునుండి ముందుకు సాగినచో ''జల్జిబి'' వచ్చును. అది ఒకనాటి పెద్ద వ్యాపార కేంద్రము. కాని 1962 తర్వాత వ్యాపారము మూలపడినది. అచటనే 'నలుపు తెలుపు నదుల' సంగమమున్నది.నేపాల్ పర్వత శిఖర పంక్తులపై నుండి వచ్చు 'నది' స్వచ్ఛముగా పాలలా తెల్లగాను మరియు 'కాలాపాని' నుండి వచ్చుచున్న ''కాళిగంగా'' నల్లగాను కన్పించుచు ప్రవాహములు రెండూ కలిసిన తర్వాత గంగాయమునల సంగమమును జ్ఞప్తికి తెచ్చును. మా బస్సు ఆ సంగమముపై గల వంతెనను దాదాపు 3.30 గంటలకు దాటినది. అటనుండి కాళిగంగా గలగలమోత బస్సుయొక్క బరబర ఘోష లతో కలసి ఆ ప్రయాణము 'ధార్చులా' వరకు సాగును. ''బిల్వాకోట్'' మీదుగా కొనసాగి కాళికా యను ప్రదేశమును దాటి తుదకు మేము సాయంత్రము 5 గంటలకు ''ధార్చులా'' చేరితిమి.

ఆ ధార్చులా గ్రామము ప్రక్కగా కాళిగంగా పారుచున్నది. నది ఆవలి చిన్న గ్రామము పర్వతములు నేపాలీయులవి. అది చైనీయుల, నేపాలీయుల సామానుల విక్రయించు పెద్ద వ్యాపార కేంద్రము. ఈవల మిలిటరీ క్యాంపు దాదాపు 15వేల జనాభా కలిగి డిగ్రీకాలేజ్ ఆస్పత్రి పెద్దబజారు కల్గియున్నది. రెంటినీ కలుపుట కొరకు తీగవంతెన కలదు. ఇరువైపులా చెక్‌పోస్టులున్నవి. అధికారులు తనిఖీ చేయుచుందురు. నేపాల్‌వారు ఎటుపోవలసినా ఆ వంతెనను దాటి మన భూభాగము గుండానే వారి ముఖ్యపట్టణమగు ఖాట్మండు లేక మరే చోటికిగాని పోవలసి యుండును. భారత నేపాల్ ఒడంబడిక ప్రకారము వారికి ఆ హక్కుయేర్పడినది. మా బస్సు కాళిగంగా ప్రక్కనే గల ఒక గెస్ట్‌హౌస్‌లో ఏర్పాటు చేయబడినది. అందు రెండు గదులే వున్నందున కొన్ని గుడారములను యేర్పాటు చేసి అందులో మంచములు వేసి యుంచిరి. మేము మా సామానులను అందులోకి చేర్చి తలా ఒక మంచము ఆక్రమించితిమి. ప్రక్కనే గల కాళిగంగా ప్రవాహపు ఝుంకారపు మోతలో మామాటలే మాకు సరిగా వినిపించుట కష్టమాయెను.

ఆ ధార్చులా 804 మీ. ల ఎత్తున గలదు. దాదాపు ''లిపుపాస్'' వరకు వస్తువులన్నియు అచటి నుండే కొని పోవలసియుండును. అది పెద్ద వ్యాపార కేంద్రము. పైకి వెళ్ళువారికి కావలసిన సామానులన్నియు అచట అద్దెకు దొరుకును. అనగా స్లీపింగు బ్యాగులు, చేతికర్రలు ఊలన్ గుడ్డలు తినుబండారములు మున్నగునవన్నియును లభించును. మేము కొంతసేపు ప్రక్కనే నది ఒడ్డునగల స్థలములో కూర్చొని ప్రక్కనగల నదిని నది ఆవలి గ్రామమును పర్వత చరియలలోని పచ్చని చేలను రమణీయత గొలుపు ఆయా దృశ్యములను చూచుచుండగా మాకు కాఫీలు అటకే తెచ్చి ఇవ్వబడెను. కొన్ని ఫోటోలను గూడ తీసికొంటిమి. తర్వాత హాస్పిటల్‌కు వెళ్ళాలని కొన్ని పరీక్షలు చేయించుకోవలసియుండనని ఆదేశించుటచే మేమందరము అరకిలోమీటరు దూరమునగల ప్రభుత్వ ఆసుపత్రికి వెళ్ళితిమి. ముగ్గురు డాక్టర్లు మమ్మందరినీ శ్రద్ధగా పరీక్షించిరి. ముఖ్యంగా రక్తపోటు (బి.పి.) జాగ్రత్తగా పరిశీలించిరి. ఎవరికినీ ఏలోపములేనట్లు డాక్టర్లు ధృవీకరించిరి. తర్వాత గెస్టుహౌసునకు చేరుకొనువరకు దాదాపు 8 గంటలాయెను.

మాకు కరెంటు లైట్లు గుడారముల్లో యేర్పాటు చేయుట వలన ఎక్కువగా యిబ్బంది జరుగలేదు. భోజనములు సిద్ధపరచి పిలవగా అందరము వెళ్ళి భోజనము చేసితిమి. అచటనే రాత్రి రు.10/- ల కొకటి చొప్పున అందరము చేతికర్రలను కొనుగోలు చేసితిమి. అవి కైలాసయాత్ర ముగించిన తర్వా మాతో మామా స్వస్థలములు చేరగలవు. ఆ కర్రలు కూడా ఏ పుణ్యము చేసుకొనెనో మాతో యాత్ర చేయుటకు మమ్ము చేరెను. (వీనిని భద్రముగా దాచి తనువు చాలించిన తర్వాత కాష్టములతో పాటు దహన సంస్కారమున ఉపయోగించవలసి యుండునట).

తర్వాత మరికొంతసేపు నది ఒడ్డున గుడారముల ప్రక్కనే గల దృశ్యములను సన్నని వెన్నెల కాంతిలో చూచుచు కాలక్షేపము చేసితిమి. తర్వాత అందరమును గుడారముల గదులలో ఎవరి ప్రక్కపై వారు విశ్రమించి బడలికచే వెంటనే నిదురించితిమి. కాని రాత్రి సరిగ్గా ఒంటిగంటకు చిన్న చిన్న చినుకులు ప్రారంభమై వర్షముగా మారి కుంభవృష్టి కురియసాగెను. కరెంటు ఆగిపోయెను. గుడారములలో ఒక్కొక్క చుక్కతో మొదలై ధారగా నీరు పైనుండి పడుచుండెను. మేము తడుచుటే కాక మా సామానులన్నియు తడియుచుండెను. సామానంతయుమంచముల క్రిందికి ఒక మూలకు త్రోసివేసి మేమును మూలలలో ఒదిగి చాలాసేపు కూర్చుండవలసి వచ్చెను. దాదాపు ఉదయం 4 గంటల వరకు అలాగే మా జాగరణ తపస్సు సాగెను. శరీరము వణకసాగెను. అప్పటికి వర్షము తగ్గెను. కానీ మరల పడుకొనుటకు అవకాశమేది? ఆ విధంగా ఆ యాత్రలో మాకొక ప్రథమ జాగరణ రాత్రి తటస్థించెను. ✍

శ్లో॥ బాల్యే దుఃఖాతిరేకాన్మలలులితవపుః స్తన్యపానే పిపాసు-।
రో్నే శక్త శ్చేన్ద్రియేభ్యో భవమలజనితా జన్తవో మాం తుదన్తి।
నానారోగాదిదుఃఖా ద్రుదితపరవశ శ్శంకరం న స్మరామి।
క్షన్తవ్యో మేఽపరాధ శ్శివ! శివ! శివ! భో! శ్రీ మహాదేవ! శంభో! ।



 సమత్వమునకై ప్రజలు పడు తహ తహయే లోకములోని దుఃఖమునకంతటికి కారణము.

 భారతీయుల పవిత్రగంథము భగవద్గీతలో 40 చోట్ల సమత్వమును గూర్చి కృష్ణభగవానుడు అర్జునునకుపదేశించెను. ఈశావాస్యోపనిషత్తు ఇదే సిద్ధాంతమును తెలుపును. అది చదివి గాంధీ, ఠాగూరు ఆనందపరవశులైరి.

# ఐదవ అధ్యాయం

## పర్వతారోహణారంభం

శ్లో. ప్రౌఢోఽహం యౌవనస్థో విషయవిషధరైః పంచభి ర్మర్మసంధౌ ।
దష్టో నష్టో వివేకః సుతధనయువతిస్వాద సౌఖ్యే నిషణ్ణః ।
శైవే చిన్తా విహీనం మమ హృదయమహో మానగర్వాధిరూఢమ్ ।
క్షన్తవ్యో మేఽపరాధ శ్శివ! శివ! శంభోః శ్రీ మహాదేవ! శంభో!

నేను కాలకృత్యములు తీర్చుకొని స్నానము చేసి సంధ్యా వందనాది పూజలు ముగించుకొనువరకు ఉదయం 5.30 గంటలాయెను. ఆరోజు 21-7-83 వ తేది సామానులన్నియునుకట్టి పెట్టి తయారుచేసితిని. ఒక రొకరు అందరు 6.30 గంటల వరకు ప్రయాణమునకు సిద్ధపడిరి. వెంటనే ఫలహారములు కాఫీల సేవనము ముగించితిమి. వర్షము పూర్తిగా తగ్గెను. 7 గంటలకు ప్రక్కనేగల ఆంజనేయస్వామి ఆలయమునకు వెళ్ళి స్వామిని దర్శించి మనోవాంఛా ఫలసిద్ధికొరకు నీ విధముగా ప్రార్థించితిని.

శ్లో। గోష్పదీకృతవారాశిం మశకీకృత రాక్షసమ్ ।
రామాయణ మహామాలా రత్నం వందేఽనిలాత్మజమ్.
అఞ్జనానన్దనం వీరం జానకీ శోకనాశనమ్ ।
కపీశ మక్షహన్తారం వందే లఙ్కాభయంకరమ్

ఉల్లంఘ్య సిన్ధోః సలిలం సలీలం య శ్శోకవహ్నిం జనకాత్మజాయాః।
ఆదాయ తే నైవ దదాహ లఙ్కాం నమామి తం ప్రాంజలి రాఞ్జనేయమ్

ఆంజనేయ మతి పాటలాలనం కాఞ్చనాద్రికమనీయ విగ్రహమ్ ।
పారిజాత తరుమూల వాసినం భావయామి పవమాననన్దనమ్

యత్ర యత్ర రఘునాథ కీర్తనమ్ తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్ ।
బాష్పవారి పరిపూర్ణలోచనమ్ మారుతిం నమత రాక్షసాన్తకమ్

మనోజవం మారుతతుల్యవేగం జితేన్ద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్ ।
వాతాత్మజం వానరయూథముఖ్యం శ్రీరామ దూతం శిరసా నమామి.

(ఇత్యాంజనేయ స్తుతిః)

తరువాత బస్సును చేరి జై జై నినాదములతో ప్రయాణమైతిమి. అట నుండి ''తవాఘాట్'' వరకు 19 కి.మీ.లు మాత్రమే. మా నాటి చివరి బస్సు ప్రయాణములో 3½ కి.మీ.ల తర్వాత ''తపోవన్'' వచ్చెను. తర్వాత ఒక కిలోమీటరు

పోగా ''తంతా'' నదివచ్చెను. ఆ నది దాదాపు 2000 మీ. ల ఎత్తునుండి రెండు మూడుపాయలుగా ప్రవహించుచు ఆ పాయలన్నియు ఒక చోట కలసి విపరీతమైన వేగముతో మరల ఉరకలు వేయుచు ''కాళినది'' లో కలియును. ఆ రోడ్డు మార్గము ఇరుకుగా ఒకే బస్సు వెడలేటంతమాత్రముగా నుండెను. మధ్యమధ్య రాత్రి వర్షముచే కొండచరియలు కూలి రోడ్డుపై పడియుండుట కాన్పించెను. మరియు వానిని కొంతమంది తీసివేయుచు దారిచేయుచు కన్పించిరి. తవాఘాట్ వరకు రోడ్డు దాదాపు కాళిగంగానది ఒడ్డు వెంటనే సాగుచుండెను. కుడివైపున నది ఎడమవైపున పర్వతము ఉండుట వలన ఒక్కొక్కచోట బస్సు మలుపు తిరుగునపుడు పర్వతమును బస్సుతాకునా అన్నంత దగ్గరగా ఒరసికొనుచు పోవుచుండెను. మధ్యమధ్యలో ఎడమవైపున పర్వతమునుండి పడి ప్రవహించు జలధారలు వంతెనలు లేక రోడ్డుపైనుండే కుడివంకకు పారుచుండెను. ఆ తర్వాత ఒక చిన్న గ్రామమగు ''ఖేలా''ను దాటి 8 గంటలకు ''తవాఘాట్ '' చేరితిమి.

తవాఘాట్‌లో బస్సు ఆగెను. మా సామానంతయు క్రిందకు దింపబడెను. ఆ ప్రదేశము 1009 మీ.ల ఎత్తున నున్నది. అచట ''ధౌళిగంగా'' దాదాపు 80 కి.మీ. ల దూరము నుండి ''ధర్మాపాస్''లో ఉద్భవించి ఎడమవైపునుండి ,మరియు ''కాళిగంగా'' కాలాపానీలో ఉద్భవించి ఎదురుగుండా వచ్చి కలిసే సంగమముతోను కూడి యున్నది. ఆ రెండు నదుల సంగమము హోరు వాని వేగములు దుముకుడుల ధ్వనులు హోరెత్తించుచుండును. ఆ రెండు నదుల సంగమం తర్వాత ప్రవహించునదే రాత్రి మేము చూచిన ''సరయూనది''. ఆ ''కాళిగంగా'' నదికి ఆవలి ప్రక్కనే నేపాల్‌యొక్క ఆకాశాన్ని చుంబించే ఎత్తైన కొండలు గలవు. ఆ కొండలపై మధ్య మధ్య రెండు మూడు ఇండ్లు వాని ప్రక్కన పొలాలుగల గ్రామములు కన్పించుచు ఎంతో శోభగొలుపుచుండెను. తవాఘాట్ చాలా చిన్న గ్రామము. దాదాపు 1000 జనాభా కలిగి కొన్ని దుకాణములు టీ కొట్లు కలిగియున్నది. రోడ్డుకు ఎడమవైపు చాలా ఎత్తు ప్రదేశమున మిలటరీ క్యాంపు వున్నది. అచ్చట కూడా ఒక గెస్టుహౌసు ఒక కాళికాదేవి ఆలయము వున్నవి. ఆ ప్రాంతములో అన్నిచోట్ల శివ-శక్తి సాంప్రదాయ అనుసరణ అధికముగ కనపడుచుండును.

బస్సు నుండి సామానులు దించగనే సామానులను తీసికొని వెళ్ళుటకు గుఱ్ఱములు మరియు గాడిదలు వాటి యజమానులు సిద్ధముగా నుండిరి. మా సామానంతయు తూకమువేసి అప్పగించవలసి యుండెను. కాని అచట ఒక చిన్న పేచీ వచ్చినది. మాలో కొందరు ఎవరి సామానులు వారే విడివిడిగా తూకము వేయించుకొనవలెననిరి. మరికొందరు అనవసరముగా సమయము వృధా చేయక మొత్తముగా తూకము వేయించి ఎక్కువయిన డబ్బు అందరము సమముగా

పంచుకొనవలెననిరి. తక్కువ సామానుతో వచ్చిన వారికి దీనివల్ల నష్టముండెను. దీనిపై కొంత తర్జన భర్జన కొంతసేపు వాదులాట కూడా జరిగెను. వృధావాదులాటచే కాలాతీతము జరుగును. ''కాలము ధనముకంటె మిక్కిలి విలువైనది'', మరియు అలాటి ''ద్వంద్వభావనలచే దుఃఖమును సంప్రాప్తమగును.'' మేము నాటి వరకు సమైక్యముగానుంటిమి. ఇకముందు కూడా నుండే ఆవశ్యకతయున్నది. ''సమైక్య జీవితమునకు మానసిక సంతులనము ఆవశ్యకము'' మరియు ''కలసిమెలసి యుండుటచే చింతలేక ఆత్మవిశ్వాసము, నియమపాలనము, ధ్యానము సుఖము, ఆనందము ,శాంతి, శక్తి, బలము, విజయము'' మున్నగునవి లభించును. అందరును సోదరులుగా భావించి పరస్పరము సహకరించుచు ముందుకు సాగవలెనని చిన్న చిన్న విషయములకై వాదులాడకూడదని నొక్కి చెప్ప ప్రయత్నించితిని. పైగా ఎక్కువగనున్న వారి సామానులో ముఖ్యముగా తినుబండారముల బరువే ఎక్కువై యుండెను. అది ముందు ముందు అందరకును అవసరమయ్యేదే కావున చివరకు సామానంతయు తూకము వేయగా 500రూ. లు అదనముగా చెల్లించవలసి రాగా (ప్రతి మనిషికి 25 కిలోలు మినహాయించగా) అందరమును సమానవాటాలు చెల్లించితిమి. ఆ సామానులు 'లిపుపాస్' వరకు చేర్పించే బాధ్యత నిగం వారిదే ఐయుండెను. కనుక ఆ సామానుపై ఒక నిగం ప్రత్యేక వ్యక్తి ''రామ్‌సింగ్'' నియుక్తుడాయెను. సామానులు మధ్యలోపడిపోకుండా చూచి వాటిని తర్వాత మజిలీలో మాకు అప్పగించుట అతని బాధ్యత.

దాదాపు ఒక గంటలో ఆ కార్యక్రమమును ముగించుకొనే సరికి మాలోని కొందరు ముందుకు నడక ప్రారంభించిరి. నేను 9 గంటలకు బయలుదేరి ముందుగా ధౌళిగంగాపై గల 30 మీ. ల వెడల్పు గల చెక్కవంతెనను దాటి ఎడమవంకకు తిరిగి పర్వతారోహణను ఆరంభించితిని. మా వెంట ఉత్తరప్రదేశ్ కుమాయున్ మండల్ వికాస్ నిగం వారు ఇర్వురు స్పెషల్ పోలీసు ఫోర్సు వారు నలుగురు తుపాకులతో వాకీటాకీ యుక్తముగా మాతో యిరువురు జవానులు అచటినుండి యేర్పాటు చేయబడిరి. వారంతా మా వెంటనే వుంటూ మాకు సహకరించుచుండిరి. ముందుపోవు వారి వెంట మరియు చిట్టచివరివారి వెంట S.P.F. వారు కనీసం వొక్కరైనా వుండి తోడ్పడుట వారి విధియై యుండెను. ఎందుకనగా ముందువారు దారి తప్పకుండా చివరివారు పైకి రాలేకపోతే సహకరించుటకై అలా వారు దారిపొడవునా వెన్నంటి యుండిరి. అచటినుండి దారి నిటారు ఎక్కుడుగా నున్నది. పర్వతారోహణ మెట్లు మెట్లుగానున్నా అవి మేస్త్రీలచే ఏర్పాటు చేయించిన సవ్యమైన మెట్లుకావు. ఒక బండ ప్రక్కగా మరోరాతిని పేర్చి మెట్లుగా చేసిరి. పైగా గుర్రములు గాడిదలు మనుషులు ఎల్లవేళలా నడచుట వలన ఆ రాళ్ళ మధ్యన గుంటలుపడి మెట్లన్నియు ఒడుదుడుకులుగా మారి యుండెను. ఆ మెట్లదారి 4 లేక 5 అడుగుల వెడల్పు

మాత్రమే కలిగియుండెను. ఒక ప్రక్క పర్వతము మరొక ప్రక్క నదిచాలా లోతులో ప్రవహించుచూ నున్నది. ఏ మాత్రము అజాగ్రత్త చేసినా జారిపోయి నదిలో పడవలసినదే. 10 గంటల సమయానికి దాదాపు 2 కి.మీ. లు పైకి ఎక్కేవరకు అరికాళ్ళ మంటలతో పాటు పిక్కలు, కాళ్ళు లాగుట మొదలాయెను.

నాడు బాగుగా ఎండయుండుటచే ఒళ్ళంతయును చెమట పట్టెను. నోరెండుకొని పోవుచుండెను. కొంతసేపు విశ్రమించి చుట్టూ ప్రదేశములను చూచే సరికి క్రింద కన్పించు కూకేటి పాములాంటి నది ఎదురుగా ఎత్తైన పర్వతాలపైనున్న గ్రామాలు వీటి ప్రక్కన మడులు కట్టి సాగు చేసిన వ్యవసాయ క్షేత్రాలు ఎంతో మనోహరముగా కనిపించినవి. ఆ ప్రకృతి శోభ చూస్తున్నకొలదీ మనస్సుకు ఉత్సాహము ఆనందము రెట్టింపగుచుండెను. కెమెరా తీసి ఆ దృశ్యములను కొన్నిటిని ఫిల్ములో బంధించితిని. చాలామంది ముందుకు వెళ్ళినా నా వెనుక కూడా కొందరు వచ్చుచుండిరి. ఆ ప్రదేశము నిటారగు యెక్కుడుగా నుండుట వలన గుర్రాలను ఎవరును భాడుగ కట్టరు. కట్టినా ఎక్కినవారికే ప్రమాదకరము. నేను లేచి నడక ప్రారంభించితిని. Z ఆకారంలోగల ఆ మెట్లను ఒక్కొక్క మెట్టే చాలా నెమ్మదిగా ఎక్కసాగితిని. అట్లే మరో కిలోమీటరు ఎక్కుసరికి ఒళ్ళంతా చెమటపోసి ఉఛ్వాస ఆయాసము ఎక్కువాయెను. ఆ 3 కి.మీ. ఎక్కడంలో ఒక చుక్క నీరు కూడ కానరాలేదు. అందుచే వెంటనున్న నీటిబాటిల్ నుండి నీరు త్రాగి కొంతసేపు విశ్రమించితిని. ఆ హిమాలయ యాత్రలలో ఒక్కొక్కచోట నీరు లభించదు. ఒక్కొక్కచోట శుద్ధ స్వచ్ఛ శీతల నదీ జలాలు విస్తృతంగా లభించును. ఆహార విషయంలో కూడా అంతేనని చెప్పుకొనవచ్చును. అలాంటి పరిస్థితులు పర్వత ప్రాంత ప్రత్యేకతగా చెప్పవచ్చును. నేను రెండు బిస్కట్లు తిని మరల నీరు త్రాగితిని. శ్రీ ఏొక్కారావు, డా.కులకర్ణి, డా. గోడ్బోలే గారలు నాకన్నా చాలా వెనుకబడియున్నారు. నేను లేచి కొన్ని ఫోటోలను తీసికొని మరల నడక ప్రారంభించితిని.

12 గంటల వరకు మరో కిరోమీటరు పైకి వెళ్ళితిని. కాని ఇక ముందుకు సాగే సూచనలు సన్నగిల్లుచుండెను. నేను బయలుదేరిన పిదప 3 గంటలలో 4 కి.మీ.ల నడక మాత్రమే పూర్తి చేసితిని. ఒకచోట కూలబడిపోయితిని. దాదాపు 15 నిమిషములు సేద తీర్చుకొని కొంత ఫలహారము సేవించి ఎలక్ట్రాల్ పొడరు కలిపిన నీరు త్రాగు వరకు డా. గోడ్బోలే నా చెంతకు వచ్చెను. దూరాన చాలా క్రింద సన్నగా పామువలె వంకలు తిరిగియున్న ధౌళినది దాని ప్రక్కనే క్రొత్తగా వేయుచున్న ఒక రోడ్డు ఒక రేఖ మాదిరిగా దాని ప్రక్కనే గల తవాఘాట్ గ్రామము ఒక పిట్టగూళ్ళ సముదాయము మాదిరిగా కన్పించుచున్న దృశ్యము అత్యద్భుతముగా నుండెను. మేమిద్దరము ఫోటోలు తీసికొని మరల నడక ప్రారంభించితిమి. చాలా

మెల్లగా ఇర్వ్వరము 10 మెట్లెక్కుచు,ఆగుచు, పిప్పరమెంట్లు నోటిలో వేసికొనుచు, తిరిగి నడకసాగించుచు ఆయాసపడుచు, ముచ్చెమటలు పోయగా క్షణం ఆగుచు మరల క్షణం పయనించుచు, చివరకు 1 గంట వరకు ''ధానెదార్'' అను 1920 మీ ఎత్తు ప్రదేశమునకు చేరినాము. అంటే 911 మీటర్లు ఎక్కినాము. అచట చల్లని నీరు రెండు హోటళ్ళు ప్రక్కనే చెట్లు వుండుటచే నీడన విశ్రమించితిమి. అప్పటికి మా ప్రయాణము 5 గంటలలో 6 కి.మీ.లు పూర్తియైనది. దాదాపు అరగంటసేపు విశ్రమించి ఫలహారము సేవించి డా.గోడ్బోలే గారితోపాటు టీ త్రాగిన తర్వాత కొంచెము ప్రాణము లేచి వచ్చెను. మా వెనుక నున్నవారు అంతవరకూ మమ్ము చేరుకోలేదు. శ్రీ చొక్కారావుగారి కాళ్ళకు పొక్కులు పొడచినందున ఆయన మాత్రము నడువలేకున్నాడని తెలిసినది. అచటనే మాకు పూర్వము చెక్కవంతెన వద్ద మాయమయిన కాళిగంగా మరల చాలా క్రిందుగా ప్రత్యక్షమాయెను. ఆ పిదప ధౌళిగంగా మాయమాయెను. ఈ యాత్ర చేయువారికి ఆ మొదటిరోజు పర్వతారోహణ ప్రథమ అగ్ని పరీక్ష లాంటిది. ఎంతో మనోబలము, సాహసము, ఓర్పు అవసరము. మా తరువాత వచ్చు బ్యాచిలోని కొందరు ఆ పర్వతము ఎక్కలేక ఏడ్చుచు వెనుదిరిగి పోదుమని మొరపెట్టుకున్నట్లు మా తిరుగు ప్రయాణములో మాతో వచ్చిన పోలీసువారు తెలియజేసిరి. ఎంతో బుజ్జగించి ధైర్యము చెప్పి చాల దూరము లేదని అబద్ధాలు చెప్పి ఆ పోలీసు వారు నిపుణతతో వారిని 'పంగు' క్యాంపు చేర్చుట జరిగినట్లు కూడా తెలిపిరి.

మా మజిలీ ఇంకా 3 కి.మీ. దూరములో నున్నది. కాని నాటి గడ్డు పరీక్ష గడిచినది. అచటనుండి ఇపుడిపుడే ఒక రోడ్డు తయారగుచున్నది. నేనా రోడ్డు వెంబడే నెమ్మదిగా నడుచుచుంటిని. డా. గోడ్బోలే ముందుబడెను. కాళి గంగాను నేపాల్ పర్వతములను చూచుచు ఆనందించుచు ఫోటోలు తీయుచు మధ్యాహ్నం 2.30 గంటల వరకు 'పంగు' విశ్రామ భవనమునకు చేరుకొంటిని. నా కంటే ముందు చేరిన మిత్రులు నన్ను చూడగానే చప్పట్లు చరచుచు సాదరముగా ఆహ్వానించి కూర్చొబెట్టి ముందుగా కూల్‌డ్రింకు ఇచ్చిరి. నేను విపరీతమైన బడలికతో శరీరము హూనమై యుండగా కనీసం బూట్లు విప్పే ఓపికకూడ లేక రబ్బరు చాపపై పడిపోయితిని. దాదాపు అరగంటవరకూ లేవలేదు. మా తోటి వారంతా భోజనములు చేయక మిగతా వార్కై వేచియుండిరి. తర్వాత 3 గంటలకు శ్రీ ధావే, శ్రీ కులకర్ణి, శ్రీ షణ్ముగ సుందరంగారలు వచ్చిరి. అందరికన్న చివరగా 3.30 గంటలకు శ్రీ చొక్కారావుగారు S.P.F. వారు వెంటరాగా వచ్చి చేరెను. వారందరు చాలా అలసి నీరసించిపోయిరి. నాకుగాని పై మిత్రులలో చాలామందికిగాని పర్వాతారోహణ అలవాటులేదు. మా బృందములో ఎక్కువ సంఖ్యలో యువకులున్నందున వారు ముందుండిరి. ఎస్.కె. ఘోష్ గారు మాత్రము 60 సంవత్సరముల పైబడి

వయసున్ననూ మాలోని యువకులుకూడా ఆయనను ఏరోజున, నడకలో అధిగమించలేకపోయిరి. వారు లోగా బదరీ కేదార పశుపతినాధ ముక్తినాధ క్షేత్రము లకు నడచిపోయవచ్చుటే కాక ప్రతీరోజు నడక అలవాటు కలిగినవారు. మా యువకులు చేసిన 4 గంటల పర్వతారోహణను వారు 2 గంటలలోపే పూర్తి చేసేవారు. తరువాత నేను చాలా కష్టముతో కొళాయి వద్దకు పోవుటకని లేవగా అరికాళ్ళు మంటలు, పిక్కలలోని తీపుల వల్ల క్రింద పడిపోదునా అన్నంతగా అలసి త్రాగినవాడు సోలినట్లుగా తూలుచుంటిని. మొత్తానికి ముఖ ప్రక్షాలనము గావించుకొని 4 గంటలకు భోజనము చేసి అందరమును గాఢ నిద్రలో మునిగిపోయితిమి.

సాయంత్రము 6 గంటలకు లేచి కాఫీ త్రాగి ప్రక్కనే గల ఒక టెంటునకు డాక్టరు పరీక్ష కొరకు వెళ్ళితిమి. తర్వాత పరిసరములను తిలకించి ఫోటోలను తీసికొంటిమి. అంతలో చీకటి పడసాగెను. ఆ పంగు క్యాంపులో ఒకపెద్ద హాలులో రబ్బరు చాపలు నేలపైన పరచిరి. వెనుకగా వంటశాలలు బాత్‌రూములు వున్నవి. కొళాయిలో నీరు సమృద్ధిగా వచ్చుచుండెను. చాలా ఎత్తైన ప్రదేశముపై దానిని నిర్మించిరి. దాని ఎత్తు 2500 మీ. క్రిందుగా ఒక కిలోమీటరు దూరములో పంగు గ్రామము 2250 మీ. యెత్తుపైన ఉన్నది. రాత్రి దాదాపు 9 గంటలకు మళ్ళీ భోజనములు ముగించితిమి. ఆ తర్వాత 'నిగమ్' వ్యక్తి 'సతీష్' ఒక సభా కార్యక్రమమును యేర్పాటు చేసి ముందు ముందు రాబోయే కష్ట సుఖాల గూర్చి తీసికొనవలసిన జాగ్రత్తల గురించి ఆయా ముఖ్య విషయములు ఈ విధంగా వివరించిచెప్పిరి.

**పర్వతారోహణలో పాటించదగు సూచనలు :**

1. దారివెంట నడుచుచున్నపుడు ఎల్లవేళలా కొండ ప్రక్కగా నడవాలి. ప్రత్యేకంగా గుర్రాలు గాడిదలు యెదురువచ్చినపుడు నదివైపే వానికి దారి యివ్వాలి.
2. రైన్‌కోటు తినుబండారములు మందులు మున్నగు అత్యవసర వస్తువులు మంచినీరు ఎళ్ళవేళల వీపుపై వుండే బ్యాగులో ఉంచుకోవాలి.
3. ప్రయాణము చేయునపుడు ఖాళీ కడుపుతో కొండలెక్కరాదు. దానిచే ఆకలి కలిగి దారిలో స్పృహతప్పి పడిపోయే ప్రమాదములుండును.
4. కైలాస మానస సరోవర సూర్యోదయ సూర్యాస్తమయ ఛాయా చిత్రములు ఎంతో రమణీయముగా నుండును. కాన అవి తప్పక ఫోటోలు తీసికోవాలి.
5. కైలాస పరిక్రమలో పూర్తి గుండ్రని ఇంద్రధనస్సులు అగుపడే అవకాశమున్నందున కెమెరాను కూడే యెల్లవేళలా వెంటనే ఉంచుకోవాలి. మరియు అవి కన్పించునపుడు కెమెరాలలోని ఫిల్ములో బంధించిన వాని విలువ ఒక దృశ్యమునకు 10,000 రూపాయల వరకు విక్రయించుకోవచ్చును.

6. తిరిగి వచ్చునపుడు నిగంవారు, పోలీసులు, డాక్టర్లు, మరెందరో మానససరోవర జలము మరియు అచటి రాళ్ళు కోరెదరు. కావున వారికై ప్రత్యేకముగా కొంత అధిక జలమును కొన్ని రాళ్ళను తేవలయును.

7. ప్రత్యేకముగా కైలాస మాసన పరిక్రమలో అందరు సంఘీ భావముతో మెలగి ఒకరితో నొకరు సహకరించుకోవాలి. కలసి వంటలు చేసుకోవాలి. ఎవరికి వారే వంట చేసికొనుట కుదరదు.

8. ముఖ్యమైన మరొక విషయమేమనగా ఆ పర్వతారోహణలో అలసట, ఆయాసము,ఎత్తు ప్రదేశములలో ఆమ్లజని లోపము వుండుట వలన కండ్లు తిరుగుట సహనమును కోల్పోవుట మున్నగునవి సంభవించును. ఓపిక మరియు మనో నిబ్బరము అవసరము. ముందు ఎత్తుగా నున్న కొండలను చూచి అబ్బా! అంత పైకి పోవాలా! అను పిరికి భావనను రానీయవద్దు. అటు చూడకపోవుటయే మంచిది.

9. ఎవరికి వారు ఒంటరిగా వెళ్ళకూడదు. జట్లుగా నడవాలి. భక్తి భావన ఎల్లవేళలా జ్ఞప్తికి వచ్చునట్లుగా ధైర్యము ఇనుమడించుటకు మధ్యమధ్యలో ఆప్రాంతములు మారుమ్రోగునట్లుగా కైలాసనాధుని నినాదములు చేయుట అవసరము. దానివలన ధైర్యమేకాక సంఘీభావము పెరిగి అలసట కొంత వరకు ఉపశమించును.

10. బాగుగా అలసి ఆమ్లజని లోపము గోచరించినపుడు పర్వతము పై భాగము వైపు కాళ్ళుచాచి క్రింది భాగమువైపు తలయుంచి కాసేపు విశ్రమించినచో రక్తప్రసారము తల భాగమునకు ప్రసరించి ఉపశమనము కలుగును. కొండలెక్కునపుడు కాళ్ళు గుంజునపుడు కూర్చోకుండా నిలబడే కొంతసేపు విశ్రమించుట మంచిది.

11. కొండలపైనుండి ప్రవహించు సెలయేటి జలములో క్లోరిన్గానీ మరేదైనా మందుగానీ కలుపుకొని త్రాగుట శ్రేష్ఠము.

అలాగే మరికొన్ని విషయములను మాకు వివరించిరి. తరువాత 10 గంటలకు మేమందరము తొడకోసినా తెలియనంత గాఢనిద్రలో మునిగిపోయితిమి.

**ఎత్తు పర్వతాలలో ప్రకృతి విశేషములు :**

శ్లో॥ అశ్వప్లుతం వాసవగర్జితం చ ।
స్త్రీణాం చ చిత్తం పురుషస్య భాగ్యమ్
ఆవర్షణం చాప్యతి వర్షణం చ ।
దేవో న జానాతి కుతో మనుష్యః ?(కాళిదాసు)

✍ మేము ''తవాఘాట్'' నుండి ''ధానేదార్'' చేరుటకు 9 కి.మీ. ప్రయాణముచేసితిమి. కాని దారిలో ఒక చుక్క నీరుకూడా దొరకలేదు. ఎండకూడా విపరీతముగానే యుండెను. ఎపుడు ఎండకాయునో ఎపుడు మబ్బు క్రమ్మునో ఎపుడు వర్షము కురియునో తెలియదు. ప్రకృతి త్వరత్వరగా మారిపోవుచుండును. పై శ్లోకాభవమేమనగా, గుర్రపు దుముకుడు, మేఘగర్జనము, స్త్రీ యొక్క చిత్తము, పురుషుని యొక్క భాగ్యము, వర్షము రావటము, రాకపోవటములను దేవతులు కూడా తెలిసికొనలేరు. కావున మానవులెంతటివారు. ప్రకృతి దృశ్యములు మాత్రము ఎంతో రమణీయంగా కనుపించుచు ఆకలి దప్పులను కూడా మరపింపజేయు చుండును. కాని అలాటి ప్రయాణములో ప్రతి వారు 5 కిలోల నుండి 10 కిలోల వరకు బరువుగల సామానులు ఎల్లవేళలా వీపుకు కట్టి ఉంచుకోవాలి. అవి ఏమనగా మంచినీటి బాటిల్, టార్చ్‌లైట్, రేన్ కోట్ లేదా ఛత్రి, కొన్ని తినుబండారములు, అత్యవసరమగు మందులు, నీటిలో కలిపే మందు, స్ట్రెప్సిల్స్ మొదలగు విటమిన్ సి బిళ్లలు, చిక్లెట్లు, ఎలక్ట్రాల్ పౌడరు మున్నగు మందులతో బాటు చేతిలో కర్ర, నెత్తిన టోపీ, కళ్ళకు నల్ల అద్దాలు, చంకన కెమెరా ఎల్లవేళలా వెంటవుండాల్సిందే. నేను నా యాత్ర ముగించువరకు పై వస్తువులన్ని నా చెంతనే వుంచుకొంటిని. తోడి మిత్రులు కొందరు అది పాటించక, వీనిని వెంట నిడుకొనక చాలా ఇబ్బందులు పడిరి. మరొక ముఖ్య విషయమేమనగా ఖాళీ కడుపుతో ప్రయాణము చేయకూడదు. కొండలు అసలే ఎక్కకూడదు.

ఇంకొక ముఖ్య విషయమునకూడా జాగ్రత్త చాలా అవసరము. ఆ దారులలో ఎపుడు వర్షము పడినను పైనుండి మట్టి దానితో చిన్న చిన్న రాళ్ళు దానితో పెద్ద పెద్ద బండలు శిలలు క్రిందకు జారుచు కొండచరియలు విరిగి (Land Sliding) రోడ్డుపై (దారిపై) కూలుట సహజము. ఒక్కొక్కసారి బాగుగానున్న దారులుకూడా మూతబడిపోవును. మరల దారిని బాగుచేయు వరకు ప్రయాణము నిల్పి వెనుతిరిగి పోవుటయో లేక అచటనే చదునైన క్షేమ స్థలమున వేచి నిలుచుటయో తప్పదు. వర్షము పడుచున్నప్పుడు, పై భాగము ఎలా వున్నదో చూచుకొని జాగ్రత్తగా నడచుట అవసరము. దారి ప్రమాదకరమైనందున కొండచరియలు దగ్గరగా నున్నచోట నిలిచి బాతాఖాని చేయుటగానీ విశ్రమించుటగానీ చాలాసేపు చేయకూడదు. ఆ విధముగా అచటి ప్రకృతి వైపరీత్యములచే పగలు 11 గంటల నుండి వర్షము ఆరంభమగు ప్రమాదమున్నందువల్ల ఉదయం 4 గంల నుండి పగలు 11 గంటల లోపు మాత్రమే ప్రయాణము పూర్తిగావించుకొనుట అన్నివిధాలా శ్రేయోదాయకము. ✍

శ్లో॥ వార్ధక్యే చేన్ద్రియాణాం వికలగతిమత శ్చాధిదైవాదితాపైః
ప్రాప్తే ర్వ్యో గై ర్వియోగై ర్వ్యసనకృశవపుః ప్రౌఢిహీనం చ దీనమ్
మిధ్యామోహాభిలాషై ర్భ్రమతి మమ మనో ధూర్జటే ర్ధ్యాన శూన్యమ్।
క్షన్తవ్యో మేఽ పరాధశ్శివ శివ! శివ! భో! శ్రీ మహాదేవ శంభో!

# ఆరవ అధ్యాయము

## నారాయణాశ్రమ దర్శనం

శ్లో॥ స్నాత్వా ప్రత్యూషకాలే స్నపనవిధివిధౌ నాహృతం గాంగతోయమ్ ।
పూజార్థం వా కదాచి ద్బహుతరగహనే ఖండబిల్వీదళం వా ।
నానీతా పద్మమాలా సరసి వికసితాగంధపుష్పై స్త్వదర్థమ్ ।
క్షన్తవ్యో మేఽపరాధశ్శివః శివ! శివ! భోః! శ్రీ మహాదేవ! శంభో!

పంగు క్యాంపులో 22వ జూలై ఉదయమే మేల్కొని కార్యక్రమములు ముగించి సామానుల నప్పగించి టిఫినుల చేసి టీలను త్రాగి ఉదయం 7 గంటలకు మరల ప్రయాణము సాగించితిమి. ఒక కిలో మీటరు దిగుడు గడచి 'పంగు' గ్రామము మధ్య నుండి సాగి కుడివైపుకు తిరిగితే నారాయణాశ్రమ దారియు నేరుగా వెడితే 'సిర్ఖా ' దారియు వున్నవి. మేము కుడివైపు మరో కిలోమీటరు క్రిందకు దిగగా ''చెల్మాసిలసో'' అనే చిన్న పల్లెయు ఆ ప్రక్కన 'జుంగ్ఠిగడ్' అనే పెద్ద నదియు కానవచ్చినవి. నదిలో నీరు తక్కువగా నుండుటచే ప్రవాహముపైన ఒకటి రెండు కర్ర మొద్దులు వేసియుంచిరి. వాటిపై నుండి నదిని దాటి ముందుగా గల మరికొంత నీటిని రాళ్ళపై నుండి దాటి ముందుకు నడక ప్రారంభించితిమి. నాడు నారాయణాశ్రమమును దర్శించి 'సిర్ఖా' క్యాంపును చేరవలసియున్నది. దాని దూరము 16 కి.మీ. నేరుగా వెడితే 10 కి.మీ. కానీ ప్రయాణము దాదాపు నిటారుగా నిన్నటి మాదిరిగా నుండునని తెలిపిరి. నాడు శ్రీ చొక్కారావు, శ్రీ కులకర్ణి, శ్రీ ధావే, శ్రీ రంగాచారి, శ్రీ ఉపాధ్యాయ మున్నగు పెద్దలంతా రోజుకు ఒక గుఱ్ఱమును 80/-రూ. ల చొప్పున చెల్లించి వాటిపై కూర్చొని ముందుకు ప్రయాణము సాగించిరి. మిగతా వారమందరము నడుచుచుంటిమి. మరొక 3 కిలోమీటర్లు పైకి వెళ్ళగా 'సోనా' యనే గ్రామము వచ్చెను. అది 2500 మీటర్ల ఎత్తున నున్నది. జనాభా దాదాపు 1500 లుండును. వారి జీవనరీతి ఆశ్చర్యమును కలిగించును. పర్వతముల పైన రెండు ఇండ్లున్నను దానిని గ్రామమనే పిలుతురు. పైగా ఆ ఇండ్లు ఎంతో దూరముగా నుండును. ఒక్కొక్క ఇంటిమధ్య దూరము 2 ఫర్లాంగులు మొదలు ఒక కిలోమీటరు వరకు వుండును. ఆ ఇండ్లు చాలా చిన్నవిగా నుంఢును. దాదాపు కుటీరములని చెప్పవచ్చును. ఆ కుటీరముల ముందు అడ్డముగా కొద్దిపాడవు వెడల్పుగల కట్టలు కట్టి చిన్న చిన్న మడులుచేసి వ్యవసాయము చేసికొందురు. ధాన్యము, గోధుమ, బార్లీ మొదలగు పంటలు పైనుండి వచ్చే నీటిని ఆ మడులలోనికి మళ్ళించి పండించుకొందురు. వారు ఆ కుటీరములలోనికి ఎలా

వెళ్ళెదరో, పశువులను ఆ క్షేత్రములలోనికి ఎలా తోలుకొందురో పండిన పంటనెలా క్రిందికి తెత్తురో, వారికి అసరమగు ఇతర వస్తువులను ఎలా పొందుదురో, ఆ ఎత్తు పరిసరాల్లో వీరు ఎలా జీవితము సాగింతురో దురూహ్యము. పైగా రాత్రిళ్ళు విపరీతమైన చలికూడ వుండును. అక్టోబరు తర్వాత ఆ ప్రాంతము మంచుతో నిండిపోవును. అందుచే చాలామంది ఊడ్పులుకాగానే క్రింది ప్రాంతములకు తరళివెళ్ళి కూలి మున్నగు పనులు చేసికొందురు. వారు సాధారణంగా స్త్రీలతో సహా వీపుకు బస్తాలలో సామానులు కట్టుకొని తలకు బస్తాత్రాళ్లు బిగదీసుకొని బరువులు మోయుచు నడచెదరు. వారి పిల్లలనుకూడా ఇలా వీపుపై వ్రేలాడవేసుకొని వారివారి పనులు చేయుచునే వుందురు. వారి జీవనము వింతగాను ఆశ్చర్యముగాను పరిశ్రమతో కూడుకున్నదిగాను వుండుటచే వారు ప్రాకృతిక జీవులని చెప్పవచ్చును. వారు ఇంతగా శ్రమపడునది ఆ చిన్న భూకమతాల కోసమే. వారికి ఆ భూకమతాలు కొనుగోలు చేయాల్సిన పనిగాని డబ్బు చెల్లించాల్సిన పనిగాని లేకుండా ఉచితంగా లభించునవిగా నున్నవి.

నారాయణాశ్రమమునకు పోయే మార్గంలో ఒక దట్టమైన అడవియున్నది. మేము చాలా నెమ్మదిగా నడుచుచుంటిమి. నావెంట శ్రీ శిర్సాద్ యుండెను. మిగతా వారందరును ముందు వెళ్ళిరి. ఆ ప్రాంతములో అక్రోట్, ఆపిల్ మున్నగు ఫలములు విరివిగా పండును. మాకు ఒక పై గ్రామవాసి కూడా తోడాయెను. అతనిని అచటి విశేషములనడుగుచూ నడుచుచుంటిమి. అతడు కాళిగంగాకు కొద్ది ఎత్తుపై గల చిన్న గ్రామవాసి. చలికాలములో నీరు గడ్డగా మారునపుడు కూడా తాను తన గ్రామములోనే ·లుగు మాసముల గ్రాసము సమకూర్చుకొని చలిమంటలు కాచుచు తన గృహములోనే ›ండి నాలుగు నెలలు గడుపుదునని చెప్పెను. మేము కొండ పైకి ఎక్కి ఆయాసము ›డలికలచే ఒక వృక్షచ్ఛాయలో నిలిచి నా చెంతనున్న ఫలాహారములు అందరమును తిని నీరు త్రాగితిమి. తర్వాత మరల ప్రయాణమైతిమి. చాలా నెమ్మదిగా ఒకచోట సమతలంగా, మరొకచోట పైకి యెక్కుడుగా నున్న మెట్ల నెక్కుచు ఒంటి గంట వరకు శ్రీ నారాయణాశ్రమమునకు చేరితిమి. మా మిత్రులు కొందరు చొక్కారావు గారితో సహా అచటి స్వామిజీతో ముచ్చటించుచుండిరి.

1936లో బెంగుళూరు నివాసి శ్రీనారాయణస్వామి గారు కైలాస మానస యాత్ర ముగించి వచ్చుచు ఆ ప్రదేశము నెంచుకొని అచట ప్రశాంతముగా గడిపెను. శ్రీనారాయణ స్వామిగారు దివంగతులైన తర్వాత ఆ ఆశ్రమమునకు ఇంచార్జిగా ''గంగోత్రి గర్బియాంగ్'' అనబడే వృద్ధ మాతాజీ ఉండి 1975 నుండి ఆశ్రమము నడుపుచున్నది. ప్రస్తుతము అచట ''బ్రహ్మచారి ప్రేమ చైతన్య'' అనే స్వామీజీ కూడా వున్నారు. వారిరువురి మధ్య ఏవో విభేదాలున్నట్లు కూడా తెలిసినది. మాతాజీ

ప్రస్తుతము అచట అగుపించలేదు. స్వామీజీమాత్రమే వున్నారు. వారికి దాదాపు 35 సంవత్సరాల వయస్సుండును. నల్లని గడ్డముతో నీలవర్ణ చాయలో పుష్టిగా కనిపించిరి. మేమందరమును వారితో ముచ్చటించి వారితో కలసి ఫోటోలు కూడా దిగితిమి.

ఆ ఆశ్రమము సువిశాల పర్వతారణ్యములో యున్నది. చాలా పెద్ద ఫల వృక్షములతో పాటు వ్యవసాయ క్షేత్రమును కూడా కలిగియున్నది. ఆశ్రమము చుట్టూ రకరకాల పూల చెట్లున్నవి. ఎదురుగా నేపాల్ మంచు పర్వత శిఖరములు క్రిందుగా కాళిగంగా చుట్టూ పెద్ద పెద్ద వృక్షములు కన్నులపండువుగా ప్రశాంతత కొట్ట వచ్చినట్లు కనబడి ఆనందాతిశయమును కలిగించును. అందులో ఒక మ్యూజియం శ్రీ నారయణస్వామి పేరిట యున్నది. అందు నాలుగయిదు గదులున్నవి. దానిలో సరస్వతీ విగ్రహము, అష్టధాతువులచే చేయబడిన దాదాపు 300 సంవత్సరముల పూర్వపు ''నటరాజ విగ్రహము'' మరొక చిన్న చందనపు మందిరములో హస్తి అస్థులచే నిర్మింపబడిన శ్రీకృష్ణ విగ్రహము, మరో తైలవర్ణ చిత్రము పురాతన అగరువత్తులు మరియు సకల ధర్మముల పుస్తక భాండారములు వున్నవి. అచట రెండంతస్థుల భవనము పై భాగమున ఒక విష్ణు మందిరము ఒక సంకీర్తన హాలు ఉన్నవి. దీనికెదురుగా నారాయణ స్వామివారు సమాధి చెందిన ఒక కుటీరము, అందులో వారి స్వంత సామానులు వున్నవి. వచ్చిపోయే సాధువులుండుటకు కొన్ని కుటీరములు కూడ ఏర్పాటు చేయబడియున్నవి. ఒక వంటశాల మరియు వ్యవసాయాది పనులు చూచుకొను 'పరిచారకులు' కూడా కలరు. ఆ ప్రదేశము ధ్యానమునకు ప్రశాంతతకు పేరొందిన దర్శనీయ ఆశ్రమము. మేము అచటి మందిరమును దర్శించి తీర్థ ప్రసాదముల స్వీకరించి తృప్తి చెందితిమి.

ప్రస్తుత స్వామీజీ యువకులని ముందే తెలిపితిని. వారు హిందీలోను, ఇంగ్లీషులోను ఇతరదేశ భాషలలోను అనర్గళముగా మాట్లాడగలరు. వారి నల్లని గడ్డము చామన ఛాయరంగు కాషాయ వస్త్రధారణ చూచినచో ఎవరికైననూ గౌరవభావము ఏర్పడును. నేను చేరువరకే మా మిత్రులు వారితో ఏదో తర్కించిరట. దానిపై వారు కోపగించిరట! ఏదైతే నేమి మాకందరికి టీలు మాత్రము యిప్పించినారు. ఆ స్వామీజీని రెండు దినముల క్రితం బస్సులో ఇరువురు యువతులతో ప్రయాణించు చుండగా ధార్చులాలో మా మిత్రులు కొందరు చూచిరట. వారు బొంబాయికి పోయి తిరిగి నారాయణాశ్రమమునకు వచ్చుచున్నట్లుగా తెలిసికొనిరి. అచట ఆ యువతులను మేముకూడ చూచినాము. వారు నవయౌవనముతో అందముగా అప్సరసలలాగ కాలేజి పిల్లలలాగ పాంట్లు షర్టులు వేసికొని కురులు విరబోసికొని చక్కని ఇంగ్లీషు హిందీ మాట్లాడుచు స్వామీజీ ఆదేశాలను వెంట వెంటనే శిరసావహించుచూ ఎంతో చురుకుగా కనిపించిరి. ఇంతటి ఏకాంత ప్రదేశారణ్యంలో

ఏ పట్టణమునుండియో స్వామీజీ వారిని అచటకు ఎందుకు తెచ్చినటులో మాకు బోధపడలేదు. పైగా పరిచర్యలకు ఇతర పనులకు పూజారితో సహా సిబ్బంది వున్నారు. మరి ఆ సుందరీమణులను రప్పించుటకు కారణము మేమెంత యోచించినను గ్రాహ్యముగాక సంభ్రమాశ్చర్యములలో పడి మునిగిపోయితిమి. ఆ సందర్భమున భర్తృహరి రచనలోని ఈ శ్లోకముతో పై స్వామీజీ విషయమును పోల్చ నుద్దేశించితిని.

శ్లో॥ విశ్వామిత్రపరాశర ప్రభృతయో వాతాంబు పర్ణాశనా-
స్తేఽపి స్త్రీ ముఖ పంకజంసులలితం దృష్ట్వైవ మోహం గతాః
శాల్యన్నం సఘృతం పయోదధియుతం భుజంతి యే మానవా-
స్తేషా మింద్రియనిగ్రహో యది భవే ద్వింధ్యః ప్లవే త్సాగరే (భర్తృహరి)

తా. విశ్వామిత్ర పరాశరాది మహామునులు తపస్సులలో శరీరమును గాపాడుకొనుటకు ఆకులను నీటిని గాలిని మాత్రము నుపయోగించెడివారు. అట్టి వారే సుందరాంగుల జూడగనే మోహపరవశులైరి గదా! ఇక నెయ్యి, పాలు, పెరుగులతో గూడిన వరియన్నము తిను మనుజులు ఇంద్రియ నిగ్రహముతో యుందురని చెప్పుట వింధ్య పర్వతము సముద్రములో తేలియాడుననుటలో నున్నంత సత్యమని భావింపవలయును.

స్వామీజీతో మాటల సందర్భములో మేము గ్రహించిన సారాంశమేమన స్వామీజీత్వరలో అమెరికా వెళ్ళనున్నట్లు, బహుశః పరిచర్యలకుగాను వారిని కూడా అమెరికాకు తీసికొని వెళ్ళుదురేమో యని చివరకు ఊహించినాము. మరియు చాలామంది భక్తులు స్వాములపై గౌరవ మర్యాదలు గలవారు. భగవంతునకు దేవదాసీలు పరిచర్యలు సలుపు మాదిరిగా వారి ఆడపిల్లలను స్వాముల పరిచర్యల నిమిత్తము పంపించుట గుజరాత్, బొంబాయి, హిమాచల్ , నేపాల్ మొదలగు ప్రాంతాల్లో నిప్పటికిని కొంత ఆచారముగ నున్నట్లు తెలియుచున్నది. బహుశః వీరు ఆ కోవలోని వారైయుందురు.

### ఝర్ఖా ప్రయాణము :

మేము దాదాపు 2 గంటలకు మరల ప్రయాణమైతిమి.కొందరు ముందే వెళ్ళిపోయిరి.నారాయణాశ్రమము దాటిన 5 నిముషములకే దాదాపు 1000 మీటరుల క్రింద వంకరటింకరలతో మరల కాళిగంగా ప్రత్యక్షమాయెను. మాదారి దాదాపు గట్టుపైనే అంత ఎత్తున వుండెను.చాలా జాగ్రత్తగా నెమ్మదిగా నడచుచు 3 గంటల వరకు చాలా ఎత్తు ప్రదేశమును చేరితిమి. అంతవరకు మధ్యన చెట్లు చాల తక్కువగా నున్నవి. అచట మాతోడి వారంతా ఎండలో హాయిగా విశ్రమించిరి. మేము అందరమును కలిసి మరల బయలుదేరి కొంత దూరము నడువగా దట్టమైన అరణ్యము, దాని మధ్య నుండి పోగా 'సిర్ధాంగ్' అను 2135 మీటర్ల ఎత్తున గల

చిన్న గ్రామము వచ్చెను. అది దాటి ముందుకు మరో కిలోమీటరు నడచుచు సిర్ఖా గ్రామము గుండా 2440 మీటర్ల ఎత్తుపై గల మా విశ్రాంతి భవనమును చూచితిమి. మేము ఆ రోజు కూడా చాలా నీరసించితిమి. 16 కి.మీ. ల నాటి ప్రయాణము విపరీతమైన అలసటకు ఆయాసమునకు కారణమాయెను. గెస్టుహౌజునకు దాదాపు సాయంత్రము 4 గంటలకు చేరితిమి. నేను ఒక మూల పడిపోయి 15 నిముషముల వరకు కదలలేదు.

మాకు లేచి భోజనములు చేయగల సహనము కానీ శక్తికానీ లేకుండెను. బలవంతముగా చేతులు కడుగుకొని రబ్బరు చాపలపై కూర్చొంటిమి. మాకు ప్రతిరోజు భోజనము నిలుచుండి తినుటకు వీలుగా (బఫే) యేర్పాట్లు చేయుచుండిరి. ప్రతివారిని కూర్చొన బెట్టి వడ్డించే వసతిగానీ పరిచారకులుగాని లేకుండిరి. మాలో ముగ్గురు స్త్రీలున్నట్లు ముందే తెలిపితిని. వారిలో శ్రీమతి రశ్మి (మాథుర్ భార్య) పెద్దల ఎడ ఎంతో భక్తితో అనురాగముతో పరిచర్యలు చేయుచుండెను. మా కన్నా చాలాముందే ఆ దంపతులు ఆ క్యాంపునకు చేరుకొనిరి. మాలో కొందరు పెద్దలకు నాతో సహా ఆమె వడ్డించి తెచ్చి ఏది అవసరమున్నా మేము లేచే అవకాశమివ్వకుండా అపుడపుడు ఆ విధముగా పరిచర్యలు చేయుచుండెను. మా భోజనముల అనంతరము విశ్రాంతి గైకొని డాక్టరు పరీక్ష ముగించుకొని సుందర ప్రకృతి దృశ్యముల దర్శనము చేయుచు కొన్ని ఫోటోలు తీసికొంటిమి.

నాటి సాయంకాలము మేము 'అందమైన' జీవితములో మరపురాని మధుర దృశ్యమును చూచితిమి. మా క్యాంపు ఎత్తు ప్రదేశముననున్నందున చాలా క్రింద గల గ్రామము చుట్టూర ఎత్తైన పర్వతములు కనిపించుచుండెను. మేము వానిని చూచుచుండగా చాలా క్రింద ఒక సన్నని నదిపై నుండి ఒక తెల్లని దూది పింజలాంటి చిన్న మబ్బు తెప్పగా బయలు దేరెను. మేము చూస్తుండగా కొద్ది నిమిషములలోనే అది పైకి లేచి మొత్తము పర్వతములను ఆవరించెను. అలా పర్వతములు గ్రామములు అన్నియు అదృశ్యమై మబ్బులలో (Fog) కలిసిపోయెను. ఆ దృశ్యము ఇప్పటికినీ ఒక విచిత్రానుభవముగా నా కనులలో మెదలుచునే యున్నది. అందుకేనేమో మేఘమును రోగమును ఎంత చిన్నవైనను నమ్మి అలక్ష్యము చేయకూడదని పెద్దలు నుడువుదురు. మేము పూర్తిగా చీకటి పడగానే లోనికి వచ్చితిమి. ఆ తర్వాత నేను మరికొంద రు మామా గ్రామములకు లేఖలు వ్రాసికొంటిమి. ఆ తర్వాత 8.30 గంటలకు రాత్రి మరల భోజనములు ముగించి రబ్బరుచాపలపై స్లీపింగ్ బ్యాగులలో దూరి నిదురించితిమి.

ఆ క్యాంపులో రెండు గదులు, బాత్‌రూములు, ప్రక్కన టెంట్లు కూడ

ఏర్పాటు చేసిరి. అందులోనే మేమందరము సర్దుకొంటిమి. నీరు దూరము నుండి మనుష్యులచే కొని తేబడుచుండెను. కరెంటు నిన్నటి క్యాంపునుండే లేదు. పెద్ద దీపాలు ఏర్పాటు చేసిరి. మాకు ప్రతి దినము భోజనములో చపాతీలు ఆలుగడ్డకూర అన్నములను ఇచ్చిరి. ఉప్పు కారములు చాలాతక్కువగా నుండుటచే నాకు తిండి ఏ మాత్రము సహించెడిది కాదు. ఉదయము ప్రతి రోజు టిఫినుగా ఉడికించిన శనగలనే దాదాపుగా ఇచ్చుచుండిరి. వాటితో మొగము మొత్తుచుండెను.

శ్లో॥ దుగ్ధైర్మ ధ్వాజ్యయుక్తైర్దధి గుడసహితైః స్నాపితం నైవ లిఙ్గమ్ ।
నో లిప్తం చన్దనాద్యైః కనకవిరచితైః పూజితం నప్రసూనైః ।
ధూపైః కర్పూరదీపై ర్వివిధరసయుతై ర్నైవ భక్ష్యోపహారైః ।
క్షన్తవ్యో మేఽపరాధశ్శివః శివ! శివ! భోః శ్రీ మహాదేవ శంభో!



 ''నీవలెనే అందరిని భావించు, అందరివంటివాడవే నీవనుకొనుము'' యజుర్వేదం 40వ అధ్యాయం, 6వ మంత్రం.

 ఉదయమే దైవమను స్మరించుచు లేవవలెను. కుడినుండి లేచుట మంచిది. నడక ఆసనములు కసరత్తులు వగయిరా చేయుట మంచిది. స్నానము మహాబలము. స్నాన మహిమ గూర్చి మనవారొక పురాణమే వ్రాసిరి. (మాఘ పురాణము). పూర్వము ఋషులు రోజుకు 5 సారులు స్నానము చేసి ఆ బలముతో తపస్సు చేసెడివారు.

 ''బలము కావలెనన్న ఎక్కువసేపు స్నానము చేయవలె'' నని ఫ్రెంచి నాయకుడు నెపోలియన్ చెప్పెను. నిత్యము చన్నీటి స్నానము చేయువారికి పక్షవాతము రాదు.

# ఏడవ అధ్యాయం

## రుంగ్లింగ్ టాప్ ద్వారా జిప్తి

శ్లో॥ నో శక్యం స్మార్త కర్మ ప్రతిపదగహనే ప్రత్యవాయాకులాఢ్యే ।
శ్రౌతే వార్తా కథం మే ద్విజకులవిహితే బ్రహ్మమార్గానుసారే ।
తత్త్వే జ్ఞాతే విచారే శ్రవణమననయోః కిం నిదిధ్యాసితవ్యమ్ ।
క్షన్తవ్యో మేఽపరాధ శ్శివ శివ శివ భోః! శ్రీ మహాదేవ శంభోః!

నాడు 23-7-83 న ఉదయమే టిఫిను చాయ కార్యక్రమమును ముగించుకొని 7 గంటలకు ప్రయాణమైతిమి. నాడు కూడ పెద్దలు నిన్నటిలా గుర్రాలపై ప్రయాణమైరి. కొద్ది దూరము మెట్లపై నుండి దిగుడు దారి గుండా ఒక కిలోమీటరు దూరములో ''సమూరి'' యనే చిన్న గ్రామమును దాటిన తర్వాత మళ్ళీ ఎక్కుట ప్రారంభమాయెను. దాదాపు 3 కి.మీ. ఎక్కుచూ పోగా 9 గంటల ప్రాంతమున ''నక్రే'' మరియు ''కుటియా'' లనే గ్రామాలను దాటి 2743 మీటర్ల ఎత్తుగల చిన్న గ్రామమగు ''జంగల్‌చట్టి'' ని చేరితిమి. అచట ఒక రేకుల గెస్టుహౌసు శిధిలావస్థలోయున్నది. ఆ గ్రామములో రెండు మూడు గృహముల కన్నా ఎక్కువ లేవు. మేము ఆయాసపడుచు నెమ్మది నెమ్మదిగా నాలుగు ఫర్లాంగుల పైకి వెళ్ళగా ఒకే ఒక హోటలు కనపడినది. అచట కొంతసేపు విశ్రమించి టీ త్రాగి మరల 10 గంటలకు బయలుదేరితిమి. నాటి ప్రయాణములో చాలా దట్టమైన అడవి కలదు. అది నిర్జన ప్రదేశము కావున ఉదయమే మేమంతా కలసి వెళ్ళాలనే నిర్ణయము గైకొంటిమి. మా లీడరుచేత అలా ఆదేశింపబడెను. ఆ ప్రదేశములో క ఠినమైన పర్వతారోహణ నాడే మొదలాయెను. అచటి నుండియే ''రుంగ్లింగ్‌టాప్'' ప్రారంభము. మేము మెల్లమెల్లగా మెట్లెక్కుచు దట్టమైన అరణ్యము గుండా పోవుచుంటిమి. రాత్రి వర్షము పడుటచే మెట్లన్నియు జారుడుగా నుండెను. మెట్ల కిరువైపుల - నేల, దూలగొండి చెట్లచే నిండియుండెను. కొన్ని అడవి మృగాలుండునని తెలిపిరి. కాని మాకు కొండెంగలు (నల్ల ముఖముగల కోతులు) తప్ప వేరేమి కానరాలేదు. ఆ దారికూడా తవాఘాట్ దారిని గుర్తుకు తెచ్చుచుండెను. మేము నిటారుగా Z ఆకారపు మెట్లు ఎక్కుచుంటిమి. విపరీతమైన చెమటతో ఆయాసపడుచు నోరెండుచుండగా మధ్య ఆగుచు ఎలక్ట్రాల్ నీరు త్రాగుచు ముందుకు సాగితిమి. మధ్య 5 కిలోమీటర్ల ప్రయాణములో ఎచటనూ నీటిచుక్క లభించలేదు. అట్లే నడచుచు ఆయాస పడుచు మధ్యాహ్నం 12 గంటలకు ''రుంగ్లింగ్‌టాప్'' పై 3050 మీటర్ల ఎత్తునకు చేరితిమి. అచట ప్రక్కనే ఒక చిన్న గుడి లాంటిది దాని ముందు

రాళ్ళకుప్పలు మరియు ఒక చిన్న చెట్టుకు ధ్వజములు (గుడ్డ పేలికలు) కట్టబడి యుండెను. మాతో వచ్చిన కరణ్‌సింగ్ యను బోటియా పోర్టరు (కూలి) అచటి రాతికుప్పపై ఒక రాతినుంచి మోకరిల్లి నమస్కరించెను. మేము దాదాపు 20 నిమిషములు అచట విశ్రమించి కొంత ఫలహారము తిని నీరు త్రాగితిమి. పిదప కొందరు ముందుకు సాగిరి.

ఆ దారులలో పైకెక్కుట చాల కష్టమైనా క్రిందకు దిగుట కొంత సుఖమే, కానీ ఇదే బహు ప్రమాదకరము. మేము మరల క్రిందకు దిగుట మొదలిడితిమి. అవి Z ఆకారపు బురదతోనున్న పాకురు మెట్లు చాలా జాగ్రత్తగా కర్రల సహాయముతో దిగుచుంటిమి. ఆ సమయములో తిరిగి వచ్చు రెండవ బృందము వారు గుంపులుగా ఇర్వురు ముగ్గురు చొప్పున మాకు ఎదురుపడిరి. వారితో కొంత తడవు కైలాసమానస విశేషములు చైనీయుల ప్రవర్తన మున్నగు విషయములను ముచ్చటించి తెలిసికొంటిమి. వారు వాతావరణము చాలా బాగున్నదని మమ్ముల నాశీర్వదించుచు అభినందించుచు ధైర్యము చెప్పుచు ఎంతో ఆయాస పడుతూ పైకి ఎక్కసాగిరి. వారును మేమును జైశంకర్ జైకైలాస్‌నాథ్ అను నినాదములు చేయుచు ముందుకు సాగితిమి.

దాదాపు అరగంట ప్రయాణము చేసిన తర్వాత నా వెనుక వచ్చుచున్న డా. మోఖా అగ్రవాల్ మున్నగు వారిని మెట్లకు పాకురు చేజారుడుగా యున్నందున జాగ్రత్తగా రమ్మని వెనుదిరిగి హెచ్చరించుచు బూటుకాలు జారి నేనే వెల్లకిలా పడిపోయితిని. కాని విచిత్రమేమంటే నాకు ఎలాంటి దెబ్బలు తగులలేదు. ఆ సమయమున నాకీ పద్యము జ్ఞప్తికి వచ్చినది. ✍

శా॥ పోకన్ మానదు దేహ మేవిధమునన్ పోషించి రక్షించినన్ ।
రాకన్ మానవు హాని వృద్ధులు మహారణ్యంబులో దాగినన్ ।
కాకన్ మానవు పూర్వజన్మకృతముల్ కాగల్గు నర్థంబులున్ ।
లేకన్ మానునె యెంత జాలిపడినన్ లేముల్ సిరుల్ భార్గవా ।

క॥ పులి నాకి విడుచు దైవము
గలనాటికి దైవబలము గడచినయెడలన్ ।
కలహించి గొర్రె గరచును ।
కలియుగమున కుందవరపు కవిచౌడప్పా.

✍ వెంటనే లేచి మా తోడివారిని మరల హెచ్చరించి నాకు ప్రమాదము లేదనిచెప్పుచు క్రిందకు దిగుచుంటిని.

అలాగే దాదాపు 4 కిలోమీటర్లు దిగిన తర్వాత సుమారు 2 గంటలకు ఒక నదీ ప్రవాహము చెంతకు చేరితిని. పైన చిన్న వంతెన యుండి నీరు యెత్తుపై నుండి

పడుచుండెను. అచట చల్లని నీటిని త్రాగి విశ్రమించితిని. 5 నిమిషాలలో మా మిత్రులును వచ్చి నీరు త్రాగి కూర్చుండిరి. ఆ రోజు డా. మోఖా కాళ్ళనొప్పులచే నడవలేక బాధ పడుచుండెను. క్రింద ఒక కిలోమీటరు దూరంలో సువిశాల పర్వతాల మధ్యన ఒక లోయ, చాలా పెద్ద నది ప్రక్కనే ఒక గ్రామము కన్పించుచుండెను. అచటనుండే అరణ్యము ముగిసెను. క్రిందుగా పెద్ద పెద్ద వృక్షములు చాలా చిన్నవిగా కనిపించెను. నేను మరల ప్రయాణము సాగించితిని. అచట మెట్లులేవు. మామూలు మట్టిపై రాళ్ళపై పిల్లదారి యున్నందున అడుగులు త్వరత్వరగ పడుచు ప్రయాణ వేగము హెచ్చెను. 15 నిమిషములలో ''సింఖోలా'' యను పెద్ద నదిని చెక్కవంతెన పైనుండి దాటి తిని. నీటి ప్రవాహవేగము పరిమాణము అధికముగా నుండెను. మనిషి అందులో సులువుగా కొట్టుకొని పోవునంత వేగము కలిగి యుండెను. కొండలపై నుండి మంచు కరుగుటచే చాలా ఎత్తు నుండి పరుగులు తీయుచు ప్రవహించుకారణముగా ఇంతటి వేగము ఏర్పడినది. నేను ముందున్న సింఖోలాగఢ్ గ్రామమును చేరి హోటలులో సేద తీర్చుకొని కొంత ఫలహారము చేసి టీ త్రాగునంతలో మిగతావారందరును వచ్చిరి.

దాదాపు ఒక గంట ముందుగా గుర్రముపై వచ్చిన మా చొక్కారావు గారు నదిలో స్నానము చేసి పట్టు వస్త్రములు ధరించి పూజలో నిమగ్నుడాయెను. నాడు వారు సిర్ఖాలో నీటి ఎద్దడి కారణముగా స్నానము చేయలేదు. నేను మాత్రము కొంత వేడినీరు సంగ్ర హించి అచటనే స్నానపూజాదులు ముగించుకొని తిరిగి ప్రయాణమైతిని. నేను వారికై మరికొంత వేచియున్ననూ వారి పూజముగియక రాని కారణముగా ముందుకు ప్రయాణము కొనసాగించితిని. మా రాబోయే జిప్తి క్యాంపు దాదాపు 5 కి.మీ. ల దూరములో నున్నది. ఆ సింఖోలాగఢ్ గ్రామములో 1972 లో భయంకరమైన భూస్ఖలనము జరుగుటచేత ఎన్నో పశువులు గొర్రెలు ప్రజల చనిపోయి యెనలేని నష్టము వాటిల్లెనట. మరియు మరల 1980 అతివృష్టి సంభవించుటచేత మరొకసారి విపరీతమైన నష్టము సంభవించినట్లుగా అచటి వారు తెలిపిరి. ✍

## తెలుగు తమిళ మిలటరీ మిత్రులు

✍ నా వెనుకనున్న డా॥ మోఖా అగ్రవాల్ మున్నగువారు నేను వేచియున్న కారణముగా నాకంటే ముందు నడవసాగిరి. నేనును వారి వెనుక నడక సాగించితిని. అచటినుండి పర్వతారోహణము లేదు. దారి సమతలముగా వున్నది. గ్రామము దాటగా మరియొక చిన్ననది ఎదురయ్యెను. అదిదాటి కాళ్ళు పీకుతున్నా కాలాతీతమైన కారణంగా వడివడిగానే నా నడక సాగుచున్నది. ఒక కిలోమీటరు ముందునకు పోగానే

శ్రీ షణ్ముగ సుందరముగారు కలిసిరి. మిగతావారంతా వెళ్ళిపోయిరి. ఆయన చాలా నీరసించి నెమ్మదిగా నడుచుచుండెను. ఇరువురము కలిసి నడుచుచుంటిమి. మధ్య మధ్య చక్కని దృశ్యముల ఫోటోలు తీయుచుంటిని. అచట నాలుగువైపుల ఎత్తైన కొండలు కలవు. ప్రక్కన నది దిగువగా విశాలమైన లోయ కలవు. అచట ''గుల్లా'' అనే చిన్న గ్రామమున్నది. ఎడమవైపున పై నుండి విరిగిపడిన పెద్ద పెద్ద బండలు భయోత్పాతము కలిగించుచుండెను. మేము ఇరువురము కొంత దూరము మాట్లాడుచూ పయనించగా మళ్ళీ మెట్లు కొద్దికొద్దిగా పై కెక్కుట మొదలాయెను. ''బిందకోట్'' అనే చిన్నగ్రామమును దాటి మరో కిలోమీటరు పైకెక్కగనే ''సిర్దాంగ్'' గ్రామము చెంత మాయమైన ''కాళిగంగా'' చాలా లోతుగాను దాదాపు నారాయణాశ్రమము క్రింద కనిపించిన ప్రదేశము వరకు కనిపించెను.

అచట ఒక మిలిటరీ క్యాంపు వున్నది. ఒక హెలిప్యాడ్ ఉన్నది. తెలుగు తమిళ యువకులు 4 మాసముల కొరకు బంకర్లు మున్నగు నిర్మాణ పనుల నిమిత్తము అచట విడిదిచేసి యుండిరి. మా ముందు పోయినవారు, నేనును శ్రీచొక్కారావు గారును తెలుగు వారమని వెనుక వస్తున్నామని తెలియచేయుటవలన అందులోని కుమార్ మున్నగు తెలుగు మిలిటరీ వారు మాకై వేచియుండి ఎంతో సాదరముగా ఆహ్వానించి ఒక పోస్టాఫీసు భవనములో కూర్చుండబెట్టి బిస్కట్లు కాఫీలు, బలవంతముగా తినిపించిరి. ఎంతో ఆప్యాయతతో మాట్లాడి అచటనే ఆ పూటనుండి వారి చెంత భోజనము కూడ చేయుమని బలవంతపెట్టిరి. కానీ మేము తిరుగుప్రయాణములో తప్పక భోజనము చేయుదుమని వారికి హామీనిచ్చితిమి. నాతో నున్న షణ్ముగ సుందరం తమిళులతో చాలాసేపు ముచ్చటించెను. నేను తెలుగువారితో ముచ్చటించితిని. అందరము కలిసి ఫోటోలు దిగితిమి. వారి అడ్రసులు మాకు, మాచిరునామాలు వారికి ఇచ్చి పుచ్చుకొంటిమి. ఇంకా మా రేస్ట్ హౌజు దాదాపు 2 kms వున్నందున దాదాపు 2.30 గంటలకు తిరిగి ప్రయాణమును సాగించితిమి. చొక్కారావుగారు ఇంకను మమ్ము చేరలేదు. మెల్ల మెల్లగా ఇరువురము నడచుచు ఎడమవైపునకు మలుపు తిరిగితిమి. అపుడు మా క్యాంపు కనిపించెను. కానీ అది ఒక కిలోమీటరుకు పైబడివున్నది. నేటి ప్రయాణము 18 kms.లకు పైబడివున్నందున మేము చాల అలసిపోయితిమి. 4.15 గంటలకు మాక్యాంపునకు చేరి చతికిలపడితిమి. తరువాత శ్రీమతి రశ్మి వడ్డించుట మేము భోజనము చేయుట మామూలే కదా!

ఆ ''జిప్తి'' మజిలీ 2379 మీటరుల ఎత్తున వున్నది. ప్రక్కనే కుడి వైపున కాళిగంగా ఎలా లో న పారుచున్నది. దాని ప్రక్కనే నేపాల్ పర్వతరాజములు

ఎడమప్రక్కన భారత ప్రాంత పర్వత శృంగములు చాలా ఎత్తుగా నున్నవి. ఆ గెస్టుహౌసులో రెండుగదులు, బాత్ రూములు, వంటశాల కలవు. రబ్బరు చాపలు గదులలో వేసివుంచిరి. ప్రక్కన గుడారముల వేయు స్థలము కూడా నుండెను. నీరు చాలా దూరము నుండి తెచ్చిరి. డాక్టర్లు పోలీసులు వుండు స్థలము మేము వచ్చిన మార్గంలోనే ఒక ఫర్లాంగు దూరము వెనుకగా నుండుటచే డాక్టరు పరీక్ష కొరకై వెళ్లుటకు లేచితిని. కానీ కాళ్ళ తీపులచే అడుగులు తడబడుచుండెను. పైగా అది పూర్తిగా పైకి ఎక్కుట కావటం చేత మరీ బాధపడితిని. ఆ ఒక్క ఫర్లాంగు నడకకు దాదాపు 20 నిమిషములు పట్టెను. అలసిపోవుట వలన ఇంత భాధ కలుగుతుందే అని నాకు నేనే నవ్వుకొంటిని. ఎలాగైతేనేమి డాక్టరు పరీక్ష ముగించుకొని తిరిగివచ్చి కొన్ని ఫోటోలు తీసి మరల విశ్రమించితిని. నేను ఢిల్లీలో నున్నప్పుడు నా వెన్నుపోటు బాధను గురించి ఎంతో భీతిల్లితిని. కాని అచటి నుండి బయలుదేరిన తర్వాత అది నాఛాయలకు రాకుండుట నాకెంతో విచిత్రమును కల్గించినది. రావణప్రేరితులైన రాక్షసులు హనుమంతుని వాలమునకు నిప్పు తగిల్చినారు. ఆ యువిధాగ్ని ఆంజనేయునకు ఇసుమంతబాధ గల్గించలేదు. అందుకు ఆంజనేయుడు విస్మయముజెంది తనలో ఈ విధముగా తలచెను.

క॥ రాముని సామర్ధ్యముననో ।
భూమిజ కారుణ్యముననో పొందుగ పవనో ।
ద్ధామ సహాయంబుననో ।
నామేను దహింప దీ అనల తీవ్రశిఖిన్.

అన్నట్లు కైలాస నాధుని కటాక్ష ప్రభావమో లేక మార్గా శ్రాంత ప్రభావమో యనునది అద్భుతమే.

శ్లో॥ ధ్యాత్వా చిత్తే శివాభ్యాం ప్రచురతరధనం నైవ దత్తంద్విజేభ్యో ।
హవ్యం తే లక్షసం ఖ్యైర్హుతవహావదనే నార్పితం బీజమన్త్రైః ।
నో తప్తం గాంగతీరే వ్రతజపనియమై రుద్రజాప్యం న జప్తమ్ ।
క్షన్తవ్యో మేఽపరాధశ్శివ! శివ! శివ! భోః! శ్రీ మహాదేవ శంభో!



# ఎనిమిదవ అధ్యాయం

## సుందర నిజంగ్ జలపాతముద్వారా మాల్పా

శ్లో॥ నగ్నో నిస్సంగశుద్ధ స్త్రిగుణ విరహితో ధ్వస్త మోహాన్దకారో ।
నాసాగ్రేన్యస్తదృష్టి ర్విదితభవగుణో నైవదృష్టః కదాచిత్ ।
ఉన్మన్యాఽవస్థయా త్వాం విదితగతిమతి శ్శంకరం న స్మరామి ।
క్షన్తవ్యో మేఽపరాధశ్శివ! శివ! శివ! భోః! శ్రీ మహాదేవ శంభో!

✍ 24-8-83 న ఉదయమే స్నాన పూజాదులు ముగించి 7 గంటలకు ఫలహార సేవానంతరము ప్రయాణము సాగించితిమి. నాటి ప్రయాణము ''మాల్పా''కు 9 కిలోమీటర్ల దూరము, బయలుదేరిన అరగంటలో 'తుషారా' అను చిన్న గ్రామమును దాటిన తర్వాత పూర్తిగా దాదాపు 2000 మీటర్ల క్రిందికి దిగుడు దారి కలదు. క్రింద కాళిగంగా ఆవల నేపాల్ పర్వతములు కనబడుచుండెను. నేటి దారి యేమాత్రము బాగులేదు. Z ఆకారములో నిటారుగా దిగుడుగా నున్నది. దారి అధ్వాన్నముగాను ఒడుదుడుకులు గల తంతెల (మెట్ల)తోను ఉండి దారిలో నడుచుచుండగా భయము వేయుచుండెను. ఆ మెట్లు నది ఒడ్డునుండే ఉన్నందున ప్రమాదకరముగా నుండెను. కాళిగంగా ఆవలి వైపుగా నేపాల్ భాగము. వారికి కూడ దారి కలదు. అది చాలా సునాయాసముగా నడచునట్లు ఏర్పాటు చేసిరి. వారి దారి నది వెంబడే సాగి కొద్దిగా యెత్తుగా నుండి సమముగా నున్నది. మన దారి తప్పుడు మెట్లతో ఒక మలుపు తిరుగుటకుగాను కాళిగంగా ప్రవాహము ప్రక్కవరకు దిగి మరో మలుపు తిరిగి మరో 1000మీటర్లు ఎత్తునకు ఎక్కవలసి వచ్చుచుండెను. ఆదారిలో నడుచుచు మెట్లు ఎక్కుట దిగుటవలన ఆయాసము భయములతో పాటు మన ప్రభుత్వముపై కోపము విసుగు ఏర్పడుచుండెను. అదే దారిగుండా నెమ్మదిగా దిగి 'కాళిగంగా'కు దగ్గరలోచేరి కొంత ముందుకుపోగా ఒక హోటలు నది గట్టుననే కాన్పించెను. అచట కాసేపు విశ్రమించి 'టీ' త్రాగితిమి. మరల ప్రయాణమైతిమి. అచటి నుండి ఒక కిలోమీటరు ముందుకు సాగగా ఎదురుగుండా వందమీటర్లు ఎత్తునుండి నేపాల్ పర్వతములనుండి ఏనుగంత ధారావాహకముగు ఒక జలపాతము నిటారుగా ఎగురుచు దుముకుచు వచ్చి కాళిగంగలో పడుచుండగా ఆ రెండు నదుల మ్రోత పర్వతములలో ప్రతిధ్వనించుచు మారుమ్రోగుచుండెను. ఆ ప్రాంతము భయము గొలుపు చుండెను. మా దారి ఎడమ వంకకు తిరిగెను. నది వెంబడే సాగుచుండెను. ఇరువైపుల ఎత్తైన పర్వతాలు మధ్యననది. ఒడ్డున దారి. పైకి కొండల చివర చూడవలెనంటే మెడను పూర్తిగా వెనుకకు వంచితేనే పర్వతాగ్రములు

కాన్పించుచుండెను. ఎడమవైపు నుండి మరల పైకి ఎక్కుట మొదలాయెను. మధ్యలో రెండు మూడు ప్రదేశాలలో కాళిగంగ మలుపులను చెక్క వంతెనలపైనుండి దాటితిమి. అంటే మామెట్ల త్రోవ నీటి ప్రవాహములో కొట్టుకొని పోవుటో విరిగి నదిలో పడుటో జరిగియుండెను. అచట కాళిగంగ యొక్క ప్రవాహ వేగము కాంతివేగ సమమా యనిపించుచుండెను.

మరియు 'జా' అనే నది మ్రోత ప్రతి ధ్వనులతో మరింత భయానకముగా ఏకాంత ప్రదేశమై మధ్య మధ్య పైనుండి పడే నీటి ధారల మ్రోత తోడై మేము ప్రాణములు అరచేత పట్టుకొని ముందుకు సాగుచుంటిమి. ఆ ప్రదేశములో నాలాంటివారు ఒక్కరే ప్రయాణముచేయవలసి వచ్చినచో ఒడలు జలదరించి రోమాంచితమై కళ్ళు తిరిగి, చెవులు దిబ్బపడి గుండె ఆగిపోవలసి నదే తప్ప వేరేమియు లేదు. దీనినే 'లోకర్‌కూ' అందురు. ''కూ'' అనగా టిబెట్టులో 'గుహ'యని అర్థము. 1966 పూర్వము అచట భయానకముగు భూస్ఖలనము జరిగి కొండ చరియలు విరిగి ఎనలేని పశు సంపదతోపాటు 100 మంది జనులు మరణించిరట. ఆ తర్వాత నీగుహ నామరూపాలు లేకుండా పోయెనని చెప్పుదురు. తర్వాత ఒక కిలోమీటరు పైకి మెట్లు ఎక్కుచుంటిమి. ఒక చోట మెట్ల వెడల్పు మూడు అడుగులు మాత్రమే ఉండెను. అట్లే నడిచి ఆ '' లోకర్ టాప్'' అనే ప్రదేశము చేరువరకు మా మెట్లదారి అమాంతము కూలి పోయి దాదాపు అయిదు మీటర్ల దారి నదిలో విరిగిపడెను. దారి పూర్తిగా మూత పడెను. ఇది ఆ పర్వతాలలో సహజమే. అందుచే ప్రభుత్వ ''గాంగ్‌మెన్''లు మా కొరకై దాదాపు 20 మీటర్లు ఎత్తునుండి గడ్డిని చెక్కుచు ఒక చిన్నగుట్టపైనుండి దారి చేయుచుండిరి. మేము కొంత సేపు అచట నిలిచితిమి. తర్వాత నిగంవారు గాంగువారు ఒకరినొకరినే చేయిపట్టుకొని పైకి ఎక్కించుచు జాగ్రత్తగా 50 మీటర్లు దూరములోగల యథా పూర్వ మార్గములో వదలుచుండిరి.

కొందరు ముందు వెళ్ళిరి. గుఱ్ఱాలు సామానులు దాటుటకు వీలులేకుండెను. కావున గుఱ్ఱములను దిగి, వానిని విడిచి మా పెద్దలుకూడ నడక ప్రారంభించిరి. ఇట్లు ఒక కిలోమీటరు పైకి వెళ్ళగా కాళిగంగా కుడి వైపుకు మలుపు తిరిగెను. ఆ మలుపు రెండు చాల ఎత్తైన పర్వతముల మధ్యగా పది మీటర్ల వెడల్పాటి ఇరుకులోనుండి ఉధృతంగా వచ్చును. 50 మీటర్ల వెడల్పుగల నది మా వెంట వచ్చు చుండెను. ఇంకను కొంత ముందుకు ఎక్కగా ఎదురుగా దాదాపు వెయ్యి మీటర్లు ఎత్తునుండి అయిదు మీటర్ల వెడల్పుతోను తెల్లగా పడుచున్న జల పాతముయొక్క రమణీయ దృశ్యము కనబడుచుండెను.

ఆ జల పాతమును చూడగనే యేనుగు లక్ష్మ కవిగారు రచించిన భర్తృహరి సుభాషితములోగల పద్యము స్పురించినది. ✍

శ్లో॥ ఆకాశంబున నుండి శంభునిశిరం బందుండి శీతాద్రి సు-
శ్లోకంబైన హిమాద్రినుండి భువి భూలోకంబునందుండి అ-
స్తోకాంభోధి పయోధినుండి పవనాంధోలోకముంజేరె గం
గాకూలంకష పెక్కు భంగులు వివేకభ్రష్టసంపాతముల్.

తా. ఆకాశ గంగ శివుని శిరమునుండి హిమాలయముపై బడి అంతటితో ఆగక భూమిపై బడి అంతులేని జలరాశియై సముద్రమున బడి రసాతలములకు జేరినట్లు వివేక భ్రష్టుడుగూడా ఇదే విధముగా నధోగతిని బొందగలడేమో.

✍ మా మిత్రులందరును ఆవలి వెరుగున విశ్రమించి యుండిరి. నేను చొక్కారావు, రంగాచారి, కులకర్ణి మున్నగు వారము జలపాతము క్రింద పడిన తర్వాత పారుచున్న చెక్కవంతెనపై నిలువబడి ఫోటోలు తీసికొంటిమి. అదే నిజంగ్ జలపాతము. అది కాళిగంగాలోకలియును. నేను మామిత్రులతో చేరి అందరము పది నిముషములు దృశ్యములను జలపాతమును గాంచుచు నిలచి పైనుండి ప్రవహించే చిన్న జలధార నీరును గ్రోలి ప్రయాణమైతిమి.

అచటినుండి రెండు కిలోమీటర్లు నిటారుగా ఎక్కుట ఆరంభమగును. దానిని ''ఛత్తా ఛడాయి'' అని కూడ యందురు. 'z' ఆకారములో ఆ నిటారు ఎక్కుడు చాల నెమ్మదిగా మధ్య మధ్య ఆగుచు సుందర దృశ్యములు తిలకించుచు ఫోటోలు తీయుచు రెండు గంటలు ఎక్కగా పూర్తి పర్వతాగ్రము చేరితిమి. దానినే ''భోలాపాన్'' అని యందురు. అచట మరల మాకు కాళిగంగా ప్రత్యక్షమై ఎదురుగా చాలాదూరము పాము మలకలవలె వంకరలుగా కాన్పించుచుండెను. ఆ తర్వాత మరల మెట్లు దిగుచు మధ్య మధ్య కొండ చరియలు విరిగిపడియుండుట వాటిని తీసివేసి దారిచేయు ''గాంగ్‌మెన్''లు కనిపించిరి. మధ్య మధ్య దిగుడులో చాలా ఎత్తునుండి వచ్చు జలధారలు కనుపించెను. ఆ మెట్ల దారిగుండా కొంత దూరము ఎక్కుడు మరల దిగుడు ఉండుటచే మెల్ల మెల్లగా రెండు కిలోమీటర్లు దాటగా ''మాల్పాగడ్'' అనే గ్రామము వచ్చెను.

అచటి హోటలులో మాకు 'మఠ్ఠా' (మజ్జిగ) దొరికెను. 'ధార్చులా' తర్వాత నేటివరకు మాకు పెరుగుగాని మజ్జిగగాని దొరుకలేదు. నా వద్దగల సీసాలో డబ్బిచ్చి నింపికొంటిని. ప్రక్కనే గల పెద్ద ''మాల్పా'' నది కొయ్య వంతెన మీదుగా దాటి అరకిలోమీటరు దూరాన ఎత్తు ప్రదేశమునగల మా 'మాల్పా' విడిదికి

మధ్యాహ్నము 12-30 గంటలకు చేరితిమి. మాకు వెంటనే చల్లని పానీయముల నిచ్చిరి. కొంతసేపు నేను విశ్రమించితిని. అపుడే శ్రీ చొక్కారావు గారు తన బట్టలు చేత పుచ్చుకొని స్నానమునకు నదికి బయలుదేరిరి. నేను నిన్ననే ఆయనను వారించితిని. అంతగా అవసరమనుకుంటే వేడినీటితో బాతురూములో స్నానము చేయమని చెప్పితిని. కాని నా మాట వినలేదు. ఏమీకాదులేయని నదికి వెళ్ళిరి. ఆ నదులలో నీరు, పైన మంచు కరుగుటచే వచ్చు ప్రవాహము కావున విపరీతమైన చల్లగా వుండును. వెంటనే జలుబు చేయుననియు చెప్పి, కనీసము స్నానము చేయగానే వెంటనే స్వెట్టరు మున్నగు వేడి కలిగించు బట్టల నైనను వేసుకొనుమని ఆ బట్టలతోనే పూజ చేసుకోమని మరోసారి హెచ్చరించితిని. అయినా వారు వినలేదు. చన్నీటి స్నానము గంటల తరబడి చల్లని పట్టు వస్త్రధారణతో పూజ చేయుచునే యుండిరి. మేమందరము భోజనము చేసి వెంటనే పడుకొంటిమి. 5 గంటలకు లేచి టీ త్రాగి ప్రక్కనే టెంటులోనున్న డాక్టరు వద్దకు వెళ్ళి పరీక్షలు ముగించు కొంటిమి. తర్వాత కొంతసేపు మిత్రులతో పిచ్చాపాటి ముచ్చటించితిమి. రాత్రి భోజనాలు విశ్రమించుట-ఆ రోజు కార్యక్రమ సారాంశము.

ఆ "మాల్పా" ఎత్తు సముద్రమట్టమునకు 2,200 మీటర్లు కలదు. ప్రక్కనే 20 మీ. దిగువన కాళిగంగా ప్రవాహము. రెండు గదులు గదులలో రబ్బరు చాపలు బాత్‌రూములు వంటగది మున్నగు వసతులు గలవు.

శ్లో॥ స్థిత్వాస్థానే సరోజే ప్రణవమయ ఘరుత్కుమ్భితే సూక్ష్మ మార్గే !
శాన్తే స్వాన్తే ప్రలీనే ప్రకటితవిభవే దివ్యరూపే శివాఖ్యే! ।
లింగాగ్రే బ్రహ్మ వాక్యే సకలతను గతం శంకరం న స్మరామి ।
క్షన్తవ్యో మేఽపరాధశ్శివ! శివ! శివ ! భోః! శ్రీ మహాదేవ శంభో!।



 కలియుగములో తపస్సు కంటె దానము గొప్పది. దానఫలము 100 రెట్లని అనేకచోట్ల వ్రాసిరి.

# తొమ్మిదవ అధ్యాయం

## మనోహర ''బుద్ధి'' క్యాంప్

శ్లో॥ హృద్యం వేదాన్తవేద్యం హృదయసరసిజే దీప్త ముద్యత్ప్రకాశం ।
సత్యం శాన్తస్వరూపం సకలమునిమనః పద్మషండైక వేద్యం ।
జాగ్రత్స్వప్నే సుషుప్తౌ త్రిగుణవిరహితం శంకరం న స్మరామి ॥
క్షన్తవ్యో మేఽపరాధశ్శివ! శివ! శివ! భోః! శ్రీ మహాదేవః శంభో!॥

25-8-1983 రోజు ఉదయం యధాప్రకారం 7-30 గంటలకు మరల మా ప్రయాణము సాగించితిమి. నాటి ప్రయాణము తొమ్మిది కిలోమీటర్లు. నాడు దాదాపు 5 కిలోమీటర్లు పైకి ఎక్కుడుగానున్నా నిటారుగా లేకుండెను. మెల్ల మెల్లగా నడచుచు ఎత్తైన పర్వత పంక్తుల మధ్యన క్రింద కాళిగంగా ప్రవహించుచుండగా ఫోటోలు తీయుచు నడుచుచుంటిమి. కొంతదూరము వెళ్ళిన తర్వాత నాల్గు వందల మీటర్లు ఎత్తునుండి పడే సన్నని జలపాతము మేము నడిచే మెట్లపైన గల పర్వతాగ్రముపై నుండి పడుచూ దారిపై బడి నదిలోకి జారుచుండెను. ఆ ధార మా దారిపై దారిన పోవు మా పై వర్షపు జల్లుగా పడుచుండెను. అచట కొంతసేపు విశ్రమించి ఫోటోలు తీసికొంటిమి. మా వెంట నున్న నిగమువారు అచట కూర్చొనకూడదని ఆక్షేపించిరి. ఎందుకనగా ఇలాంటి కొండ ప్రదేశములలోనే కొండ చరియలు విరిగిపడే అవకాశ ముండును. దానిని ''బహెలిథా'' జలపాతమందురు. (థా) యనగా టిబెట్టు భాషలో జలపాతమని యర్థము.

పూర్వము ఆ జలపాతము వలన రాకపోకల మార్గము మూతబడిపోవుట వలన ''బుద్ధి'' గ్రామస్థులు ఆ జలపాత మార్గమును 650 మీటర్ల నుండి మార్చి 400 మీ. ఎత్తునుండి పడునట్లు చేసిరట. తర్వాత ''లామారి'' అనే ఒక చిన్న గ్రామము ద్వారా ''ధక్తీథా'' అనే మరో జలపాతమును చేరితిమి. ఆ జలపాతము దాదాపు 50 మీ. ఎత్తునుండి చాలా వేగముతో నదీ ధారలా పడుచుండెను. దానిని కొయ్యవంతెనపై నుండి దాటి క్రింది నది వద్దకు పోయి పైనుండి జలపాతము వచ్చు దృశ్యమును ఫోటోలు తీసికొంటిమి. కొన్ని బిస్కట్లు తిని నీరు త్రాగి మరల బయలుదేరితిమి. మరికొంత దూరము పైకి చేరగా ఎదురుగా నున్న నేపాలు పర్వతములపై నిటారుగా నున్న దేవదారువనము ఆ వనము మధ్యనుండి ఒక మంచుదిబ్బ దాదాపు కాళిగంగా ఒడ్డువరకు జారి పడియుండెను. ఆ మంచుదిబ్బ చాల వెడల్పుగా నున్నది. రెండు అడుగుల మందముగా నున్నట్లు కాన్పించినది. ఆ మంచుదిబ్బ క్రిందినుండి జలము ధారగా ప్రవహించుచుండుట కూడ చూచితిమి. దాని ఫోటోలను



శ్రీ నారాయణాశ్రమ దేవాలయము



చంపావతిలోని ఆలయము.



శిథిల గొంపాల రాళ్ళపై విగ్రహములు ప్రణవ మంత్రములు



మానస సరోవర సంధ్యాసమయ దృశ్యము



కైలాస పర్వతము మరో ఆకృతిలో.



మానస సరోవరములో స్నానము.



మాల్పా బుద్ధి మధ్య జలపాతము



బుద్ధి గుంజి మధ్య కన్నములు గల హిమాలయ పర్వతము.

తీసికొంటిమి. అట్లే దాదాపు పదిన్నర గంటలకు ''ఖోశ్లా'' అనబడు పర్వతాగ్రము చేరితిమి.

కాళిగంగా కుడివైపునకు తిరిగినది. అచట చేరగనే చల్లని గాలులు వీచుచుండెను. ఎండ బాగుగా నుండెను. మాకు పట్టిన చమటలు వెంటనే ఆరిపోయెను. ఆ వాతావరణము వలన హాయిగా తోచెను. అచటినుండి దూరాన ''బుద్ధి'' బంగళా కాన్పించుచున్ననూ అది దాదాపు మూడు కిలోమీటర్ల దూరమున నున్నది. ఎదురుగాగల ఒక నదిని దాటవలసియుండెను. అందుచే ఆ నది వెంబడే మేము ఎడమకు తిరిగి రెండు పర్వతముల మధ్యగల లోయను దాటవలసియుండెను. మేము దారి వెంటనే క్రి ందికి దిగుచు అరగంటలో ఆ విశాలమైన నదిని కొయ్యచెక్కల వంతెనపైనుండి దాటు ఆ సుందర దృశ్యముల ఫోటోలు తీసుకొని ముందుకు సాగితిమి. ఆచట 'పాలాగఢ్' అను గ్రామమును దాటి ఒక కిలోమీటరు దూరములో కొంత యెత్తు ప్రదేశముపై గల మనోహరమైన 'బుద్ధి' క్యాంప్‌కు 12 గంటలకు చేరితిమి. అచట చల్లని పానీయములు సేవించి కొద్దిసేపు విశ్రమించితిమి.

ఆ బుద్ధి 2710 మీటర్ల ఎత్తుగల ప్రదేశము, చుట్టూ ఎటు చూచినా పర్వత పంక్తులు మంచు శిఖరములు కనుపించెను. చూడముచ్చటగా ర మణీయముగా ఆహ్లాదము గొలుపుచు కనుపించుచుండెను. మా క్యాంప్ చుట్టు వింత వింత రంగుల పూలచెట్ల పూలతో నిండి యుండి సూర్యకాంతిలో శోభాయ మానముగా ప్రకృతి సౌందర్యమును యినుమడింపజేయుచుండెను. ఆ భవనము ముందు 20 అడుగుల ఎత్తుపై గుండ్రని గద్దె నొక దానిని నిర్మించి దానిపై కొన్ని కుర్చీలు వేసిరి. అచట కూర్చుండినచో అన్ని వైపుల పూర్తి దృశ్యములు నదులు కనుపించుచు ఎంత సమయము గడపినను తనివితీరని మధురానుభూతి కలుగుచుండె ను. దానిపై నుండి ఒక కిలోమీటరు దూరములో పర్వతపాదము వద్ద గల 'బుద్ధి గఢ్' గ్రామము కనుపించుచుండెను. మా క్యాంపులో రెండు కాస్త పెద్ద గదులు బాత్‌రూమ్‌లు గుడారములు వెనుకగా వంటశాల ప్రత్యేకముగా నున్నవి. కొళాయి లున్నవి అందుపుష్కలముగా నీరున్నది. ఆ ప్రదేశములో యెండ తీవ్రత యున్నను మిట్ట మధ్యాహ్నము కూడ యెండలోనే కూర్చుండి సూర్యరశ్మి వేడిచే హాయిని అనుభవించుచుంటిమి. ఇంత చక్కని ''రెస్ట్ హౌస్'' మా ప్రయాణములో యెక్కడా తటస్థ పడలేదు. చొక్కారావుగారితో సహా అందరును ఆ రోజు స్నానములు చేసిరి. బట్టలుదికికొనిరి.

నాటి ఒక దృశ్యము యింకా నా కనుల ముందు కదులుచున్నది మేము క్యాంప్ ముందు యెండలో కూర్చుంటిమి. ఇతరుల లాగా కీ॥ శే॥ రామకృష్ణన్ గారు

కూడా కిచెన్ ప్రక్కన గల కొళాయి వద్ద బట్టలుతుకుచు మధ్యలో ఏదో మరచి అది గొనిపోవుటకు చెడ్డీతో (డ్రాయర్) మా ముందు నుండి గదిలోకి వెళ్ళి ఆ వస్తువును తీసుకొనిమరల మా ముందు నుండే కొళాయి వద్దకు వెళ్ళిరి. వారు పొట్టిగా దిట్టగా నల్లగా వెడల్పాటి ఛాతీ దృఢమైన అంగ సౌష్టవము కండ పుష్టి కలిగి యుండి 'వెయిట్ లిఫ్టర్'గా పేరు పొందినారు. ఆయన సజీవ విగ్రహమును నేటికిని మరులేకున్నాను. ఇటువంటి వారు తర్వాత 5 రోజులలోనే మమ్ము వీడిపోవుట ఎంతో విషాద జనక విషయము. ✍

☝ ప్రస్తుతమున్న ''బుద్ధిగఢ్'' మాక్యాంపుకు దగ్గఱగానే యుండెను. కాని చాలా కాలము క్రిందట భూస్ఖలనము జరిగి కొండచరియలు విరిగిపడెనట. అందుచే విశేష జననాశనము జరిగి అపరిమిత పశుసంపద కూడ నష్టపడెనట. దాదాపు గ్రామ మంతయు కప్పి వేయబనందున తర్వాత ఒక కిలోమీటరు దూరములో గల ప్రస్తుతస్థలమున ఆ గ్రామ పునర్నిర్మాణము జరుపబడెను. ఆ పర్వత పంక్తులలో గలదానిని 'చౌదాస్ ఘాట్' అని అందురు. దాని తరువాత 'వ్యాసఘాట్' ఆరంభమగును. కాళిగంగా కుడివైపు తిరిగి ఎదురుగా కనబడే దేవాలయము వెనుక గా పర్వతమును అర్ధ చంద్రాకృతిలో ప్రదక్షిణము చేయును. అందుచే రేపటి ప్రయాణములో అది కొంతవరకు అగుపించదు. ☝

✍ నాడు మేము త్వరగా చేరినందు వలన నేమి నీరు సమృద్ధిగా ఉన్నందు వలన నేమి ఎండ బాగుగా కాయుచున్నందున నేమి దాదాపు అందరును స్నాన మాచరించిరి. నాటి వరకు ప్రతిరోజు నేను చొక్కారావు గారు షణ్ముగ సుందరం మాత్రమే స్నానము చేసినట్టు గుర్తు. శ్రీ షణ్ముగ సుందరంగారు మాత్రం అందరితో భోజన ఫలహారములు చేసి వీలు యెప్పుడు చిక్కితే అప్పుడే స్నానముచేసి మా అందరి మధ్యలో కూర్చొని తమిళములో ఏవో మంత్రాలు శ్లోకాలు చదువుచు చివరిలో లేచి నిలబడి చేతులెత్తి ''కళైమళయాణిబొట్రి బొట్రి యని'' ప్రదక్షిణము చేయుచుండుట. దాదాపుగా ప్రతిరోజు సాయంత్రమో మధ్యాహ్నమో చూచుచుంటిమి. ఇది గమనించిన మాలో కొందరు జై కైలాస్‌కు బదులుగా ''కళైమళయాణి బొట్రి బొట్రి'' అనే నినాదములు మధ్య మధ్యలో చేయుచుండిరి.

నేడు అందరము కలసి భోజనము చేసి నిదురించితిమి. సాయంకాలము డాక్టరు పరీక్షానంతరము ప్రకృతి దృశ్యములను తిలకించి ఫోటోలు తీసికొని గదులలో చేరితిమి. రాత్రి 8 గంటల ప్రాంతములో వర్షము పడుచుండుటచే ఒక గదిలో అందరమును కూర్చొని పిచ్చాపాటి మాటలలో పడితిమి. ఇంతలో శ్రీ మాథుర్ తాను కైలాస్ చేరగానే ముందుగా వందల యేండ్ల తరబడి తపస్సు చేయుచున్న

సాధువుల జాడ తెలిసికొని దర్శింతుననెను. ఇంతలో మరొకరు సాధువులెందుకు సాక్షాత్ పరమేశ్వరుడే కాన్పించి నీకేమి కావాలంటే ఏమి కోరుతావని ప్రశ్న? మాలోని డా॥ మోఖా తానైతే వెంటనే మోక్షమును అడుగుతానని తెల్పెను. ఇంతలో శ్రీమతి రశ్మి తానైతే సంసార కష్టముల బాపి సదా సుఖము ప్రసాదించ గోరెదననెను. మా చౌక్కారావు గారు అందుకొని పూర్వజన్మ పుణ్య పాపముల ఫలితముల ననుభవింపనిదే మోక్షమెట్లు శివుడు ప్రసాదించుననే సందేహము వెలిబుచ్చిరి. ఆ తర్వాత ఎవరికి తోచినట్లు వారు అది కాదు యిది అదికోరుతామనే చర్చలో పడిరి. తర్వాత నేను మీరందరికి ఇంతింత స్వార్థమున్నది; ఏ సాధన లేక అలభ్యముగా కోరు కోరికలకు ఆ శివుడు ప్రత్యక్ష మగుట కాని వరాలిచ్చుట కాని జరుగదని తెలిపితిని. అలా చివరకు మోక్షమును కోరుట కూడ స్వార్థమే కదా! తర్వాత కొంత తర్జన భర్జన ఆ తరువాత నేడు భజన కార్యక్రమమును మొదలిడితిమి. డా॥ గోడ్బోలే శివునిపై ఆంజనేయ స్వామిపై భజనలు చెప్పుచుండగా మేమందరమును వంత పాడితిమి.

☝ మన హిందూ ధర్మములో భక్తియోగమని ఒక శాఖ బహుళవ్యాప్తి కల్గియున్నది. దైవ భక్తి వలన మోక్షము లభించునని నమ్మువారిలో చైతన్య ప్రభువు, జ్ఞానదేవ, వల్లభాచార్య, రామానుజ మున్నగు ఆచార్యులుండిరి. వీరు భక్తి యోగమునకు అత్యధిక ప్రాధాన్యత నిచ్చి భాగవత సంప్రదాయము ననుసరించినారు. భక్తి నవ విధములుగా చెప్పబడి యున్నది. ఆ వివరములు దిగువ పొందుపరచుచున్నాను. భాగవతములో ప్రహ్లాదుడు నవవిధ భక్తులను గూర్చి ఈ విధముగా చెప్పెను. ☝

మ॥ తను హృద్భాషల సఖ్యమున్ శ్రవణముఀ దాసత్వముఀ వందనా ।
ర్చనముల్ సేవయు నాత్మలో నెరుకయున్ సంకీర్తనల్ చింతనం ।
బను నీ తొమ్మిది భక్తి మార్గముల స ర్వాత్ముఀ హరిఀ నమ్మి స ।
జ్జనుడై యుండుట భద్ర మంచు దలతుఀ సత్యంబు దైత్యోత్తమా ।

శ్లో॥ శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాద సేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనమ్.

☝ **1. శ్రవణము :** దేవుని అవతార గాధలు హరికధలు పురాణములు భజనలు వివరింపబడిన గ్రంథములను వినుట ద్వారా భక్తిని పెంపొందించు కొనవలయునని ఆయా గ్రంథములలో గల ననేక ఆధ్యాత్మిక విషయముల తెలిసికొని అనుసరించుటకు భక్తులు ప్రయత్నించవలెనని తేలుపబడినది. శ్రవణమునకు పారాయణమునకు చెందిన అనేక గ్రంధములు కలవు. వానిలో భాగవతము భాగవద్గీత రామాయణము ముఖ్యమైనవి. వాటిని ప్రతిదినము చదివి లేక చదువు వారి ద్వారా విని భక్తిని పెంచుకొనుట శ్రవణభక్తి అనబడును.

2. కీర్తనము : కొందరు గొప్ప కవులు దేవుని ప్రశంసించుచు ననేక కీర్తనలు వ్రాసి యున్నారు. ఆ కీర్తనలలో సంగీత సాహిత్య నృత్య నాట్య కళా ప్రాధాన్యత గలదు. కొందరు కీర్తనకారులు హరిదాసులు భాగవతులు తమ తమ నైపుణ్యముల ద్వారా భక్తిని వ్యాపకము చేయుచున్నారు. వారు జరుపుచున్న నీ కీర్తన కార్యక్రమముల ద్వారా భక్తులు మానసికానంద ఉత్తేజములను పొందుటయే వాంఛనీయము. భక్తులు స్వయముగా కూడా కీర్తనల నాలాపించుచు భక్తిని వ్యాప్తి చేయవచ్చును. ఇందుకు భజన మండలులను నెలకొల్పు కొనుట భక్తి పెంపొందించు కొనుటకు సాధనమగును.

మన భారత దేశములో భక్తిచే మోక్షమును పొందిన మహానుభావుల గూర్చి నీ విధముగా చెప్పబడినది. ☝

శ్లో॥ ప్రహ్లాద నారద పరాశర పుండరీక ।
వ్యాసాంబరీష శుక శౌనక భీష్మ దాల్భ్యాన్ ।
రుక్మాంగ దార్జున వశిష్ట విభీషణాదీన్ ।
పుణ్యా నిమాన్ పరమభాగవతాన్ స్మరామి.

☝ 3. స్మరణ భక్తి : పరామాత్ముని వివిధ నామములను స్మరించినచో మన స్సునకు సమాధానము లభించును. నిరంతరము భగవన్నామ స్మరణ వలన మనస్సునకు కల్గు తాపము లుపశమించును. మనము చేయు ప్రతి పనిలో మనస్సును భగవంతునిపై లగ్నము చేయవచ్చును. సుఖ దుఃఖముల యందు స్మరణము వీడరాదు. ఆదిలో వాల్మీకి మహర్షి 'రామ'కు బదులుగా 'మరా' యను నామము స్మరించనది రామాయణమై ముక్తిని బడసెనని పెద్దలు చెప్పుదురు. భగవంతునికి గల అనేక నామములను స్మరించుటచే అనంత మహిమ కల్గి మనము తెలిసి తెలియక చేసిన పాపముల నెల్ల హరింప జేసి ముక్తినిచ్చును. ఈ రామనామము అష్టాక్షరియగు "ఓం నమో నారాయణాయ" మరియు పంచాక్షరియగు "ఓంనమశ్శివాయ"యను మంత్రముల నుండి ప్రాణమయమగు "రా" యను అగ్ని బీజమును మరియు ఆనందమయమగు "మ"యను శాంతి బీజమును గైకొని "రామ"గా నేర్పరచి అవతారపురుషుడగు శ్రీరామచంద్రునికి వశిష్ట మహర్షి చేసిన నామకరణము. దీనినే రామతారకమని మన పెద్దలు చెప్పుదురు. ఈ రామతారకమును వల్మలుడను బోయవాడగు మహా పాపాత్ముడు శతకోటి జపించి పునీతుడై వాల్మీకి మహర్షి యయ్యెను. ఈతడే రామాయణమును రచించిన ఆదికవి, యని పెద్దలు వచించిరి.

4. పాదసేవన భక్తి : కామితార్థ మోక్షమునకై మనో వాక్కాయకర్మలతో సద్గురుని చరణముల ననన్యభావముచే పాదసేవ చేయవలయును. ఐహిక తృష్ణ

సంసారభవ బంధముల తొలగింపజేయుటకు సద్గురుని పాదసేవ యెంతేని అవసరము. గురువులు సర్వము అనుభవ పూర్వకముగా నెరిగి యుందురు. గోప్యముగా నుండు నంగత్యాగము, ఆత్మ నివేదనము, దేహస్థితి, అలిప్తత, సహజ స్థితి, ఉన్మనము, విజ్ఞానము అను ఈ యేడును ఏక రూపములు గావున గురు పాదసేవన వలన మాత్రమేనివి అనుభవము కాగలుగును. ☝

శ్లో॥ 'గు' శబ్ద స్త్వంధకారఃస్యాత్ రుశబ్ద స్తన్నిరోధకః ।
అంధకార నిరోధిత్వాత్ గురురి త్యభిదీయతే.

అజ్ఞానమను తిమిరమును బోద్రోలువాడే గురువు. అందుకే గురువును గురించి.

శ్లో॥ గురుర్ బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్ పరం బ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః ॥

అని వాల్మీకి ప్రథమముగ గురుని ప్రార్థించి బ్రహ్మ విష్ణు మహేశ్వరులకన్న గొప్పవాడని నుడివెను.

☝ **5. అర్చన భక్తి** : దేవ, బ్రాహ్మణ, అగ్ని, సాధు, సజ్జన, అతిథి అభ్యాగతుల మరియు వివిధ రకముల వివిధ నామముల దేవతామూర్తులను విగ్రహములను మనస్ఫూర్తిగా అర్చించుటయే యీ భక్తి. హరిహర విగ్రహారాధనలో భేదమెంచక అర్చించవలెను. భగవంతుని అనేక మూర్తులగు సర్వదేవాతార్చన ఆ కేశవునికే చెందునను నమ్మకముతో అర్చించవలెను.

ఈ అర్చన సాధ్యమైనంతవరకు నానావిధ పూజా ద్రవ్య పంచామృత దీప, ధూప కర్పూరముల చేతను, నానా విధ భోజ్య పదార్థముల చేతను తాంబూల ఛత్రచామర ధ్వజములచేతను, వీణా మృదంగ మనోహర వాద్యములచేతను భగవంతునికి ఉత్సవములు జరుపుచు నర్చించవలెను. వీలు ప్రకారము ఆలయ తటాక సరోవర తులసీవన మండపాదుల నిర్మాణములు గావింపవలయును. ఇవి యేమియు చేయ నశక్తులైనవారు కేవలము నిర్మల మనస్సుతో నర్చించనను చాలును.

**6. వందన భక్తి** : మానవులను వారి వారి యోగ్యతల ననుసరించి నిత్యము నమస్కరించుచుందుము. కాని గురువును భగవంతుని సకల దేవతామూర్తులను సాష్టాంగ ప్రణామములతో భక్తిని ప్రదర్శించుట విశిష్టాచారము.

శ్లో॥ శంకర శ్శేషశాయీ చ మార్తాండో మారుతీ స్తథాః ।
ఏతేషాం దర్శనం పుణ్యం నిత్యే నేమే విశేషతః ॥

అనగా మహాదేవ విష్ణు సూర్య హనుమద్దర్శనముచే సమస్త పాపములు నశించును భక్తి జ్ఞాన తాపస వేద విదుర సర్వజ్ఞ మహానుభావులగు వారి దర్శనము కలుగ గనే సాష్టాంగ ప్రణామము లాచరించుట ఉత్తముని లక్షణము. మరియు మనము నిత్యము ననేక దేవాలయములలో దేవతామూర్తులను గాంచి వందనము చేయుదుము. ఆ మూర్తుల కర్పించు వందనములన్నియు భగవంతుడగు కేశవునికే చెందును.

శ్లో॥ ఆకాశ త్పతితం తోయం యదా-గచ్ఛతి సాగరమ్
సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి ॥

అనగా ఆకాశమునుండి పడు జలమంతయు సాగరము చేరు మాదిరి సర్వ దేవతలకు నర్పించు వందనములు విష్ణువునకే చేరును. నమస్కారము వలన వికల్పములు నశించును. లీనత కల్గును. సజ్జన సాంగత్యము చేకూరును. పెద్దల కృప కల్గును. పాపము తొలగి క్షమ కర్హులమగుదుము. పవిత్రత కల్గి ముక్తి మార్గము లభించును. మరియు యీ నమస్కారమునకు చిల్లిగవ్వయు ఖర్చు చేయ నవసరము లే దుకదా!

☝ **7. దాస్య భక్తి :** భగవంతునికి వైభవముల నొనర్చుచు న్యూనతను వీడి భజన సమాజముల చేరి దాస్యము చేయవలయును. దేవాలయ మండపాదుల నుద్ధరించుట ధర్మశాలల నిర్వహణ, ఉత్సవములకు వలయు వస్తు వాహన సంపత్తి నొనగూర్చుట సమస్త దేవతా వస్తువుల, పురాతన వస్తువుల కాపాడుట మున్నగున వి. భగవంతుని సత్య దాస్యస్థితియని తెలియవలె ను. ఇందు యింకను ఉద్యానవనముల వేయించి కళలను పోషించవచ్చును. హరి నామ సంకీర్తన చేయుచు భగవంతునికి వలయు నెటువంటి నీచ సేవనైనను చేయ వెనుదీయరాదు. భగవంతుని ఆచమన స్నానాదులకు వలయు జలమును సేకరించి నానా విధ పరిమళ పుష్పములను సేకరించవలయును. మహదానందముతో భక్తి పరవశముచే బాడుట దేవతాస్థానముల కడిగి శుభ్రముచేయుట మున్నగు పనులు చేయవలెను.

**8. సఖ్య భక్తి :** భక్తి భావమున భజన ఆధ్యాత్మిక నిరూపణ భగవత్కథ అతని గుణకీర్తన ప్రేమతో భక్తితో గానము చేయుట పరమేశ్వరునకు సంతోషము కలుగజేయునవి గావున సఖ్యభక్తి యనబడును. పరమాత్ముని మైత్రి కావలెనన్న మన సమస్త సుఖములకు తిలోదకములు వదలి సఖ్యతచే ప్రాణమును శరీరమును భగవదర్పణ మొనర్పవలెను. ఇట్లు భక్తి పూర్వక ముగా సర్వము సమర్పించినచో భగవంతునితో మైత్రి కలుగుటలో నెటువంటి సందియము నుండదు. నిండు సభలో ద్రౌపదిని, లాక్షాగృహమున పాండవులను, మొసలి బారినుండి గజేంద్రుని కాపాడిన దీసఖ్య భక్తియని తెలియవలయును. మనము ధ్వని ఎంత పెద్దగా చేసిన ప్రతిధ్వనియు

నంతే శబ్దముతో వచ్చును. పరమాత్ముని పట్ల మనము అనన్యభావముతో నుండిన అతడును సమయమునకు ప్రసన్నుడగును. అతనిపై మనము విముఖత బూనిన నాతడును విముఖుడగును. ☝

శ్లో. యే యదా మాం ప్రపద్యంతే తాన్ తథైవ భజా మ్యహమ్.

కావున మనము అర్పించు తాళము చెవి మనవద్దనే యున్నది. భగవంతుని చెలికానిగా, తల్లిగా, తండ్రిగా, గురువుగా పరిపరి విధముల భావించి భక్తితో పూజించవలెను. ఈశ్వరుడు కృపాసాగరుడు. భక్తులపై ఆయనకున్న ప్రేమ అనంతమైనది. కావున సఖ్యత సంపాదించి యెన్నటికిని విడువరాదని పెద్దలునుడివిరి.

☝ **9. ఆత్మ నివేదన భక్తి** : భక్తుడు తనను తాను నివేదించుకొనుటయే యీ చివరి భక్తి. లక్షణుడై అలక్షణుడు, జ్ఞానియై అజ్ఞాని, భక్తుడై విభక్తుడు యగుట దీని లక్షణము. అంతఃకరణమున స్వయముగా తన నువెదకి, తత్వమును విచారించి 'నేను' అనునదేదియు లేదని తెలిసికొనుటయే ఆత్మనివేదనము. ప్రకృతి నియమానుసారము పంచతత్వాత్మిక శరీరము పంచతత్వములలో గలసిన మిగులున దేదో అదియే ''నేను'' ''ఆత్మ''అనిగ్రహించవలెను. తత్వ విచారమేనున పిండ బ్రహ్మాండములు కేవలము తత్వరచనమని తెలియును. వ్యక్తులందరి తత్వములు రచింపబడి విశ్వాకారమందు వ్యాప్తిచెందినవి. సాక్షిత్త్వముచే తత్త్వములు నిరసనమైతే ఆత్మానుభవమున సాక్షిత్వము మిగులదు. కావున ఆద్యంతములయందు గలది, ''ఆత్మ'' మాత్రమే. ''సోహం హంస'' నేను కేవల మాత్మనై యున్నాడను. 'ఆత్మ' నిర్గుణ నిరంజనమై నన్యత కలిగి యుండును. అన్యము లేదు. కావున ''నేను'' అను అన్య మెచటినుండి వచ్చినది. ఆత్మ అద్వైతము. దానికి ద్వైతాద్వైతములు లేవు. మరియు నది పూర్ణత్వముచే పరిపూర్ణమై గుణాగుణము లేమియు లేనిది. అట్టి నిర్గుణమందు 'నేను' అనున దెవ్వరు? ''త్వం'' పదము తత్పదము ''అసి'', పదముల భేదాభేదములు నిరసనమై ''తత్వమసి=అదినీవై యున్నావు''. అను మహా వాక్యానుసారము శుద్ధ బ్రహ్మము మిగిలి యుండును. కావున ''నేను'' అసత్యము, ఈశ్వరుడు సత్యము. పంచభూతములలో నాకాశము దేవతలలో జగత్పతి పరమాత్మ నెట్లు శ్రేష్ఠులో, భక్తిలో నీ చివరి ఆత్మ నివేదన భక్తిచే మానవుడు జనన మరణములు లేని పరమాత్మలో చేరి ముక్తి నందగలడు. ఇది ముఖ్యమైన భక్తి. దీనినే సాయుజ్యముక్తి అని చెప్పుదురు. నాలుగు ముక్తులలో సాలోక్యముక్తి (దేవునితో సమము) 2.సామీప్యముక్తి (దేవుని సమీపము) 3. సారూప్యముక్తి (దేవునితో సమాన రూపము) యీ మూటికిని నాశమున్నది. కాని సాయుజ్యముక్తి (దేవునిలో లీన ము) ఇది కల్పాంతరమునను

నాశము లేనిది. ఈ ఆత్మ నివేదనము పిదపటి వస్తువు నిర్మలమై అలిప్తమై సంపూర్ణ అఖండ శాశ్వత మగునని బోధ పరిచిరి.

వర్షము ఇంకను తగ్గకుండెను. అందుచే మాకు భోజనములు ప్లేట్లలో వడ్డించి తెచ్చి ఒక్కొక్కరికే అందించిరి. ఆ గదిలోనే అందరము భోజనములు ముగించుకొంటిమి. ఆ తదుపరి యెవరి స్థానములలో వారు పడుకొని గాఢనిద్రలో మునిగిపోయితిమి.

శ్లో॥ చన్ద్రోద్భాసితశేఖరే స్మరహరే గఙ్గాధరే శంకరే ।
సర్పై ర్భూషితకంఠ కర్ణ వివరే నేత్రోత్థవైశ్వానరే ।
దన్తిత్వక్కృతసున్దరాంబరధరే త్రైలోక్యసారే హరే ।
మోక్షార్థం కురు చిత్తవృత్తి మమలా మన్యైస్తు కిం కర్మభిః

శ్లో॥ కిం యానేన ధనేన వాజికరిభిః ప్రాప్తేన రాజ్యేన కిమ్ ।
కిం వా పుత్త్రకళత్రమిత్రపశుభి ర్దేహేన గేహేన కిమ్ ।
జ్ఞాత్వైతత్క్షణ భంగురం సపది రే త్యాజ్యం మనో దూరతః ।
స్వాత్మార్థం గురు వాక్యతో భజ భజ శ్రీపార్వతీ వల్లభమ్.



 ఉపనిషత్తుల సారు బ్రహ్మసూత్రములు 555, గీతా శ్లోకములు 700. (1) ఉపనిషత్తులు (2) బ్రహ్మసూత్రములు (3) గీత. ఈ మూడింటిని ప్రస్థాన త్రయమందురు. వీనిసారమే 18 పురాణములు (4 లక్షల) శ్లోకములు. 18 ఉప పురాణములు (లక్ష శ్లోకములు) భారతం లక్ష శ్లోకములు. భాగవతం 22వేల శ్లోకములు. మన వేదపురాణములలో వ్రాసినదే పలుచోట్ల వ్రాయుట జరిగినది. అందుబాటులో లేని విధముగా పెద్ద గ్రంధములైనవి.

 పంచమవేదము మహాభారతము. అందనేక రత్నములనున్నవి. గీతకు మాత భారతము. గీత అనగా త్యాగమని అర్థము. గీతయను రెండక్షరముల లోనే దాని సారమున్నది. ఒరులకు సర్వస్వము త్యాగముచేయుట కంటె మహద్భాగ్యము లేదు. గీతలో మొదటి శ్లోము ధర్మ అను అక్షరములతో ప్రారంభమగును.

# పదవ అధ్యాయం

## దారిలో గల దర్శనీయ స్థలములు

శ్లో॥ పౌరోహిత్యం రజనిచరితం గ్రామణిత్వం నియోగో।
మాతాపత్యం హ్యనృతవచనం సాక్షీవాదః పరాన్నమ్।
బ్రహ్మద్వేషః ఖలజనరతిః ప్రాణినాం నిర్దయత్వం।
మా భూ దేవం మమ పశుపతే జన్మ జన్మాన్తరేషు.

☝ **1. బైద్యనాథ్ లేక వైద్యనాథ్ :** ఇది బోగేశ్వర్‌కు ఇరవై కిలోమీటర్ల దూరములో నున్నది. పదవ శతాబ్దములో ''జోషిమఠ్'' నుండి కత్యూరిరాజులు ఇచటికి వచ్చి నివసించినట్లు చెప్పుదురు. ఇచట పన్నెండు పదమూడు శతాబ్దములకు చెందిన బమానిదేవ వైద్యనాథ్ కేదార్‌నాథ్ దేవాలయములతోపాటు పార్వతీదేవి విగ్రహము అతి సుందరముగాను బహు అరుదైన ఆకృతితోను వెలసియున్నది. ఇవికాక లక్ష్మీనారాయణ, సత్యనారాయణ, రక్షకదేవ్ మందిరములు అరుదైన శిల్పములు కూడ కలవు. ఇచటికి దగ్గరలో బ్రామరీదేవినాగ్‌నాథ్, ఆలయములు, రంచిత్‌కోట మరియు అత్యంత సుందరమైన 'కత్యూరి' లోయగూడనున్నది. అచటి నుండి నంద ప్రయాగ్‌ద్వారా బదరీనాథ్‌కు ఒక దారియున్నది. ఆ దారి లో ప్రకృతి శోభల నలరించు అత్యంత సుందర 'గౌహనా' సరస్సును చూడవచ్చును. అచటికి దగ్గరలో 'కాసాని' అనబడే చక్కని ప్రదేశము ఆరోగ్యరీత్యాను ప్రకృతిరీత్యాను కేంద్రముగా నుండి దూరములో కాన్పించు హిమశిఖర దృశ్యకేంద్రమైయున్నది. అచటనే మహాత్మా గాంధీగారు కొన్నాళ్ళుండి ''అనాసక్తయోగము' అను పుస్తకమును రచించినట్లు చెప్పుదురు. అచటికి దగ్గఱలో ఆలిండియా చేనేత పరిశ్రమ కేంద్రము కూడ చాల పెద్ద యెత్తున నడచుచున్నది.

2. జుల్‌జిబి: ఇది 'గౌరీగంగా' మరియు 'కాళిగంగా' సంగమములో నున్నది. దగ్గఱలోని మామిడి తోపులపైన 'మహాదేవ' మందిరము దాని కెదురుగా నొక ధర్మశాల ఆస్కోట మహారాణి గారిచే 1944లో నిర్మింపబడినది. అచటి నుండి సంగమ దృశ్యము అతి మనోహరముగా నుండను. ఒక వైపు నుండి సాగివచ్చు కాళిగంగా ఉరుకులు పరుగులు నురుగులతో చూడ ముచ్చటగా నుండును. అచటికి దగ్గరలో 'గోరీ' యను ప్రదేశములో వృశ్చిక సంక్రమణము (14వ నవంబర్) రోజున దాదాపు పదివేల మంది జనులు పాల్గొను పెద్దమేలా జరుగును. పూర్వము అచట కూడ మన భోటియాలు మరియు టిబెటనుల మధ్య గణనీయముగా వర్తక వ్యాపారములు జరుగు చుండెను. భోటియాలనగా హిందూక్షత్రియ సంస్కృతికి

చెందినవారు. వీరు యజ్ఞోపవీతము ధరింతురు. వీరి పేర్ల చివర 'సింగ్' అని యుండును. వీరి స్త్రీలు స్వేచ్ఛకలిగియుండి అనేక వెండియాభరణములు ధరింతురు. వీరికి నృత్యముపై చాలామోజు. వీరు హిమాలయ సరిహద్దు ప్రాంతాలగు 'మానాపాస్' 'నితిపాస్', నేపాల్, భూటాన్, సరిహద్దులలో నివసింతురు.

**3. శ్రీ నారాయణాశ్రమము** : ఇది కైలాష్ వెళ్ళుదారిలో గల ఒక దర్శనీయస్థలము. దీనిని గురించి మా ప్రయాణ సంద ర్భములో వివరముగా తెలియజేయబడినది.

**4. మరణ గుహ:** 17 కిలోమీటర్ల దూరములో ''ఖారుద్వార్'' అనబడే ఇరవై నాల్గు అడుగుల పొడవు ఆరడుగుల వెడల్పు తొమ్మిదడుగుల ముఖద్వారము కలిగి లోపల 6 అడుగుల ఎత్తుకల్గిన ఒక గుహకలదు. అందులోకి ఏ ప్రాణి వెళ్ళినను మరణించునని ప్రతీతి కలదు. ప్రజలు అది తెలుసుకొనుటకు గొఱ్ఱెలను, త్రాళ్ళచే బంధించి ఒక చివర చేతయుంచుకొని వానిని లోనికి పంపిరి. అవి చనిపోయెను. అట్లే పక్షులు కూడ చనిపోయినవి. పూర్వము మనుష్యులు కూడ చనిపోయినట్లుగా చెప్పుదురు. కాని శ్రీ ప్రణవానందస్వామి అచటి గ్రామస్తుల సహాయముతో నడుమునకు త్రాడు కట్టించుకొని మూడు తడవలు లోనికివెళ్ళి తిరిగివచ్చిరి. వర్షాకాలములో గుహలోనికి నీరువచ్చుట వలన దాదాపు నాలుగడుగుల ఎత్తువరకు బొగ్గుపులుసు వాయువు నిండుకొని లోన ఊపిరాడనందున అట్లు జరిగినట్లు ఆయన వివరించియున్నారు. అయినను ఆ గుహలోనికి ఎవరును వెళ్ళుటకు సాహసించరు.

**5. పాటలాభువనేశ్వర్** : ఇది ''గంగోలీహట్ '' నుండి పదకొండు కిలోమీటర్ల దూరములో గలదు. అచట చాలపురాతనమైన మూడు మందిరములు గలవు. అచటికి దగ్గరలో ఒక విచిత్రమైన గుహకలదు. లోనికి బోవుటకు 'టార్చి' సహాయముతో కూర్చొని పడుకొని ప్రాకుచూ వెళ్ళుదురు. గుహలో కొన్ని నగిషీలు మహాభారతమును గురించి తెలియజేయు శిలాశాసనములున్నవి. ఆ గుహ పై భాగమునుండి నీటి చుక్కలు కాల్షియం కార్బనేటు మొదలగు ధాతువులచే మిశ్రితమై క్రిందకు రాలుచుండును. ఆది భూగర్భ శాస్త్రజ్ఞులకు కుతూహలము కలిగించు విషయము.

**6. భేరినాగ్** : పాటలా భువనేశ్వర్‌కు పద్దెనిమిది కిలోమీటర్ల దూరములో నున్న ఈ ప్రదేశమును ''వేణీనాగులకు'' జన్మస్థానముగా చెప్పుదురు. అచటికి దగ్గరలోనే పింగళినాగ్, ముల్‌నాగ్, ఫణినాగ్, ధోళ్‌నాగ్, వాసుకీనాగ్, కాల్‌నాగ్ అను పలురకములైన నాగుపాములకు కేంద్రమైన ''రమానికద్వీప'' మనే స్థలము ఉండెనని చెప్పుదురు.

బౌద్ధమతగ్రంథములలో నీ సంతతి యొక్క ప్రసక్తి కనపడును. ''మిళిందపన్హా'' లో గల ''మిళిందిని'' గురువు నాగశేనుడు నాగజాతి రాజుగను బుద్ధుని శిష్యులలో నాతడు ముఖ్యుడుగను పరిగణింపబడుచుండె ను. హిమాలయ ప్రదేశములో ఈ నాటికిని ఈ నాగజాతి తెగలు 'నాగాలాండు'లో నివసించుట ఎల్లరకును విశదమేకదా? అచటికి ఏడుకిలోమీటర్ల దూరములో పర్వతాగ్రముపై నొక భద్రకాళి ఆలయము కలదు. అచటనే ఒక సొరంగము ద్వారా భద్రావతియను నది వెలువడి ఎంతో రమణీయముగ కనిపించును. ఆ ప్రాంతములోనే ''శాండిల్యమహర్షి'' తపమొనరించి నట్లుగా పురాణగాథలు కలవు.

**7. భాగేశ్వర్ :** ఈ గ్రామము 'సరయూ' మరియు 'గౌమతి' నదుల సంగమములో నున్నది. ఆ సంగమమువద్ద భాగ్‌నాథ్, దత్తాత్రేయ, భైరవనాథ్, గంగాజీ మొదలగు మందిరములున్నవి. 'సరయూ' నది కిరువైపులా గ్రామపు బజారులున్నవి. ఆ నదిపైగల ఊయల వంతెనకు దగ్గరలోగల ఒక పెద్ద బండరాతిని 'మార్కండేయశిల' అని అందురు. అచటనే మహర్షి మార్కండేయుడు తపమొనరించినట్లు తన 'దుర్గాసప్తశతి' ని రచించినట్లు తెలియుచున్నది. మరియు శివుడు హిమవత్ కుమారి పార్వతీదే విని అచటనే వివాహమాడినట్లు ప్రతీతికలదు. అందుచే అచ్చట ప్రతి మకర సంక్రమణమున పెద్ద ఉత్సవము జరుగును. క్రీ. శ. 1962 పూర్వము టిబెట్ దేశీయులు లామాలు పెద్ద సంఖ్యలో వచ్చే వారని ప్రతియేట అచ్చట వేలాది సంఖ్యలో వర్తకవ్యాపారములు కూడ జరుగుచుండెడివని చెప్పుదురు.

**8. గంగోలిహాట్ :** ఇది ఒక పెద్ద గ్రామము. అచట ఎన్నోమందిరములు ఒకేవీధిలో నున్నవి. పెద్ద పెద్ద దేవదారువృక్షముల మధ్యన 'మహాకాళీ' మందిరము కూడ కలదు. అచట దుర్గాష్టమి రోజున ''మేలా'' జరుగును. అచటినుండి ఒకదారి ''పిథోరాగడ్'' వరకు పోవునని తెలిసినది.

**9. పిథోరాఘడ్ :** ఇది ఉత్తరప్రదేశ్ రాష్ట్రములోని ఒక జిల్లా కేంద్రము. 'దార్చులా' వెళ్ళుదారిలో నున్నది. అది 'సోర్' యనే లోయ వద్ద ఎత్తైన ప్రదేశమునగల పట్టణము. అది వేసవి కేంద్రముగా కూడ ఉపయోగపడును. ఇచట గల ప్రభుత్వ కార్యాలయములతోపాటు పరిశ్రమలు ఆసుపత్రి కాలేజీ పెద్ద పోస్టాఫీసు, ఒక పురాతనకోట, హోటళ్ళు, అంగళ్ళు కలవు. చాల ఎత్తు ప్రదేశములో చక్కని వసతి గృహము ప్రక్కనే 'దేవి' మందిరము ఒక స్తూపము కలవు. అది వీరులకు జన్మభూమి ఈ పట్టణము రవాణా కేంద్రము. అనేక బస్సులు అచట నుండి ప్రతిరోజూ బయలుదేరుట పర్వతములపై పయనించుట అచటికి చేరుట విశేషము. అది

చూచుటకు మనోహరమైనది, మరియు ఆహ్లాదము కలిగించుటలో ఏమాత్రముతీసిపోని దర్శనీయ స్థలము. ఆ ప్రదేశములో వరిపంట కూడ పండింతురు.

**10. జాగేశ్వర్ :** ఇది సుందరమైన లోయగల దేవదారు వృక్ష సముదాయము మధ్య నున్నది. కొందరు దీనిని మన దేశములోని పన్నెండు జ్యోతిర్లింగములలో నొకటిగా భావింతురు. అచట బాల జాగేశ్వర్, మృత్యుంజయ, పుష్టిదేవి, నవగ్రహ, సూర్య మందిరములే కాక కొన్ని శిధిలావస్థలో నున్న మందిరములు గలవు. అచట కొన్ని గృహములు దగ్గరలో నొక చిన్న నదియు గలవు. ఆ స్థలమును చాల పురాతనమైనదిగాను ధార్మిక పుణ్యక్షేత్రము గాను భావింతురు. దీనికి 2 కిలోమీటర్ల పైన 'వృద్ధ జ్ఞానేశ్వర్' మందిర మున్నది. అచట మహాశివరాత్రి పర్వకాలమున ఉత్సవము జరుగును. అది అందమైన దర్శనీయ క్షేత్రముగా చెప్పబడును.

ఆ సంగమమునకు మూడు కిలోమీటర్ల దిగువన 'కాళిగంగా'కు కుడి ఒడ్డున 'హంసేశ్వరమహాదేవి' ఆలయము కలదు. అందులో ఒక యోగి నూటముప్పది సంవత్సరములు బ్రతికి 1945లో చనిపోయినట్లుగా చెప్పుదురు.

**11. చిప్లాకోట్ సరోవరములు :** ధార్చులా నుండి ఎనిమిది కిలోమీటర్ల దూరములో 'జుమ్మా' అనే గ్రామము నుండి ముప్పైనాలుగు కిలోమీటర్ల దూరములో 14,000 అడుగుల ఎత్తున ''పంచ్‌ఛూళి'' అను మంచు శిఖర సముదాయము నేత్రపర్వముగా కన్పించును. కాని ఈ దారి నిటారుగా పైకి ఎక్కవలసినదిగా వుండుటచే చాల ప్రమాదభరితమైనది. అచట 'కక్రోలాఖిద్' అను సరస్సు 1020 అడుగుల చుట్టుకొలత కలిగి ఎంతో లోతుగనున్నది. మరొక చిన్న సరస్సు 840 అడుగుల చుట్టుకొలత కలిగియున్నది. ఇవి వేసవిలో ఎండి పోవును. ఆ సరస్సులో దేవతలుందరని భావించి యాత్రికులు నాణెములను నీటిలో వేయుదురు. సరస్సు ఎండినపుడు ఆ నాణెములు కనిపించినను ఎవరును వాటిని ముట్టుకొనరు. వర్షాకాలమున ఆ సరస్సులో ఎర్రని బ్రహ్మకమలములు అనేకముగా పుష్పించి సువాసనలు వెదజల్లుచు మనోహరముగా నుండును.

ఈ పై తెలిపిన స్థలములు క్షేత్రములు మా ప్రయాణపు దారిలోను దారికికొంత దూరములోను వెలసియున్నవి. అందుచే వానిని గూర్చి ఇచట ప్రత్యేకముగ తెలియబరచుట జరిగినది. ఇవికాక హిమాలయములలో చూడవలసిన స్థలములు క్షేత్రములు అనేకములున్నవి. వాటి నన్నిటి గురించి ఇచట తెలియజేయుటగాని వివరించుటగాని సాధ్యపడదు. నాదృష్టికి వచ్చినంతలో వీని పేర్లు ఆయా సందర్భములలో పేర్కొనబడినవి. కాగా ఆయా ప్రదేశములన్నిటి గూర్చి వింతవింత స్థలపురాణములు కూడ వ్యాప్తమైయున్నవి.

హిమాచల ప్రాంతంలో అనేక విధములైన దేవతలు ఆరాధింపబడుచున్నారు. ఆయా దేవతలకు వలయు మడిమాన్యములు అచటిరాజులు కేటాయించి ఉన్నందున ఆరాధనలు ఉత్సవములు తిరునాళ్ళు కడువైభవముగా జరుగుచుండును.

వైదిక దేవతలు : వైదిక దేవతలలో పృధ్విపై నెలకొనియుండు అగ్నిదేవునకు పూజలు జరుగును. భూమికి ఆకాశములకు మధ్యగల అంతరాళములో ఇంద్రుడు నివసించునని వీరు విశ్వసింతురు. ఇవికాక ఆకాశదేవతగా సూర్యుని ఆరాధన ప్రాధాన్యత కలిగియున్నది. ఆయా దేవతల ఆరాధనలలో వీరు పాలతోపాటు మద్య మాంసములు కూడ నివేదించుట ఆచారమై యున్నది.

పౌరాణిక దేవతలు : ఇచటి పౌరాణిక దేవతలలో బుద్ధుని ఆలయములు విష్ణు ఆలయములు బ్రహ్మ ఆలయములు కూడ కలవు. వీనిలో 'భర్మోర్' లేక బ్రహ్మపురి క్షేత్రమునగల 'బ్రహ్మాలయము' ముఖ్యమైనది. ఇచట పౌరాణిక దేవతలతో పాటు సూర్యోపాసన కూడ జరుగును. ఇచట ''సుందరనగరము'' అను ప్రదేశమున సూర్యకుండమున సూర్యునిపూజ విశేషముగా జరుగును. 'నీరథ్' అనుచోట కూడ సూర్యపూజ విరివిగా జరుపబడును.

ఇచట ఆర్యదేవతలను శుక్ల పక్షములోను అనార్య దేవతలను కృష్ణ పక్షములోను ఆరాధించుట ఒక ప్రత్యేకత.

ఇచట అనేక సరోవరములను కూడ పూజించుట ప్రదక్షిణలు జరుపుట ఆచారమై యున్నది. మరియు పర్వత శిఖరము నారాధించి ప్రదక్షిణలు జరుపుట కూడ ఆచారమై యున్నది. నదులను పూజించి జంతుబలులను ఇచ్చుట మరొక ఆచారము. 'సిర్మోక్' అను ప్రదేశమున గల రేణుకాకుండములో కార్తీక శుద్ధ దశమిరోజు పెద్ద తిరుణాళ్ళు జరుగును. ఆసమయమున భక్తులెల్లరు స్నానములు చేయుదురు. 'మండి' యను ప్రదేశమున గల పరాశర కుండము 'కిన్నౌర్' లోని కైలాస కుండము మున్నగు సరస్సుల నాశ్రయించి పెద్ద సంఖ్యలో తిరునాళ్ళ జరుగుచుండును.

'హిమాచల్' కులులోయలోని 'హళాణ' గ్రామమున 'వాసుకి' నాగ దేవత యొక్క మందిరము గలకు. చంబా జిల్లాలోని 'కాలు నాగ్', 'మహల్ నాగ్', 'దైనంగ్ నాగ్', 'ముథల్ నాగ్','బీరూ నాగ్' అను దేవతల నారాధింతురు. పౌరాణికములలో మాత్రము 'తక్షకి నాగ్' వాసుకి నాగ్, వజ్రభంగ్ నాగ్, కర్కోటక నాగ్, కుళీక్ నాగ్, శంఖు నాగ్ మరియు కాళి నాగ్ అను సప్త నామములు గలవు.

ఈ ప్రాంతమున మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, పరశురామ, శ్రీరామ, కృష్ణ, బుద్ధ, కలికి యవతారములకు చెందిన సమస్త దేవాలయములు గలవు. స్థానిక భాషలో లక్ష్మీనారాయణులకు ''హురంగు నారాయణ్'', ''కిసంగీ నారాయణ్'', ''బీధి నారాయణ్'', ''పరామంగ్ నారాయణ్'', ''ఫలాణి నారాయణ్'',

''సృష్టి నారాయణ్'', ''బదరీ నారాయణ్'' అను పేర్లు ఆయా పరిసరముల గ్రామముల నామములతో నేర్పడి యుండవచ్చును.

ఆ ప్రాంతములో శివ శక్తి స్థానములలో జంతు బలులిచ్చు ఆచారమున్నను వైష్ణవాలయములలో నివి నిషేధింపబడినవి. అచటి దేవతా మూర్తులలో మహిషాసురమర్దని బహుళ వ్యాప్తి కల్గియున్నది. చాముండేశ్వరి జ్వాలాముఖి, భవాని గౌరి, భగవతి, వజ్రేశ్వరి, జగదంబ, మహామాయ, మున్నగు పేర్లతో ననేక దేవాలయములున్నవి. అచటి 'కాంగ్డా'యను ప్రదేశమున గల జ్వాలాముఖి మందిరమున నిరంతరము జ్వాలలు భూమి నుండి ప్రజ్వరిల్లు చుండును. మరియు ప్రతి సంవత్సరము నిచట జరుగు మేలాలో లక్షలాది ప్రజలు పాల్గొను చుందురు.

బౌద్ధశక్తి యగు తార పేరిట ''డోమ్లా అవలోకితేశ్వర్'' అను మందిరము ''లాహౌస్పితి'' యను చోట గలదు. ఆ ప్రదేశమును బౌద్ధులు, హిందువులును కూడ దర్శింతురు. ఇవిగాక ప్రతి గ్రామముల గ్రామ దేవతల పేరిట ఆరాధనలు జరుగుచుండును.

హిమాలయ ప్రాంతమున దేవతలేగాక మహర్షుల మందరిములు కూడ కలవు. వానిలో పరాశర, మార్కండేయ, వ్యాస, వాశిష్ఠ, లోమశ, మున్నగు మందిరములు మరియు వారి 'మేలా'లు జరుగుచుండును. లక్షణయతిని ముస్లిములు పదునొకండవ ''పీరు''గాభావించి ఆరాధనలు చేయుదురు. దీనిని ''లఖ్‌దాతా'' యని యందురు. ఈ విధముగా హిమాచల ప్రదేశములో నేటికిని దైవారాధన బహుళ వ్యాప్తిలో యుండుట గమనార్హము.

శ్లో॥ ధనేనకి యన్నదదాతి నాశ్నుతే
బలేనకింయేనరిపూం న బాధతే
శృతేన కింయేన నధర్మ మాచరేత్
కి మాత్మనా యేనసు క్షేత్రాని దర్శయేత్

దీనులకు దానము చేయని ధనము, శతృవుల జయింపని బలము, ధర్మచింతన లేని విద్య, సుక్షేత్రముల దర్శింప జాలని జీవితము, అన్నియు వృథాయేనని భావము. అందుచే వీలైనన్ని పుణ్యక్షేత్రాల దర్శించి తరించాలని భావము.

శ్లో॥ ఆయుర్నశ్యతి పశ్యతాం ప్రతిదినం యాతి క్షయం యౌవనం।
ప్రత్యాయాన్తి గతాః పున ర్న దివసాః కాలో జగద్భక్షకః।
లక్ష్మీ స్తోయ తరఙ్గ భఙ్గచపలా విద్యుచ్చలం జీవితం।
తస్మాన్మాం శరణాగతం కరుణయా త్వం రక్ష రక్షాఽధునా
(ఇతి శ్రీమచ్ఛంకర భగత్పాదకృతం శివాపరాధక్షమాపణ స్తోత్రమ్)

# పదకొండవ అధ్యాయం

## ఛయలెక్ టాప్ ద్వారా గుంజి

శ్లో. శాంతాకారం భుజగశయనం పద్మనాభం సురేశం
విశ్వాధారం గగనసదృశం మేఘవర్ణం శుభాంగమ్
లక్ష్మీ కాంతం కమలనయనం యోగిహృద్ధ్యానగమ్యం
వందే విష్ణుం భవభయహరం సర్వలోకైకనాథమ్
వనమాలీ గదీ శార్ఙ్గీ శంఖీ చక్రీ చ నందకీ
శ్రీమాన్ నారాయణో విష్ణు ర్వాసుదేవోఽభిరక్షతు.

(ఇతి విష్ణుస్తుతిః)

రాత్రి మా భోజనముల తదుపరి వర్షము బాగుగా కురిసినది. 26-7-1983 ఉదయము యధాప్రకారము పూజాఫలహారములుగావించి ఆరుగంటలకే ప్రయాణమైతిమి. వర్షపు తుంపరలు ఇంకను పడుచునేయున్నవి. అయినను మా ప్రయాణము మానలేముకదా? నీటికి తడవని పొడి బట్టలువేసుకొని కఱ్ఱచేతపట్టి ప్రయాణము సాగించుచుంటిమి. ఆ రోజు దాదాపు మూడు కిలోమీటర్లు మరల నిటారుగా పర్వతము నధిరోహించవలసి యుండెను. వాతావరణము ఎంతో చల్లగానుండెను. చుట్టునూ క్రమ్మిన మబ్బులవలన చీకట్లు అలముకొనెను. 5 గజముల దూరములోగల నే వస్తువును కనబడుటలేదు. ఒక కిలోమీటరుపైన 'బుద్ధిగడ్' గ్రామముండుటచే తిన్నగా కొంతదూరము పోయితిని. ఆదారి గ్రామమునకు పోవుచున్నది. మా తోడివారు కొందరు ముందువెళ్ళిరిగాని వారు మాకు కన్పించుటలేదు. నాకు గ్రామస్థుడెవడో కలిసి దారి అటుకాదని చెప్పెను. అందుచే నేను వెనుదిరిగి 100 గజములు పోయి ప్రక్కకు ఎక్కి మెట్లను చేరితిని. ఆ దారి కూడ ఏమాత్రము బాగుగాలేదు. అంత చలియున్నను 15 నిమిషములు నడచుసరికి వేడిపుట్టెను. మొదటిరోజు ప్రయాణము జ్ఞప్తికి వచ్చుచుండెను. మధ్యలో కూర్చుండుటకు త్రోవ అంతయు తడిగాయుండెను.

ఆ రోజుకూడ మాలోని పెద్దలు గుఱ్ఱములను కట్టించుకొనిరి. కాని ప్రయాణము మాత్రము నడచి చేయుచుండిరి. నేను శ్రీ చొక్కారావు ఉపాధ్యాయ మున్నగువారిని చేరితిని. మేము మెల్ల మెల్లగా ఎక్కుచు ఆగుచు నడక సాగించితిమి. ఆ రోజు మబ్బులవలన ప్రకృతి దృశ్యములేవియు సరిగా కన్పించలేదు. మా దారిని మాత్రమే చూచుచు మాట్లాడుకొనుచు మెట్లెక్కు చుంటిమి. ఆ మూడు కిలోమీటర్ల ప్రయాణమును పూర్తిచేసి పూర్తిగా పైకెక్కి ఒక సన్నని దారిగుండా మైదానమునకు

3,360 మీటర్ల ఎత్తు చేరువరకు మూడు గంటలు పట్టి ఉదయము తొమ్మిది గంటలాయెను. దానిని ''ఛయలేక్ టాప్'' అందురు.

ఆ మెట్ల చివరభాగమున ఒక చెట్టుకు కట్టిన ధ్వజములు (గుడ్డపీలికలు) మరి యొక రాళ్ళకుప్ప కనిపించెను. మేము విశాలమైన మైదానము చేరితిమి. ఎడమప్రక్క ఎత్తుపర్వతముపై మిలటరీక్యాంపు ఉన్నట్లుగా గమనించితిమి. కుడిప్రక్కన యొక 'హెలిపాడ్' కన్పించెను. అప్పటికి వర్షము తగ్గిపోయి మబ్బులమాటున సూర్యుడు దోబూచులాడుచుండెను. అచట ఎటుచూచినను చిన్నచిన్నపొదలు పొదలనిండుగా రంగురంగుల పూలు దూరాన పెద్ద వృక్షములు ఆపైన నదులు, నదుల వెనుక కొండలు అగుపించు చుండెను. మాతోడివారు వేచియున్న గుర్రముల నధిరోహించి ముందుకు ప్రయాణమైరి. నేను ఫోటోలు తీసితిని. వెనుక నేను అగరువాలు కిషోర్ మున్నగువారము నడచుచుంటిమి. ఆ దారి బాగుగానున్నది. మెట్లులేవు ఎక్కుడులేదు. దాదాపుగ ముందుకు వెళ్ళుకొలది క్రిందికి దిగుడుగా నుండుటచే అడుగులు త్వరత్వరగా పడుచుండెను.

ఒక కిలోమీటరు ముందుకు వెళ్ళుటతోడనే పాదములు జారుట మొదలిడెను. అందుచే వేగమును తగ్గించి ఎంతో జాగరూకతతో నడువవలసి వచ్చెను. అట్లు కొంత ముందుకు సాగి ఒక కర్రవంతెనకు క్రిందగల చిన్ననదిని దాటితిమి. కాని ప్రక్కనే చాల ఎత్తువరకు మంచు గడ్డకట్టియుండి వంతెనకు 10 గజముల దూరమునే మంచు క్రిందుగా నీటిప్రవాహము వచ్చుచుండెను. దృష్టి సారునంతవరకు ఆ మంచు ఒక లోయలో నిండుగా కన్పించుచుండెను. రెండు ప్రక్కలకు చెట్లు పర్వతములు కలవు. ఆ చిన్ననది కొంత కుడిదిక్కుగా పోయి అప్పుడే ప్రత్యక్షమయిన కాళిగంగాలో పడుచుండెను. ఆ కాళిగంగా మేము ఎక్కిన పర్వతమును కుడివైపున చాలదూరముగ ప్రదక్షిణము చేసి మరల మా దారికి చేరుకొనుచుండెను. దాని ఫోటోలు కొన్ని తీసికొంటిమి.

ఆ ప్రకృతిమయ మగు పూవనములో ముందుకు రెండు కిలోమీటర్లు సాగగా ప్రక్కనే ఒక పురాతన శివాలయము దాని ముందు గంటలు ఆలయములో నొక శివలింగము నుండెను. మేము వాటిని దర్శించుకొని మరల త్రోవకు రాగా అచటనుండి మెట్లును మరియు దిగుడుదారి ఉన్నది. ఎదురుగా ఒక గ్రామము. గ్రామము ప్రక్కనుండే చాల దూరము వరకు మెలికలు తిరుగుచు కాళిగంగా రెండు వైపుల పర్వతశ్రేణులు, ఆ పైన మంచు శిఖరములు గల ఆ అత్యంత రమణీయ దృశ్యమును మా కెమేరాలో బంధించకుండ ఉండగలమా? కొన్ని మెట్లు దిగినతదుపరి మరొక లోయ, దాటితిమి. తదుపరి మామూలు దారిలో దిగుట పాదములు జారుట

రాత్రి వర్షము కారణముగా మరింత ఎక్కువయ్యేను. ప్రక్కన గల రాళ్ళకు బూట్ల కంటిన బురదను రాచుచు చేతికర్రను అవుసరానికి మించి ఉపయోగించుచు దాదాపు రెండు కిలోమీటర్లు అతి నెమ్మదిగా ప్రయాణము చేసితిమి. పిదప 12 గంటలకు ''గార్బ్యాంగ్''''లేక''''దార్బ్యాంగ్'' గ్రామము చేరితిమి. అచటనే ముందు వెళ్ళిన వారు టీలు త్రాగుచు హోటలులో కూర్చుండిరి. గ్రామ వీధులన్నియు బురద మయముగ నున్నవి.

ఆ ''గార్బ్యాంగ్'' గ్రామము ఒక పర్వతమును అనుకొని యున్నది. దానిని ''పాతుకపోతున్న'' గ్రామము అంటారు. 50 సంవత్సరముల పూర్వము దాదాపు 2000 జనాభా కలిగిన ఈ గ్రామము నేడు 500 జనాభా మాత్రమే కలిగియున్నది. అచట ప్రాధమిక ఆరోగ్య కేంద్రము, మాధ్యమిక పాఠశాల, పోస్టాఫీసు, మున్నగునవి యున్నవి. అచట కర్రతో చేయబడిన రెండు మూడు అంతస్థుల భవనములున్నవి. క్రిందభాగము పశువులకు పై భాగము మనుష్యులకు నివాసముగా ఉపయోగింతురు. వీనిలో కొన్నిభవనములు భూమిలోనికి పాతుకొని పోయి యుండుటయు కన్పించినవి. అచటి మట్టి పసుపువర్ణము కలిగియున్నది. బంకమన్నువలె జారుచున్నది. పూర్వము మనదేశపు చివరిగ్రామము అదే. పూర్వమిదియొక వ్యాపార కేంద్రము. టిబెట్టు దేశీయులు నేపాలీయులు మనదేశీయులును అచట పెద్ద ఎత్తున వర్తకము చేయుచుండిరి. ఉప్పు ఉన్ని తినుబండారములు మున్నగు వాని క్రయవిక్రయములు హెచ్చుగా జరుగుచుండెనట.

మా మిత్రులు కొందరు ముందుకు బయలు దేరిరి. నేను గుర్రముపై పయనించువారు టీ తాగిన తరువాత కొంతసేపు విశ్రమించితిమి. తదుపరి అందరము బయలుదేరితిమి. త్రోవ జారుడుగాను జిగురుగానున్నందున గుర్రములవారు కూడ నడచుచుండిరి. నేను కొంత ముందుగా నడచుచుంటిని. నా ఆలోచన ఎదుటి ప్రకృతి దృశ్యములపై నుండెను. మాకు కుడివైపున ఒక చిన్న రేకుల గోదాము భూమిలో సగము వరకు పాతుకునిపోయి ఒక ప్రక్క సగమువరకు మట్టి దిబ్బతో కన్పించెను. అచట ఎల్లపుడు పై నుండి మట్టి వర్షపునీటితో జారుచుండెను. దానికి క్రిందనే కాళిగంగా చాల వెడల్పుగా ప్రవహించుచూ మాదారికి ఎదురువచ్చుచున్నది. నేను కొంత ముందుకు దిగుచుంటిని. మెట్లు లేవు. కాలినడకతో మట్టిపైనే దారి. నా ధ్యాస ఎదుటి దృశ్యములపై నుండుటచే కుడికాలు జారినది. సర్దుకొనబోగా చేతి కర్ర రెండు కాళ్ళ మధ్యన తట్టినది. వెల్లకిలా పడిపోయినాను. అదృష్టవశాత్తు ఎటువంటి గాయములు కాలేదు. బ్యాట్మెంటన్ ఆట వలన లోగా నాకు వుండి తగ్గిపోయిన జబ్బ నొప్పి, మరల అధికమాయెను. వెంటనే లేచితిని. నా బట్టలన్నియు

బురదమయమైనవి. వెనుకవారు చూచిరేమోయని అనుమానించి బురద దులుపుకొని ముందునకు నడచితిని. అట్లు ఒక కిలోమీటరు దూరము పోగా కుడి నుండి ఒక పెద్దనది వచ్చి కాళిగంగాలో కలియుచున్నది. ఆ నది ఎదురుగా చాలా ఎత్తుపై కనుపించు నేపాలు పర్వత మంచు శిఖరములు ''టింకర్‌పాస్'' నుండి వచ్చుచున్నది. ఆ సంగమము వద్ద ఒక కొయ్యవంతెన కలదు. ఈ వంతెనకు ఆవల నేపాలు గ్రామములు, ఒక వ్యాసమందిరము ఉన్నది. కాలాతీతమగుటచే మేము ఆ మందిరమును దర్శించుకొనలేదు. ఆ వంతెన వద్ద ఎల్లప్పుడూ కాపలాభటుడు యుండును. నేపాలీయులు అనుమతి పొంది మన భూభాగమునకు వచ్చెదరు. మా ప్రయాణము దాదాపుగ కాళిగంగా ఒడ్డుపై నుండే సాగుచుండెను. ఒక్కొక్కచోట ఎడమవైపున గల పర్వతము మెట్లక్రిందివరకు కాళిగంగా ప్రవాహము చొచ్చుకొని వచ్చుటచే చెక్కవంతెనలు ఏర్పరచుటచే దాని పైనుండి దాటితిమి. మరల కొంత దూరము ఎక్కుచు దిగుచు ఆయాసపడుచు మధ్య మధ్యన ఆగుచు దృశ్యముల చూచుచు ప్రయాణము సాగించితిమి. ఎడమవైపు పర్వతములపై నుండి జారిన మట్టి కుప్పలు ఒకచోట నదిలోపలి వరకు పడియుండెను. అచట మా దారివెంటగల హిమాలయ పర్వతములను పర్వతములుగా పిలువక మట్టిదిబ్బలుగా పిలిచిన సరిపోవును. మరియు కాళిగంగా యొక్క మురికి నలుపునకు కూడ నిదే కారణమైయుండును. ఇట్లు చిన్న చిన్న నదులను దాటుచు మరి కొంత ముందుకు సాగితిమి. వెనుక వచ్చుచున్న కులకర్ణిగారు ఒకచోట జారిపడిరి. ఆ తరువాత మరికొంత దూరము పోగా అగర్వాలుగారు కాలు జారిపడిరి. వారి బట్టలు కూడ బురదమయమయ్యెను. ఎవరికిని దెబ్బలు తగులకపోవుట అదృష్ట విశేషమే!

ఇట్లు 6 కిలోమీటర్లు నడచు సరికి మధ్యాహ్నము 2½ గంటలయ్యెను. శరీరములో సత్తువ నశించెను. ఇంక ఏ మాత్రము ముందుకు నడువలేకపోయితిమి. ఒకచోట సెలయేటి ఒడ్డున విశ్రమించి ఫలహారములు భుజించితిని. మరల లేచి నెమ్మదిగా నడక సాగించితిమి. ఎదురుగా మా విశ్రాంతి భవనము కన్పించెను. కాళిగంగా కుడివైపుకు తిరిగెను. చాలా విశాలముగ నుండెను. కాని నీరు తక్కువగా నుండెను. మా ఎదురుగ దారి వెంబడే మరొక నది ''కుట్టి'' యను పేరు గలది ఉన్నది. దానిలో నీటి ప్రవాహము చాలా హెచ్చుగానున్నది. ఈ సంగమమునకు కొంత ముందుగా ఒక పెద్ద చెక్క వంతెన యున్నది. కాని ఇది ఒక ప్రక్కన గల, కఱ్ఱ విరిగియుండుటచే అచట దాట వీలు పడలేదు. ఆపైన దూరానగల ఒక గ్రామము ''గుంజి'' కాన్పించెను. ఈ వంతెనను దాటితే అర కిలోమీటరులోనున్న మా బస. ఈ చుట్టు తిరుగుట వలన ఇంకను మూడు కిలోమీటర్లు నడువవలసియుండెను. ఈ వంతెనను చూచి మాకు గోరు చుట్టుపై రోకలిపోటు

అన్నట్లు ప్రాణాలు పైపైకి లేచి పోయినను ఆ రోజు 18 కిలోమీటర్ల ప్రయాణంలో ఇంతవరకు నడచినది ఒక యెత్తు ఆ మూడు కిలోమీటర్లు సాగుట మరొక ఎత్తుగా తోచినది. అందుకు కారణము మా విపరీతమైన బడలికయే. ఇట్లే చాల నెమ్మదిగ ఒక గంటవరకు ''గుంజి'' గ్రామము బయట గల పెద్ద వంతెనచే క్రిందుగల 'కుట్టి' నదిని దాటితిమి. అచట గ్రామము అర కిలోమీటరు దూరమున్ననూ చాలా పైకెక్కుట యుండుటచే కాళ్ళు లాగుచుండెను. ఎట్లో మొత్తానికి గ్రామములో చేరి చిన్న సన్నని వీధి గుండా గ్రామము బయటపడి నెమ్మదిగా నాలుగు గంటల వరకు మిడిల్ స్కూలును దాటి మా క్యాంపునకు చేరితిమి. ముందు బురదబట్టలు మార్చుకొని కాళ్ళూ చేతులు కడుగుకొని శ్రీమతి రశ్మి వడ్డించగా భోజనము చేసి విశ్రమించితిమి.

సాయంత్రము డాక్టరు పరీక్ష ముగించిన తదుపరి కొందరు ఒక కిలోమీటరులో గల వ్యాస మందిరమునకు పోయిరి. కాని నేను నడువలేక పోలేక పోయితిని. మనదేశపు చివర పోస్టు గల గ్రామము అదేనని చెప్పినందున నేనునూ మరికొందరు మా మా గ్రామాలకు ఉత్తరములు వ్రాసితిమి. ఆ తరువాత రాత్రి భోజనములు చేసి కొంతసేపు చర్చలు భజనలు జరిపి లేపనము కాళ్ళకు రాచుకొని కొంత సేపు విశ్రమించితిమి.

లేపనములు చలిచే పగుళ్ల నుండి కాపాడుకొనుటకు ప్రతిరోజును రాత్రుళ్లు కాళ్లు చేతులు ముఖము మున్నగు బహి: ప్రదేశములకు రాచికొనుచుంటిమి. ఈ సందర్భమున మనుచరిత్రలో ప్రవరాఖ్యునకు సిద్ధుడు నొసగిన లేపనము జ్ఞప్తికి వచ్చినది. ఈ లేపనమునకు మేము ఉపయోగించు లేపనమునకు సారూప్యము లేకున్నను అలాంటి సిద్ధుడిచ్చిన లేపనమైనచో యెంత బాగుండెడిదో యని తోచెను.

మ॥ పరమంబైన రహస్య మౌ నయిన డాపఁ జెప్పెదఁ భూమిని-
ర్జరవంశోత్తమ! పాదలేపమను పేరఁ గల్గు దివ్యౌషధం-
పు రసం బీశ్వరసత్కృపఁ గలిగెదద్భూరిప్రభావంబునఁ
జరియింతున్ బవమాన మానస తిరస్కారిత్వరాహంకృతిన్.

తా॥ దైవానుగ్రహమువలన నాకు ఒక పాదలేపనము లభించినది. ఇది మిక్కిలి గోప్యమైనది. ఈ ఓషధీరసము అరి కాళ్లకు రాచికొనినచో వాయు వేగ మనోవేగముకంటే శీఘ్రముగా మనమున తలంచిన చోటికి చేరగలము. ఇలాంటి మహిమగల లేపనము ప్రవరాఖ్యుడు బొందెను.

మేము పైకి వెడలిన కొద్ది చలి అధికముగా నగుటచే మాలోని పెద్దలకు శ్రీమతి రశ్మి యేదో తైలము రాత్రి పడుకొనగానే మా యొక్క ఛాతికి

వీపుకి ప్రతిరోజు బుద్ధి క్యాంపునుండియే రాయుచుండెడిది. ఆమె మాపై యెంతో గౌరవభావముతోను మేము అనారోగ్యము చెందకుండా నుండుట కై ఈ విధముగా తక్లాకోట్ చేరు వరకు ప్రతి రోజు తైలము రాయుచుండెను. సపర్యలు నలుపుచుండెడిది.

చాల చలిగా నుండుటచే ఊలు బట్టలు వేసికొని పడుకొంటిమి. 'గుంజి' గ్రామము 'కుట్టి'న ది ఒడ్డున నున్నది. చుట్టును పర్వతములు. మా క్యాంపు ఉన్న వైపు విశాలమైదానమున్నది. అది 3,550 మీటర్లు సముద్ర మట్టమునకు ఎత్తులో నున్నందున చలి ఎక్కువగా నుండెను. ఇంత ఎత్తు నున్నట్లు మనము ఆ ప్రదేశమును చూచి ఊహించలేము. అచట అప్పుడు ప్రైమరీ స్కూలు పోస్టాఫీసు వున్నవి. మా క్యాంపునకు ఎదురుగ పైన చెప్పిన వ్యాస మందిరమునకు కొంత దగ్గరలో ఒక పెద్ద టిన్ను రేకులతో కట్టబడిన గోదాము ఉన్నది. దానికి 100 గజముల వెనుక వంటకో సామానులకో ఉపయోగించు మరొక పెద్ద షెడ్డు యున్నది. ఈ రెంటి మధ్య నడుచుదారి కూడ రేకులతో కప్పినారు. చలికాలములో మొత్తము మంచుచే నిండు కారణమున అది మన మిలటరీ వారికై చేయబడెను.

శ్లో॥ లక్ష్మీం క్షీరసముద్ర రాజ తనయాం శ్రీరంగ ధామేశ్వరీం ।
దాసీభూత సమస్త దేవ వనితాం లోకైక దీపాంకురామ్ ।
శ్రీమన్మంద కటాక్ష లబ్ధ విభవ- బ్రహ్మేంద్ర గంగాధరాం ।
త్వాం త్రైలోక్య కుటుంబినీం సరసిజాం వందే ముకుంద ప్రియామ్।

శుద్ధలక్ష్మీ ర్మోక్ష లక్ష్మీర్జయలక్ష్మీ స్సరస్వతీ ।
శ్రీర్లక్ష్మీ ర్వర లక్ష్మీశ్చ ప్రసన్నా మమసర్వదా ॥
పరాంకుశౌ పాశమభీతి ముద్రాం కరైర్వహంతీం కమలాసనస్థామ్ ।
బాలార్క కోటి ప్రతిభాంత్రి నేత్రాంభజేహమంబాం జగదీశ్వ రీంతామ్॥

సర్వమంగళ మాంగల్యే శివే సర్వార్థ సాధకే ।
శరణ్యే త్ర్యంబికే దేవి నారాయణి నమోస్తుతే ॥
మహాదేవ్యైచ విద్మహే, విష్ణుపత్నైచధీమహి।
తన్నో లక్ష్మీః ప్రచోదయాత్ ॥

(ఇతి లక్ష్మీ స్తుతి:)



# పన్నెండవ అధ్యాయం

## కాళిమాత దర్శనార్థము

శ్లో॥ ఉద్యద్భాను సహస్రకోటి సదృశాం కేయూర హారోజ్జ్వలాం
బింబోష్ఠీం స్మిత దంతపంక్తి రుచిరాం పీతాంబరాలంకృతాం
విష్ణుబ్రహ్మ సురేంద్ర సేవితపదాం తత్త్వస్వరూపాం శివాం
మీనాక్షీం ప్రణతో స్మి సంతత మహం కారుణ్య వారాంనిధిమ్.

✍ కాళీమాత దర్శనార్థము : ది. 27-7-1983వ రోజు చలి అధికముగా నుండెను. అయినను కార్యక్రమానుసారము ఉదయము ఉపాహారములను ముగించుకొని 7 గంటలకు బయలుదేరితిమి. ఒక కిలోమీటరు వెళ్ళి మా దారికి 50 గజముల దూరములో గల వ్యాసమందిరమునకు వెళ్లి మందిరములోని గంటలు కొట్టి దేవునికి నమస్కరించి ముందునకు సాగితిమి. ఆలయము లోనికి పోవలసి యున్నను కొంతపైకి ఎక్కవలసియుండెను. మాబృందము ముందు బడిపోవుటచే (కొందరు నిన్ననే దర్శించినారు గావున వారు మందిరమునకు రాకుండ ముందు వెళ్లినారు కనుక) నేనొక్కడనే మిగిలితిని. ఆ మందిరమునకు చాలా ఎత్తున పర్వతాగ్రముపై మరొక చిన్న వ్యాస మందిరము కాన్పించెను. కాని అచటికి మార్గము సరిగా లేనట్లును దుష్కరముగాను తోచెను.

నేను కొంత దూరము పోగా కాళిగంగా మరల మాత్రోవ వెంటనే సాగుచెండెను. ఒక్కొక్కసారి మెట్లు ఎక్కుచు దిగుచు దారివెంట మా నడక సాగుచుండెను. ప్రక్కనే నేపాలు పర్వతపంక్తులు ఎడమవైపు ఎత్తైన భారత దేశ పర్వతములు కలవు. ఆ రెండు పర్వత శ్రేణులపైన పెద్ద పెద్ద వృక్షములు త్రోవ వెంట కాన్పించుచు మనోరంజకముగా నుండెను. ఆ ప్రకృతి దృశ్యములను ఆనందముతో తిలకించుచు ముందునకు ప్రయాణము సాగించితిమి.

నాటి ప్రయాణములో ఎక్కువగా ఎక్కుట లేని కారణంగా ప్రయాణము ఎక్కువ కష్టముగా లేదు. ఇంకను కొంతదూరముపోగా ఒకచోట మరొకనది నేపాల్ పర్వతములనుండి వచ్చి కాళిగంగలో కలియుచు కన్పించెను. ఆ నదిపై కొంతదూరములో ఒక ప్రాచీన దేవీ ఆలయము కన్పించెను. దానికి కొంత ముందుగా ఒక వంతెన శిథిలావస్థలో కన్పించెను. మేము మా దారివెంట నడచుచునే ఆ దేవికి నమస్కరించి ముందుకు సునాయాసముగ ప్రయాణము సాగించితిమి. నదికి రెండు ప్రక్కలలో చాలా ఎత్తయిన పర్వతములు పర్వతాగ్రములపై వెండి పూతపూసినట్లు మంచు శిఖరములు వృక్షముల పచ్చదనముతో ప్రవాహము యొక్క గలగలలు పక్షుల

కిలకిలలు గుర్రపు డెక్కల పటపటలు కాలిబూట్ల టకటక శబ్దములతో మా ప్రయాణము ఆహ్లాదకరముగా సాగుచుండెను. ఎవరును ఏమియు మాట్లాడక నిశ్శబ్దముగా ప్రకృతిని తిలకించుచు సాగితిమి.

దాదాపు 11 గంటల సమయమున మాకు ఒక 'కాళికాదేవి' ఆలయము ప్రక్కన శివాలయము ఆ ఆలయముల వెనుక ఎత్తయిన పర్వతము దానికి కొంత దూరములో రేకులతో కప్పిన పెద్ద పెద్ద గోదాములు కన్పించెను. ఇంకను కొంత దూరము పోయి ఒక చెక్క వంతెన పై నదిని దాటి తిన్నగా ఆలయము వద్దకు పోయి కాళిమాత విగ్రహమును శివలింగమును దర్శించితిమి. ఆ ఆలయములముందు ఒక వెడల్పయిన ''హౌజు'' (అనగా నీరు నిలువయుంచుటకు కట్టిన కొలను) యున్నది. వెనుక పర్వతములోనుండి నీరు వచ్చి కాళి ఆలయము గర్భగుడి క్రిందుగా ప్రవహించుచు ముందుగల హౌజులో పడుచు చిన్న ప్రవాహముగా ప్రక్కనగల నదిలో కలియుచుండెను. ఆ కాళిమాత ఆలయమునుండి వచ్చుటచే దీనిని ''కాళిగంగా'' నదియని పిలచుచున్నారు. మరియు దాని ప్రక్కన గల రేకుల గోదాము మన సరిహద్దు రక్షక పటాలము వారి వసతులు (ITBP) (INDO-TIBETAN BORDER POLICE). నేపాల్ భూభాగము ఆ మందిరముతో అంతమగును. ఇకపై మా ప్రయాణములో నేపాల్ భూభాగము కన్పించదు.

మేము ఆ గోదాములను దాటి రెండు ఫర్లాంగులు పైకి వెళ్లగా అచట నాలుగైదు గుడారములు ఒక చిన్న వంటగృహము కనుపించెను. మాలో వారు కొందరప్పటికే వానిలో ప్రవేశించిరి. నేను చిట్టచివరి గుడారము ఖాళీగా యుండగా అందులో చేరితిని. ఆ గుడారము అంతకుముందే కురిసిన వర్షం నీరు లోనికి పోవుటవలన నేలయంతయు తడిగా యుండెను. ఆ, తడి భూమిపై రబ్బరు చాపలు పరచి నేను, షణ్ముగసుందరము, అగర్వాల్, రంగాచారి కొంతసేపు విశ్రమించితిమి. నేడు 10 కి.మీ. ప్రయాణము సాగించినను ఎక్కువ శ్రమగల దారి కానందున మిక్కిలి అలసట చెందలేదు.

తరువాత నేను నా సంచిలోనుంచిన బిళ్వపత్రి అభిషేకపుస్తకము పూజాద్రవ్యములను బయటకు తీసి డా॥ గొడ్బేలే మరియు ఇతర మిత్రులు కలిసి మరల ఆలయములకు వెళ్ళి శివాలయములో చల్లని మంచునీటితో శివునికి భక్తి శ్రద్ధలతో రుద్రాభిషేకము చేసి కాళికాదేవికి నమస్కరించి అందరకు తీర్థ ప్రసాదములు ఇచ్చితిమి. ఆ సమయములో ఆ ఆలయ పూజారి (బ్రాహ్మణ జవాను) బహుశః భోజనమునకై వెళ్లి యుండవచ్చును, ఈసందర్భమున కాళికాదేవి భువనేశ్వరీ రూపమును గూర్చి దేవీ భాగవతములోని విషయములను పొందు పరచనైనది. ✍

**ఆదిశక్తి భువనేశ్వరి రూపము. (త్రిమూర్తుల ఆవిర్భావము)**

ఏషా భగవతీ దేవీ సర్వేషాం కారణం హి నః
మహావిద్యా మహామాయా పూర్ణా ప్రకృతి రవ్యయా.
దుర్జ్ఞేయాల్పధియాం దేవీ యోగగమ్యా దురాశయా।
ఇచ్ఛా పరాత్మనః కామం నిత్యాఽ నిత్యస్వరూపిణీ॥
దురారాధ్యాఽల్ప భాగ్యైశ్చ దేవీ విశ్వేశ్వరీ శివా।
వేద గర్భా విశాలాక్షీ సర్వేషా మాది రీశ్వరీ॥
ఏషా సంహృత్య సకలం విశ్వ క్రీడతి సంక్షయే।
లింగాని సర్వజీవానాం స్వశరీరే నివేశ్య చ॥
సర్వబీజమయీ హ్యేషా రాజతే సాంప్రతం సురౌ।
విభూతయ స్థ్సితాః పార్శ్వే పశ్యతాం కోటిశః క్రమాత్॥

ఈ జగజ్జనని రూపము లెక్కకు మించిన బ్రహ్మ విష్ణు రుద్రులు ఇంద్ర యమ వరుణ కుబేరాదులు యీ మణి ద్వీప వాసినిని పరివేష్టించి యున్నారు. అతి దుర్లభమగు నీమె దర్శనము తపస్సంపన్నులు పరిపక్వపుణ్య పురుషులు మాత్రమే చేయగల్గుదురు. ఈమె యేమూలప్రకృతి. బ్రహ్మాండముల సృజించి యామె ద్రష్టగా నిలబడినది. ''సర్వమాయా సర్వేశ్వరీ శివా'' యని పిలువబడునీమెముందు త్రిమూర్తులు దేవతలు నిలువజాలరు. ఈ మహామాయా స్వరూపిణీ ప్రళయమందున క్షీరసాగరమున వటపత్ర శాయినియై బాలభావమున (నిర్గుణ) నుండును. గంభీరమైన సింహాసనమున నా భువనేశ్వరి నాసీనయైయుండ రక్తాంబరధారిణులు, నీలాంకుశధారులు, పీతవసనులు, చిత్ర మాల్య విభూషణాలంకృతసఖులు, కనుసన్నలనే యుండి యాదేవి యాజ్ఞల శిరసావహించుచు ఉండెదరు. ఆ మహామాయా స్వరూపిణి ప్రదర్శించు నింద్ర జాలమునకు ముగ్ధులగుదురనుటకు సందియములేదు. ఆమెయందలి నఖదర్పణమున బ్రహ్మాండమంతయు నిలచియుండును. స్థావర జంగమాత్మక మగు ననేక కోటి బ్రహ్మాండములు, కోటానుకోట్ల, మూర్తిత్రయములు, ఇంద్రాది అష్టదిక్పాలక గణములు,దేవ బ్రహ్మర్షి గణములు, దేవ గంధర్వ, యక్ష రాక్షస, పన్నగ కిన్నర కింపురుషాదులు కైలాస, సత్య, వైకుంఠలోకములు, ఆమె అర్ధచంద్ర బింబమున గాంచనగును. ఆ సర్వేశ్వరియే లోకేశ్వరి, ప్రకృతి స్వరూపిణి, కల్యాణ కల్పతరువు, సచ్చిదానంద స్వరూపిణి, జగద్యోని, సృష్టి స్థితి సంహార తిరోధాని, విద్యాజగత్తున కధిష్ఠాన రూపిణి,నిర్వికార చైతన్య మాత్రాశ్రిత హృల్లేఖా స్వరూపిణి, ప్రత్యగాత్మ, మూర్తిత్రయాతీతురాలు. సృష్ట్యంతరాత్మురాలు, లోకాతీతురాలు, కార్యకారణమూర్తి, నిర్గుణ నిరంజన నిర్వికారిణి, విశ్వామృత స్వరూపిణి, బ్రహ్మాదులకు సృష్టి స్థితిలయముల శక్తి ప్రదాత. ప్రభాకర ప్రకాశదాత. సర్వేశ్వరి.

ఇదేకాక విద్యావంతులకు బుద్ధి శక్తివంతులకు శక్తి లోకమున కీర్తి, కాంతి, శోభ తుష్టి, పుష్టి, సర్వమూ ఆమె యంశమే. సకల వేదసారమగు గాయత్రియు మరియు ముక్తిప్రదాయినియు యామెయే. పంచభూతములు, శబ్ద స్పర్శ రూపరస గంధములెల్లయు పాంచభౌతికములు, మున్నగు, సృజనా శక్తి, నవాక్షరీ మంత్రస్రష్ట ఈమెయే. ఈమె ఇచ్ఛా మాత్రముననే అనంతకోటి బ్రహ్మాండ భాండముల సృజన జరుగుచున్నది. ఆమె సర్వ స్వతంత్రురాలు మిగతా వారందరూ కీలుబొమ్మలై ఆమె యాజ్ఞ శిరోధార్యముగా నాచరించేవారు. ఆమె క్రీగంటి చూపుచే కోటి బ్రహ్మాండములు ప్రకటములయ్యి మరుక్షణమున కోటియుగముల కాలచక్రము తిరిగిపోయి రెప్పపాటున సర్వము లయమగుచుండును.

'' ఉన్మేష నిమిషోత్పన్న విపన్న భువనావళి:''

అట్లే ఆమెకు స్త్రీపురుష భేదములేదు. ద్వైతాద్వైత భావన రహిత సూక్ష్మాతిసూక్ష్మ, వివేచనగల్గి, దర్పణమున ముఖమొక్కటియైనను ఎన్నో ప్రతిబింబముల వలె చైతన్యమొకటియై, మాయాకార్యాంత: కరణరూపములనేకములు, దృశ్యాదృశ్య,భేదములు ఆమెయందే, కల్పితములు. ప్రళయకాలమందు సర్వమూ ఆమెయందే లయించును.

'' ఏకమే వాద్వితీయం బ్రహ్మ - నేహ నానాఽ స్తి కించన'' అనునది పరమ సత్యము. అట్లే :

''అహం బుద్ధి రహం శ్రీశ్చ ధృతి : కీర్తి: స్మృతి స్తథా:
శ్రద్ధా మేధా దయా లజ్జా క్షుధా తృష్ణా తథా క్షమా.
కాంతి శ్శాంతిః పిపాసా చ నిద్రా తంద్రా జరా ఽ జరా!
విద్యా ఽ విద్యా స్పృహా వాంఛా శక్తి శ్చా శక్తి రేవ చ॥
వసా మజ్జా చ త్వ క్చాహం వృష్టి ర్వా గనృతా ఋతా
పరా మధ్యా చ పశ్యంతీ నద్యో ఽ హం వివిధాశ్చ యాః ॥
కిం నాహం పశ్య సంసారే మద్వియుక్తం కి మస్తి హి!
సర్వ మే వాహ మిత్యేవం నిశ్చయం విద్ధి పద్మజ॥
నూనం సర్వేషు దేవేషు నానానామధరా మ్యహం!
భవామి శక్తి రూపేణ కరోమి చ పరాక్రమమ్॥
గౌరీ బ్రాహ్మీ తథా రౌద్రీ వారాహీ వైష్ణవీ శివా!
వారుణీ చాథ కౌబేరీ నారసింహీ చ వాసవీ॥
ఉత్పన్నేషు సమస్తేషు కార్యేషు ప్రవిశామి తాన్।
కరోమి సర్వకార్యాణి నిమిత్తం తం విధాయ వై॥ శ్రీ దేవి భాగవతము

☝ ఈ మహాశక్తి బ్రహ్మకు సురూపి, రజోగుణాత్మిక, చారుహాసిని యగు సరస్వతి నొసంగి సతిగా స్వీకరించుమని నుడివెను. భాగవతమున పోతనామాత్యులు శారదను నీవిధముగా శ్లాఘించిరి. ☝

ఉ॥ అంబ నవాంబుజోజ్జ్వలకరాంబుజ శారద చంద్ర చంద్రికా.
డంబర చారు మూర్తి ప్రకటస్ఫుట భూషణ రత్న దీపికా
చుంబిత దిగ్విభాగ శ్రుతి సూక్త వివిక్త నిజప్రభావ భా
వాంబర వీధి విశ్రుత విహారిణి నన్ గృప జూడు భారతీ.

☝ మరియు సత్యలోకమునకేగి చతుర్విధ సృష్టి చేయమని కాలానుగుణమున ఆయా జీవుల కాయా ఫలముల జన్మనిచ్చుచు సృష్టికార్యమును జరుప నాదేశించి అందుకు తగిన శక్తి యుక్తుల సమకూర్చి హరి హరాదులకు, బ్రహ్మకును, భేదము అధికారములో మాత్రమే గాని గౌరవ మర్యాదలలో లేదని సెలవిచ్చి ''నవాక్షరీ'' మంత్రము నుపదేశించి సదా సృష్టి కర్తగా యుండుమని ఆదేశించెను.

అట్లే ఆ శక్తి హరిని గాంచి ఒక మనోహరిణి నొసంగి ఈమెయే లక్ష్మి యని హరివక్షః స్థలమున స్థానమిచ్చి ఏలుకొమ్మనెను. ఆ లక్ష్మీదేవిని పోతనామాత్యు లీవిధముగా స్తుతించిరి. ☝

మ. హరికిం బట్టపుదేవి పున్నెముల ప్రో వర్థంపు బెన్నిక్క చం.
దురుతోబుట్టువు భారతీ గిరిసుతల్ దోనాడు పూబోడి దా.
మరలం దుండెడి ముద్దరాలు జగముల్ మన్నించు నిల్లాలు భా
సురతాఁ లేములు వాపు తల్లి సిరి యిచ్చుఁ నిత్య కళ్యాణముల్.

☝ పాలనా దక్షుడవుగా నుండుమని లక్ష్మినారాయణ యోగమున అపజయముండదని అభయమిచ్చి యామాత హరిహర భేదము లేదని వాక్రుచ్చి వైకుంఠమున నివాసముండుమని యాదేశించెను.

ఆ తరువాత ఆదివ్య శక్తి శంకరుని గాంచి సమరూప సమన్విత యగు భవాని నొసంగి ఏలుకోమనెను. అట్లే దుర్గామాతను కూడా వారు ఈవిధంగా స్మరించిరి. ☝

శ్లో॥ అమ్మల గన్న యమ్మ ముగురమ్మల మూలపుటమ్మ చాల బె
ద్దమ్మ సురారులమ్మ కడు పారడి బుచ్చిన యమ్మ దన్ను లో
నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడియమ్మ దుర్గ మా
యమ్మ కృపాబ్ధి యిచ్చుత మహత్త్వకవిత్వపటుత్వసంపదల్

☝ సృష్టి సంహారము గావించుచుండుమని కైలాస మావాసముగా నేర్పరచుకొనుమని యాదేశించెను. ఇట్లు ఆ దేవి ముచ్చురికి మూలము తానే యై తద్గుణములనే ప్రసాదించు చుంటినని సమభావమున ముచ్చురును వర్తించుచు సృజన పాలన సంహారముల సల్పుమని యాదేశించెను. ☝

యో హరి స్స శివ స్సాక్షా ద్య శ్శివః స స్వయం హరిః ॥
తయో ర్భేద మాతిష్ఠ న్నరకాయ భవే న్నర ః ॥
తథైవ ద్రుహిణో జ్ఞేయో నాత్ర కార్యా విచారణా॥

☝ ఇదియే కాక సూర్యచంద్రులు ఇంద్రుడు అశ్వినులు వసువులు కుబేర యమ వరుణ వాయువహ్నులు వినాయక కుమారులు మున్నగు సర్వదేవతలు ''శక్తి'' యంశసంభూతులై సృష్టి కార్యములలో పాల్గొనుచున్నారు. జగత్తున కా పరాశక్తియే కారణభూతురాలు. మహాలక్ష్మి మహాసరస్వతి మహాకాళి రూపముల విరాజిల్లుచున్న దామెయే. ☝

ఈశ్వరీ సర్వభూతానాం సర్వకారణకారణం॥
సర్వకామార్థ దా శాంతా సుఖసేవాదయా న్వితా॥

☝ అందుకనే ఏ మహాశక్తి నామముచ్చరించినంత మాత్రమున వాంఛితార్థము లీడేరునో త్రిమూర్తి యుక్త ముక్కోటి దేవతలచే నారాధింపబడునో మోక్షకాములు ఏపాదపంకజముల నారాధించి ఫలమొందిరో ఏ నామముచ్చరించి నంత మాత్రమున దుర్లభమైన యభీష్టము లీడేరునో పరభావనాశక్తిచే మునీశ్వరులకు ప్రత్యక్ష కరతలామలకమై యొప్పారునో ఏ శక్తి త్రిగుణాత్మికయై వెలుగొందునో ఆ పరాశక్తియే సర్వజగత్తుకు సదాసేవ్యురాలు - ఆమెయే భువనేశ్వరి మాత, పరాశక్తి ఈశ్వరి, ఆదిశక్తి, మున్నగు నామముల నొప్పారుచున్నది.

హిమాలయ ప్రాంతపు నేపాల్ భూటాన్ సిక్కిం హిమాచల కాశ్మీర అస్సాం మేఘాలయ త్రిపుర బెంగాల్ మున్నగు రాష్ట్రములలో ఈ దేవీతత్వము బహుళముగా ఉపాసింపబడుచున్నది. అచటి బౌద్ధులు నేటికి కూడ వారి వారి భాషలలో దాదాపు మన సంప్రదాయమునే అనుసరించుచున్నట్లుగా తెలియుచున్నది.

ఆంధ్ర ప్రాంతములలోని శిష్ట కుటుంబములలో దేవీ నవరాత్రి ఆచరణ ప్రచురితమై యున్నది. దుర్గాష్టమి విజయదశమి సందర్భములలో ఇలాంటి దేవీ ఆరాధన ఉత్సవములు ఆసేతు హిమాచల పర్యంతము ఏదో ఒక రూపములో అనుసరించబడుట చూడగలము.

టిబెట్ ప్రాంతములో శక్తిని 'తార' రూపములోను శివుని బోధిసత్త్వుని రూపములోను ఆరాధింతురు. అచట కూడ నవరాత్రి ఆరాధన లాంటి ఆచారములు కొనసాగుచునేయున్నవి.

తీర్థ ప్రసాదములు స్వీకరించిన తరువాత మేమందరము విడిదికి చేరితిమి. అందరికిని ఆరు బయట భోజనములు యేర్పాటు చేయగా భుజించితిమి. అదే పుల్కా అదే ఆలు కూర అదే పప్పు అదే ఉప్పుకారవము లేని చప్పుడు భోజనము.

శ్లో. ఆయు స్సత్త్వ బలారోగ్య సుఖ ప్రీతి వివర్ధనాః॥
రస్యా స్స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారా స్సాత్త్విక ప్రియాః॥ (భగవద్గీత)

పై శ్లోకానుసారము ఆయుర్వృద్ధికి మనస్సునకు దేహమునకు బలము గలుజేయు ఆరోగ్యమగు రసవంతపు చమురుగలిగిన కమ్మదనము గలిగి సత్త్వవ నిచ్చునవి యగు సాత్విక భోజనములు ఈ ప్రమాద భరిత ప్రయాణములో ప్రతి రోజు అవసరమై యుండెను. కాని పై ఉప్పు కారము లేని రుచి రహిత ఆహారముచే మొగము మొత్తుటే గాక వెంటనే బడలిక కలుగుచుండెను. భోజనానంతరము గుడారములలో చేరి స్లీపింగ్ బ్యాగులలో దూరి విశ్రమించితిమి.

ఆ కాలాపాని స్థలము ఎత్తు 3600 మీటర్లు. అక్కడ విపరీతమైన చలి. అచట ఐ.టి.బి.టి. వారి పెద్ద క్యాంపు ఉన్నది. అక్కడి నుండి ''లిపుపాస్'' (లిపు కనుమ) వరకు (20 కి.మీ. నో మాన్ ఏరియా) అగుట వలన నిస్సంచర ప్రదేశము. అనుమతి లేనిదే అచట నుండి పైకి వెళ్ళుట గాని వచ్చుటకుగాని వీలు లేదు. సంవత్సరమంతయు కాపలా పటాలమువా రిక్కడనే యుండి ''లిపు పాస్'' వరకు గల మన భూ భాగమును కాపలాకాయుదురు. అక్టోబరు మాసము నుండి ఆ ప్రదేశమంతా మంచుతో నిండిపోవును. నదులన్నియు గడ్డకట్టును. నీరు భూమి ఎచట యున్నదో తెలియదు. అచట జవానులు నాల్గు మాసముల గ్రాసము ఇతర వస్తువులు గుర్రములపై, గాడిదలపైన, తెచ్చుకొని గుడారములలో నిల్వ చేసికొందురు. ఈ నాల్గు మాసములలో ఎప్పుడైనను బయటికి రావలసి వచ్చిన యెడల మంచును పగుల గొట్టుకొని బయటికి రావలసి యుండును. అక్కడ హెలిప్యాడ్ సౌకర్యము కూడ కలదు. ''బరేలి'' హెడ్క్వార్టరు నుండి కనీసము రెండు మూడు రోజుల కొకసారైనను పై అధికారులు హెలికాప్టరులపై వచ్చిపోవుదురు. మాతో వచ్చిన ఎస్.పి.ఎఫ్. జవానులు అక్కడనే ఆగెదరు. అచటి నుండి మమ్ము 'లిపు పాస్' వరకును ITBPవారే కొనిపోవుదురు. తిరిగి వచ్చునపుడు మా కన్న ముందు బోయిన మూడవ బ్యాచ్ వారిని తీసికొని వత్తురు.

అచట కాళీ ఆలయము ప్రక్కన నది దాని నానుకొని చాల ఎత్తయిన కొండ, కొండపై భాగాన ఒక చిన్న గుహ కన్పించును. పూర్వము వ్యాస మహర్షి ఆ గుహలోనే తపమాచరించినట్లు చెప్పుదురు. అచటికి బోవుట దుస్సాధ్యము. దానిని 'వ్యాసవ్యాలి' అని యందురు.

సాయంత్రము 5 గంటలకు లేచి తేనీరు సేవించితిమి. మా పాస్‌పోర్టు లన్నియు మా లీడరు గైకొనెను. మాకు డాక్టరు పరీక్షలు జరిపిరి. మాలోని 'ఉపాధ్యాయ' యను బెంగాలి మిత్రుని ఆరోగ్యస్థితి గత రెండు మూడు రోజుల నుండి క్షీణించెను. గత క్యాంపులోనే ఆయనను ప్రయాణము మానుకోమని సలహో ఇవ్వబడెను. మందులు కూడ ఇచ్చిరి. దగ్గు, దమ్ము (ఆయాసము) తగ్గలేదు. ఆ రోజున ఆయనను డాక్టరుగారు బాగుగా పరీక్షించి రేపటి ప్రయాణమునకు ఆక్షేపించిరి. ఉపాధ్యాయ గారి కోరికపై రేపటి చివరి క్యాంపు వరకు మాతో వచ్చునట్లు పరిస్థితి మెరుగైనచో ముందుకు పోవునట్లు లేనిచో తిరిగి వచ్చునట్లు షరతు పెట్టి బ్రతిమాలగా డాక్టరుగారు సమ్మతించిరి.

ఆ రోజు చీకటి పడకముందే వానచినుకులు ఆరంభమాయెను. మా గుడారములలో రోజటి కందిళ్ళు (లాంతర్లు) ఏమియును లేవు. క్రొవ్వువత్తులు మా టార్చి లైట్లు మాత్రమే ఉండెను. మాకు మరల భోజనమును గుడారాల్లోనికే తెచ్చిరి. మేమందరము భుజించితిమి. మాలో కొందరము ఒక గుడారములో జేరి భజనలు చేసి కొంటిమి. తర్వాత చలి భాధ భరించలేక వున్ని బట్టలతో స్లీపింగ్ సంచులలో దూరి పండుకొంటిమి. కాని రాత్రి బాగా చలి వలన, వివపరీతముగా వీచే గాలి వలన, చాలా సేపు నిదురరాక వ్యాకులత చెంది ఎట్లో రాత్రి గడిపితిమి.

చెక్క వంతెనకు కొంత క్రింది భాగమున నది ప్రక్కగా ఒక వేడి నీటి ఊట యున్నట్లు మా పోలీసు వారి ద్వారా వింటిమి. దానిని తిరిగి వచ్చునప్పుడు పరీక్షించి చూచితిమి. ఈ రోజు మాకు ప్రతి వారికి డాక్టరు గారు ఒక మందు ప్యాకెట్టు ఇచ్చిరి. అందులో ముఖ్యమైన కావలసిన మందులు సుమారు 30 రూ. నుండి 40 రూపాయల విలువచేయునవి గలవు. చైనాలో మాకు లభించవనే కారణముతో ఇవి ఉచితముగా ప్రభుత్వము ద్వారా ఇవ్వబడినవి. చాలా మంది వద్ద మా వెంటనే ఢిల్లీలో కొన్న మందులు ఉన్నను ఇవి కూడా గైకొంటిమి.

శ్లో॥ ముక్తా హారలసత్కిరీట రుచిరాం పూర్ణేందు వక్త్ర ప్రభాం॥
శింజన్నూపుర కింకిణీ మణిధరాం పద్మ ప్రభాభాసురామ్।
సర్వాభీష్ట ఫల ప్రదాం గిరిసుతాం వాణీర మా సేవితాం॥
మీనాక్షీం ప్రణతో ఽస్మి సంతత మహం కారుణ్యావారాంనిధిమ్.

# పదమూడవ అధ్యాయం

## భయంకర లోయ - ''నభిడాంగ్''

శ్లో॥ శ్రీ విద్యాం శివవామభాగనిలయాం హ్రీంకారమంత్రోజ్జ్వలాం
శ్రీచక్రాంకితబిన్దుమధ్యవసతిం శ్రీమత్సభానాయకీమ్
శ్రీమత్షణ్ముఖవిఘ్న రాజజననీం శ్రీమజ్జగన్మోహినీం
మీనాక్షీం ప్రణతోఽస్మి సంతత మహం కారుణ్యవారాంనిధిమ్.

✍ ది. 28-7-83న కార్యక్రమములు ముగించుకొని నెమ్మదిగా 8-00 గంటలకు బయలుదేరితిమి. ఆ దినము విపరీతమైన చలి యుండెను. ఒక కిలోమీటరు ముందుకు వెళ్లగా ''గరిప్స'' అను చిన్న నదిని చెక్క వంతెన మీదుగా దాటి ముందుకు పోగా ''ఇర్కా'' యనబడే మరొక పెద్దనది ''లిపుపాస్'' నుండి వచ్చి కలియు సంగమము కనబడెను. ✍ ☝ భారతదేశములో ప్రవహించు పుణ్య నదులన్నిటికి 'స్త్రీ' నామములుండుట గమనార్హము. ఆలోచనాపరులు ఈ నదీ సంగమముల దృష్టియందుంచుకొనియే ఈ స్త్రీనామము లిచ్చియిందురేమో. కొన్ని నదులకు నపుంసక నామము లిచ్చిన, నవి సంగమించునపుడు, స్త్రీ పురుష సంగమములుగా నభివర్ణింపవచ్చునను భీతివలన అన్ని నదులకు స్త్రీ నామములిచ్చి యుండిరని నిశ్చయముగా తెలియుచున్నది. ఈ నదీ ప్రవాహ జలములకంటే న దీ సంగమజలములకే మన దేశమున అత్యంత పవిత్రత గలదనుటలో సందియము లేదని మన పూర్వీకులు ఉపదేశించిరి. వీనిలో ప్రాముఖ్యత గలవి గంగా యమునా సరస్వతీ సంగమము. ఒకో చోట పెద్దలు నదీనదములను పదముల ప్రయోగించి స్త్రీ పుం భేదముల వర్ణించి ఆ పొరపాటును సవరించుకొని, ఆసేతు హిమాచలమునగల నదులన్నింటికి స్త్రీ వాచక నామకరణములనే చేసిరి. ఉదా: గంగా, యమునా, సరస్వతీ, బ్రహ్మ పుత్ర, సింధు, సరయు, కావేరి, నర్మదా, గోదావరి, క్రిష్ణ, వేణి, తుంగ, భద్ర ఇత్యాది నామములు స్త్రీ నామములని చెప్పగనే యర్థమగును.

ఈ నదులన్నియు సాగరములో చివరకు సంగమించును. కాని నదితో సంగమించు నపుడే ఆ సంగమము మహాక్షేత్రమగుచున్నది. అందుకే సంగమముల గూర్చిన నొక వేద వాక్యమేమన ''ఉద్ధరేచ గిరీణాం సంగమేచనదీనాం'' అని ఋషులు నుడివిరి. పర్వతపాదము పవిత్రముగను నదీ సంగమము పవిత్రాతి పవిత్రముగను వారే తెలియజేసిరి. జప తప హోమ ఫలముల సత్వరముగా బడయుటకు నదీసంగమమున నుపవిష్టుడై గావించు సత్క్రియలచే ఒక హాయనమునకు లభ్యమగు ఫలితము ఒక మాసముననే సిద్ధించునని ఋషుల అభిమతమైయున్నది. అందుచే

నదీ సంగమ ప్రాశస్త్యముల విస్మరించతగదు. + (పుష్కరముల వివరణ) ఈ సంగమము చెక్క వంతెన పైనుండి చూచినచో తెల్లగా పాలవంటి మంచు నీరు నురగలతో మలిన రహితముగ, స్వచ్ఛముగా, అధిక ప్రవాహవేగముతో రాళ్ళపై దూకుళ్ళతో చాల రమణీయ దృశ్యముగా కన్పించెను. నాడుకూడ మాలోని పెద్దలతోపాటు షణ్ముఖ సుందరం మరికొందరు గూడ గుర్రముల పై ప్రయాణము చేయుచుండిరి. అచటి నుండి మాకు నిన్నటి వరకు కనుపించిన వృక్షజాలము, పక్షిజాలము, మాయమై చిన్న చిన్న పొదలు మరియు ఎత్తైన పర్వతములు ఆపైన మంచుశిఖరములు తప్ప వేరేమియు కన్పడుటలేదు. హిమాలయముల ఔన్నత్యము ఇనుమడించెను. నేటి దారిలో అచట అచట కొన్ని మెట్లున్ననూ కొంత చదును భూమి పైననే పిల్లదారి యుండి పైకి నడచుచుంటిమి. అరగంట తర్వాత ఒక ఎత్తైన ప్రదేశమున శిథిలమయిన రాళ్ళ గృహములాటిది కొంత దూరములో కన్పించెను. అవి ''ముల్లాతార'' మరియు ''కింగ్‌కాంగ్'' యని పిలుచు గ్రామములట. ప్రస్తుతము అచట మనుష్యులెవ్వరు లేరు. మేమచట ఫోటోలు దిగితిమి.

మేము చెక్క వంతెనను దాటి కుడి ప్రక్కకు తిరుగగనే ఒక రోడ్డు జీపు వెళ్ళునంత వెడల్పుగా కన్పించినది. ఆ రోడ్డు ''నభీడాంగ్'' వరకు కన్పించెను. ఆ తర్వాత లేదు. దీని కొక గాథ చెప్పబడెను. అది యేమన 1958ప్రాంతమున ఒక భారతీయ మిలిటరీ బ్రిగేడియరు భారత రక్షణశాఖ కు తెలియకుండానే మిలటరీ వారిచే ఆ రోడ్డు వేయించెనట. తర్వాత గూఢచారుల ద్వారా ఈ విషయము ప్రభుత్వము తెలిసికొని ఆ బ్రిగేడియర్‌ను జైలుకు పంపి రోడ్డు నిర్మాణము ఆపుచేయించినట్లు తెలిసినది.

మేము ఆ రోజు నడక నెమ్మదిగా సాగించుచుంటిమి. నాడు ప్రయాణము అతికఠినముగా ఎత్తెక్కునదై లేకుండెను. ఆ రోజు విపరీతమైన గాలియును ఎండకూడ నుండెను. ఆ హోరుగా వీచు పవనముల ప్రభావమువలన చెవులు ముక్కు నొసలు చెక్కిళ్ళు ఇతర బహిర్గత ప్రదేశములు రక్తవర్ణములోనికి మారును. ఒక్కొక్కసారి వీనిని కాపాడుకొనక పోయినచో, రక్తము వచ్చు ప్రమాదముకలదు. అట్లే మేము ఉదయం 11 గంటల వరకు ఒక సువిశాలమైన ప్రదేశమునకు చేరితిమి. ప్రక్కనే వెడల్పాటి భయంకరలోయ అందులో ఒకనది గలదు. దాని ఎదురుగా మరొక నది వచ్చి ఆ నదిలో కలియు సంగమము. దూరముగా ఎటు చూచినను చాలా ఎత్తయిన పర్వతములు, వాని శిఖరములు, మంచుతో కప్పబడి కన్పించుచుండెను. ఎక్కడను ఒక మనిషిగాని, పక్షిగాని, పురుగుగాని, కన్పించక వేగముగా వీచు గాలి యొక్క, భయంకర శబ్దముల, మధ్య నుంటిమి. సూర్య భగవానుడు కూడ బయటకు రాలేక మబ్బులలో దాగుకొనుచున్న ఆ భయంకర ప్రదేశమున 'సన్నాటా'' వెలసియుండెను.

అచటనే మాకు గుడారములు ఏర్పరచిరి. ఆదే భారతదేశపు చివరిమజిలీ. నేడునూ మావెంట ఐ.టి.బి.పి. వారే యుండిరి. ఎస్.పి. ఎఫ్. వారు ''కాలాపానీ''లోనే నిలిచిపోయిరి. వారిని లిపుపాస్ వరకు అనుమతించరు.

ఆ ''నభిడాంగ్'' సముద్రమట్టమునకు దాదాపు 4,600 మీటర్ల ఎత్తున నున్నది. మేము గుడారములో చేరి అరగంట విశ్రమించితిమి. ఆ తరువాత ఆరు బయట భోజనము ఆరగింతిమి. తర్వాత కొంతసేపు విశ్రమించి డాక్టరు పరీక్ష చేయించుకొంటిమి. శ్రీ ఉపాధ్యాయగారి ఆరోగ్యపరిస్థితి మెరుగుపడలేదు. మావెంటగల ఐ.టి.బి.పి. డాక్టరు మాకు డాక్టరుగాను, ఆ ఆఫీసరుగారే మా అందరికీ కమాండరుగాను వ్యవహరించుచుండిరి. నేడు మా సామానులన్నీ మిలటరీ వారు తనిఖీ చేసిరి. మా ప్రక్క బట్టలు, స్లీపింగ్ సంచులు మనదేశపు పటములు దారి పొడవునా తీసిన చిత్రములు పుస్తకములు ఫోటోల నెగెటివ్‌లు, టేపురికార్డరులు, పెద్ద మూవీ కెమెరాలు, చివరకు ప్రతి రోజు వ్రాసుకునే డైరీలు కూడా ముందునకు తీసికొనిపోవుటకు నిషేధించిరి. మనదేశపు భద్రతకు హాని కలుగుననే అనుమానమున్న ప్రతి వస్తువును తీసికొనిపోకూడదని మమ్ము అభ్యర్థించిరి. చైనీయుల చేతిలో ఇవేమియు పడకూడదని వారి ఉద్దేశము.

మేము మాకు అవసరము లేదనుకొన్న వస్తువులను వేరుచేసి, అచట పడవేసి, 'లోడు' లేని కెమెరాలు, కొత్త ఫిల్ము రీళ్ళు తొడుగుకునే బట్టలు, తినుబండారములు ఇతర అవసరమున్న వస్తువులను వెంట తీసుకొని మిగిలిన అనవసర వస్తువులను మూటకట్టితిమి. ఈ సామానుల తనిఖీ అయ్యేవరకు మా శరీరములు చల్లబడెను. మేము మళ్ళీ గుడారములలో దూరితిమి. సాయంత్రము, దీపములు లేని కారణంగా ఏడు గంటలకే భోజనములు ఆరుబయట భుజించి, లేపనములు వ్రాసికొని, రోజులాగ కాకుండా ఒకరి కొకరు దగ్గరగా ఒదిగి పడుకొంటిమి. ✍ ☝ చలి మనకు చాలా బాధకరమైనదైనను అది చిన్న,పెద్ద, భాష, ప్రాంత,వయోభేదముల కతీతముగానుండి, ఎట్టి వారినైనను,సన్నిహితులుగా చేయునట్టి మహత్తు కల్గినదనుటలో ఆశ్చర్యమేమియులేదు. ★ ఆ చలికి తట్టుకొనుటకు మేము వేడిగానుండు ఉన్ని బట్టలు ధరించితిమి. నేను కూడ బనియను దానిపై ఉన్ని బనియను చొక్కా ఉన్ని స్వెట్టరు దానిపై ఇంకొక స్వెట్టరు దానిపై ''విండ్ చీటరు'' (గాలి శక్తిని తట్టుకొనే షర్టు) పై భాగమునను ,చెడ్డీ ఉన్ని చుడిదార్ పైజామా దానిపై ఉన్ని పాంటు, శరీరము క్రింది భాగమునను (పైన ఏడు వరసలు క్రింది మూడు వరుసలు) దుస్తులు వేసికొని ఆపైన బాగుగా వేడిచేయు ఓవర్ కోటును వేసుకొని స్లీపింగ్ సంచిలో దూరితిని. అయినను రాత్రంతయు నిద్రపట్టక పూర్తిగా రెండవ జాగరణ జరిగినది.

1981 సం॥లో కైలాస మానస సరోవర యాత్రకు బయలు దేరిన ప్రథమ బృందములో శ్రీ సుబ్రమణ్యస్వామి ఎం.పి. తదితరులు ఉండిరట. వారందరికిని రోజువారి ప్రయాణం మాకంటె కొంచం ఎక్కువగా చేయవలసి వచ్చెనట. మాకు నడక మొదలయిన మొదటి రోజు ''పంగు''లో విశ్రాంతి యుండగా వారికి మాకన్న 6 కిలోమీటర్ల దూరము ఎక్కువ ఉన్న శ్రీ నారాయణాశ్రమములో విడిది యుండెనట. అట్లే ఆ తర్వాత 'జిప్తి' తర్వాత 'మాల్పా' యుండెను. మాల్పా తర్వాత 'బుద్ధి'కి బదులుగా ''గార్బ్యాంగ్''లో విశ్రామముండెనట. దాని తర్వాత 'కాలాపాని'లో విడిది చేసిరి. మరియు చిట్టచివరి 'మజిలీ' 'నభీడాంగ్'లో కాక ఇంకా మూడు కిలోమీటర్ల దూరములోనున్న ''హిమచుంగ్'' అనే ఇంకా 200 మీటర్ల ఎత్తు ప్రదేశములో ఏర్పాటు చేసిరట. అంటే ఆ బృందమువారికి మాకన్న ఎక్కువ దూరము ప్రతిరోజు నడచుట ఎత్తెక్కుట వలన వారు మాకన్న ఎక్కువ బాధలు పడినట్లు తెలియుచున్నది.

ఆ బృందము 20 సంవత్సరముల తర్వాత చైనా దేశములోగల ఈ యాత్ర చేయుచున్నందున ప్రతి చిన్న పెద్ద గ్రామాలలోను వారికి సాదరముగా స్వాగత సమారోహములు బాగా ఉత్సాహముతో ప్రజలు జరిపించినట్లు ముందే తెల్పనైనది.

శ్లో. శ్రీమత్సుందరనాయకీం భయహరాం జ్ఞానప్రదాం నిర్మలామ్
శ్యామాభాం కమలాసనార్చితపదాం నారాయణ స్యానుజామ్
వీణావేణుమృదంగవాద్య రసికాం నానావిరాడంబరాం
మీనాక్షీం ప్రణతోఽస్మి సంతత మహం కారుణ్యవారాం నిధిమ్.

శ్లో. నానాయోగిమునీంద్రహృద్యవసతిం నానార్థసిద్ధిప్రదాం
నానాపుష్పవిరాజితాంఘ్రియుగళాం నారాయణే నార్చితామ్
నాదబ్రహ్మమయీం పరాత్పరతరాం నానార్థతత్త్వాత్మికామ్
మీనాక్షీం ప్రణతోఽస్మి సంతత మహం కారుణ్యా వారాం నిధిమ్.

(ఇతి శ్రీమచ్ఛంకరాచార్యకృతం మీనాక్షీ పంచరత్నమ్ సంపూర్ణం.)





రెండవ రోజు కైలాస శిఖర దర్శనము.



మాల్పా బుద్ధి మధ్యన చొక్కారావుగారు సైనికుల సహాయంచే ఎక్కుట.


నారాయణాశ్రమ స్వామీజీతో


ధార్చులా వద్ద, కాళిగంగా ప్రవాహముపై తీగవంతెన ప్రక్కన పర్వతము.



కాలాపానీలో కాళిమాత మందిరము క్రింది ఊట.



కాలాపాని నభిఢాంగ్ మధ్య ఛత్రిగలవారు కీ॥శే॥ రామకృష్ణన్‌గారు.



బుద్ధి, గుంజి మధ్యలో పూవనము



గౌరీకుండము

# పదునాల్గవ అధ్యాయం

## మన వేదములు - హిమాలయములు - పుణ్యక్షేత్రములు

శ్లో. వందే శంభు ముమాపతిం సురగురుం వందే జగత్కారణం।
వందే పన్నగ భూషణం శశిధరం వందే పశూనాం పతిమ్।
వందే సూర్య శశాంక వహ్నినయనం వందే ముకుందప్రియం ।
వందే భక్తజనాశ్రయం చ వరదం వందే శివం శంకరమ్.

మన భారత దేశము ఆధ్యాత్మిక చింతనకు భగవద్భక్తికి దివ్య క్షేత్రములకు ఖ్యాతిగాంచిన పుణ్యభూమి. మనది హిందూ ధర్మము. వేదశాస్త్ర పురాణ ఇతిహాసముల కూడలి. ఈ వేదములు హిందూధర్మ ముఖ్య గ్రంథములు. ఇట్టి మనవైదిక సాంప్రదాయమును గురించి కొంత వివరణ ఇచట అవుసరమని తోచినందున ఆ యంశముల నిక్కడ ప్రస్తావించుచున్నాను.

వేదము సర్వ ధర్మములకును మూలమని వేదలక్షణము. ఇష్ట ప్రాప్తి అనిష్ట పరిహారములకు అలౌకికోపాయ బోధకమగునవి వేదములని చెప్పబడెను.

''అలౌకిక శ్రేయస్సాధనతా బోధకో వేదః''. మరియు ''యస్య నిస్య సితం వేదాః''. యను సూక్తిచే సాక్షాత్ పరబ్రహ్మ ముఖము నుండి, నిశ్వాసమువలననే నప్రయత్నముగా వెలువడినట్లు చెప్పబడినందునకూడనవి. ''అపౌరుషేయము'' లనియు ''నిత్యము'' లనియు నిర్ధరించిరి. మరియు ''వేద ప్రాభవే సాదా సాత్సాక్ష ప్రామాణయాత్మనా'' అనియు ''భారతం పంచమో వేదః'' అనియు - వేద ధర్మ ప్రధాన తాత్పర్యములతో బోధించును కాన ఇతిహాసములు వేద వైశిశ్యములై బహువ ప్రబోధములైయున్నవి.

ఈ వేదములు బ్రహ్మదేవునిచే వినబడి ఆయనచే వచింపబడినట్లు తెలుపబడినది. వీనిని నారదాదిమునులు బ్రహ్మచే విని తమ తమ శిష్యులకు తెలియబరచిరి. ఈ వేదములు అపౌరుషేయములగు మూల గ్రంథములు.

వేదము ''విద్'' అనుధాతువుచే పేర్కొనబడినందున ''శృతిః అమ్నాయః'' అని చెప్పుదురు. ''విద ంత్యనేనేవ ఇతి వేదః'' అనియు ''విదంత్యనేనధర్మా ధర్మా వితి వేదః'' అనగా వీనిచే ధర్మాధర్మములు తెలియ జేయబడునని యర్థము. ''శ్రూయతే ధర్మా ధర్మాదిక మనయేతి శృతి ః'' - అంటే ధర్మా ధర్మములు వినబడునవి. ''అమ్నాయతే పారం పర్యేణే త్యామ్నాయః'' - పారంపర్యముగా నభ్యసించబడున విగాన 'అమ్నాయమని తెలియును. ఈ శృతి స్వయంభువగు నాదిదేవునిచే

నుడువబడినందున ''శృతిః'' యనియు మరియు శ్రోత్రేంద్రియములచే శబ్ద రూపముగా తెలియబరుప బడుటచేగూడ ''శృతిః'' యనబడినది. ఎల్లప్పుడు వల్లించుట-సాధనమైనందున ''అమ్నాయః'' యని యర్థమును పెద్దలు విశదీకరించిరి.

ఈ వేదములను అగస్త్య, కశ్యప ,ఆంగీరస, జమదగ్ని, పరాశర, గౌతమ, నారద, కణ్వ మేదాతిథి, శున స్సే,నాది మహామునులు వేద సంచయమునకు కర్తలని పెద్దలు చెప్పుదురు. ఈ వేదములు ఎంతేని శ్లాఘనీయములు. ఇందు ప్రాంపంచిక, పారమార్థిక, జ్ఞాన, ప్రబోధ విషయములన్నియు ఇమిడియున్నవి.

మహాభారతములో ఈ వేదముల గురించి ఇట్లు చెప్పబడెను.

ఆదియందు చతుర్ముఖుని హృదమునందున ఒక నాదముద్భవించెను. అందుండియే ఓంకారనాదము జనించెను. అదియే సర్వమంత్ర ఉపనిషన్మాల భూతమగు వేదమాతయనియు, అదియే త్రిగుణాత్మకమైన ''అ'' కా ''రో'' కారమకారం బులనెడు త్రివర్గ రూపంబై ప్రకాశించుచెండెను. భగవంతుడీ ప్రణవమువలన 'స్వర' 'స్పర్శాంత' ''స్థోష్మాది'' లక్షణ లక్షితంబగు అక్షర సమామ్నాయంబు గల్పించి తన వదన చతుష్టయము వలన వేద చతుష్టయమును గల్పించెను. అవియే చతుర్వేదములు. (1) ఋగ్వేదము (2) యజుర్వేదము (3) సామవేదము (4) అధర్వణవేదము. వీనిని బ్రహ్మపుత్రులగు బ్రహ్మవాదులు నభ్యసించి ప్రతి యుగమున నీ వేదములు ఋషులచేత శిష్యులకు బోధింపబడుచుండెను. ద్వాపరయుగమున భగవంతుడు సత్యవతీదేవియందు పరాశర మహర్షికి సుతుడై వ్యాస భగవానుడుగ జన్మించి ఆ వేదములను నాలుగు సంహితలుగా విభజించెను. పైల, వైశంపాయన, జైమిని, సుమంతులను, శిష్యులకుపదేశించెను.

**(1) ఋగ్వేదము** : పైల మహర్షిచే నుడువబడిన ఋగ్వేదము అనంత ఋక్కులతో జేరియుండుటచే ''బహ్వృచ''శాఖయని చెప్పబడెను. పైలుడు దీనిని 'ఇంద్రప్రమి'కి 'భాస్కలున కుపదేశించెను. భాస్కలుడు దానిని చతుర్విధములుగా విభజించి భోధ్యుండు, యాజ్ఞవల్క్యుండు, పరాశర అగ్ని మిత్రులను శిష్యుల కుపదేశించెను.

ఆ తదుపరినీవేదములు క్రమముగా ''ఇంద్రప్రమితి ''మార్కండేయునకు, తర్వాత వేదమిత్రుండు, తరువాత సౌభరిసుతుండు, శాకల్యుడు నేర్చి వీని నైదు విధములుగ విభజించిరి. ఇది వాత్సుండు, మౌద్గల్యుండు, శాలియుండు, శిశిరుండు నను శిష్యులకుపదేశించెను. ఆ తరువాత క్రమముగా జాతుకర్ణి, బలాకుండు, పైంగుడు, వైతాళికుడు, విరజాడు మున్నగువారుపదేశింపబడిరి.

ఈ ఋగ్వేదము పరమాత్ముని స్తుతించు మంత్రములు మరియు అత్యంత పురాతనమైనది. దీనిని పది మండలములుగా విభజించిరి. ఇందు మొదటి ఏడు అగ్నికి పదియవది ఇంద్రునికి సుత్తి చేయబడుచున్నవి. ఎనిమిది తొమ్మిది మండలములు విశ్వదేవతలపేర నుతింపబడుచు పరబ్రహ్మమును గూర్చి స్తోత్రము చేయబడుచున్నవి. వీనిలో ఆయా అధ్యాయములలో ధృతిని గూర్చి, అగస్త్యుని, ఇంద్రుని, వశిష్టమహర్షి, విశ్వామిత్రుడు మున్నగువారు ప్రార్థించిన గీతములు గలవు. ఇందులోనే ఓంకార గాయత్రీస్తుతియు గలదు. ఇవియేగాక నిందు రుద్రస్తుతి రాజుల చరిత్ర ప్రస్తావన, వారి పట్టాభిషేకము, ఇంద్రాదిదేవతల వర్ణన, భయ భక్తులలవరచుకొను కర్మలు, పురోహిత ఆచార్యుల లక్షణములు, వారికి చేయు మర్యాదలు, శత్రు విజయము, చంద్ర సూర్య సల్లాపములు, నీతివాక్యములు, లోక సృష్టి విషయములు మున్నగువాని స్తుతిని గూర్చి తెలియచేయబడినది.

ఈ ఋగ్వేదములో ఐతరేయ బ్రాహ్మణమును, ఐతరేయారణ్యకమును, ఐతరేయోపనిషత్తును, కైషీతక్యుపనిషత్తును మిగుల ప్రశస్తముగా భావింపబడుచున్నవి.

ఇట్లే ప్రతి సంహితకు బ్రాహ్మణ, అరణ్యాక, ఉపనిషత్ విభాగములు యేర్పడినవి.

(2) యజుర్వేదము : యజుర్వేదమును వైశంపాయనుడను మహర్షి తన శిష్యులగు యాజ్ఞవల్క్యుడు మున్నగువారికి నేర్పెను. ఈతడు గురువునకు అపరాధము చేసినందున ఈ వేదమును గురువునకు తిరిగి ఇచ్చివేసి పొమ్మనిన యాజ్ఞవల్క్యుడు తాను జదివిన యజుర్గణంబును తదుక్తక్రమంబున గ్రక్కగా నవి రుధిరాక్తంబగు రూపముదాల్చి ఆయాదేవతలు తిత్తిరి పక్షులై వానిని భుజించెను. అందుచే నవితైత్తిరీయ శాఖలాయెను. యాజ్ఞవల్క్యుండతిగా ఖిన్నుడై దుఃఖించి సూర్యుని గూర్చి యుగ్రతపమొనరించగా 'హయ' రూపమున సూర్యుడు యజుర్గణంబుల మరల నుపదేశించెను. అందుచే దీనికి ''వాజసనేయ శాఖయను'' నామము వచ్చినది.

ఈ యజుర్వేదము యాగములు, కర్మకాండ, యజ్ఞ యాగ, బలిదానములు మున్నగువాని మంత్రములు గల్గియున్నది. ఇందు అమావాస్య పౌర్ణమి దినములలో చేయు యాగములు, పితృ కర్మలు చేయు విధానములు, నిత్యకర్మవిధులు, అగ్నిష్టోమ సోమ పానాదులు, రాజసూయ వాజపేయ యజ్ఞములు, అశ్వమేధయాగమేగాక పురుష మేధము, సౌత్రామణి నారాయణ బలి మున్నగున వెన్నియో చెప్పబడినవి. ఈ స్తోత్ర భాగములందు పరమేశ్వరుని, ప్రజాపతిని, పరమేష్టి, నారాయణుడు, బృహస్పతి, ఇంద్రుడు, వరుణుడు, అశ్విని మొదలగు పేర్లచే కొనియాడబడి వాసిష్ఠ ,వాసుదేవ, విశ్వామిత్రులు కర్తలుగా తెలుపబడినవి.

**(3) సామవేదము :** సామవేదము జైమినిమహర్షి ద్వారా తన సుతుండు సుమంతుడు, ఆయన సుతుడు సుకర్ముడును నేర్చిరి. తర్వాత దీనిని తన కుమారుడు సహస్ర శాఖలుగా విభజించి కోసలుని కుమారుడైన హిరణ్యానాభుని కుపదేశించెను. ఇట్లు బ్రహ్మవేత్తలగు నావంత్యులు నేమూర్గరును సామవేద పారంగతులైరి. ఇందు తరచు ఋగ్మంత్రములు, స్వరయుక్తంగా నేర్పరచబడినందున ఈ పాఠ్యక్రియ ప్రాధాన్యత కల్గియున్నది.

ఈ సామవేదము గానరూపమైన గీతము గలది. ఇందు పరమేశ్వరుని ఇంద్రుడు మున్నగు నామములచే నుద్ఘోషింపబడినది. ఇందు ఛాందోగ్యోపనిషత్తు, కేనోపనిషత్తు నను నవి రెండునూ ప్రశస్తములైనవి. ఈ సామవేదము భక్తి ప్రధానముతో కూడుకొని యున్నది. ఈ వేదము నుండియే భరతముని సంగీత నాట్యముల గ్రహించి విస్తరింపజేసెను.

**(4) అధర్వణవేదము :** అధర్వణవేత్త సుమంతుమహర్షి, వేద ధర్ముండు శౌల్కాయని, బ్రహ్మ, బలి, పిప్పలాయనుడు, శుకకుండు, జాబాలి, శైంధవాయనుడు మున్నగు వారు వారి వారి శిష్య పరంపరగా నధర్వణ వేదమును వృద్ధి నొందించిరి. వేద సాహితి యొక్క ప్రధమ దశకు చెందు భావనలిందు నిక్షిప్తమై యున్నవి.

ఇందు శాంతిక, పౌష్టిక, చరకాది మంత్ర తంత్ర ప్రయోగములు గలవు. వీనిని వ్యాస మహర్షి శిష్యుడైన సుమంతుడు తన కుమారుడైన కబంధువున కుపదేశించెను. ఇది ఇరువదితొమ్మిది కాండములుగాను, ఆ తరువాత వందల అనువాకములుగాను, మరికొన్ని వందల సూక్తులుగాను విభజింపబడినది. ఇందు శత్రునాశనము, నక్షత్రములు, సంవత్సరములు, మాసములు, దినములు మున్నగునవే కాక, ప్రపంచోత్పత్తియు విశదీకరింపబడినది. అధర్వణ వేదమునుండి చరకమహాముని ఆయుర్వేద సంహితను ఆవిష్కరించెను.

ఈ వేదములు కర్మకాండ, ఉపాసనాకాండ, జ్ఞానకాండ మని మూడు విధములు 1) కర్మకాండయనగా ఇహ పరసుఖములకు దగిన కర్మానుష్ఠానము చేయు పద్ధతులు, అశ్వమేధము మున్నగు యజ్ఞములు, వాని వలన కలుగు ఫలములను బోధించును. ఈ ఫలమును జీవులు ఆయా లోకములలో అనుభవించి పునర్జన్మ పొందుచుందురు. 2) ఉపాసన కాండ యనగా పరమాత్ముని యందు భక్తిని చూపు విధానము, అట్లు చేయు వారికి కలుగు ఫలములను బోధించును. 3) జ్ఞానకాండ మనగా తత్వజ్ఞానము ద్వారా జ్ఞానము బోధించు మార్గము మరియు దానిచే కల్గు ఫలములను బోధించునది. అట్లే నీ వేదములు మూడు విధానములు కలిగియున్నవి.

(1) ''బ్రాహ్మణము''లనగా బ్రహ్మజ్ఞానులనుష్టించునవి. ఇవి వచన రూపమునున్నవి.

(2) ''మంత్రము''లనగా భగవంతుడు మున్నగువారిని స్తుతించు స్తోత్రములు, ఋషులు విన్నవి మంత్రములనియు, తెలిసికొన్నవి బ్రాహ్మణములనియు కొందరు విశదపరచిరి. ఇవి ఋగ్వేదములోని ప్రధాన విషయములై యున్నవి.

(3) ''అరణ్యకము''లనగా ఋషులు అరణ్యములో భగవంతుని గూర్చి స్తుతించిన భాగములు. ఇవి బ్రాహ్మణులకు టీక తాత్పర్యము వంటివని కొందరి భావము.

ఈ చతుర్వేదముల ముఖ్యాంశముల వివరించుటకు పది ఉపనిషత్తులు (వేదాంతములు) మరియు ఈ వేదాంతములకు అంగములైన షడంగములును వేదముల కనుబంధములగు ఉపవేదములును గలవు.

దశ ఉపనిషత్తులు : ఇవి వేదాంత ప్రధానములు.

1. ఈశావాస్యోపనిషత్తు
2. కేనోపనిషత్తు
3. కఠోపనిషత్తు
4. ప్రశ్నోప నిషత్తు
5. ముండకోపనిషత్తు
6. మాండూక్యోపనిషత్తు
7. తైత్తిరీయోపనిషత్తు
8. ఐతరేయోపనిషత్తు
9. ఛాందోగ్యోపనిషత్తు
10. బృహదారణ్యకోపనిషత్తు : యనునవి.

షడంగములు : ఇవి విద్యా విధులకు చెందు వివరణలు -

''శిక్షా వ్యాకరణం ఛందో నిరుక్తం జ్యోతిషం తథా।
కల్పశ్చేతి షడంగాని వేద స్యాహు ర్మనీషిణః॥

అంటే శిక్ష వ్యాకరణము ఛందము నిరుక్తము జ్యోతిషము కల్పము యను షడంగములు. ఆయా ఋషి పుంగవులచే రచింపబడిన వి. ఇవి శాస్త్రములుగా ప్రఖ్యాతమైయున్న, బోధనార్థముగల విద్యలు.

ఉపవేదములు : ఆయుర్వేదము ధనుర్వేదము గాంధర్వవేదము అర్థవేదము మున్నగునవి ఉపవేదములు. వీనికి మత ప్రధాన్యతలేనందును యెల్లరకు అందుబాటులో ఉన్నవి.

## పురాణములు

☝ వేదవ్యాస విరచితమైన పురాణములను గురించి ఈ విధముగా చెప్పబడినది. ☝

''మద్వయం భద్వయం చైవ బ్రత్రయం వచతుష్టయం।
అనాపలింగ కూస్కాని పురాణాని పృథక్ పృథక్॥''
బ్రాహ్మం పాద్మం వైష్ణవం చ శైవం లైంగంచగారుడం।
నారదీయం భాగవతం ఆగ్నేయం స్కాంద సంజ్ఞితమ్॥
భవిష్యత్ బ్రహ్మవైవర్తం మార్కండేయం చ వామనం।
వారాహ మత్స్య కౌర్మాణి బ్రాహ్మం చైవమితి త్రిషట్॥
బ్రాహ్మన్నేతం సమఖ్యాతం శాకా ప్రణయనం మునే॥

1. మత్స్య పురాణము 2. మార్కండేయ పురాణము (మద్వయం) 3. భవిష్య పురాణము 4. భాగవతము (దేవిభద్వయం) 5. బ్రహ్మపురాణము 6. బ్రహ్మండ పురాణము 7. బ్రహ్మవైవర్త (బ్రత్రయం) పురాణము 8. వామన పురాణము 9. వాయు పురాణము 10. విష్ణు పురాణము 11. వరాహ పురాణము (వచతుష్టయం) 12. అగ్ని పురాణము 13. నారద పురాణము 14. పద్మ పురాణము (అనాప) 15. లింగ పురాణము 16. గరుడ పురాణము (లింగ) 17. కూర్మ పురాణము 18. స్కంధ పురాణము (కూస్కాని) యనునని మొత్తము అష్టాదశ పురాణములు. వీని యొక్క బుక్కుల సంఖ్యా వివరములు కూడ తెలుపబడినవి. అందు మొదటిది 14,000, రెండవది 9,000, మూడవది 14,700, నాల్గవది 18,000, అయిదవది 10,000 ఆరవది 12,000, ఏడవది 18,000, ఎనిమిదవది 10,000, తొమ్మిదవది 24,600, పదియవది 23,000, పదకొండవది 24,000, పన్నెండవది 16,000, పదమూడవది 25,000, పద్నాలుగవది 55,000, పదిహేనవది 11,000, పదహారవది 19,000, పదిహేడవది 17,000, పద్దెనిమివది 81,000 అని తెల్పబడినది.

ఇవి కాక ఉపపురాణములు కూడ నున్నట్లు సూతుండు తెలిపెను. ఇందులో సృష్టి క్రమము. రాజ్య వంశములు, పలు అభ్యాసములు, నీతులు వివరించబడినవి.

1. సనత్కుమారము 2. నారసింహము 3. నారదీయము 4. శివము 5. దూర్వాసము 6. కపిలము 7. మానవము 8. ఔశినవము 9. వారణము 10. కల్కి 11. సాంబము 12. నంది 13. సౌర 14. పరాశర 15. ఆదిత్య 16. మహేశ్వర 17. భాగవత 18. వాశిష్టము లను నీ పద్దెనిమిది ఉప పురాణములుగా చెప్పబడినవి.

☝ ఈ పురాణ ఉప పురాణములన్నియు సాక్షాత్తు విష్ణు అంశతో కూడిన వేదవ్యాస విరచితమనుటకు ఈ శ్లోకము ద్వారా తెలియజేయుటయే గాక, వేదసారముల యొక్క విపులీకరణయనియు తెలియుచున్నది. ☝

శ్లో॥ ద్వాపరే ద్వాపరే విష్ణు ర్వ్యాస రూపేణ సర్వదా।
వేదమేకం స బహుధా కురుతే హిత కామ్యయా॥

☝ ఆ తరువాత శ్రీమద్రామాయణ మహాభారతాదులు ఇతిహాసములుగా చెప్పబడినవి. వీనితోపాటు కావ్య ప్రబంధములు కూడ ప్రాచుర్యము పొందియున్నవి.

శ్లో॥ గంగా గంగేతి యో బ్రూయా ద్యోజనానాంశతైరపి।
ముచ్యతే సర్వపాపేభ్యో విష్ణులోకం చ గచ్ఛతి॥

వందల వేల క్రోసుల దూరమున నున్న హిమాలయములు, అందుండి వెలువడు గంగను, స్మరించినంత మాత్రముననే పాపముల నుండి విముక్తులై, వైకుంఠమునకు పోవుదురని పురాణ శ్లోకము చెప్పుచున్నది.

శ్లో॥ హర్షిర్హరతి పాపాని హరి రిత్యక్షర ద్వయం॥

హరియను రెండక్షరముల నామోచ్చారణ సమస్త పాపముల హరించును. రామ, కృష్ణ, శివా మున్నగు నామములన్నియు పాపముల పటాపంచలు చేయునని పురాణోక్తి.

శ్లో॥ ప్రాతఃకాలే శివం దృష్ట్వా నిశి పాపం వినశ్యతి।
ఆజన్మకృతం మధ్యాహ్నే, సాయాహ్నే సప్తజన్మనామ్॥

☝ మానవుడు ప్రాతః కాలమున శివలింగమును పాషాణమూర్తిని దర్శించిన మాత్రమున రాత్రి చేసిన పాపము లన్నియును, మధ్యాహ్నమున దర్శించిన జన్మలో చేసిన పాపములన్నియును, సాయంకాలమున దర్శించిన ఏడు జన్మల పాపములు నశించి పోవునని పై శ్లోక భావము.

కావున పుణ్య హిమాలయములలోగల ఎన్నో పుణ్యక్షేత్రముల గురించి వాని దివ్యత్వమును గురించి అచట నుద్భవించు నదుల గురించి హిమాలయములలో గల ముముక్షువుల గురించి అనేకానేక విషయములు తెలిసికొనుట అవుసరము. కావున వాని గురించి సంక్షిప్తముగా తెలియచేయుచున్నాను.

ఈ దేశమున గల పుణ్యక్షేత్రములు దేవుడి ఆరామములు, ఆశ్రమములు ఏ ఇతర దేశములలో కానరావు. ఇచటి సాధుపుంగవులు ఋషులు మునులు తపస్సంపన్నులు ధ్యానపరులు మనకెంతయు ఆప్తులు. మన వేదవేదాంగ పురాణ

ఇతిహాస కావ్యము లన్నియు ఈ హిమాచల సన్నిధిలోనే ఉద్భవించియున్నవి. అవి మన ప్రాచీన చరిత్రనే కాక ఆధ్యాత్మిక సాంస్కృతిక మనస్తత్వ ఔన్నత్యమును కూడ చాటి చెప్పునవిగా ప్రసిద్ధములై యున్నవి. మన భారతదేశము ఆసేతు హిమాచలము మూల మూలల ఎన్నో పుణ్యక్షేత్రములున్ననూ అతిముఖ్యమయినవి, అతి ప్రాచీనమైనవి పురాణ ఖ్యాతి గాంచిన వన్నియును ఈ పవిత్ర హిమాలయ పర్వత ప్రాంతములలోనే వెలసియున్నవి. బదరీనాథ్, కేదారనాథ్, పశుపతినాథ్, అమర్‌నాథ్, తుంగ్‌నాథ్, వైష్ణవీదేవి, గుప్త కాశీ, హరిద్వార్, హృషికేశ్, రుద్రప్రయాగ్, నంద ప్రయాగ్, దేవ ప్రయాగ్, గంగోత్రి, యమునోత్రి మొదలుగా గల ఎన్నో క్షేత్రములు ఆదర్శ ఆధ్యాత్మిక కేంద్రములని ఎల్లరకు తెలిసిన విషయమే. ఈ క్షేతములే కాక హిమవత్పర్వతములలో ఇంతవరకు బయటపడని, మానవులు ద.ర్శింపజాలని హిమముచే కప్పబడి నట్టియు మరెన్నో క్షేత్రములు మనము తెలిసికొనవలసియున్నది.

గంగా, యమున, భగీరథి, బ్రహ్మపుత్ర, సింధు, సరయు మొదలగా గల పుణ్య నదులన్నిటికిని జన్మస్థాన మీ హిమాలయాలే. ఆది దంపతుల నివాసమగు కైలాసము ప్రథమ బ్రహ్మ మానస జనితమగు పవిత్ర మానస సరోవరము కూడ ఈ హిమాలయ పర్వత పంక్తులలోనే యున్నవి. కావున ఈ పుణ్యక్షేత్రములు పుణ్య నదులు మన ఆధ్యాత్మిక పురాతన సంస్కృతికి పెట్టని కోటలుగా నిలిచినవి.

ఈ హిమాలయ పర్వత శ్రేణులు మన దేశమున పశ్చిమోత్తరముగా కాశ్మీరు గాంధార ప్రాంతములనుండి తూర్పున అస్సాము వరకు దాదాపు మూడు వేల కిలోమీటర్ల పొడవును 300 నుండి 500 కి.మీ.ల వెడల్పును కలిగియుండి ఎన్నో శ్రేణులుగా విభజింపబడియున్నవి. కైబరుశ్రేణి, జస్కర్ శ్రేణి, (రేంజ్), గ్రేటర్ హిమాలయశ్రేణి, హిందుకుష్ శ్రేణి, మహాభారత శ్రేణి, కైలాసశ్రేణి, శివాలిక్ శ్రేణి, ధోలీథార్ శ్రేణి, జస్కర్ శ్రేణి, మున్నగునవి దేనికదే విఖ్యాతి గాంచియున్నవి. ప్రతి ిణిలోను ఎన్నో ఎత్తైన శిఖరములు శిఖరాగ్రములు కలవు.

ఈ శిఖరములు కొన్ని ఎల్లవేళల మంచుతో కప్పబడియు, మరికొన్ని ులల తరబడి మంచుతో కప్పబడియు ఇంకను కొన్ని అప్పుడప్పుడు మాత్రమే మంచుచే కప్పబడియు నుండును. ఉదా : హిమాద్రి, హిమాచల, హిమగిరి, నంగాపర్వత్, మౌంట్ ఎవరెస్ట్, గౌరిశంకర్, జాంగ్‌సాంగ్, గుర్ల, మాంధాత, కైలాష్ మున్నగు శిఖరములు 20,000 అడుగుల మొదలు 30,000 అడుగుల వరకు ఎత్తున దాదాపుగ ఎల్లవేళల మంచుచే కప్పబడియున్నవి.

మహాకవి కాళిదాసు రచించిన కుమార సంభవములో హిమవత్పర్వతముల ప్రశస్తి విశదీకరింపబడినది. ☝

శో॥ అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా
హిమాలయో నామ నగాధిరాజః
పూర్వాపరౌ వారినిధీ విగాహ్య
స్థితః పృథివ్యా ఇవ మానదండః.

తా॥ ఉత్తరదిశకు దేవతాత్మయైన పర్వతరాజమగు హిమాలయమున్నది. అది పూర్వ పశ్చిమ సముద్రముల నంటుకొని భూమిని కొలచే కొలకర్రగా నిలచియున్నది. యని కాళిదాసు వర్ణించెను.

అల్లసాని పెద్దన రచించిన మను చరిత్ర మందు ప్రవరాఖ్యుడు హిమాలయములను చూచి వర్ణించిన ఈ క్రింది పద్యమును అన్వయించును.

చ॥ అట జని కాంచె భూమిసురు డంబరచుంబి శిరస్సరజ్ఝరీ-
పటల ముహుర్ముహుర్లుఠదభంగతరంగ మృదంగనిస్స్వన-
స్ఫుటనటనానుకూల పరిఫుల్ల కలాప కలాపిజాలమున్
గటకచరత్కరేణు క-రకం పితసాలము శీతశైలమున్.

తా॥ సెలయేళ్ల మ్రోత మిక్కుటముగా నుండి ఆకాశాన్నంటు శిఖరముల నుండి దొరలుట వలన వచ్చు శబ్దమును, ఉరుములని భ్రమించి నెమిళ్ళు తాళయుతముగా నాట్యము చేయుచుండును. ఎందరెందరో మహానుభావులే కాక, పలువురు ఆంగ్లేయులు కూడ హిమాలయముల ఔన్నత్యమును సౌందర్యమును అనేక రీతులుగా శ్లాఘించియున్నారు. వీరిలో నికలాయ్ రోరిచ్ యను రష్యన్ చిత్రకారుడు అగ్రగణ్యుడని చెప్పవచ్చును.

☝ ఈ హిమాలయ పర్వతములను శ్రేణులను శిఖరములను ఒక్కొక్క దానిని తిలకించిన కొలది యాత్రికులకు ఒక్కొక్క రీతిగా దివ్యానుభూతి కలుగుచుండును. మరియు మనలో నిద్రాణమై అణగారియున్న ఆధ్యాత్మిక చింతన, భగవద్భక్తి, నిశ్చలధ్యానము, ఆహ్లాదము, ఆనందము, తన్మయత్వము, భగవత్తత్వము మనకు తె లియకుండగనే హృదయ కవాటములు త్రెంచుకొని పెల్లుబుకుచుండును. ఈ హిమ శిఖర దర్శనములు ఆనందానుభూతి వర్ణనాతీతము, అనూహ్యము. దీనికి స్వీయానుభవమే సరియగు దృష్టాంతము. ఈ హిమాలయములలో ఇప్పటికిని మనకు తెలియని ఎన్నెన్ని పర్వత శ్రేణులు, శిఖరములు, లోయలు, దివ్య క్షేత్రములు హిమముచే కప్పబడియున్నవో తెలియదు. ఆయా పర్వతారోహక బృందముల కృషివలన నవీన దృశ్యములు క్షేత్రములు బయటపడినచో భక్తులకు దృశ్య సందర్శనాకాంక్షులకు ఉత్తేజకరము కలుగచేయును.

ఈ హిమాలయములలో పలురకముల పక్షలు వివిధ జంతు జాలములు, అమూల్యమగు వనమూలికలు అత్యున్నతమైన వృక్షములు ఎంతో విలువైన ఖనిజములు, సుందరములును ప్రకృతి సిద్ధమగు పూల వనములును, ఎన్నో నున్నవి. ఇవేకాక అత్యున్నతమైన దివ్య ఔషధులును మూలికలును ఇచట నున్న విషయములు ఎల్లరకును విదితమే. అలాగే పునుగుపిల్లులు,కస్తూరి జింకలు, సుగంధ ద్రవ్యములకును నెలవైయున్నవి.

గీ॥ పాలవెల్లి గడచి యోలి నుత్తర దిశ
బరగు ద్రోణచంద్ర గిరివరంబు
లమృతమచట నుండు నందు నీ మందులు
గలవు రాత్రులందు వెలయుచుండు. (భాస్క. రామా. యుద్ధ)

అని రామాయణములో చెప్పబడినది. రావణుని శక్తి ఘాతముచే మూర్ఛిల్లిన లక్ష్మణుని మూర్ఛ దేర్చుటకు పవమానసుతుడగు ఆంజనేయునికి, సుషేణుడను పేరుగల లంకా రాజవైద్యుడు, ఈ ఓషధులను గూర్చి వివరించియున్నాడు.

1. సావర్ణ్యకరణి : రక్తస్రావముచే వివర్ణత గల్గినవానికి ఉపయోగపడునది.
2. విశల్యకరణి : యెముకలు విరిగినవానికి అతుకుట కుపయోగ పడునది.
3. సంధానకరణి : మాంసస్నాయువులు నరములు పునర్నిమితము లగుట కుపయోగపడునది.
4. సంజీవకరణి : చనిపోయిన వానిని పునః ప్రాణ ప్రతిష్ఠ గావించునది.

ఈ పైన తెల్పిన ఓషధులన్ని హిమాలయములలో నున్న ద్రోణ పర్వతమున నున్నట్లు వానినే ఆంజనేయుడు గొనితెచ్చి లక్ష్మణుని బ్రతికించినట్టు తెలియచేయుటేకాక నేటికిని ఈ పైన తెల్పిన ఓషధులు మరెన్నో ఇతర ఓషధులును ఈ దివ్య హిమాలయములలో నున్నట్లు విశ్వసింతురు.

ఇంతేకాక అన్నిటికన్న ముఖ్యమైన మన ఋషులు, తాపసులు వందల వేల సంవత్సరములనుండి సజీవంగా ఉంటూ ఆకులలములు భుజించు తపోధనులు, శ్వాసను మాత్రమే పీల్చుచు జీవించు మరికొందరు, శ్వాసను కూడ బంధించిన మరెందరో మహానుభావులు, ఈ పుణ్య హిమాలయ ప్రాంతములో నేటికి ఉన్నట్లు విశ్వసించువారు ఎందరో యున్నారు. బ్రహ్మర్షుల, ప్రజాపతుల గాథ లన్నియును జరిగినవి ఈ దివ్య హిమాలయములలోనేనని విశ్వసించువారెందరోగలరు.

ఈ హిమాలయ పర్వతశోభను గాంచగనే మనస్సు అయస్కాంతము వలె ఆకర్షింపబడి తనకు తెలియకుండానే ఆధ్యాత్మిక భక్తి ప్రపత్తులలో నిండి నిబిడీకృతమగు తన్మయత్వాను భూతులను బొందును. అందుకే జిజ్ఞాసాపరులు పవిత్రులు శుద్ధ తత్వజ్ఞులు ధార్మికులు తపస్సంపన్నులు ప్రకృతి దృశ్యకాంక్షాపరులు, ఎన్ని ఇడుములకైనను ఓర్చి, సాహసించి, ప్రమాదముల నెదిరించి, కీళ్ళను కొరుకు చలిని భరించి, హిమాచల పుణ్య తీర్థయాత్రలు జరిపి, ప్రకృతియొక్క అత్యున్నత సౌందర్యశోభను తిలకించి, పులకించి తన్మయత్వము నందుచు, ఇహపరములను సాధించు ప్రయత్నమును నేటికిని చేయుచున్నారు.

ఇందుకై హిమాచల దర్శనీయ క్షేత్రవివరములు వివరణ ప్రత్యేకానుబంధములో పొందుపరచనైనది.

ఒక్క మాటలో చెప్పాలంటే ఈ పుణ్య హిమాలయముల గురించి ఎంత వ్రాసినను ఎంత చదివినను ఎందరి నోట విన్నను తనివి తీరదు. జీవితములో ప్రతివారును ఒక్కసారైనను ఈ ప్రకృతి ప్రసాదించిన శోభను మనసారా నయనానంద భరితముగా తిలకించి అనుభవించి, ఆస్వాదించవలసినదే.

హిమాలయ పర్వతముల నధిరోహించుట సాధ్యపడనివారికి వారి మనస్సు హృదయము పవిత్రమగుటకుగాను పావన గంగానదిలో స్నానమాచరించుట గంగానదీ జలమును గ్రోలుట గంగామాతను పూజించుట గంగాదేవి ఔన్నత్యమును పొగడుట మొదలగు విధులు ముఖ్యములు. దీనిసేవకు దాదాపు మైదానభాగములోనున్న పుణ్యహృషికేశ క్షేత్రమును లాంఛనముగా నెంచుకొనవచ్చును. ఇది భారతీయుల కెల్ల సులభముగా అందుబాటులో నున్న హిమవత్ పాద పీఠము. ఇచ్చట కూడ ఋషులు తాపసులు భక్తులు ఎందరో ఉన్నారు. మన మనోమలినములను పాపములను పార ద్రోలి పవిత్రతను పొందుటకు ఇది సులభోపాయము.

ఈ మంచుకొండలు నదులు వాని అందచందములు, అవి కల్పించు సంతోషములన్నియు భూసంబంధమే. కాని మనకు కల్గు నీ విశేషానుభూతులన్నియు దైవీతత్వములే కాకున్నచో నీఅందచందములను గ్రోలుట మానవ మాత్రులకు సాధ్యపడుట దుస్తరమైయుండెడిది. దేవి ఉపాసన విధులు దేవి భాగవతమున నీవిధముగా తెలుపబడినవి.

దేవి ఉపాసనా విధానములు : లోకములోని ''దృశ్యమాన ప్రపంచమంతయు'' దేవీనివాసమే అని అంబ స్వయముగా నుడివెను. ఆమెలేని ప్రదేశమే లేదు. దేవి సర్వస్వరూపిణి గావున సర్వకాలములును ఆమెకు త్సవ దినములే. అందు ముఖ్యములు కొల్హాపురమున మహాలక్ష్మి, సహ్యాద్రి యందు రేణుక, వింధ్యాచల వింధ్యావాసిని,

కాంచీపుర అన్నపూర్ణ, నేపాళమున గుహ్యకాళి, వేదార ణ్యమున సుందరి, చీనా దేశమున నీల సరస్వతి, వైద్యనాధమున బగళ, స్వీయస్థానమైన మణిద్వీపము, కామాఖ్య దేశమున త్రిపుర, భైరవీస్థానములు, అవిముక్తమున విశాలాక్షి యని కాశీపురాణములో వర్ణించబడినది. అందుచే నాయాక్షేత్ర మహాత్మ్యములు తెలసికొని, ఆయామూర్తుల సేవించి, జప దాన పరాయణుండై, ఎవరైనను భవ బంధవిముక్తి నొందవచ్చును.

వ్రతములలో ముఖ్యమైనది రసకళ్యాణి వ్రతము, అనంత తృతీయమున చేయవలెను. శుక్ర, సోమ, కృష్ణ చతుర్దశీ, పూర్ణిమలు ముఖ్యదినములు. ప్రదోష వ్రతము దేవికి ప్రీతికరము. నవరాత్రి ద్వయము లుత్తమోత్తమములు. చైత్రాశ్వీయుజ మాసమున ప్రతి వర్షము శుద్ధపాఢ్యమి మొదలు నవమి వరకు నిత్యవిధి సేవించవలయును.

పూజావిధులు బాహ్యాంతరములని ద్వివిధములు. వైదిక తాంత్రికము గూడ ద్వివిధములు. శృతి స్మృతి సంబంధము సధర్మము. అన్యశాస్త్ర పూజ అధర్మము. తంత్రాంతరముల వేదవిరుద్ధముల వినబడునవి శ్రోత్రేతరుల యనుగ్రహపాత్రములు. ఎట్లన :

శ్లో॥ ''అన్యాని యాని శాస్త్రాణి లోకే స్మి న్వివిధాని చ॥
శృతిస్మృతివిరుద్ధాని తామస్వాన్యేవ సర్వశః ।
వామం కాపాలకం చైవ కౌలకం భైరవాగమః ॥
శివేన మోహనార్థాయ ప్రణీతో నాన్యహేతుక ః ।

ఇట్లు వేదశాస్త్రాగమముల పరిశీలించి తద్ధర్మమును నిర్ణయించుకొని దేవిని పూజించి తరించవలెను. బాహ్యపూజ ఆచార అనాచారముల ననుసరించి యెట్లున్నను దోషయుత దోషరహిత గుణములైనను ముఖ్యముకాదు. ముక్తి హేతువు జ్ఞానము. దానిఫలితము గాంచుటకు అంతర శోధనావశ్యకము శృతులననుసరించి శ్రద్ధగా ననుష్ఠించి మానవుడు కృతకృత్యుడు కాగలడు. ఎట్లన :

శ్లో॥ ధర్మేణ సహితం జ్ఞానం పరం బ్రహ్మ ప్రకాశయేత్।
సర్వేషణాః పరిత్యజ్య మామేవ శరణం గతాః ॥
సర్వభూతదయావంతో మానాహంకారవర్జితా ః
మచ్చిత్తా మద్గత ప్రాణా మద్ధ్యానకథనే రతాః ॥

సంన్యాసినో వనస్థాశ్చ గృహస్థా బ్రహ్మచారిణః ।
ఉపాసంతే సదా భక్త్యా యోగ మైశ్వర్యసంజ్ఞితం ॥

తేషాం నిత్యాభియుక్తానా మహ మజ్ఞానజం తమః।
జ్ఞానసూర్య ప్రకాశేన నాశయామి న సంశయః ॥

అంతరపూజ సర్వము జ్ఞానమయము. అట ద్రవ్య సముచ్ఛయాది కర్మలు లేవు. నిర్గుణ తేజోమయమగు నారూపము ధ్యాన, జప, తప అర్థము ఆ సంవిస్మయంబైన రూపము నిరాశ్రయంబైన దానిని చిత్తమందు నిలిపి సర్వేంద్రియము లచట లగ్నము గావించిన చాలును. ఆ తర్వాత చేయునదేమియుండదు. బాహ్యమంతయు మాయ మిథ్య, జగత్తు.

శ్లో॥ పాశాంకుశవరాభీతిధరా మానందరూపిణీం ।
పూజయే దుపచారైశ్చ యధావిత్తానుసార త ః ॥
యావ దాంతర పూజాయా మధికారో భవే న్న హి ।
తావ ద్బాహ్యా మిమాం పూజాః శ్రయే జ్ఞాతే తు తాం త్యజేత్ ॥

పై విధముగా దేవి ఉపాసనావిధులు నిర్వచించబడినవి. దక్షయజ్ఞగాధ మరియు దైవీక్షేత్రముల వివరములు పాఠకుల ఆసక్తి కొరకై శ్రీ అత్తలూరి మృత్యుంజయ శర్మగారి 'సృష్టి క్రమ' వ్యాసమున పొందుపరప బడినవని గమనించ ప్రార్థన.

శ్లో ॥ శంభో త్రినయన చంద్రచూడ శివ శంకర గిరిజాకాంత ।
అంభోజాసనముఖ్య దేవతావందిత చరణోపాంత।
కాలకాల కరుణామయమూర్తే కలికలుషాపహకీర్తే ।
నీలరుచిగళానంద? నీరదనిర్మలమూర్తే
భక్తిం తవ పద పంకజయుగళే భక్త జనావన దేహి ।
ముక్తి సరణి మనిశం మదనాంతక మృత్యో ర్మాం పరిపాహి।
తాపత్రయహర। పాపవినాశన పురుషోత్తమ త్రిపురారే।
చాపభూతకనకాచల! దోర్బలఖండితనిఖిలసురారే ।
(ఇతి శ్రీ శివస్తుతి ః)



## పదునైదవ అధ్యాయము

## దూదిలాటి తెల్లని మెత్తని మంచులో :

శ్లో. శ్రీమేధాదక్షిణామూర్తి రూపాయ పరమాత్మనే ।
నమ శ్శివాయ వేద్యాయ నాధాయ గురవే నమః.
ఓం ఓంకారస్తు పరం బ్రహ్మ సర్వ మోంకార సంభవం
అకారోకారమాంతాయ ఓంకారాయ నమో నమః.
న నమస్తే దేవదేవేశ! నమస్తే పరమేశ్వర ।
నమస్తే వృషభారూఢ! నకారాయ నమోనమః ॥
మః మహాదేవం మహాత్మానం మహాపాతకనాశనమ్ ।
మహానటవరం వందే మకారాయ నమో నమః.
శి శివం శాంతం జగన్నాథం లోకానుగ్రహకారకమ్ ।
శివ మేకపదం దేవం శికారయ నమో న మః.
వా వాహనం వృషభో యస్య వాసుకి ః కంఠభూషణమ్ ।
వామే శక్తి ధరం దేవం వాకారాయ నమో నమః.
య యత్ర యత్ర స్థితో దేవః సర్వవ్యాపీ మహేశ్వర ః ।
య ల్లింగం పూజయే న్నిత్యం యకారాయ నమో నమః.

✍ గతరోజు మాకివ్వబడిన ఆదేశాను సారము 29-7- 1983 రోజు ఉదయము నాలుగు గంటలకే మేలుకొంటిమి. నేను ప్రతిరోజు ఉదయం ఏదోవిధముగా 'టీ' కాచేవారి నుండి కొంత వేడి నీటిని సంగ్రహించి చన్నీరు కలిపి స్నానము పూజ నిన్నటివరకు చేసితిని. కాని నేడు అది సాధ్యపడలేదు. మా మిగిలిన వారందరు ''బుద్ధి'' లో చేసిన స్నానమే చివరిది. నేను నేడు నమస్కారములతోనే సరిపుచ్చుకొంటిని. అందరము ముఖ ప్రక్షాళన గావించుకొని 5 గంటలకే 'నిగము' వారు ఇచ్చిన ఉడికించిన గుగ్గిళ్ళు భుజించి టీ త్రాగితిమి. నేడు మాకు దారి మధ్యన భోజనము దొరకదు. కావున వారు పూరీలను పొట్లములలో కట్టి ఇవ్వగా తీసికొంటిమి. శ్రీ ఉపాధ్యాయగారి ఆరోగ్యము బాగు పడనందున డ్నాక్టరుగారు అచటనే నిలిపివేసిరి. మేము ఒక్కొక్కరము ఉపాధ్యాయగారిని ఆలింగనము చేసుకొని వీడ్కోలు చెప్పితిమి. వారు ఇంత శ్రమ పడియు ఈ యాత్ర పూర్తి చేయలేక పోయితిని కదాయని కనుల నీరు జలజల కార్చుచుండిరి. మా మనసులలో దుఃఖభారమునిండెను. కాని చేయునది లేక మేము ప్రయాణమైతిమి. మా మిలిటరీ డ్నాక్టరు మమ్ములనందరిని ఒకరితరువాత నొకరిని 'క్యూ' (వరుస) లో నిలిపిరి. ఎవ్వరును వరుసతప్పకూడదని ఆజ్ఞాపించిరి.

మా చిన్ననాటి డ్రిల్లు మాస్టారు మాకు జ్ఞాపకము వచ్చిరి. ఇంకను మసకమసకగానే యుండెను. అట్లు మా ప్రయాణము సాగెను. మావెంటనున్న మిలిటరీ డాక్టరు అందరికంటే ముందునడువగా మేము వరుసలో ఒకరివెనుక ఒకరముగా నడచుచుంటిమి. మా వెనుక జవానులు వారివెనుక గుర్రములు వానిపై మా పెద్దలు వాని వెనుక సామానులు మోయు గుర్రములు వచ్చుచుండెను.

మేము మెల్ల మెల్లగా నడుచుచుపైకి ఎక్కుచుంటిమి. దారి పిల్లదారి. మెట్లులేవు. మధ్యమధ్యన మంచుదిబ్బలు హిమముచే వచ్చు నీటి ధారలు మాచుట్టును మంచు కొండలు మహోన్నత శిఖరములు. ఇట్లే దాదాపు ఒక కిలోమీటరు దాటితిమి. పైకి ఎక్కుట ఎక్కువయ్యెను. మధ్యలో రాళ్ళను దాటుచు పైకెక్కుచు ఆయాసపడుచు ఆగుచు శ్వాసతీసికొనుచు ఎంతో మెల్లగా నడచుచుంటిమి. పూర్తిగా తెల్లవారెను. నేడు శ్రీ చొక్కారావుగారు, రంగాచారిగారు, కులకర్ణిగారు ధావేగార్లతోపాటు షణ్ముఖ సుందరం, రామకృష్ణన్‌గారు కూడ గుర్రములపై వచ్చుచు మా కంటె ముందుకుపోయిరి. మరియు నడకలో అగ్రగణ్యుడుగా నున్న ''ఘోష్‌దాదా'' నేడుకూడ ఇతరులందరికన్న ముందే సాగిపోయెను. ఆ ప్రదేశమున మాకు ఎచ్చట కూడ మహావృక్షములు కాదుగదా పొదలు కాని గడ్డిపరకయు కూడా కానరాలేదు.

మేము పైకి ఎక్కిన కొలది ఆమ్లజనిలోపము ప్రస్ఫుటముగా అనుభవమగు చుండెను. విపరీతమైన ఆయాసము వచ్చుచుండెను. ఇట్లే దాదాపు ఏడుగంటలకు 'హిమచుంగ్' అను 4,800 మీటర్ల ఎత్తు ప్రదేశమును జేరితిమి. ఆ ప్రదేశములలో ఉదయము మంచుపడుట సహజము. మేము చాలా నీరసించిపోయితిమి. కాలు ముందుకు పడుటలేదు. పది అడుగులు ముందుకు వెళ్ళుసరికి విపరీతమైన ఉచ్ఛ్వాస నిశ్వాసముల ఒత్తిడికి గురియగుచుంటిమి. పైకి చేరు ఆశ సన్నగిల్లు చుండెను. మేము పది పదకొండు గంటలవరకే ''లిపు పాస్'' చేరవలయును. లేనిచో ఈ ప్రదేశములో వీచు హోరుగాలి మరీ ఎక్కువై మనుష్యులను కూడ ఎత్తివేసి ఎచటనో పడవేయవచ్చును. పైగా వర్షము మొదలైనచో ఇక చెప్పున దేమున్నది. కాని ప్రస్తుతము అటువంటి అవరోధసూచనలు కనబడుటలేదు. ఎండ ఇప్పుడిప్పుడే బాగుగా వచ్చుచున్నది. గాలిమాత్రము హోరెత్తుచున్నది. నాతో అగర్‌వాల్, మరియు డాక్టరు 'మోఖా' మాత్రమే మిగిలియున్నారు. మిగిలిన వారందరు ముందుకు వెళ్ళిపోయినారు. నావెనుక జవానులు డాక్టరు గోడ్బేలే మాత్రమే ఉన్నారు. నాకు కాళ్ళు లాగుట ఆయాసము ఎక్కువగుటచే ఒకశిలపై కూర్చుంటిని.

నాతోనున్న మిత్రులు ముందుకు వెళ్లిరి. డాక్టరు ''గోడ్బేలే'' వచ్చే వరకు వుండి కొన్ని బిస్కట్లు తిని నీరు త్రాగి ఆయనకు కొన్ని బిస్కట్లు కొంత నీరు ఇచ్చి మరల ప్రయాణమైతిని. నా వెంట నున్న మిలటరీ జవానులు - అదుగో ఆ

కనబడు చోటు నుండి ప్రయాణము సమతలభూమిపై యున్నదని పైకెక్కు శ్రమ లేదని మాకు ధైర్యము చెప్పుచుండిరి. మేము నిజమని నమ్మి కొంతదూరము మెల్లగా నడచుచు ఆ ప్రదేశమును చేరితిమి. కాని తర్వాత మేము ముందుకు చూడగా అచట మరింత పైకెక్కునట్లున్నది. దూరాన హిమము మెత్తని దూది ఎండలో ఆరబోసినట్లు మాదారిలో కన్పడుచున్నది. కాని అక్కడికి చేరాలంటే మాకు సాధ్యపడేటట్లు లేదు. నేను పది గజాల దూరమున కొకసారి నిలబడి శ్వాస తీసికొనుచుంటిని. కాని డా. గోడ్బోలే నాలుగు గజాలకొకసారి ఆగి మొసతీయుచుండెను. నేను 'ఎలక్ట్రాల్ నీరు (గ్లూకోజు నిమ్మరసము కలిసిన) త్రాగి ఆయనకును మధ్య మధ్యన ఇచ్చుచునే యుంటిని. మొత్తానికి 8½ గంటలకు ఒక కిలోమీటరు వెడల్పాటి ఐదారు కిలోమీటర్ల పొడవుగల దూది వలె మంచు ఆరబోసిన మెత్తని హిమస్థలమును జేరి పదినిముషములు విశ్రమించితిమి.

ఆ మెత్తని మంచును దాదాపు ఒక కిలోమీటరు వరకు దాటవలసి యుండెను. అందులో అడుగువేసేవరకు బూటు సహితముగా పాదములు మంచులో దిగబడి పోవుచుండెను. ఆ మంచుపై బడి దొర్లితే ఎంత బాగుండునో యని యనిపించెను. సినీమాలలో హీరో హీరోయిన్లు (కథానాయకుడు, కథానాయకి) ఇల్లాంటి మంచుపై దొర్లుట చూచినాను. కాని కూర్చుంటే మళ్ళీ లేచే ఓపిక కన్పించుటలేదు. కాళ్ళు చేతుల నరాలు పీకుచుండెను. మంచులో వేసిన కాలు పైకి తీసి మళ్లీ అడుగువేయాలంటే ఎండకాలములో గోదావరి స్నానానికి ఇసుకలో నడచినట్లు లేదా మద్రాసు బీచిలో ఇసుకలో కాలుమోపినట్లు అనుపించుచుండెను. అందుచే ముందు పోయినవారి అడుగులలో అడుగు వేయుచు నడచుచుంటిని. దానివలన కొంత త్వరగా సులభముగా పాదము పైకి లేచుచుండెను. ఈ మంచు కరుగుటచే భూగోళముపై జలము లభించుచున్నది. ఈ భూగోళములోని హిమమంతయు ఒకేసారి కరిగినచో హిమ ప్రళయము ఏర్పడి, భూగోళమంతయు జల ప్రళయము సంభవించునని, శాస్త్రవేత్తలు అభిప్రాయ పడుచున్నారు.

నేటి ప్రయాణపు ప్రయాసతో మానవునికి గల అష్టకష్టముల గురించి నాకు, జ్ఞాపకము వచ్చెను. ఇక పరదేశగమనము చేయవలయును. ఇది అష్ట కష్టములలో మొదటిది. తాళపత్ర ప్రమాణ చాటువు వివరణ.

సీ॥ పరదేశ యాత్రకై పరతెంచు టొక్కటి ।
తనకు తానై వండుకొనుట రెండు ।
కలసతీమణిని తా తొలగియుండుట మూడు ।
వివరించ యాచకవృత్తి నాల్గు ।

తన సరివారి పంచననుండుట య్యెదు ।
గుర్తెరుంగని ప్రభు గొల్చుటారు ।
చదువు లేమియు రచ్చ నెదిరించుటయు నేడు
ఎన్నగా దారిద్ర్య మెనిమిదవది ।

గీ॥ ఊహలను బట్టి చూడ నూహింపవలయు ।
కష్టములవెంట కష్టముల్ కలిసి వచ్చు ।
కష్టముల జూచి భయపడు కష్టుడిలను ।
భువిని ఏరంగమునన్నైన గవయలేడు.

అయినను మేమందరము ఆపరమశివుని దర్శనార్థముపైనే మనసునుంచి ఈ కష్టములనెల్ల అధిగమించుచుంటిమి. భక్తి భావన గలవారికెవరికైనను ఎలాంటి కష్టముల నెదిరించు సమర్థత, యుండగలదను భావమీ తాళపత్ర ప్రమాణ చాటువు వలన తేట తెల్లము.

సీ॥ దైవ దృష్టమునందు ధరణీఘనంబన్న ।
భరియించె నలదాని పాపరేడు
పాపరేడే దండివా డటన్నను నతని ।
కంకణమునధరించెగరళ గళుడు ।
గరళకంఠున్నరుల్ ఘనుడనుకొన్న నా ।
విభుని వాసిగ నెత్తె వెండికొండ ।
వెండికొండన్ నరుల్ దండిగా దలుపంగ ।
లావుగా నెత్తె నా రావణుండు ।

గీ॥ రావణుని వంచె కార్తవీర్యార్జునుండు ।
అతని బడగొట్టె జమదగ్ని సుతుడు లీల ।
జామదగ్న్య మదమణచె రామభద్రు ।
డతడు పరమభక్తుల మనోలతను జిక్కె.

ఈ మంచులో కూడ కొండ పైకెక్కుట చాల నిటారుగా నున్నందున చాలా ఆయాసపడుచుంటిమి. డా. గోడ్బోలే ఇక ఏ మాత్రము నడువలేకపోవుచుండెను. మాటిమాటికిని కనులు తిరుగుచున్నవని ఆయాసపడుచు ఎగశ్వాస తీయుచు, మరీ రెండు గజముల కొకసారి ఆగిపోవుచుండెను. నా వద్ద గల నీరు కూడ పూర్తిగా అయిపోవచ్చినది. నేను ఎట్లో ప్రతి అయిదారు గజముల కొకసారి నిలబడి, శ్వాస తీయుచు ముందుకు సాగుచుంటిని. దాదాపు ఒక గంట తర్వాత పూర్తి అగ్రమునకు చేరుకొని, అచట మాతోటి వారందరిని కలుసుకొని ఒక రాతిపై జారగిలబడితిని. మా పోర్టర్లు సామానులన్నియును ''లిపు పాస్''కు ఆవలివైపు వారికి అందించు

చుండిరి. డా॥ గోడ్బలే గారిని జవానులు చెరొకవైపు భుజములపై చేతులు మోపి నడిపించుచు నెమ్మది నెమ్మదిగా తోడ్కొని 9½ గంటల వరకు వచ్చి చేరిరి.

ఈ ''లిపు పాస్'' 5 మీ. వెడల్పు కలిగిన 5,100 మీటర్ల ఎత్తగు ప్రదేశము ఆ 5 మీ. వెడల్పు సమముగా యుండి రెండు వైపులను గల పర్వతములు చాలా ఎత్తుకు వెళ్ళును. దానికి ఆవల ఒక మీటరు క్రిందికి దిగినచో దాదాపు 6 మీ. వెడల్పు అంతే పొడవు గల మంచు ప్రదేశమున్నది. అచట దాదాపు 20 మంది వరకు నిలబడవచ్చును. దాని క్రింద చాల నిటారగు దిగుడు యున్నది. ఆవలి ప్రక్కన కూడ రెండు కిలోమీటర్లు పైబడి మంచు కనబడుచున్నది. మన ప్రాంతముకన్న, నిటారగు దిగుడు ప్రమాద భరితముగా అగుపడుచున్నది. మన జవానులు, పోర్టర్లు, నిగం వారు దాదాపు 25 మందిలో ఎవరును ఆ ప్రదేశమునుండి ఆ ఒక మీటరు క్రిందికి దిగలేదు. ఎందుకనగా అది చైనీయుల భూభాగము. అది మన భారత చైనా సరిహద్దు. చైనా పోర్టర్లు తెచ్చిన సామానులను మన పోర్టర్లు పైనుండి అందుకొనిరి. మన పోర్టర్లు ఇచ్చిన సామానులను చైనా పోర్టర్లు క్రిందినుండే అందుకొన్నారు. వారు ఎవరును పైకి రాలేదు. మేము అచటనుండే నాల్గు వెరుగులగల మంచు శిఖర దృశ్యములను చూచుచు, మా ఆయాసమును మరచిపోయి దివ్యమైన అనుభూతిలో నిమగ్నమైపోయితిమి. అచటి నుండియే దూరాన 'మాంధాత' పర్వత శిఖరములు, కుడివైపు నేపాల్ పర్వతములు, ఇంకను అనేక పర్వత శిఖరములు కనుపించుచుండెను. వెనుదిరిగి చూచినచో చాలా దూరము చాల లోతైన లోయలు కనుపించెను. మేము అంత క్రిందనుండి ఇంత ఎత్తుకు నిజముగా వచ్చితిమా యను అనుమానము జనించుటయు సహజమే.

శ్లో॥ ఓం ఓంకారమంత్ర సంయుక్తం నిత్యం ధ్యాయంతి యోగిన ః
కామదం మోక్షదం తస్మై ఓంకారాయ నమో నమః.
మహాదేవః పరో మంత్రః మహాదేవః పరం తపః
మహాదేవః పరా విద్యా మహాదేవ ః పరా గతి ః.
ఓం నమః శివాయ యేతిచ షడ్లింగాయ నమో నమః
మోక్షకామ్యప్రదాత్రే చ విశ్వరూపాయ తే నమః.
ఓం నమః శివాయ సోమాయ సకారయ షడాత్మనే
స్వయం జ్యోతిప్రకాశాయ స్వతంత్రాయ నమో నమః.
మహాదేవాయ మహతే జ్యోతిషేఽనంతతేజసే.
ఓం నమశ్శివాయ శాంతాయ బ్రహ్మణే లింగమూర్తయే
ఓంకారాయ విశేషాయ నమో దుందుభినే నమః.
ఓం నమశ్శివాయ రుద్రాయ ప్రధానాయ నమో నమః
గురవే సర్వలోకానాం భిషజే భవరోగిణామ్.

# పదునారవ అధ్యాయం

## చైనా ప్రదేశము - యాత్రికుని దుర్మరణము

శ్లో॥ జ్ఞానానందం జ్ఞానరూపం జ్ఞానబీజం సనాతనమ్
తపసాం ఫలదాతారం దాతారం సర్వసంపదామ్.
ఋతగ్ంం సత్యం పరం బ్రహ్మ పురుషం కృష్ణ పింగళం
ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపం నమామ్యహమ్.
ధ్యాయే దభీష్ట సిద్ధ్యర్ధ మహర్నిశ ముమాపతిం
ఈశానం సర్వవిద్యానా మీశ్వరేశ్వర మవ్యయమ్.

✍ మేము సరిగ్గా 10 గంటలకు ఒక మీటరు క్రిందగల చైనా భూభాగంలో ప్రవేశించినాము. అచ్చట పూర్తిగా మంచు ఉండుట వలన కాళ్ళు దిగబడుచుండెను. ఆ సమయమున ఎదురుగుండా క్రిందినుండి మూడవ బృందము వారు కైలాస దర్శనము కావించుకొని మా కెదురుగా పైకి వచ్చుచుండిరి. అప్పటికే చైనా పోర్టర్లు మా సామానులనందుకొని క్రిందకి వెళ్ళుచుండిరి. మూడవ బృందముతో ఒక ఇంగ్లీషు తెల్సిన చైనీయుడు కూడ ఆ ప్రదేశము చేరెను. మేము కొద్దిసేపు వారితో ముచ్చటించితిమి. వారు మాకు ధైర్యము చెప్పిరి. వాతావరణము చాలా బాగున్నదని ఉత్సాహపరచిరి. వారితో చివరకు ఒక స్త్రీ మరిద్దరు పురుషులు పైకెక్కుచు బాగుగా ఆయసపడుచు మమ్ము చేరిరి. తరువాత మాలోని వారు ఒక్కరొక్కరే క్రిందికి దిగుట మొదలు పెట్టిరి. ఇక్కడినుండి ఇరవై మీటర్ల దిగుడు పూర్తిగా నిటారుగా చాలా ప్రమాదకరముగా నున్నది. మంచుపై కాలు పడినచో జారుచున్నందున మూడవ బృందమువారి అడుగుల జాడలలో అడుగులు వేయుచు మా సహచరులు చేతికర్రల సహాయముతో దిగుచుండిరి. మూడవ బృందములోని ఇరువురు యువకులు మమ్ము ఒక్కొక్కరినే పట్టుకొని నెమ్మదిగా క్రిందికి దిగుటకు సహాయము చేయుచుండిరి. చివరకు నేను, మాతో వచ్చిన డాక్టరుగారికి, ఇతరులకు వీడ్కోలు చెప్పి ఆ యువకుల సహాయముతో నెమ్మదిగా చాలా జాగ్రత్తగా ఇరవై మీటర్ల క్రిందికి దిగితిని. ఆ తర్వాత ఆ యువకులు ఇద్దరు పైకి వెళ్లిపోయిరి. అచ్చటనుండి మరో ఇరవై మీటర్లు దూరము పూర్తిగా రాళ్ళతో నిండియుండెను. దారి ఏమియును లేదు. ఆ రాళ్ళపై కాలుపెట్టగానే జారుచుండెను. ఎంతో సంభాళించుకొనుచు ఆ ఇరవై మీటర్ల రాళ్ల బాటను దాటగా మరల ఇంకొక మంచుదిబ్బకు చేరితిమి. ఆ మంచు దిబ్బను రెండు కిలోమీటర్ల దూరమువరకు దాటవలసి యుండెను. అది మెత్తని దూదిపరుపువలె వాలుగా నున్నది. మధ్యన ఒకచోట మరల ముప్పది మీటర్లవరకు నిటారుగా దిగవలసి వచ్చినది.

చైనావారిలో ఇంగ్లీషు తెల్సిన ''షీ'' యనునతడే కాక మరి ముగ్గురు మాత్రమే యుండిరి. ఆ నిటారు దిగుడు ప్రదేశమును ముందు నడచుచు మా మిత్రులు చేరిరి. ఒకరి చేతిని మరొకరు పట్టుకుని పైకి వచ్చినవారి అడుగుల అడుగులలో అడుగులు మోపుచు నెమ్మదిగా దిగుచుంటిమి. మధ్యలోనున్న రంగాచారిగారి కాలు ఏ విధముగా దారి ప్రక్కన పడెనో తెలియదు. ఆయన అకస్మాత్తుగా జారిపడిపోయిరి. చూస్తుండగా -పిల్లలు జారుడుబల్లపై జారునంత వేగముతోను మరియు తలక్రిందికి కాళ్ళు పైకియై నాలుగువందల అడుగుల క్రిందికి జారిపోయిరి. మేమందరము అదిచూచి భయకంపితులమై ''రంగాచారిగారు జాగ్రత్త జాగ్రత్త'' యని కేకలు వేయునంతలో మంచు చివరి భాగమునకు చేరి అచ్చటగల రాళ్ళ కుప్పలపై పడిపోయిరి. మా ప్రాణములు పైపైననే లేచిపోయినవి. ఆయన కైలాసవాసునికి అర్పితమైనట్లు భావించితిమి. కాని మేము చూచుచుండగనే ఆయన లేచి కూర్చుండి బట్టలకు అంటుకొనిన హిమమును దులుపుకొనుచుండెను. క్రింద అన్ని రాళ్ళు ఉన్నను ఆయనకు ఏ మాత్రము దెబ్బలు తగులకుండా క్షేమముగా బయటపడుట ఆ కైలాసవాసుని మహిమకాక వేరు ఏమైయుండును! ఆయనకు ఇది పునర్జన్మ కదా! అందుకే ప్రాణములు తీయువానికన్న రక్షించువాడే మిన్నయను సామెత నిజమేమో. మేము ఈ సంఘటనను జూచి సంభ్రమాశ్చర్యములతో ఆయన ఈ దుర్ఘటన నుండి తప్పుకొని బైటపడినందుకు ఎంతో సంతోషించితిమి. వెంటనే ఇరువురు చైనీయులు మంచును త్రవ్వుచు బాటచేసుకొనుచు రంగాచారిగారిని పైకి తీసుకొని వచ్చుటకు నెమ్మదిగా అడుగులు వేయుచూ క్రిందకు దిగుచుండిరి.

శ్లో॥ భగ్నాశస్య కరండపిండితతనోర్ మ్లానేంద్రియస్యక్షుధా ।
కృత్వాఖుర్వివరం స్వయం నిపతితో నక్తం ముఖే భోగిన ః ।
తృప్త స్తత్ పిశితేన సత్వర మసౌ తేనైవ యాత ః పథా ।
స్వస్థా స్తిష్ఠత దైవమేవహి పరం వృద్ధౌ క్షయే కార ణమ్. (భర్తృహరి)

తా॥ ఆశలన్ని భగ్నమైపోవగా ఒక కాలసర్పము చెక్కపెట్టెలో బంధింపబడి చావుకు దగ్గరాయెను. అదే పెట్టెలో కొన్ని పిండివంటలు నిక్షేపింపబడి యుండెను. వానిని తినగోరిన ఒక ఎలుక ఛిద్రము గావించుకొని చెక్క పెట్టెకు కన్నము చేసికొని పిండివంట లారగించుటకై లోన ప్రవేశించెను. లోననున్న పామునకు అది దైవికముగా నాహారమాయెను. అంత శ్రమ పడి యెలుక, గావించిన రంధ్రమునుండియే పాము ప్రాణము దక్కించుకొని బయటపడెను. మృత్యువుకు జీవనమునకు దైవమే కారణము. అందుకే అంత క్రిందికి దొర్లిపడి ప్రాణాపాయము సంభవించవలసిన రంగాచారిగారు ఏలాంటి గాయములును తగులకుండా సురక్షితముగా బయటపడిరి.

దైవబలమును గూర్చి రామాయణములో ఈ విధముగా చెప్పబడియున్నది. అవసాన దశలో రావణాసురుడు నుడివిన వాక్యము లేమనగా.

శ్లో॥ జాతో బ్రహ్మకులేఽగ్రజో ధనపతిర్ యః కుంభకర్ణానుజ ః
పుత్రశ్శక్రజితో రథస్తు విజయో మధ్యే సముద్రం గృహం
దైత్యా ః కామచరా ః స్వయం దశశిరా ః పూర్ణా భుజా వింశతి ః
సర్వం నిష్ఫలితం కృతంతు విధినా దైవే బలే దుర్బలే.

తా॥ రావణుడు అనుకొన్న విధము ''నేను బ్రహ్మకు నాల్గవవాడను, బ్రహ్మ కులజుడను. నాయన్న కుబేరుడు. నా తమ్ముడు కుంభకర్ణుడు. నా కుమారుడు ఇంద్రాదుల జయించినవాడు. నా రథమునకు విజయమను పేరు. దానికి అపజయము లేదు. నా గృహము సముద్ర మధ్యమున గల అభేద్యము. ఎవరును చేరలేరు. నా సైన్యమంతయు కామరూపులు. నేను పది తలలుగల వాడను. 20 చేతులున్నవాడను. దైవబలము తప్పగా నివన్నియు దుర్బలములై పోయినవి.'' అంతేగాక రావణుడు ఇంకను ఈ విధముగా తెలిపినాడు.

శ్లో. ''ఆపుః ప్లవంతు పాషాణాం మానుషగ్రంతు రాక్షసః
కపయః కర్మ కుర్వంతి కాలస్య కుటిలా గతి.''

☝ కాలము వక్రించినపుడు జరుగకూడని పనులెల్ల జరుగును. సముద్రమునకు వారధి నిర్మింపబడినది. ఆ వారధి నీటిపై రాళ్ళచే తేలియాడినది. రాళ్ళు నీటిపై తేలుట విశేషమే. రాక్షసులకు మనుజులు ఆహారము. కాని ఇపుడు మనుజులు రాక్షసులనే మ్రింగుచున్నారు. అనగా దుర్బలులైన ఇరువురు బాలలు రామ లక్ష్మణులు కుంభకర్ణాది రాక్షసులనెల్ల సంహరించినారు. ఇదియు ఆశ్చర్యకరమే. 'కపి' యనగా మతి చలించునది లేక చరచునది. అట్టి కపులన్నియు గలసి నిర్మాణాత్మకమైన పనులు గావిస్తు సముద్రమునకు వారధి నిర్మించుటే కాక, సంజీవిని గూడ తెచ్చు సత్కార్మలు చేసినవి. కాలము వక్రించినపుడు జరుగకూడనివి జరుగును. జరుగునవి జరుగకపోవును. కాలమనునది దైవాధీనమే అని రావణుడు చింతించెను. ☝

✍ ఒక చైనీయుడు నేను అందరికన్న వెనుకవున్న కారణమున నా చెంతకు వచ్చి సహాయము చేయుటకు నా చేయి పట్టుకొని నన్ను మా సహచరులు నడచుదారికి భిన్నముగా ఎడమవైపు మరికొంత దూరంనుండి గబగబా నడిపించుచుండెను. ఆవైపు నిటారు దిగుడు తక్కువగా నుండెను. మంచులో ఏమాత్రము దారి లేకున్నను ఏటవాలుగా నుండిన కారణమున నా యొక్క బూటు మడమలను మంచులో బలముగా దూర్చుచు కుడిచేతి కర్ర సహాయముతో దాదాపు పరుగిడినంత వేగముగా నడచుచుంటిని. జారి పడుదునేమోయని భయపడుచుంటిని. నే నాతని కా విషయము చెప్పదల్చినను భాష సమస్యగా నుండెను. నేను చెప్పినను అతనికి అర్థము కాదు. దాదాపు ముప్పది అయిదు నిముషములలో ఎచ్చటను ఆపకుండా ఒకటిన్నర కిలోమీటర్లు క్రింది వరకు గల మంచుచివర రాళ్ల వరకు

నన్ను తీసికొని వచ్చి నా చేయి వదలెను. మా సహచరులు కొందరు అప్పుడే అచ్చటికి చేరిరి. మేమందరము ఆ ప్రదేశమున కూర్చుంటిమి. అంతలో చైనీయులు రంగాచారిగారిని నెమ్మదిగా పైకి తోడ్కొని తెచ్చిరి.

మాకు దాదాపు అరకిలోమీటరు పైన మంచు మధ్యలో చొక్కారావు గారు, థావేగారు, కులకర్ణిగారు శీర్షాడ్‌గారు ఒకచోట గుంపుగాచేరి దాదాపు యాభై మీటర్ల క్రిందనున్న డాక్టర్ గోడ్బోలే గారిని త్వరగా పైకి రమ్మని కేకలు వేయుట మాకు వినిపించెను. మరేదో ప్రమాదము జరిగినదని మేము అనుమానించితిమి. డాక్టర్ గోడ్బోలే పది నిమిషాలలో వారు గుమిగూడిన ప్రదేశమునకు తిరిగి వెళ్ళిరి. అచ్చట నాల్గు మీటర్ల క్రిందికి దొర్లి జారిపడిన రామకృష్ణన్ గారి ఛాతీపై ఒత్తిడిచేయుచు కృత్రిమ శ్వాస కల్పించుటకు ప్రయత్నించుట మాకు కన్పించెను. దాదాపు పది నిముషములు ఆ విధముగా ప్రయత్నించినను ఫలితము లేకపోయెను. డాక్టర్ గోడ్బోలే నిరాశచే అక్కడ గుమిగూడిన మిత్రులకు డాక్టర్ మోఖా కొరకై కేకవేయుమని హెచ్చరించెను. వారు దాదాపుగా మా చెంతకు చేరిన డాక్టరు మోఖాను కేకవేసిరి. ఆమె ''హారి భగవంతుడా యని'' కాళ్ళీడ్చుకొనుచు దాదాపు ఇరవై నిముషములు పైకెక్కి వారి చెంతకు చేరి రామకృష్ణన్‌గారిని పరీక్షించి ఆయన మృతి చెందినట్లు ధృవీకరించెను. ఈ విషయము మా మిత్రులు కేకవేసి మాకు తెలిపిరి. కొంతసేపటికి ''షీ''తో సహ గోడ్బోలేగారు ఇతరులు మా వద్దకు వచ్చి చేరిరి. మృతుని చెంత చొక్కారావుగారు, థావేగారు, శీర్షాడ్‌గారు వుండిరి.

ఇలాంటి ఎత్తు ప్రదేశములలో జనులు ఆమ్లజని లోపించుటవలన ఆకస్మాత్తుగా మృతి చెందుట అపుడపుడు సంభవించుట సహజమే !

హిమాలయములలోని బదరీనాథ్ క్షేత్రానికి పైన 'స్వర్గారోహణ' శిఖరమున్నది. మహాభారత స్వర్గారోహణ పర్వములో యుధిష్ఠరుడు నలుగురు తమ్ములను ద్రౌపదిని దారిలో కోల్పోవుటకు కారణము లిట్టి పరిస్థితులేయై యుండవచ్చును. ధర్మరాజు మాత్రము యాత్రామార్గము ద్వారానే బొందితో స్వర్గము చేరినట్లు చెప్పబడెను.

ద్వాపర యుగాంతమున కలి ప్రవేశము జరుగునపుడు పాండవులు పరీక్షిత్తునకు పట్టాభిషేకము గావించి ద్రౌపదితోపాటు సశరీర స్వర్గ ప్రవేశమున్నకై స్వర్గారోహణ మహాప్రస్థానము గావించిరి. మార్గమధ్యమున ద్రౌపది సహదేవ నకుల అర్జునులు ఒకరి వెంట నొకరు వరుసగా కాలధర్మము జెందిరి. వారు మరణించుటకు కార ణము లేమిటని భీమసేనుడు ధర్మనందనుని ప్రశ్నించెను. సమాధానముగా ధర్మజుడు వారివారిలో గల అహంకృతి దుర్గుణ విశేషముల విపులముగా తెల్య చేయుచు ముందుకు సాగెను. తుదకు భీముడు కూడ భూమిపై బడెను.

ఉ॥ దాననుదాన నిట్లగుట దప్పునె యంచు దదీయ
మ్మానితదేహమున్ విడిచి మానవనాధుడు దాల్మజేసి బ
ద్ధానిరతాత్ముడై యరిగె నత్తరి వాయుజు డార్తి నెంతయున్
దీనత బొంది ధైర్యలత ద్రెవ్విన నేలకు వ్రాలె భూవరా.

క॥ అప్పుడు దగ నిట్లను నత
డప్పౌరవవరున కోధరాధిప! కనుగొ
మ్మిప్పా టేమిట వచ్చెం
జెప్పు మెఱుగు దేని గరుణ సిగురొత్తంగన్.

చ॥ అన విని యాత డిట్లనియె నాతనితో భవదీయమైన భో
జన మతిమాత్ర ముద్ధతి బ్రచండుడవై భుజశక్తి నెవ్వరిం
గొనక కడంగి రజ్జ పలుకుల్ గడుబెక్కులు వల్కుదెప్ప నీ
వనుపమశౌర్య యిప్పుడుట కత్తెఱగుల్ గతమెల్ల జెప్పితిన్.

ఇచట రామకృష్ణన్‌గారి మరణమునకు దోషమాపాదించు ఉద్దేశ్యము లేదు. కాని మరణించిన వారి గురించి ఇతరులు అతని మృతదేహము గురించి ప్రయాణమాపుట అసంభవము. ఆనాటి కాలంలో సహస్ర గజబలము గల భీముడే అచటి పరిస్థితుల ప్రభావముచే పడిపోయి మరణించగా స్వంత అన్నగారగు ధర్మరాజే భీముని మృతదేహమును ఇతర తమ్ముల మృత దేహములను భార్యయగు ద్రౌపది మృతదేహమును కూడ విడచి వెనుదిరిగి చూడక వెంటపోవు కుక్కతో మాత్రమే ముందుకుసాగినట్లు పై పద్యములచే గల దృఢ సంకల్పమే మా ముందు ప్రయాణమునకు దృఢ సంకల్పముగా సామ్యము కొరకు ఉదహరించబడినది.

అందుచే ఈ యాత్రకు - మరణమునకూ సామ్యము జోడించి యాత్రా కాంక్షపరులు కొందరు ఇంతటి కఠిన తీర్థముల దర్శించి మరణ మేల తెచ్చుకొనవలెను? అను సందేహము పొందనవుసరము లేదు.

శ్లో ॥ అరక్షితం తిష్టతి దైవరక్షితం
సురక్షితం దైవహతం వినశ్యతి
జీవచ్ఛనాధో పివనేవిసర్జితః
కృతప్రయత్నో పిగృహేనజీవతి.

దైవానుగ్రహము గలవాడు ఎందరో దుర్మార్గుల మధ్య నుండియు బ్రతుకును. లేనివాడు ఎందరి రక్షణలో యున్నను వధింపబడును. దైవానుగ్రహమున్న కీకార్యణ్యంలో అనాధగా విడువబడినా జీవించును. అలా ఈ రోజులలో కూడ ప్రతిరోజు విమానాలలో రైళ్ళలో బస్సులలో ప్రయాణించుచు కూడ ఏదో ఒకచోట ఏదో ఒక కారణముగా

ప్రజలు మృత్యువాత పడుచున్నారు. అంతేకాక ఇంటిలో కూర్చొని హాయిగా భోజనము చేసి పరుండి మరణించువారు ఇంకా ఇతర విధముల హఠాన్మరణము చెందువారి కథలు ఎన్నో వినుచున్నాము. అందుచే ఈ మరణము యన్నది లలాట లిఖితముగా విధివిధానమని సహజ మరణముగా భావించుటే ఉత్తమము.

అదే సమయములో సరిగ్గా 11 గంటల 15 నిముషములకు మన దేశపు హెలికాప్టరు ఒకటి మాపైనుండి ప్రదక్షిణము చేసి భారత భూభాగమునకు వెడలిపోవుచుండెను. అదిచూచిన మాలోని కొందరు చేతులు, గుడ్డలు ఇంకేవో చూపుచు ఊపుచు సైగలు చేసిరి. కాని హెలికాప్టరులోని వారు వీరి చేష్టలు గమనించినట్లులేదు. అది వెడలిపోయెను. మాథుర్‌గారు, గోడ్బోలేగారు చింతాక్రాంతులై అప్పుడు చేయు కర్తవ్యమేమని నాతో విచారించిరి. మేమందరము 'ఎవరికివారే యమునాతీరే' యన్నట్లు బయలుదేరినవారము. దారిలో ఎవరికి ఏమి జర్గినను యాత్రను విరమించుకొని పోయినవారికొరకు ఏదో త్యాగము చేయు సాహసికులు ఎవరును లేకుండిరి. ఏమి చేసినను అందరము కలిసి మానవతా దృక్పథముతో ఏదో ఒక నిర్ణయము తీసుకొనవలసి యుండెను. అప్పటి తక్షణ కర్తవ్యము ఆ మృతదేహమును మన భారత ప్రభుత్వమునకు ఎట్లప్పగించవలెనా యని ! ఆ ఆలోచన తప్ప ఇంకా యేమైన చేయ తోచినను ఒకరిద్దరు చేయగల్గినది ఏమియులేదు. చేతనైతే ఇరువురు వెనుదిరిగి ''నభీ డాంగ్'' క్యాంపుకుపోయి మన రక్షణ సిబ్బందికి ఆ వార్త తెలిపి వారిని తోడ్కొనివచ్చి శవమును వారికి అప్పగించుట. ఇది ఒక్కటే మార్గమై యుండెను. కాని మేమందరము ఉదయము 5 గంటల నుండి ప్రయాణము సాగించుచుంటిమి. అప్పటికి మధ్యాహ్నము 12 గంటలైనది. ప్రతివారికి ఆకలి దప్పులు దహించుకొనిపోవుచున్నవి. ఎండ తీక్షణముచే మలమల మాడుచుంటిమి. పైగా హిమముపై నున్నను త్రాగుటకు నీటిబిందువు లేదు. అట్లాంటి పరిస్థితులలో ఎవరు అంతపైకి వెళ్లి క్యాంపుకు చేరి మన రక్షణ సిబ్బందిని తోడ్కొనివచ్చు సాహసము చేయగలరు? పైగా అంతదూరము పోయినవారు మరల వెనుకకు వెంటనే తిరిగి రావలయును. లేనిచో వారు ఒంటరిగా 'తక్లా కోట్' చేరలేరు. వారు వచ్చువరకు మేము వేచి వుండలేము. ఇదంతయు అనవసరమైన ఆలోచన మరియు వృథాప్రయాస. అందుచే ముందుగా ఇరువురము త్వరగా ''తక్లాకోట్'' చేరి ఏ తంతి ద్వారానో భారత ప్రభుత్వమునకు ఈ విషాద వార్త తెలియజేయుట సమంజసమని నిర్ణయమునకు వచ్చితిమి. మా లీడరు డా॥ గోడ్బోలే తనవెంట నన్ను రమ్మని కోరిరి. నేను అంగీకరించితిని. చైనీయుడు ''షీ'' కూడ ఈ నిర్ణయమునే బలపరచి తనవెంట వచ్చిన చైనీయులకు రామకృష్ణన్‌గారి మృతదేహమును గుఱ్ఱముపై బంధించి ''తక్లాకోట్'' చేర్చుటకు ఆజ్ఞాపించెను. నేను. డా. గోడ్బోలే మరియు 'షీ' ముందు నడచుటకు లేచి మిగతా వారిని చైనీయులతో మృతదేహము వెంట రమ్మని చెప్పి ప్రయాణమైతిమి.

మేము ముప్పురము రాళ్ళపై నెమ్మదిగా నడచుచు అరకిలోమీటరు దూరములోనున్న గుర్రాల చెంతకు చేరితిమి. అచ్చట ఇరవైనాల్గు గుర్రములు నిలబడియుండెను. మనుషులు మావెంట నున్న నల్గురు మాత్రమే. మేము మూడు గుర్రముల నధిరోహించి ''షీ'' ముందు పయనించుండగా ఒకదాని వెనుక ఒకటి చొప్పున మా గుర్రములు నడచుచుండెను. ఆ ప్రదేశమంతయు రాళ్ళమయము. దారి ఏమియులేదు. పైగా నిటారు దిగుడుగా నుండెను. గుర్రము కాలు రాయిపై బడి జారినచో గుర్రముతోపాటు మేమును పడిపోయే ప్రమాదమైన పరిస్థితి యుండెను. అందుకే గుర్రములను వెనుకకు ముందుకు ఏటవాలుగా ''జడ్'' ఆకారములో నడిపించుచు క్రిందికి దిగితిమి. అచ్చట ఒక నదీ ప్రవాహము మేము దాటివచ్చిన మంచుదిబ్బ క్రిందినుండి పారుచుండెను. గుర్రములు నదిగట్టు మీదుగా నడచుచుండెను. అచ్చోట భూస్ఖలనము వలన జారిపడిన పెద్ద చిన్న బండరాళ్ళు వుండెను. ముందునకు సాగిన కొలది నది లోతు ఎక్కువగుచుండెను. దారి బహు దుస్తరముగా నుండెను. మా గుర్రములు మేము విదిలించకున్నను చాల జాగ్రత్తగా మెల్లగా మమ్మలను మోసుకొని పోవుచుండెను. ఆ భయానక ప్రదేశమును దాటునంతవరకు మా ప్రాణములు అరచేతిలో పెట్టుకొని ప్రయాణము సాగించితిమి. మాకు గుర్రములపై స్వారీ చేయుటలో ఏమాత్రము అనుభవముగాని, అభ్యాసముగాని లేదు. గుర్రములపై నున్న జీనులు కఠినముగా నుండుటచే మా ఆసనములు మంట పుట్టెను. ఇట్లు రెండు కిలోమీటర్లు నది ఒడ్డుపైగా నడచి కుడిప్రక్కను నదిని దాటవలసి వచ్చెను. ఢిల్లీలో మా కమల్ మిత్రుడు బలవంతముగా నాకు అంటగట్టిన ''కౌబాయ్'' టోపీ ప్రతిరోజు నాకు అనవసరముగా నుండెను. నేడు మాత్రము ఎండ తీవ్రతవలన ఆ టోపీ బాగుగా ఉపయోగపడుచుండెను. మా బృందములో ఎవరికిని ఇలాంటి టోపీ లేకుండెను. కొందరికి మాత్రము క్రికెట్ టోపీలు వున్నను మరికొందరికి అట్టివికూడ లేవు. నేటి ఎండ తీక్షణముగా నుండుటచే మా మిత్రులు నా టోపీని నాకంటే నా కిమ్మని నన్ను అర్థించిరి. ఆ రోజు ఎండతోపాటు ఝంఝామారుతము కూడ హెచ్చుగా నుండెను. నదిని దాటు సమయములో నా టోపి గాలి తాకిడికి ఆకస్మాత్తుగా ఎగిరి నీటి ప్రవాహములో పడి కొట్టుకొని పోవుచుండెను. ప్రవాహము వేగముగా యున్నందున మంచు నీరు అతిచల్లగా నున్నందున నేను గుర్రము దిగి టోపీ తెచ్చుకొనుటకై వీలుకలుగలేదు. నేను 'షీ' కి టోపీ పడిపోయినదని చెప్పగా అతను తన గుర్రమును దిగ ప్రయత్నించెను. కాని గుర్రమును వెనుకకు త్రిప్పు అవకాశము అచట లేకుండెను. అతను కూడ గుర్రమును దిగే అవకాశము లేకుండెను. అందుచే నేను టోపీపై ఆశ వదులుకొని ముందుకు సాగమంటిని. నాటోపీ ప్రవాహములో కొట్టుకొనుచు ఇరవై మీటర్లు దూరము పోయి ఒక రాతికి తగులుకొని భీష్మించెను. గుర్రములు నది ఆవలి గట్టుపై కెక్కి కొంత దూరముపోయి రాళ్ళులేని కొంత వెడల్పాటి చదునుగా నున్న దారికి చేరగా బ్రతికి బయటపడ్డంత ఆనందము కల్గినది.

మాకు తీవ్రముగా దాహము వేయుచు ప్రేవులు మల మల మాడుచుండెను. నా చెంతనున్న పూరీలు ఎవరో కావాలంటే మంచుదిబ్బ చెంతనే ఇచ్చివేసి యుంటిని. ఇంతలో 'షీ' తన సంచీలో గల బన్నులు తీసి మా ఇరువురికి చెరి రెండు ఇచ్చెను. తానును మేమును గుర్రములపై కూర్చుండి అవితినుచునే ప్రయాణము సాగించితిమి. అట్లే ఎండ మరియు గాలి తీవ్రతతో నాలుగు కిలోమీటర్ల దూరము ముందుకు ప్రయాణము చేసి ''పాలా'' అనే ఒకే ఒక గుడిసె గల గ్రామము చేరితిమి. మా ప్రక్కనున్న నది దూరమాయెను. ఆ ప్రదేశము విశాలముగా నుండెను. ఎత్తు నాల్గువేల మూడువందల మీటర్లు వుండెను. అచట మేము గుర్రములను దిగితిమి. ఒక టిబెట్టు దేశస్తుడు మా బృందమునకు సరిపడు 'టీ'ని తయారుచేసి వుంచెను. మేము మంచి నీరు త్రాగి తర్వాత టీ త్రాగి కొంతసేపచట విశ్రమించితిమి. కాని హృదయము ఆవేదనతో శరీరము అలసటతో మనస్సు త్వరగా చేరవలెనను ఆరాటముతో నుండెను. రామకృష్ణన్ విషాదవార్తను మనదేశమునకు త్వరగా అందించవలెననే తపన మెండుగా నుండుటచే మేము త్వరగా మరల ప్రయాణము సాగించితిమి.

దారి మధ్యలోగల ''టిసుం'' అను మంచు నీటి నదిని చిన్న చెక్క వంతెన మీదుగా దాటి ముందుకు సాగగా ''లిపుపాస్'', ''టింకర్‌పాస్''ల నుండి ప్రవహించు వేరే నదులను అధిగమించి విశాలమైన మైదానము చేరితిమి. ''షీ'' ఆ ప్రదేశమును చేరగానే గుర్రము యొక్క వేగమును హెచ్చించెను. మేము అదలించకున్నను మా గుర్రములు కూడ పరుగులంకించెను. కాని మాకు దీనిచే ఆసన భాగమున మంట విపరీతమగుటయే కాక గుర్రములు ఎక్కడ క్రింద పడవేస్తాయో యను భీతావహము కలుగుచుండెను. ఆయినను చేయునదేమియు లేక భరించితిమి. ఆ ప్రదేశమున కనీసము గుర్రములు మేయుటకు కూడ పనికివచ్చు గడ్డిపరక కూడ ఎచ్చటను కన్పించలేదు. దృష్టిసారునంతవరకు భూమి బీడుపడి రాళ్ళమయముగా నుండెను. ఆ విధముగా సాయంకాలము నాల్గుగంటల వరకు ''తక్లాకోట్'' పరిసర ప్రాంతమును చేరితిమి.

అచట పైనుండి వచ్చు మంచునీటి ప్రవాహములు కాలువల ద్వారా మరలించి గోధుమ బార్లీ, వరి మున్నగు వానిని సేద్యము చేయు పంటపొలములు కొన్ని కన్పించినవి. మా గుర్రములు ఉదయము నుండియు మేత మేయని కారణమున ఆకలిచే ప్రక్క పొలములలోనికి లాగుకొనిపోయెను. కళ్ళెములను ఎంతగా అదుపు చేసినను అవి నిలువలేదు. మా ముందు గల ''షీ'' అక్కడ ఎవరో దారినపోయే దానయ్యను పిలువగా పాపం ఆ టిబెట్ దేశీయులు ఇద్దరూ వచ్చి మా గుర్రముల కళ్ళెములు పట్టుకొని మేము పోవలసిన దారిలోనికి వాటిని మరల్చిరి. అలా కొంత దూరము ముందునకు సాగగా ఒక పెద్ద నది కన్పించెను. అటులనే మరికొంత దూరము ముందుకు పోగా ముప్పయిమీటర్ల దిగుడు దారియు మధ్యలో పెద్దపెద్ద రాళ్ళును కన్పించెను. అది కర్ణాలినది. మేమచటనుండి ఆ నదిలోనికి దిగియుంటిమి.

మా గుర్రములు ఆ కర్ణాలినదిని కొంతదూరము ఇసుకలోను ఆపైన ఒక చెక్క వంతెన మీదుగా దాటిపోయినవి. ఆ నది ప్రదేశము దాదాపు రెండువందల మీటర్ల వెడల్పు ఉన్నను నీరు మాత్రము ముప్పయి మీటర్ల వెడల్పు రెండున్నర అడుగుల లోతు వుండి అధిక ప్రవాహ వేగము కలిగి యుండెను. మేము నదినిదాటి కుడివైపునకు మరల గట్టు పైకి ఏటవాలుగా ఎక్కితిమి. ముందునకు సాగితిమి.

మాకు ఆప్రదేశమున ఒక పెద్ద మట్టిపర్వతము కనుపించెను. ఆ పర్వతమున కొన్ని పురాతన ఇండ్లు (మట్టి త్రవ్వి తయారుచేసిన గుహలు) కనుపించుటయేగాక వాటిలో టిబెట్ దేశస్థుల కుటుంబములు కూడ నివాసము చేసియుండిరి. అవి పురాతన ''గొంపా''లుగా చెప్పబడినవి. ఆ పర్వతము అగ్రభాగమున ఒక ''ఖండర్'' (శిథిల భవనము) కన్పించెను. దానిని ''సమ్మర్ ప్యాలేస్'' (వేసవి వసతిగృహము) అని చెప్పిరి. పూర్వపు రాజులు వంద సంవత్సరముల క్రిందటివరకు అచ్చటనే నివాసముండెడివారట. ఆ పర్వతము ఎత్తు 200 మీటర్లు వుండును. ''తక్లాకోట్''కు మరొక పేరు ''పులన్ చుంగ్'' అనికూడ కలదు.

తక్లాకోట్ ఎత్తు సముద్రమట్టమునకు నాల్గు వేల అయిదు వందల మీటర్లు. మేము ఆ గట్టు వెంబడి కొంత ముందునకు పోయి గట్టును ఇంకా పైకెక్కి కుడివైపు తిరిగేవరకు మరొక పెద్ద నదిని దాటుటకుగాను మరొక ముప్పయిమీటర్లు క్రిందకు దిగవలసి యుండెను. ఆ దిగుడు ప్రాంతమున కుడి ఎడమలలో కొన్ని ఉన్ని బస్తాలు, గొఱ్ఱెలు, గుర్రాలు, మనుష్యులతో కూడిన కోలాహలము కనిపించెను. చూడగానే అది ఒక మార్కెట్టు అని ('మండీ ' అని కూడ అంటారు) తెలిసెను. మేము గుర్రములను క్రిందికి దింపి ఒక వెడల్పాటి వాహనములుకూడ దాటునంతటి చెక్క వంతెనను దాటి మరల కుడివైపునకు తిరిగి పైకెక్కితిమి. ఆ నది ఎక్కువ వెడల్పులేదు. కాని లోతు అధికముగా యుండెను. దానిని ''గారుఛూ'' అని పిలుతురు. మేము కుడిప్రక్కగా పైకి ఎక్కగనే అచ్చట ఒక విశాలమగు భవనము, దాని ముందు మిలటరీ వాహనములు కన్పించెను. బహుశః అది ఒక సైనిక స్థావరమై యుండును. మేము దానిని దాటి ఎడమకు తిరిగి మరల కుడికి తిరిగిన ప్రదేశమున మరొకనదిపై ఒక ''డామ్'' దానిపై రోడ్డు ఎదురయ్యెను. అది దాటి అరకిలోమీటరు ముందుకు సాగగా విశాలమైన మరొక రోడ్డుకు చేరితిమి. రోడ్డున కిరుప్రక్కల చిన్న పెద్ద ఇండ్లు వుండెను. కొంతముందుకు సాగగా ఎడమ వైపున ఒక పెద్ద గేటు వచ్చెను. 'షీ' గుర్రము విశాలమగు భవనమునకు దారితీయగా మేమును వెంబడించితిమి. మేమచ్చటకు చేరునప్పటికి దాదాపు సాయంత్రం అయిదు గంటలయ్యెను. మేమందరము గుర్రములు దిగి భవనములోనికి చేరితిమి. ఆ రోజు గుర్రములపై సాగిన మా ప్రయాణం ఇరువది రెండు కిలోమీటర్లు. మేము విపరీతమైన అలసట చెంది నీరసించిపోయితిమి. ఆ భవనము తక్లాకోట్ పరిసర ప్రాంతమునకు నేరుగా నుండెను. కాని దారి

మూడునదులు దాటవలసినందున ముక్కును కుడిచేతితో తలవెనుక నుండి త్రిప్పిచూపిన మాదిరిగా గుండ్రముగా తిరిగి మేము ఆ భవనమును చేరితిమి.

ఆ భవనమునకు కుడివైపున రెండుమూడు గదులున్న కొన్ని క్వార్టర్లు (ఇండ్లు) కన్పించెను. ఆ భవనములో ఒక ఆఫీసు గది పొడవైన వరాండా మధ్య హాలు (భోజనశాల కూడ) కలిగి విశాలముగా నుండెను. ''షీ'' మమ్ము ఒక ఆఫీసు గదిలో కూర్చుండ బెట్టి తంతి ఇచ్చుటకై పోస్టాఫీసుకు వెళ్ళెను. అరగంట తర్వాత తిరిగి వచ్చి పోస్టాఫీసు మూయబడినదని చెప్పెను. దానిచే మా గుండెలు మరీ భారమాయెను. ఆ క్యాంపులో ఒక చైనా మేనేజర్ వుండెను. అతనికి చైనా భాష తప్ప వేరే ఏ భాషయురాదు. మరియొక హిందీ నేర్చిన చైనీయుడు కూడ యుండెను. మేము వారందరితో ఏ విధముగా నైనను ఆ దుర్వార్తను భారతదేశమునకు తెలుప ప్రయత్నించుమని కోరితిమి. కాని వారు అలాంటి సదుపాయమేమియు అచట సాధ్యపడదని తెల్పిరి. వారు మాకు చైనా టీ (పాలు లేకుండా) మరియు చాక్లెట్లు ఇవ్వగా ఆరగించితిమి. కొంతసేపటికి దాదాపు ఆరుగంటలకు ''రామకృష్ణన్'' గారి మృత దేహముతో సహ మా తోడి వారందరు ఆ భవనమునకు చేరుకొనిరి. శవమును బయటగల ఒక గదిలో నుంచిన పిదప వారందరికి టీ చాక్లెట్లు ఇవ్వబడెను. చైనీయులు మా సామానంతయు ఒక వరండాలో నుంచిరి. తరువాత ప్రక్కనున్న వేరే భవనములో ఒక్కొక్కరి సామానులను ప్యాస్‌పోర్టులను పరీక్షించిరి. విలువైన వస్తువులు వుంగరాలు వాచీలు కెమెరాలు డబ్బు వివరములన్నియు ఒక ఫారంపై వ్రాసి ఇచ్చితిమి. మా ప్యాస్‌పోర్టులపై వీసా ముద్రలు వేసిన పిదప దాదాపు రాత్రి ఎనిమిది గంటల వరకు మాలో ఒక్కొక్కరిని పరీక్ష చేసిన వారిని చేసినట్లు సామానులతో ఆయాగదులలోనికి పంపిరి. నేను బాగా చలియున్నను స్నానము చేయ సంకల్పించితిని. స్నానమునకు ఒక గది కాని నీరు కాని ఎచట నుండునో తెలియదు. అంతలో భోజనమునకు రావలసినదని పిలుపు వచ్చెను. మామిత్రులందరును భోజనమునకు వెడలిరి. నేను స్నానము చేసి పూజలో నిమగ్నమైనచో ఆ తరువాత నాకు భోజనము దొరుకునో లేదో యని సందేహము కలిగెను. అది అసలే క్రొత్త ప్రదేశము. ఒకరి భాష ఒకరికి తెలియదు. కావున చేయునది లేక ముఖము కాళ్ళు చేతులు ప్రక్షాళన గావించుకొని నమస్కారముతో సరిపెట్టుకొని నేనును అందరితోపాటు భోజనము చేయబూనితిని.

భోజనానంతరము కీ. శే. రామకృష్ణన్ గారి వెంట గల వస్తువులను జాగ్రత్త చేయుటకు గాను మేమే ఐదుగురము ఒక కమిటీగా ఏర్పడి చైనా మేనేజర్ మరియు ఇతరుల ముందు ఒక్కొక్క వస్తువును బయటకు తీసి కాగితంపైన లిష్టు వ్రాసి తిరిగి ఆ సామానంతయు సంచులలో సర్దిపెట్టి లిష్టు యొక్క మరొక ప్రతిని ఒక దానిని మా లీడరు చెంత యుంచితిమి. ఆ తరువాత గదులలోనికి పోయి బడలికచే విశ్రమించితిమి. వెంటనే నిదురాదేవి ఆవహించెను.

☝ పైన చెప్పిన ఒక్కొక్క క్వార్టరులో మూడు గదులుండెను. గదికి మూడు మంచములు వానిపై పరుపులు తెల్లని రెండు దిండ్లు ఒక్కొక్కదాని పై ఒక్కొక్క బ్లాంకెట్టు ఒక్కొక్క పరుపులను జతపరచి యుంచిరి. ప్రతి గదిలోను ఒక సబ్బు, ఒక తువ్వాలు, ఒక బేసిన్, రెండు సోఫాలు, ఒక పెద్దవేడి నీటి థర్మోస్ ఫ్లాస్కు, ఒక ఖాళీ బకెట్టు, చన్నీటి బకెట్టు, ఒక పెద్ద కెటిల్ నిండుగా మంచి నీరు, రెండు కప్పులు లాసా నుండి తెచ్చిన తేయాకుపొడి మున్నగునవి అమర్చియుంచిరి. అది దాదాపు ఒక ప్రభుత్వ అతిధి గృహమువలె నుండెను. ఆ భవనమునకు ఒక స్వంత జనరేటర్ ద్వారా రాత్రి 11 గంటల వరకు విద్యుద్దీపములు వెలుగు ఏర్పాట్లు చేయబడి యుండెను. నాడు అనేక మానశిక శారీరక ఒత్తిడుల వలన వెంటనే గాఢనిద్రలో మునిగిపోయితిని. అందుకేనేమో దారిమధ్యలో ఎవ్వరికి ఏ అపాయము జరిగినను ప్రభుత్వ బాధ్యత యుండ బోదని ఢిల్లీలో విదేశాంగశాఖ కార్యాలయములో మా అందరిచేత పదిరూపాయల స్టాంపు కాగితంపై అంగీకార పత్రము వ్రాయించి తీసుకొనుట జరిగినది. ☝

✍ జీవితములో ప్రప్రథమ విదేశ యాత్ర ప్రథమదినముననే పై విధముగా కఠిన ప్రయాసకులోనైతిమి. రాత్రి దాదాపు పదకొండు గంటల ప్రాంతమున మా లీడరు మరియు మాధూర్ మున్నగువారు వచ్చి బలవంతముగా నాకు నిద్రా భంగము కలిగించి "చైనా మేనేజర్ తెల్లవారగానే మృత దేహముతో సహా అందరిని మనదేశమునకు తిరిగి పోవలసినదని చెప్పినాడు" ఏమి చేయుదమని గద్గద స్వరముతో చెప్పిరి. నేను ఏమాత్రము కంగారుపడక వారిని వెళ్ళి పడుకోమనియు, రేపటి విషయము రేపు ఆలోచించు కొనవచ్చునని, అనవసరముగా శారీరక బాధతో పాటు మనసులు కూడ పాడుచే సుకోవద్దని హాయిగా నిద్రపొమ్మని వారికి సలహాయిచ్చి పంపివేసి మరలగాఢ నిద్రలో మునిగిపోతిని. ✍

శ్లో॥ గోభి ర్జుష్టం ధనేన వా ప్యాయుషా చ బలేన చ।
ప్రజయా పశుభి ః పుష్కరాక్షం తన్మే మనః శివసంకల్ప మస్తు
సత్యం మాతా పితా జ్ఞానం ధర్మో భ్రాతా దయా సఖా ।
శాంతి ః పత్నీ క్షమా పుత్ర ః షడతే మమ బాంధవా ః.
( ఇతి శైవషడక్షరీస్తుతి ః)



# పదునేడవ అధ్యాయం

## తక్లా కోట్‌లో

శ్లో॥ నాగేంద్ర హారాయ త్రిలోచనాయ।
భస్మాంగ రాగాయ మహేశ్వరాయ।
నిత్యాయ శుద్ధాయ దిగంబరాయ।
తస్మై నకారాయ నమశ్శివాయ.

☝ తక్లాకోట్ జనాభా దాదాపు 10,000 లుండును. ఇందులో 5000 టిబెట్ దేశస్థులు. 4000 నేపాలీలు 1000 హోణ్‌లు (చీనావారు) ఉన్నారు. అక్టోబరు నెల తరువాత అచట చలి మంచు కురియుటచే నేపాలీయులు వెళ్ళిపోవుదురు. టిబెట్టనులు దీనావస్థలోను, బీదత్వములోను బానిసలలాగున్నట్లు తోచును. నేపాలీయులను చైనా దుకాణములలో వస్తువులను కొననియ్యరని వింటిమి. చాల వరకు వర్తకము ''బార్టర్'' విధానముపైన అంటే వస్తువులకు బదులుగా వస్తువులిచ్చు పద్ధతిపై జరుగును. నేపాలీయులు ఎక్కువగా గోధుమలు మున్నగు తిండి పదార్థములు ఉప్పు వగైరా ఇచ్చి దానికి బదులుగా ఉన్ని మున్నగునవి సేకరింతురు. వీరికి కొద్దిగా డబ్బు కూడ ఈయబడును. అచట వ్యవసాయము చాల తక్కువ. మొత్తము భూమి బీడుగాను, రాళ్ళమయ ప్రదేశముగా నుండుటవలన వ్యవసాయ యోగ్యము కాదు. పైగా పది పన్నెండు వేల అడుగుల ఆ ఎత్తు ప్రదేశములో ఏలాటి వృక్షములు మొక్కలు పెరగవు. ఐనను తక్లాకోట్ పరిసర ప్రాంతములో మంచుతో పారు నదులను కాల్వల ద్వారా పొలాలకు మళ్ళించుకొని ఇపుడిపుడే కొంత వ్యవసాయము కూడ చేయుచున్నారు. అలా గోధుమలు బార్లి వరి కూరగాయలు సాగులో నున్నవి. ☝

నాడు 30-7-1983న ఉదయమున లేచి టీ త్రాగి మేము చైనీయులతో మరల మృతదేహమును గురించి సంప్రదించితిమి. వారు మాలోని ఇరువురు వ్యక్తులు ''నభీడాంగ్'' వరకు వెళ్ళవలెననియు వారితో తమ మనుషులను ''లిపు పాస్'' శిఖరము వరకు మృతదేహముతో పంపెదమనియు చెప్పిరి. మన వారా మృతదేహమును మన జవానుల కప్పగించి, తిరిగి వచ్చిన తరువాత మేము మా కైలాస యాత్రను యధా పూర్వకముగా కొనసాగించవలసి యుండునని చెప్పిరి. కాని మా సహచరులలో ఎవరుకాని ఈ దుష్కర ప్రయాణమునకు ఒప్పుకోలేదు. మేము ఎంత ప్రయత్నించినను చైనావారు ఎలాంటి బాధ్యతలను స్వీకరించుటకు అంగీకరించుటలేదు. తరువాత మిత్రులందరు కూర్చొని తర్జన భర్జనలు చేయుచుండిరి. ఈ లోగా నేను వెళ్ళి ఆ ప్రక్కన ఫర్లాంగు దూరములో ప్రవహించు ఒక చల్లని నీటి కాలువలో

స్నానము ముగించుకొని వచ్చి పూజ పూర్తి చేసుకొంటిని. అందరము కలిసి టిఫినులు దాదాపు తొమ్మిది గంటలకు ఆరగించితిమి. తర్వాత మాలోని ఐదుగురితో ఒక కమిటీని ఏర్పాటు చేసికొంటిమి. అందు నేను డా. గోడ్బోలే, మాథూర్ మున్నగు వారము చేరియుంటిమి.

ఈలాటి విషాద పరిణామము గత మూడేండ్లలో నెప్పుడును జరిగినట్లు లేదు. అదే ప్రథమము కావున చైనీయులకు ఏమి చేయుటకు తోచకుండెను. ఇక మా సంగతి అంతయును క్రొత్తే. కొన్ని తర్జన భర్జనల తరువాత మేము కనీసం మృతదేహము చెడిపోకుండునట్లుగా ఏదైనా ఏర్పాటు చేయుడని కోరితిమి. దానికి ఆ గ్రామములో ఏ వసతియు లేనందున ''లిపు పాస్'' వద్ద మంచులో శవమును దాచియుంచుట ఒకటే మార్గమని సెలవిచ్చిరి. మేము లిఖితపూర్వకముగా ఆ ఏర్పాటు చేసి భారత ప్రభుత్వమునకు వివరములను కబురుచేసి మృతదేహమును అప్పగించగలందులకు గాను విన్నవించుకొంటిమి. దానికి వారొక షరతు పెట్టిరి. అదేమనగా భారత ప్రభుత్వము ఏదైన సమాచారము కోరినచో జవాబిచ్చుటకు గాను ఇద్దరు యాత్రికులను ''తక్లాకోట్'లో ఉంచునట్లును ఆ మృత దేహమును అప్పగించగనే వారిని జీపులో తిరిగి కైలాస మానసములు దర్శింప జేయునట్లును ఒడంబడిక కుదిరెను. ఆ తతంగమంతయు వ్రాత మూలకముగా పూర్తియగు వరకు 12½ గంటలు దాటెను.

తరువాత వెంటనే చైనావారు నలుగురు మనుష్యులను ఒక గుర్రమును మరొక గుర్రము పైన టెంట్లను కావలసిన సామానుల యుక్తముగా తయారు చేసిరి. ఆ మృత దేహమును ''లిపు పాస్'' వద్ద మంచులో పాతి పెట్టినను కాపలా అవసరము. ఏదేని తెలియని జంతువులు ఈకళేబరమును కబళించినచో బహు ప్రమాదము కదా! మా ఒడంబడికలో మేముకోరకున్నను ఆ విషయము లేకున్నను, ఏర్పాటు మాత్రం వారే చేసిరి. దాదాపు ఒంటిగంటకు శవమును బయటకు తెచ్చి పరుండబెట్టిరి. మేమందరము కీర్తిశేషులు రామకృష్ణన్ గారి మృత దేహమునకు నమస్కరించితిమి. మా గుండెలు బరువుతో నిండిపోయి కనులలో నీరు నిండెను. మేము దీన వదనులమై చూచుచుండగా ''షీ'' ఫోటోలు తీసెను. తర్వాత శవమును ఎత్తుచుండగా మాలో కొందరు ఏడ్చుటతో డా॥ గోడ్బోలే దారుణ దుఃఖమును ఆపుకోలేక వెక్కి వెక్కి ఏడ్చుచుండెను. టిబెట్టు స్త్రీలు, మాకు పరిచర్యలు చేయు స్త్రీలు కూడ ఏడ్చిరి. వెంటనే శవమును గుర్రముపై బంధించి ఆ టిబెటనులు 'లిపు పాస్'కు బయలు దేరిరి. మృతదేహమును మంచులో పాతిపెడితే చాల రోజుల వరకు చెడకుండా యుండును.

తక్లాకోట్‌లో కీ. శే. రామకృష్ణన్ గారి భౌతిక కాయమును చెడిపోకుండా యుంచుటకు సదుపాయము లేదు గావున దానిని లిపు పాస్‌కు తీసుకొని పోవు ఏర్పాటు చేయుట జరిగినది.

పౌరాణిక కాలములో కూడ భౌతిక కాయములు చెడకుండ మంచులో పాతిపెట్టి యుంచిన నిదర్శనములు పెక్కు కలవు. భారతములో పాండురాజుకు కుంతీమాద్రిలు ఇరువురు భార్యలున్నట్లు తెలియును. పాండు రాజు ఒకసారి మాద్రిసహితముగా హిమాలయములలో విహరిస్తు లేడి రూపములో క్రీడించుచున్న ఋషి జంటలోని, మగలేడిని (గిందమ ఋషి) వేటాడి జంపెను. ధర్మసూత్ర ప్రకారము క్రీడించుచున్న ఏ ప్రాణులను హింసించుట మహాపరాధము. అంతట ఆడలేడి నిజస్వరూపము ధరించి పాండురాజు చేసిన ఈ అపచారమునకు తన భార్యయగు మాద్రిని తాకినచో తలప్రక్కలై మరణింతువని శపించెను. అందుచే పాండురాజు కుంతీదేవితో మాత్రమే కేళి జరుపుచుండెను.

కొన్నాళ్ల తరువాత పాండురాజు కుంతీమాద్రి సహితుడై హిమాలయములలోని శతశృంగ పర్వతమునకు ప్రశాంతముగా గడుపుటకు వెడలెను. యధాప్రకారము కుంతీదేవిచే మాత్రమే క్రీడా కార్యక్రమములు సలుపుచుండెను. ఒకరోజు కుంతీదేవి ఏదో వ్రతములోనో మునిపుంగవుల పరిచర్యలలోనో నిమగ్నమై యుండెను. పాండురాజు కేళీ విలాస పురుషుడుగాను, కామతృష్ణ గలవాడుగను, జీవితమును ఉల్లాసముగను, నిశ్చింతగను గడుపుకాంక్షాపరుడైన కారణమున రాజ్యభారమును అంధుడగు ధృతరాష్ట్రున కప్పగించినట్లు భారత కథ తెలియచేయును.

ఆ రోజు పాండురాజు తన కామతాప మాపుకొనలేక మాద్రి పొందుగోరును. ఆమె యెంతవారించినను, శాపమును సహితము లెక్కచేయక, మాద్రిని క్రీడించును. వెంటనే తల ప్రయ్యలై మరణించును. అప్పటికి పాండురాజుచే కుంతీ మాద్రిలకు సంతానము కలుగకుండెను.

అంతట వ్యాస భగవానుడు అచటికి చేరి పాండురాజు భౌతిక కాయమును, శతశృంగ పర్వతపు హిమములో నిక్షేపింపజేసెను. సంతానహీనుడగుటచే వంశోద్ధరణకై వ్యాస భగవానుడు కుంతీదేవిని సంతానము బడయుటకు, పూర్వము దూర్వాస మహాముని ఉపదేశించిన మంత్రమును పఠించి సంతానము బడయ నాదేశించెను. ఆ మంత్ర ప్రభావము చేతనే కుంతీదేవి కన్యగా యున్నపుడే సూర్య భగవానుని యనుగ్రహముచే కర్ణుని కనిన వృత్తాంతము తెలిసినదే. అంతవరకు పాండురాజు దహన సంస్కారకాండ జరుగనందున కుంతీ మాద్రిలకు విధవత్వము ప్రాప్తించలేదని దోషరహితమని చెప్పినందున కుంతీదేవి ఆ మంత్రము పఠించి యమ వాయు

దేవేంద్రులను ప్రార్థించి యుధిష్ఠర భీమ అర్జునులను కొన్ని ఘడియలలోనే పుత్రులుగా బడసెను. ఆ తర్వాత కుంతీదేవి మాద్రికిని ఆ మంత్ర ముపదేశించెను. ఆమెయు మంత్రము జపించి ఆశ్వినీదేవతల ప్రార్థించెను. వారి హంశలచే నకుల సహదేవులను బడసెను.

ఆ తరువాత కొన్నాళ్లకు బంధువులెల్లరను రావించి పాండురాజుకు దహన సంస్కారములు చేయించగా మాద్రి పాండురాజుతో సహగమనము చేసెను. కుంతీయే పంచపాండవులకు తల్లియై పెంచి పెద్ద చేసెను. ఈ వృత్తాంతముచే ఈ మంచులో మృతదేహముల నిక్షిప్తము చేయు నాచారము ఆదినుండియు వున్నట్లు కాననగును. ఇట్లే పూర్వరాజులు మరికొందరును మంచులో పాతిపెట్టబడినట్లు నిదర్శనములు మన ఇతిహాసములలో లభించును.

పై ఐతిహాసిక వివరణలో భిన్నాభిప్రాయములున్నవి. ఈ విషయము ఒక పండిత మిత్రునిద్వారా తాళపత్ర గ్రంథ ఆధారముచే మాత్రమే తెలియచేయనైనది. భారత రచనలలో ఈ పై ఘట్టమేకాక యెన్నో ఇతర ఘటనలు యెందును కానరావు. పాండురాజు సజీవముగా నున్నపుడే శాపమువల్ల సంతానము తనచే బడయు నవకాశము తన భార్యలకు లేనందున కుంతీదేవిని నియోగమునకు ప్రోత్సహించునట్లు అందులకు ఆమె అంగీకరించక తనకు దూర్వాస మంత్రమహిమ తెల్యుటచే ఆ మంత్ర మూలముగానే సంతానము బడసినట్లు గ్రంథములలో తెలియచేయనైనది. తర్వాత ఆయన మరణముచే ఆ పర్వతములలో మునులచే దహన సంస్కారము చేయబడి, పాండవులు బాలురు గావున వారిని తెచ్చి ధృతరాష్ట్రుని కొప్పగించినట్లు గలదు.

ఏది యేమైనా ఇచట మంచులో నాటి కాలములో కూడ మృతదేహ నిక్షిప్తము కలదనే అంశమే నేను పాఠకులకు తెలియచేయగోరి ఈ అంశము నుదహరించితిని. పాఠకుల భిన్నాభిప్రాయముల ప్రసక్తి నిచట అనుచితమని మనవి.

ఆ పన్నెండు రోజుల ప్రయాణములో మాకు కలిగిన సంఘీభావమున మానవతా దృక్పథమును మాత్రమే కాక మాలో ఒకరిపై మరొకరికి ఎలాటి ప్రత్యే బాధ్యత నుండునను భావించు నవకాశము లేదు. మాలోని దాదాపు అందరును పన్నెండు రోజులకు పూర్వము ఒకరి నొకరు ఎరిగినవారు కాదు. మరొక విషయమేమనగా దాదాపు రు.8,000/- వెచ్చించి పన్నెండు రోజులు ప్రమాదభరితముగా అష్టకష్టాలు సహించి చేయు పవిత్ర యాత్రను మానుకొని ఒక మృతదేహమ్మును గురించి త్యాగము చేయు ఓపిక లేదా సాహసము మాలో ఏ ఒక్కరికిని లేకుండుట సహజమే. ఈ అనుభవమువల్ల ఇలాంటి కఠిన యాత్రలలో యాత్రికులు తమ ప్రాణములను గోల్పోవుటే కాక వారి వారి బంధు బాంధవులకు

మృత భౌతిక కాయమును చూడగల అవకాశమును కూడ జారవిడుచుకోవలసివచ్చునేమో నన్న ఆశంకకు లోనై మేమెంతో విచారమునకు గురియైతిమి.

తరువాత మేము భోజనములు ముగించుకొంటిమి. దానిలో అన్నము బన్ను మరియు సూప్ ఉడికించిన సన్నని. పొడుగైన కాయల ముక్కలను (చైనీస్ ఫుడ్) ఇచ్చిరి. ఉప్పుకారము నూనెలను వేరుగా ఉంచిరి. అదే వారిచ్చు భోజనము మాలో మాంసాహారులున్నను ఆ పవిత్ర యాత్రా సమయములో ఎవరును ఎచటను కూడ మాంసాహారమును తీసికొనలేదు. అందుచే ఇచ్చటను కూడ మాకందరికి శాకాహారమే ఏర్పాటు చేయగలందులకు కోరితిమి. ఈ యాత్రలో మాలో నెవ్వరును మధుపానము కూడ చెయ్యలేదు. అంతటి చలి ప్రదేశములో అలవాటున్న ప్రతివారు బార్లీతో చేసిన మదిరను (బీర్) తప్పక సేవింతురు. కాని మాలో అందరును దాదాపుగ దైవభక్తి కలిగి పవిత్ర యాత్రను దృష్టిలో నుంచుకొని యున్నవారమైతిమి. భోజనాదుల తర్వాత మమ్ములను ప్రక్క యున్నట్టి బ్యాంకుకు తీసికొనిపోయిరి. అచట మేమే చైనా యువానులు (నాణెములు) 651 చెల్లించవలసివచ్చెను. ఆ ధనము భోజన వసతి బస్సు గుర్రములు వంటపాత్రలు పాల సరఫరా మొదలగు ఖర్చుల గురించియు కైలాష్ మానస పరిక్రమ యేర్పాట్ల కొరకై చెల్లించవలసియుండెను. 651 యువానులకు సరిగా 341 అమెరికా డాలర్లు సమానము. అంటే దాదాపు రు. 3500/- భారత రూపాయలగును. తొమ్మిది అమెరికా డాలర్లకు సరిపడు యువానులను మేము చెంత నుంచుకొనుటకుగాను గైకొంటిమి. ఒక యువాను దాదాపు ఐదు రూపాయలకు సమముగా నుండెను.

ఆ కార్యక్రమానంతరము మేము తిరిగి వచ్చి రూములో జేరి విశ్రమించితిమి. నేను నా వద్ద గల స్తోత్ర రత్నమాల పుస్తకమును పఠించి తన్మయుడనైతిని. సాయంత్రము చైనీయులు 5 గంటలకు మా అందరిని బయటకు తోడ్కొని వెళ్ళిరి. ఊరి చివరివరకు వాకింగ్ జరిపితిమి. అచట పాలాలు దూరాన నేపాల్ టింకర్ పాస్ మరియు భారత లిపుపాస్ మున్నగు హిమశిఖర పర్వత శ్రేణులు ఎంతో అందముగా కన్పించుచుండెను. మేము ఫోటోలు తీసికొంటిమి. తక్లాకోట్ ప్రక్కన గల ఎత్తు ప్రదేశములోని శిథిల సమ్మర్ ప్యాలె స్కు తీసికొని వెళ్ళుటకు కోరితిమి. కాని చైనా వారంగీకరించలేదు. ప్రస్తుతము అది మిలటరీ సంబంధమగు రహస్య స్థావరముగా ఉపయోగింపబడుచుండవచ్చును. ఆ తర్వాత కొంత సేపటికి సాయంత్రం ఆరు గంటలయ్యెను. (బీజింగ్ టైం 8½ గంటలు) మేము తిరిగి భవనమునకు చేరగనే భోజనములకు పిలచిరి. మేమందరము వెళ్ళి తోటివారి వద్ద గల కొన్ని పచ్చళ్ళు వాడుకొని భోజనములు ముగించితిమి. ఆ తర్వాత మాకు

భవనము వెనకగల పెద్ద హాలులో చైనీయులు తమ భాషలో గల ''పంచెన్‌లామా'' దేశమునకు చేసిన అభివృద్ధి కార్యముల గురించిన ఒక సినిమా ఫిల్మ్ పక్షుల జీవితముపై మరొక సినిమా ఫిల్మ్ చూపించగా అవి చూసి రాత్రి పది గంటలకు విశ్రమించితిమి. ఉదయమే బీజింగ్ టైము ఐదుగంటలకు మా ప్రయాణమని చెప్పిరి. ✍

శ్లో॥ మందాకినీ సలిల చందన చర్చితాయ
నందీశ్వర ప్రమధనాథ మహేశ్వరాయ
మందార ముఖ్య బహుపుష్ప సుపూజితాయ
తస్మై మకారమహితాయ నమ శ్శివాయ.



 అనేక జన్మల పుణ్యము ఒకసారి త్రాగిన పోవునని శుక్రాచార్యుడ మద్యపానమును శపించెను.

 ఇద్దరు భూమి సరహిద్దుకై పోట్లాడి ఒకడు పాముగా, మరియొకడు కప్పగ పుట్టెనెను. వీనినిబట్టి పోట్లాడిన నీచజన్మలు గలుగునని తెలియుచున్నది.

 తీర్థయాత్రలు చేసినవారికి దరిద్రము, రోగము ఏ జన్మకు రాదు.

# పదునెనిమిదవ అధ్యాయము

## టిబెట్ దేశ చరిత్ర

1. శ్లో॥ శివాయ గౌరీవదనారవింద-।
సూర్యాయ దక్షాధ్వరనాశ నాయ।
శ్రీ నీలకంఠాయ వృషధ్వజాయ।
తస్మై శికారాయ నమ శ్శివాయ।

2. శ్లో. వశిష్ఠకుంభోద్భవగౌతమాది।
మునీంద్ర దేవార్చిత శేఖరాయ।
చంద్రార్క వైశ్వానర లోచనాయ।
తస్మై వకారాయ నమ శ్శివాయ.

మన ప్రాచీన పురాణేతిహాసములలో దేశచరిత్రకు చెందిన అనేక వంశావళులు ఆ యారాజుల గాథలు వివరముగా వ్రాయబడియున్నవి. కాని ఈనాటి మన చరిత్రకారులు ఆ వివరములను కేవలము పుక్కిట పురాణములుగా త్రోసిపుచ్చుట జరుగుచున్నది. కల్హణుని రాజతరంగిణిలోని అనేక విషయాలను ఆంగ్ల ప్రభుత్వ అనంతర కాలపు ఆధునిక చరిత్రకారులు ప్రామాణికముగా గుర్తించుటలేదు. ఈ ముఖ్య విషయములను గూర్చి చరిత్రకారులు మరింత నిశితంగా ఆలోచించుట ఆవశ్యకమని భావించనైనది.

మనపురాణముల ప్రకార ము మగధ సామ్రాజ్యమును పరిపాలించిన నంద వంశీయులు. క్రీ. పూ. 1534వ సంవత్సరములకు చెందినవారు. చంద్రగుప్తమౌర్యుడు క్రీ. పూ. 1534 నుండి 1500 వరకు పరిపాలించినట్లు పురాణములో కలదు. దీనిని క లి అబ్దములు 1408-1568 మరియు 1568-1602 లుగా పేర్కొన వచ్చును. మహాభారత యుద్ధము క్రీ. పూ. 3138 సంవత్సరమున జరిగినట్లు మనవారు జ్యోతిషచక్ర ఆధారముపై నిరూపించియున్నారు. పై అభిప్రాయ భేదమువలన మన పురాణ రచయితలు పేర్కొనియున్న బృహద్రథులు ప్రద్యోతులు మరియు శిశునాగ వంశీయుల చరిత్రలు అనిర్ధారితమై అంధకారమున పడిపోవుట జరుగుచున్నది.

నేటి చరిత్రకారులు చంద్రగుప్త మౌర్యుడు క్రీ. పూ. మూడవ శతాబ్దమునకు చెందినట్లుగా భావించుచున్నారు. దీని వలన దాదాపు 1,300 సంవత్సరములకు పైబడు చరిత్ర లోపించి పోవలసి వచ్చినది. ఎట్లాగైనను పురాణోక్తమగు మన చరిత్రను మరింతలోతుగా పరిశోధించినచో చరిత్రలోని ఈ 1,300 యేండ్ల చరిత్రావగాహన సమస్యను చాలావరకు పరిష్కరించుకొనవచ్చును.

తొలుత బ్రహ్మావర్త ఆర్యావర్త ప్రాంతములలో మానవ సృష్టి జరిగినట్లు వేదపురాణేతి హాసములలో స్పష్టముగా వ్రాయబడినది. బ్రహ్మావర్తమనగా సరస్వతి దృషద్వతినదులసమీపమునగల ప్రదేశమని అలాగే గంగాతీర ప్రాంతమును కూడ ఆర్యావర్తముగా ప్రాచీనులు పేర్కొని యున్నారు. ఇందులో సరస్వతీనది మహాభారత కాలంలోనే ఇంకిపోయినట్లు, అది భూమి అంతర్గతంగా ప్రవహించుచు ప్రయాగలో త్రివేణి సంగమంగాయేర్పడినట్లు పురాణాధారములచే తెల్యుచున్నది. ఈ రెండును కలసి ఉత్తరా పథముగా భావించవచ్చును. ఈ ఉత్తరాపథమున గల సింధునది తీరము నాశ్రయించి ''రమనులు'' (రోమనులు) హరులు, హూణులు, కిరాతులు, పర్వతులు, అభిసారులు, శకస్థానులు, సుత్తలులు, ఆర్యానకులు, బాహ్లీకులు, దరదులు, ఉత్తరజ్యోతిష్కులు, గాంధారులు మున్నగు తెగలవారు నివసించిరి. వీరు ఆ కాలమున వేదకర్మలను సక్రమముగా నిర్వర్తించనందున ఆర్యులు వీరిని బహిష్కరించగా వీరెల్లరు దేశాంతరములకేగి స్థిరపడినట్లుగా పురాణగాథలు చెప్పుచున్నవి.

ఒకవంక ఈ యదార్థము కనపడుచుండగా వేరొకదిశన నవీన చరిత్రకారులు పలువిదేశములనుండి ఆర్యులు భారత దేశమున ప్రవేశించినట్లును అంతకు పూర్వమే దేశములో నివసించుచుండిన ద్రావిడాది తెగలవారిని అణచివేసి దక్షిణాపథమునకు తరిమి వేసినట్లును చరిత్రకారులు వ్రాసియున్నారు. దీనిని మన చరిత్రకారులు పునరాలోచించుట అవుసరము.

శ్లో. సింధు స్థాన మితి జ్ఞేయం రాష్ట్ర మార్య న్య చోత్తమమ్ ।
మ్లేచ్ఛస్థానం పరం సింధో కృతం తేన మహాత్మనా॥ (భవిష్య పురాణం)

శ్లో. ఉత్తర శ్చాపరే మ్లేచ్ఛా క్రూణభరత సత్తమా। (భా. భీష్మ. పర్వ)

శ్లో. యవనా శ్చీన కాంభోజా దారుణా మ్లేచ్ఛ జాతయః
సకృద్గ్రాః కులత్థా శ్చ హూణ పరశైకైన్యః ॥ (భా. భీష్మ. పర్వ.)

పై శ్లోకములు మన ఇతిహాస కవిలోకమున అనుగుణ్యా సాక్ష్యమిచ్చుచున్నవి.

మార్కండేయ పురాణమున భారతదేశ యెల్లలను గూర్చి ఈ దిగుః శ్లోకమున వివరించి యున్నారు.:-

శ్లో॥ పూర్వే కిరాతే యస్యాంతే పశ్చిమే యవనాః స్మృతాః ।
దక్షిణే మలయో యస్య హిమవాన్ ఉత్తరే తథా ॥
తదేతద్ భారతం వర్షం సర్వబీజం ద్విజోత్తమ ।
బ్రహ్మత్వ మమరేశత్వం దేవత్వ మపి దుర్లభం. ॥

అదే విధముగా భారతదేశము నుండి సగర చక్రవర్తి మ్లేచ్ఛ జాతులను తరిమి వేసిన ప్రసక్తి ఈ క్రింద విధముగా నున్నది :-

శ్లో॥ శకాః యవన కాంభోజాః పరథాః పల్లవా స్తధా ।
కోనిసర్పాః సమాహిషాః దర్వా శ్చోలాః సకేరళాః ॥
సర్వే తే క్షత్రియా స్తథా తేషాం ధర్మా నిరాకృతాః ।
విశిష్ట వచనా ద్రాజన్ సగరేణ మహాత్మనా ॥ (హరివంశ)

మాంధాత మహారాజు ఇంద్రునితో నుడివినట్లు మహాభారత శాంతి పర్వమున తెలియచేయబడినది :-

శ్లో. యవనాః కిరాతా గాంధారా శ్చీణాశవర వర్వరః ।
శకాస్తుషారా కంకాక్ష ప్లహ్వా శ్చాంధ్ర మద్రకాః ॥
పౌండ్రాః పులిందా రమఠాః కాంభోజాశ్చైవ సర్వశః ।
బ్రహ్మ క్షత్ర ప్రసూతాశ్చ వైశ్యాః శూద్రాక్ష మానవాః ॥
కంద ధర్మాం శ్చరిత్యంతి సర్వే విషయవాసినః ।
మద్విధై శ్చ కధం స్థాప్యాః సర్వే వై దస్యు జీవినః ॥
ఏత దిచ్ఛామ్యహం శ్రోతుం భగవం స్తద్ బ్రవీహి మే ।
త్వంబంధు భూతోహ్యస్మాకం క్షత్రియాణాం సురేశ్వర ॥

☝ పై శ్లోకము వలన తెలియునదేమన :- క్షత్రియసార్వభౌముడైన మాంధాత భారత దేశములోగల ఆయా తెగలవారిని ఏవిధముగా ఆర్య ధర్మమున ప్రవేశపెట్టవలయునాయని వశిష్టమహాముని నడిగినట్లు తెలియుచున్నది. మరియు నీ ప్రాంతముల నార్య ధర్మమును పూర్వ మన్వంతరములకు అను గుణ్యరీతిలోనే మాంధాత నెలకొల్పినట్లు విశద మగుచున్నది. ☝

## --మహాభారతములో భీష్మ పర్వమున--

శ్లో. ప్రాగ్జ్యోతి షాధిప శ్శూరో మ్లేచ్ఛానా మధిపోబలీ ।
యవనై స్సహితో రాజా భగదత్తోమహారధిః ॥

పై శ్లోకమువలన యవనులు గ్రీకుదేశస్థులుకాదని తెలియుచున్నది. అంతేకాక.

శ్లో. అటవీం చ పురీం రమ్యాం యవనానాం పురం తధా। (భా.స.పర్వ)

☝ ఇట్టి ఉదాహరణలవలన యవనులను వారు భారతీయ క్షత్రియులేననియు గ్రీకు దేశములో నివసించువారు కాదనియు లేదా అచటి నుండి వచ్చిన వారు కాదనియు తేట తెల్లమగుచున్నది.

నేటి చరిత్రకారులు గ్రీసు దేశమున గ్రీకుభాషను యవనపదములతో జతపరచి అవగాహనలో పలు సంశయములకు దారితీయుచున్నారు. భారతదేశము నుండియే యవనులు మున్నగు కొన్ని తెగలవారు ఐరోపా మరియు ఈజిప్టు, గ్రీకు, చీనా తదితర ప్రాంతములకు తరలిపోయినట్లుగా పురాణములలో వివరించియున్నారు. మన పురాణములే కాక బౌద్ధ జైన పురాణములు కూడ మేరు సుందర ప్రాంత బ్రహ్మావర్తముననే మానవసృష్టి జరిగినట్లు పేర్కొనియుండుట గమనింపదగినది. ఈ విషయములో ఇంకను వివరములు కావలసినచో-ఆర్య విజ్ఞాన గ్రంథమాల విజయవాడ-వారి ''బుద్ధ మిళింద మిత్యోర యుగ పురాణ గ్రంథము''ను చూడవచ్చును. ☝

✍ చిన్ననాట ఎపుడో విన్న జ్ఞాపకము ననుసరించి చాలమంది వలె మేమును ఈ టిబెట్టులో ప్రత్యేకంగా మానస సరోవర ప్రాంతములో ఆలయములు మంచి మంచి వృక్షములు జంతువులు సరోవరములో రాజహంసలు ఉండగలవని భ్రమించితిమి. పన్నెండువేల అడుగుల ఎత్తున వున్న ఆ ప్రదేశమున ఏలాటి చెట్లును వుండవని తెల్యును. అది దాదాపు అ. 12,000 నుండి అ. 14,000 ల వరకు గల ఎత్తు ప్రదేశము. చాల చలిగా నుండును. అందుచే నిర్వృక్ష మరియు నిర్జంతు ప్రదేశము. పూర్వమిచట చాల బౌద్ధారామములు 'గొంపా'లు ఆశ్రమములు ఉన్నమాట వాస్తవము. కాని చారిత్రకంగా మధ్యలో ఈ టిబెట్టు ప్రాంతము ఎన్నో దాడులకు దోపిళ్ళకు గురియయ్యెను. ఎన్నోసార్లు మఠములు, ఆరామములు, బౌద్ధ గ్రంథములు ధ్వంసము చేయబడెను. ఈ మధ్య చైనాలో చెలరేగిన సాంస్కృతిక విప్లవ సందర్భములో అచటి యువక బృందము టిబెట్‌లోని అనేక 'గొంపా' లను ధ్వంసము చేసియున్నారని తెలిసినది. ✍

☝ పూర్వము కాశ్మీరుదేశము నేలు 'లలితాదిత్యు'డనురాజు మధ్య ఆసియా టిబెట్‌లను జయించి ప్రథమముగా బౌద్ధమతము నచట స్థాపించియుండెను. మరియు అచటికి పండితులను పంపి బౌద్ధ మత వ్యాప్తికి గాను కృషి జరిపెను. తరువాత టిబెట్ చక్రవర్తి నేపాలును జయించి 'భ్రికుటి' యను రాకుమారిని పెండ్లి యాడెను. తర్వాత నేపాలు పండితులు ఆచటికి వెళ్ళి బౌద్ధ మత వ్యాప్తికి కృషి జరిపిరి. నేటికిని వేలాది ప్రజలు టిబెట్ నుండి నేపాలుకు యాత్ర చేసి అచటి పెద్ద తీర్థములను మూడింటిని 1. స్వయంభు, 2. మహాబోధి, 3. నమోబుద్ధ యలు దర్శించి వత్తురు. టిబెట్‌లో బౌద్ధమతమును స్వీకరించిన సన్యాసులను ''లామా'' లందురు.

టిబెట్‌లో ఏడవ శతాబ్దమునకు పూర్వము ''షామాన్'' యను మత గురువు నెలకొల్పిన ''బొంపాబౌద్ధ'' మతాచారములు కొనసాగినవి. ఈ

బొంపాబౌద్ధులు ఎర్రటోపీలను ధరించి యుండెడివారు. వీరు పలు భూత, ప్రేత, పిశాచ, మారణ శక్తులను విశ్వసించి కొన్ని అనాగరిక క్రూర ఆచారములను కొనసాగించి యుండిరి.

ఆ పరిస్థితిలో భారతదేశమునుండి టిబెట్‌కు పయనించిన ''మిలరిపుడు'' టిబెటులో ''దుగ్పా'' బౌద్ధమును ప్రవేశపెట్టెను. ఈ మత లామాలు పసుపు పచ్చటోపీలను ధరించి అహింసను పాటించిరి. ఉత్తర టిబెట్, సింకి యాంగ్ కజగ్ ప్రాంతముల నుండి ఎర్రటోపీ బొంపా బౌద్ధులు దక్షిణ టిబెట్‌లోని దుగ్పా బౌద్ధులపై దాడులు దండ యాత్రలు జరుపుచుండిరి.

టిబెట్ ప్రాంతములో బౌద్ధ తంత్ర ఆచార సంప్రదాయములను గట్టి పునాదులపై నెలకొల్పిన వారు 'ఆచార్య అతిశుడు' నేటికిని దీపంకర అతిశుని టిబెటు లామాలు సాక్షాత్తు ఆది బుద్ధుడుగా భావించి నేటికిని భక్తి శ్రద్ధలతో నారాధించుచున్నారు. వారు బహు గ్రంధకర్తగాను ప్రవక్తగాను ఖ్యాతిగాంచిరి. వారు మానస సరోవర ప్రాంతమున సాయుజ్య మొందినట్లు తెలియుచున్నది. వీరిని టిబెట్ దేశీయులు బౌద్ధ ధర్మ పునరావిష్కర్తగా విశ్వసించెదరు. అతిశుడు వారి శిష్యుడగు ''బ్రొంటాన్‌వే''లను ప్రథమ దలైలామా పదునాల్గవ శతాబ్దిలో అవతరించెను. నాటి నుండి నేటి వరకు పదునాల్గురు దలైనామాలు టిబెట్ ముఖ్యపట్టణమగు ''లాసా''లో నివసించిరి. వారందరు ''లామాఇజం'' అనే ప్రత్యేక బౌద్ధ శాఖాధిపతులుగా కొనసాగినట్లుగా ''మావియర్ విలియమ్స్'' తన ''బుద్ధిజం''యను గ్ర ంథములో పేర్కొనియున్నారు. ఈ లామాలను ఎన్నుకొను అచారము కూడ అవతార తత్వపునాదికపైననే ఆధారపడియున్నది.

దాదాపు సం. 1400 A.D. ప్రాంతము వ రకు ఈ టిబెటు చైనాదేశ ఆధీనములో నున్నట్లును చైనా రాజదూత ఒకరు టిబెట్‌లో నుండి అచటి రాజ గురువైన ''దలైలామా''తో సహకరించుచున్నట్లును చైనా చారిత్రికులు వ్రాసిరి. క్రీ.శ. 1610 నుండి 1680 వరకు టిబెటును పరిపాలించిన ఐదవ దలైలామా చైనా సహకారమును ధిక్కరించి తన సార్వభౌమత్వమును నెలకొల్పుకొని తాను ''అవలోకి తేశ్వరు''డగు బోధిసత్వావారసునిగా చాటుకొనెను. (విష్ణువు) ఈ దలై లామాలు మతాధికారులు గాను, తాషిలామాలు (పంచన్ లామాలు) న్యాయాధికారులు గాను తరువాత స్థిరపడిరి. వీరు బౌద్ధమత వ్యాప్తికి ఎనలేని కృషి జరిపి, ఎన్నో ఆరామములు ఆశ్రమములు ఆయా ప్రదేశములలో స్థాపించిరి. చివరి 14వ దలైలామా క్రీ. శ. 1935లో జన్మించి 1940 ఫిబ్రవరి 22వ తేదీన ''లాసా'' పట్టణములోని 'పొటాలా'' భవనములో రాజ్యపట్టాభిషిక్తుడాయెను. ఈ పదునాల్గువ దలైలామాయే క్రీ.శ. 1962లో చైనీయులు టిబెటును ఆక్రమించుకొనగా పారిపోయి ఇప్పటికి మన

భారత దేశములో రాజకీయ శరణార్థ ఆశ్రయము పొంది నివసించుచున్నాడు. అదే సమయమున చైనీయులు భారత భూభాగమును కొంత ఆక్రమించుటచే భారత చైనాల మధ్య యుద్ధము జరుగుటయు అప్పటి మన ప్రధానియైన కీ. శే. జవహర్‌లాల్ నెహ్రూ ఆ మనోవ్యాధితోనే ఆరోగ్యమును కోల్పోయి దివంగతులగుటయు జరిగినది. ఈ విధముగా ప్రసుత్తము టిబెటు చైనా యధీనములో నున్నది.

దలైలామా అవలోకితేశ్వర (విష్ణుమూర్తి) అవతారము. ఈయన ధ్యాని బోధిసత్త్వుని ప్రతినిధిగాను పంచన్‌లామా బుద్ధ అమితాబ అవతారముగను బౌద్ధులు విశ్వసించెదరు. ప్రథమ బుద్ధుడగు అవలోకితేశ్వరునకు రెండవ బుద్ధుడు అమితాభుడు కుమారుడనియు (బ్రహ్మదేవుడు) చెప్పబడి యుండుటచే తండ్రికి పుత్రుడు విధేయుడై యుండునని వీరి పురాణములు తెల్పుచున్నవి. ''పంచన్‌లామా'' ''తాషీలుప్పో'' అను పట్టణములోను దలైలామా ''లాసా'' (టిబెటు ముఖ్య పట్టణము)లోను నివసిస్తూంటారు.

టిబెటులో 'లామాఇజం' ఒక వ్యవస్థగా కొనసాగుచున్నది. అవలోకి తేశ్వరుడు జగద్రక్షకుడు. ఆయన మానవ ఉద్ధరణకై మనుష్య రూపములో నవతరించుచుండును. టిబెటన్ బౌద్ధులు బుద్ధుని న్యాయమును ధర్మమును త్రిరత్నరూపములుగా విశ్వసింతురు. అవలోకితేశ్వరుడు మంజు(శ్రీ) మైత్రేయ కుబేర పద్మ సంభవుల విగ్రహముల నారాధింతురు. ''పల్డన్'' అను మారణశక్తి (కాళిరూపము) లామాలకును బౌద్ధ ధర్మమునకు నిరంతర రక్షణ నొసగునని టిబెటు దేశస్థులు నమ్ముదురు. ఈ శక్తి భూత ప్రేత పిశాచాదులను దునుమాడునని నమ్మెదరు. ఈ శక్తి పరముగా బయళ్ళలో అచ్చటచ్చట గల వృక్షశాఖల పైనను లేక ధ్వజస్తంభముల పైనను గుడ్డపేలికలను (జెండా)కట్టి దాని మూలముగా అరిష్టములనుండి రక్షణ పొందుదుమని భావింతురు. అవలోకితేశ్వరుని విగ్రహములను అనేకాకృతులతో నెలకొలుపు కొందురు.

ఈ లామాలు పలురకములు. దలైలామాలు, పంచన్‌లామాలు, గ్రాండ్ లామాలు. గ్రాండ్‌లామాలు అవతార లామాలు అవతార రహిత (ఖంపో) లామాలు వారి అధికార స్థాయిననుసరించి ప్రాధాన్యత బడయుచుందురు. 'లుంపా' లనే బోధిసత్వ దేవాలయములను వీరు నెలకొల్పి యున్నారు. బౌద్ధ మఠము (గొంపా) లలోను దేవాలయములుండును. లాబ్రాంగ్, రమోచి, మోరు, గల్డన్, సెరా, లాపున్ మున్నగు ప్రధాన మఠములు వేలాది సంఖ్యలో గల లామాలకు ఆశ్రయములుగా నుండును. లామాలు నిరంతరము బౌద్ధ మంత్రములను జపించుచుందురు. ఈ మంత్రములు ధరణియను బీజాక్షర యంత్రముతో కూడా యుండును.

✍ ''ఓం మణి పద్మేహం ప్రాం'', ''ఓం వజ్ర పాణి హుం'', ''ఓం అహం'', ''ఓం వాగీశ్వరీ మం'', ''సర్వ సిద్ధి ఫలహం'', ''ఓం ముని ముని, మహాముని, శాక్యముని ఆవాహ'', ''ఓం వజ్ర సత్వహుం హులు హులు, రులు రులు, హుంఫట్'' అను మంత్రములను లామాలు పఠించుచుందురు. ✍

☝ ఈ టిబెట్ లామాలు, పులి, డేగ, సింహము డ్రాగన్ (సర్పము) మొదలుగా గల చిత్రములను వారి జెండాలపై చిత్రించెదరు. అవి దుష్టగ్రహ పిశాచశక్తుల నుండి వారిని కాపాడగలవని వారి విశ్వాసము. ఎగిరే గుర్రము (లుంగా) గుర్తుకూడా అలాంటిదే. ఈ మఠములను నడిపించుట కయ్యే ఖర్చులను ఆ గ్రామీణ ప్రజలు ధారాళముగా విరాళములు కానుకలు బహుమతుల రూపంలో చెల్లింతురు. ఈ మఠములన్నియు, చైనావారి దాడి యనంతరము తమ ప్రాబల్యమును కోల్పోయినవి. సాంఘిక వ్యవస్థలో కూడా లామాల ప్రభావము చాలావరకు అంతరించిపోయినది. ✍

✍ క్రీ.శ. 1962 నుండి 1980 వరకు ఈ కైలాస మానస సరోవర పుణ్యక్షేత్రములను మనదేశీయులు ఎవరును దర్శించలేదని చెప్పవచ్చును. ఈ మధ్యకాలములో ఈ రెండు దేశముల దౌత్య సంబంధములు అంతంతమాత్రముగనే యుండెను. 1980లో భారతదేశ విదేశాంగశాఖామాత్యులు శ్రీ పి.వి. నరసింహారావు గారు, ఆ శాఖ ఇతర నిర్వాహకులు శ్రీ సుబ్రహ్మణ్యస్వామి, ఎం.పి. గారు మరియు నితరుల కృషి ఫలితంగా 1981వ సంవత్సరము నుండి, ప్రతి సంవత్సరము రెండు వందల మంది భారతీయులకు ఈ పుణ్యక్షేత్రములను దర్శించుకొను సౌలభ్యమును, చైనావారిచే కల్పింపచేసిరి. ఈ అవకాశమును 1981, 1982, 1983 సంవత్సరములలో మన దేశీయులు వినియోగించుకొని ఈ పుణ్యక్షేత్రములను దర్శనము చేసికొనిరి. ఈ 1983 సంవత్సరమున దాదాపు 6,000 దరఖాస్తులు ఈ యాత్రకై విదేశాంగశాఖకు చేరగా అందులో 200 మందిని లాటరీ ద్వారా ఎంపిక చేసిరి. కాని ఈ యాత్రకు కావలసిన ఆరోగ్య అర్హతలు అందరికి లభించని కారణమున దాదాపు 150 మంది మాత్రమే ఈ యాత్రకు అర్హత పొందిరి. ఈ యాత్రికులను చిన్న చిన్న బృందములుగా విభజించిరి. అందు నాల్గవ బృందములో నేనును, నియుక్తుడనై యాత్ర పూర్తిచేసి వచ్చితిని. ఈ చైనా భారతదేశ ఒడంబడిక మొదట మూడు సంవత్సరముల వరకు అమలులోనికి వచ్చెను. 1983తో ఈ ఒడంబడిక ముగిసినది. మరల ఈ ఒడంబడిక పునరుద్ధరింపబడిన యెడల మరొక మూడు సంవత్సరములు యాత్రికులు పోవచ్చును. ఈ పుస్తక రచన పూర్తియగు వరకు (అనగా 1985 సం.) రెండు బృందములు (1984, 1985) యాత్రలు చేసివచ్చెను. అనగా మరల ఒడంబడిక జరిగినదని తెలియవలెను. యాత్రికులకు అదనపు సౌకర్యములు కొన్ని మనవైపు

నుండియు కొన్ని చైనావారి తరపునను జరుగవలసినవి కొన్ని జరిగినవి. ఉభయ ప్రభుత్వములు, ఇంకా కొన్ని వసతులు, సౌకర్యములు కల్పించి యాత్రికులకు ప్రోత్సాహము చేకూర్చవలసిన బాద్యత యెంతేని ముఖ్యమని భావించుచున్నాము. ఈ యాత్ర యధాక్రమం 1997 సం॥ రం వరకు సాగినది. ఈ పుస్తక ద్వితీయముద్రణ 1998 జూన్‌నెలలో పూర్తి అయినది.

కాశ్మీర్ మహారాజా గులాబ్‌సింగ్‌గారి ప్రథమ సైనికాధికారి జనరల్ జరావల్‌సింగ్ క్రీ.శ. 1841 సం.లో 'లడక్' ప్రాంతమును స్వాధీన పరచుకొనెను. ఆ తరువాత అతడు 1841లో కైలాస ప్రాంతమునకు బయలుదేరి త్రోవలోగల గ్రామములను ఆరామములను బౌద్ధమఠములను బౌద్ధ బిక్షువులను, కోటలను నాశనము చేసెను. 'తీర్థపురి' ని ముఖ్య పట్టణముగా చేసికొని 1,500 సైనికులతో 10,000 టిబెటు సైన్యమును మట్టుబెట్టి ''తక్లాకోట్'' చేరెను. ఆ తర్వాత ఆ జరావర్‌సింగ్ తన భార్యను కొద్ది సైన్యముతో 'గోర్టక్'లో వదలి వచ్చుచుండగా దారిలో చైనీయుల అసంఖ్యాక సైన్యములు ఆయనపై దాడిచేసెను. అయినను అతడు అద్భుతముగా పోరాడి చూచువారికి తాంత్రిక మాంత్రిక శక్తులున్నవానిగా తోచునట్లు వీరవిహారముచేసి చివరికొక బంగారు బుల్లెట్ దెబ్బవలన మరణించెను ఆతని ధైర్య సాహసములకు అచ్చెరు వొందిన టిబెటు దేశీయులు ఈతనికి ''తొమో''లో ఒక సమాధిని కట్టించిరి. ఆయన వాడిన ఆయుధములు, అతని ఒక చేయి, మరియు వృషణములను నేటికిని అచట భద్రపరచియుంచినట్లు తెల్పిరి. తక్లాకోట్‌లోని ధర్మ సేవాసంఘము వారు జరావర్‌సింగు పరాక్రమమును తెలియచేయటకై ఆయన శతాబ్ది ఉత్సవములు కూడ జరిపించుచుండిరి. తమ దేశమును ఆక్రమించిన ఒక శత్రువు స్మారకమును నిర్మించిన ఘనత టిబెట్‌లో తప్ప ప్రంపచములో మరెక్కడను కానరాదేమో! లేక, జరావర్‌సింగ్ ఆరోజులలో టిబెటుపైన తరచూగా జరుగు చైనీయుల దండయాత్రల నిరోధించి అచట శాంతి భద్రతలను నెలకొల్పబూని యుండుట కూడ సంభవమై యుండును. టిబెట్ లామాలు జరావల్‌సింగును స్వయముగానే ఆహ్వానించి యుండవచ్చును. ఏవిధముగనైనను ఆరోజులలో టిబెట్ భూభాగము పై చైనీయుల సామ్రాజ్యాధికారము నామమాత్రముగానే యుండినట్లు చరిత్ర వలన తేటతెల్లమగుచున్నది. టిబెట్ ప్రాంత పరిసరములలో గల చైనా, రష్యా లడక్ దేశముల ఆయా సంచార నేరస్థజాతులును తెగలును టిబెట్ ప్రాంతము భూభాగమున సాయుధులై సంచరించుచు, దోపిడులు, దాడులు, యుద్ధములు, విధ్వంసములు, తరచుగా జరుపుచుండినట్లు చరిత్రలో యెన్నో నిదర్శనములున్నవి.

1941లో రష్యాదేశపు 'కొజక్కులు' దాదాపు 3,000 మంది పిల్లపాపలతో ఒంటెలతో, చైనా తుర్కిస్తాన్ ద్వారా టిబెట్‌లోనికి ప్రవేశించి ఆమూల నుండి ఈ

మూలవరకు విధ్వంసకాండ జరిపి చేతికందినవన్నియును దోచుకొనిపోయిరి. వారు తురక మతస్థులు కావున, కైలాస మానస సరోవరముల చుట్టు ప్రక్కన గల బౌద్ధాశ్రమాలను, తీర్థపురి మున్నగు ప్రదేశములను కొల్లకొట్టి ఎన్నో పవిత్ర బౌద్ధ గ్రంథములను కాల్చివేసిరి. లక్షల రూపాయిల విలువ గల వస్త్రములను ధనమును దోచిరి. వారు గుర్రములను, గొఱ్ఱెలను అహారముగా స్వీకరించుచుండిరి. వారు 'రాక్షసతాల్' ప్రాంతములో విడిది చేసియున్నప్పుడు మువ్వురు యువకులు ఆకస్మాత్తుగా కొండలపై నుండి వీరిపై రాతి గుండ్ల వర్షము కురిపించగా, 80 మంది వరకు అశ్వికులును ఇరువురు నాయకులును హతులైనందున వెనుదిరిగి పలాయనము చిత్తగించిరి. అందువలన 'పురాంగ్' లోయ మాత్రము వీరి దోపిడికి గురికాలేదు. వారు లడక ప్రాంతము చేరువరకు వీరి ఆధీనములో 4,000 యాక్‌లు, (చమరీ ఆవులు, లేక జడల బర్రెలు) 2,000 పోనీలు 500 రైఫిళ్ళు, లక్షల విలువగల వెండి, బంగారు వజ్రవైఢూర్యములు లక్షల ధనము చేరియుండెనట. అప్పటి భారతాంగ్ల ప్రభుత్వము వీరిని నిరాయుధులుగా చేసిగాని లోనికి రానీయలేదు. వీరు నివసించుటకు నిజాంభూపాల్‌రాజులతో సంప్రదించి తుదకు వారిని కాశ్మీర్ దేశములోని హజారా జిల్లాలో స్థిరపరచిరి. ☝

✍ ఇట్లు టిబెటు బహు దోపిడీలకు గురియగుటచేక పురాతన బౌద్ధ గొంపాలన్నియు నశించి, నేటికిని ఆరాళ్ళు కుప్పలు కుప్పలుగా పడియుండుటయు వానిపై గల చక్కని శిల్ప కళ యుక్తముగా నేటికిని అనేకచోట్ల చూడవచ్చును. ఈ రాళ్ళపైన చక్కగా చెక్కిన 'ఓం మణిపద్మేహుం హ్రీ'యనే ప్రణవ మంత్రము గల రాళ్లు కోకొల్లలుగా అగపడును. 1962 తర్వాత టిబెటు పూర్తిగా చైనా స్వాధీనములోనికి పోయిన విషయము వేరే చెప్పనవసరములేదు. ✍

శ్లో॥ యక్ష స్వరూపాయ జటాధరాయ ।
పినాక హస్తాయ సనాతనాయ ।
దివ్యాయ దేవాయ దిగంబరాయ।
తస్మై యకారాయ న మశ్శివాయ.
పంచాక్షర మిదం పుణ్యం యః పఠే చ్ఛివసన్నిధౌ
శివలోక మవాప్నోతి శివేన సహ మోదతే.

(ఇతి శివపంచాక్షరీ స్తోత్రమ్.)



# పందొమ్మిదవ అధ్యాయం

## కైలాస మానస దర్శనము

శ్లో : ప్రభుం ప్రాణనాథం విభుం విశ్వనాథం ।
జగన్నాథనాథం సదానంద భాజం ॥
భవద్భవ్య భూతేశ్వరం భూతనాదం ।
శివం శంకరం శంభు మీశాన మీఢే ॥

శ్లో : గళే రుండమాలం తనౌ సర్పజాలం
మహాకాలకాలం గణేశాదిపాలం
జటాజూటగంగోత్తరంగై ర్విశాలం
శివం శంకరం శంభు మీశాన మీడే.

ఆ రోజు 31-7-83 ఉదయం రెండున్నర గంటలకే మమ్ములను లేపిరి. తోటివారందరును సామానులు సర్ది తయారైనారు. అప్పటికే ఫలహారము తయారుచేసి మమ్ములను పిలిచిరి. ఫలహారమును ముగించి సామానులు బస్సుపైకి అందచేయగా డ్రైవరు పైన పెట్టి త్రాళ్ళతో బిగించెను. సరిగా నాల్గుగంటలకు (ఆరున్నర బీజింగ్ టైం) బస్సు మా జై కైలాస్ అను నినాదములతో బయలుదేరెను. కీ.శే. రామకృష్ణన్‌గారి మరణ వార్తను పీకింగు ద్వారా ఢిల్లీకి పంపినట్లు తెలిపిరి. ఒప్పందము ప్రకారము కులకర్ణిగారు ధామోరు అచటనే యుండిపోయిరి. బస్సు చీకట్లో తక్లాకోట్‌ను దాటి "షిక్రా" యను ప్రదేశమును గడచి మరికొంత పైకి పోయెను. "రింగింగుఛూ" యనే నదిని దాటి మలుపు తిరిగి 'లాజెకోప్" యను చోటికి చేరువరకు ఆరుగంట లయ్యెను ఇంతలో బస్సు వెనుక టైరొకటి ఒక రాతి నొక్కుడువలన పంక్చరయ్యెను. అపుడపుడే తెల్లవారుచున్నందున మేమందరమును బస్సుదిగి హిమ శిఖరముల ఫోటోలు తీయుచుంటిమి. ఎటు చూచినను పర్వతాలు వాటిపై మంచు శిఖరములే. డ్రైవరు టైరును ఊడదీసి క్రొత్త ట్యూబును ఎక్కించి మరల టైరు బిగించి ఇంజను పంపుద్వారా గాలిని నింపుకొనువరకు దాదాపు 45 నిముషములు పట్టెను. ఆ ప్రదేశము 4,600 మీటర్ల ఎత్తున నున్నది. క్రింద భూమిపై ఎటు చూచినను గుండ్రని తెల్లని రాళ్ళు తప్ప మరేమియు లేదు. ఆ బస్సు పోవు మార్గమునకు రోడ్డు కూడ లేదు. అపుడో ఇపుడో కొన్ని మిలటరీ వాహనములు నడచుటచే గుర్తుగా ఒక నాటుదారి ఏర్పడినది. వేరే బస్సులు కాని ఆ ప్రాంతములో ఎచటను లేవు. పచ్చదనము ఎక్కడ వెదకినను కానరాలేదు. అక్కడక్కడ ఇండ్లు కన్పించెను. మట్టి గోడలపై వాసాలను నిలిపి వానిపై రెల్లు గడ్డి పొరకపరచి

మట్టిపూత పూసిరి. ఆ ఇండ్లకు పైన కిటికీలుండి క్రింద చిన్న ద్వారములుండుటచే అవి చలికి తట్టుకొనును. మాకు మధ్య మధ్య కొన్ని చిరు నదులు కన్పించెను మా బస్సు ఆ నదులను మామూలుగా రాళ్ళపై నుండియే దాటుచుండెను. వంతెనలు ఎచ్చటను అమర్చలేదు.

మేము ఇట్లే బస్సులో క్రమముగా ముందుకు సాగుచు ఎత్తు ప్రదేశమగు "బల్‌డక్" చేరితిమి. అచట మాకు ఇన్ని రోజులనుండి ఎదురుతెన్నులు చూచిన కైలాస పర్వత శిఖర ప్రథమ దర్శనము కాన్పించెను. అది చూడగనే శరీరము జలదరించి రోమాంచలమై తన్మయత్వము కలిగి కైలాసవాసుడు మదిలో సాక్షాత్కరింప నయనములు ఆనందభాష్పములతో నిండగా సర్వము మైమరచితిని.

ఉ : అంగజగర్వభంగ శరణాగతరంగ దయాంతరంగ సా
రంగధరా వృషాధిపతురంగ గిరీశ భుజంగ భూష ఉ
త్తుంగ మహోగ్రశూలధర ధూర్జటి శుభ్రమహోజ్వలాంగ స
న్మంగళ ప్రాణలింగ యమమర్దన మత్ గిరిజామనోహరా!

(గిరిజామనోహర శతకం)

మరియు

ఉ : శంకర భక్తమానసవ । శంకర దుష్టమదాసురేంద్రనా
శంకర పాండునీలరుచి । శంకర వర్ణనిభాంగ భోగిరా
ట్కంకణ పార్వతీహృదయ । కైరవకైరవమిత్ర యోగిహృ
త్పంకజపంక జాప్త జయ । తాండవఖేలన భక్తపాలనా.

(భాగవతము. దశ.)

మరియు

"ఓం నమో భగవతే రుద్రాయ"
వెంటనే మదిలో మెదలెను.
"మా నో మహాంత ముత మా నో అర్భకం
మా న ఉక్షంత ముత మా న ఉక్షితం ।
మా నో వధీః పితరం మోత మాతరం
ప్రియామానస్తన్వోః రుద్ర రీరిషః ॥" (యజుర్వేదము)

ఓ రుద్రా! దుఃఖ రూపములగు పాపఫలముల నొసగి ఏడ్పించు ఓ ఈశ్వరా! నీవు మా చిన్న పెద్దల బంధు వర్గముల ప్రియుల తల్లిదండ్రుల మున్నగువారిని నీ దండనకు పాత్రులు గాకుండునట్టి ఉపాయము చూపి ఆ మార్గమున మమ్ములను నడుపుము.

శ్లో॥ అసతో మా సద్గమయ తమసో మా జ్యోతి ర్గమయ।
మృత్యో ర్మాఽమృతం గమయేతి॥ (శతపధ - 30)

ఓ పరమగురువా పరమాత్మా నీవు మమ్ము దుర్మార్గముల నుండి సన్మార్గములకు అవిద్యాంధకారమునుండి విద్యాతేజస్సునకు మృత్యురోగబాధల నుండి మోక్షామృత మార్గమునకు చేర్చి కరుణింపుము. ఈ నా ప్రార్ధనను సగుణముగను నిర్గుణముగను భావించుము.

యజ్జాగ్రతో దూర ముదైతి దైవం తదు సుప్తస్య తథై వేతి ।
దూరంగమం జ్యోతిషాం జ్యోతి రేకం తన్మే మనః శివసంకల్ప మస్తు॥
(యజుర్వేదము)

ఓ దయానిధీ ! నీ కృపచేత నా మనస్సు జాగ్రదవస్థలోను కడుదూరము ప్రసరించునట్లు దివ్యగుణములు కల్గియుండునట్లు దీవించుము. నిద్రాస్వప్నములయందు సుషుప్తి బొంది ప్రకాశించుచు శివసంకల్పము కోరునదిగా యుండి సకల కల్యాణముల కోరునట్లుగా ఆశీర్వదింపుము.

యేన కర్మాణ్యపసో మనీషిణో యజ్ఞే కృణ్వంతి విదధేషు ధీరాః ।
యదపూర్వం యక్ష మంతః ప్రజానాం తన్మే మనః శివ సంకల్ప మస్తు॥
(యజుర్వేదము)

ఓ సర్వాంతర్యామీ ! కర్మ ధర్మ యుక్త విద్వాంసులందు యజ్ఞ యుద్ధ యాత్రల యందు అపూర్వ సామర్ధ్యముగ పూజనీయమై యుండు నామనసు సదా ధర్మేచ్ఛయందుండునట్లు చేయుదువు గాక!

సుషారథి రశ్వానివ యన్మనుష్యా న్నేనీయతేఽభీశుభి ర్వాజిన ఇవ ।
హృత్ప్రతిష్ఠం యదజిరం యవిష్ఠం తన్మే మనః శివ సంకల్ప మస్తు॥
(యజుర్వేదము)

☝ ఓ సర్వ నియంతవగు పరమేశ్వరా! కైలాస వాసా! దయానిధే నా మనస్సు అత్యంత వేగముతో ఇటూ అటూ పోకుండ గుర్రములకు సారధి లాగా సర్వేంద్రియములను అధర్మపధము నుండి నిరోధించి ధర్మ పధము నందే సదా నడిపింప కృప చేయుము.

☝ ఇట్టి భావనలు నాలో ఆ కైలాస శిఖర ప్రధమ దర్శన సమయమున కలుగుచుండగా మా బస్సు ఎత్తు పల్లముల కదలికలవల్ల యధా స్మృతికి వచ్చితిని.

**టిబెటు స్వర్గ భూమి**

ఆ కైలాస మానస సరోవరములు ప్రస్తుతము చైనా ఆధీనములోని టిబెటు రాష్ట్రమున యున్నట్లు తెలిసి కొంటిమి. ఆ టిబెటు పూర్వము స్వర్గ భూమిగా దేవభూమిగా పురాణ ప్రాశస్త్యము గలిగి యున్నది. టిబెటు రాష్ట్రము పచ్చదనము లేని పంటలు ఫలించని మోడు పోయిన బీడు భూమియనియు ప్రజలు చాలా బీదతనములోను దీనత్వములోను ఉన్నట్లుగా తెలిసి కొంటిమి. వీరు శ్రమ జీవులు. పొయ్యిలోనికి కావలసిన పచ్చి పుల్లలు సైతము ఎంతో శ్రమపడి చాల దూరము నుండి తెచ్చు కొనవలసి యుండును. అయినను అచటి దృశ్య సందర్శన భాగ్యముచే వారు మరుక్షణములో వారి వారి దుఃఖములను బాధలను మరచిపోవుచుందురు. ఆ టిబెట్టు శీతలమైన, ప్రశాంతమైన, ఏకాగ్రత కలిగించు హిమాలయ పంక్తుల, వరుసలు, గల సమున్నత పీఠభూమి. హిమజలములు పెద్ద చిన్న మంచు కొండలపై నుండి జారి ప్రవహించుచు బంగారు వెండి ఛాయలతో తళతళ మెరయుచు చూపరులకు అపారమగు దైవత్వ వివేకము కల్గించుచుండును. అచటి సంపూర్ణ ప్రశాంత దృశ్యములవలన మనస్సునకు ప్రశాంతత కలుగుచుండును. యాత్రికులకు రోమాంచలముతో ఒక విధమగు దివ్యానందానుభూతి కలుగును. అందుకే కాబోలు పురాణ గ్రంథములలో ఈ టిబెటును ''త్రివిష్టపభూమి'' లేక ''దేవతల భూమి'' యని పేర్కొని యున్నారు. అమరకోశ నిఘంటుకారుడు స్వర్గమును గూర్చి ఈ విధముగా వర్ణించెను.

శ్లో. స్వర్ అవ్యయం స్వర్గనాక త్రిదివ త్రిదశాలయా ః।
సురలోకో ద్యోదివౌ ద్వే స్త్రియాం క్లీబేత్రివిష్టపమ్.

అనగా స్వర్‌లోకము స్వర్గము త్రిదివము త్రిదశాలయము సురలోకము త్రివిష్టపము, మున్నగు, నవన్నియు స్వర్గమని యనబడును.

☝ కొందరు వేదాంతులు టిబెట్ పదమునకు అర్థము దేవతలను గూర్చి అవిశ్వాసముగా చెప్పెదరు. అంటే ఆ ప్రాంతమున పరస్త్రీలను పరులధనములను కొల్లగొట్టు రాక్షసులును, లైంగిక, విశృంఖలత్వము, కల్గిన యక్షులు సంచరించెదరని వారి యభిప్రాయము అయి ఉండవచ్చును. కాని స్వామి తపోవన్‌జీ మహరాజుగారి వ్యక్తిగత అనుభవానుసారము టిబెటులోని, కైలాస ప్రాంతము, మానవుని మానస వికాసమునకు అద్భుతమును, దివ్యమైన ప్రశాంతత కల్గించెడిదియు, ప్రాపంచిక చింతలను బాపెడిదనియు, భూతలస్వర్గమేకాని అన్యము కాదని నుడివిరి. ☝

దీని గురించి భారతములోని భీష్మ పర్వములో (ప. ఖ.)

సీ॥ నిడువున దూర్పున బడమర నై రెండు
కడలు నంభోనిధి గదిసియుండు
రత్నమయంబులు రమణీయములు సాధ్య
సిద్ధ చారణ గణసేవితములు
నై హిమాచలమును నావల హేమకూ
టంబును నట నిషదంబు నొప్పు
అలితంబులైన నీల శ్వేత శృంగవం
తంబులు క్రమమున దనరి పొలుచు

ఆ॥ నివుల మూటి కవల నవుల యమ్మూటికి
నివల దేజరిల్లు దివిజ నగము
కమల కర్ణికానుకారియై కాంచన
మణిమయత్వ మహిమ మహిత మగుచు.

శ్రీ అద్భుత మహిమలుగల ఈ హిమాలయ పర్వతములు మన దేశమునకు తూర్పు పడమరలుగా విస్తరిల్లినవై రెండు చివరలను కడలిని (సముద్రమును) తాకుచు మణిమయములై సిద్ధచారణులుమున్నగు దేవతాగణములచే సేవితములైన సానువులతో (Mountain slope small plains) తళతళ మెరయుచుండును. ఆ పర్వత శ్రేణి మూడు వరుసలుగా ఆవల హేమకూటమును ఈవల నిషధమును కడు మనోహరములైన నీల శ్వేత వర్ణములచే శోభిల్లు నట్టి శృంగములతో విరాజిల్లుచుండును. ఆమూడు పర్వతశ్రేణులకును ఆవలగా నెలకొన్న దివిజగిరి (కైలాసము) పద్మములోనుండు కర్ణికవలె కాంచనమణి మయమైన శోభతో చెన్నొడుచుండును.

భూమధ్యన నున్న నమ్మేరు మహీధరము దేవతలు దేవమునులు గంధర్వ కింపురుషాది దేవయోనులును దేవేంద్రప్రముఖ దిక్పతులును బరమేష్ఠియు ఆయా ప్రదేశంబులందు బుణ్య వర్తనముచే బరమ సుఖంబు లను భ వింతురు. వృత్తే తటంబున "గర్థికావనంబున (కొండ గోగులేక రేల) గౌరీ సమేతుండై సిద్ధగణంబుల బరివేష్ఠంప విశ్వేశ్వరుండు విహరించుచుండును. యని పై పద్యము వర్ణించుచున్నది బహుశ ఈ స్వర్ణ భూమియగు టిబెటు ప్రాంతము దీనికి సరిపోయి యుండును.

**టిబెట్టులో దొంగలు :**

పూర్వ కాలములో టిబెట్‌లో దోపిడీ దొంగలు తిరుగుచు దారులుకాచి వ్యాపారస్థుల, బాటసారుల నుండి ధనము ఆహార పదార్థములు దోచుకొనుట సర్వసాధారణము. వారు సన్యాసులను సాధువులను కూడ వదలక వారి సామానులను తస్కరించుచుండెడివారట. కాని సాధుపురుషుల వద్ద వీరికి లభించునదేమి? స్వామి

'తపోవన్‌జీ' గారి కైలాస యాత్ర సందర్భములో పై విధముగా వారిని దారి దొంగలు పరీక్షించిరి. కాని వారి వద్ద ఏమియును లభించనందున ఆ దొంగలే స్వామిజీకి తినుబండారము లిచ్చి తినిపించిరి. దోపిడి దొంగలకు కూడ ఆ కాలములో మునుల సన్యాసుల లామాలపై గౌరవ మర్యాదలతోపాటు పాపభీతియున్నట్లుగా ఈ సందర్భము ననుసరించి బోధ పడగలదు. ఎలాగైనను టిబెట్ పరిసర ప్రాంతములన్నియును నేడు కూడ ఎంతగానో వెనుక బాటుదనానికి, దారిద్ర్యానికి, అజ్ఞానానికి, నిలయమైయున్నది. రవాణాలు రోడ్లు సరిగాలేనందున దారిదొంగల బెడదలు తరచు ఎదురౌతుంటవి. అందువల్ల టిబెట్ చిరకాలముగా ఒక దుర్గమ ప్రాంతముగా యేకాకి తనానికి గురియై యున్నట్లు తెలియును.

మరికొంత దూరము ప్రయాణించుసరికి ఆ కైలాస శిఖరము మాయమయ్యెను. అయినను నాలోని ఆనందాతిశయములు స్మృతిపథములో తిరుగుచుండెను. ఇట్లు మూడు కిలోమీటర్లు ముందుకు పోవుసరికి ''లాప్చే'' అను ఎత్తు ప్రదేశమునుండి కైలాస శిఖరము పునః దర్శనమాయెను. మరికొంత దూరము సాగగా ''గుర్లాఛూ'' అను నదిని దాటి ''గుర్లాపుక్'' అను ప్రదేశమును చేరితిమి. అచ్చట కొన్ని ప్రాచీన గుహలున్నట్లు తెలిసినవి. ఆచటనే గణేశ జననము జరిగినట్లుగా టిబెట్టు దేశస్థులు చెప్పుదురు. మరి యారు కిలోమీటర్లు దూరము ప్రయాణించగా 4,800 మీటర్ల ఎత్తైన ''గుర్లాపాస్'' వచ్చెను. అది గుండ్రని రాళ్ళతో నిండియుండెను. నాటి మా బస్సు ప్రయాణము, ఘాట్‌రోడ్లలాగ, పర్వతములెక్కుననిని, తలచినచో పొరపాటే! మన ప్రాంతమున ఇటువంటిదారులు అరుదైనను, రెండువైపుల దిబ్బలుండి ఎటవాలుగా బస్సులు కొద్ది కొద్దిగా పైకెక్కుట, అచ్చటచ్చట, మన ప్రాంతమున కూడ అగుపడును. అట్లే ఆ పర్వతములు కూడ రాళ్ళ దిబ్బలుగానే యుండెను. మధ్యనుండి చిన్న చిన్న పలుగు రాళ్ళపై మా బస్సు ప్రయాణము సాగుచుండెను. ఇంకొక నాల్గు కిలోమీటర్లు ముందుకుపోగా ''ఛాంగ్‌ఛూ'' అనబడే నది కుడిప్రక్కగల మాంధాతా'' మంచుకొండలపైనుండి దుముకుచు ఎడమ దిశగా ప్రవహించు ుండెను.

## మాంధాత చరిత్ర (భాగవతమునుండి)

యువనాశ్వ మహారాజు మహాయజ్ఞము చేయుచు ఒకనాటి రాత్రి యజ్ఞభూమిలో సంచరించుచుండగా ఆయనకు దాహము వేసినది. కాని అచట మంచి నీరు లభించలేదు. ఋషులందరును నిదురలో మునిగియుండిరి. అంత యువనాశ్వుడు యజ్ఞవేదిక సమీపమునగల నొక కలశములోని నీరు గ్రోలెను. ఆ జలము సంతానసిద్ధి నిచ్చు ప్రభావమును కలిగియున్నందున యువనాశ్వుని కుడి

తొడభాగమునుండి ఒక శిశువుద్భవించెను. పుట్టగనే ఆ శిశువు పాల కొరకై ఏడ్వగా అచటనే గల ఇంద్రుడు 'మాంధాత' యనుచు తన చూపుడు వ్రేలును పిల్లవాని నోట నుంచెను. అందుచే ఆ బాలకుడు 'మాంధాత' యను నామము బడసెను. ఆ యుగమున 'మాంధాత' గొప్ప చక్రవర్తిగా ఇక్ష్వాకు వంశమున కీర్తి గాంచెను.

ఈయనకు ఇందుమతివలన కురుకుత్సుడు, అంబరీషుడు, ముచికుందుడు యను ముగ్గురు కుమారులును ఏబదిమంది పుత్రికలును కలిగిరి. 'సౌరభి' యను మహాముని నీటిలో జపము చేయుచు చేప రూపములో నీదుచున్న మాంధాత పుత్రికను చూచెను. ఆమెను తన కిచ్చి పెండ్లి చేయుమని మాంధాత నర్థించెను. మాంధాత కన్యలకు స్వయంవరమే ఉచిత విధానమని సమాధానమిచ్చెను. అంత సౌరభి తన యోగశక్తిచే అతి సుందరుడుగా మారి మాంధాత యాభై మంది పుత్రికలను కూడ వివాహమాడెను. అతడు బహునాళ్ళు వారితో సంసారము నెరపి తుదకు భార్యలతోసహా మోక్షమును పొందెను. యవనాశ్వుడు తన రెండవ కుమారుడగు అంబరీషునికి రాజ్య పట్టాభిషేకము గావించెను. ప్రఖ్యాతుడైన అంబరీష మహారాజు చరిత్ర మన కందరకు తెలిసిన విషయమే! ఈయన యేకాదశీవ్రతమాచరించి విష్ణువునుండి సుదర్శన చక్రమును వరముగా పొందెను.

ముచికుందుడు మహాయోగిగా ప్రసిద్ధి గాంచెను. 'గర్గ' మహర్షిని ఆశ్రయించి యోగము నభ్యసించెను. యోగియైన ముచికుందుడు చాలకాలము యోగనిద్రలో మునిగియుండెను. ద్వాపరయుగమున కృష్ణావతార సందర్భమున కృష్ణుడు 'కాలయవను'ని సంహరించు సందర్భమున ముచికుందునకు దర్శనమిచ్చెను. ముచికుందుడు పూర్వయుగ పురుషుడు. ద్వాపరములో సృష్టిలోని జీవుల పరిమాణము తగ్గియున్నట్లు కనుగొని ఆశ్చర్యమొందినట్లు భాగవతమున చెప్పబడినది. పూర్వయుగపురుషులు, పిదపటి యుగములలోకూడ ప్రవేశించుట మన పురాణ సాహితీ సాంప్రదాయాలలో కాననగును.

శ్రీకృష్ణునితో యుద్ధము చేయుటకు అజేయుడైన ''కాలయవనుడు'' సంకల్పించగా శ్రీకృష్ణుడు పారిపోయెను. కాలనేమి ఆయనను వెంబడించి చాల దూరము పరుగెత్తిన పిదప శ్రీకృష్ణుడొక పర్వత గుహలో దూరి అదృశ్యుడయ్యెను. కాలయవనుడు ఆ గుహలో ప్రవేశించెను.

ఆ గుహలో యోగనిద్రలో మునిగియున్న ముచికుందుని జూచి శ్రీకృష్ణుడని భావించి తన్ని లేపెను. ముచికుందుడు కళ్ళు తెరచి కాలనేమి వైపు చూడగా అతని క్రోధాగ్నికి కాలనేమి భస్మమైపోయి నేలకూలెను.

పిదప శ్రీకృష్ణుడు ముచికుందునకు దర్శనమిచ్చి రాగల జన్మలో నీవు బ్రాహ్మణ జన్మ నెత్తి మోక్షము పొందగలవని వరమిచ్చి మధురకు వెడలిపోయెను.

కృష్ణుని ఆదేశానుసారము ముచికుందుడు బదరికాశ్రమములో తపమాచరించుటకు వెడలిపోయెను.

ఇంతలో మా బస్సులోని కొందరు అదుగో మానస సరోవర్ అని కేకలు వేసిరి. అది ''రాక్షసతాళ్'' అని ''షీ'' చెప్పెను. ''షీ'' మరియు చైనా మేనేజరు ఇర్వురును మా బస్సులోనే ప్రయాణించుచుండిరి. మరికొంతదూరాన ''లాంగ్‌ఛూ'' అను నదిని గూడ దాటితిమి. ఆ నదులన్నియు మాకు ఎడమ వైపున గల ''రాక్షస తాళ్'' అను పెద్ద సరస్సులో కలియుచుండెను. అచట మా బస్సు నాపి మమ్ములను ''రాక్షస తాళ్'' చూచుటకొరకు దింపిరి. మేము ఆ విశాలమైన దాదాపు వంద చదరపు కిలోమీటర్ల వెడల్పాటి నీలి నీటి సరస్సును, దాని అలలను, దానికి పూర్తి వెనుక ఉత్తరానగల ఎత్తైన కైలాస శిఖరమును, దక్షిణమున సమీపములోనే కన్పించు మాంధాత హిమ శిఖరములను చూచి ఆనందించి ఫోటోలు తీసుకొని పదిహేను నిమిషాలలో మరల బస్సు చెంతకు చేరగలిగితిమి.

నాలుగైదు కిలోమీటర్లు ఈ ''రాక్షస తాళ్'' గట్టు వెంబడే ప్రయాణించి మా బస్సు ఒక మైదానము గుండా కుడికి తిరిగి మరొక ఐదు కిలోమీటర్లు ముందుకు పోగానే సువిశాల మానస సరోవర దర్శనమై చూచినంత లోపుననే మా గమ్యమును చేరితిమి. మేము బస్సు దిగగానే ముందుగా సరోవరము చెంతకు పోయి నీలివర్ణములో గల స్వచ్ఛమైన నీటిని త్రాగి శిరస్సున జల్లుకొంటిమి. నేడు బాగుగా చలి యుండుటచే సరస్సు అలలు సముద్ర తరంగములవలె నుండెను. ఆ కైలాస మానస సరోవర పరిక్రమ చేయువారు గత రాత్రి రెండు దళములుగా విభజింపబడిరి. ఎందుకనగా మా మొత్తం మందికి ఉనికి వసతిగాని పాత్రల వసతిగాని ప్రక్కల వసతిగాని ఒకేచోట సరిపోకుండెను. రెండు క్యాంపులలో పదిహేను మందికి సరిపడు సౌకర్యములు మాత్రమే యుండెను. పైగా అందరి సామానులు మోయుటకు తగినన్ని గుర్రములుగాని యాకులుగాని లేకుండెను. గత రాత్రి చాలమంది ముందు కైలాస పరిక్రమ జరుపుటకు ఎంచుకొనిరి. ఎందుకనగా మానస సరోవర పరిక్రమలో అలసిపోయినచో కైలాస పరిక్రమ చేయలేమేమో యను భయమువలన వారు ఎక్కువ ప్రాముఖ్యతను కైలాస పరిక్రమ కిచ్చిరి. నేనును మరికొందరు తప్పనిసరిగా రెండు పరిక్రమలును చేయవలెనను తలంపుచే ముందుగా ఏదైనను ఒకటేయని మానస సరోవర పరిక్రమకు అంగీకరించితిమి.

కైలాస పరిక్రమ దళము వారు నేడు మానస సరోవరములో స్నానములు చేసి కైలాస క్యాంపుకు బయలుదేరుదమని నిన్నటి రాత్రి ప్రగల్భాలు పలికి యుండిరి. కాని చల్లని నీరు ఆ తరంగములు ఆ ఝంఝామారుతమును చూడగానే వారి

ఊహలు తలక్రిందులై ఎవ్వరును స్నానము చేయసాహసించలేదు. మా లీడరు 'గోడ్బోలే మరియు బందోపాధ్యాయ మానససరోవర బృందములో నున్నను పరిక్రమ (ప్రదక్షిణ) చేయజాలమనుటచే అచట గల ''బేస్'' క్యాంపు 'చెడ్డి' లో ఆగిపోయిరి. మిగతా వారందరము బస్సెక్కితిమి. అయిదు కిలోమీటర్లు ఎగుడుదిగుడుగా ప్రయాణము చేసి ఒక వెడల్పాటి ''గంగాఛు'' అను నదిని దాటితిమి. అది మానస సరోవరము నుండి ఊటగా వచ్చునొక నదీ జల ప్రవాహము. అది ముందుకు ప్రవహించి రాక్షసతాళ్‌లో కలియును. మరల మా బస్సు కొంత ఎత్తు ప్రదేశమునకు ఎక్కిన పిదప ఒక విశాల మైదానము గుండా ప్రయాణించెను. ఎదురుగా కైలాస పర్వతముల పంక్తులు కనుపించెను. మధ్యలో ''డామ్‌ఛూ'' నదిని ఇతర పెద్ద నదులను దాటుచు మా బస్సు ముందుకు సాగిపోవుచుండెను. ఆ మైదానములో మాకు చాల గొర్రెల మందలు అగుపించెను. మధ్యలో ఒక చిన్న గ్రామము ''పార్యా'' యున్నది నాల్గైదు ఇండ్లు మాత్రమే గల్గినది అగుపడెను. అచట ఒక చైనా యధికారి వచ్చి పోవు వాహనములను పరీక్షించును. అచట బస్సు ఆపి డ్రైవరు లోనికి వెళ్ళి వచ్చి మరల ముందుకు సాగెను. ఇట్లే 25 కి.మీ. దూరము ప్రయాణము చేసిన తర్వాత మేము ''ధార్చెన్'' అనబడు కైలాస్ బేస్ క్యాంపు జేరితిమి.

అది పదిలేక పదిహేను ఇండ్లు గల చిన్న గ్రామము. అందు యాభై మంది వరకు జనులుండవచ్చును. గ్రామము 4910 మీ. ఎత్తున నున్నది. అచట కైలాస పరిక్రమ జరుపు మిత్రులందరు దిగిరి. ఈ నివాస స్థానము ఒక ఇల్లు అందు ఆరుగదులున్నవి. ఒక గది ప్రత్యేకముగా వంట కొరకున్నది. ఒక్కొక్క గదిలో మూడు చెక్క బల్లలు అరడుగు ఎత్తైనవి. వానిపై పరుపులు దిండ్లు కప్పుకొనుటకు గూడ ఒక్కొక్క పరుపు వేయబడి యుండెను. మాలో తొమ్మిది మంది సహచరులు సామానుతో దిగగానే మేము వారితో సెలవు తీసుకొని మరల బస్సెక్కితిమి. ఆ క్యాంపులో ఒక ''దోర్జి'' యనబడునతడు టిబెటు చైనా ఇంగ్లీషు హిందీ భాషలు తెలిసిన వ్యక్తి యుండెను. మా మానస సరోవర్ బ్యాచ్‌లో నేను చొక్కారావు గారు కిశోర్ దుష్యంత్, యోగేష్, దిలీప్ చౌదరి కలిసి మొత్తం ఏడుగురిలో ఐదుగురు నవయువకులు. మా బస్సు కొంతదూరము వచ్చిన దారిలోనే ప్రయాణించినది. పిదప దారిమారి మానస సరోవరమునకు కాక వేరొక ప్రక్కగా బోవుచుండెను. మధ్యలో చాలా చిన్న, పెద్ద నదులు కొన్ని ఎదురయ్యెను. ఒక్కొక్కచోట నదులలో నీరు బస్సు టైర్లు మునుగునంత లోతున్నను డ్రైవరు చాళ చాకచక్యమున బస్సును దాటించుచుండెను. ఇర్వురు చైనీయులు బస్సులో మాతోనే యుండిరి. ఇట్లే దాదాపు ఇరవై కిలోమీటర్లు ప్రయాణము చేసి ''హీర్'' యనే చిన్న గ్రామము చేరితిమి. అచట ఒక పురాతనమైన ఇంటిలో ''దార్చెన్''లో లాగానే వసతులుండెను. మేము బస్సు దిగి సామానులు గదులలో సర్దుకొంటిమి. ''షీ'' అచట గల ఒక యువతితో

మాకు కావలసిన యేర్పాట్లు చూడమని తెల్లవారి, మాకువలయు గుర్రముల గురించి ఏదేదో చెప్పి మాకు ఏమియును ఇబ్బందులు వుండవని చెప్పి, ఆ విధముగా బస్సులో చైనీయులు వెళ్ళిపోయిురి. కాని చోటుగాని చోటు, మాట భాష తెలియని ఆ అజ్ఞాన స్త్రీ వైఖరిని చూచి మాకు భయము వేసెను.

మూర్ఖ స్త్రీ స్వభావమును గురించి భగవద్గీతలో నొక వాక్యము కలదు! ఈ సంసారమున కారణము లేక ఏ కార్యమును పుట్టదు. స్త్రీ సర్వసాధారణముగా తామసీ శక్తి ప్రాధాన్యము కలది. అందుచే వారికి మాయ, మూర్ఖత్వము, లౌభ్యము, సాహసము, అనృతము, అశుచి, మున్నగు దోషములు స్వాభావికములట. ఇట్టి లక్షణములు గల స్త్రీకి వశుడైన భర్త దొరికిన యెడల అతడు భర్తకాక బానిసయగునేమో!

మరియు విద్యావిహీనులగు స్త్రీలకు పాతివ్రత్యమునకు గల కుటుంబ అర్హతా నర్హతలు తెలియవు. భారతములోని అనుశాసనికపర్వములో - స్త్రీ ప్రాతివ్రత్య రహిత వర్తనను గురించి పార్వతి శివునకు ఈ విధముగా తెలియజేసెను. - 5 ఆప. 299

సీ॥ పరమేశ యాసురి పైశాచి రాక్షసి,
యను పేళ్ళు కల వధర్మాంగనలకు,
వ్యభిచారతత్పరత్వంబు వారికి నెల్ల
గల దాసురాంగన క్రౌర్య నిరత
తన యిచ్చ బొలియించు ధనధాన్యములు చపల
హృదయ భోగపరాత్మ యీర్ష్య కలదు
పైశాచి క్రోధన భర్తృ పుత్రులయందు
ని ః స్నేహ గృహకార్యనిపుణ కాదు

తే॥ కలహశీల రాక్షసి సయికంబు లేదు
బొంకు పల్కు నెప్పుడు నిద్రబోవు వీత
లజ్జ యిందరు నాధుకులంబువారి
దురిత మొందించి పోదురు నరకమునకు.

ఈవిధంగా నాకు ఆ అనాగరిక స్త్రీ స్వభావ విషయము జ్ఞప్తికి వచ్చెను.

మేము అచటికి చేరిన బస్సు ప్రయాణము వలన మేము చేయబోవు మానస సరోవర పరిక్రమలో దాదాపు ఇరవై ఐదు కిలోమీటర్లు వరకు రాళ్లపైన నడక తగ్గినది. మా లీడరు ఆగిన ''చెడ్డి'' క్యాంపు ఉత్తర పడమరలోను కైలాష్ ఉత్తరములోను మేము ఉత్తర తూర్పులోను యుంటిమి.

మేము ఉదయం నుండియు బస్సులో ప్రయాణించుటచే బాగుగా అలసి శరీరమంతా నొప్పులతోను ఆకలితోనున్నాము. ముందుగా కాఫీ త్రాగ సంకల్పించితిమి. భాష ఇక్కడ చాల గడ్డు సమస్యగా పరిణమించెను. సంజ్ఞలు చేసి ఆ పనిచేయు స్త్రీకి స్టౌ కావలెనని చెప్పితిమి. ఆ పిల్ల స్టౌ అంటించి పెట్టెను. బకెటులో నీరు తెచ్చిపెట్టెను. మేము ముందుగా కాఫీ కాచుకొని త్రాగితిమి తరువాత స్నానమునకు బయలుదేరితిమి. చొక్కారావుగారు మానససరోవరములోనే స్నానముచేయ సంకల్పించిరి. అది దాదాపు ఒక కిలోమీటరు దూరమున నుండెను. మరియు ఈవైపున గట్టు సరిగాలేకుండుటచే, నేను కిషోర్ మరియు దిలీప్ ప్రక్కగా ప్రవహించుచున్న హిమజల ప్రవాహములో స్నానము చేసితిమి. ఆ నీటి చల్లదనమునకు ఒడలంతయు గడ్డకట్టెను. బాగుగా ఎండకాయుచున్నందున నేను అచటనే కూర్చొని ఎండవేడిమిలో హాయిగా పూజ కూడ ముగించుకొని గదిలోనకు వచ్చి ఫలహారము చేసి పడుకొంటి ని. మాలోని యువకులు దిలీప్, కిషోర్‌లు వంటచేయ మొదలిడిరి. సామానులను బయటకితీసి పప్పు బియ్యము కలిపి కిచడి తయారుచేసిరి. ఇంతలో మిగతా మిత్రులుకూడ వచ్చి చేరిరి. చొక్కారావుగారు పూజలో నిమగ్నుడయ్యెను. తర్వాత దాదాపు ఆరు గంటలకు భోజనములు ముగించుకొంటిమి. నేటివరకు కట్టిపెట్టిన వంట సామాగ్రి తొలిసారిగా నాడే ఉపయోగపడగా మిగిలినవి మరల కట్టిపెట్టిరి. తరువాత విపరీతమైన చలిగాడ్పులవలన తలుపులను మూసివేసి పడుకొంటిమి.

నాడు తక్లాకోట్ నుండి కైలాస్ వరకు గలదారి ఎత్తు పల్లములతోను రాళ్ళతోను నిండియుండి మేము ఆయా ప్రక్కల గల పర్వతములలాంటి మట్టి దిబ్బలను దాటి ఒక విశాల మైదాన ప్రదేశమునజేరినందున ఈ కైలాసపర్వతమును ఇతర పర్వతములు హిమాలయాలలోనివి కావేమోయని తోచెను. కాని వాస్తవములో హిమాలయ పంక్తుల ''కైలాస్'' మరియు ''జస్కార్'' శ్రేణులకు చెందినవే కాని తదితరములు కావు. ఇట్లు తలచుచు నేను గాఢముగా నిద్రించితిని.

శ్లో. ముదా మాకరం మండనం మండయంతం
మహా మండలం భస్మ భూషాధరం తమ్
అనాదిం హ్యపారం మహా మోహమారం
శివం శంకరం శంభు మీశాన మీఢే.

శ్లో. వటాధోనివాసం మహాట్టాట్టహాసం
మహా పాపనాశం సదా సుప్రకాశం
గిరీశం గణేశం సురేశం మహేశం
శివం శంకరం శంభు మీశాన మీఢే.

## ఇరువదియవ అధ్యాయం

## మానస సరోవర మొదటి రోజు పరిక్రమ.

స్తో: గిరీంద్రాత్మజా సంగృహీతార్ధ దేహం ।
గిరౌ సంస్థితం సర్పహారం సురేశమ్ ।
పరబ్రహ్మ బ్రహ్మాదిభి ర్వంద్యమానం ।
శివం శంకరం శంభు మీశాన మీఢే.

ఆ రోజు ఆగష్టునెల మొదటి రోజు ఐదుగంటలకు లేచి కాఫీలు సేవించి ప్రయాణమునకు సిద్ధమైతిమి. సామానులు బయటపెట్టితిమి. ఆరుగంటలకు ఇర్వురు టిబెటు దేశీయులు ఆరు గుర్రములను తోడ్కొని వచ్చిరి. మూడు గుర్రములపై సామానులువేసిరి. మూడు గుర్రములు మేమెక్కుటకుగా నుండెను. ఒక టిబెటుదేశీయుడు తాను ఎక్కుటకు తన స్వంత నల్లటి నిగనిగలాడు గుర్రమును కూడ వెంట తెచ్చుకొనెను. మేము నడక మొదలు పెట్టితిమి. గుర్రాలు ముందుగా నడచుచుండెను. మా ఎడమప్రక్కగా ''గూర్లా'' ''మాంధాత'' యును కుడి ప్రక్కగా కైలాస శిఖరమును కనుపించుచుండెను. ఒక గంట ప్రయాణముచేయగా మానససరోవరము గట్టు దగ్గరయ్యెను. మధ్యలో ఒకటి రెండునదులు రాగా నలుగురము ఒక్కొక్కసారి ఒక్కొక్కరు చొప్పున వానిని దాటితిమి. దాదాపు పదిగంటల సమయము వరకు మానస సరోవరములోని నీరు నీలి వర్ణము గలదియై స్వచ్ఛముగా కాన్పించుచుండెను. ఆ తీరము వెంబడి గొర్రెల మందలు ''యాక్'' (జడల బర్రెలు)ల గుంపులు కనిపించెను. ఒక్కొక్కసారి సరోవర తరంగములు చాల బలముగాను మరొక్కసారి చాల నిశ్చలముగాను వచ్చుచుండగా చూచుచు అవి ఒడ్డునకు తగులు టట తటట శబ్దములను వింటూ ప్రశాంతముగా నిర్మల మనస్సులతో ఒక గంట ప్రయాణము సాగించితిమి. తర్వాత పదకొండు గంటలకు ఒక తెల్లని రాళ్ళ గట్టుపైన విశ్రమించితిమి. అందరము కూడ ఏమైనను సరే నేడు స్నానము చేయ సంకల్పించితిమి. సరోవరములోని నీరు చాల చల్లగా నుండెను. అయినను రెండు నిముషములు రెండు మూడు మునకలు వేయగల్గితిమి. నిన్నటి నది నీరు మేము నేడు దాటుచున్న నదుల నీరు మాత్రము మంచు ముద్దను పిండినట్లే యుండెను. ఆ నదులలో పదిసెకలనులకన్న ఎక్కువ ఉండలేము. ఉన్నచో చేతులు కాళ్ళు బిగిసికొనిపోవును. అందుకే ఈ ప్రదేశాల్లో ''నిప్పును చేతబట్టవచ్చును కాని నీటిని కారుతో పట్టుకొనవలె'' అను సామెత యేర్పడినది.

నేను ముందుగా సంధ్యావందన కార్యక్రమములను ముగించుకొంటిని. ఈ సందర్భమున సంధ్యా విధులను గూర్చి ''దేవీభాగవతము'' నుండి కొన్ని యంశములను పేర్కొనుట భావ్యమని తలచి వ్రాయుచుంటిని.

శ్లో. అపాం సమీపే నియతో నైత్యికం విధి మాస్థిత : ।
సావిత్రీ మప్యధీయాత గత్వాఽరణ్యం సమాహిత : ॥

అడవియందు ఏకాంత ప్రదేశమున లేదా జల సమీపమున సావధానులై కూర్చుండి నిత్యకర్మల నొనర్చుచు సావిత్రి గాయత్రి మున్నగు మంత్రముల యధావిధి నుచ్చరించుచు దాని యర్థమును గుర్తెరిగి దాని ననుసరించి నడువవలయును. ఈజపతపాదులు మనస్సుచే చేయుట యుక్తమని పైశ్లోకభావము. ఈ సంధ్యా వందనాది కార్యక్రమములు ఉదయము, మధ్యాహ్నము, సాయంత్రము మూడు మార్లు చేయవలయునని కూడ చెప్పబడినది.

## సావిత్రీ గాయత్రీ ప్రాశస్త్యము :

వేద జననియైన సావిత్రిని పూజించిన వారిలో బ్రహ్మ ప్రథముడు. ఆ తరువాత వేద గణములు వారి తర్వాత బుధ బృందములు సావిత్రినర్చించిరి. పూర్వము భరత ఖండమున న శ్వపతి యను రాజు సావిత్రిని పూజించెను. ఈ రాజు సంతానాపేక్షచే సావిత్రి నారాధించి తపము చేసెను. ఫలితము లేక ఆకాశవాణిచే గాయత్రి జపమాచరింపవలెనని కోరబడెను. ఆ సమయమున పరాశర మహర్షి యచట కేతెంచి యానృపుని యాశయము గ్రహించి గాయత్రి జప విధానమును దాని ప్రాశస్త్యమును దెలిపెను : ''ఒక్కసారి గాయత్రి జప ముచ్చరించిన ఆ దినమున చేసిన పాపములు హరించును. పదిమారులుచ్చరించిన దివారాత్రపాపహరము. శతవారము జపించినచో నొక మాసపాపములు హరించును. ఈ గాయత్రిని సహస్రము జపించిన సంవత్సర పాపములు, లక్షసార్లు జపించిన ఈ జన్మలోని పాపములు నశించును. పదిలక్షలు జపించిన పూర్వజన్మ పాపములు కూడా తొలగును. కోటిగాయత్రి జపమువల్ల సర్వజన్మల పాపములు హరించి జన్మరాహిత్యమగును. గాయత్రి మంత్రోపదేశముగాని వాడు, ఏ కర్మ చేయుటకు కూడ పనికిరాడు.'' యని రాజునకు గాయత్రిని త్రికాల సంధ్య నుపాసించుమని దానివలన సంతానవంతుడ వగుదువని పరాశర మహర్షి బోధించెను. గాయత్రిమంత్ర ముపదేశించెను. పైగా ఈ గాయత్రి మంత్రము జపించు వాని స్పర్శచేత తీర్థములు పావనమగును. అతని గాలిసోకిన ప్రదేశములనుండి పాపములు గాలివలె పారిపోవును. పితృతర్పణాదులు దేవ పూజావిధులు గాయత్రిమంత్రోపదేశముగాని ద్విజుడొనరించిన అవి అన్నియు

వ్యర్థములగును. మూల ప్రకృతి మంత్ర జప ధ్యానాదికములు విడచినవానిని, విష్ణు మంత్రమును ధ్యానించనివానిని, హరినామము అమ్ముకొనిన వానిని, సూర్యోదయమైనను నిదురించువానిని, శివపూజ చేయని వానిని, ఏ నియమములు పాటించని ద్విజుని, నిర్జన ప్రాంతమున, సర్పములను విడుచునట్లు సమస్త శుభములాతనిని వదలివేయును. ☝

**సావిత్రీ ధ్యాన విధము :**

శ్లో. తప్తకాంచన వర్ణభాం జ్వాలంతీం బ్రహ్మ తేజసా ।
గ్రీష్మ మధ్యాహ్న మార్తాండ సహస్ర సమిత ప్రభాం ॥
ఈషద్ధాస్య ప్రసన్నాస్యాం రత్నభూషణ భూషితాం ॥
వహ్ని శుద్ధాం శుకాధానాం భక్తానుగ్రహ విగ్రహాం ॥
సుఖదాం ముక్తిదాం శాంతాం కాంతాం చ జగతాం విదేః ।
సర్వ సంపత్య రూపాం చ ప్రదాత్రీం సర్వసంపదాం ॥
వేదాదిష్ఠాతృదేవీం చ వేదశాస్త్ర స్వరూపిణీం ।
వేద బీజ స్వరూపాంచ భజే తాం వేదమాతరం ॥

ఇటుల సావిత్రిని షోఢశోపచారమున పూజావిధి నిర్వర్తించి ధ్యానించి తీర్థప్రసాదములు గ్రహించవలయునని తెలుపబడినది.

**గాయత్రీ ఉపాసనావిధులు :**

☝ గాయత్రీ యందు నియమబద్ధమైన 24 వర్ణములు ఓంకారముతో కలిసి 25 యై పంచవింశతి తత్వములగుచున్నవి. తత్వార్థ వర్ణములకు ఋషి ఛందము దేవత మున్నగు వివరణలు నారాయణుడు నారదునకు తెలియజేసెను.

ఏ యనుష్ఠానములు జపతపములు నిర్వర్తించకున్నను గాయత్రీయుపాసన పరుడైనచో నాతడు సర్వ విధులు నిర్వర్తించువాడే యగును. త్రికాల సంధ్యావందనము లాచరించి అర్ఘ్యమిచ్చి మూడు వేలు గాయత్రి నిత్య జపము గావించినవాడు దేవతలకే పూజ్యుడగునట. స్నానాదికములు చేయకున్నను లోపము లేదు. ☝ గాయత్రీ వర్ణనలేమన-

శ్లో. వాసుదేవో త్రిర్వసిష్ట శ్శుక్ర ః కణ్వ ః పరాశర ః ।
విశ్వామిత్రో మహా తేజా ః కపిల ః శౌనకో మహాన్ ॥

ఈ మొదలగు ఇరువది నలుగురు ఋషులును -

శ్లో. ''గాయ త్ర్యుష్ణి గనుష్టుప్చ బృహతీ పంక్తి రేవ చ ।
త్రిష్టుప్చ జగతీ చైవ తధాతిజగతీ మతా ॥''

ఇత్యాది ఇరువది నాల్గు ఛందములును

శ్లో. ''ఆగ్నేయం ప్రథమం ప్రోక్తం ప్రజాపత్యం ద్వితీయకం ।
తృతీయం చ సదా సౌమ్య మీశానం చ చతుర్థకమ్ ॥
సావిత్రం పంచమం ప్రోక్తం షష్ఠ మాదిత్య దైవతం ।

ఇట్లు ఇరువది నలుగురు శక్తులును నియమితులైరి.

ఆ వర్ణములకు శాస్త్ర సిద్ధతత్వములు :

శ్లో. ''పృధి వ్యాప స్తధా తేజో వాయు రాకాశ ఏవచ ॥
గంధో రసశ్చ రూపం చ శబ్ద ః స్పర్శ స్తథైవ చ।
ఉపస్థం పాయుపాదం చ పాణీ వాగపిక్రమాత్ ॥

ముద్రాకములు ః

శ్లో. సుముఖం సంపుటం చైవ చతు ః పంచ ముఖం తథా !
శకటం యమపాశం చ గ్రధితం సంమ్ముఖోన్ముఖమ్
ఇతి ముద్రా న జానాతి గాయత్రీ నిష్ఫలా భవేత్ ।

ప్రస్తుత కాలములో ముద్రలను తెలుసుకొనుట పాటించుట తగ్గిపోవుచున్నది.

## గాయత్రీ కవచము :

☝గాయత్రీ దేవతాకవచమును పఠించినంత మాత్రమున నరుడు సర్వపాప విముక్తుడగును. గాయత్రీ కవచమునకు ఋషులు అజరుద్రులు, హరియు, వేదత్రయము ఛందో రూపమున నున్నవి. బీజము దాని వర్ణము. శక్తి భర్గుడు, ధియ ః పదకీలకము. కాన వినియోజనము మోక్షమునకు. ఇరువదినాల్గు వర్ణములలో నాల్గు వర్ణములు, హృదయమున మూడక్షరములు శిరస్సున, శిఖయందు నాలుగు, వెనుక భాగమున మూడు, నేత్రములందు నాలుగు, మిగిలినవి దేహమందు న్యసించవలెను. విద్యుక్తముగా ధ్యానించి తనకుముందు గాయత్రీ, దక్షిణమున సావిత్రి, వెనుక బ్రహ్మసంధ్య, ఉత్తరమున సరస్వతి యను పది దిక్కుల పదినామములచే రక్షనిడవలెను. ☝

శ్లో. తత్పదం పాతు మే పాదౌ జంఘే మే సవితు ః పదం ।
వరేణ్యం కటిదేశే తు నాభిం భర్గ స్తథైవ చ ॥
తత్పదం పాతు మూర్థానం సకార ః పాతు ఫాలకం ।
చక్షుషీ తు వికారార్ణో తుకారస్తు కపోలయో ః
నాసాపుటం వకారార్ణో రకారస్తు ముఖే తథా ।

☝ ఇట్లు 24 అక్షరములు న్యసించబడినవి దీనివల్ల బాధాశతములు దూరమగును. మోక్షదాయకము. విద్యాప్రదము. పరంబ్రహ్మపదము చేర్చును.

రహస్యాతిరహస్యమైన దేవీ విరాడ్రూపమందు సువిలసితము వేదమాత గాయత్రి. గాయత్రీ హృదయమునకు నారాయణుండే ఋషి. గాయత్రి ఛందము పరమేశ్వరి దేవత - దివ్యత్వమును సాధించుటకే కాంత ప్రదేశమున ఏకాగ్రతగా పరమేశ్వరిని ధ్యానించి ఉపాసించవలెను. ఆయా అర్థము లెట్లన ఊర్ధ్వమున - ద్యైవము దివి దంత పంక్తి నశ్వినీ దేవతలు పెదవులందుభయ సంధ్యలు, ముఖమున నగ్ని, జిహ్వ యందు సరస్వతి, కంఠమున బృహస్పతి, స్తనములందష్ట వసువులు, బాహువులయందు 49 మరుద్గణము, హృదయమున పర్జన్యుడు ఉదరమున నాకాశము నాభి యంతరిక్షము, కటి దేశమున బడబానలము, జఘనమున విజ్ఞాన ప్రజాపతి, ఊరువులయందు కైలాసము, జానువులందు విశ్వ దేవతలు, జంఘలయందు కౌశికుడు, గుహ్యమున ఆయనద్వయము, ఊరువులయందు పితృదేవతలు, పాదములందు పృధ్వి, అంగుళములయందు వనస్పతి, రోమకూపములందు ఋషులు, నఖములయందు కాలస్వరూప ముహూర్తములు, యెముకలయందు గ్రహములు, రక్తమాంసముల యందు ఋతువులు, రెప్పపాటున సంవత్సరములు, అహోరాత్రములు, సూర్యచంద్రులు నివాసముగా నున్నట్లాదివ్యమగు శ్రేష్ఠమైన గాయత్రీమంత్రమును శరీరమున భావనచేసి కల్పించి తన శరీరమునకు నామమంత్ర దేవత్వాకమైన దివ్యమైన తనువునకు అభేదము కల్పన చేసి తానే దేవత దేవతయే తానుగా నైక్యతను తన్మయతను ఆపాదించి నిత్యము జపించిన శుభావహ సిద్ధులు చేకూరును.

''ఓం తత్సవితు ర్వరేణ్యాయ నమః ।
తత్రాప్త రాదిత్యాయ నమః ॥
తత్రాప్త రాదిత్యప్రతిష్ఠాయై నమః ॥''

☝ అమ్మా ! నీ వాదిశక్తివి, జగన్మాతవు భక్తుల కామముల నీడేర్చుదానవు. అనంత మూర్తుల అంతర్యామివి, సంధ్యాత్రయమున నీకు నమస్కరింతును. సావిత్రి సరస్వతి వైష్ణవి రౌద్రి రక్త శ్వేత నీలివర్ణముల గుణత్రయ మూర్తివి. మునులు ప్రాతఃకాలమున బాలవని, మధ్యాహ్నమున యువతివని, సాయంకాలమున వృద్ధవని నిన్నే భావించి ధ్యానింతురు. హంసవాహనివి, బ్రాహ్మీశక్తివి, గరుడవాహన సరస్వతివి, వృషభవాహన సావిత్రివిగా, భావించి యర్చింతురు. పృధివియందు ఋగ్వేదమును, అంతరిక్షమున యజుర్వేదమును, సామవేదమును గానము చేయుచు సర్వత్ర నిండి యున్నావు. వైకుంఠ కైలాస లోకముల నీవే వ్యాపించియున్నావు. బహువరములిచ్చు దానవు. శివశక్తుల కరముల నుండి నేత్రముల నుండి స్వేదమునుండి ఆనంద రూప కన్నీటి నుండి యుద్భవించి దశరూపములందినదానవు. ☝

''వరేణ్యా వరదా చైవ వరిష్ఠా వరవర్ణినీ ।
గరిష్ఠా చ వరార్హా చ వరారోహా చ సప్తమీ ।
నీలగంగా సదా సంధ్యా సర్వదా భోగమోక్షదా ॥ ''

☝ మర్త్యలోకమున భాగీరధివి, పాతాళమున భోగవతివి, ఆకాశమున త్రిలోక వాహినివి, స్వర్గమున గంగవు, లోకత్రయమును పవిత్రముగా నొనర్చు నుదకమును వహించి నదీరూపమున ప్రవహించు రసమూర్తివి. ధరిత్రి శోక భారమును భూలోకమున భువర్లోకమున, వాయుశక్తిగా స్వర్లోకమున, మూల తేజముగా మహర్లోకమున, సిద్ధరూపిణివిగా సత్యలోకమున, సత్యస్వరూపముగా భాసించుదానవునీవే. అజహరిహరులయందు గాయత్రీ కమలా గౌరి రూపములు నీవే. వారిచే సృజన పాలన లయముల జేయించుచున్నావు. సకల బ్రహ్మ పరాశక్తి పరాయణివి నీవేయైయున్నావు. ఇచ్ఛా క్రియాది జ్ఞానరూపములు నీవే. శరీరమందలి ఇడా పింగళ సుషుమ్నాది దశవిధప్రాణనాడులు నీవే. హృదయపు ప్రాణశక్తిని మూలాధారకుండలినీ మూర్తివి నీవే, ముల్లోకముల మూర్తివంతములైన సర్వము నీవే వ్యాపించియున్నావు. ☝

''రక్త శ్వేత హిరణ్య నీల ధవళై ర్యుక్తాం త్రినేత్రోజ్వలాం
రక్తాం రక్త నవస్రజం మణిగణై ర్యుక్తాం కుమారీ మిమాం ॥
గాయత్రీం కమలాసనాం కరతలవ్యానద్ధ కుండాం బుజాం ॥
పద్మాక్షం చ వరస్రజం చ దధతీం హంసాధిరూఢాం భజే.

☝ గాయత్రీ ప్రాశస్త్యము నేటి యుగములో సన్నగిల్లునట్లు యుగధర్మ ప్రకరణములో ముందే పెద్దలు సెలవిచ్చి యున్నారు. అంతేగాక దీనికి కారణము నాటి గౌతముని శాపఫలమేమో. గాయత్రి ప్రాశస్త్యమే గాకుండ సమస్త వేదాంశములు గూడ నిస్తేజములగునని పెద్దలునుడివిరి. జపతప హోమాదులు షట్కర్మలు దివ్యక్షేత్ర దర్శన ప్రదక్షిణ ఫలములు గూడ భౌతికవాదుల విమర్శల నెదుర్కొనవలసి వచ్చునని పాషండ నాస్తిక మతముల నాచరించు వారే మాననీయులుగా పరిగణింపబడుదుర కలియుగ ధర్మములో వివరింపబడినది. నేడు 'టెర్రరిస్టు' యని పిలువబడు తీవ్రవాఁ లుద్భవింతురని యుగధర్మముల గురించి తెల్పుచు మార్కండేయ మహాముని విస్పష్టముగా ధర్మరాజుకు బోధించెను. రాడకల్ యను ఆంగ్ల పదమునకు మూడు అర్థములు గలవు. 1. మూలస్పర్శ, 2. మౌలిక, 3. తీవ్రవాదములని పేర్కొన బడినది. ఈ తీవ్రవాద చర్యలను పూర్వము మార్కండేయుడు విశదీకరించి యున్నాడు. వానిని క్రింద నుల్లేఖించనైనది. రాడికల్స్ కూడ హింసను నమ్మెదరు.

సీ. సత్యంబు నరులకు సంక్షిప్త మగు సత్య
హానినాయువు గడు నరిగిపోవు ।
నాయువు దరిగిన నల్పంబు లగు విద్య
లల్పవిద్యల విమోహంబు మిగులు ।
మోహంబువలన బైముసురు లోభంబుద
దావేశమున గామ మగ్గలించు ।
గామంబు పెంపున గడగు గ్రోధంబు క్రో
ధంబున వైరమెంతయును బెరుగు ।

ఆ॥ వైరమున నశేష వర్ణులు నన్యోన్య ।
పీడ సేయుచును విభిన్న బుద్ధి
నొక్క డొకడు మేర నుండక వర్ణసం
కరము సేయగలరు కలియుగమున.

☝ అనగా సత్యము మాటాడిన విత్తము లభింపదను భ్రమలోబడి జనులెల్లరు అసత్యము నాశ్రయింతురు. అట్టి సత్యహానిచే జనుల ఆయుర్దాయము తగ్గి పోవును. ఆయువు తగ్గుటచే అల్పకాలములో అల్ప విద్య లలవడును. వానిచే విమోహము విమోహమువల్ల లోభము లోభముచే గామము గల్గును. కామముచే క్రోధము క్రోధముచేత పరస్పర వైరము బెరిగి సమాజమంతయు వివిధ దుష్కర్మలచే ఛిన్నా భిన్నమై పోవును. ☝

క॥ జప నియమ స్వాధ్యాయప్ర
పంచమ్ములు విడువగలరు బ్రాహ్మణులు జనా
ధిప శూద్రులు విపులతపః ।
క్షపితులు గాగలరు వినవె కలికాలమునన్.

☝ అనగా కలియుగములో జపతపాది సత్కర్మల బ్రాహ్మణులు పరిత్యజింతురు. వానిని కొందరు శూద్రులు విధిగా నాచరింతురు. అనగా స్వధర్మమును కొందరు బ్రాహ్మలు విస్మరింతురని భావము. ☝

మ॥ వనితా దుర్బల దీనబంధు జన సర్వస్వాపహారుల్ సుహృ
జ్జన మాతా పితృ పుత్త్ర హంతలు యదృచ్ఛాకర్మ శీలుర్ ధరన్
జనసంపూజితులై చరింతురు వినష్టశ్రీకులై విప్రులా
జనులం జేరి ప్రతి గ్రహించెద రవజ్ఞాపూర్వ దుర్విత్తముల్.

☝ స్త్రీ దుర్బల పేద బంధు జనుల సర్వస్వము నపహరించువారును సజ్జన మాతాపితరుల సంహరించువారును దళారీలును కలికాలములో సర్వత్ర పూజింపబడుచు యోగ్యులనిపించుకొందురు. సమస్త సంపదలను నష్టపరచుకొన్న బ్రాహ్మలు పైన తెలిపిన వారిచెంత కేగి చేతులెత్తి యాచించగా ఆ విప్రుల నవమానించి యొసంగు నీతి బాహ్యద్రవ్యముచే బ్రతుకవలసి వచ్చునని భావము. ☝

తరువోజ : ఉక్కున శూద్రు లత్యుగ్రులై కవిసి
యొక్కండ పెక్కండ్ర నరక చంపుటయు
దిక్కెవ్వరును లేక దీనులై వసుమ -
తీసురుల్ నాలుగుదెసల బారెదరు
ముక్కడిచోరులు ముట్టి నిశ్శేష -
ముగ ధనావలి గొని మొగి వధింపంగ
స్రుక్కి కాకులయట్లు శూన్యులై చెదరి
సొంపరి యడవులు సొత్తురు జనులు.

☝ అనగా అవివేకులు కొందరు కలిసి ఊరకనే ఉగ్రులై అమాయకులను జంపెదరు. దిక్కులేనివారై దేవతలవంటి సజ్జనులు స్వస్థానములు వదిలి నలువైపులకు పారిపోవుదురు. మూర్ఖులగు దొంగలు కొందరు రాత్రులందు అమాయకుల గృహముల నిశ్శేషముగా దోచి వారి ప్రాణములు తీయుదురు. ఈ అశక్తులు గ్రామముల సైతము వదలి యడవులలో తలదాచుకొనవలసివచ్చును. ☝

మ. దేవతాయతనంబులున్ జగతీసురా వసుధంబులుం
భావనాశ్రమభూములుం జెడి పాడగున్ శుభవృక్ష వ
ల్లీవనంబులు నాశమొందు గలి ప్రచారమునందు దుః ।
స్త్రీ విహారము మధ్యపానము జెల్లు బెల్లుగ నెల్లెడన్.

☝ ఈ కలియుగ ప్రభావముచే దేవాలయములు సద్బ్రాహ్మణుల గృహములు పావన ఆశ్రమ భూములు పాడైపోవును. ఎల్ల ప్రజలకు శుభముల నిచ్చు వృక్షసంపద తరులతా గుల్మములు నశించును. నగర నిగమముల యందు దుష్ట స్త్రీల వ్యభిచారము మధుపానములు విశృంఖలముగా బెచ్చు బెరుగును. ఈ విషయములెల్ల భారతారణ్య పర్వములో ధర్మరాజునకు మార్కండేయుడు కలియుగ ధర్మములు బోధించెను. ☝

✍ నేను చక్కని రంగు రంగు రాళ్ళు తీసుకొని గణపతిగాను శివునిగాను అవాహనచేసి గణపతి పూజ మా అందరి సహచరుల గోత్ర నామములతో జపించితిని. ఆ తర్వాత స్వచ్ఛమైన మానస జలముతో మనసారా రుద్రాభిషేకము చేసితిని.

ఇంతలో చౌక్కారావుగారి పూజకూడ ముగిసెను. వారు తెచ్చిన ఒక కొబ్బరికాయను కొన్ని ఎండు ఫలములను ఒక రూపాయి బిళ్ళను సరోవరములోనికి దూరముగా విసరి నిమజ్జన గావించితిమి. ఆ తర్వాత తీర్థ ప్రసాదముల స్వీకరించితిమి. మా చెంతనున్న మూటలను విప్పి అందరి ఫలహారములను మా ముందుంచుకొని అన్ని రకములను భుజించుచు మాతో వచ్చిన గుర్రముల వారికి కూడ ఇవ్వగా వారును భుజించిరి. హాయిగా ఆనందముగా తృప్తిగా ఇక్షురసములాటి మానస జలమును మనసార గ్రోలితిమి. అశ్వములు గట్టున మేత మేయుచుండెను. దాదాపు ఒక గంట యచట గడపిన తర్వాత మరల ప్రయాణము సాగించితిమి. నేను కొంతసేపు దారిలో అశ్వారోహణ గావించితిని. చౌక్కారావుగారు ఉదయము నుండే గుర్రముపై పయనించుచుండిరి. కిషోర్ చౌదరి మున్నగువారును కొంతసేపు అశ్వము నారోహించియుండిరి.

అట్లు మా ప్రయాణము చాలాసేపు జరిగినది. మేము మధ్యలో వచ్చు నదులను గుర్రములపైనుండి దాటుచుంటిమి. గుర్రపు రౌతులు సరోవర తీరమునకు దూరముగా రెల్లుతుప్పలలోనుండి తిన్నగా దారి తీసిరి. ఎందుకనగా తీరము వెంబడి పోయినచో దారియొక్క దూరము పెరుగును. కావున ఈ అడ్డ త్రోవ తీసినారు. మాకు దారిలో శిథిలమైన గోడలు రాళ్ళకుప్పలు కనబడెను. ఆ రాళ్ళపై బుద్ధునివి శక్తివి బొమ్మలు మరియు ప్రణవ మంత్రము చెక్కబడియుండెను. ఇట్టి రాళ్ళ కుప్పలు తెప్పలుగా కన్పించెను. అవి యన్నియు శిథిలము చేయబడిన గొంపాల రాళ్ళ కుప్పలుగా తెలిసికొంటిమి. కొన్ని ఫోటోలను కూడ తీసి ప్రయాణము ముందునకు సాగించినాము. దాదాపు నాల్గు గంటల వరకు ఆ తుప్పలలో రాళ్ళలో ఆయా నదులు దాటుచు పరిసరములను పరీక్షించుచు కొంతసేపు గుర్రములపైన మరికొంతసేపు నడకద్వారా ముందుకు సాగుచు ఒక పెద్ద నదిని దాటితిమి. గుర్రాలవారు మేతకై గుర్రములను విడచిరి. ఆ నది ఒడ్డున బాగుగా పచ్చగడ్డి యుండెను. నేను కాఫీ త్రాగుటకై నా సంచిలో గల గిన్నెను మంటబిళ్ళలను స్టౌను బయటికి తీసి గిన్నెలో రెండు కప్పులు నీటిని పోసి ఒక మంట బిళ్ళను వెలిగించి కాఫీ కాచితిని. మరల ఫలహారము చేసిన తర్వాత నేను కిషోర్ మాత్రమే కాఫీ త్రాగితిమి. ఈ మంట బిళ్ళలు ఒక విధమైన హారతి కర్పూరము లాటి వస్తువుతో తయారుచేయుదురు. ఒక బిళ్ళను స్టౌలో వేసి అంటించినచో అది మండి కాఫీ తయారగుట కుపయోగించును. టీ మరల తయారుచేయుదునంటే మిగిలినవారు అక్కరలేదు తయారు చేయవద్దనిరి. అరగంట తర్వాత మరల లేచి సరోవర తీరము వెంబడే దాదాపు ఆరుగంటల సమయానికి ''యాంగు'' అనే ఒక గుడార క్యాంపునకు చేరితిమి.

అది సరోవరమునకు దగ్గరలో ఒక నది ఒడ్డున ఏర్పాటు చేయబడి యున్నది. అచట ఇరువురు మనుష్యులు మాకు సహాయము చేయుటకై నియుక్తులై యుండిరి. ఆ టెంటులో (గుడారము) రెండు వరుసలుగ వరుసకు ఆరు పరుపులు దిండ్లు కప్పుకొను పరుపులు (రజాయిలు) అమర్చియుంచిరి. మధ్యభాగములో వంట పాత్రలు వగైరా వస్తువులు కలవు. మేము గుడారములో కొంతసేపు విశ్రమించుచుండగా మా యువక మిత్రులు ఖిచడీ వండుటకై ప్రయత్నములు సాగించుచుండిరి. ఆ ప్రాంతములో దాదాపు సాయంకాలము ఎనిమిది గంటలకు గాని చీకటి పడదు. ఆ సమయమున మిత్రులు బయటి దృశ్యమును చూచుచు మమ్ములను కూడ వచ్చి చూడమని పిలచిరి. నేను కెమెరా తీసికొని బయటకు వచ్చితిని. అది సంధ్యా సమయము. ఆ సమయమున, ఆ మానస సరోవర జలము నీలముగా, దానిపై నుండి తిన్నగా కైలాస పర్వతము, ఆ పర్వతము వెనుక నల్లని తెల్లని మేఘములు, వాని వెనుక, నీలి యాకాశము, దాని వెనుకగా, ఎర్రగా క్రింది నుండి పెద్ద పెద్ద మంటలు వచ్చుచున్నట్లుగా కన్పించు, ఎర్రని సూర్య కిరణములు, గలిగి అదియొక అధ్భుత దృశ్యముగా కన్పించుచుండెను. ప్రకృతి సౌందర్యము యొక్క అద్భుత కళా ఖండికగా చూపరులకు నచ్చెరువు నొందించునట్టి, యాదృశ్యము, చూచి తరించవలసినదే, గాని వర్ణనాతీతము. ఆ సహజ ప్రకృతి శోభా, కళాఖండికను, నా కెమెరాలో బంధించితిని. ఆ దృశ్యమును జూచిన యనుభవము, మానవుని జీవితాంతము, మరుపురానిదై యుండునట్టి, మహిమ, గలది గావుననే నేటికిని, ఆదృశ్యము, నాతలపులలో, మెదలుచునే యున్నది.

తరువాత మేము లోనికి వచ్చి మా వద్ద గల పాడులు పచ్చళ్ళు బయటకు తీసికొని అందరము భోజనము ముగించితిమి. కొంతసేపు మాటా మంతీ అయిన తర్వాత ముఖమునకు చేతులకు మందు లేపనములు వ్రాసుకొని పరుపులలో దూరి గాఢ నిద్రలో మునిగితిమి. నేటి పరిక్రమలో నలభై యైదు కిలోమీటర్ల ప్రయాణము సాగెను. నిన్నటి దినమున బస్సులో ఇరువది కిలోమీటర్లు దూరము బస్సు ద్వారా ప్రయాణము చేసితిమి. రేపటి రోజున నలభై కిలోమీటర్లు దూరము ప్రయాణము చేయవలసి యుండెను. మొత్తము మానస సరోవరము, చుట్టును దూరము నూట ఐదు కిలోమీటర్లు ఈ సరోవర వైశాల్యము ఏబది నాల్గు చదరపు మైళ్ళు అనగా నూటయాభై చతురపు కిలోమీటర్లు.

ఈ మానస సరోవర ఫరిక్రమలో దాటవలసిన నదుల పేర్లు : 1. గూమాఛూ 2. లంగ్‌నర్‌ఛూ 3. పాల్చెన్‌ఛూ 4. ఛర్ ఛర్ గంగ్ 5. దుంగ్‌ ఛెండాంగుఛూ 6. డాగ్‌ట్సంపో 7. నిమాపెండిఛూ 8. రిల్జింగ్ ఛూ మొదలైనవి. ఆ నదులు సెలయేళ్ళ వలె స్వచ్ఛ జలముతో అతివేగముగా ప్రవహించుచు, చూచుటకు

ఇంతలో చొక్కారావుగారి పూజకూడ ముగిసెను. వారు తెచ్చిన ఒక కొబ్బరికాయను కొన్ని ఎండు ఫలములను ఒక రూపాయి బిళ్ళను సరోవరములోనికి దూరముగా విసరి నిమజ్జన గావించితిమి. ఆ తర్వాత తీర్థ ప్రసాదముల స్వీకరించితిమి. మా చెంతనున్న మూటలను విప్పి అందరి ఫలహారములను మా ముందుంచుకొని అన్ని రకములను భుజించుచు మాతో వచ్చిన గుర్రముల వారికి కూడ ఇవ్వగా వారును భుజించిరి. హాయిగా ఆనందముగా తృప్తిగా ఇక్షురసములాటి మానస జలమును మనసార గ్రోలితిమి. అశ్వములు గట్టున మేత మేయుచుండెను. దాదాపు ఒక గంట యచట గడపిన తర్వాత మరల ప్రయాణము సాగించితిమి. నేను కొంతసేపు దారిలో అశ్వారోహణ గావించితిని. చొక్కారావుగారు ఉదయము నుండే గుర్రముపై పయనించుచుండిరి. కిషోర్ చౌదరి మున్నగువారును కొంతసేపు అశ్వము నారోహించియుండిరి.

అట్లు మా ప్రయాణము చాలాసేపు జరిగినది. మేము మధ్యలో వచ్చు నదులను గుర్రములపైనుండి దాటుచుంటిమి. గుర్రపు రౌతులు సరోవర తీరమునకు దూరముగా రెల్లుతుప్పలలోనుండి తిన్నగా దారి తీసిరి. ఎందుకనగా తీరము వెంబడి పోయినచో దారియొక్క దూరము పెరుగును. కావున ఈ అడ్డ త్రోవ తీసినారు. మాకు దారిలో శిథిలమైన గోడలు రాళ్ళకుప్పలు కనబడెను. ఆ రాళ్ళపై బుద్ధునివి శక్తివి బొమ్మలు మరియు ప్రణవ మంత్రము చెక్కబడియుండెను. ఇట్టి రాళ్ళ కుప్పలు తెప్పలుగా కన్పించెను. అవి యన్నియు శిథిలము చేయబడిన గొంపాల రాళ్ళ కుప్పలుగా తెలిసికొంటిమి. కొన్ని ఫోటోలను కూడ తీసి ప్రయాణము ముందునకు సాగించినాము. దాదాపు నాల్గు గంటల వరకు ఆ తుప్పలలో రాళ్ళలో ఆయా నదులు దాటుచు పరిసరములను పరీక్షించుచు కొంతసేపు గుర్రములపైన మరికొంతసేపు నడకద్వారా ముందుకు సాగుచు ఒక పెద్ద నదిని దాటితిమి. గుర్రాలవారు మేతకై గుర్రములను విడచిరి. ఆ నది ఒడ్డున బాగుగా పచ్చగడ్డి యుండెను. నేను కాఫీ త్రాగుటకై నా సంచిలో గల గిన్నెను మంటబిళ్ళలను స్టౌను బయటికి తీసి గిన్నెలో రెండు కప్పులు నీటిని పోసి ఒక మంట బిళ్ళను వెలిగించి కాఫీ కాచితిని. మరల ఫలహారము చేసిన తర్వాత నేను కిషోర్ మాత్రమే కాఫీ త్రాగితిమి. ఈ మంట బిళ్ళలు ఒక విధమైన హారతి కర్పూరము లాటి వస్తువుతో తయారుచేయుదురు. ఒక బిళ్ళను స్టౌలో వేసి అంటించినచో అది మండి కాఫీ తయారగుట కుపయోగించును. టీ మరల తయారుచేయుదునంటే మిగిలినవారు అక్కరలేదు తయారు చేయవద్దనిరి. అరగంట తర్వాత మరల లేచి సరోవర తీరము వెంబడే దాదాపు ఆరుగంటల సమయానికి ''యాంగు'' అనే ఒక గుడార క్యాంపునకు చేరితిమి.

అది సరోవరమునకు దగ్గరలో ఒక నది ఒడ్డున ఏర్పాటు చేయబడి యున్నది. అచట ఇరువురు మనుష్యులు మాకు సహాయము చేయుటకై నియుక్తులై యుండిరి. ఆ టెంటులో (గుడారము) రెండు వరుసలుగ వరుసకు ఆరు పరుపులు దిండ్లు కప్పుకొను పరుపులు (రజాయిలు) అమర్చియుంచిరి. మధ్యభాగములో వంట పాత్రలు వగైరా వస్తువులు కలవు. మేము గుడారములో కొంతసేపు విశ్రమించుచుండగా మా యువక మిత్రులు ఖిచడీ వండుటకై ప్రయత్నములు సాగించుచుండిరి. ఆ ప్రాంతములో దాదాపు సాయంకాలము ఎనిమిది గంటలకు గాని చీకటి పడదు. ఆ సమయమున మిత్రులు బయటి దృశ్యమును చూచుచు మమ్ములను కూడ వచ్చి చూడమని పిలచిరి. నేను కెమెరా తీసికొని బయటకు వచ్చితిని. అది సంధ్యా సమయము. ఆ సమయమున, ఆ మానస సరోవర జలము నీలముగా, దానిపై నుండి తిన్నగా కైలాస పర్వతము, ఆ పర్వతము వెనుక నల్లని తెల్లని మేఘములు, వాని వెనుక, నీలి యాకాశము, దాని వెనుకగా, ఎర్రగా క్రింది నుండి పెద్ద పెద్ద మంటలు వచ్చుచున్నట్లుగా కన్పించు, ఎర్రని సూర్య కిరణములు, గలిగి అదియొక అద్భుత దృశ్యముగా కన్పించుచుండెను. ప్రకృతి సౌందర్యము యొక్క అద్భుత కళా ఖండికగా చూపరులకు నచ్చెరువు నొందించునట్టి, యాదృశ్యము, చూచి తరించవలసినదే, గాని వర్ణనాతీతము. ఆ సహజ ప్రకృతి శోభా, కళాఖండికను, నా కెమెరాలో బంధించితిని. ఆ దృశ్యమును జూచిన యనుభవము, మానవుని జీవితాంతము, మరుపురానిదై యుండునట్టి, మహిమ, గలది గావుననే నేటికిని, ఆదృశ్యము, నాతలపులలో, మెదలుచునే యున్నది.

తరువాత మేము లోనికి వచ్చి మా వద్ద గల పొడులు పచ్చళ్ళు బయటకు తీసికొని అందరము భోజనము ముగించితిమి. కొంతసేపు మాటా మంతీ అయిన తర్వాత ముఖమునకు చేతులకు మందు లేపనములు వ్రాసుకొని పరుపులలో దూరి గాఢ నిద్రలో మునిగితిమి. నేటి పరిక్రమలో నలబై యైదు కిలోమీటర్ల ప్రయాణము సాగెను. నిన్నటి దినమున బస్సులో ఇరువది కిలోమీటర్లు దూరము బస్సు ద్వారా ప్రయాణము చేసితిమి. రేపటి రోజున నలభై కిలోమీటర్లు దూరము ప్రయాణము చేయవలసి యుండెను. మొత్తము మానస సరోవరము, చుట్టును దూరము నూట ఐదు కిలోమీటర్లు ఈ సరోవర వైశాల్యము ఏబది నాల్గు చదరపు మైళ్ళు అనగా నూటయాభై చతురపు కిలోమీటర్లు.

ఈ మానస సరోవర పరిక్రమలో దాటవలసిన నదుల పేర్లు : 1. గూమాఛూ 2. లంగ్‌నర్‌ఛూ 3. పాల్చెన్‌ఛూ 4. ఛర్ ఛర్ గంగ్ 5. దుంగ్‌గ్ ఛెండాంగుఛూ 6. డాగ్ట్సంపో 7. నిమాపెండిఛూ 8. రిల్జింగ్ ఛూ మొదలైనవి. ఆ నదులు సెలయేళ్ళ వలె స్వచ్ఛ జలముతో అతివేగముగా ప్రవహించుచు, చూచుటకు

ఉత్సాహము గొల్పుచుండును. నదులు ఎంతగా నధికమో త్రాగుటకు నీరు లభించక పోవుటయు అంతగానే కఠినమని యొక సామెత గలదు. అచ్చట ప్రయాణీకులకు దారులు సరిగానుండక అలసటకు గురికావటంచే , దాహము అతిశయమముగా నుండుటవలన కాబోలు ఈ సామెత ఏర్పడియుండ వచ్చును. మానస సరోవరమునకు చుట్టును గల ఎనిమిది గొంపాల పేర్లు ఏమన. 1. గోసుల్ గోంపా (మూడు డాబాలు లేక ఇళ్ళు గలది) 2. ఛివు గొంపా (5 ఇండ్లు గలది) 3. ఛెర్క్యిష్ గొంపా (ఒక ఇల్లు గలది) 4. లాంగ్‌పోనాగొంపా (అయిదు ఇళ్ళు గలది) 5. పోంరిగొంపా (అయిదు ఇళ్ళు గలది) 6. సార్లుంగ్ గొంపా (పందొమ్మిది ఇండ్లు) 7. మెర్గొగొంపా (అయిదు ఇళ్ళు గలది) 8. ధుగొలో గొంపా (ఎనిమిది ఇండ్లు) యను పేర్లు గలవి. ఈ గొంపా లిప్పుడు నామమాత్రావశేషములుగా మిగిలిపోయినవి. ✍

కపాలం త్రిశూలం కరాభ్యాం దధానం
పదాంభోజనమ్రాయ కామం దదానం
బలీవర్దయానం సురాణాం ప్రధానం
శివం శంకరం శంభు మీశాన మీఢే.



 ఆవులింత, తుమ్ము, నవ్వు, ఉమ్మివేయుట, శబ్దములేకుండ చేయవలెను. శబ్దమైన ఇతరులు అసహ్యపడుదురు.

 తన ఒక్కనికే వండుకొని ఇతరులకు పెట్టకుండ తినినవాడు బ్రతికుండియు చచ్చినవానితో సమానము.

 అహింసాపరులడు అందముగా, ఆరోగ్యముగా, ఐశ్వర్యవంతుడై పుట్టును.

# ఇరువది ఒకటవ అధ్యాయం

## రెండవ రోజు పరిక్రమ

శరచ్చంద్ర గాత్రం గణానందపాత్రం
త్రినేత్రం పవిత్రం ధనేశస్య మిత్రమ్
అపర్ణాకళత్రం సదా సచ్చరిత్రం
శివం శంకరం శంభు మీశాన మీఢే ॥

✍ ది. 2-8-1983 రోజు ఉదయము ఆరు గంటలకు తేయాకు పానీయము మాత్రము త్రాగి సామానులన్నియు గుర్రములపై నెక్కించి ప్రయాణోన్ముఖుల మైతిమి. తుప్పల పైనుండి గుండ్రని రాళ్ళపై నుండి ప్రయాణము. ప్రక్కనే ఎడమకు గుర్లా మాంధాతా మంచుశిఖరములు ఎదురుగా మానస సరోవరము దానియొక్క ఘడియ ఘడియకు మారుచున్న రంగునీటి అలలు, దానిపైన కనుపించు కైలాస శిఖరమును, చూచి ఆనందించుచు శిథిల గొంపాలను, దాటుచు, నడచువారు, నడచుచుండగా, గుర్రములపై స్వారీచేయువారు స్వారీ చేయుచుండగా, ముందునకు ప్రయాణము సాగించుచుంటిమి. నేను నిన్నను ఈ దినమునను కొంతసేపు గుర్రము పైనను కొంతసేపు నడచుచు ప్రయాణము చేయుచుంటిని. మా గుర్రమువెంట గల ఒక టిబెటు దేశీయుడు నడచుచునే తనలో తాను ఏదో స్మరించుచుండుట నిన్నటి నుండియు గమనించుచుంటిని. అది వారి ప్రణవమంత్రమై యుండవచ్చును. దాదాపు పదకొండు గంటల ప్రాంతమున మేమొక ప్రదేశమున ఆగితిమి. ఆచట పైనుండి ఒక నదీ ప్రవాహము మానససరోవరమున బడుచుండెను. అచట మేము మానస సరోవరములో స్నానములు చేసి పూజలు ముగించి మరల ఫలహారములు సేవించితిమి. మా గుర్రములతో వచ్చు మనుష్యులు యాక్ జడల బర్రెల పేడచే ఎండుపిడకలుగా నున్నవాటిని ప్రోగుచేసి నిప్పంటించి రొట్టెలు తయారుచేసుకొనిరి. గుర్రములు హాయిగా అచ్చటగల పచ్చగడ్డిని మేయుచుండెను. మానససరోవర జలములో రెండు నిముషముల కాలము మాత్రమే యుండవచ్చునని తెల్పితిని. మధ్యన ఎచటనో కొన్ని ఉష్ణ గుండములున్నట్లుగా చెప్పబడెను. ఆ సరోవరములో ఎల్లవేళల మంచునీ ప్రవహించినను ఆ నీరు అంతచల్లగా నుండకపోవుటకు ఆ ఉష్ణగుండముల కారణమైయుండవచ్చును.

గుర్రములవారి భోజనమింకను కానందున మేము నెమ్మదిగా కాలి నడకను ప్రయాణము మొదలుపెట్టితిమి. ఎదురుగా ప్రక్కన ఒక మడుగులో ఎన్నో రకముల రంగురంగుల పక్షుల గుంపులు కనుపించెను. మమ్ములను చూడగానే అవి ఆకసములోనికి

ఎగసి మానససరోవరములో వ్రాలెను. వాని ఆకారములు బాతులు మరియు కొంగలవలె యుండెను. సరోవరములోకూడ ఈదుచున్న బాతులు (బ్రహ్మనీడక్స్) మొదలైనవి కన్పించెను. ఇందులో రాజహంసలేవో గుర్తించుట కష్టముగా యుండెను. అసలు రాజహంసలెట్లుండునో కూడ తెలియదు.

హంస యనగా మనస్సు అనియు ఋషి యనియు సన్యాసియనియు బ్రహ్మయనియు, ఆత్మ యనియు, పలురకములైన, యర్థములు గలవు. కావున అవి కాల్పనిక అంశములైయుండవచ్చును. లేదా కాలక్రమమున ఆ రాజహంసలు అంతరించిపోవుట గూడ సంభవమై యుండవచ్చును. ఈ రాజహంసలు, రత్నములను భక్షించుననియు, పాలను నీటిని వేరు చేయగల లక్షణములు గలవనియు సామాన్యముగా ఎల్లరును విశ్వసించు విషయమే. ఈ రాజహంసలు మానవుల భాషలను అతి సులభముగా అర్థము చేసికొనగలవని ప్రతీతి. ఒక రాజహంసయే నలదమయంతుల వివాహమునకు మధ్యవర్తియైనట్లు గల పురాణగాథ అందరకును తెలిసినదే. ఈ రాజహంసలకు పురాణేతిహాసములలో చాలా ప్రాముఖ్యము గల సన్నివేశము లెన్నేని కలవు. శ్రీమద్భాగవతములో పేర్కొనిన నర నారాయణ హంసద్వయము విహరించిన ప్రదేశము మానససరోవర ప్రాంతమేయని ఈ సందర్భమున చెప్పుటకెంతయు సమంజసముగా నుండును.

రాజహంసలకు మానస సరోవరమే నిలయమైనట్లు భారతములోని కర్ణపర్వములో గల హంసకాకోపాఖ్యానమున కాకముతో హంస తెలపిన విధము ఈ దిగువ పద్యము ద్వారా తెలియదగినది.

క. మానస సరసి వసింతు మ
హీన బలము జవము బక్షు లెల్లను బొగడం
గా నెందు దిరుగుదుము ద
వ్వైనను బేదంబు లేదు హంసల మగుటన్.

అనగా హంసలు మానససరోవరములో నివాసముండునని ఎంత ఎత్తుకేని ంతటి దూరమునకేని ఎగిరిపోవుటలో హంసలకు బేదముండదని భావము.

అట్లే అల్లసాని పెద్దనార్యుడు వ్రాసిన మనుచరిత్రములో ప్రవరాఖ్యుడు పాదలేపనము ద్వారా హిమవద్గిరికి వెడలగా అచటి మంచు ప్రభావమున పాదలేపనము హరించిపోగా మంచుకొండపై చిక్కుబడిపోయి వచటగల క్రూర మృగములను గూర్చి భీతావహుడై తాననిన మాటల నీ పద్యమున పెద్ద నార్యుడు తెలిపెను.

మ. అకలం కౌషధసత్త్వముం దెలియ మాయాద్వారకావంతికా
శి కురుక్షేత్ర గయా ప్రయాగములు నే సేవింప కుద్దండ గం

డక వేదండ వరాహ వాహరిపు ఖడ్గ వ్యాఘ్ర మిమ్మంచుకొం
డకు రాజెల్లనే బుద్ధి జాడ్యజనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్.

అని పై పద్యములో హిమాలయాల, మంచుకొండలపై నానావిధ క్రూర జంతువులున్నట్లు గండభేరుండ పక్షులున్నట్లు చెప్పబడెను. కాని ఈ మృగాదులు పక్షులును మా దృష్టికి రాలేదు.

ఇదియునుకాక వాల్మీకి రామాయణములో వృక్ష పక్షి యక్ష రాక్షస కిన్నెర కింపురుష గంధర్వజాతులు వజ్ర వైఢూర్య గోమేదిక పుష్ప రాగ మరకత మాణిక్య నీలమేఘ ప్రవాళ మౌక్తికములను నవరత్నములున్నట్లు జాంబూఫలములున్నట్లు ఈ క్రింద చూపబడిన రామాయణ వివరణ ద్వారా తెలియచేయబడినది. గమనింపగలరు.

''మీరు నదుల దరులలో **అరణ్యము**లలో పర్వతములమీద అన్ని చోట్లలో వెదకవలయును. మ్లేచ్ఛ పుళింద శూర సేన ప్రస్థల భరత ముద్ర దక్షిణకురు కాంభోజ యవన శక అరట్టక బాహ్లీక ఋషిక పౌరవ టంకణ చీన పరమ చీన విహార దరద దేశములన్నింటిని చక్కగా వెదకుడు. హిమవత్పర్వతము నందు మాటిమాటికి వెదకుడు. అక్కడి అడవులు నదులు పర్వతమధ్య ప్రదే శములు అన్నియు పరీక్షింపుడు.

ఆ తరువాత సోమాశ్రమము చూచుకొని కాళమను పర్వతమున కరుగుడు. ఆ పర్వతము నందు బంగారుగనులున్నవి. అక్కడినుండి సుదర్శన పర్వతమున కరుగుడు. ఆపైన దేవసఖపర్వతమున్నది.

దాని కావల నూరుయోజనములవరకు గల ప్రదేశమున కొండలుగాని నదులుగాని చెట్లుగాని ఉండవు. ఆ ప్రదేశము శూన్యముగా ఉండును. అచ్చట ప్రాణి సంచారము లేదు. ఆ ప్రదేశమును వేగిరముగా దాటవలయును.

ఆ తరువాత కైలాసపర్వతము కనబడును. ఆ పర్వతమును చూచినంత మీకు సంతోషము కలుగును. ఆ కైలాస పర్వతము మీదనే కుబేరుని భవనమున్నది. దానిని విశ్వకర్మ నిర్మించినాడు. ఆ భవనపు ఆవరణమున ఒక తామర కొలను కలదు. అందులో కమలములు కలువలు నిండియుండును. హంస కారండవములు కనులపండువు కావించును. అక్కడికి అప్సరసలు వచ్చుచుందురు. అదియే యక్షరాజైన కుబేరుని నిలయము.

ఆపై మీకు క్రౌంచ పర్వతము కానవచ్చును. దాని బిలముగుండ వెళ్ళుట అమితకష్టము. మీరు మెలకువతో పోవలయును. ఆ బిలమున మహర్షులుందురు.

క్రౌంచ పర్వత శిఖరమును చూచి అనంతరము చెట్టు చేమ లేని కామ పర్వతమును కనుగొనగలరు. ఆ తరువాత సమస్త పక్షులతో కూడిన మానవ పర్వతము కానవచ్చును. అక్కడికి దేవతలుగాని దానవులుగాని రాక్షసులుగాని ఎవ్వరును వెళ్ళలేరు. ఆ ప్రదేశములన్నియు మీరు జాగరూకలై వెదకవలయును.

క్రౌంచ పర్వతమును దాటిన పిదప మీకు మైనాక పర్వతము గోచరించును. దానవరాజైన మయుని భవన ముండునది అచ్చటనే. ఆ భవనమును మయుడే స్వయముగా నిర్మించుకొన్నాడు. అక్కడ కిన్నెర స్త్రీలుందురు.

అక్కడనుండి పోవుదురేని మీకొక ఆశ్రమము కనిపించును. అణిమాది సిద్ధులు గల మహర్షులు అచ్చట నివసించుచుందురు. మీరు వారికి నమస్కరించి సీతాదేవి వృత్తాంతము నరయుడు. వైఖానసమను సరోవరము అచ్చటనే యున్నది. అది అత్యంత రమ్యముగా నుండును. కుబేరుని వాహనమైన సార్వభౌమమను ఏనుగు ఆడయేనుగుల కూడి అక్కడ విహరించుచుండును.

ఆ సరోవరమున కావల చంద్ర సూర్యుల సంచారము లేదు. నక్షత్రము లుండవు. మేఘములుండవు. అంతయు నిశ్శబ్దముగా, శూన్యముగా నుండును.

సూర్యచంద్రుల సంచారము లేకపోయినను అక్కడి సిద్ధపురుషులు స్వయంప్రకాశకులు కావున ఆ ప్రదేశమంతయు వెలుగు గలిగియుండును.

ఆ ప్రదేశమున కావల శైలోద అను నది కలదు. దాని తీరములందలి కీచకములు పొడవుగా నుండి కలిసికొనియుండుటవలన సిద్ధులు. వానిమీదుగనే ఇవతలి తీరము నుండి ఆవలకు రాకపోకలు సాగించుచుందురు.

దానికి ఆవల ఉత్తర కురుదేశమున్నది. పుణ్యవంతులు మాత్రమే అక్కడ నివసింతురు. బంగారు కమలములతో కూడిన నీలవైడూర్యముల వన్నెలు గల తామరలతో అలంకృతములైన నదులు వేనవేలుగా అందు ప్రవహించుచుండును. అక్కడ జలాశయములు పుష్పములతో నిండి రమణీయములై యుండును. అక్కడి నదులలో ముత్యములు, రత్నములు కలవు. నదుల మధ్య ప్రదేశములలో కాంచనమయ పర్వతములు ప్రకాశించుచుండును. ఆక్కడి వృక్షములందు సువాసనల వెదజల్లు పుష్పములు రుచ్యములైన ఫలములు ఎల్లప్పుడును లభించును.

అక్కడి వృక్షములు కల్పతరువులు కోరినవారి అన్ని కోరికలను తీర్చగలవు. కొన్ని వృక్షములు నానా విధములైన వస్త్రముల నిచ్చును. మరికొన్నివృక్షములు నవరత్నములను, ఆభరణములను స్త్రీలకుగాని పురుషులకుగాని కావలసిన వానినన్నింటిని ప్రసాదించుచుండును. మరికొన్ని వృక్షములు శయ్యల నిచ్చును.

మరికొన్ని పుష్పమాలలను, తినుబండారములను పానీయములను పుష్కలముగా ఇచ్చును. మరికొన్ని వృక్షములు రూపయౌవన సంపన్నలగు కాంతలను ప్రసాదించును. ☝

మనఃకాంతాని మాల్యాని ఫలం త్యత్రాపరే ద్రుమాః
పానాని చ మహార్హాణి భక్ష్యాణి వివిధాని చ
స్త్రియశ్చ గుణసంపన్నా రూప యౌవన లక్షితాః

☝ అక్కడికి గంధర్వులు, కిన్నరులు, కింపురుషులు, సిద్ధులు, నాగులు, విద్యాధరులు, తమ స్త్రీలను కూడివచ్చి క్రీడించుచుందురు. అక్కడ వీనుల కింపుగా సంగీతము వినబడుచుండును. అక్కడ యుండువారు ఎల్లప్పుడు సంతోషముతో కాలము గడపుదురు''. ఈ పై వర్ణన యెంతేని అద్భుతావహమైయున్నది.

పైన తెలిపినటువంటి నాటి రామాణము కాలపు లేదా ప్రవరాఖ్యుని కాలపు పరిస్థితులు నేడు లేనట్లు గోచరమగుచున్నది. దీనికి మరొక కారణము హిమాలయాలు నాడు నేడున్నంత ఎత్తైన కొండలుగా ఉండకపోవచ్చును. కాలానుగుణముగా భౌగోళిక మార్పు లెన్నో సంభవించుచున్నవి.

కొన్ని లక్షల సంవత్సరముల పూర్వము హిమాలయ ప్రాంతమంతయు సముద్రమగ్నమైయున్నట్లు తరువాత భౌగోళిక మార్పులవలన క్రముముగా భూమిగా మారినవి. హిమాలయ పర్వతములు వేలాది సంవత్సరముల తరబడి పెరుగుచూ ఇంకనూ ఎత్తగుచున్నవని నవీన శాస్త్రజ్ఞులు నిరూపించియున్నారు. దీనికి సరిపడు పౌరాణిక చిన్నగాధ ఈ విధముగా తెలుపబడినది.

పూర్వము పర్వతములకు రెక్కలుండెనట. ఆ రెక్కలవల్ల పర్వతము లెగురుచు భూలోకముపై జనసంచార ప్రదేశములలో వాలుటవలన దేవమానవులకు సంక్షోభములు గలుగుచుండెన ట. అందువలన దేవతలు వాని రెక్కలు ఖండించుటకు దేవేంద్రుని ప్రార్థించిరి. దేవేంద్రుడు పర్వతముల రెక్కలు దెగనరుకుటకు బూనగా కొన్ని పర్వతములు సముద్రగర్భములో దాగియుండి కాలక్రమేణ మహేంద్రునితో సామరస్యమేర్పడి పర్వతములు మరల మెల్లమెల్లగా సముద్రముపైకి తేలినవట. ఇదియొక పురాణగాధయైనప్పటికి పైన తెల్పిన నవీన భౌగోళిక విజ్ఞాన శాస్త్రజ్ఞుల నిరూపణచే హిమవత్పర్వతములు దినదినము పెరుగుటయను పోలిక సరిపోవుచున్నది. అలా వింధ్య పర్వతములు, ఇతర మహాపర్వతములు పెరుగుట లేదు. వానివృద్ధి దశ పూర్తియైనందున, అలాంటివి క్రుంగుచున్నట్లున్నవని శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. వీనిని వారు మృత పర్వతములుగా పేర్కొనుచున్నారు.

ఇది భౌగోళిక వికాస పరిణామ క్రమమునకు చెందిన కోట్లాది సంవత్సరముల కొలతబద్ధతో కొలచి చూడవలసిన జటిల విషయము: మన పురాణములలోను బౌద్ధపురాణములలోను యుగయుగాంతరములకు, ఖండఖండాంతరములకు, గ్రహగ్రహాంతరములకు, కల్పకల్పాంతరములకు, చెందిన అనేకాద్భుత గాధలు అసంఖ్యాకములుగా ప్రచురితములై యున్నవి. వాటన్నిటి యొక్క వివరణలు వ్రాయుట శక్తికి మించిన పని కాగలదు. ☝

✍ ఇట్లే మరికొంత ముందుకు సాగగా ఒక ప్రక్కగా శిధిలమైన రాళ్ళ కుప్పలు ఆ ప్రక్కనే ఒక శిధిలమైయున్న గొంపా భవనము కన్పించెను. వాని చెంతనే కుప్పలు కుప్పలుగా జడలబర్రెల ఎముకలు పడియుండి దుర్వాసనవేయుచు కనుపించెను. ఇంతలో గుఱ్ఱములు వచ్చి మమ్ముజేరెను. మేము వాని నెక్కి ప్రయాణము సాగించుచుంటిమి. మేము పెద్ద పెద్ద పాదలనుకూడ దాటుచుంటిమి. ఆ ప్రదేశమున లెక్కలేనన్ని ఈగలు మా శరీరములనిండను గుఱ్ఱముల శరీరముల నిండను ముసురుకొనెను. ఎంత విదిలించినను అవి లేచి పోవుటలేదు. వాటివల్ల చాల ఇబ్బందిగా యుండెను. ✍

☝ ఈ సందర్భమున ఈగల గురించి నాకొక భయసందేహ మావరించినది. అదేమనగా అడవి ఈగలు ర క్తమాంసములు సహితము బీల్చివేయునని భాగవత సప్తమ స్కంధములో హిరణ్యకశిపుడు తపమాచరించు ఘట్టములో బ్రహ్మ ప్రత్యక్షమై నుడివిన వాక్కులు. ☝

శా. దంశవ్రాతములున్ బిపీలికలు మేదఃక్రవ్యరక్తంబులన్
సంశీర్ణంబులు సేసి పట్టి తినగా శల్యావశిష్టుండవై
వంశచ్ఛన్నతృణావళీయుతమహా వల్మీకమం దింద్రియ
భ్రంశం బింతయు లేక నీకు నిలువన్ బ్రాణంబు లెట్లుండెనో.

☝ అనగా అడవి ఈగలు దోమలు చీమలు నీయొక్క రక్తమాంసములను బీల్చివేయగా ఎముకలు మాత్రమే మిగిలినవాడై చిరుగడ్డి మొలచిన పుట్టనిన్నావరించగా పంచేంద్రియములు కదలిక లేకుండ నీప్రాణముల నిలుపుకొనుటకు ఏ విధముగ సాధ్యపడెనో గదా! అన్నాడు ఆవిధాత. ☝

వివేకానందులవారి సహతపస్వి యొకరు, ఒకసారి యోగములో నుండగా ఆయన శరీరముపై దోమలన్నీ కంబళి వలె కప్పివేసినవట. ఐనను యోగనిద్రలో నున్న ఆతను దోమల బెడదను గుర్తించకయే, సమాధి నిమగ్నములో నుండెనట. ఇలాంటివి ఆశ్చర్యకరములే గదా !

✍ ఈ పొదలు దాటి కొంతదూరము వెళ్లగా ఈ ఈగలు తగ్గిపోయెను. అట్లు సరోవరము గట్టు మీదుగా మా ప్రయాణము సాగుచుండెను. ఈ ఈగలు హానికరములు వ్యాధికరములుగావని స్వామి ప్రణవానంద పరిశోధనవల్ల తేలినట్లు తర్వాత తెలిసినది.

దాదాపు ఒంటిగంట ప్రాంతమున మేము పూర్తిగా కుడివైపునకు తిరిగితిమి. ఇచటినుండి మా పడమర వంక, పర్వతవరుసలాంటి దిబ్బలు కనబడెను. ఇచటినుండియే దిబ్బలు ప్రారంభమయినవి. దూరాన మాకు ఈ దిబ్బ అంచు కనపడుచు ఆ అంచుకు చేరినచో మా చెర్డీ క్యాంపు వచ్చునని మాకు తలంపు కల్గుచుండెను. కాని అరగంట గడచి ఆ దిబ్బమూలకు జేరగా మా భ్రమ తొలగిపోయెను. మరల యధాప్రకారము దూరాన పర్వత దిబ్బ అంచు కనిపించెను. మళ్ళీ అవి దాటగనే క్యాంపు వచ్చు చున్నట్లు భ్రమ కల్గును. కాని ఎంత నడచినను మా క్యాంపు మాత్రము కన్పించలేదు. మా తోటివారు కొందరు నడచుచు తీరము వెంబడిగల రాళ్ళను ఏరుకొనుచు కొంత వెనుకబడిరి. అందుచే నేను చొక్కారావుగారు, కిషోర్ చౌదరి గుర్రములనుండి దిగి మేము కూడ రంగురంగుల రాళ్ళను ఏరుకొనుట మొదలుపెట్టితిమి. ఈ మానసతీరమున లభించిన రాళ్ళలో కొన్ని అపురూప ఖనిజ సంబంధమైనవియు మరికొన్ని ధార్మికశక్తియుతమైయున్నట్లు శ్రీ ప్రణవానంద పరిశోధన ద్వార వెల్లడియైనది. ఇంతలో మా గుర్రములు కూడ మేతమేయుటకు పూనుకొనినవి. ఇక్కడ ప్రక్కనే దాదాపు నలభైమీటర్ల ఎత్తుపైన ఒక చాల పెద్దభవనముగాబోలు (గొంపా) దానిగోడలు మాత్రమే కనుపించెను. మట్టిదిబ్బలో త్రవ్విన గుహారామములు కొన్ని యగుపించెను. మాకు మాత్రము పైకి వెళ్ళి వానిని చూచు ఓపిక లేకపోయెను. ఆ భవనము గోడలను పరిసర ప్రాంతములనుబట్టి ఆ గొంపా వైభవము ఒకప్పుడు ఎంతో గొప్పదిగాను అందులో చాలమంది లామాలు కలిసి నివసించుటకు వసతులు ఉండినట్లుగను తోచెను. పూర్వము ఈ మానస సరోవర పరిక్రమలో చాల మంది లామాలు ఆ భవనములో విశ్రమించుచుండిరని తెలిసికొంటిమి.

మా తోటివారు ఎంతసేపటికి రానందున మేము వారికై వేచియున్నందున ప్రాణము విసిగి, నేను ఒక్కడనే మెల్లమెల్లగా నడక మొదలుపెట్టితిని. సరోవరము ప్రక్కన గల రకరకాల రాళ్ళను ఏరుచు జేబులో వేసికొనుచు ముందుకు నడుచుచుంటిని. అప్పటికి సమయము సాయంత్రము నాల్గుగంటలయ్యెను. ఎం. దూరము నడచినను దిబ్బలాటి ఈ పర్వతముల చివరలు కనబడుటయు అచటికి చేరగనే ఆపైన మరొక మూల కనబడుటే కాని మా క్యాంపు మాత్రము సమీపించదాయెను. ఇంకను ముందుకు నడువగా ప్రక్క గుట్టకు సరోవరము గట్టునకు

మధ్యన గలదారి సన్నగిల్లెను. ఒకే ఒక్క మనిషినడువగల యెడమే యుండెను. మధ్య మధ్య పైనుండి ఈ సరోవరములోనికి కూలిన రాళ్ళు పెద్ద మట్టిదిబ్బలుగా కనుపించెను. ఇట్లు ఒక గంట నడక తరువాత పర్వతము పూర్తిగా ఎడమకు తిరిగిపోగా ఎదురుగా విశాల ప్రదేశమును దూరాన క్యాంపు ప్రదేశమునగల పరిసర దృశ్యములను సమన్వయించుకొనగానే నా ప్రాణములు లేచి వచ్చినవి. ఈ రోజు మేము దాటిన నదులు (1) అనురాఛూ (2) నంరెల్డిఛూ (3) తాండవఛూ (4) సిలుంగ్ హర్లంగ్‌ఛూ మొదలైనవి. ఈ నదులన్నియు మాంధాతా పరిసర హిమశిఖరములనుండి ఉద్భవించి ప్రవహించుచు రెండడుగులనుండి మూడడుగుల లోతువరకు కలిగియుండెను. ఆ నదులు విపరీతమైన వేగముతో వచ్చునవేకాక నీరు అతిచల్లగ యుండుట కూడ గమనించితిమి. 1981 ప్రథమ యాత్ర బృందమువారు ఈ నదులన్నియును నడచుచునే దాటినట్లును వారు నాలుగు రోజులు మానససరోవరము నాలుగు రోజులు కైలాసపర్వతము పరిక్రమ చేసినట్లు తెలిసినది. ఎందుకనగా ఇచట విపరీతమైన గాలి ఒక్కొక్కసారి పశువులను మనుష్యులను కూడ పైకి ఎత్తివేయును. అనగా గంటకు సుమారు రెండు వందల కిలోమీటర్ల వేగముతో వీచునన్న మాట, ఈ మానససరోవర దృశ్యము ఒక సారి ప్రశాంతముగను మరొకసారి అలలతోను నానారకాలుగా మారుచుండును. ప్రశాంత సమయమున సరోవరములో అగుపడే కైలాస శిఖర ప్రతిబింబచ్ఛాయ అతి మనోహరముగా ఆహ్లాదకరముగా నుండును. ఇచట చాల ప్రశాంతముగ నుండుటచే పూర్వము గొంపాలన్నియు నిర్మింపబడి సాధుపుంగవులకు ఆధ్యాత్మిక నిలయమై దేవభూమిగా పేరుగాంచెను.

ఇట్లే మరికొంత ముందునకు నడువగా ఎదురుగా డా. గోడ్బోలే ఆయన వెనుకగా శ్రీ బందోపాధ్యాయగార్లు వాహ్యాళికి వస్తూ ఇటే అంటే మా వైపే వచ్చుచుండుట చూచి సంభ్రమాశ్చర్యములతో నేను చేయి ఎత్తి సైగ చేసితిని. డా. గోడ్బోలే వడివడిగా నడచి పది నిముషములలో నా చెంత చేరెను. మేము గాఢాలింగనము చేసికొంటిమి. మేము ఎన్నో రోజులు విడిపోయి మరల కలిసినట్లుగా అనుభూతి పొందితిమి. మైత్రి గురించి

శ్లో॥ ఆపత్సుమిత్రంజానీయా, ద్యుద్దేశూరమృణే శుచిం,
భార్యాంక్షీణేశు విత్తేషు, వ్యసనేషుచ బాంధవాన్.

తా॥ ఆపదలో నిజమైన మిత్రులను, యుద్ధములో శూరుని, మృత్తిక (మట్టిలో) శుభ్రతను తెల్సికోవచ్చును. అలాగే ధనము పోయినపుడు భార్యగుణము, కష్టకాలములో నిజమైన బంధువులెవరో గ్రహించవచ్చును.

కుశల ప్రశ్నల అనంతరము ఆయన మా మానస సరోవర పరిక్రమ విశేషముల నడిగెను. నేను మా ప్రయాణము చాల బాగుగా జరిగినదనియు దారిలో ఏ బాధా లేకుండా జేరితిమనియు చెప్పితిని. నేను ముందువైపునకు వారు వెనుకకు నడచితిమి. దాదాపు అయిదున్నరగంటలకు క్యాంపునకు జేరి ప్రక్కపై వ్రాలిపోయితిని. తరువాత అరగంటకు మామిత్రులంద రు క్యాంపునకు చేరిరి. వారే మాకు కాఫీలు చేసి ఇచ్చిరి. వంటలు త యారుచేయు ప్రయత్నములో నిమగ్నులైరి. నేను రాత్రి ఎనిమిది గంటలకు భోజనము చేసి, నాడు జరిపిన నలభై కిలోమీటర్ల ప్రయాణబడలిక వలన ఎంతో అలసి నీరసించి ఆ పరుపులలోదూరి వెచ్చగా గాఢనిద్రలో మునిగిపోయితిని. ✍

శ్లో. హరం సర్పహారం చితాభూ విహారం
భవం వేదసారం సదా నిర్వికారం
శ్మశానే వసంతం మనోజం దహంతం
శివం శంకరం శంభు మీశాన మీఢే
స్తవం యః ప్రభాతే నర శ్శూలపాణేః
పఠేత్ సర్వదా భర్గసేవానురక్తః
న పుత్రం ధనం ధాన్యమిత్రే కళత్రం
విచిత్రం సమాసాద్య మోక్షం ప్రయాతి.

(ఇతి శ్రీ శివాష్టకమ్)



 మాండవ్యుడు చిన్నతనములో తూనీగల రెక్కలకు ముల్లుగ్రుచ్చిన పాపమునకు రాజుచే కొరత వేయించబడెను. అందుచే మన పిల్లలు జీవులను హింస పెట్టకుండ చూడవలయును.

 మాంసాహారము విసర్జించినవానికి నూరేండ్లు తపస్సుచేసిన ఫలము కలుగును.

 'సత్యంవద, ధర్మంచర' వేదవాక్యము, భారతం దీనిని చక్కగా వివరించెను.

# ఇరువదిరెండవ అధ్యాయం

## మానస సరోవర పురాణగాథ విశేషములు

శ్లో. ప్రాతః స్మరామి లలితా వదనారవిందం
బింబాధరం పృథుల మౌక్తిక శోభితాస్యం
అకర్ణ దీ ర్ఘ నయనం మణికుండలాఢ్యం
మంద స్మితం మృదుమనోజ్వల ఫాలదేశం

శ్లో. ప్రాతర్భజామి లలితా భుజకల్ప వల్లీం
రత్నాంగుళీయలసదంగుళి పల్ల వాఢ్యామ్
మాణిక్య హేమవలయాంగద శోభమానాం
పుండ్రేక్షు చాప కుసుమేషు ఘృణీర్ దధానామ్

✍ ఈ పవిత్ర మానస సరోవరము చుట్టుకొలత నూట అయిదు కిలోమీటర్లు. దానిలోతు మూడు వందల అడుగులు. దాని వైశాల్యము దాదాపు నూటయాభై చదరపు కిలోమీటర్లు. దాని యొక్క శోభ ప్రాశస్త్యముల గురించి ప్రాచీన కాలము నుండియు పురాణపురుషులచేతను, ఆధునిక కవులచేతను ఎంతో విపులముగా వర్ణింపబడియున్నది. ఆ సరస్సు సువిశాలమైనదియై దాదాపు పదిహేనువేల అడుగుల ఎత్తు ప్రదేశము పైనుండి ప్రపంచములో ఎత్తైన సరస్సుగా ప్రఖ్యాతి గాంచినది. దాని యందు నీరు అతి స్వచ్ఛముగా యుండును. అది దాదాపు వలయాకారములో నున్నది. ఆ జలము ఎల్లపుడును ఎత్తైన శిఖరములపై గల మంచు కరిగి వచ్చు నీరగుట వలన ఆ నీరు ఎప్పుడును స్వచ్ఛముగానే యుండును. ఆ సరోవరములో రాజహంస లుండెడివని పురాణగాథలవలన తెలియుచున్నది. ఇప్పుడు కూడ అక్కడ అనేక రకములైన రంగు రంగుల పక్షులు చాల కన్పించును. కైలాస శిఖర ప్రతిబింబము దాని నీటిలో పడునపుడు ఆ సరోవర శోభ ఇంకను ఇనుమడించి చాలా విచిత్రముగా ఎంతో ఆనందముగా అనితర సౌందర్య శోభగా మారి కనులకు దివ్యానుభూతి గల్గించుచుండును. ఆ ప్రాంతమును మానస ఖండముగా కూడ చెప్పుదురు.

ఆ మానస సరోవరము చుట్టును ఏడువరుసల వృక్షరాజములున్నట్లును సరోవరములో నొక పెద్ద భవనమున్నట్లును చెప్పబడెను. అందు మధ్యన నాగరాజు నివసించుచున్నట్లును మధ్యలో నొక కల్పవృక్షమున్నట్లు గూడ కొన్ని ఇతిహాసములలో చెప్పబడెను.

ఆ సరోవరము ఉపరితలము బాణాకారముగా నుండునట్లు కన్పించునని టిబెట్టు పురాణ గాథ. కైలాస పర్వతమును మేరు పర్వతముగాను వెండి కొండగాను

కొన్ని ఇతిహాసములలో వర్ణించినను ఆ మేరు పర్వతము ఇంకా ఆ పర్వత శ్రేణిపైనగల హిందుకుష్ పర్వత శ్రేణి ప్రాంతములో నున్నట్లుగా మరొక వాదన కూడ గలదు. ఆ సరోవర మధ్య గల మేరు పర్వతము నాల్గుముఖములు కలిగి నానావర్ణములతో నాలుగు వివిధ వృక్షములతో నున్నట్లును వీని ఆకృతినే బ్రాహ్మణ, వైశ్య, క్షత్రియ, శూద్రులుగా విభజింపబడినట్లును చెప్పెదరు. ఆ సరోవర మధ్య భాగమున నున్న వృక్షరాజము యొక్క పెద్ద పెద్ద ఫలములు సరోవరములో రాలుచుండగా ''జం'' అనే శబ్దము వచ్చుటచే ఆ ప్రాంతమునకు ''జంబూలింగ్'' లేక ''జంబూద్వీపమని'' నామకరణము జరిగినట్లుగ హిందూ పురాణగాధలు గలవు. అలా రాలిన ఫలములు కొన్నిటిని నాగదేవతలు ఆరగించగా మిగిలినవి సరోవరములో బంగారు ముద్దలై మునిగి పోవుచుండెనని చెప్పబడెను. మనము ప్రతినిత్యము చేయు సంకల్పములో ''మేరో దక్షిణ దిగ్భాగే'' ''జంబూద్వీపే'' ''భరతవర్షే'' ''భరతఖండే'' తో మొదలగు సంకల్పము నేటికిని వాడుకలో నున్నది.

మహా భారత భీష్మ పర్వములో దీనిని గురించి సంజయుడు ధృతరాష్ట్రున కీవిధముగా తెల్పును.

సీ. ధాత్రీశ మేరువు దక్షిణంబున సుద
ర్శనమను నభిధానమున బ్రభూత
విస్తారమై రెండువేల నేనూరు యో
జనములు పొడవునై సరస మధుర
విపుల శాశ్వత ఫలవితతి సమేతమై
యొక్క జంబూ తరు వొప్పియుండు
దాని పండులు మహోన్నతి మహా ర
వముగ ననిశంబు బడిరాలి యవియుచుండు

ఆ. వాని రసము పొంగి వాహినీమూర్తి న
న్నగమునకు బ్రదక్షిణంబు గాగ
నొరసి కొనుచు దిరిగి యుత్తర కురుభూము
లందు జొచ్చి పారు నంబుధికిని

☝ జంబూనది యొక్క నీరు సోకిన చోట్లెల్ల సువర్ణంబగుట వల్ల కనకమునకు జంబూనదంబను నామము గల్గెను. ఆ జంబూనది జలము పానము చేసిన మానవులకు ఎపుడును దప్పిక యుండదని జెప్పుదురు. ఆ మేరు పడమరన బెరిగి పరువులుగల్గి శరనిధి చందంబున జంబూషండంబు కారు కొనుచుండు గారణంబున యా

జంబూవృక్షము పేర జంబూద్వీపంబను నామము కల్గెను. ఆ దీప మందు సుదర్శన ద్వీపంబు ననునెగడి లవణ సముద్ర ముద్రితంబయి పోయెనా దీవియందు.

మన పూర్వులు ఆ మానస ఖండ లేదా బ్రహ్మావర్త ప్రాంతమునుండి మన దేశపు హిమాలయములకు దక్షిణ ప్రాంతమున గల ''ఆర్యావర్తము''చేరుట వలన ''ఆర్యులు'' గాను టిబెట్టు కైలాస మానస సరోవర ప్రాంతము హిమాలయములలో నున్నట్లుగా హిందూ పురాణములు స్తుతించుచున్నవి.

## ఆర్యావర్తము

ఆర్యావర్తమును గురించి మన వేదశాస్త్రములలో ఈ విధముగా చెప్పబడినది.

శ్లో. ఆసముద్రాత్తువై పూర్వా దాసముద్రాత్తు పశ్చిమాత్
తయోరే వాంతరం గిర్యో రార్యావర్తం విదుర్బుధాః
సరస్వతీ దృషద్వత్యో ర్దేవనద్యోర్య దంతరం
తం దేవనిర్మితం దేశ మార్యావర్తం ప్రచక్షతే (మను. 22-17)

ఉత్తర మందు హిమాచలము దక్షిణమున వింధ్యాచలము పూర్వపశ్చిమము లందు సముద్రము సరస్వతీ అటక్‌నది తూర్పున బ్రహ్మపుత్రయును దృషద్వతినది ఈ రెండింటి మధ్యన గంగానదియు హిమాలయ మధ్య రేఖనుండి దక్షిణ పర్వతముల మధ్య ప్రదేశమును ఆర్యావర్త మని చెప్పబడినది. ఇచట దేవతలు విద్వాంసులు ఆర్యులు నివసించుటచే కూడ ఆర్యావర్తమను నామము వ్యక్తమైనది.

ఆర్యులు రాక పూర్వము ఈ ప్రాంతమున ఆదిమవాసులు మాత్రమే యుండుటచే ఆ ప్రాంతమునకు ఏ పేరుకూడ లేనట్లు చెప్పబడెను. ఈ ఆర్యులు టిబెటు (బ్రహ్మ వర్తము) నుండి తిన్నగా వచ్చినట్లును మరియు ఇరాను మున్నగు దేశముల నుండి మాత్రము రాలేదను ప్రమాణము ఈ క్రింది శ్లోకములో ఈ విధముగా నున్నది.

శ్లో. విజానీ హ్యార్యాన్పేచ దస్యవో బర్హిష్మతే రంధయా
శాసదవ్రతాన్ (ఋ. 1-51-8)
ఉత శూద్రే ఉతాశ్వే (అధర్వ. 19-62)

ధార్మికులు విద్వాంసులు ఆప్త పురుషులగు వారినే ఆర్యులనియు వీరికి భిన్నమగు వారిని ధన్యులు లేక దొంగలు దుష్టులు అధార్మికులు అవిద్వాంసులనియు చెప్పబడినది. బ్రహ్మ క్షత్రియ వైశ్యులకు ఆర్యులనియు శూద్రులకు

ఆనార్యులనియు కూడ చెప్పబడెను. అర్జునుడు, దశరథుడు మున్నగువారు ఆర్యావర్తీయులు హిమాలయ పర్వత ప్రాంతమున ఆర్యులకు దస్యులకు (దేవాసుర సంగ్రామములు) జరిగిన యుద్ధములందు దేవతలు ఆర్యులను రక్షించుటకు అసురుల నోడించుటకు సహకరించినట్లు తెలియును. దీని వలన ఆర్యావర్తము వెలుపల గల అంటే హిమాలయములకు పూర్వాగ్నేయ దక్షిణ నైఋతి పశ్చిమ వాయవ్యోత్తర ఈశాన్య దేశములందు నివసించు మనుష్యులే అసురులనుట యదార్థము. ఆర్యుల మీద దస్యులు (మ్లేచ్ఛులు) దండెత్తినపుడెల్ల ఇచ్చటి మహారాజు లందరును ఆర్యులకు సహకరించినట్లు ఇతిహాసపురాణములలో ననేక గాథలున్నవి. రామాయణములోని శ్రీరామ రావణాసుర సంగ్రామము మానవరాక్షస సంగ్రామమనే చెప్పుట ధర్మము. దేవాసుర సంగరము కాదు. ఈ ఆర్యావర్తీయులు వ్యాపారము రాజ కార్యము సంచారము మున్నగువాని కొరకు భూగోళమంతయు సంచరించుచుండిరని చెప్పు నిదర్శనము లెన్నోగలవు. యుధిష్టరుడు రాజసూయయజ్ఞము చేయు తరుణములో సమస్త భౌగోళిక రాజులను బిలచుటకు భీముడు, అర్జునుడు, నకుల, సహదేవులను నాల్గు దిక్కులకు పంపినట్లు చెప్పబడినది. ☝

శ్లో. మేరోర్హరేశ్చ ద్వే వర్షే వర్షం హైమవతం తతః
క్రమేణైవ వ్యతిక్రమ్య భారతం వర్ష మాసదత్ ॥
స దేశాన్ వివిధాన్ పశ్యం శ్చీన హూణ నిషేవితాన్ ॥
(భారత-శాంతి-మోక్ష-324)

✍ భారతములో వ్యాస శుక సంవాదమున ఒకా నొకప్పుడు వ్యాసుడు తన కుమారుడైన శుకునితోను తన శిష్య బృందముతోను నేటి యమెరికా యనబడు పాతాళమున నుండిరి. అపుడు శుకుడు ఆత్మ విద్య గురించి తండ్రి చెప్పినదివిని ఇంకేమైన యున్నదా ఇంతేనా? యని అనగా వ్యాసుడు తన పుత్రుని మిథిలానగరమున కేగి జనక మహారాజు నడుగుమని చెప్పును. అంతట శుకుడు బయలుదేరి మేరువునకు హిమాలయమునకు ఈశాన్యోత్తరము నకును వాయవ్యమున గల హరి వర్షము చేరెను హరి యనగా కోతి. కోతిలా ఎరుపుగా నుండు మనుష్యులు గల ఈ దేశము నేడు ''యూరోపు''గా చెప్పబడుచున్నది. ఈతడు అచటి నుండి యహూది దేశము మరియు చైనాదేశమునకును అచటి నుండి హిమాలయముల ద్వారా మిథిలానగరమునకు వచ్చినట్లు చెప్పబడినది.

అగ్ని యానమును (అశ్వతరి) నావయందు శ్రీ కృష్ణార్జునులు బాతాళ దేశమునకు (అమెరికా) బోయి యజ్ఞమునకు '' ఉద్దాలక'' మహర్షిని గొని వచ్చిరి. ధృతరాష్ట్రుని వివాహము ''గాంధారి'' యను గాంధార ( ఆఫ్ఘనిస్తాన్) రాకుమారిచే

జరిగెను. పాండురాజు భార్య (మాద్రి) ఈరాన్ దేశపు రాజకన్య. అర్జునుడు పాతాళ దేశపు (అమెరికా) రాజపుత్రి '' ఉలూచి''ని వివాహమాడెను. అందువల్ల ఆ కాలంలో దేశ దేశాంతరాలకు ద్వీప ద్వీపాంతరాలకు ఆర్యా వర్తీయులు పోగలిగిరని చెప్పుటకు పై విషయములు సాక్ష్యాధారముగ నున్నవి. మరియు మనుస్మృతిలో సముద్రయానము చేయు వారిపై పన్నులు కూడ విధింపబడుచుండినట్లు దీని వలన తెలుపబడినది. అందులకే పూర్వకాలమున ఆర్యుల ఆర్యావర్తీయుల ప్రపంచప్రఖ్యాతి బహు విధములుగా ఋజువగుచున్నది.

ఈ మానససరోవరమును సృష్టికర్తయైన బ్రహ్మ తన మానసమునుండి ప్రప్రథమమున సృష్టించిన ప్రకృతిసిద్ధమైన అతి పురాతనమైన ప్రపంచములో కెల్ల ఎత్తైన సరోవరము ఇదేయనియు - మహాభారతములో దీనిని ''బిందుసర'' మని యందురనియు-రామాయణములోని స్కాందపురాణములోని మానస ఖండములో ఈ మానస సరోవర గాధను బహువిధములుగా వర్ణించి స్తుతించినట్లు నిదర్శనములు గలవు. మాంధాతయను పూర్వకల్ప మహారాజు దానిని ముందుగా కనుగొన్నట్లును అందుచే వారి పేరిట అచట నొక పర్వతముకూడ వెలిసినట్లు తెలియజేయబడినది. పూర్వము ఇలాంటి మానసజనితులలో 'సనక సనందనాదులు' ముఖ్యులు. అట్లే కేశ జనితులలో వీరభద్రుడు అయోనిజ జనితులలో, కుండలో అగస్త్యుడు ,విష్ణు కర్ణములనుండి జనించిన మధుకైటభులు కుంతీదేవి కర్ణమున కర్ణుడు బుట్టెను. ఇలాంటి కథలు ఆశ్చర్యము గొల్పుట సహజమే.

ఋష్యశృంగుడు జింకకు బుట్టెను. వాల్మీకి పుట్టలో బుట్టెను. జంబుక మహాముని నక్కకడుపున బుట్టెను. కౌశికుడు గడ్డిమోపులో బుట్టెను. వ్యాస మహర్షి బెస్తమాతకు బుట్టెను. గౌతముడు కుందేలునకు బుట్టెను. వశిష్ట మహర్షి ఊర్వశి కుద్భవించిన మున్నగు జన్మగాధ విశేషములు మన పురాణములలో ఎన్నో కాననగును. ఇవన్నియు సత్యత్రేతాయుగ కాలములకు చెందు విశేషములు. పిదపటి కాలములో ఇలాటి గాధలు కానరావు.

ఈ మానససరోవరములో దేవతలు స్నానమాచరించుదురనియు తెలుపబడినది. పాళిభాషలో సంస్కృత బుద్ధ రచనలలో ఈ మానససరోవరమును ''అనవతప్త'' (ఎప్పుడును ఎండిపోనిది) యని చెప్పబడెను. దీని మధ్యన గల వృక్ష ఫలములు సర్వశక్తులు గలిగి మానవులలోని సర్వ రోగములను బాపి దైవత్వమును సిద్ధింపచేయునని ఇంకా ఈ ''అనవతప్తా'' సాక్షాత్తు భూలోక స్వర్గమే యనియు వర్ణింపబడినది. ఇదికాక ఈ సరోవరములో పెద్ద కమల పుష్పములు వికసించగా బుద్ధుడు బోధిసత్వులు అపుడపుడు వచ్చి ఈ పుష్పములలో నివసింతురని

చెప్పబడియున్నది. మేలుజాతి రాజహంసలు ఇందులో ఈదుచు శ్రావ్యమైన గీతములను పాడుచు మంచి ముత్యములను ఆరగించుచుండునని తెలుపబడినది. ఆ చుట్టుప్రక్కల గల పర్వతములలో శతమూలికలు లభించుననియు కూడ వివరించబడినది. కాళిదాస మేఘసందేశములో రాజహంసల వర్ణనలు గలవు.

జైన పురాణములో కైలాసమును ''అష్టపద'' మనియు ''ఆదినాధవిశ్వదేవుడు'' అనే ప్రథమ జైన ''తీర్థంకరు'' డిచటనే నిర్యాణము చెందిరనియు గాథ కలదు. ఈ మానస సరోవరమును టిబెట్టు భాషలో ''సోమువంగ్'' యందురు. ఈ మానసప్రాంతములోనే 'ఏసుక్రీస్తు' కూడ జ్ఞానోదయము బడసినట్లు, క్రీస్తు అజ్ఞాత జీవిత చరిత్రయనే గ్రంధములో రష్యన్ పరిశోధకుడు, లితోవిచ్ వ్రాశాడు. ఆతనికి, క్రీస్తు స్వహస్తలిఖిత గ్రంధప్రతి, టిబెట్ లోని ఒక ''గోంపా''లో లభించినదని తన పుస్తకములో పేర్కొన్నాడు.

ఈ మానస సరోవర కైలాస ప్రాంతమున సూర్యాస్తమయ సూర్యోదయ స్వర్ణకాంతి రేఖలతోపాటు కైలాస పర్వత ప్రతిబింబము ఈ సరోవరములో కన్పించునప్పుడు చూచుటకు చాలా ప్రకృతి శోభాయమానంగా నుండి చూచువారి యెదలు జలధరించును ఆనందాతిశయములతో హృదయము పొందే ఆహ్లాదము వర్ణనాతీతము. ఈ సరోవరమున యాత్రికులెల్లరును స్నానమాచరించి పునీతులగుదురు. ఇచట ఏలాంటి మబ్బులు లేకుండా వర్షము లేకుండా మంచుకురియుట ఒక ప్రత్యేక విశేషము. అందుకే ఒక కవి ''మానససరోవర్ కోన్ పర్సే బిన్ బాదల్ బర్సే'' అన్నాడు. ఈ ప్రాంతము నంతటిని ప్రశాంతతకు మారుపేరుగా చెప్పవచ్చును. అందుకే ఇచట ఇన్ని గొంపాల నిర్మాణము జరిగి ప్రాపంచిక చింతనలు లేని బౌద్ధలామాలు తాపసులు ముక్తిని సాధించుటకు నిరంతర కృషి సల్పిరి. ఈ మానససరోవరము ఎప్పుడు కూడ ఎన్ని వర్షములు వచ్చినను ఎన్నినదులు దీనిలోకలసినను ఆ నీటిని జీర్ణించుకొను శక్తి కలిగియున్నది. ఏ కాలములో కూడ నిది ఎక్కి పొరగల అవకాశము లేదు. ఒకే ఒక ''గంగాఛు'' అనే ప్రదేశమునుండే ఊట వెలువడి నదిగా ప్రవహించి ''రాక్షసతాళ్'' లో కలియును. ఈ మానస సరోవరములోనే శ్రీ మహావిష్ణువు ఆది మత్స్యావతారము దాల్చిన ట్లు కూర్మపురాణములో తెలియబర్చబడినది.

చలికాలములో ఆ నదులు ఆ సరోవరము ఆ ప్రాంతమంతయు మంచుతో నిండిపోవును. ఆ సమయాన లక్షలాది చేపలు పలురకముల పక్షులు ఇందులో చలికి గడ్డకట్టి చనిపోవును. ఒకోసారి ఆ ప్రాంతమున అకస్మాత్తుగా హిమమువలన మరియు మంచుతుఫానులవలన అనేక గొర్రెలు పశువులు కూడ నశించును. చలికాలములో పశువులతో సహా ప్రజలు తక్లా కోట్ మొదలగు క్రింది ప్రాంతములకు తరలి

వెళ్ళుచుందురు. లయకారుడగు శివుని నివాసముగా కైలాస హిమశిఖరములు మృత్యువునకును ప్రళయమునకును సంకేతములుగా మన శాస్త్రములలో చెప్పబడినవి.

పలువురు బౌద్ధలామాలు టిబెటు దేశస్థులు ఈ మానస సరోవరతీరమున మరణించుట మోక్షప్రదమని విశ్వసింతురు. భారతీయులు కూడ కాశీ మరణమును కాంక్షించి వారణాసిలో స్థిరనివాసమేర్పరచుకొన్నవా రెందరోగలరు. అదేవిధంగా మానస సరోవరమున కూడ మరణమును కాంక్షించుట అచటి లామాలకు ఆచారమైయున్నది. ఆ విశ్వాసములకు మూలము ఆ క్షేత్ర మహాత్మ్యమే యని చెప్పవచ్చును. శివుడు సంహారకర్త మరియు శ్మశానవాసిభస్మకపాలకధారి నాగభూషణుడు ప్రళయకాల విధ్వంస సూచక త్రినేత్రుడు. కావున శివసాన్నిధ్యమున మరణింపవలెనను యాచారము సహజముగా సిద్ధించెనేమో.

ఈ లయకర్త లీలలను అర్థముజేసికొనక దక్షప్రజాపతి వంటి శివశత్రువులు హరుని నిందించిన సంఘటనలు కూడ గలవు. ఒక శివద్వేషి నుడివిన నిందాలాపము లీ దిగువ నుదహరించనైనది. ✍

చాలు సిగ్గింత లేక గంజాయి బీల్చి
తినుచు ఉమ్మెంత విత్తనాల్ దేహ మెరుగ
కుండ మత్తిల్లుచు స్మశాన మండ జేసి
కొని సుఖించెడి నీమాట వినెద రెవరు

అన్నాడు.

☝ అనగా శివుని దిగంబరుడని గంజాయి త్రాగువాడని ఉమ్మెత్తవిత్తనాలు భుజించువాడని స్మశానముల నిలయముగా జేసికొని సుఖించెడి వాని మాటలు ఏమి పాటియని నిందించెను.

సరోవరములో వేడినీటి ఊటలున్నట్లుగను చెప్పబడెను. ఈ కైలాస మానససరోవర ప్రాంతమునుండియే నాలుగు పుణ్యనదులుద్భవించును. వాని ఆకారమును నీటి పరిమాణమును అనుసరించి వానికి టిబెటులోను మన దేశములోను ఈ విధంగా నామకరణము చేయబడినది. ☝

✍ (1) ''లాంఛన్ కంబాబ్'' - ఏనుగు నోటినుండి ప్రవహించుటచే ''గంగా'' యని దీనికే ''శతద్రు'' లేక ''సట్లేజ్'' యని పేరు.

(2) ''మాప్చాకంబాబ్'' - నెమలి నోటినుండి వచ్చుటచే ''కర్నాలి'' లేక ''సింధూ'' యనియు లేక ''సరయు'' యనియు పేరు.

(3) ''తాంబోక్ కంబాబ్'' - అశ్వము నోటినుండి వెడలుటచే ''పక్షు'' లేక ''బ్రహ్మపుత్ర'' యని పేరు.

(4) ''సెంజెకంబాబ్'' - సింహము నోటినుండి వచ్చును గావున ''సీత'' లేక ''సింధు'' యనునామము వచ్చినది.

ఆ మానస సరోవర పరిక్రమను మేము రెండురోజులలో పూర్తిచేసినను ఒకే రోజు పూర్త చేయగల ''లామా''లు కలరు. మరియు కొందరు టిబెటు దేశస్థులు సాష్టాంగ ప్రణామములు చేయుచు ఇరవై ఎనిమిది రోజులలో ఒక పరిక్రమను పూర్తిచేయుదురు.

అచట శివశక్తి తంత్ర ఉపాసనాక్రమములు హైందవ అవతారవాద పునర్జన్మ వాదములు విగ్రహారాధన మరియు పురాణోక్తములగు పలు సాంప్రదాయ విశ్వాసములు బౌద్ధమత సాంప్రదాయములపై ప్రబల ప్రభావముద్రలు వేసినవి. దేవీదేవతలను గూర్చిన అనేక విశ్వాసములు టిబెటు బౌద్ధములో చోటు చేసికొన్నవి. మరియు దీనిని గూర్చిన యెన్నో హిందూ పురాణగాధలున్నవి.

ఈ సందర్భమున దేవీభాగవతములోని ఈ దేవీ విశ్వరూప పాంచశక్తుల వివరములను పాఠకుల ఆసక్తి కొరకై పొందుపరచుచున్నాను.

## దేవీ విశ్వరూప సందర్శన

దేవీ చెప్పి విధము : ''చరాచరాత్మకమైన నీ సర్వజగత్తు నామాయా ప్రకృతియే. అందుచే ప్రపంచమెల్ల మిధ్యయగును. నా రూపమే ఈ సృష్టిగాన దానికి వేరే స్వరూపము లేదు.

అధిష్ఠాన సత్వమువల్ల దానికి సత్యమునాస్తి. నేనే జగమునుసృజించి యందు ప్రవేశించితిని. అజ్ఞాన భ్రాంతులవల్ల అది వేరే ప్రపంచముగా మానవులకు భాసించుచున్నది. తత్వ పరమాత్మ దృష్ట్యా అది భ్రాంతి మాత్రమే. నేను ఉచ్చ నీచ భేదములులేక అద్దమునందు ప్రతిబింబమువలె - జగమెల్ల భాస్కరుడు ప్రకాశించినను దూషితుడుకానట్లు - నేనును జీవుల కర్మ సంబంధ గుణాగుణములచే సక్తురాలనుకాను. భేదము జ్ఞానకల్పితము గాదు. జీవేశ్వర విభాగమును అజ్ఞాన కల్పితమే. మాయావశమున జీవుడనంతముగా భాసించునట్లే ఈశ్వరుడు మాయా విలాసమున ననంత రూపు డైభాసించినను స్వభావమున అభేదమే భేదభ్రాంతి నా మాయయే. కారణదేహానీశ్వరుడు లింగదేహాభిమాని హిరణ్యగర్భుడు స్థూల దేహ విరాట్టు బ్రహ్మ విష్ణు రుద్రులు గౌరి బ్రాహ్మి వైష్ణవి సర్వమును నేనెయై నొప్పుచున్నాను. సూర్య చంద్రులు నక్షత్రములు పశుపక్ష్యాదులు తస్కర ఛండాలురు క్రూర కర్మలు

సత్కర్మలాచరించువారు స్త్రీ పురుషులు, బ్రహ్మాది స్తంబ పర్యంతము, అణువు మొదలు మహద్వస్తువు వరకు బాహ్యాంతరమున సచరాచరమున నేనే నిండి యున్నాను. కాన ఇదిగో నా విశ్వరూపము'' యని.

ఆ భువనేశ్వరి, కామేశ్వరి తన విరాడ్రూపమును చూపుచున్న విధి ఎట్లన అన్నిటికి పైనున్న సత్యలోకము శిరస్సు, సూర్య చంద్రులు నేత్రములు, దిక్కులు చెవులు, వాక్కు వేదములు, వాయువే ప్రాణము, విశ్వమే హృదయము. భూమి జఘనము, ఆకాశము నాభి, జ్యోతిశ్చక్రము ఉరస్థలము, మహర్లోకము కంఠము, జనలోకము ముఖము, తపోలోకము లలాటస్థానము, ఇంద్రాదులు బాహువులు, అశ్వనీ కుమారులు నాసాపుటము, పృథివి గుణము, గంధమే వాగ్వేంద్రియము, ముఖము అగ్ని, రాత్రిందినములు కనురెప్పలు, కనుబొమలు బ్రహ్మస్థానము, జలము తాలువు (దౌడ), రసము జిహ్వ, దంష్ట్రా రూపము (పళ్ళు) యముడు, స్నేహకల దంతములు, హాసము మాయ, ఊర్ధ్వోష్టములజ్జ, అధరోష్టము లోభము, సముద్రములు కుక్షి, గిరులస్థులు, నదులు నాడులు, వృక్షములు కేశములు, వయస్సు కౌమార యౌవన జరావస్థలు, మనస్థానము చంద్రుడు, విజ్ఞానశక్తి హరి, యంతఃకరణము రుద్రుడు అతల వితల సుతల తలాతల మహాతల రసాతల పాతాళాది యధోలోకములు, కటి మొదలు పాద పర్యంతము గల అవయవస్థానములుగా విరాజిల్లుచున్నవి. ఇట్టి విశ్వరూపమును గాంచుటకు సాధారణ నయనములు జాలవు. దివ్యనేత్రముల దివ్యులెల్లరు గాంచగలిగిరి. కనులు విస్ఫులింగములు రాల్చుచు దంష్ట్రా కరాళ వదనమున బాహువుల నానా విధాయుధములు ధరించి సహస్రములు శిఖరములు కోటి విద్యుల్లత బోలిన దేహకాంతి గల్గి కంటికి హృదయమునకు భీతిగొల్పు ఘోరరూపమును దాల్చి ఆమహాదేవి సాక్షత్కరించెను. దేవాదిదేవులే ఆ రూపము జూడజాలక మూర్ఛనొందిరి. ఇంతటి శక్తి సంపన్నురాలగు ఆ భువనేశ్వరీ మాతయే గదా సర్వాంతర్యామి. ☝

శ్లో. న జాయతే మ్రియతే వా కదాచి న్నాయం న బభూవ కశ్చిత్ ।
అజో నిత్య శ్శాశ్వతోయం పురాణో న
హన్యతే హన్యమానే శరీరే ॥
హింతా చే న్మన్యతే హంతుం హత శ్చే న్మన్యతే హతం ।
ఉభౌ తౌ న విజానతో నాయం హంతి న హన్యతే ॥ (భగ)

**దేవీ పాంచ శక్తులు : (దేవీ భాగవత వివరణ) :**

☝ సృష్టికి పరాప్రకృతియైన దుర్గ, రాధ, లక్ష్మి, సరస్వతి యనునవి పంచశక్తులు -- ప్ర-కృ-తి: యనగా : సృష్టి నిమిత్తమైన దేవీ రూపాంతరము సగుణము. స్వీయ వికృతి. అందున్న త్రితారలు గుణత్రయ సూచకములు. మరియు

ఆ ప్రకృతియే త్రిగుణాత్మకమైన శక్తి సమన్విత సృష్టికి ప్రధాన కారణము. మాయాయోగమున దేవి సృజన కార్యమునకై తన దక్షిణార్ధాంగమున పురుషుడు మరియు వామార్ధాంగమున ప్రకృతి యైనది. అగ్నికి దాహకశక్తివలె ఆత్మకు ప్రకృతి అభేదముగ నిత్యయుక్తమైయున్నది. శాశ్వత సత్యరూపమున బ్రహ్మ భాసించుట ''సర్వం బ్రహ్మమయ'' మని యోగీశ్వరుల మతము. ఈశ్వరి నానారూపముల నావిర్భవించి మూల ప్రకృతి ఆద్యాశక్తి యాజ్ఞ వలన సృజన కార్యవిభాగమునకై పాంచశక్తులుత్పన్నమైనవి.

మొదటిది గణేశమాత దుర్గ. శివరూపిణి. శివప్రియ నారాయణి. విష్ణుమాయ పూర్ణబ్రహ్మ స్వరూపిణి. బ్రహ్మాదులు మునులు మనువులచే నుతింపబడి సర్వమున కధిష్ఠాత్రి, సనాతని, ధర్మ సత్వ కీర్తి సుఖ మోక్ష హర్ష శోక దుఃఖాదుల నశింపచేసి శరణాగతదీనుల రక్షించు తేజస్వరూపిణి. అనంతగుణ స్వరూపిణియైన పంచశక్తుల మధ్యగల ''దుర్గ'' యొక్క గుణ విశేషములుగా చెప్పబడెను.

రెండవది సర్వ సంపత్స్వరూపిణి, కామాధివర్జిత, భక్తులయెడ ప్రీతి సర్వసస్యాత్మిక, జీవనోపాయ రూపిణి, వైకుంఠమున మహాలక్ష్మి, స్వర్గమున స్వర్గలక్ష్మి, రాజ్యమున రాజ్యలక్ష్మి, గృహమున గృహలక్ష్మి, సర్వప్రాణ ద్రవ్యాదులందు శోభారూపిణియగు, లక్ష్మి స్వరూపురాలైన శక్తి విలాసము రాధ.

మూడవది సరస్వతి. ఆమెయే బుద్ధి కవిత మేధ ప్రతిభయను నొప్పుచున్నది. బోధా స్వరూపిణి సందేహ నివృత్తిణి వీణాపుస్తకధారిణి శుద్ధ సత్వ స్వరూపిణి తప స్వరూపిణి. ఈమె లేనిచో లోకము ప్రాణ రహితము. వాచాశూన్యమునై యుండెడిది.

నాల్గవది వర్ణ సమామ్నాయమునకు, వేదాది ఛందస్సులకు మాత బ్రహ్మణ్య తేజోరూపిణి, సర్వ సంస్కారమూర్తి, పవిత్ర రూపిణి సావిత్రి గాయత్రి బ్రహ్మలోకవాసిని నిర్వాణ పదము నిచ్చునది. ఆమె పాదధూళిచే సర్వజగత్తు పవిత్రము కాగల సావిత్రి శక్తి.

అయిదవశక్తి పంచప్రాణ స్వరూపిణి శక్తులన్నింటిలో సౌందర్యవతి. పరమానంద రూపిణి. శ్రీకృష్ణ పరమాత్మ యందధిదేవత. రాసమండలమున నుద్భవించి దానికలంకారభూతురాలైన రాసేశ్వరి గోలోకవాసిని. నానాలంకార శోభినియగు నామె పాదస్పర్శవల్ల వసుంధర పవిత్రమై శ్రీకృష్ణ వక్షస్థల నివాసినియైన రాధిక విశ్వమునగల దేవీ ప్రకృతులలో నొకటి. విశ్వమున దేవీ ప్రకృతులే పంచవిధమున వ్యాపించియున్నవి. ☝

✍ ఇట్లే .నీ శక్తులు లోకమున ఆయా సమయములలో సృజింపబడి పౌరాణిక గాథను కలిగియున్నవి. అందు :

1. గంగ-లోకపావని తులసి కల్పవృక్ష స్వరూపిణి.
2. షష్ఠీదేవి - శిశురక్షావిధిగొని పూజింపబడునది.
3. మంగళ చండిక - మంగళవారము నర్చన చే యుదురు.
4. కాళి - సంహారశక్తి పురుషార్ధముల ప్రసాదించునది.
5. స్వాహాదేవి - అగ్ని యొక్క పత్ని. దేవతాపూజని.
6. దక్షిణ - లేక దీక్షయను శక్తి యజ్ఞపత్ని. సదా సేవ్యురాలు.
7. స్వధ - పితృపత్ని - ఈమె పూజచే దానాదుల ఫల మందును.
8. స్వస్తి దేవి - వాయుపత్ని - ఇచ్చుపుచ్చుకొను ఫలమిచ్చునది.
9. పుష్టి - గణేశపత్ని - జీవులన్నింటికి బలము నిచ్చునది.
10. తుష్టి - అనంతునిపత్ని - జీవులకు తృప్తి నిచ్చునది.
11. సంపత్తి - ఈశాన పత్ని ఈమెను స్మరించిన దరిద్ర బాధలుండవు.

ఇట్లే ధృతి, సతి, దయ, ప్రతిష్ట ,కీర్తి, క్రియ, మిధ్య మరియు కాలాగ్ని, నిద్ర,. సంధ్య రాత్రి దివములు - ప్రభావాహిక ,అదితి,దితి, మున్నగునవి శక్తి దేవతలుగా చెప్పబడినవి. ఇట్లు ప్రకృతికళ లనంతములై లోకమును జీవింప జేయుచున్నవి. అనంతమైన ప్రకృతి కిట్లు సాహచర్యము లేనిచో అణువైనను లోకమున నిలువజాలదు.

యాత్రికులీ మానస సరోవర జలమును ప్లాస్టిక్ డబ్బాలలో నింపుకొని పదినుండి యాభై లీటర్ల వరకు వెంట తెచ్చుకొందురు. గంగాజలము ఇతర హిమనదీ జలముల కన్నను మధురాతి మధురముగా నుండి ఈ మానస సరోవర జలమును అత్యంత పవిత్రముగా భావించి శుభా శుభ కార్యములలో వాడుకొనుచు జీవితాంతము వరకే కాక కొన్ని సంతతుల వరకును అమృతమువలె భద్రపరచుకొనుట ఒక విశేష ఆచారము. ఒక్కమాటలో చెప్పవలెనంటే వంద కోట్ల జనాభాగల హైందవుల బౌద్ధుల జైనుల అతిపవిత్రమైన దర్శనీయ పుణ్యక్షేత్రమే ఈ కైలాస మానస సరోవరములు.

వీని దర్శనమునకు ప్రత్యేక అర్హతలేమియు లేవు. డాక్టరుకాని, పేషెంటుకాని, ప్రొఫెసరుకాని, సైంటిస్టుకాని, ఖగోళ జంతువృక్ష ఇతర శాస్త్రజ్ఞులు కాని, చారిత్రకులుగాని సంఘసేవకుడుగాని, యాత్రికుడుకాని, వ్యాపారి, రాజనీతిజ్ఞుడు, గృహస్థు, సన్యాసి, ధనికుడు, పేదవాడు, ఆడ, మగ ,హైందవులు, హైందవేతరులు ఎల్లరును ఈ ప్రకృతి శోభను తిలకించి పులకించి తన్మయత్వమునంది జన్మసాఫల్యము

గావించుకొనవచ్చును. ప్రస్తుత మీ ప్రాంతములో వృద్ధ సాధువులుగాని వృద్ధలామాలుగాని తాంత్రికులుగాని అమోఘ మహిమా సామర్థ్యముగలవారు రాజహంసలు ఎవరుగాని మాదృష్టికి రాలేదు. పెక్కేండ్లు ఆ ప్రాంతమున సంచరించిన శ్రీప్రణవానందస్వామిగారి దృష్టికి కూడ రాలేదు.

టిబెటులో ఇంటింటికి ఒకరిద్దరు లామాలుగామారుదురు. ఆ లామాలు సన్యాసులవలె వైరాగ్యముతో నిరంతరము దేశమున పర్యటించుచుందురు. మరి కొందరు గృహస్థాశ్రమ ధర్మమునుకూడ పాటింతురు. కొందరు లామాలు ఆ యా గుహలలో ద్వారములను బంధించుకొని లోపలనే సమాధిమగ్నులై యుందురు. వారికి పరిసర గ్రామవాసులు ప్రతిరోజు విధిగా ఆహారమును సమకూర్చుచుందురని పలువురు యాత్రీకులు పేర్కొనియున్నారు. అట్లు సమాధులలో జీవించు లామాలను వారిని విధిగా పోషించు గ్రామస్థులను ఎంతటి త్యాగనిరతులో వేరే నిరూపణ అవుసరముండదు. అట్లే హిమాచల ప్రాంతమున పలువురు విరాగులు సాధువులు మౌనులు సిద్ధులు నివసించుచున్నారు. వీరిని మనము కుంభమేలాలవంటి సందర్భములలో వేల సంఖ్యలో చూచి ఆశ్చర్యచకితుల మగుదుము. ఎట్లైనను మనస్తత్వ శాస్త్రజ్ఞులు వైరాగ్య ప్రవృత్తికి చెందిన మనస్తత్వ వివిధాంశములను ఇంకను విపులముగా పరిశోధించి వివరించవలసిన అవుసరము కలదు. జీవన పరిస్థితులలో భావనాత్మకమగు ఆత్మరక్షణను సంకల్పించుకొనుటయే ఈ నివృత్తి ధోరణులకును దివ్యశక్తుల మహిమలపైగల విశ్వాసమునకును ఆధారమై యుండవచ్చునని తోచును.

**రాక్షస తాల్ :**

ఈ సరస్సు మానస సరోవరమునకు ఎడమవైపున పదికిలోమీటర్ల దూరములో నూట ఇరవై చదరపు కిలోమీటర్ల వైశాల్యముతో నున్నది. అచటి నుండి గూడ ఉత్తరాన కైలాస్ దక్షిణమున గుర్లా మాంధాతా పర్వత పంక్తులు తెల్లగ కన్పించును. పురాణములో లంకాధీశుడగు రావణబ్రహ్మ అచటనే పలు సంవత్సరముల తప మాచరించి కైలాస పర్వత శిఖరమును పెకలించినట్లు అందుచే దానికి ''రాక్షసతాళ్ లేక రాక్షసహ్రద'' లేక ''రాక్షస సరోవర''మని నామములు వచ్చినట్లును చెప్పబడెను. టిబెట్టు భాషలో దీనిని ''లాంగర్ సో'' అని అందురు. అనగా అయిదు పర్వతములును దానిలోనున్నవని యర్థము. అది చలికాలములో గడ్డకట్టుకొనిపోవును. ఉత్తర పడమరల మూలన నాల్గు కిలోమీటర్ల దూరములో ''బెంజి గొంపా'' కలదు. ఈ సరోవరము నెవ్వరును పరిక్రమించరు. దానిలోని నీటిని త్రాగరు. త్రాగినచో కడుపులో నొప్పివచ్చునని చెప్పుదురు. అందులో పిశాచములు కూడ ఉండునని

యశ్లోక పంచక మిదం లలితాంబికాయా
సౌభాగ్యదం సులలితం పఠతి ప్రభాతే
తస్మై దదాతి లలితా ఝడితి ప్రసన్నా
విద్యాం శ్రియం విమలసౌఖ్య మనంత కీర్తిమ్.॥
(ఇతి శ్రీమచ్ఛంకరాచార్య విరచిత శ్రీ లలితాపంచకమ్)

నోట్: ఈ పుస్తకం రెండవముద్రణ దాదాపు 11 సం॥ల తర్వాత జరుగుచున్నది. నేను మానస సరోవరము పోయి వచ్చిన పిదప 14 సం॥లు దాటినవి. అంతకు ముందు, అమర్నాథ్, బదరీ, కేదారము, గంగా, యమున, సరయు, కావేరి, కృష్ణా, గోదావరి, నర్మదా [illegible] నదుల నీటిని తెచ్చితిని. ప్రతి నీటి బాటిల్ అడుగున మట్టి కణములు పేరుకొనెను. విచిత్రమేమో కాని ఈ మానస సరోవరం నీటిని ప్రత్యేకించి పరీక్షించిన బిందువంత మలినము కానరాక నేటికి స్వచ్ఛముగా [illegible], తెల్లగా ఉన్నది.





[illegible]

# ఇరవై మూడవ అధ్యాయం

## దార్చెన్ విడిదికి

శ్లో : ఉపాసకానాం య దుపాసనీయ
ముపాత్తవాసం వటశాఖిమూలే
త ద్ధామ దాక్షిణ్యజుషా స్వమూర్త్యా
జాగర్తి చిత్తే మమ బోధరూపమ్.
అద్రాక్ష మక్షీణదయానిధాన
మాచార్య మాద్యం వటమూలభాగే
మౌనేన మందస్మిత భూషితేన
మహర్షి లోకస్య తమోఽనుదన్తమ్.

✍ ది. 3-8-1983వ తేదీన మేము ఉదయముననే లేచి తేయాకు పానీయములు సేవించి మానససరోవరములో స్నానములు ముగించితిమి. తరువాత నేను పూజ, రుద్రాభిషేకమును ముగించితిని. ఇంతలో ''తక్లాకోట్'' నుండి జీపు అందులో చైనా మేనేజరుతోపాటు అచట మేము వదిలి వచ్చిన మిత్రులు కులకర్ణి ధావేగార్లు కూడ వచ్చి చేరిరి. వారు మాచెంతకు వచ్చి సరోవరమును తిలకించి ఆనందించి వెంటనే స్నానములు చేసిరి. అందులో ఎవరు ఎప్పుడు స్నానమనే పదమును వాడినను నీటిలో ఒకటి రెండు మునకలని భావించాలి. చైనా మేనేజరు వారికి అచటనుండియే కైలాసముకూడ చూపి మరల తక్లాకోటకు తీసుకొనివెళ్ళే ఉద్దేశ్యము వలన వారిని తీసికొని వచ్చినట్లు చెప్పిరి. ఎందుకనగా రామకృష్ణన్‌గారి మృతదేహమును గూర్చి భారత ప్రభుత్వము నుండి ఏ సమాచారము లేదు. కాని వారు వెంటనే తక్లాకోట్ తిరిగిపోవుటకు అంగీకరించలేదు. పైగా ఇన్ని కష్టములపడి ఇంతదూరము వచ్చి యాత్రా దృశ్యములను చూడకుండ కనీసము కైలాస పరిక్రమనైనా సలుపకుండ మరలిపోవుట యాత్రంతయు నిరర్థకమగును. ఇది మాలీడరుకును మాకును నచ్చలేదు. అందుచే కైలాస క్యాంపువరకు వెళితే ఆబృందములో మానససరోవర పరిక్రమ చేయలేని వారెవరైన ఉన్నచో ధావే కులకర్ణిగార్లకు బదులుగా పంపుట శ్రేయమని తెలియజేయగా మేనేజరు ఒప్పుకొనెను. వీరు మరియు డా॥ గోడ్బోలే కూడ జీపులో ''దార్చెన్ క్యాంపు''కు వెడలిపోయిరి. ఈ లోగా మా బస్సుకూడ వచ్చి చేరెను.

దాదాపు పదకొండు గంటలకు మేము సామానులు బస్సు ఎక్కించి బయలుదేరి ''గంగాఛూ'' మున్నగు నదులు దాటుచు ఎత్తు పల్లముల వెంట మైదాన ప్రదేశములగుండా ప్రయాణము చేయుచుంటిమి. పరిసరములను ఎదురుగా కనబడు

''కైలాస్''ను చూచుచు మరెన్నో నదులు దాటుచు పన్నెండున్నర గంటలకు ''దార్చెన్ క్యాంపు'' బస్సులో జేరితిమి.

కైలాస్ పరిక్రమ ముగించిన మా మిత్రబృందము మమ్మాహ్వానించి పరస్పర యోగక్షేమముల గూర్చి విచారించిరి. వారు కైలాస్ పరిక్రమ రెండవ రోజు చాల కఠినమనియు తీసుకొనవలసిన జాగ్రత్తలగురించి చెప్పిరి. ఇంతలో డా॥ రంగాచారి మరియు శిర్షాద్‌లు మానస సరోవర పరిక్రమ చేయ సంకల్పించనందున వారు చైనా మేనేజరుతో జీపులో బయలుదేరి ''తక్లాకోట్'' వెళ్ళిపోయిరి. మేము మా సామాను క్యాంపు గదులలో చేర్చగా మా మిత్రులు వారి సామానులు బస్సెక్కించిరి. వారు మాతో సెలవు తీసుకొని ''హిర్'' గ్రామమునకు బయలుదేరి వెళ్ళిపోయిరి. మేము వంట చేసుకొనే ఓపికలేక మా చెంత నున్న ఫలాహారములనే భుజించి విశ్రమించితిమి.

తక్లాకోట్ తర్వాత ఈ కైలాస మానస పరిక్రమలో భోజనములు మేమే ఏర్పాటు చేసుకోవాలి. చైనీయులు వంటపాత్రలు పడకలు గుర్రాలు బస్సు మాత్రము సమకూర్చి తక్లాకోట్‌లో ఆరుపూటల భోజనమునకు మరియు 'లిపుపాస్'' నుండి రానుపోను గుర్రాల ఏర్పాటుకు మాత్రమే దాదాపుమూడు వేల అయిదువందల రూపాయిలు వసూలుచేసి యాత్రికులను నిలువుదోపిడీ చేయుచుండిరి.

మేము సాయంత్రము కొంతదూరము వాహ్యాళికి వెళ్ళి మరునాడు పోనున్న దారిని చూచి ప్రకృతిని తిలకించి కొన్ని ఫోటోలు తీసుకొంటిమి. ఆచటనుండి కైలాస శిఖరము పై భాగము మాత్రమే కన్పించుచు చిన్నదిగా తోచును. మా క్యాంపునకు దగ్గరలోనే గల ''ఉమాఛూ'' అను నది రెండుపాయలై పారుచున్నది. ఆ దగ్గరలోనే గల ఒక లామాను దర్శించ ప్రయత్నించితిమి. కాని ఆయన పరిక్రమకు వెళ్ళెను. సాయంత్రము మా మిత్రులు వంట ప్రయత్నములో చేరిరి. అచటనున్న ''దోర్జి'' స్టౌలు వెలిగించుట నీరుతెచ్చు మున్నగు పనులలో సహకరించెను. ఆ తరువాత ఎనిమిది గంటలకు భోజనములు చేసి రాత్రి కొంతసేపు భజన చేసితిమి. తర్వాత హాయిగా గాఢ నిదురలో మునిగిపోయితిమి.

నిద్రాదేవి అతి పవిత్రమైనదనియు అందరికిని అందుబాటులో నుండునది కాదనియు హిందూ ధర్మ శాస్త్ర నిర్ణేతల యభిమతమైయున్నది. అది సత్పురుషుల సజ్జనుల సత్క్రియలాచరించు వారినే వరించునని తెలియజేయబడినది. ఈ సందర్భములో మరికొందరి యభిప్రాయమేమన మొద్దునిదుర బోవువారు కుంభకర్ణాంశ సంభూతులని తామస గుణప్రధానులని మూర్ఖులని వివరించియున్నారు. ఒకచోట దేవతలకు నిదురయే లేదని ''నిర్నిద్రు''లని నామకరణము చేయబడినది - నిద్రకు కుంభకర్ణుని పేర్కొందురు. కాని ఆ కుంభకర్ణుడుకూడ బ్రహ్మావర ప్రసాదము

వలననే నిద్రను బడిసినాడు. నిద్ర బ్రహ్మదత్త ఫలము. భారత ఉద్యోగ పర్వ విదురనీతియందు ధృతరాష్ట్రుడు తనకు నిదురలేమిని గూర్చి విదురుని అడుగగా అందుకు విదురుడు నాల్గు విధములైన మానవుల చెంతకు నిదురాదేవి చేరదని స్పష్టీకరించినట్లు నీ పద్యము ద్వారా తెల్యనగును.

క. బలవంతుడు పై నెత్తిన
బలహీనుడు ధనము గోలుపడిన నతడు మ్రు
చ్చిలనేయువాడు కామా
తురుడు డిలలో నిద్ర లేక కుందెద రధిపా.

ధృతరాష్ట్ర మహారాజా! బలవద్విరోధము గలవానికిని పేదయై ధనము బోగొట్టుకొన్న వానికిని దొంగతనము చేయగోరువానికి కామాంధునకు లోకములో నిదురరాక బాధపడుదురనెను.

అంతేగాక తన మానసపుత్రికయైన నిద్రాదేవిని భూలోకమున కంపించుచు విధాత యిట్లు సెలవిచ్చియున్నాడు.

సీ. సత్కృతల్ వినువారి సన్నిధి జేరుము
జూదరులను పొందచూడకమ్మ
చదివి విద్యాభ్యాసకుల జేరియుండుము
త్రాగుబోతుల మది దలుపకమ్మ
స్వస్త్రీల గమనించు వారితో గూడుము
పర వధూరతుల కేల్ బట్టకమ్మ
జపము జేసెడివారి సరసన జేరుము
చోరుల వెనువెంట పారకమ్మ

గీ. రోగమున బాధితుల కడ కేగవలదు
తొలగి చనవలె యిటువంటి దురితమతుల
పరమపావని జనవంద్య భవ్య చరిత
పొలతి నిద్రావధూటి నీభువికి జనుమ. (అర్థము సుబోధము)

ఇది ఎట్లు అయినను నిద్ర అతి పవిత్రమైనదని భావము -

మా మానస సరోవర పరిక్రమ చేయదలంచని వారిలో షణ్ముగ సుందరం కూడా చేరియుండెను. వారిని తక్లాకోట్ పంపుదామంటే వారికి తమిళము తప్ప మరే భాషయురాదు. మేమే వారితో ఇబ్బంది పడుచుంటిమి. మరియు 'చెడ్డి క్యాంపు'లో ఒంటరిగా ఉంచలేదు. పైగా కైలాసవాసునిపై అపరిమిత భక్తి. అందుచే తాను ఈ

''దార్చెన్ క్యాంపు''లోనే మా పరిక్రమ పూర్తియగు వరకు ఉండుటకు నిర్ణయించు కొనెను. ✍

☝ దార్చెన్ చిన్న గ్రామము. 4910 మీ. గల ఎత్తు ప్రదేశము. గ్రామములో యాభై అర్వై మంది కంటె ఎక్కువ వుండరు. ఆ గ్రామవాసులందరును చలికాలములో క్రింది ప్రాంతములకు వెడలిపోవుదురు. కాని ఆచట గల 'ధోర్జీ' ఆయన భార్య అచటి గ్రామ, లామాలు నాల్గుమాసముల గ్రాసమును సమకూర్చుకొని అచటనే యుండగలమని తెల్పిరి. అచట భరించరాని చలి. మరియు విపరీతముగు గాడ్పులు (సుడిగాలులు) వీచుట సర్వసాధారణము. మా క్యాంపులోనున్న ధోర్జి దాదాపు నూట ఇర్వై పైబడి కైలాస పరిక్రమలు సలిపెనట. ఒక రోజులోనే వీరు తమ పరిక్రమను పూర్తి చేయుదురు. కైలాస పర్వతములో గల రహస్యములు వీరికి తెలిసినను ఇతరులకు చెప్పరు. ☝

✍ టిబెటులో కొన్ని తాంత్రికాచారములు నిగూఢముగ కొనసాగుచుండును. వీరు యంత్ర, మంత్ర, తంత్ర బలులు ఉపాసనా విధులను రహస్యముగా నుంచి గురుశిష్య పారంపర్యగా నేర్చుకొని అమలుపరచుచుందురు. మంత్ర, తంత్ర, బలులు, ఉపాసనాదులచే అణిమ, గరిమ, లఘిమ, మహిమ, ప్రాప్తి, ప్రాకమ్య, ఇషిత్వ, వసిష, కామ, వశీయశక్తులు చేకూరగలవని వీరు విశ్వసింతురు. తంత్రోపాసనలో మద్య, మాంస, మీన, ముద్రా, మైధున, వినియోగమును రహస్యముగా జరుపుచుందురు. అవన్నియు సిద్ధులు లేక మహిమలను పొందగలమను విశ్వాసముపై నాధారపడియున్నవి. ఈ విధముగా రహస్య సంప్రదాయముల ననుసరించు వారిని, గుహ్యా సమాజీయులని చెప్పుదురు. హిమాలయ ప్రాంత సంస్కృతిలో ఇలాటి యాచారములు ఇప్పటికిని కొనసాగుచుండుట చూడగలము. ✍

శ్లో : ప్రవృత్తే భైరవీచక్రే సర్వవర్ణే ద్విజా యతః।
నివృత్తే భైరవీచక్రే సర్వవర్ణా ః పృథక్ పృథక్ ॥
మద్యం మాంసం చ మీనం చ ముద్రాం మైధున మేవ చ ।
యేతే పంచమ కారస్యర్మోక్షదాయి యుగే యుగే॥
పీత్వా పీత్వా పునః పీత్వా యావ త్పతతి భూతలే ।
పున రుత్థాయ వై పీత్వా పునర్జన్మ న విద్యతే ॥

☝ టిబెటనుల విగ్రహశిల్ప వివరముల అవగాహన కొరకై ఈ దిగువ కొన్ని అంశములను పాఠకుల దృష్టికి తేగోరుచున్నాను.

టిబెటన్లు తమ ఇష్టదేవతను ''ఇదం'' అంటారు. తారాదేవి (శక్తి)ని ''డోల్మా'' అంటారు. 'ఇదం' దేవతలు ''యాబ్సేయుం'' అను పురుషశక్తి రూపాల కలయికతో యేర్పడడం అంటారు. పురుష దాతువును ''వజ్ర'' అనీ శక్తి ధాతువును ''గర్భ'' - అనీ ఈ రెండింటి కలయికను ''యాజ్యుం'' సమావేశమని వారు విశ్వసిస్తారు. రెండు త్రికోణాలు తలక్రిందులుగా ఒకటి కొకటి కలసియున్న షట్కోణ మధ్యగత స్థానంలో వీరి దేవతా మండలాలు ఉంటాయి. ఈ రెంటినీ ''లింగం - యోని'' సమాగమమని వీరు శివశాక్తేయ తంత్రాలను ఉపాసిస్తుంటారు. తదనుగుణమైన ఆరాధనారీతులను అనుసరిస్తారు. బలులు ఉచ్చాటనలు మున్నగు తంత్ర ఆచారాలు అమలులో ఉంటున్నాయి.

టిబెటన్ లామాలు పుష్యమాసంలో ''ఛామ్'' అనే దేవతను ఉపాసిస్తారు. ఒక కొండగుహను ఎంచుకొని దానికి దిగ్బంధన జరిపి లామా అందులో ప్రవేశిస్తాడు. గుహలోనే ఉంటూ ప్రతి రోజూ జపారాధనలు కొనసాగిస్తాడు. అక్కడనే వంటలు చేసి భుజిస్తూ సాధన జరుపుతూ ఉంటాడు. సహస్రనామాలు లక్షకోటి నామజపాలు పూర్తిచేసిన పిదప ''ఛామ్'' దేవతకు పూర్ణాహుతులిస్తాడు. అగ్నిలో అనేక ధాన్యాలతో చేసిన పిండిముద్దలు గడ్డి (దర్భ) పోచలు నవధాన్యాలు బియ్యం గోధుమ వంటకాలు నెయ్యి కర్ర ముక్కలు అగ్నిలో ఆహుతి చేస్తారు. దీనివల్ల ఇష్ట దేవత ''ఛామ్'' సాక్షాత్కరిస్తుందనియు ఇష్టకామ్యాలను నెరవేరుస్తుందనియు వీరు విశ్వసిస్తారు. ఆ విధంగా శాక్తేయ (వజ్ర) తంత్ర విధులను ఆత్మసుఖానికి టిబెటన్ లామాలు అనుసరిస్తుంటారు.

టిబెటన్ బౌద్ధ ఉపాసనా క్రమంలో అనేక యంత్రాలు బీజాక్షరాలు సంఖ్యలు సంకల్ప సంకేతాలు విధులుగా పాటింపబడుతుంటాయి. వీరు 'భూమిపై' నాలుగైదడుగుల మేరకు ఆయా దేవతా యంత్రాలు అమర్చి వాటిని రకరకాల రంగులపిండితో అలంకరిస్తారు. మాంధాత పర్వతానికి చెందే దేవతలపేర్లు ''సాంగ్డుమ్'' ''జిగ్గీ'' ''కున్రిగ్''గా వాడుకలోనున్నవి. ఇష్ట దేవతలను వారికి సంబంధించిన అనేక ఇతర దేవీ-దేవతలను యంత్రాలలో ఆయా స్థానాలలో అవాహన చేయడం జరుగుతుంది. ఆయా ఉపాస్యయంత్రాలు భారతదేశం నుండి ఆయా లామాలు టిబెట్కు చేరవేసికొన్నవిగా ఉన్నాయి. ఆయా యంత్రాలపై వారివారి పేర్లు కూడా పొందుపరచియుంచారు.

కైలాస శిఖర దేవుడిని టిబెటనులు ''దెమ్ఛాగ్'' అంటారు. ఈ దేవుడే నేపాల్ సరిహద్దులో గల ''లాప్చీ'' మరియు 'లాసా'కు రెండువందల మైళ్ళ దూరములోగల ''చారీ'' శిఖరాలకు కూడ అధిదేవత. ఆనంద పారమార్ధానికి

సంకేతమైన ఈ దైవాన్ని గూర్చి అనేక వర్ణనలు, స్తోత్రాలు, కీర్తనలు టిబెట్ మత గ్రంధాలలో వ్యాప్తిని కలిగి ఉన్నాయి.

దెమ్‌ఛాగ్ చతుర్ముఖుడు. మధ్యతల నీలం, కుడితల తెలుపు, ఎడమతల ఆకుపచ్చ, వెనుకవైపుతల ఎరుపురంగులో ఉంటాయి. ఈ శిరస్సులు - భూమి జలము అగ్ని వాయు-వులకు సంకేతాలు. జాలి, దయ, ప్రేమ, న్యాయాలకు కూడ ఈ రంగులు చిహ్నాలని చెప్పవచ్చును.

ఈ నాలుగు తలలలో ప్రతితలయు ఐదుకపాలాలు గల్గిన కిరీటాలతో అలంకరింపబడి యుంటుంది. అవి పంచేంద్రియముల జ్ఞానానికి సంకేతాలు. ఈ ముఖాలకు దంతాలు అమర్చబడి అవి పాపాలను నమిలివేయుటకు గుర్తుగా ఉంటాయి. ప్రతి తలపై వెంట్రుకలు కొప్పు వేయబడియుంటాయి. ఒక్కొక్క ముఖానికి మూడు కండ్ల చొప్పున భూ స్వర్గ నరక లోకాలకు భూత భవిష్యత్ వర్తమానాలకు సంకేతాలుగా ఉంటాయి. కిరీటంపై గల ప్రతి కపాలానికి ఒక వజ్రం లేక ముత్యం పొదుగబడి అది జ్ఞాన సిద్ధికై ప్రతీకగా ఉంటుంది. తలపైగల దంతపు చక్రం ధ్యానానికి ప్రతీకగా ఉంటుంది.

చెవిపోగు క్షమకూ, కంఠహారం దాతృత్వానికీ, చేతి కంకణాలు పవిత్రతకూ, నడుముపట్టా శక్తికీ ప్రతీకలన్నమాట. నీలవర్ణ దేహం శాశ్వతత్వానికి గుర్తుగా ఉంటుంది.

డెంఛాక్ దేవతకు పన్నెండు చేతులు ఉంటాయి. అవి అవీర్య సంస్కార విజ్ఞాన నామరూప షడ్యతన స్పర్శ వేదన ,తృష్ణ ,ఉపాదాన, భావ జాతి జరామరణాలకు సంకేతాలుగా ఉంటాయి. పైనుండి మొదటి వరుస చేతులలో వజ్రం గంట జ్ఞానానికి విస్ఫూర్తికి గుర్తులన్నమాట. రెండు చేతులతోను, శక్తిని కౌగలించుకొని, శాశ్వతత్వానికి, ప్రతీక అవుతుంది. రెండు చేతులలో ఏనుగుతోళ్ళు - అవి చింపుతున్నట్లుండి - అజ్ఞాన నివారణకు గుర్తుగా ఉంటుంది. మూడవ కుడిచేయి, ఢమరుకమును ధరించి శుభానికి సంకేతమౌతుంది. నాల్గవ కుడిచేయి గొడ్డలిని గల్గి జరామరణ బంధాలను ఖండించుటకు ప్రతీకయౌతుంది. ఐదవ కుడిచేయి ఖడ్గాన్ని ధరించియుండి పంచపాతక నివారణకు సంకేతమౌతుంది. ఆరవ కుడిచేయి త్రిశూలాన్ని ధరించి యుండి కామక్రోధ, లోభముల విసర్జనకు సంకేతమౌతుంది.

మూడవ ఎడమచేతిలో అమృతకలశముండి ఆనందానికి సంకేతం అవుతుంది. నాల్గవ ఎడమచేతిలో రక్తంతోనిండిన కపాలముండి అది నిస్సంకల్ప భావనకు ప్రతీక యౌతుంది. ఐదవ ఎడమచేతిలో త్రాడు వుండి అది జ్ఞాన సిద్ధికి ముడి విప్పినట్లు అవుతుంది. ఆరవ ఎడమచేతిలో చతుర్ముఖ శీర్షముంటుంది. అది ప్రాపంచక భ్రాంతుల నివారణకు సంకేతమౌతుంది.

ఈ డెంఛాగ్ విగ్రహం తన పెడికాలుతో 'పాప' మనే పురుషుని శవమును అణగద్రొక్కుచున్నట్లుగాను ఎడమకాలితో పిశాచ శక్తిని బలహీనపరుస్తున్నట్లుగాను కాళ్ళ క్రింద గల ఆ బొమ్మలకు నాల్గుతలలుండి అవి పురుష స్త్రీ రూపాలలో యేర్పడియున్నట్లుగాను టిబెటన్ లామాలు విశ్వసిస్తారు.

డెంఛాగ్ విగ్రహం పులితోలుతో కప్పబడి అది భౌతిక ఆధ్యాత్మిక శక్తి ప్రాసారానికి చిహ్నం అవుతుంది.

పై విధంగా డెంఛాగ్ విగ్రహం ఆరోగ్యకర మానవదేహ అవయవ పరిమాణాలకు అనుగుణ్యతతో సమానకొలతలతోను ఉదాత్తతాభావ ద్యోతక రూపంలో శిల్పకళారామణీయ సమన్వితంగాను తీర్చిదిద్దబడి ఉంటుంది. ఈ డెంఛాకు ఆరాధ్య విగ్రహ రూపకల్పన భారతీయ దేవాలయ వాస్తుశిల్ప సాంప్రదాయానికి అనుగుణ్యరీతులలోనే కొనసాగియుంది.

ఈ 'డెంఛాగ్' విగ్రహంతో జతగూడి యుండు స్త్రీరూప ''వజ్ర వారాహి'' విగ్రహాన్ని ''డోర్జేఫాన్గ్మో'' అంటారు. కైలాస పర్వతానికి దగ్గరగానే యెడమవైపునగల ''టిజుంగ్'' పర్వతమంచుశిఖరం ఈ దేవికి నిలయమై యున్నట్లు చెపుతారు. ఈ దేవతా విగ్రహం ప్రకృతికి ప్రతీకయైయుండి పురుషుని ఆలింగనంలో ఒదిగినట్లుంటుంది. ఆమె ఎర్రరంగు గల్గి ప్రేమకు ప్రతీకగా ఉంటుంది. విగ్రహానికి గల రెండు చేతులు సత్యము మిధ్యలతో కూడిన చైతన్యానికి ప్రతీకలౌతాయి. కుడిచేతిలో ఆత్మజ్ఞానానికి ప్రతీకమైన కొడవలినికల్గి యెడమచేతితో పురుషుని ఎడమభుజం పై నుండి వేసిన రీతిలో ఈ విగ్రహరూపకల్పన అగుపడుతుంది. ఆమె శిరోజాలు విరబోసినట్లుండి ముడివిప్పిన విజ్ఞాన తత్వాల ప్రవర్తనకు గుర్తుగా ఉంటాయి. ఆమె దేహం నగ్నంగా ఉండి కామాన్ని అధిగమించుటకు నిదర్శనమౌతుంది.

ఆ దేవి కూడ త్రినేత్రయై దేవునివలెనే పంచశీర్ష యుతమగు కిరీటాన్ని దాల్చి పంచ తన్మాత్రల జ్ఞానానికి ప్రతీకయౌతుంది. ఈ విధంగా పలు టిబెటన్ గొంపాలలో పురుష ప్రకృతి సమ్మిళితరూపంలో విగ్రహారాధన అమలులోనున్నది. ఈ శివశక్తి సమాగమము మండుతున్న జ్వాలల సమక్షంలో జరిగినట్లుగా టిబెటనులు భావింతురు. ఈ అగ్నులు జీవన శక్తికి ప్రతీకగా నుంటవన్నమాట. ఈ విధముగా వజ్రయాన బౌద్ధమతము టిబెటులో ప్రవర్తితమై యుంది. ప్రతి సంవత్సరం జరిగే బుద్ధ జయంతి మేలా (ఉత్సవము) సందర్భములో దార్చెన్ గ్రామము జనబాహుళ్యముతో నిండిపోతుంటుంది.

శ్లో. విద్రావితా శేషత మోగణేన
ముద్రా విశేషేణ ముహుర్మునీనాం!
నిరస్యమాయాం దయయా విధత్తే
దేవో మహాం స్తత్వమసీతిబోధమ్ ।
అపార కారుణ్య సుధాతరంగై
రపాఙ్గపాతై రవలోక యన్తం ।
కఠోర సంసార నిదాఘతప్తా
న్మునీ నహం నౌమి గురుం గురూణామ్.



 ''బలము కావలెనన్న ఎక్కువసేపు స్నానము చేయవలె'' నని ఫ్రెంచి నాయకుడు నెపోలియన్ చెప్పెను. నిత్యము చన్నీటి స్నానము చేయువారికి పక్షవాతము రాదు.

 తీర్థయాత్రలను చేయుటకంటె వేదాధ్యయనము కంటె సత్యము పలుకుట వలన పుణ్యము.

 కాళిదాసు ''పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్'' అని నుడివెను. పరులకుపకారము చేయుట పుణ్యము. పరులను పీడించుట పాపము.

# ఇరువది నాల్గవ అధ్యాయం

## : మొదటి రోజు కైలాస పరిక్రమ :

స్తో. మమాద్య దేవో వటమూలవాసీ
కృపావిశేషా త్కృత సన్నిధానః
ఓంకార రూపా ముపదిశ్య విద్యా
మా విద్య కధ్వాన్త మపాకరోతు.
కలాభి రిన్దో రివ కల్పితాఙ్గం
ముక్తాకలాపైరివ బద్ధమూర్తిమ్।
ఆలోకయే దేశిక మప్రమేయ
మనాద్య విద్యా తిమిర ప్రభాతమ్.

మేము ఉదయమే 4-8-83న మేలుకొని టీలు సేవించుట ముగించి అవుసరమున్న రెండు దినముల పదార్థములు మాత్రమే మూటలుకట్టి వుంచితిమి. ఆరు గంటలకే ఇర్వురు మనుష్యులు ఆరు యాక్‌లను తెచ్చిరి. వారు మా సామానంతయు రెండు యాక్‌లపై కెక్కించి బంధించిరి. వీనిలో నొక పిల్ల యాకు కూడ నుండెను. దార్చెన్‌కు ఎడమగా మెల్లమెల్లగా మా పర్వతారోహణ ఆరంభమాయెను. మధ్య మధ్య చిన్న లోయలను దాటుచుంటిమి. ఇర్వై నిమిషములలోనే కైలాస శిఖరము మాయమయ్యెను. వెనుదిరిగి చూడగా సువిశాల ''బార్ఖా'' మైదానము మరియు దగ్గరలో రాక్షసతాల్ మాచూపు లాను మేరకు కనుపించుచుండెను. ఆ వెనుక ఎటు చూచినను పర్వత పంక్తులే యుండెను. ఆ మైదానములో రాక్షసతాళ్ ప్రాంతములో చాలా చమరీ ఆవుల గుంపులు లెక్కలేనన్ని గొర్రెలమందలు కూడ మేయుచు కనబడెను. ఈ దృశ్యము సూర్యోదయ కాంతులవలన మరింత శోభ గొల్పుచు నేత్ర పర్వముగా నుండెను. కొంత ముందునకు పోయిన తర్వాత సమతలమగు దారి వచ్చెను. చొక్కారావుగారు శ్రీ ధావేగారు శ్రీకులకర్ణిగారు యాక్‌ల నారోహించగా పిల్ల యాకు మా వెంట వచ్చుచుండెను. మెల్లమెల్లగా ఆరు కిలో మీటర్ల దూరము వెళ్ళగా 'తెర్చుంగ్' అనే ప్రదేశమున 'తార్బోచె' (అనగా ధ్వజములు వేలాడదీయుచోటు లేక మహాధ్వజమని అర్థము) అనబడే మేలా (ఉత్సవము) జరుగు స్థలము వచ్చెను. అచట శిథిలమైన ''న్యాని''లేక ''చుక్కు'' గొంపా రాళ్ళపై బౌద్ధ శక్తి విగ్రహములు మరియు ప్రణవ మంత్రము చెక్కిన రాళ్ళు కుప్పలుగా కనిపించెను. మరియు ఆ ప్రక్కనే ఎన్నో ధ్వజములు (రిబ్బను లాంటి గుడ్డ పేలికలు) వ్రేలాడ దీసి యుండెను. ప్రతి బుద్ధ జయంతి, వైశాఖ పూర్ణిమ రోజున అచట మేలా జరుగును. దాదాపు వెయ్యి నుండి పదిహేను వందల మంది

టిబెటనులు లామాలు చేరి ఒక ధ్వజ స్థంభమును పాతి పాతధ్వజములను తీసివేసి క్రొత్తవి నెలకొల్పుట వారి యాచారము.

మేము మరొక కిలోమీటరు ముందుకుపోగా ''లాఛూ'' యనే నదియు మాకు కుడివైపుగా ''పెమాపుక్'' అను గుహలును కన్పించెను. ఇట్లే ఇంకొక కిలోమీటరు నడచు వరకు ''ఛుకు గొంపా'' శిథిలములు కన్పించెను. అచటి నుండి మాకు కైలాస పర్వత శిఖరము తెల్లగా చాల పెద్దగా అతిమనోహరముగా కన్పించెను. ఇట్లే ముందునకు సాగగా కైలాస్‌కు ఎడమవైపున నల్ల త్రాచు పడగలాంటి ఎత్తైన పర్వతము లగుపడెను. వానిని ''రావణ'' పర్వతములని పేర్కొందురు.

రావణుడు కుబేరునికి వరుసకు తమ్ముడు. ఒకప్పుడు లంకాపురి పట్టణము కుబేరుని వశములో యుండెను. ఈ కుబేరుడే నవనిధులు గల ధనాధిపతి. రావణుడు కుబేరుని జయించి లంకను పుష్పక విమానమును (పుష్పక విమానములో ఎందరు యెక్కినను ఇంకా అయిదుగురికి స్థలముండుట దాని ప్రత్యేకతగా చెప్పెదరు.) గ్రహించెను. ఆ పుష్పక విమానముపై రావణుడు మంత్రిసహితముగా గరుడ, గంధర్వ, కిన్నెర, కింపురుష, దందశూక బృందారకాది కాంతలతో ఈ కైలాసాచల ప్రాంత పరిసరముల యందు విహరించినట్లు రామాయణ మందలి ఉత్తరా కాండలో గలయీ క్రింది పద్యము తెల్పుచున్నది.

సీ. చరియించు నొకవేళ జంబూనదీతీర
సౌవర్ణవాలుకా స్థలములందు
విహరించు నొకపూట వేల్పురా తోటల
బొదలు గొజ్జెగపూవు పొదలయందు
గ్రీడించు నొక తరి గేసర స్వేతాంజ
నాద్యద్రి రాడధిత్యకలయందు
నలరు నొక్కెడ గేళి నరుణోద మానస
ప్రముఖ దివ్య సరోవరములందు

తే. నన్నెలవులందు మెలగెడు నమర ఖచర
యక్ష కిన్నర సిద్ధ విద్యాధరాప్స
రోభుజంగాధికులు మహాక్షోభ మొంది.
తన్ను గనుగొని పారనద్దశముఖుండు.

మధ్యన గల ''లాఛూ'' నదికి కుడివైపున ''న్యాద్రి'' పర్వతము గలవు. మరి కొంత కుడికి కార్తికేయగణేశ పర్వతాలు గలవు. అట్లే కొంత దూరపు పోయిన తర్వాత ''షబ్జే'' యను బుద్ధ పాదముద్రల ప్రదేశమును కైలాస పర్వత

శిఖర ప్రత్యేక ఆకృతి గల వలయాకారములు కనిపించెను. మాకు ఎచట కంటికి ఇంపుగా తోచెనో అచటనే ఫోటోలు తీయుచుంటిమి. ఈ కైలాస శిఖరము మా పరిక్రమలో వివిధ ప్రదేశములనుండి వివిధ భంగిమలలో కనుపించుచుండెను. దాదాపు పదకొండు గంటల సమయమగుటచే మేమందరము విశ్రమించి ఫలహారములన్నియు బయటపెట్టి ఆరగించితిమి. యాక్‌ల వారికిని కొంత ఫలహారము తినుట కిచ్చితిమి. యాక్‌లు కూడ నది ప్రక్కలలో గల పచ్చికను మేయుచుండెను.

యాకులు : (యాకులు) ఈ యాకులు వాడిగల పొడవైన కొమ్ములతోను శరీరమంతా నల్లని వెంట్రుకలతోను పెద్ద దున్నపోతంత ఎత్తుగా ఎలుగుబంటివలె చూపరులకు భయోత్పాతము కలిగించును. కాని నిజముగా ఇవి చాలా సాధు జంతువులు. వ్యవసాయపనులకు సరుకుల మనుష్యుల మోతకు ప్రత్యేకముగా ఇలాంటి ఎత్తు ప్రదేశములలో వీటిని ఉపయోగింతురు. ఎంతటి బరువు పైన వేసినను ఇవి సులభముగా మోయగలవు. చాలా ధృఢముగా నుండును. ఎంతటి చలినైనను భరించి మంచులోను మంచునదులలోను ఇతర దుర్గమ ప్రదేశములలోను ఇవి అతి సులభముగా పయనించగలవు. ఇవి ఎంతటి సూదుల్లాంటి రాళ్ళు గల బాటలలో కూడ రాళ్ళ కుప్పలపై నుండి సునాయాసముగా ప్రయాణించగలవు. కాని ఇవి దారి వెంట సరిగా నడవవు. ప్రక్కన గడ్డి పరకలు కనబడినచో మేయుచు ఆయా ప్రక్కలకు తిరుగుచు ముందుకు సాగును. వీనికి ఏలాంటి పగ్గాలు ముక్కు త్రాళ్ళు ఉండవు.కాని అవి వాని యజమానులను చూచి ఎంతో భయపడును. అవి యజమానులు వేయు ఈలలను బాగుగా గమనించి నడచుచుండును. ఒక ఈల వేసినచో ప్రక్కనుండి దారికి వచ్చును. మరొక ఈల వేయగా త్వర త్వరగా నడచును. ఆ విధముగా యాకులు వాని కాపరుల ఈలలను జాగ్రత్తగా గమనించి పాటించుట మాకెంతో విచిత్రముగా తోచెను. వానిపై ప్రయాణించునపుడు మేము ఎన్ని ఈలల ప్రయోగించినను ఏమియు ఫలితము లేకపోయెను. ఇంకొక ముఖ్య విషయ మేమనగా ఈ యాకులపై ఎలాంటి జీనులు ఉండవు. ఏదైనా సామానులుంటే వాటియొక్క మోపురముపై వేసి కట్టుదురు. వెనుక భాగాన బ్లాంకిటో చద్దరో మాత్రము వేసికొని కూర్చొని కట్టిన త్రాళ్ళు మాత్రమే పట్టుకొనవలసి యుండును. ఆ త్రాళ్ళు లేనిచో పట్టుకొనుటకు ఆధారమే ఉండదు. వీనిపై ప్రయాణించిన పిరుదుల ప్రాంతమున నొప్పి పుట్టును. బాధ కూడ కలుగును. ఆ బాధకన్న నడచి పోవుటయే మేలనిపించును. ఆ రోజు ఏకాదశి సంప్రాప్తమయినందునను, కైలాసవాసుని ప్రదక్షిణ తరుణము అయినందునను నేను యాకును ఎక్కలేదు కాలి నడకనే ప్రయాణము చేయుచుంటిని. ఈ యాకులు లేక చమరీ ఆవుల యొక్క వెంట్రుకలతో చేసిన చామరములను మన దేవాలయములలో దేవీ దేవతలకు వీవనలుగా వాడుట కొన్ని చోట్ల ఆచారముగా యున్నది. టిబెటనులు ఈ చమరీ ఆవుల వాలములను

శుభ ప్రధమగు రక్షణగా భావించి తమ ఇండ్ల ద్వారముల వద్ద వ్రేలాడ గట్టియుంతురు. భూత ప్రేత పిశాచాది బాధలు దీనివల్ల ఇండ్లలోనికి ప్రవేశించవని వారు విశ్వసింతురు.

మేము లేచి మరల నడకసాగించితిమి. ''చిర్లంగ్'' ''దుర్లంగ్ ఛూ'' అను రెండు నదులు ''లాఛూ'' నదిలో కలియు సంగమమును చూచి మెల్ల మెల్లగా శిఖరములను పర్వతములను లోయలను సన్నని జలపాతములను లోయలలోని గొర్రెల మందలను గుర్రములపై గల ఆ గొర్రెమందల, కాపరులను, చూచుచు మధ్య మధ్యన, తారసిల్లిన, లామాలను, టిబెటనులను కైలాసము దర్శించువారిని ఫోటోలు తీయుచు ముందునకు సాగిపోయితిమి. ప్రయాణములో పైకెక్కు చున్నందున మేము చాల నీరసించితిమి. ఎప్పుడు క్యాంపు వచ్చునా యని తహ తహలాడు చుంటిమి. ఇంక నడక ఏ మాత్రము చేతకాకుండెను. నిటారుగా ఎక్కుడు లేకున్నను ఆమ్లజని లోపముచే ఎండ తీక్షణతచే చాల బడలిక జెందితిమి. మాకు ఒక భూబిలములో నాల్గైదు ఉడుముల్లాంటి ముంగిలాంటి జంతువులు కన్పించెను. మమ్ము చూచి అవి వాటి బిలములోనికి పారిపోయెను.

జంతువులలోను కొన్ని రకములుండును. ఇలాటి వానిని బిలాశయము (కన్నములలో నివసించునవి) లందురు. గుహలలో యుండువానిని గుహాశయములని కొమ్మలపైనుండు వానిని శాకాశయములని నీటిలో నుండు వానిని జలాశయములని నీటి ఒడ్డున యుండువానిని కులేచరములని గ్రామాలలో నుండు మేకలు గొర్రెలను మానవులచే పెంచబడు కోడి బాతు మొదలగు పక్షులను విష్కిరములని వాని వాని స్థావరముల ననుసరించి వానికి నామాంతరములు గలవన్న విషయము ఆశ్చర్యకర మేమీగాదు. ఈ బిలాశయముల మాంసము ఉష్ణవర్ధకముగాను బలవర్ధకముగాను ఉండునని చెప్పుదురు. టిబెట్టులో మాంసభక్షణము సర్వసాధారణమే.

ఇట్లు కొంత దూరము బహు ప్రయాసతో నడువగా 'టెరిబుక్ అను ప్రదేశమునగల ''మా శిబిరము''నకు దాదాపు సాయంకాలము మూడు గంటలక చేరుకొని అందరము తలొక పడకపై వాలి వెంటనే గాఢ నిద్రలో మునిగిపోయితిమి. నాకు మెలకువ వచ్చేసరికి సాయంత్రము నాల్గు గంటలయ్యెను. వెంటనే లేచి ప్రక్కన గల నదికి వెళ్ళి విపరీత ప్రవాహముతో నీరు ఎంతో చల్లగా నుండుటచే ఒక్క ప్రక్కనే లోతుకువెళ్ళకుండా నామకః స్నానము చేసి పూజాభిషేకములు పూర్తిచేసి తిరిగి టెంటు దగ్గరకి వచ్చుసరికి మామిత్రులెవ్వరును ఇంకా నిద్రనుండి లేవలేదు. ఇంకను గాఢ నిద్రలోనే యుండిరి. నేను వారిని నెమ్మదిగా లేపి పూజా తీర్థమును ఇచ్చితిని. తర్వాత టీలు కాచుకొని త్రాగితిమి. మా యువక మిత్రులు వంటలు మొదలు పెట్టిరి.మేము కొందరము బయట ప్రకృతి దృశ్యములను చూచుటకై పోయి ఫోటోలు

తీసుకొంటిమి. దాదాపు ఆరుగంటలకే అందరమును ఆకలి దహించుటచే నేడు ఏకభుక్తము చేసితిమి. నేడుకూడ కిచడి అన్నమునే తయారుచేసిరి. తరువాత కొంతసేపు దైవ ప్రార్థనలు భజనలు చేసి అందరము నిదురపోయితిమి.

ఆ ప్రదేశము చుట్టును చాల దగ్గరగా ఎత్తయిన పర్వతములచే చుట్టబడియుండి మీ. 5,000లు ఎత్తున నుండుటచే కాబోలు ఎముకలు కొరుకునంత విపరీతమైన చలివేయుచుండెను. ''నభీడాంగ్'' లో చలికన్నా యధికముగా ఉన్నట్లు తోచెను. అందుచే ఒకదానిపై నొకటిగా ఆరు దుస్తులు ధరించితిమి. ఆచట కప్పుకొనుటకు మరియు ప్రక్కలపై పరచుకొనుటకు గూడ పరుపులు ఉన్నందున మరల జాగరణ సంభవించ లేదు.

ఆ రోజు రాత్రి శ్రీ చొక్కారావుగారికి 103 డిగ్రీల జ్వరము వచ్చెను. వారు ఆహారమేమియు గైకొనలేదు. చాలాబాధపడుచు మూలుగుచుండిరి. మాకు వారి జ్వరము వలన భయ మావహించెను. మేము ఇంతవరకు గడచిన సంఘటన నుండియే తేరుకోలేదు. వారు త్వరగా కోలుకొని మావెంబడి పరిక్రమ సలిపి జ్వరపీడావిముక్తుడు కావలెనని ఆకైలాసవాసుని ప్రార్థించితిమి. ఆలోచించి చూడగా సుఖదుఃఖములు మానవుని వెంటాడుచునే యుండునని ఈ క్రింది శ్లోకమువల్ల తేటపడును.

శ్లో. యద్ధాత్రా నిజఫాలపట్టలిఖితం స్తోకం మహద్వా ధనం ।
తత్ప్రాప్నోతి మరుస్థలేఽపి నితరాం మేరౌ చ నాఽతోఽధికం।
తద్ధీరో భవ విత్తవత్సు కృపణాం వృత్తిం వృథా మా కృథా ః।
కూపే పశ్య పయోనిధావపి ఘటో గృహ్ణాతి తుల్యం జలమ్.(భర్తృహరి)

తా॥ మనకు ధనసంపదలు సుఖదుఃఖాదులు బ్రహ్మవ్రాత ననుసరించి మనమెచటికి వెడలినా నవి మనల ననుసరించును. అది ఎడారిగాని మేరు పర్వత శిఖరముగాని అవి మనచెంత చేరుచునే యుండును. మన లలాట లిఖితములయెడల ధీరులమై మనోనిశ్చయముతో నుండవలయును. కార్పణ్యరహితముగా మెలగవలయును. మన చేతనున్న కుండను చెలిమిలో ముంచినా చెరువులో ముంచినా సాగరములో ముంచినా కుండలో రావలసినంత మాత్రమే నీరు వచ్చును. అని పై శ్లోకతాత్పర్యము. అట్లే దీనికొకపురాణకథ నీ విధముగా చెప్పబడినది.

ఒకరోజు తపోధనుడగు దుర్వాసమహాముని జనకమహారాజు చెంతకుపోయి ఈ రాజభోగములను అధికారదర్పాదులను వదలుకొమ్మని బ్రహ్మజ్ఞానివి కమ్మని ప్రబోధించెను. అందుకు జనకుడు వీటిని నేను వదలినను అవి నన్ను వీడవని రాజ యోగమున్నంతకాలము రాజ భోగములు వెంటాడునని బదులు చెప్పెను. అందుకు దుర్వాసుడు వానిని వదిలిస్తానని తన వెంటరమ్మని పంతముతో హిమాలయములలోని

కైలాసమునకు తోడ్కొనిపోయెను. దారిలో జనకమహారాజు డస్సి అలసి జ్వరపీడితుడై మూర్ఛిల్లెను దూర్వాసుడు కమండలముతో నీటిని గొనితెచ్చుటకు వెడలెను. ఇంతలో శూరసేనుడను సామంతరాజు రథగజ తురగపదాతి సకల సంపత్సముదాయముతో వేటకై ఆ ప్రదేశము చేరెను.

అచట ఈ దుస్థితిలో పడియున్న జనకచక్రవర్తిని చూచి సంభ్రమాశ్చర్యములలో మునిగిపోయి అట్టిస్థితి కల్గుటకు కారణము ఏరక్కసుడో యయి యుండునని భావించెను. వెంటనే శూరసేనుడు జనకునకు విశ్రాంతి భంగము కాకుండా జనకుని చుట్టు రాజభవనములాటి శిబిరము వేయించి అందులో నొక హంస తూలికా తల్ప మమర్చి పరుండబెట్టెను. మరియు సకల దాసీ జన సమూహములచే సర్వశైత్యోపచారములు సలిపి ఫలరసాదుల నొసగి సేద దీర్చెను. జనకుడు మూర్ఛ నుండి తేరుకొని పరిస్థితిని అవగాహన చేసికొనెను.

బయట నెక్కడో రాజ దర్శనార్థము ఘర్షణ పడుచున్న దూర్వాసుని రావించి అచట జరుగుచున్న నిజస్థితిని చూపించి సమాధానమేమి యని దూర్వాసుని అడిగెను. ఇది యంతయు విధి విధానమని దూర్వాసుడును అంగీకరించెను.

ఈ యాత్రా ఫలసిద్ధి ఆ కైలాసవాసుని యభీష్టమే కాని మేమందరము నిమిత్తమాత్రులమే గదా!

మా లీడరు డా॥ గొడ్బొలే తన వద్ద నున్న కొన్ని మందులిచ్చెను. ఆ రోజు మా యాభైయ్యైదు కిలోమీటర్ల ప్రయాణములో 25 కి.మీ. దూరము పూర్తి చేసితిమి. అతి కఠినమైన ప్రయాణము రేపుండెను. మధ్య రాత్రి రెండు గంటల సమయానికే లేచి ప్రయాణము సాగించవలయునని కైలాస పరిక్రమ గావించిన మామిత్ర బృందము హెచ్చరించి యుండిరి. ☝

✍ ఆ పరిపరివిధ ఆలోచనల విరమించి చలి బాధచే గాఢ నిదురలో మునిగిపోయితిని. ✍

శ్లో. స్వదక్షజానుస్థిత వామపాదం
పాదోదరాలంకృతయోగపట్టం ।
అపస్మృతే రాహితపాద మజ్గే
ప్రణౌమి దేవం ప్రణిధానవన్తమ్.
తత్త్వార్థ మంత్రే వసతా మృషీణాం
యువాఽపి య స్స న్నుపదేష్టు మీష్టే।
ప్రణౌమి తం ప్రాక్తనపుణ్యజాతై
రాచార్యమాశ్చర్య గుణాధివాసమ్.



# ఇరువది ఐదవ అధ్యాయం

## : రెండవరోజు - కైలాస పరిక్రమ :

స్తో. ఏకేన ముద్రాం పరశుం కరేణ
కరేణ చాన్యేన మృగం దధాన ః
స్వజాను విస్యస్త కరః పురస్తా
దాచార్య చూడామణి రావి రస్తు.
ఆలేపవస్తం మదనాజ్ఞభూత్యా
శార్దూలకృత్యా పరిధాన వస్త్రమ్
ఆలోకయే కఞ్చన దేశికేన్ద్ర
మజ్ఞాన వారాకర బాడ బాగ్నిమ్.

ది. 5-8-1983న మధ్యరాత్రి దాదాపు ఒకటిన్నర గంటలకు మాతో వచ్చిన యాక్ మనిషి ''ఉఠో, ఉఠో'' గరంపానీ, గరంపానీ అని వచ్చీరాని హిందీలో అరచుచు మమ్ములను బలవంతముగా లేపెను. వారు మాత్రము బయటనే పండుకొనిరి, మేము లేచి టార్చీల సహాయంతో మా సామానులు కట్టి ఇచ్చితిమి. వారు ఆ సామానులను యాకులపై వేసి కట్టిరి. ముఖములు కడుగుకొంటిమిగాని ఆ చలిలో ఎవరును టీ కాచుటకు ప్రయత్నము చేయలేదు. ఒక టార్చిలైటు సహాయముతో చిమ్మ చీకటిలో యాకువాడు ముందు నడచుచుండగా ప్రయాణము సాగించు చుంటిమి. అతనిని మేము ఒకరి తరువాత ఒకరము అనుసరించుచుంటిమి. చివర చాల వెనుకగా యాకులు వచ్చుచుండెను. విపరీతమైన చలి మా కీళ్ళను కొరుకుచుండెను. మాలోని పెద్దలు వడివడిగా నడువలేకపోవుచుండిరి. కులకర్ణిగారు, చొక్కారావుగారు చాల వెనుకబడుచు ప్రతి రెండు నిముషములకు పైకి ఎక్కలేక ఆగుచు ఉచ్ఛ్వాస నిశ్వాసములతో బాధపడుచుండిరి. ఇంకా అంతయు చీకటిమయముగా ఉండుటవలన యాకులను ఎక్కే అవకాశములేదు. దారికూడ సరిగాలేదు. మధ్యమధ్య సెలయేళ్ళు వాటిపై పొర, మంచుతో కప్పబడి యుండెను. దారిలో మధ్యమధ్యన రాళ్ళుండెను. మేము త్వరగా నడచుటకు వీలుగా లేదు. మెల్లమెల్లగా నడచుటచే చలిని భరించునట్లు లేదు. ఈ కైలాస పరిక్రమ ముందుగనే చేసిన మిత్రుల సలహాప్రకారము చన్నీళ్ళలో బూట్లు తడవకుండ జాగ్రత్తపడుట ముఖ్యము. మేమాచలిలో మెల్లమెల్లగా నడుచుచుంటిమి. మా పెద్దలు ఆగినపుడల్లా మేమందరమును ఆగవలసివచ్చెను. మధ్యలో ఒక మీటరు వెడల్పుగల మరొక చిన్న సెలయేరు దాటవలసి వచ్చెను. యాకువాడు సన్ననిదారి విడిచి కొంత పైకి వెళ్ళి నీటిలో అడుగులు

వేయుటకై చిన్న చిన్న రాళ్ళను వేసి మాలో ఒక్కొక్కరినే ఆ వేసిన రాళ్ళపై నుండి దాటించుచుండెను. నా వద్దగల టార్చివెలుగులో దారి మార్చి కొంత పైకి వెళ్ళుట యెందుకు అనుకొని నేను నీటి మధ్యలో గల గుండ్రని బండరాయిపై ఒక్క అడుగు వేసి దాటవచ్చని తలచి బూటుకాలును ఆ బండపై మోపి మరొక కాలును లేపి అంగ వేయులోపున జర్రున కాలుజారి నీటిలో పడినది. నేను వెంటనే తమాయించుకొని మరొకకాలును ఆవలి వడ్డున వేసి నీటిని దాటితిని. ఈ సందర్భమున నాకాలు మోకాలు వరకు బూటు ప్యాంటుయుక్తముగ తడిసినది. అందుచే కాలు తడిసినంతవరకు రక్తము గడ్డకట్టి రక్తప్రసారము ఆగినట్లనుపించెను. బూట్లు విప్పు పరిస్థితిలేదు. విప్పినచో చలి మరీ భరించలేనిదిగా యుండెను. త్వరత్వరగా నడచినచో కాలులో వేడి పుట్టునేమోనన్నను ఆ చీకటిలో రాళ్ళబాటలో అదియును సాధ్యము కాకుండెను.

మా మొత్తము ప్రయాణములో ఇంతటి భరించలేని చలిని ఎక్కడను మేము అనుభవించలేదు. వేసినయడుగు భూమిపై పడుచున్నదా లేదా యనే అనుమానము కలుగుచుండెను. నాకు యికముందు ప్రయాణము చేయలేనేమోయని భయము సందేహము కల్గుచుండెను. ఎట్లో బాధపడుచు మరికొంత ముందుకు నడువగా ''కాంజుం ఛూ'' అనునొక పెద్దనది దారిలో వచ్చెను. దానిని దాటించుటకు యాకులు వచ్చెను. నలుగురు ముందు దాటిరి. తర్వాత యాకులను వెనుకకు తీసుకొనివచ్చి మరల మరొక నలుగురను చొప్పున మూడు తడవల్లో మమ్ములనందరిని నదిని దాటించిరి. ఈ నది చీకటిలో బాగుగా కనిపించకపోయినను నీటి పరిమాణము వలన ఇరవైమీటర్ల వెడల్పు ఒక మీటరు లోతు మరియు అత్యధిక ప్రవాహ వేగము కలిగియున్నట్లు తోచెను. నదిని దాటి తర్వాత మేమందరము మరల నడక సాగించితిమి.

అడుగులు నెమ్మదిగా వేయుచు ఇట్లే దాదాపు రెండు కిలోమీటర్లు రాళ్ళపై భూమిపై జాగ్రత్తగా నడువగా ఒక ప్రక్కన తెలతెలవారుచుండెను. అచట ''ధీరాపుక్'' గొంపా యుండెను. అది 5,800 మీటర్ల ఎత్తు ప్రదేశము. అచటినుండి మాకు కైలాసపర్వతము పూర్తిగా కనుపించినది. ఇంతలో పూర్తిగా తెల్లవారినది. అచ్చటనే కొన్ని ఫోటోలు తీసుకొని కొంతసేపు విశ్రమించి ప్రకృతి శోభను పరికించి ఆనందించితిమి. ఎదురుగా చాల ఎత్తుపై ''డోల్మాలా'' యను కనుమ దృశ్యము మంచుతో నిండియుండి కనుపించుచుండెను. మా పెద్దలు యాకుల నధిరోహించిరి. మరల ప్రయాణము రాళ్ళతో కూడినదైయున్నను అట్లే పోవుచుంటిమి. నేను కూడ ఒక యాకుపై నెక్కితిని. కాని ఎంతోసేపు నేను యాకుపై ప్రయాణించలేకుంటిని.

ఎందుకనగా యాకులు పర్వతముపై కెక్కునపుడు వాటి వీపుల మీదగల మేము వెనుకకు జారుచుండుట. ఆ జారుట నాపుకొనుటకై గట్టిగా తొడలతో యాకు వీపును పట్టుకొని ప్రయత్నించుట-దానితో తొడలలో బాధ కలుగుట-భరించలేక మరల దిగి నేను కాలినడకను ప్రయాణము సాగించితిని. ఉదయము దాదాపు ఎనిమిది గంటలకు మేము ''డోల్మాలాపాస్'' నకు కొన్ని వందల మీటర్ల క్రిందుగానుంటిమి. అచట కొంతసేపు విశ్రమించితిమి. మేము ఎంతో అలసి పోయితిమి. నామిత్రులతో మూటలు విప్పి ఫలహారములను చేయుమనిచెప్పితిని. కాని వారి మూటలన్నియు, యాకులపై ముందు దూరముగా వెడలుటచే, వారికి సాధ్యపడలేదు. వారి ఆకలిగొన్న దీనపరిస్థితి చూచి నాకు చికాకు వేసినది. ఎవరును ఆ కనుమనెక్కి అవతలవైపునకు దాటు పరిస్థితి కనబడలేదు. అందరును చాల బడలిక జెందియుండిరి. మాకు ఎట్టి పరిస్థితిలోను కూడ-ఖాళీ కడుపు (Empty Stomach) తో పర్వతారోహణ చేయకూడదనే ఆదేశమున్నప్పటికిని మేము ఆరోజున కనీసం టీని కూడ త్రాగలేదు. అందుకే కాబోలు నేను నాకు తెలియకుండానే సహనము కోల్పోయి చికాకు పడితిని. మాలీడరు డ్యాక్టరు అయివుండికూడ మమ్ములను ఆ విధముగా ప్రయాణము చేయించుట చాల ఆశ్చర్యముగా తోచి ఆయనను కూడ చీవాట్లు వేసితిని. ఆయన ఏమియు మారుమాటాడలేదు. నా ఇతర మిత్రులు నన్ను శాంతింపజేసిరి. ఈ నా ఆవేశమునకు కారణము నా బడలిక, ఆకలి, ఆమ్లజని లోపము కావచ్చును. ఆ తరువాత నేను నా వద్ద గల ఫలహారమును కొంత సేవించి ఉపశమించితిని.

ఆ తరువాత నేను, డా॥ గోఢ్బలే, చౌదరి, యోగేష్‌లును వెనుకబడగా మిగిలన వారందరు మెల్లమెల్లగా ''డోల్మాలాపాస్''ను ఎక్కుచుండిరి. మేము నలుగురము ఆగుచు నెమ్మదిగా నడచుచు శ్వాసతీయుచు రొప్పుచు, ఈ ప్రయాణములో ఆమ్లజని లోపమును ప్రస్ఫుటముగా కనుగొనుచుంటిమి. నేను యోగేష్ మిగిలిన ఇద్దరికంటె కొంత ముందుగా నడచితిమి.

ఆ డోల్మాలాపాస్ సమీపమునకు చేరితిమి. డా॥ గోడ్బోలేతో చౌదరి యుండెను. వీరు చాల నీరసించి నెమ్మదిగా నడుచుచుండిరి. ఆ డోల్మాలాపాస్ మొదట చాల ఎక్కుడుగాను ఒక మీటరు వెడల్పుతో మాత్రమేయుండెను. మేము కొంతదూరము పైకెక్కి ఒక విశాలమైనరాతిపై కూర్చొని ఫలహారములు భుజించితిమి. ఎలక్ట్రాల్ పొడరు కలిపినీరు త్రాగితిమి. ఫలహారముకాని, నీరుకాని మిగతా వారెవరిచెంతను లేకుండెను. దాదాపు పదిహేను నిమిషములకు వారిరువురు మమ్ములను సమీపించిరి. వారికి కూడ కొంత టిఫిను నీరు ఇచ్చితిని. అపుడు వారికి కొంత బలము చే కూరినట్లనిపించెను.

మరల అందరము లేచి ముందకు ఎక్కుచుండగా చౌదరీ యోగేష్‌లు ముందుకు వెళ్ళిరి. డా॥ గోడ్బోలే ఏ మాత్రము నడక సాగించకుండెను. కనులు తిరిగుచున్నవని మాటిమాటికి కూర్చుండుచుండెను. నేను ఆయనకు ధైర్యము చెప్పి వెంటవుండి మెల్లమెల్లగా నడిపించుచు రాళ్ళపైకి కొంత ఎక్కువరకు అక్కడ మంచును మధ్యలో రాళ్ళును వచ్చెను. అచటనే కొంతసేపు నిలిచి ఆయనను లేపి నడక ప్రారంభించి ఒక్కొక్క రాతిపై ఒక్కొక్క అడుగువేయుచు మంచును తప్పుకొనుచు ఆగుచు ఆయాసపడుచు తుదకు అరగంట తర్వాత వందమీటర్ల ఎత్తుగల ఒక ప్రదేశమునకు చేరితిమి. ప్రక్కన ఒక గుండ్రని రాయి కనబడెను. ఆ రాతివద్ద కొన్ని ధ్వజములు కన్పించెను. దీనిని ''శివచల్ తుధుప్'' అందురనియు అచట టిబెటనులు, వెంట్రుకలను, రక్తమును సమర్పించుకొని సాష్టాంగ ప్రణామము చేయుదురనియు వింటిమి. అచట ప్రాణములు విడుచువారు పుణ్యలోకములను చేరుదురని టిబెటనుల ధృడ విశ్వాసము.

కర్మ సిద్ధాంతములో మరణానంతరము జీవులకు స్వర్గ లోకములు ప్రాప్తించుననియు అందువలననే పాపములు విడిచి పెట్టి పుణ్యకార్యములు చేయవలెననియు పూర్వాచార్యులు చెప్పియున్నారు. ఈ స్వర్గనరక వివరణ ఈ దిగువ విధముగా చెప్పబడినది.

**నరకములు** : పరుల ధన అపహరణ చేత మిశ్రనరకము బొందుదురు. ఇతరుల కన్యాయము చేయువాడు. అంధతామిశ్రమ నరకము బొందును. ఇతరలను హింసించువాడు రౌరవాధి నరక మనుభవించును. క్రూరత్వము చేయువాడు కుంభీపాక నరక మనుభవించును అట్లే మహారౌరవము, కాలసూత్రము, అసిపత్రవనము, సూకరముఖము, అంధకూపము, క్రిమి భోజనము, నందశము, తప్తమూర్తి, వజ్రకంటకము, శాల్మలివైతరణి , పూయోదము, ప్రాణరోధము, విశనయి, లాలాభక్షము, సారమేయవనము, నవీచి, క్షారకర్తమము, రక్షోదణము, భోజనము, శూలప్రోతము, దందశూకము, వటారోధము, పర్యావర్తనకము, సూచీముఖ మనునవి ఇరువది యెనిమిది నరకములు వివరింపబడియున్నవి.

ఈ విధముగా ప్రతి జీవియు కర్మయొక్క శుభాశుభ ఫలములు అనుభవించక తప్పదని ధర్మ శాస్త్ర ప్రబోధము.

**బౌద్ధ నరకములు** : బౌద్ధులు కూడ అనేక విధములగు నరకములను నమ్మెదరు. ఈ నరకములను, కామలోకనరకము లందురు. జంతువులు, ప్రేతలు, పిశాచములు మరియు భూమిపై నివసించు మానవులు నరక దుఃఖము లనుభవింతు రనియు వారి వారి సత్కర్మలవలన, స్వర్గమునో, మోక్షమునో, పొందుదురని

విశ్వసింతురు. దేవలోకముల వర్ణనలు కూడ బౌద్ధ గ్రంథములలో వివరింపబడియున్నవి, ఆయాదేవతల మహత్తువారివారి యోగ్యతలపై నాధారపడియుండును. ఈ దేవతలు మానవులకు ముక్తినీయజాలరనియు బుద్ధుని బోధనలను చాటుగా విన్న ఒక కప్పకు ''అనుత్రయ త్రింశస్'' అను దేవలోకము సంప్రాప్తమైనదనియు వారి పురాణములలో కలదు.

**బౌద్ధ స్వర్గములు :** నిర్వాణమనగా మోక్షమేకాని దేవత్వము బొందుట కాదు. బౌద్ధమతములో స్వర్గములనేకములున్నవి. వాటి వివరణ ఈ విధముగా చెప్పబడెను.

**కోరికలస్వర్గములు ఆరు :** (1) మహారాజ (2) త్రయత్రింశస్ (3) యామ (4) తుషిత (5) నిర్మాణరతిదేవ (6) పరనిర్మిత వాసవర్తి యను స్వర్గములు.

**సశరీర స్వర్గములు మూడు :** (1) బ్రహ్మపరిసజ్జదేవ (2) బ్రహ్మ పురోహితదేవ (3) మహాబ్రహ్మదేవలోకములు.

**ధ్యానస్వర్గములు మూడు :** (1) అప్రమాణాభదేవ (2) అభాస్వరదేవ (3) పరితాభా దేవలోకములు.

**ధ్యానస్వర్గ విధములు :** (1) పరిప్తశుభదేవ (2) అప్రమాణ శుభదేవ (3) శుభకృతనా దేవలోకములు.

ఇవికాక (1) బృహత్ఫలదేవ (2) అసంజయ సత్వదేవ (3) ఆవిర్బాదేవ (4) ఆతపాదేవ (5) సుదర్శదేవ (6) సుదర్శినోదేవ (7) ఆకనిష్ఠదేవ స్వర్గములని యున్నవి.

**నిర్గుణ తత్వములవి నాల్గు :** (1) ఆకాశ నాట్యాయతనదేవ (1) విజ్ఞాన నాట్యాయతనదేవ (3) అఖించయాయతనదేవ (4) నైవ సంజ్ఞానయాతనా దేవలోకములని మొత్తము 26 చెప్పబడి వీనియొక్క శ్రేణులు ఒక దానికి మించి మరొకటిది మహత్తుగలది గాను చెప్పబడినవి.

మన హిందూ గరుడ పురాణము మొదలగు పౌరాణిక ధర్మ సూత్రములను బౌద్ధులు విరివిగా స్వీకరించియున్నారు. స్వర్గ నరకవాస వివరములు రెండును ఉదాహరణలుగా పేర్కొనవచ్చును.

గరుడ పురాణములో తెలిపిన 25 నరకము లీ విధముగా తెలుపబడినవి.

సీ. రౌరవ రోధన రక్తాంబ సూకర
తాళ క్రిమిభక్ష తప్తకుంభ

విషసన లవణంబు విభ్రాంత ఆదఃశ్శిరము
పున్నామ నరకంబు పూయవయము
అగ్ని పత్రంబును అంధకూపంబును
అధోముఖ వైతరిణి సముచితముగ
కాక భక్షంబును కాల సర్పంబును
గృధ్రభక్షంబులే కీరవాణి

తే. గీ. అల విమోహ మహాజ్వాల లలర నెలమి
తప్తలోహ తప్తస్తంభ దనరుచుండు
వృశ్చికాద స్త్ర మనుపేర్ల నిశ్చయముగ
నిరువదియునైదు నరకము లింతి వినుమ.

✍ మేము ఈ ''శివచల్ తుధుప్'' వద్ద కొంతసేపు విశ్రమించి దేవునకు నమస్కారముచేసి డా॥ గోడ్బోలేను వెంట నిడుకొని బయలుదేరి ఆయాసముతో రొప్పుచు మరొక వందమీటర్లు ఎత్తు ప్రదేశమునకు చాల నెమ్మదిగా చేరుకొనగా అచట మామిత్ర బృందము ఫలహారములు సేవించి విశ్రమించియుండిరి. మా వెంట వచ్చిన యాకులును ఒక మనిషియు వెళ్ళిపోయిరి. నేటి కఠినమైన పర్వతము పైకి నిటారుగా ఎక్కు ప్రయాణము యింతటితో ముగిసెను. మేము కూడ ఫలహారములు భుజించి నీరు త్రాగి అరగంటకు పైగా విశ్రమించితిమి. ఆ ప్రదేశము ఎత్తు దాదాపు 5,800 మీటర్లు అనగా దాదాపు 19,000 అడుగులు ఉండెను. మా మొత్తము ప్రయాణములో ఇంత ఎత్తైన ప్రదేశము మాకు ఇంతవరకు తటస్థించలేదు. మాకు నేడు తెల్లవారుఝామున కన్పించిన కైలాస శిఖరము మాకు ఇరవై నిముషముల కాలమే కన్పించి ప్రయాణములో మాయమైనది. తర్వాత ఇంతవరకు అది మాకు కన్పించలేదు. ✍

☝ ఆ పర్వతములలో ధ్వని బాగా వినపడదు. ఇరవైమీటర్ల దూరమున నున్న మనిషి పిలుపు కూడ వినరాకుండును. కారణము ఆమ్లజని లోపము మరియు విపరీతమైన గాలులు. అందుచే ఆ ప్రదేశాలలో కర సంకేతములే బాగుగా ఉపయోగపడును. టిబెటనులు పరిక్రమ చేయునపుడు ప్రణవ మంత్రమో, దలైలామానో, బుద్ధుడినో ఏదో ఒకటి జపించుచునే యుందురు. నేను మాత్రము రెండు పరిక్రమలలో గూడ శివపంచాక్షరీ జపమును చేయుచునే యుంటిని. లామాలు పెద్దరాళ్ళపై చిన్న రాళ్ళుంచి మోకరిల్లుట, ప్రణామము చేయుట తెలిసిన విషయమే. ఈ ప్రాంతములలో నీటి ప్రవాహము మధ్యాహ్నమగుకొలది సూర్యరశ్మిచే మంచు కరగిన కొలది హెచ్చుగా నుండును. రాత్రిపూట - చలికి నీరు గడ్డకట్టి-తగ్గును.

రామచరిత మానసములో, ఈ ప్రాంతమును కైలాస శిఖరమును అచట కలుగు అనుభూతిని గురించిన వర్ణన చదివి పొందిన అనుభూతికంటె మిక్కిలి ఎక్కువ అనుభూతిని ప్రత్యక్షముగా చూచి పొందుదురనుటలో ఏ మాత్రము సందేహములేదు. అందువలననే ఈ దృశ్యములను చూడగనే జన్మ తరించినదను అనుభూతి కల్గును. సింధునది దాదాపు ఇచట నుండియే బయలుదేరును. ఇది కైలాసము ప్రక్కనుండి ప్రవహించును. ఈ కైలాస శిఖరము ఎత్తు మీ. 6,800లు అనగా దాదాపు 22,050 అడుగులు.

మేమందరము దాదాపు పదిగంటలకు లేచి మరల నడక ప్రారంభించితిమి. అచట ఒక ''దిక్పాకర్షక్'' (పాపుల పరీక్ష) అను ఒక పెద్ద బండ రాయి కలదు. దూరాన కైలాస్. జాంబియాంగ్, మంచు శిఖరములు ఆ ప్రక్కనే మరికొన్ని పెద్ద పర్వతములు మధ్యమధ్యన మంచు దిబ్బలు కలిగిన దృశ్యములు నయనానందకరముగా కన్పించుచుండెను. ఆ రాళ్ళలో సమతల ప్రదేశముపై అయిదువందల మీటర్లు నడుచువరకు మాకు దాదాపు నాల్గువందల మీటర్లు లోతుగా లోయలో ఒక అండాకారపు నీలివర్ణ ''గౌరీకుండ్'' అను సరస్సు కన్పించెను. దానిపై పలుచని మంచుపొర, అచట - నీటిపై తెల్లని దుప్పటి కప్పినట్లు-కనిపించుచుండెను. మేము బాగుగా అలసియుండినందున ఆ సరస్సు దగ్గరికి వెళ్ళలేకపోయితిమి. వెళ్ళుట యనగా 400 మీటర్లు పర్వతము దిగుట - మళ్ళీ ఎక్కుట - చాల శ్రమతో కూడుకొని, ఎక్కువ కాలము వృధా కాగలదు -కాబట్టి, మాతో వచ్చిన ఒక యాకువాడు మా నీటి సీసాలు, సంచులు తీసుకొనివెళ్ళి ఆ ''గౌరీకుండ్'' సరస్సులోని జలమును నింపుకొని తీసుకొని వచ్చెను. గౌరీదేవి అచటనే స్నాన మాచరించుననియు కార్తికేయ జననము అచటనే జరిగినట్లును పురాణగాధల వలన తెలియుచున్నది.

భాస్కర రామాయణములో కార్తికేయ జనన పద్యము నీ విధమున నున్నది.

చ. అలరి యటన్ సహస్రశిఖరావళి కాంచన దీప్త మండలిన్
గల బహు కేతునామ గిరి గ్రాలుచు నుండును దానిమీద ని
ర్మల సలిల హ్రదం బమరు మానుగ నచ్చట కార్తికేయజ
న్మలలితదీప్తి మ చ్చరవణంబు వెలుంగు దదీయసన్నిధిన్.

ఆ గౌరీకుండ్ సరస్సు ఎత్తు 18,400 అడుగులు. అంటే ఇంత ఎత్తు గల సరస్సు ప్రపంచములో మరెక్కడను లేదందురు. ఈ నీటిపై సంవత్సరమంతయు మంచుపొరలు కప్పబడి యుండును. ఇక్కడినుండి ఒక కిలోమీటరు తిన్నగా క్రిందికి దిగగా - అక్కడ అరకిలోమీటరు వెడల్పుతో మూడు

కిలోమీటర్లు పొడవుగా - పిండి ఆరబోసినట్లు కన్పించు తెల్లని మంచుదిబ్బ, ఎండలో ధగధగా మెరయుచు, మిక్కిలి ఆశ్చర్యానందములు, గొలుపుచు మాకు తారసిల్లెను. చాల నెమ్మదిగా ఆ మంచుదిబ్బను దాటుచు, మధ్యలో నొక బహుసుందరమైన ప్రకృతి శోభావిశేషమును తిలకించితిమి. ఆ విశేషమేమనగా - ఆ మంచుదిబ్బపై మేము నడచు దారిలో దాదాపు నాలుగుమీటర్లు లోతుగా ఒకటిన్నర అడుగుల వెడల్పుగల సన్నని నీటికాల్వ కనపడెను. ఆ కాల్వయొక్క అడుగు భాగము ఎంత లోతున నున్నదో ఊహించుటకు కూడ కష్టముగా నుండెను. కాల్వకు ఇరువైపుల మంచుగోడలు. నీరంతయు చలికి మంచుగా గడ్డకట్టిన ఈ హిమ ప్రదేశములో నీరు మంచుదిబ్బ అడుగునుండి కాల్వగా పారుట ప్రకృతియొక్క అద్భుత విశేషము. కాలువ హిమ కుడ్యములకు మధ్యమధ్యన హిమవల్లతలు మంచుగోడల నంటుకొనియుండుట, ఆ కాలువ సొగసు నినుమడింపజేయుచుండెను. మేము పొరపాటున కాలుజారి ఆ నీటిలో పడినచో ఏ లోకములకు పోయెదమో అగమ్యగోచరముగా నుండి ఒళ్ళు జలదరించెను. ఈ కాలువలోని నీరు ''గౌరీకుండ్''లోనుండి వచ్చుచున్నట్లుగా చెప్పబడెను. దానిని ఫోటోలు తీసితిని. కాల్వను ఒక్క అంగలో దాటితిని. ఇట్లే మెల్లమెల్లగా ఆ మంచుదిబ్బను పూర్తిగా దాటి మేము మరల రాళ్ళ త్రోవగుండా నడచుచుంటిమి.

ఇట్లు కొంతదూరము నడువగా మరొక పెద్దరాయి. ధ్వజములు, రాళ్ళ కుప్పలు కంటబడెను. దానిని ''జుతుల్ ఫుక్ గొంపా'' యందురు. అచటినుండి దాదాపు నాలుగు కిలోమీటర్లు నిటారుగా క్రిందికి పర్వతము దిగుటయుండెను. ఆ దారి అంతయు రాళ్ళమయము. దారికూడ సరిగా కనబడదు మేము ''జడ్'' (Z) ఆకారములో వెనుకకు ముందుకు నడచుచు నెమ్మదిగా చేతికర్ర సాయంతో దిగుచుంటిమి. శ్రీ చొక్కారావుగారు చాల నీరసించిరి. వారు అనారోగ్య కారణముచే ఆహారమేమియు తీసికొనలేదు. చొక్కారావుగారి వెంట డా॥ గోడ్బోలే కూడ యుండెను. నేను నడచి దాదాపు రెండుగంటల వరకు క్రింది నదియొడ్డున గల మామిత్రులను చేరితిని. వారి ప్రక్కనే యాకువారు, కొందరు టిబెటనులు పిడకలను ప్రోగుచే సి వంటలు చేయుచుండిరి. వారు మాకు కొంత వేడినీరు ఇవ్వగా టీ కాచుకొని సేవించితిమి. కులకర్ణి, ధామేగార్లు నా తర్వాత వచ్చి చేరిరి. ఆ తర్వాత దాదాపు రెండుగంటల నలభైయైదు నిముషములకు డా. గోడ్బోలే సహాయముతో శ్రీ చొక్కారావుగారు వచ్చి చేరిరి. ఇచటికి దగ్గరలోనే ఒక గుహయున్నది. అది బుద్ధుని పాదముద్రలు గల ప్రదేశమని చెప్పబడినది. ✍

☝ ఈ కైలాస పరిక్రమపట్ల మనకన్న టిబెటు దేశస్థులకే ఎక్కువ భక్తి. శ్రద్ధ, నమ్మకము, ఆదరము కలదని వింటిని. ఇంతలో మా ముందునుండే ఇర్వురు

పురుషులు, ఇర్వురు స్త్రీలు సాష్టాంగ నమస్కారములు చేయుచు పైకి వెళ్ళుట కనులార చూచితిమి. వారుబోర్లాగా పడుకొని, చేతులు ముందుకు చాచి, ఆ చేతులున్న స్థలమువరకు అడుగులు వేసి, మరల బోర్లా పడుకొని సాష్టాంగ నమస్కారములతో పోవుట, సాష్టాంగ పరిక్రమగా చెప్పుదురు. ఈ విధముగా వీరు పదిహేను దినములకు ఈ కైలాస పరిక్రమ పూర్తి చేయుదురు. ఈ పరిక్రమ కైలాస పర్వతమునకు కుడినుండి ఎడమకు (Anti-clock wise) సాగును. మామూలు పరిక్రమ మాత్రము వారు నడకతో మనవలె ఎడమనుండి కుడివైపుకు ఒకే రోజులో పూర్తి చేయుదురు. ఈ పరిక్రమలో మధ్య మంచు గాని, రాళ్ళుగాని, నీరుగాని ఏది వచ్చినను వారు అలా బోర్లా పడుకొనుచు, లేచుచునే ఈ సాష్టాంగ పరిక్రమ చేయుచుందురు. ఈ పదిహేను రోజులు వారు సత్తును మాత్రమే భుజించుచు, పరిక్రమను పూర్తి చేయుదురు. ఎందుకనగా దారిలో వారికి వంట చేసికొని తినుటకు వీలుండకపోవుట కావచ్చును. లేదా వారి నియమము కావచ్చును.

టిబెటన్ లామాలు ఆయా ఆరామ దేవాలయములలో కాళ్ళు చేతులు భూమిపై ఆన్చుచు, పరిక్రమలు జరిపెదరు. ఒకప్పుడు ఆ పరిక్రమలలో బరువైన మత గ్రంథములను తలపై కట్టుకొని మోయుట కూడ జరుగుచుండును. అట్లు ఆ గ్రంథములను మోయుచు పరిక్రమలు జరుపుట వలన ఆ గ్రంథము లన్నియు సంపూర్ణముగా పఠించిన ఫలితము వారికి చేకూరునని వారి విశ్వాసము.

ఒక పర్యాయము కొందరు ఆంగ్లేయ యాత్రికులు లాసాలోని ఒక ఆరామమున ఒక లామాను సందర్శించిరి. ఆ లామా ఒక ఉచితాసనముపై కూర్చుండి జపచక్రమును చేతితో త్రిప్పుచుండెను. ఈ ఆంగ్లేయులు ఆ లామా ఎదురుగా కూర్చొని ఆయనతో ఏదో చెప్పబోగా ఆ లామా అతివేగముగా తన జపచక్రమును త్రిప్పుచు కూర్చుండెను. ఆంగ్లేయులు ఆ లామా తమను పిచ్చివారిగా భావించు చున్నాడేమోనని భ్రాంతి పడి ఆశ్చర్యముతో తెల్ల మొగములువేసికొని బయటికి వచ్చిరట. కాని ఆ తర్వాత ఆ ఆంగ్లేయులు - ఆ బౌద్ధలామాలు అతిధులతో మాట్లాడునప్పుడు కూడ తమ జపచక్రమును త్రిప్పుచునే యుందురని వారు తెలిసికొని ఆశ్చర్యపోయినట్లు - ''మోనియర్ విలియమ్స్'' అను చరిత్రకారుడు తన ''బుద్ధిజం'' అను గ్రంథములో ఉదహరించి యున్నాడు. దీనిని బట్టి ఆ లామాలు ఏ పనిచేయుచున్నను దినమంతయు జపము చేయుచునేయుందురని భావించవచ్చును.

ఈ టిబెటన్ను లామాలు చేయు ఆచారములవంటి ఆచారములు మన దేశములో కూడ అక్కడక్కడ కాననగును. దక్షిణ భారతదేశమునగల సుప్రసిద్ధ ''అయ్యప్పస్వామి'' ఆలయమునకు వెళ్ళువారు వారివారి మొక్కుబడులను కొబ్బరికాయలు మున్నగువానిని నెత్తిపై నుంచుకొని పర్వతముపై గల ఆలయమునకు

ఎక్కుచు మొక్కులు తీర్చుకొనుట చూడగలము. దీనిని 'ఇరుముడి' గా పేర్కొందురు. కొన్ని కొన్ని ఆలయములలోనికి అంగవస్త్రములు మాత్రమే వేసుకొని వెళ్ళవలసిన నియమములు కూడ నున్నవి. (అంగీలు, బనియన్లు కూడ విప్పవలెను.)

మేము మూడున్నర గంటలకు లేచి మరల ప్రయాణమైతిమి. మాలోని పెద్దలు కొందరు యాకుల నధిరోహించిరి. మేము నది వెంబడి నడచుచుంటిమి. కొద్దిదూరములో పర్వతముపైనుండి పడిన పెద్దపెద్ద బండరాళ్ళు మా దారి నడ్డగించుటే కాక నదిలోనికి కూడ పడియుండెను. మేము జాగ్రత్తగా వాటిపై నుండి దాటి బయటికి చేరితిమి. అట్లే మేము కొంతదూరము ముందునకు సాగగా, ఆ నది కొంతదూరమై విశాల ప్రదేశము వచ్చెను. అక్కడ ''లాంచుకీర్'' ''తొప్పెన్ఛూ'' అను రెండు నదుల సంగమ మగుపించెను. ఆ సంగమమునుండి ఆ నది ''జోంగ్ఛూ'' యని పిలువబడును. అచటి దారి సమతలభూమిపై నుండుట వలన ప్రయాణము కొంచము త్వరగా సాగెను. అట్లు నాల్గు కిలోమీటర్ల దూరము పోవునప్పటికి ''గంగ్సా'' యను ''గొంపా''వచ్చెను. కొన్ని శిథిలమైన గొంపాలయొక్క చెక్కడములు గల్గిన రాళ్ళు అక్కడక్కడ చెదరిపడి మాకు రెండు ఫర్లాంగుల దూరమువరకు కన్పించెను. ఆ మధ్యలో నాకు కాళ్ళు లాగగా ఒక మిత్రుడు యాకు దిగగానే నేనా పిల్ల యాకును ఎక్కితిని. నేను ఇరవై నిముషముల కన్న ఎక్కువసేపు ఆ యాకుపై ప్రయాణించలేదు.

మాముందు వెళ్ళిన యాకులను ఐదుగంటల ప్రాంతమున మేతకు ఆపిరి. మిత్రులందరు అచటనే విశ్రాంతి తీసుకొనుచుండిరి. నేను అక్కడకు చేరి ఆగకుండా ముందుదారి వెంట ప్రయాణము సాగించితిని. దారిమధ్యలో కొన్ని నదులను దాటితిని. అనేక ఎత్తయిన పర్వతముల ప్రక్కనుండి దారి వెంబడి ముందునకు సాగి వెళ్ళుచుంటిని. దారి ప్రక్కన ఇంకొక నది వచ్చెను. దాదాపు మూడు అడుగుల వెడల్పు గల ఆ దారి నది ఒడ్డుపైననే యుండుటయు నది చాలా లోతుగా యున్నందునను ఆ దారి ప్రమాదముగా యుండెను. నేను ఒక్కడినే ప్రయాణము చేయుచుంటిని. కొందరు లామాలు టిబెటనులు నా వెనుక నుండి త్వరత్వరగా నడచుచువచ్చి నన్ను అధిగమించి పోవుచుండిరి. నేను వారితో సమాన వేగముగ నడువలేక వెనుకబడి ఒంటరిగానే నెమ్మదిగా నడచుచుంటిని. ఇట్లు సాయంత్రము ఆరున్నర గంటలకు నేను నదితోపాటు ఒక విశాలమైన మైదానమును చేరితిని. అక్కడినుండి ఆ నది తిన్నగా పోయెను. మాదారి కుడివైపునకు తిరిగినది. ఇదే నదిని బస్సులో మేము ''దార్చెన్'' కు పోవు దారిలో దాటినట్లు ఊహించితిని. కొద్దిదూరాన ''దార్చెన్'' క్యాంపు కనిపించునను భ్రమ కల్గినది. కాని ఎంతోసేపు నడచినను దాని ఛాయలు కూడ కన్పించలేదు. నాకు ఎడమవైపున మైదానము కుడివైపున పర్వత పంక్తులు కనుచూపు మేర కాన్పించుచుండెను. అచట ఇంకొక నదిని దాటగానే

చివరిది ఐదవది అయిన ''సిలుంగ్'' గొంపా వచ్చెను. చుట్టుప్రక్కల ఎక్కడ కూడ మానవమాత్రుడు కన్పించలేదు. పొరపాటున దారిగాని తప్పితినా యని అనుమాన ముదయించుచుండెను. అట్లే ఒంటరిగా ప్రాణము బిక్కుబిక్కుమనుచు నడక సాగించుచుంటిని. ఇట్లు నడువగా ఎనిమిది గంటల ప్రాంతమున - కొద్ది దూరాన - ''దార్చన్'' క్యాంపు గ్రామము కనుపించి ప్రాణము లేచి వచ్చెను. కాని ఇంకను ఆ క్యాంపు రెండు కిలోమీటర్లు దూరమునకు ఎక్కువే గాని తక్కువ లేకుండెను. ఆ సంతోషబలముతో అట్లే ముందరకు పోగా దారిమధ్యలో ఒక నది అడ్డు వచ్చుటచే ''దార్చెన్'' గ్రామమునకు పూర్తిగా వెనుకవైపునకు పోవలసివచ్చెను.

అచట గల ఒక కర్రవంతెనపై నుండి ''ఉమాఛూ'' నదిని దాటి ఎనిమిదిన్నర గంటలకు క్యాంపుకు చేరి విపరీతమైన అలసట చెంది యుండుటచే ప్రక్కలో వ్రాలిపోయితిని. ఆ రోజు క్యాంపుకు మా అందరికన్న ముందుగా కిషోర్ చేరెను. ఆ తర్వాత నేను చేరితిని. మిగతా వారందరును ఇంకా వెనుకనే దారిలో యున్నారు. నాకు షణ్ముగసుందరం కిషోర్‌లు నీరు టీ తెచ్చి యిచ్చిరి. వారే వంట ప్రయత్నము కూడ చేయుచుండిరి. నేను నదిని దాటు వరకు యాకుల వారు చేరుకోలేదు. అంటే బాగా వెనుకపడిరి. దాని కారణంగా మా గ్రూపులో మిగిలినవారు నెమ్మదిగా నడచియే నదిదాక వచ్చిరి. అప్పటికి కూడ ఈ యాకులవారు రాని కారణంగా అందరును నడచియే వచ్చి క్యాంపు జేరిరి. ఈ లోగా మాదోర్చి (నౌకరు) వంతెన వద్దకు టార్చి ఎదురుగా తీసుకొని వెళ్ళి వారికి దారి సరిగా చూపుటకు సహాయపడెను. వారు వచ్చి వేడినీటితో కాళ్ళు చేతులు మాత్రమే కడుగుకొనిరి. అందరము భోజనాలు ముగించితిమి. శ్రీ చొక్కారావుగారు ఆ రోజు కూడ ఏ విధమైన ఆహారము తీసుకొనలేదు. ''సూపు'' (వేడిచారువంటిది) మాత్రమే కొద్దిగా తీసుకొనిరి. వారి జ్వరము ఇంకను తగ్గలేదు. పైగా విరోచనములతో కూడ బాధపడుచుండిరి. ఆ రోజు ముప్పై అయిదు కిలోమీటర్ల అతి ప్రమాదభరితమైన ఆ ప్రయాణము వలన విపరీతముగా అలసిపోయి మేమందరము చలిబాధతో వెంటనే నిదురలో మునిగిపోతిమి.

శ్లో. చారుస్థితం సోమకలావతంసం
వీణాధరం వ్యక్తజటాకలాపం
ఉపాసతే కేచన యోగిన స్త్వా
ముపాత్తనాదానుభవప్రమోదమ్.
ఉపాసతే యం మునయ శ్శుకాద్యా
నిరాశిషో నిర్మమతాధివాసాః
తం దక్షిణామూర్తితనుం మహేశ
ముపాస్మహే మోహమహార్తిశాన్త్యై.

# ఇరువది ఆరవ అధ్యాయం

## కైలాస పురాణగాధ - విశేషములు

శ్లో. కాన్త్యా నిన్దిత కుంద కందలవపు ర్న్యగ్రోధమూలే వస
న్కారుణ్యామృత వారిభి ర్మునిజనం సంభావయ న్వీక్షితైః
మోహధ్వాన్తవిభేదనం విరచయ న్బోధేన తత్తాదృశో
దేవ స్తత్వమసీతి బోధయతు మాం ముద్రావతా పాణినా.

ఆ కైలాస పర్వతము ప్రస్తుతము చైనా దేశములోని టిబెట్టు రాష్ట్రములో హిమాలయ పర్వత శ్రేణిలో కైలాష్, జస్కార్ పర్వత శ్రేణులలో 22,000 అడుగుల ఎత్తున నున్నట్లు తెలిసికొంటిమి. దీనినే వెండికొండ యనియు మేరు పర్వతము గాను కొందరు భావింతురు. 1962 సంవత్సరముపూర్వము మన దేశీయులు అచటికి నిరాటంకముగా వెళ్ళుచు ఆ పవిత్ర కైలాస శిఖరమును దర్శించి పరిక్రమ చేసి వచ్చెడి వారు. టిబెటు దేశస్థులు కూడ మనదేశములోని సారనాథ్ మున్నగు బౌద్ధ క్షేత్రముల దర్శించుటకే కాక వ్యాపార నిమిత్తమై కూడ నిరాటంకముగా వచ్చుచుండిరి. తరువాత జరిగిన రాజకీయ మార్పులవలన టిబెట్టును చైనా ఆక్రమించు కొనుటవలనను చైనా భారత యుద్ధము వలనను ఇప్పుడచటికి వెళ్ళుటకు భారతీయులకు 'పాస్‌పోర్టు' ''వీసా'' అవుసరమవు తుయున్నవి.

మన పురాణాలలోయున్న పుణ్యతీర్థ క్షేత్రములలో కెల్ల దివ్యత్వము కలిగిన అతి పవిత్రమైన ఆ కైలాస పర్వతము ఆది దంపతులైన పార్వతీ పరమేశ్వరుల నివాస స్థానముగా మన పురాణములు పేర్కొనుచున్నవి. ఈశ్వరుడు సృష్టినంతయు నడుపు అధినాయకులైన ముగ్గురు దేవులలో ఒకడు. కావున ప్రతి హిందువునకు ఆ కైలాస పర్వతము అతి ముఖ్యాతి ముఖ్యమైన పుణ్యక్షేత్రము. భూమండలము యొక్క గరిమనాభి అచ్చటనే యుండి భూభారమంతయు ఇచట నుండియే కేంద్రీకరింప మోయబడుచున్నట్లుగా పూర్వ శాస్త్రగాధలే కాక నవీన శాస్త్రజ్ఞులు కూ నమ్ముచున్నారు. సమస్త సురాధీశ్వరుల కధీశ్వరుడు వేదకర్త సకల కర్మ ఫలదాత యైన పరమేశ్వరునకు ఆ కైలాస పర్వతమే నివాసము.

నేటి కాలములో ముఖ్యముగా భారతీయ యువకులలో భక్తి భావన ఆధ్యాత్మిక చింతన త రిగిన మాట వాస్తవము. తీవ్ర భావాలు కల మరికొందరిచే అసలు భగవంతుడే లేడను నాస్తికవాదము ప్రబలుచున్నది. మన చెవులు దిబ్బపడినపుడు బయటి శబ్దము వినపడదు. రేడియో ట్యూన్ సరిచేయనిదే సరియగు స్టేషనుకు మార్చనిదే ప్రసారములు ఎట్లు సరిగా వినలేమో అట్లే మానవుడు తన మనస్సు

సరిగా ట్యూన్ చేసికొని భగవంతునిగూర్చి భక్తిని గూర్చి తెలుసుకోవలెను. పురాణ పుస్తక పఠన గావించి పుణ్యక్షేత్రములను దర్శించి ప్రకృతి దృశ్యములనుగాంచి కొద్ది కొద్దిగా భగవత్ సాధనను మొదలిడినచో ఆ అనుభూతిని తన్మయత్వమును పొందుటే కాక తనువు పులకరించి పరవశ మగుననుటలో సందేహము లేదు. ఆ కైలాస మహిమ ఎట్టి దన - ఎంతటి ఘనుడైన మానవుడేని ఆ కైలాస పర్వత దర్శనము చేయగనే దానికి తలవంచి మోకరిల్ల వలసినదే. కొందరు భక్తులు ఆ కైలాస పర్వతముతో కలసిన ఇతర పర్వతములను కూడ కలుపుకొని ''రుద్రమాల'' యను పూర్తి పరిక్రమ జరుపుదురు.

పురాణ గాథలలో ఆ కైలాస పర్వతమును చేరుట చాల దుర్లభమనియు అది ఇంద్రాదిదేవతలకు కపిలాది మునులకు కూడ కష్ట సాధ్యమైనదని తెలియచేయబడినది. శ్రీ మహావిష్ణువు అచట కొంత కాలముతపమొనరించి నట్లు చెప్పబడెను. అంత మహోన్నత ప్రాశస్త్యము కలిగిన అ కైలాస దర్శనము చేయుటవలన జన్మ చరితార్థమగు ననుటలో సందేహమేమియు లేదు.

అచట ''ధీరాపుక్ గొంపా'' గొంపాలలో లభించిన టిబెట్ పురాణముల సహాయముతోను ''కాంగ్రి కర్ఛక్'' పురాణము సహాయముతోను ''సోల్డేప్'' అను మత గ్రంథములలో దాని పురాణ సారాంశములు ప్రచురితమాయెను. ఆ గ్రంథములో కైలాస పర్వతము విశ్వము యొక్క మధ్య భాగమనియు అది కుడివైపు నుండి ఆకాశమువైపు ఇరుసు యొక్క చక్రము లాగా విశ్వమంతయు తిరుగగలదని తెల్పబడినది. ఆ పర్వతము నాల్గు వైపుల గల ఫలకములలో తూర్పున స్ఫటికమువలె దక్షిణమున నీలమువలె పడమర ఎరుపువలె ఉత్తరమున బంగారమువలె రంగు గలిగి వజ్ర వైఢూర్యములతో కూడి యున్నట్లు చెప్పబడినది. ఆ కైలాస శిఖరము వికసించిన పుష్పములతో మూలికలతో కప్పబడియున్నట్లు కూడ ఆ పురాణములో గలదు. ఆ కైలాస శిఖరమునకు నాల్గు వైపుల బుద్ధుని పాదముద్రలున్నట్లు తెలియజేయబడినది. పైన ఆకాశ దేవతలు గాని క్రింద మానవులుగాని ఇతరులెవ్వరు గాని ఆ కైలాసమును ఎత్తుకొని పోకుండ ఆ పాదముద్రలు కాపలాకాయుననే నమ్మకము కూడ కలదు. ఆ కైలాస శిఖర ముఖ్య రక్షకుడు ''ధెంఛుక్'' అనబడు ''ధర్మపాలు''డను దేవత. ఆతడు పులి చర్మమును ధరించి మనిషి పుర్రెలను (కపాలములను) దండలుగా వేసికొని దేవీ సహితుడై యుండునని ప్రజలు విశ్వసింతురు.

ఆ కైలాసము చుట్టును గల 990 వరుసలలో ఒక్కొక్క వరుసకు 500 చొప్పున ఇతర దేవతలు (ప్రమధులు) న్నట్లును వీరందరు పులి చర్మధారణతోనే ఉందురనియు చెప్పెదరు. ''దేంఛాక్'' యొక్క సహవాసి ''దొర్జెపాంగ్మో'' అనబడే

''వజ్రవారాహి'' శక్తి దేవత కూడ కైలాసమునకు పడమరలో గల ''త్రిజుంగ్'' మంచు శిఖరమును అంటి పెట్టుకొని స్థిరనివాసినియై యున్నట్లు చెప్పెదరు. ఇవే కాక బుద్ధుడు ఆయన శిష్యులైన 500 బోధి సత్వులు కూడ అచటనే ఉన్నట్లుగాను కైలాస పాద భాగమున వాయు నందనుడైన ''హనుమంతుడు'' ఉన్నట్లుకూడా చెప్పబడినది. ఈ హనుమంతుడు రుద్రాంశ సంభూతుడు. రుద్రాంశలు పదకొండు విధములు. అందులో హనుమ ఏకపాదరుద్రునియవతారముగా రామాయణ ఉత్తర కాండలో అగస్త్య మహాముని శ్రీ రామచంద్రునికి తెలిపినట్లు ఈ క్రింది పద్యముచే తెలియును. ☝

ఉ. చండక రాన్వయాంబునిధి చంద్ర రఘూద్వహ యీసమీరపు
త్రుండు మహాత్ముడౌనె కద తొల్లిటి పుట్టుక నేకపాదరు
ద్రుండితడంచు గొందరు బుధుల్ గణియింపుదు రారహస్యమె
వ్వండెరుగుం జరాచరభవంబు లెరింగిన నీవు దక్కగన్.

☝ ఇవే కాక కైలాస మానస ప్రాంతములో ఇంకను ఎన్నో దేవతలున్నట్లును సామాన్యులకు వీరిని చూచు భాగ్యముండదనియు కూడ ఈ టిబెట్ పురాణ గాథలలో ఉల్లేంఖింపబడి యున్నది.

ఆ కైలాస శిఖరము 22,000 అడుగుల ఎత్తున నుండి అర్ధ చంద్రాకృతిలో ఎల్లవేళల మంచుతో కప్పబడి యుండును. అందువలన దానిపై భాగమును ఇంతవరకు ఎవరును చేరలేదు. ఆ శిఖరము యొక్క ఆకృతి లింగాకారములోనుండి పద్మముగా చుట్టును గల పర్వతములు పద్మము యొక్క రేకులు రుద్రమాలగా తోచును. (పద్మ పత్రముల వంటి పర్వతములు మధ్యన లింగాకారమును బోలు శిఖరముతో ఎల్లప్పుడు మంచుతో కప్పబడి గొప్ప ప్రకృతి విచిత్ర వైఖరులలో నొకటిగా ఎల్లప్పుడును సూర్యరశ్మికి ధగ ధగ తెల్లగా మెరయు వెండి దిమ్మవలె చూపరుల కత్యానందము గొల్పుచు ఆ కైలాస శిఖరము ప్రకృతి యొక్క మహత్తర శక్తికి నిదర్శనముగా మనకు గోచరించును.) ఆ కైలాస పరిక్రమ 15,000 అడుగుల ఎత్తునుండి 19,000 అడుగుల ఎత్తువరకు పర్వతములపై సాగుచు ''రుద్రమాల'' పరిక్రమ జరుపవలసి వచ్చును. ఆ 'రుద్రమాల' పరిక్రమ ఒకసారి చేసిన ఈ జన్మలోని పాపాలు హరించునని పదిసార్లు చేసిన ఒక కల్పము చేసిన పాపాలు హరించునని నూట ఎనిమిదిసార్లు పరిక్రమ చేయగల్గితే ఈ జన్మలోనే మోక్షము లభించుననియు ఆయా గాథల వలన తెలియుచున్నది. దీనిని 13 సార్లు పరిక్రమ చేసిన వారికి మరొక అంతర పరిక్రమ గోచరించుననియు అది ఆరుగంటలలోనే పూర్తి చేయవచ్చుననే విశ్వాసము కూడ కలదు. ఎంతో దైవభక్తి గల ఏకాంత చిత్తులకే ఇది సాధ్యపడుననియు మరియు ఈ

అంతర పరిక్రమ చేయు వారికి పరమ శివుని తాండవ నృత్య డమరుక నాదస్వరముల ధ్వనులు వినుపించుననియు నమ్మకము గలదు. ఈ పరిక్రమ చేసిన వారు ఇందు నుండి వచ్చు కొన్ని రకములైన ధ్వనులు విన్నవారు ఇతరులకు దారిచూపరు. విన్నవి పరులకు చెప్పరు. చెప్పినను అవి బోధపడబోవు. ఆ కైలాస శిఖర అంచుల పైగల మంచు గడ్డలు సూర్యరశ్మిచే బీటలు వారి చిట్లి క్రిందికి పడునప్పుడు ఈ గడ్డలు అక్కడక్కడ పడుచూ గెంతుచూ క్రిందికి వచ్చును. ఇట్లు పడుచు ఈ గడ్డలు నానావిధ ధ్వనులు చేయును. పై ధ్వనులు ఎండ వేడిచే మంచు బీటులు వారి విరుగుటచే కలిగి వినిపించునని వైజ్ఞానికుల యభిప్రాయము.

ఆ కైలాస పర్వతము చుట్టునుగల అయిదు గొంపాలను గూర్చి తెలుసుకుంటిమి. ఈ పర్వతమున కెదురుగనే మానససరోవర రాక్షసతాళ్ సరస్సులుగలవని తెలిపియేయుంటిని. ఆ ప్రకృతిసిద్ధ సరోవరములు ప్రకృతి మాతకు ప్రతీకలు. ఆ శిఖరమునకు తూర్పువైపున 1¼ కిలోమీటరు పొడవు, ½ కిలోమీటరు వెడల్పు, 84 అడుగుల లోతుగల ''గౌరీకుండ్'' (తుకిజింబో) అనే అండాకార సరస్సు 19,000 అడుగుల ఎత్తున నున్నది. పార్వతీదేవి ఆ సరస్సునందు స్నానమాచరించునని భక్తుల విశ్వాసము. కొందరు యాత్రీకులు కూడ అందులో స్నానము చేసిన పుణ్యము గలుగునని భావించుచుందురు. దానికి దగ్గరలో ''రుక్త'' యను ఒక నల్లనీటి సరస్సు 700 మీ. చుట్టు కొలత కలిగియున్నది. దానికి కొంత దూరములో ''దుర్చి'' అనే పాలనీటి సర స్సు 100 మీ. చుట్టుకొలత గలిగి చూచుటకు చాల వేడుకగా నున్నది.

ఆ కైలాప శిఖరమును పరిక్రమించునపుడు కైలాస దృశ్యము వివిధ సమయములందు వివిధ ఆకృతులతో కనులకువిందుగా కన్పించును. అందుచే మనకు వివిధ రకములైన ఊహలు వానిని చూచినప్పుడు జనించును. ఒకసారి పరమశివుడు జటాధారియై మరొకసారి రుద్రాక్షాధారియై మరొకసారి శివుడు కనులు మూసుకొని తపోనిమగ్నుడై యున్నట్లును ఇంకొకసారి శివలింగమునకు ముందు నందీశ్వరుడు నిలచినట్లును తోచి మనస్సు రకరకాల ఊహా జగత్తులో ఓలలాడుచు తృప్తినిచ్చి ఎంతో ఆనందమును పొందు అనుభూతి వర్ణనాతీతము. దీనినే జైనులు ''అష్టపద'' క్షేత్రముగా భావింతురు. వారి ముఖ్యదేవత '' ఆది నాధ దేవుడు!'' అచటనే యున్నట్లు నమ్మెదురు. ఆ విధముగా ఆ కైలాసపర్వతము హైందవులకు బౌద్ధులకు జైనులకు ముఖ్యక్షేత్రమైయున్నది. ఆ క్షేత్రములో శైవ శాక్త బౌద్ధ సంప్రదాయముల సమన్వయము మనకు గోచరించును. మరియు ఎందరో మహానుభావులు ఆ కైలాసప్రాంతములో సజీవబ్రహ్మ ఐక్యానుసంధానము గావించియున్నారు.

శ్లో॥ ఏకః ప్రజాయతే జంతు రేక ఏవ ప్రలీయతే।
ఏకో౽నుభుంక్తే సుకృత మేక ఏవ చ దుష్కృతమ్॥ (మను-4. 240)

జీవుడు ఒంటరిగా పుట్టుచున్నాడు. ఒంటరిగా మరణము పొందుచున్నాడు. ఒంటరిగానే ధర్మ అధర్మ ఫలములను సుఖ దుఃఖములను అనుభవించుచున్నాడు. మనవెంట వచ్చున దేదియు లేదు. మనము చేసిన పాప పుణ్యముల ఫలితమువల్లనే మనకీ మోక్షము లేదా జన్మరాహిత్యము మొదలగునవి కల్గుచున్నవి.

శ్లో॥ మృతం శరీర ముత్సృజ్య కాష్ఠ లోష్ట సమంచితౌ।
విముఖా బాంధవా యాంతి ధర్మస్త మనుగచ్ఛతి॥ (మను - 4-241)

ఎవరు మరణించినా వారిని మట్టిలో కలిపియో కాష్టములో తగులబెట్టియో అందరును తిరిగివచ్చుచున్నారుగదా! మరి చనిపోయినవారితో బోవు వారెవరు? ఎవరును వెంబడిపోరు. కాని అతని ధర్మము మాత్రము ఆయన వెంటనే యుండును. దాని ఫలితమునే ఆయన అనుభవించును.

మా వెంట వచ్చిన కీ.శే. రామకృష్ణన్‌గారి మృతదేహమును అప్పగించుటకైనను మేము అశక్తులుగా యుంటిమి. కావున తీర్థయాత్రలతోపాటు ధార్మిక విధి మానవ సేవ మాతాపితరుల సేవ ఇతర అనేక ధార్మిక సత్య మార్గముల ద్వారా మోక్షమును ముక్తిని లేదా జన్మరాహిత్యమును బడయ వచ్చునని మనశాస్త్రములు ఘోషిల్లుచున్నవి.

మోక్షమనగా బంధింపబడినవాడు బద్ధుడనియు విడివడినవాడే విముక్తుడనియు, అతడే మోక్షము బొందినవాడని పెద్దల యభిమతము. ప్రాణి సంకల్పముతో జీవత్వముచేత బంధింపబడియున్నది. నేను జీవుడనను సంకల్పముచే జరామరణము లున్నవని తలచి పాపపుణ్య ఫలములకొరకు మరుజన్మలో రాబోవు సుఖములకై దాన ధర్మాది పుణ్యకార్యముల నొనర్చుచున్నాడు. గత జన్మలోని పాప పుణ్య ఫలములను ఈ జన్మములో అనుభవించి తీరవలెనను ధృఢ భావము బాదుకొనియుండుటచే ''బద్ధుడు'' యనబడును. కావున మరుజన్మలో బొందబోవు భోగభాగ్యముల విచారము చేయువాడు 'బద్ధుడు' అజ్ఞానియని తెలియవలయును. బహుజన్మాంతర విశేషముచే మానవజన్మ సంభవించినను మరుజన్మకూడ మానవరూపమున బొందునను నిశ్చయము లేదు. పాపపుణ్యములు సమమగునేని నరజన్మ లభించునని వ్యాసభగవానుడు భాగవతములో నుడివిరి.

శ్లో : శరీర మాద్యం సులభం సుదర్లభం
ప్లవం సుకల్పం గురుకర్ణధారం
మాయానుకూలేన నమస్వతేరితం
పుమాన్ భవాబ్ధిం న తరే త్స ఆత్మః॥

☝ ఇట్టి పరమదుర్లభ దేహరూప నౌకను గురురూప ధారుని కృపా రూపానుకూలమునుబొంది, భవసాగరము దాటలేని మానవుడు ఆత్మ హంతకుడు. జ్ఞానహీనుడు. 84 లక్షల నానావిధ జనన మరణముల బొందును. కావున ముందు జన్మయనునది దురాశగా భావించి మూర్ఖ అజ్ఞానపు స్వయం బంధమున తనకు తాను శత్రువై యుండకూడదు. ☝

'' ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మై రిపు రాత్మన :''

☝ సాధుసాంగత్యముచే పై సంకల్పము వీడి చరాచర పంచభూతాత్మిక నిర్మితములైన ప్రకృతి స్వభావ జగదాకారమందు వర్తించుచున్నవని తెలియవలెను. దేహము అవస్థ అభిమానము, స్థానము, భోగము, మాత్రము, గుణము, శక్తి మున్నగు తత్త్వ లక్షణ పిండబ్రహ్మాండము లిట్టివి. అష్ట దేహములు నాల్గు పిండములో నాల్గు బ్రహ్మాండములో నున్నవనియు ప్రకృతి పురుషుని,గల్పి పదిదేహములు ఉండునని తత్త్వలక్షణము. వీనికి 'ఆత్మ' సాక్షిగనుండియు వేరుగ నున్నది. కావున మరుజన్మ యాశవీడి బంధము నుండి తొలగి మోక్షము లేదా జన్మరాహిత్యముకై ప్రయత్నించవలయునని దాసబోధాకారుని యభిమతమైయున్నది. ☝

శ్లో : అగౌరగాత్రై రలలాటనేత్రై
రశాన్తవేషై రభుజంగభూషైః
అబోధముద్రై రనపాస్తనిద్రై
రపూర్ణకామై రమరై రలం నః.
దేవతాని కతి సన్తి చావనౌ
నైవ తాని మనసో మతాని మే
దీక్షితం జడధియా మనుగ్రహే
దక్షిణాభిముఖ మేవ దైవతమ్.



# ఇరువది ఏడవ అధ్యాయం

## బౌద్ధమతము

శ్లో. ముదితాయ ముగ్ధశశినా వతంసినే
భసితావలేప రమణీయ మూర్తయే
జగదిన్ద్ర జాల రచనాపటీయసే
నుహసే నమోఽస్తు వటమూల వాసినే.
వ్యాలమ్బినీభిః పరితో జటాభిః
కలావశేషేణ కలాధరేణ।
పశ్యల్లలాటేన ముఖేన్దునా చ
ప్రకాశసే చేతసి నిరమలానామ్.

✍ బౌద్ధ మతములో ముఖ్య విధులు అష్ట విధములుగా చెప్పబడిన వి.

1. సమ్మ్యదిద్ధి - సరియగు అవగాహన.
2. సమ్మ్యక్సంకల్పము - సరియగు ఆలోచన
3. సమ్మ్యగ్వాక్కు - సరియగు మాట లేక సరియగు ఉపన్యాసము.
4. సమ్మ్యరమంతము - సరియగు పని - లేక సరియగుప్రక్రియ.
5. సమ్మ్యక్ అజీవము - సరియగు జీవనము
6. సమ్మ్యక్ సాతి - సరియగు మనోవికాసము
7. సమ్మ్యక్ సమాధి - సరియగు ధ్యాననిముగ్నత.

బౌద్ధ మతము నవలంభించిన వారు పై సిద్ధాంతముల ననుసరింపవలెను.

☝ అశోక చక్రవర్తి కుమారుడైన మహేంద్రుని ద్వారా కుమార్తె సంఘమిత్ర ద్వారా బి.సి. మూడవ శతాబ్దిలో శ్రీలంకలో బౌద్ధ మతము వ్యాప్తి చెందెను. చైనాలో క్రీస్తు ప్రథమ శకములో బౌద్ధ మతము వ్యాప్తి చెందెను. బర్మాలో కూడ దాదాపు ఇదే కాలములో వ్యాప్తి చెందెను. జపానులో 6వ శతాబ్దిలో బౌద్ధ మత వ్యాప్తి చెందెను. టిబె ట్టులో కూడ అప్పుడే జరిగినది.

బౌద్ధమతములో ''ప్రత్యీసముత్పాదములు'' సిద్ధాంతీకరింపబడినవి. మరియు హిందూ మతము లాగనే బౌద్ధ మతము కూడ ''కర్మ'' సిద్ధాంతమును నమ్మును.

వైదిక మతములో వలెను అది బౌద్ధములో విగ్రహారాధన లేకున్నను తరువాత కాలములో ఈ విగ్ర హారాధన విస్తృతముగా చోటు చేసుకొన్నది. ఇచట నొక ఆశ్చర్యకరమైన విషయము జ్ఞప్తికి వచ్చును. బౌద్ధ లామాలలో వారి వారి స్థాయి ననుసరించి క్రమోన్నతము లగు శ్రేణులున్నవి. అట్లే బుద్ధుని అవతారమును గూర్చి కూడ గౌతమ బుద్ధునికి పూర్వము ఇరవై ముగ్గురు భూతకాల భోదిసత్త్వులుండినట్లు చెప్పబడినది. వారి పేర్లు దీపంకర, కౌండిన్య, మంగల, సుమన, రైవత, సోహిత, ఆనవమ, దర్శిన, పద్మ నారద, పద్మోతర, ధర్త తిష్య, పుష్య, విపశ్య, శిఖ, విశ్వ భూ, క్రుచ్ఛంద, కనక, కశ్యపులనియు బౌద్ధ పురాణములలో తెల్పబడినది. గౌతమ బుద్ధుని అవతారము కాలము సమాప్తము కాగానే భవిష్యత్కాలములో మైత్రేయ బుద్ధుడు అవతరించగలడని టిబెట్ బౌద్ధుల విశ్వాసము. గత నాల్గు యుగములలో క్రకుచ్ఛంద కనక కశ్యపులును, ప్రస్తుత భద్ర కల్పమున గౌతమ బుద్ధుడును భూమిపై మానవ దేహముతో అవతరించి యున్నారనియు వారు భావింతురు. బౌద్ధ పురాణములలో ఇల్లాంటి అనేక విశేషములను చూడవచ్చును. దీనిని బట్టి హిందూ పురాణములలో గల అవతార తత్వమునే బౌద్ధులు అనుసరించి బుద్ధునికి అనేక అవతారముల కల్పించిన ట్లు భావించవచ్చును. ☝

బౌద్ధులు క్షిణుక వాదులని యందురు. ఏలన

శ్లో. కార్యకారణ భావాద్వా స్వభావాద్వా నియామకాత్।
అవినాభావ నియమో దర్శనాంతర దర్శనాత్॥

☝ అనగా కార్య కారణ భావము కారణ దర్శనము కార్యాదుల సాక్షాత్కారముల ప్రత్యక్షము ననుసరించి శేషము నందు అనుమానము కల్గుచున్నది. దీని నంగీకరింపక జీవుల సమస్త వ్యవహారములు పూర్ణము కానేరవు. ఇట్టి లక్షణాధిక్యతచే చారువాకుల భిన్నమతమే బౌద్ధ మతము. ఇది నాల్గు విధములు : 1. మాధ్యమికులు, 2. యోగాచారులు, 3. సౌత్రాంతికులు 4. వైభాషికులు. ఇందు మొదటివారు. సర్వమూ శూన్యమని నమ్ముదురు. రెండవ వారు బాహ్య శూన్యము నమ్ముదురు. మూడవ వారు వెలుపలి పదార్థము ననుమానింతురు. నాల్గవ వారు బయట పదార్థము ప్రత్యక్ష మగునే కాని లోన కాదందురు. ఆ విధముగ వారు సమగ్రతను గుర్తించలేక పోయారని చెప్పవచ్చును. ☝

శ్లో. దేశనాలోక నాథానాం సత్త్వాశయ వశానుగా ః।
భిద్యన్తే బహుధా లోకే ఉపాయై ర్బహుభి ః కిల॥

☝ జ్ఞానులు విరక్తులు జీవన్ముక్తులు లోకనాధులు బుద్ధుడు మొదలుగా గల తీర్థంకరులు పదార్థ స్వరూపము గ్రహించి భిన్న భిన్న విషయముల ప్రతిపాదించు ఉపదేశకుడు అనేకానేక భేదోపాయములతో చెప్పిన వానిని అంగీకరింపవలెను. ☝

శ్లో. జ్ఞానేంద్రియాణి పంచైవ తథా కర్మేంద్రియాణి చ।
మనో బుద్ధి రితి ప్రోక్తం ద్వాదశాయతనం బుధైః ॥

జ్ఞానేంద్రియము లయిదు, కర్మేంద్రియము లయిదు, గల పది ఇంద్రియములతో పాటు మనస్సు బుద్ధిని సత్కరించుట బౌద్ధుల యొక్క మతము. శ్రీ వివేకానందులు సెలవిచ్చినట్లు బౌద్ధమతము హిందూ ధర్మము యొక్క సంతానమైయు హిందూ దర్మమును వ్యతిరేకించుచున్నది. సు

బౌద్ధ మతములో కూడ సత్యాహింసలకు ప్రాధాన్యత, మెండుగా నున్నది. ఈ మతము జీవహింసకు విరుద్ధము. ప్రస్తుతము బౌద్ధ మతస్థులు టిబెటులో సంకరము చెంది ( ఇతర మత ప్రభావితులై) జీవహింసను నిరాటంకముగా చేయుచున్నారు. అచటి తాంత్రికులను లామాలుగాను తాంత్రిక శక్తిని ''లామాయిజం''గాను చెప్పుకొనుచున్నారు. వారు నైసర్గిక వాతావరణము ననుసరించి జీవహింస చేయుట్లకై వెనుకాడకున్నారు. వారి కచటి వాతావరణము కూడ జీవహించ చేయుటకై పురికొల్పుచున్నది. పంటలు లేని ప్రదేశము కాన గొర్రెలు గుర్రములు చమరీ ఆవులను మేపుట సాకుట వారి ముఖ్యవృత్తి మరియు వాటి మాంస భక్షణే వారి జీవనాధారము. చేపలు కూడ వీరికి ఆహారమే. టిబెటును బౌద్ధులు మాంసములను భక్షించి, ఎముకలను ఎల్లచోట్లను కుప్పకుప్పలుగా పడవేయుదురు. అయినను వీరు సాత్వికులు. సాధు సన్యాసులయెడ వీరికి భక్తి గౌరవము కలిగి ప్రేమానురాగములతో వారికి కావలసిన పరిచర్యలు చేయుచుందురు. హిందూ సన్యాసులను వీరు హిందూ లామాలని వ్యవహరింతురు. హిందూ మతములో కూడ అత్యధికులు మాంసాహారులే నన్నది మనము గమనించాలి. కనుక జీవహింసకు మాంసాహారమునకు మధ్యగల వైరుధ్యమును గూర్చి మరింత లోతుగా ఆలోచించుట అవసరమగునేమో!

భగవద్గీతలో పార్థుడు ఒకచోట సందేహించినట్లు ఈ జగత్తులో ఒక ప్రాణికి వేరొక ప్రాణి ఏదో రూపములో హానిచేయుట సహజము. ఒక జంతువునకు మరొక జంతువు ఆహారము. పెద్ద చేపకు చిన్నచేప ఆహారము. ఒకజీవి ప్రాణమును నిలుపుటకు మరియొక జీవి బలిగాక తప్పదు. ఒకరి సంతోషము వేరొకరికి దుఃఖము. బలహీనుడు బలవంతునికి బానిస. ఇదే ప్రకృతి ధర్మము. అయినను కొందరు పెద్దలు, గురువులు, ఆచార్యులు జీవహింస చేయరాదని అహింసా ధర్మములను బోధించుచునేయున్నారు. అయినను పైన పేర్కొనబడిన టిబెటులాంటి ప్రదేశములో ప్రకృతి ధర్మమును నిరాకరించుట అసలు అక్కడ జీవహింస చేయకుండుట సాధ్యపడగలదా? నేటి కాలమున పాశ్చాత్య ధర్మోపదేశకులు ఎంతో తీవ్రముగా ఆలోచించి, జంతువులు మానవునికి ఆహారము కొరకే ఉద్భవించినవని కూడ

చెప్పుచున్నారు. కావున ఈ జీవ హింస అను సమస్య జటిల స్వభావమును కల్గి యుండునదిగా తోస్తుంది.

మానవుడు పరిమిత ప్రజ్ఞ, పరిమిత శక్తి, పరిమిత జ్ఞానమునకు లోనై యున్నాడు. కావున ప్రాపంచిక జీవితము అనేక లోపములతో కూడుకొని కొనసాగుచున్నది. హింస - అహింస, న్యాయము - అన్యాయము, మంచి-చెడు, పుణ్యము-పాపము, సుఖము-దుఃఖము మొదలగు ద్వంద్వములు సమాజ జీవితమును శాసించి బంధించుచున్నవి. వాటిని సరిజేయుట సాధ్యపడు విషయము కాదు.

కావున ఈ అజ్ఞాన ప్రపంచకమునకు అతీత మగు పారమార్థిక చింతనము ద్వారా మానవులు శాంతి - వివేకముల సాధించుకొన ప్రయత్నించవలసి యుండునని జ్ఞానులు ఆదేశించుచున్నారు. ఆత్మ జ్ఞానముద్వారా ఉత్తమగతులను సాధించు కొనుట మూలముగా ఐహికద్వంద్వముల బెడద నుండి విమోచనము చేకూరగలదని వారు విశదీకరించియున్నారు. ఇదే ఆధ్యాత్మిక జిజ్ఞాసకు ఆధారమగు మూలసూత్రమై యున్నది.

అందువలన ప్రాపంచిక అన్యాయ అక్రమ అసత్య దుష్ట ధోరణులను గురించి బాధపడుట బెంగపడుట కలతలకు గురియగుట నిష్ప్రయోజనమని అందుకే వైరాగ్యభావన ఆవశ్యకమౌతుందని కూడా జ్ఞానులు నిర్ధారించియున్నారు. శ్రవణ మననాదుల దృశ్యస్ప్రశ్యాదుల స్వానుభవాదుల ఆవశ్యకతను గూర్చి కూడ జ్ఞానయోగులు వివరించియున్నారు. హిమాలయాదియాత్రలు ఇలాంటి యోగసాధనకు ఎంతేని ఉపకరించునవిగా నుండును. ☝

శ్లో. ఉపాసకానాం త్వ ముమాసహాయః
పూర్ణేందుభావం ప్రకటీకరోషి ।
య దద్య తే దర్శనమాత్రతో మే
ద్రవత్యహో మానసచంద్రకాన్త ః
యస్తే ప్రసన్నా మనుసందధానో
మూర్తిం ముదా ముగ్ధశశాంకమౌలేః।
ఐశ్వర్య మాయు ర్లభతే చ విద్యా
మన్తే చ వేదా స్తమహోరహస్యమ్.
( ఇతి శ్రీ దక్షిణామూర్తిస్తోత్రమ్)



# ఇరవై ఎనిమిదవ అధ్యాయం

## టిబెటు వేదాంతము

శ్లో. మనోబుద్ధ్యహంకారచిత్తాది నాహం
న శ్రోత్రం న జిహ్వే న చ ఘ్రాణనేత్రే
న చ వ్యోమ భూమి ర్న తేజో న వాయుః
చిదానందరూప శ్శివోఽహం శ్శివోఽహమ్.

☝ అచట ఒక 'గొంపా' లో లభించిన గ్రంథాను సారము మానవులలో నాలుగు వర్ణములు 1. బ్రాహ్మణ (తెల్లవారు) 2. క్షత్రియ ( ఎరుపువారు) 3. వైశ్య (పసుపు) 4. శూద్ర (నల్లని) జాతులున్నట్లు తెలుపబడినది. ఈ భావన మహా భారత గ్రంథములోనిదేయై యుండును. బ్రాహ్మణుడే సన్యాసస్వీకారమున కర్హుడు. బ్రాహ్మణుడనగా, మహాభారతమునం దిట్లు చెప్పబడినది. ☝

సీ. ఎవ్వడు సత్యంబు నెప్పుడు బల్కు హిం
సావిదూరుడు గురుజనహితార్థి
ఇంద్రియంబుల నోర్చి యెల్లవారల దన
యట్ల కా జూచు ధర్మాభిరతుడు
కామంబు దగులందు కర్మంబు లారును
సముచిత సంప్రయోజ్యత నొనర్చు
నట్టి పుణ్యాత్ముని ననఘు బ్రాహ్మణుడని
యనిశంబు కీర్తింతు రమరవర్యు

తే॥ లార్జవంబు శమము నధ్యయనంబును
పరమధనము సువ్వే బ్రాహ్మణునకు
ధర్మగతికి నవియు తగు సాధనంబులు
వేద విహిత ముఖ్య విధులు నెనయ (సుబోధము)

☝ కాని పైరంగుల ననుసరించి టిబెటులోని లామాలందరు బ్రాహ్మణులు గాలేరు. రంగులు రూపములు అర్హతలో ముఖ్యము కాదు. బ్రాహ్మణుడనే వానికి సాత్విక జీవనము అహింస ధర్మాధర్మ విచక్షణ జ్ఞానము భక్తి మున్నగు ధర్మము లుండుట ముఖ్యము. ఈ ధర్మములు ఉన్న ఏ వ్యక్తి యైనను ''లామా'' లేక ''సన్యాసమునకు అర్హుడు'' అనవచ్చును. చెడు గుణములున్న వాడు కపటసన్యాసి యగును. టిబెటు లామాలు సాధారణముగా ప్రశాంతమగు గొంపాలలో జీవింతురు. వారు ఆధ్యాత్మిక చర్చలలో గాని గోష్టులలోగాని పాల్గొనరు. వారు తమ తమ

గొంపాలలో తమ ప్రణవ మంత్రమును జపించుచుందురు. వీరికి పరిశుభ్రత తెలియదేమో! స్నానము కూడ ఎపుడోగాని చేయరు. త్రాగుడు మాంస భక్షణ, జపము, దేవతా పూజలు, నిద్రాహారములన్నియు ఒకే తావున జరుపుకొందరు. చలికి కావలసిన వేడి కల్గించు వస్త్రములను ఎల్లవేళల ధరించియే యుందురు. చలి వాతావరణ ప్రభావకారణంచే స్నానాదులకు ప్రాధాన్యతలేదేమో.

### సన్యాసము

సన్యాసాశ్రమ స్వీకరణకు సంసారమును వీడ నవుసరములేదని హిందూ వేదాంతము ఉద్ఘోషించుచున్నది. తనవారి నందరిని వదలి అడవికి పోయినంత మాత్రమున మమకారములు నశించవు. సరైన సన్యాసి కాజాలడు. ☝

ఉ. పట్టెడు నామముంచినను బాగుగ బుట్టెడు బూదిబూసినన్
దిట్టరియై శరీరమును తీర్థములన్నిటి లోన ముంచినన్
గట్టిగ లోనున్న మమ కార మొకింతయు బోదు దుడ్డుచే
పుట్టను గొట్ట పాము మృతి బొందునే ధారుణి రాఘవేశ్వరా

(అర్థము సుబోధము)

☝ మరియు అహంకార మమకారములు నశించనిదే భగవత్సాన్నిధ్యము లభించదు. అట్లే అహంకార మమకారములకు బహు దూరము లేదని నుడివెదరు. చెవులకు కనులకు గల నాలుగంగుళ దూరము లాగుననే భగవత్తత్వమునకు అహంకార తత్త్వమునకు అంతే దూరము గలదు. ☝

శ్లో. దూరస్తే కో సమీపస్తు సమీపస్తే కో దూరత :
చతురంగుళ ప్రమాణాం తు కర్ణచక్షు ర్న దృశ్యతే.

☝ మమకారమును త్యజించి జిజ్ఞాసువుగా మారి అహంకారమును వీడి ధ్యాననిమగ్నుడై బ్రహ్మత్వమునకు పాటుపడువాడే నిజమైన సన్యాసి. సంసారమును సాగించుచు కూడ పై వాటికి పాటుపడుటకు ప్రయత్నించు యోగులు హిందూ ధర్మ పురాణములలో పెక్కుమంది కలరు. జనక మహారాజు బ్రహ్మజ్ఞానిగా ప్రసిద్ధుడు కదా! అందుచే సన్యాసాశ్రమ స్వీకరణకు గృహస్థాశ్రమము సల్పువారుండుట అవుసరము. ☝

శ్లో : యథా నదీనదా : సర్వే సాగరే యాంతి సంస్థితిం ।
తథైవా శ్రమిణ : సర్వే గృహస్థే యాంతి సంస్థితిమ్॥ (మను. 6-90)

శ్లో.: యథా వాయుం సమాశ్రిత్య వర్తంతే సర్వజంతవః
తథా గృహస్థ మాశ్రిత్య వర్తంతే సర్వ ఆశ్రమాః. (మను. 3-77)

శ్లో.: యస్మాత్త్రయో హ్యాశ్రమిణో దానే నాన్నేన చాన్వహమ్।
గృహస్థేనైవ ధార్యంతే తస్మా జ్జ్యేష్ఠాశ్రమో గృహీ॥ (మను. 3-78)

శ్లో.: స సంధార్య ః ప్రయత్నేన స్వర్గ మక్షయ మిచ్ఛతా।
సుఖం చే హేచ్ఛతా నిత్యం యో ధార్యో దుర్బలేంద్రియైః.
(మను. 3-79)

☝ నదీ నదములు సముద్రము నాశ్రయింపనంతవరకు పారుచున్నట్లు గృహస్థాశ్రమమువల్లనే సమస్తాశ్రమములు స్థిరముగా నుండును. ఇది లేనిది ఏ యాశ్రమమునకు సిద్ధిలేదు. బ్రహ్మచర్య వానప్రస్థ సన్యాసాశ్రమములకు ప్రతిరోజు అన్నమునిచ్చువాడు గృహస్థుడే. కాన ఈ గృహస్థాశ్రమమే జ్యేష్ఠాశ్రమము. అన్ని వ్యవహారములందును ధురంధరము. మోక్షమును ప్రపంచ సుఖమును గోరువారు ప్రయత్నముతో గృహస్థు కావలెను. దుర్బలులు పిరికి వారు దీనికి అనర్హులు. ఈ గృహస్థాశ్రమము లేనిది సంతానము లేదు. అపుడు మిగతా మూడాశ్రమముల ప్రస్తావనే రాదు. గృహస్థాశ్రమమును నిందించకూడదు. స్త్రీపురుషు లెపుడు పరస్పర ప్రసన్నులును విద్వాంసులును పురుషార్థులును సర్వవ్యవహారముల తెలిసినవారును యైనయెడల గృహస్థాశ్రమము సుఖప్రాయమై మూడు పూవు లార్గుకాయలుగా నుండి బ్రహ్మచర్యానంతర వివాహము వల్ల కలుగు ఫలమునిచ్చును. ☝

గృహస్థాశ్రామము గురించి మను చరిత్రలో సిద్ధుడగు సాధువు ప్రవరాఖ్యునికి నీ విధముగా తెలియ జేసెను.

సీ॥ కెలకుల నున్న తంగేటి జున్ను గృహమేధి
యజమాను డంకస్థితార్థపేటి
పండిన పెరటికల్పకము వాస్తవ్యుండు
దొడ్డి బెట్టిన వేల్పుగిడ్డి కాపు
కడలేని యమృతంపు నడబావి సంసారి
సవిధ మేరునగంబు భవనభర్త
మరుదేశపథ మధ్యమ ప్రప కులపతి
యాకటి కొదవు సస్యము కుటుంబి.

తే॥ బధిర పంగ్వంధ భిక్షుక బ్రహ్మచారి
జటి పరివ్రాజకాతిథి క్షపణకావ
ధూత కాపాలికా ద్యనాధులకు గాన
భూసురోత్తమ! గార్హస్థ్యమునకు సరియె.

ఔ అనగా బ్రహ్మచారులు, బిచ్చగాండ్రు, సన్యాసులు, అతిథులు, బిక్షువులు, బౌద్ధ దిగంబరులు, అనాధులు, చెవిటి, కుంటి, గ్రుడ్డి, మున్నగు యశక్తుల కెల్లరకు గృహస్థుడే రక్షకుడు. ఇదియే ప్రశస్త్యాశ్రమము. వీరందరికి గృహస్థే తేనెపట్టు లాటి కామధేను కల్ప వృక్షమువంటివాడు. షమీపమేరు పర్వతములాంటివాడు. మరుభూమి (నిర్జలభూమి) యందు నీటిని కుండలతో నిలువ బెట్టుకొనులాంటివాడు. మరియు సద్వినియోగము చేయు సస్యముల మాదిరి అవసరపడువాడే గృహస్థుడు.

సన్యాసమునకు బాల్యయౌవన వృద్ధ వాన ప్రస్థాశ్రమములు యథాక్రమ మాచరించుటే మానవ విధి. బాల్యమున ఉపనీతుండై, గురు ముఖమున వేధ వేదాంగముల నభ్యసించి, గురుదక్షిణ నొసగి, గురుఋణ విముక్తుడై, వివాహమంది, గృహస్థుడై న్యాయార్జితమున, నిత్యసంతుష్టుడై, నిష్కల్మష హృదయుడై, సత్యాహింసలు కల్గి, శుచియై, నిత్య కర్మల నాచరించుచు, పుత్రపౌత్రుల బడయవలయును. తర్వాత భార్యా పుత్రుల వీడి వాన ప్రస్థాశ్రమము చేరి, వైరాగ్యమూని, అరణ్యమునకేగి అరిషడ్వర్గముల జయించి, సన్యాసము స్వీకరించి, శుద్ధుండై, మోక్షము నన్వేషించవలయును. అపుడే సన్యాసాశ్రమమునకు, ముక్తి కామన కర్హుడు. ఇదియే శిష్టానుశాసనము. కాని ఈ ఆశ్రమ ధర్మములు అందరికిని సాధ్యపడలేవేమో!

నడచి పోవువాడు ప్రమాదములనొందక గమ్యస్థానమును నెమ్మదిగా చేరును. ఇంద్రియములు బలిష్టములైనవి. వానిని జయించుట దుష్కరము. భోజన శయ్యాది ఇంద్రియ సుఖముల బడయనివాడు యతియైనను ఏమి లాభము? ఇంద్రియ వేగమును శాంతింప జేయుటకైనను పై ఆశ్రమముల ఆవశ్యకత ఎంతేని కలదు. మొదటనే సన్యసించి మార్గభ్రష్టుడగు వానికి గతి లేదు. ఆత్మ లాభముచే సంతుష్టి కల్గినవాడు ముక్తుడగును. అందుచే సన్యాసమునకు మోక్షమునకు అర్హత బొందుటకు పై ఆశ్రమముల పాటించువాడే అర్హుడు.

భ్రాంతి వదలి, నాది ఈ దేహము, నాది ఈ గృహము, భార్యాపుత్రులు రాజ్యము ధనము ఇతర నిత్యవస్తువులు యను భావనల మనస్సు నుండి వీడి దేహ సంబంధాది యెల్ల వాసనలు వీడిన వాడు మాత్రమే సన్యాసమునకు మోక్షమునకు అర్హత కలవాడని జనకమహారాజు స్వయముగా శుకునకుపదేశించెను.

యాజ్ఞవల్క్యుడు తన భార్య మైత్రేయికి ఈ విధంగా ఉపదేశించెను. ''భార్య భర్తను, భర్త భార్యను, తండ్రి కుమారుని, కుమారుడు తండ్రిని, ధనికుడు ధనమును, తమతమ స్వప్రయోజనముల కొరకే ప్రేమింతురు. మానవుడు వానివాని అనుబంధముల ననుసరించి తన స్వప్రయోజనముల కొరకే ఇతరుల ప్రేమించును. కావున అత్యున్నతమైన ప్రేమ తనకే నని ఇతరులపై చూపు ప్రేమ లెక్కలోనికి రాదనియు గ్రహించ[illegible]. తన ప్రే[illegible]మ ఆత్మకు సంబంధించినదైనచో అది ఉన్నతమైనది.

ప్రేమకు కొలమానము ఆనందమే. తానెంత యెక్కువ ఆనందిస్తే అంత మిక్కుటముగా ఆత్మను ప్రేమిస్తున్నట్లుగా లెక్క. మానవుడు భౌతిక సౌఖ్యములను కోరి పరుగిడుటకన్న ఆత్మజ్ఞానము నన్వేషించుట శ్రేయము. సత్పురుషుడు ప్రాపంచిక సుఖములను వీడి వైరాగ్యమును బొందువాడు భయరహితుడై యుండును. ☝

వైరాగ్యమూనినవానికి ఏలాటి భయావ హములంటవని భర్తృహరి ఈ క్రింది శ్లోకమున వివరించియున్నాడు.

శ్లో : భోగే రోగభయం కులే చ్యుతి భయం
విత్తే నృపాలా ద్భయం
మానే దైన్యభయం బలే రిపుభయం
రూపే జరాయా భయమ్
శాస్త్ర వాదభయం గుణే ఖలభయం
కాయే కృతాన్తా ద్భయం
సర్వం భయాన్వితం భువిన్నృణాం
వైరాగ్యమే వాభయమ్.

☝ అనగా భోగికి రోగభయము, అగ్రకులజునికి కులభ్రష్ఠ భయము, ధనము గలవానికి రాజభయము, అభిమానికి అప్రతిష్ఠ భయము, బలవంతునికి శత్రుభయము, వయోరూపికి వృద్ధాప్యభయము, శాస్త్రముల దెలిసినవానికి విమర్శకుల భయము, సజ్జనునికి దుర్మార్గునిభయము, దృఢకాయునికి యముని భయము, సర్వ విషయములందును భయావహములేకాని ఒక్క వైరాగ్యమునకు మాత్రమే ఏలాటి భయములేదు.

''మనస్సునుండి కోరికలను తొలగించి స్వప్రయత్నము ద్వారా ధ్యాన నిమగ్నురాలవుకమ్మా. దాని వలన నేను నిన్ను చూచినంత దగ్గరగా నీకు భగవంతుడు స్వయముగా కనుపించును. ఓ మైత్రేయీ! ధ్యానము సత్‌చింతన ద్వారా మహాత్ముల సచ్చరిత్రలద్వారా సద్గ్రంథపఠనముద్వారా ఆత్మ ఒక్కటే యను సత్యమును నీవు తెలిసికొందువు.'' ☝

శ్లో: ''నాహం మోహం బ్రవీమి
అనుచ్ఛిత్తి ధర్మాఽయ మాత్మేతి॥''

☝ ''సర్వవ్యాపకుడగు పరమాత్మ అన్ని జీవుల యందును ''జీవ'' రూపము వ్యాపించియున్నాడు. అది గ్రహించుము. ఈ ప్రయత్నములో బుద్ధి ఆత్మతో కలసిపోయి సమాధి అవస్థను బొందెదవు. అపుడు శరీరము ఆత్మ వేరని అవయవములన్నియు ఆత్మ యున్నంతవరకేయుండునను సత్యము తెలిసికొందవు.

నేను అనే ఆత్మాభిమానము వదలిపోయిన తరువాత ప్రతి జీవియందుండు "ఆత్మ" ఒక్కటే మిగులును. అపుడు ఉచ్చ-నీచ, పేద-ధనిక, సుఖ-దుఃఖ మంచి-చెడు, రాగ-ద్వేష భేదములు అన్నియు శరీర సంబంధములేనని "ఆత్మ"కు సంబంధములు కావని నిజమును గ్రహింతువు. జ్ఞాని వగుదువు. జీవన్ముక్తి సాక్షాత్కారము బడయగలవు. ఇదే మానవుని జీవిత పరమావధి. మోక్షసాధనకు మార్గము. మోక్షమును బడయుటే, జన్మ రాహిత్యమును చేసికొనుటే మానవుడుగా జన్మించినందులకు ఉత్తమ కర్తవ్యము." ఈలాటి ఆలోచనలనే సన్యాసియగు "స్వామి తపోవన్‌జీ" మహారాజుగారు తమ కైలాస మానసయాత్రలో విరముగా వెల్లడించియున్నారు. ☝

శ్లో : యచ్ఛే ద్వాఙ్మనసీ ప్రాజ్ఞ
స్తద్యచ్ఛేద్ జ్ఞాన ఆత్మని।
జ్ఞాన మాత్మని మహతి నియచ్ఛే
త్త ద్యచ్ఛే చ్ఛాంత ఆత్మని॥ (మం)

☝ బుద్ధిమంతుడగు సన్యాసి వాణిని మనస్సును అధర్మము నుండి మరలించి వానిని జ్ఞాన ఆత్మలందు జ్ఞానాత్మను పరమాత్మయందు చేర్చవలయునని, ఆ విజ్ఞానమును శాంత స్వరూపాత్మయందు స్థిరముగా నుంచవలయునని పెద్దల నిర్దేశము. ☝

శ్లో : దూషితోఽపి చరే ద్ధర్మం
యత్రతత్రాశ్రమే రతః ।
సమః సర్వేషు భూతేషు
నలింగం ధర్మకారణమ్॥ (మను)

☝ సన్యాసాశ్రమమును స్వీకరించినవారు తన్నెవరు దూషణ భూషణలు సలిపినను పట్టించుకొనక సమస్తప్రాణులందు సమత్వము కలిగి స్వయముగా ధర్మాచరణ సేయుటయేకాక ఇతరులను ధర్మాచరణమునకు పురికొల్పుచుందురు. దండ కమండల కాషాయ వస్త్రధారణము మున్నగు చిహ్నములు మాత్రమే ముఖ్య ధార్మికములు కావని తెలసికొని మానవులందరికి సత్య ధర్మ మార్గములు విద్య మున్నగు దానము లస్పతిని కలిగించునని తాను తెలిసికొని ఇతరులకు తెలుపువాడే నిజమైన సన్యాసిగా తెలియచేయబడినది. ☝

శ్లో. న చ ప్రాణ సంజ్ఞో నవై పంచ వాయుః
న వా సప్త ధాతు ర్న వా పంచకోశః
న వాక్పాణిపాదౌ న చోపస్థపాయూ
చిదానందరూప శ్శివోఽహం శివోఽహమ్.

# ఇరవై తొమ్మిదవ అధ్యాయం

## టిబెటు ప్రభుత్వము

శ్లో. న మే ద్వేషరాగౌ న మే లోభ మోహౌ।
మదో నైవ మే నైవ మాత్సర్యభావః।
న ధర్మోన చార్థోన కామో న మోక్షః।
చిదానందరూప శ్శివోఽహం శివోఽహమ్.

ఇరవైయో శతాబ్దమునకు ముందు టిబెట్టు ప్రభుత్వము సంగతి మనకు సరిగా తెలియదు. అది కొంత కాలము చైనా చక్రవర్తుల అధీనములోను కొంత కాలము చైనా టిబెట్టు అధికారములోనూ వుంటూ రెండు దేశముల చక్రవర్తులకు పరస్పర యుద్ధములు జరుగుచుండెడివి. చైనా టిబెట్టులకు ఆదినుండియు ఒకరి ఆధిపత్యమును మరొకరు తిరస్కరించుచు ఎక్కువ యుద్ధముల తోనే గడుపుచుండిరి.

బ్రిటిషు వారు ఇండియాను వారి హస్తగతము చేసుకొనిరి. కాని వారికి రష్యాతో అంతరంగిక వైరములుండెడివి. కావున వారు - ఈ రష్యా చక్రవర్తులు టిబెటు ద్వారా ఇండియాపై దండయాత్ర చేసి బ్రిటిషు ప్రభుత్వమునకు ఇండియాలో ముప్పు తేగలరనే ఉద్దేశముతో ఇండియా రష్యాల మధ్యగల టిబెట్టును తమ ఆధీనములోనికి తెచ్చుటకు ప్రయత్నముల చేయుచుండిరి.

క్రీ. శ. 1904లో బ్రిటిష్ సైనికదళం టిబెట్‌పై దాడి జరిపినప్పుడు రష్యాకు పారిపోయిన పదమూడవ "దలైలామ" 1905లో "లాసా"లో బ్రిటిష్ వారితో సంధి ఒడంబడికలు చేసుకొని టిబెట్టుకు తిరిగివచ్చి బ్రిటిషువారితో స్నేహసంబంధాలు పెట్టుకొన్నాడు. చైనా వారికి ఈ ఏర్పాటు వలన ఆగ్రహం కలిగి టిబెట్టుపై తన సార్వభౌమత్వాన్ని సుస్థిరం చేసుకోడానికై 1910లో టిబెట్టుపై దండయాత్ర జరిపారు. ఆ దండయాత్రకు తట్టుకోలేక "దలైలామా" భారతదేశానికి పారిపోయి వచ్చి బ్రిటిష్ ప్రభుత్వమును సహాయము కోరెను. బ్రిటిష్ ప్రభుత్వం దలైలామాకు తమ సేనలు ఆయుధ సామగ్రినొసగినారు. 1911లో టిబెట్టు ప్రజల చేతిలో ఓడిపోయిన చైనా సైన్యాలు తమ దేశానికి పారిపోయినవి. దలైలామా అప్పుడు టిబెట్టుపై తన స్వతంత్రాధికారాన్ని సుస్థిరం చేసుకొని బ్రిటిషు ఇండియాతో సంధి ఒడంబడికలు చేసుకున్నాడు. ఆ తరువాత భారత చైనా టిబెట్ ప్రతినిధుల సిమ్లాలో సమావేశమై ఘనదేశము, చైనా, టిబెట్ దేశాల మధ్య సరిహద్దు ఒడంబడికలు జరుపుకొన్నారు. భారత ప్రభుత్వము ప్రతినిధియైన 'మెక్ మోహన్' గారు సూచించిన సరిహద్దు రేఖను ఇండియా, టిబెట్ ప్రభుత్వాలు ఆమోదించినవి. చైనా ప్రభుత్వం

దీనికి అంగీకారం తెలుపలేదు. 1918లో టిబెట్ ప్రభుత్వము చైనా వారితో తెగతెంపులు చేసుకొని సంపూర్ణ స్వాతంత్ర్యము ప్రకటించుకొన్నది. బ్రిటిష్ ఇండియా ప్రభుత్వంతో దేశ రక్షణ సంధి చేసుకొన్నది. అప్పటి నుండి టిబెట్ స్వతంత్ర రాజ్యంగా అన్ని దేశాలు అంగీకరించినవి. ''దలైలామా'' టిబెటు చక్రవర్తిగా కొనసాగుచుండెను. ఆయన పరిపాలన టిబెట్‌లో జరుగుచుండెను. ''లాసా'' నగరము దానికి ముఖ్యపట్టణముగా నుండెను.

1962లో చైనా దురాక్రమణ జరిపి టిబెట్‌ను స్వాధీన పరచుకొన్నది. దలైలామా ఇండియాకు శరణార్థిగా పారిపోయి వచ్చెను. ఈ చైనా దురాక్రమణకు పూర్వము టిబెట్‌లో పరిపాలనకై ఇద్దరు మైత్రాయిలు దలైలామా క్రింద పనిచేసేవారు. ఎండకాలములో ''గార్చక్''లోను చలికాలములో ''గార్ గుంసా'' లోను వీరి క్యాంపులుండెడివి. ఈ పడమటి టిబెటు నాలుగు మండలాలుగా విభజింపబడెను. వీరుగాక పన్నులు వసూలు చేయు అధికార్లు, వర్తక వాణిజ్యములు చూచు ఏజంట్లు (ప్రతినిధులు) ఉండెడివారు. ఈ ప్రతినిధులు యాకులు గుర్రములు మున్నగురవాణా సౌకర్యములు సమకూర్చుచుండిరి. ''తాస్మా'' యను వారు తంతి తపాలా కార్యములు నిర్వహించుచుండిరి. ఒక స్పెషల్ ఆఫీసరు సంవత్సరమంతయు అన్ని ప్రదేశములకు తిరుగుచు న్యాయశాఖాధిపతియై తీర్పులు చెప్పుచుండెను. వీరందరు కూడ ''దలైలామా'' ఆధ్వర్యములో ''లాసా'' లో నియమింపబడుచుండిరి. గ్రామములు చాల చిన్నవి గనుక కొన్ని గ్రామముల సముదాయమునకు ''మాంగ్‌పాక్'' యనబడే ''పట్వారీ'' గ్రామాధికారిగా యుండెడివాడు. పెద్ద గ్రామములకు మాత్రము ఒక్క గ్రామమునకే ఒక పట్వారీ ఉండెడివాడు. గ్రామాధికారి పద్ధతి బ్రిటిష్ ఇండియా పద్ధతిలాగే వంశ పారంపర్య హక్కు గలదైయుండెను. మనదేశమున ఈ పట్వారీల వంశ పారంపర్యముగా నెలకొల్పు యాచారము త్రేతాయుగములో శ్రీరాముని కాలము నుండియే యున్నట్లు పూర్వ గ్రంథములలో ఆధారములున్నవి. వీరిని ఆ కాలములో 'గ్రామణి' యని వ్యవహరిస్తు పది గ్రామములను కలిపి ఒక గ్రామణిని నియమించేవారు. వారికి పన్నులు వసూలు చేయుట రక్షణ చట్ట సంబంధమైన న్యాయాధికారములు జల పరి వాహక (నీటి పారుదల) సౌకర్యాల యధికారములు మున్నగున వుండెడి వనియు తెలుపబడినది. అందుకు ప్రతి ఫలముగా వసూలు చేయబడిన పన్నులో కొంత శాతము హక్కు భుక్తమై యుండెడిది. ఇవి కాక ప్రాచీన కాలములో ప్రజా సభలకు బాధ్యత వహించే, పంచాయితీ పరిపాలనా వ్యవస్థ కూడ అమలులో ఉండేది.

ప్రజల నుండి నూరు చేతులతో ప్రోగు చేసిన ''సుంకమును'' ఆపద సమయములలో వేయి చేతులతో ప్రజలకు రామరాజ్యములో పంచే వారని ఈ క్రింది శ్లోకము తెలియజేయును.

శ్లో. ''శతహస్తైః సమాకర్ష సహస్ర హస్తైః సంకిర.''

అటువంటి రామరాజ్యము పదకొండువేల సంవత్సరములు రాముడేలినట్లు ఈ క్రింది రామాయణ శ్లోకము తెలుపును.

శ్లో. దశవర్ష సహస్రాణి దశవర్ష శతాని చ।
రామో రాజ్య ముపాసిత్వా బ్రహ్మలోకం గమిష్యతి.

పదివేల సం॥లు సీతతో కూడి సీతారాములుగా ఒక వేయి సం॥లు సీతను కానల విడచి కోదండరాము డేకాకియై రాజ్యమేలినట్లు వాల్మీకి రామాయణాధారము లున్నవి. భాస్కర రామాయణములో కూడ

క. సారాచారోదారుడు
వీరేంద్రుడు పదునొకొండు వేలేండ్లు నిజా
జ్ఞారంభ మొదవ నిత్య
స్మేరయశస్స్ఫూర్తి నేలె మేదినియెల్లన్.

ఆ గ్రామాధికారులు తిన్నగా ''లాసా'' కే సంవత్సరమునకు కొంత ధనము చెల్లించుచుండిరి. ప్రభుత్వ అధికారులలో స్త్రీలు కూడ పెద్ద చిన్న హోదాలలో పాత్రులైయుండిరి.

**శిక్షలు :** అచట చాల కఠినమైన శిక్షలు విధించుచుండిరి. సామాన్యమైన నేరమునకు కూడ '' ఉలన్'' త్రాడు ( ఉన్నితో చేసిన త్రాడు)తో రక్తము వచ్చునట్లు చేతులు కట్టి కొరడా దెబ్బలు వేయుచుండిరి. దోపిడి మున్నగు నేరములకు ముంజేతులు రెండునూ క్రాగుతున్న వేడి నూనెలో ముంచుట జరిగెడిది. ఇంతకన్నను పెద్ద నేరములు చేసిన వారికి ప్రభుత్వ వ్యతిరేక నేరములకు పర్వతములపై నుండి పడద్రోయుట లేదా ఇతర విధములగు మరణ శిక్షలు విధించుట జరుపుచుండిరట. ప్రాణములు తీయునట్టి హత్యా నేరములకు గోళ్ళలో సూదులు గ్రుచ్చి, కీళ్ళు ఊడదీసి, కాళ్ళు చేతులు విరుగగొట్టి, చివరకు చంపివేయు క్రూర శిక్ష విధించుచుండిరట. ఇవికాక చిన్న చిన్న నేరములకు ఆఫీసర్లు జరిమానాల రూపముగా ధనము వసూలు చేయుచుండిరి.

**టిబెటు లక్షణము :**

సంస్కృతములో టిబెటునకు ''కిన్నెరఖండ'' ''కింపురుషఖండ'' ''త్రివిష్టపభూమి'' లేక ''స్వర్గభూమి'' యను నామాంతరములు గలవు. పూర్వము టిబెటు, బర్మా (శ్రీ క్షేత్రము) సియాం (కాంభోజ) ఇండో చైనా (మాళవ) మలయా సుమిత్ర (స్వర్ణదీప) జావా (యవద్వీప) బోర్నియా బలి మున్నగు ద్వీపములు మరియు ఆఫ్ఘనిస్థాన్ ( ఉపగణ స్థానము) గాంధార మున్నగునవి కలసి భారత ప్రదేశముగా నుండెను. మరియు ఒకే విధమగు సాంస్కృతిక మత ధార్మిక

వ్యాపార సంబంధములు కలిగియుండెను. టిబెటు జనాభా 30 నుండి 50 లక్షల వరకు ఉండెను. దీని వైశాల్యము 8,14,000 చ. మైళ్ళు. సముద్రమట్టమునకు 12,000 అడుగుల నుండి 16,000 అడుగుల ఎత్తు ప్రదేశములో నుండి - ప్రపంచములో కెల్ల ఎత్తైన రాజ్యముగా పేరు గాంచినది. ఆ భూభాగమంతయు పర్వత పంక్తులతో మంచు శిఖరములతో నిండియున్నది. అక్కడక్కడ కొన్ని లోయలు మైదానములు కూడ గలవు. కొన్ని చోట్ల ఉప్పునీటి సరస్సులు గలవు. అందులో "కొకో" సరస్సు 1,630 చ.మై. వైశాల్యము గలిగి పెద్దదిగా నున్నది. మిగిలినవి మంచినీళ్ళ సరస్సులు. ఇచ్చటి నుండి పెద్ద నదులు పుట్టినవి. "హోయాంహో" యాంగ్సెక్ యాంగ్" అను పెద్ద నదులు చైనా దేశములోకి ప్రవహించి చాలా ముఖ్యనదులుగా పేరొందినవి. బ్రహ్మపుత్ర టిబెట్టులో పుట్టి హిమాలయ పర్వత శ్రేణిని చుట్టి వచ్చిభారతదేశములోని అస్సాం రాష్ట్రం గుండా ప్రవహించుచున్నది. ఈ నదులు అపారమైన నీటితో నిండి పారును. "లాసా" నగరము దీని ముఖ్యపట్టణము. దాని జనాభా 60,000 లకు పైగా యుండి "క్యిభూ" అను నది ఒడ్డున ఉన్నది. అచట ఒక ప్రక్క విపరీతమైన చలిగాలులు మరొక ప్రక్క అపరితమైన వేడిగాడ్పులు వీచుచు క్లిష్టమైన వాతావరణము కలిగియుండును. దేశమంతయు పర్వతమయ మగుటచే అచట దృశ్యములు చాలా దూరముగా నున్నను దగ్గరగా కన్పించును. పగటి కాలము ఎక్కువగా రాత్రి కాలము తక్కువగా యున్నట్లు తోచుట ఒక ప్రత్యేకమైన స్థానిక లక్షణము. ఆ దేశము పరిశుభ్రమైన గాలి నీలాకాశము ప్రశాంత వాతావరణముతో హాయి గొల్పుచు యాత్రికులను పరమానంద భరితులను జేయుట ఆ ప్రదేశపు ప్రత్యేకతయై యున్నది. అందుకే పై "స్వర్గభూమి"లాంటి నామములు ప్రసిద్ధములై యుండును.

## టిబెటు ప్రజల జీవనము :

టిబెటు దేశ ప్రజలు చాల కష్ట జీవులు, ధృఢకాయులు. వారెంతో చలిని భరించగలిగిన సామర్థ్యము కలిగియున్నారు. వారు ఉత్సాహముగా, శాంతి కాముకులుగా, సహృదయులుగా ఆత్మ తత్వ సుముఖులుగా నున్నారు. ఐనను కొందరు "లామా"లు మాత్రము కొన్ని దుర్వ్యసనములకు లోబడియుందరు. కొందరు "లామా"లు ప్రభుత్వాధికారులు. పరిష్కృత విద్యా వ్యాసంగము కలిగి సంస్కారవంతులై యున్నారు. టిబెటు దేశములో కులములు లేవు. కాని లోహ పాత్రలను చేయు కమ్మరి పనివారిని మాత్రము రెండవ తరగతి పౌరులుగా భావిస్తారు. కావున వారికి మాత్రము ఇతరులతో వివాహ భోజనాది సంబంధములుండవు. అచట ఆచార్యుడు మొదలు ఊడ్చు పనిచేయువాని వరకు ఒకే రకమైన ఆచారము కల్గియుందురు. ఒక్క "పురాంగ్" లోయ ప్రాంతము దగ్గర అడవులలో కట్టె లభించును. గనుక ఇండ్లు ఇటుకలు కర్ర

దూలములతో నిర్మించుదురు. మిగత ప్రాంతమంతయు ఇండ్లు మట్టి గోడలతో పైన కర్రలు వేసి నిలిపి గడ్డి పొరక పరచి చూరులను మట్టితో పూసి నిర్మించెదరు. కైలాస మాన సరోవర ప్రాంతమున కట్టె చాల దూర ప్రాంతము నుండి తెచ్చుకొనవలసి యుండును గావున రెండు మూడు గృహములున్నచో చాలు దానినే గ్రామమందురు. ఆశ్రమములు (గొంపాలు) మాత్రము ఎక్కువ ధనము వెచ్చించి విశాలముగ నిర్మించిరి. కాని అవి అన్నియును చైనా వారి దురాక్రమణ తర్వాత ''గాంగ్ ఆఫ్ ఫోర్'' అను సాంస్కృతిక విప్లవము వారి ఆగ్రహమునకు గురియై శిథిలములు గావించబడినవి.

టిబెటులో అధిక జనులు పశువుల పెంపకముపై ఆధారపడియున్నారు. వారు ఉన్ని పరిశ్రమలో వచ్చు ఆదాయముపై జీవింతురు. వారు గుర్రములపై నుండి గొర్రెలను మేపుకొనుచు పర్వతముల లోయల యందు సంచారము చేయుచుందురు. వారు తమ వెంట గుడారములను కూడ తీసుకొనిపోయి ఎక్కడ రాత్రయిన అక్కడే గుడారములు వేసికొని వండుకొని తినుచు గడుపుదురు. వారు చాల వరకు ఎతైన మట్టిగుట్టలలో గుహలు త్రవ్వుకొని వాటిని గదులుగా చేసుకొని వాటికి ద్వార బంధములను బిగించుకొని అందులో నివసింతురు. తక్లాకోట్ గ్రామములో మాకు నిట్టి ఇండ్లు అధికముగ కన్పించినవి.

వ్యాపారమునకు 'జ్ఞానిమామండి', 'తక్లాకోట్', 'గాంగ్‌టక్', 'డప్పా', యనబడే గ్రామములు ముఖ్య కేంద్రములు. పూర్వము అచట భారత నేపాల్ దేశస్థులు బాగా వ్యాపారము చేయుచుండిరి. కాని 1962 చైనా దురాక్రమణ తర్వాత ఆ వ్యాపారమంతయు మూతబడెను. ప్రస్తుతం నేపాలీయులు మాత్రము అచటచట వ్యాపారము సాగించుచున్నారు. ఇటీవల టిబెట్ వార్తలను చైనా ప్రభుత్వము బయటి ప్రపంచమునకు తెలియనీయుటలేదని వింటిమి.

**టిబెటనుల ఆహార విహారములు**

వీరి ముఖ్యాహారము మాంసము చేపలు అపుడే వేపుడు చేసిన బార్లీ గింజల పొడి (సత్తు) యును పాల ఉత్పత్తి వస్తువులు. వారు ఉదయము సాయంత్రము సత్తులో నీరు కలిపి మరగించి మాంసమును ఉప్పును జేర్చి ద్రవరూపములో సేవింతురు. ''పురాంగ్'' లోయ ప్రాంతీయులు మాత్రము ధాన్యమును, గోధుమలు పండించుటచే అన్నమును రొట్టెలను తిందురు. వారికి ఇవి భారత నేపాల్ దేశముల ద్వారా కూడ లభించును. టిబెటనులు ప్రతిరోజు కనీసం యాభై నుండి నూట యాభై కప్పుల చైనీస్ టీని సేవించెదరు. ఇది ప్రత్యేకముగా తయారు చేయబడు టీ - నీటిలో కొంత ఉప్పు వెన్న టీపొడి వేసి బాగుగా మరగించి ఇందులో కొద్దిగా సోడా పొడరు కలిపి బాగుగా కలియబెట్టి పొయ్యిపై నుండి దించి కొంతసేపు మూత బిగించిపెట్టి తర్వాత సేవించెదరు. చాలవరకు పండుగ దినములలో ఆడ మగ పిన్న

పెద్ద సాధు సన్యాసులందరు బార్లీతో తయారుచేసిన ''ఛాంగ్'' అను జాతీయసారాయిని పింగాణీ లేక కఱ్ఱ కప్పులతో వారి వారి స్థాయినిబట్టి సేవించుచుందురు.

అచట చాల చలిగా నుండుటచే అందరును పొడమైన ఊలుతో కుట్టబడిన గౌనులు ఛాతీవద్ద (గుండెలవద్ద) రెండు వరుసలు ఉండునట్లుగా కుట్టి ధరించెదరు. మరియు ఉన్నితో తయారైన బూట్లు దాదాపు పిక్కల వరకు ఉండును. వీరు లామాలవద్దకు గాని ఆశ్రమములకుగాని పోయినపుడు కూడ వాటిని తీయరు. చలి కాలములో తోలుతో తయారుచేసిన కోట్లు టోపీలు ధరింతురు. స్త్రీలు కూడ దాదాపు కొద్ది తేడాతో ఇలాంటి దుస్తులనే ధరింతురు. వారి జీవితములలో సంతృప్తి ప్రధాన లక్షణముగా కన్పించుచుండును.

**టిబెటనుల సాంఘిక ఆచారము :**

టిబెటనులలో రెండవ వివాహము, వితంతు వివాహము సర్వసామాన్యము. బహు భర్తృత్వము కూడ అక్కడక్కడ ఉండును. బహుశా సంతానోత్పత్తిని తగ్గించి బ్రతుకులు భారము కాకుండ చూచుటకు కాబోలు ఒక కుటుంబములో పెద్దవాడు పెళ్ళి చేసుకొన్నచో ఆ అన్నదమ్ములందరికి కూడ ఆ స్త్రీయే భార్యయగును. భారతం లోని పంచపాండవుల సంప్రదాయమును బట్టియే కాబోలు అందరికిని ఒక్క భార్యగా ద్రౌపదిని స్వీకరించినట్లు నేటికిని వారాచరించుచున్నారు. ఒక కుటుంబములోని వారందరు ఎటువంటి బాదరబందీ లేక సమిష్టి కుటుంబముగా శాంతితో సహజీవనము సాగింతురు. పెద్దవానికి పిన్నలు భయభక్తులతో సేవకులుగా నుందురు. అందుకే టిబెటనుల కుటుంబములు గృహములు నేటికిని పెరగక ఎన్నో ఏండ్ల క్రింద ఉన్నట్లే స్థిరపడియున్నవి. బాల్య వివాహములు బహు భర్తృత్వము ఉన్నను పిల్ల పిల్లవాని ఇష్టములతోను తల్లిదండ్రుల ఇష్టానుసారముగను వివాహములు పురోహితులచే జరుపబడును. ఆడ లేక మగ వితంతువులలో స్వేచ్ఛ, రాత్రిళ్ళు వారు ఒకరినొకరు స్వేచ్ఛగాకలుసుకొనే ఆచారము మరియు అలాంటి వారికి కలిగిన సంతానమునకు సంఘములో సమానహక్కులు గౌరవ మర్యాదలు మామూలు వివాహిత దాంపత్య సంతతివలెనే ఉండుట చూడగలము. విధవా వివాహములు కొన్ని తాత్కాలికముగా కూడ జరుగుచుండును. విధవల స్త్రీ పురుషుల సంగమము 'నియోగ'' మందురు. స్త్రీలు పురుషులతో సమాన హక్కు గౌరవము కలిగియుందురు.

## వితంతు వివాహములు :

వితంతు వివాహముల గురించి శాస్త్రములలో ఈ విధముగా చెప్పబడినది (మను-9.56-58-159).

శ్లో. ''దేవరాద్వా నపిండాద్వా స్త్రియా సమ్యఙ్నియుక్తయా।
ప్రజేప్సితాఽధిగంతవ్యా సంతానస్య పరిక్షయే॥
జేష్ఠో యవీయసో భార్యాం యవీయాన్వాఽగ్రజస్త్రియం।
పతితౌ భవతో గత్వా నియుక్తావ ప్యనాపది. ఔరసః క్షేత్రజ శ్చైవ.''

☝ అనగా పతియొక్క ఆరు తరముల వారితోగాని, పతి యొక్క అన్నదమ్ములతోగాని, లేక స్వజాతి పురుషునితోగాని తన కన్నను ఉత్తమ పురుషునితోగాని విధవస్త్రీకి ''నియోగము'' కావలయునట. విధవయు విధురుడును. సంతానోత్పత్తి నిచ్ఛయించు వారయి ''నియోగ''ము చేసికొనుటే శ్రేయమని చెప్పబడినది. ఇది సర్వదా సంతానము క్షయమయినపుడు జరుగవలసినదని ఆపత్కాలమందు సంతానేచ్ఛ యొక్క ఆవశ్యకమందు మాత్రమే పై ''నియోగ'' సమాగమము జరిగి సంతానమును నలుగురివరకు బడసిన తరువాత విడిపోవలయునని పై శ్లోకములకర్థము. అట్లు విడిపోనిచో వారిని పతితులుగా యెంచబడుదురని చెప్పబడినది. ఇది సంతానమునకే గాని వ్యభిచారుల్లా కామక్రీడలు జరుపుకొనుటకు గాదనియు అందు చెప్పబడినది. ☝

''అన్య మిచ్ఛస్వ సుభగే పతిం మత్''॥ (ఋ. 11-10-10)

☝ అనగా బ్రతికియున్న స్త్రీ పురుషులలో నెవరికేని సంతాన ఉత్పత్తి యందు అసమర్థత యున్నచో కూడ పతి లేక పత్ని యొక్క ఆయా సంధర్భములను బట్టి ఆజ్ఞను బొంది ఇతరులతో ''నియోగ''ము జరుపుకొని - అట్లు సంతానము బడయుట దోషముగాదని చెప్పబడెను. వ్యాస భగవానుని ద్వారా అంబికా అంబాలికలయందు పుట్టంధుడు ధృతరాష్ట్రుడు పాండురోగియగు పాండురాజును మరియొక దాసియందు విదురుండును సుతత్రయముల బడసిరని భారతములో పేర్కొనబడినది. ప్రస్తుతము టిబెటులో ఇలాంటి యాచారము లీనాడును వాడుకలో యున్నవి.

టిబె టులో బౌద్ధమతము వ్యాపించకముందు అనేక క్రూర దుర్ మతాచారములు కొనసాగుచుండెడివి. మంత్ర తంత్రములు చేతబడులు పూనకాలు భూతవైద్యము రక్షరేకుల విశ్వాసము వీనితోబాటు అచటి తెగలు తరచు స్పర్థలకు దాడులకు దోపిడులకు గురియగుట జరుగుచుండెను. బానిస వ్యాపారము జంతుబలులు నరమేధములు కూడ కొనసాగుచుండెను. కొన్ని రహస్య నేరస్థ తెగలు విచ్చలవిడిగా తిరుగాడుచుండెను. దుర్గమ ప్రదేశములు గావున బయటి ప్రపంచమునకు చెందు విజ్ఞాన వికాసమును నాగరికతను గూర్చిన పరిజ్ఞానము పరిచయము టిబెటు దేశ ప్రజలకు సాధ్యపడెడిది కాదు. అందువలన వారిలో అనాగరిక క్రూర ఆచారములు కొనసాగినవి. ఆ ఆనాగరిక లక్షణములు ఈనాడు కూడ కొంతవరకు టిబెట్టులోను

ఇతర హిమాలయ ప్రాంత ఆదివాస తెగలలోను కొనసాగుచునే యున్నవి. బౌద్ధ మత ప్రభావము వలన టిబెటనులలో ఆధ్యాత్మిక చింతన శాంతి సౌజన్య-శీలత నిరాడంబర-ప్రవర్తన వైరాగ్య భావనయు విరివిగా వ్యాప్తమైనది. అచటి సమాజమునకు బౌద్ధ సంస్కారమొక రక్షణ శక్తిగా తోడ్పడి పురోగామ ఉత్తేజతను చేకూర్చినట్లు శాంతి- భద్రతల నెలకొల్పినట్లుగాను చూడగలము. కావున వారు సాధువర్తనులని చెప్పవచ్చును. సన్యాసులు పురోహితులు తలలను నున్నగా క్షౌరము చేయించుకొందురు. ప్రజలు మాత్రము జుట్టు ఉంచుకొందురు. కాని బుద్ధ విగ్రహములు మాత్రము బోడిగా నుండక ఉష్ణీసముతో నుండుట ఆశ్చర్యకరము.

పెద్దలకు నమస్కరించు నపుడు పిల్లలు నాలుక కొద్దిగా చాచి తల వంచి ''ఖంజం' లేక ''జూ'' అనెదరు. గురువులు దలైలామా మొదలు కూలివాని వరకు అన్ని వృత్తుల వారి నుండియు ఇంటి కొకరు చొప్పున సన్యాసులుగా నేర్పడెదరు. సన్యాసులు ప్రజలను దీవించు విధములు అనేకములు. ఎదుటి వాని గౌరవమును బట్టి తలను తలకు తగిలించి తలపై చేతులు పెట్టి లేక తలపై సన్యాసి చేతులోని రిబ్బను కట్టిన కర్రతో ముట్టుట ఆచారము. ''ఖటక్'' అనబడే మరో ప్రత్యేకత ఏమనగా పెద్దవారి వద్దకు సన్యాసుల వద్దకు ప్రభుత్వాధికారులవద్దకు లేదా శుభా శుభ కార్యములకు వెళ్ళునపుడు వారి వారి స్థోమత ననుసరించి జానెడు మొదలు గజము పొడవుగల రిబ్బనులాంటి తెల్లనిది కాని సిల్కుది కాని ఒక గుడ్డ ముక్కను తప్పక బహూకరించవలయునట. అట్లు చేయనివాడు అవిధేయుడుగాను సంస్కారరహీనుడు గాను పరిగణింపబడును.

టిబెట్టు దేశస్థులు జంతువును రక్త రహితముగా ముక్కును మూతిని గట్టిగా చుట్టి వేయులాగున త్రాడు బిగించి మణి మంత్రమును జపించుచు చంపెదరు. మన పూర్వులు యజ్ఞ యాగములు చేసినపుడు ఈ విధముగానే యజ్ఞ పశువును చంపెడివారని పురాణాల్లో తెలిపిరి.

వీరికి జనన మరణములందు కార్యక్రమములు కొన్ని చిక్కులతో కూడుకొని యుండును. ప్రసిద్ధి గాంచిన సన్యాసి మరణించినచో దహనము చేయుదురు. మామూలు వ్యక్తి మరణించినచో అతని శరీరమును ముక్కలుగా చేసి పక్షులకు వేయుటయో లేక నదులలో పడవేయుటయో చేయుదురు. శవ ఖననము (భూమిలో పాతి పెట్టుట) కూడ అమలులో యున్నది.

శ్లో. న పుణ్యం న పాపం న సౌఖ్యం న దుఃఖం
న మంత్రో న తీర్థం న వేదా న యజ్ఞాః
అహం భోజనం నైవ భోజ్యం న భోక్తా
చిదానందరూప శ్శివోఽహం శివోఽహమ్.

# ముప్పదియవ అధ్యాయం

## టిబెటు మతము - పాఠశాలలు

శ్లో. న మృత్యు ర్న శంకా న మే జాతి భేదా :
పితా నైవ మే నైవ మాతా చ జన్మ
న బంధు ర్న మిత్రం గురు ర్నైవ శిష్య :
చిదానందరూప శ్శివోఽహం శివోఽహమ్.

టిబెటనులు చాలవరకు బౌద్ధమతస్థులు. అక్కడి జనాభాలో కనీసం మూడువంతులు సన్యాసులు. ప్రతి కుటుంబమునుండియు ఒకరిద్దరు రెండు మూడేళ్ళ వయస్సులోనే సన్యాసులలో (బౌద్ధులలో) చేర్చబడుదురు. వీరి మతమును లామాయిజంగా చెప్పుదురు.

ఆ దేశములో పదిరకములైన పాఠశాలలుండెడివి. 1. గంగ్మాపా, 2. ఉర్గ్యేంపా, 3. కాదంపా, 4. సర్యాపా, 5. గెలుక్పా, 6. కార్గ్ యుడ్పా, 7. కర్మాపా, 8. దేకుంగ్పా, 9. దుక్పా మరియు 10. బోన్పా లేక పెంబో యనునవి. దీనిలో చదివినవారు కొందరు బౌద్ధ మతమును స్వీకరించి సన్యాసులుగా మారినను ఆ సన్యాసులు కొందరు వివాహితులుగాను మరి కొందరు అవివాహితులుగాను ఉందురు. వారందరును పై శాఖలలో గల నియమ నిబంధనలకు కట్టుబడి యుండవలసి యుండును.

**టిబెటు గొంపా లేక మోనాస్టరి :** చాల వరకు బౌద్ధులు ఈ గొంపాలలో ప్రశాంత వాతావరణములో బుద్ధుని యొక్క ఇంకా ఇతర దేవతల యొక్క విగ్రహముల నుంచి పూజించుచు మంత్రమును జపించుచు నిద్రాహారములు అందులోనే చేయుటేకాక యాత్రికులకు కూడ అక్కడనే ఆశ్రయము కలిగించెదరు. మొట్టమొదటి గొంపా 830 ఎ.డి. ప్రాంతమున అనగా ఇప్పటికి పదకొండు వందల అరవైయేడు సంవత్సరముల క్రింద ''లాసా'' పట్టణ సమీపమున గల ''సామ్యే'' లో - అప్పటికి మన దేశములో గల నలందా తక్షశిల ఉదంతపురి విశ్వ విద్యాలయముల నమోనా (పద్ధతి)లో నిర్మింపబడెను. పెద్ద పెద్ద గొంపాలను పాఠశాలలుగా విశ్వవిద్యాలయ ములుగా ఉపయోగించుచుండిరి. చాలచోట్ల టిబెట్టులో ఇటువంటి గొంపాలలో వెయ్యినుండి పదివేల విద్యార్థుల వరకు విద్యలు బోధింపబడుచుండెను. ప్రాథమిక విద్యకూడ చిన్న చిన్న గొంపాలలో నేర్పబడుచుండెను. ఇందులో మత విషయములేకాక వాఙ్మయము, వ్యాకరణము, వ్యాధి, చికిత్సా విధానములు, (వైద్యము) శిల్పము, చిత్రకళ, సాహిత్యము మున్నగు విద్యలు నేర్పుచుండిరి. వాని నిర్వహణ భారము

వీనికై ఏర్పరచిన భూసంబంధ ఆస్తులచేతను ధనికుల చేతను- భరింపబడుచుండెను. సన్యాసులు రెండు రకములు 1. లామాలు - హెచ్చు తరగతి వారుగను 2. డాబాలు - మామూలు తరగతి వారుగను - ఉన్నారు. ఆ పాఠశాలలు ఎల్లరకును ప్రవేశ యోగ్యమే. కొందరు లామాలు తమ సమయమును త్రాగుడుతోను మాంస భక్షణతోను వృధా పుచ్చెదరు.

ఆ గొంపాలలో దేవతల పూజలకు, డమరకము, డమ్మ్మ, గంట, భేరి, పిల్లన గ్రోవి, మానవుని ఎముకలతో, తయారు చేసిన, గొట్టములు, ఇతర వాయిద్యములు, ఉపయోగింతురు. మాంసము సత్తు బార్లీ వెన్న కేకులు మున్నగు పదార్థములు దేవతా నివేదనకు ఉపయోగించెదరు. ఈ పూజలను మూడు రోజుల నుండి ముప్పై రోజుల వరకు జరుపుచు చివరి రోజున అగ్ని రగిల్చి ఆహుతి కూడ చేయుదురు. వారు చాలవరకు కళాభిరుచి కలిగియున్నారు.

**టి బెటు గ్రంథములు** : టిబెటులోగల గొప్ప గ్రంథములు రెండు రకములు.

**కాంజుర్** : ఇది బుద్ధుని స్వవచనములకు సంబంధించిన నూట ఎనిమిది సంపుటములుగల టిబెటు భాషా అనువాద గ్రంథము.

**తాంజుర్** : ఇది శాస్త్రములయొక్క 235 సంపుటములుగల టిబెటు అనువాద గ్రంథము. దీనిలో కావ్యములు వ్యాకరణము, ఖగోళశాస్త్రము, జ్యోతిష శాస్త్రము, తర్కశాస్త్రము, తంత్రములు, మంత్రములు, దేవతా ఉపాసన, మున్నగు వానికి సంబంధించిన విషయములు గలవు.

వారు టిబెటు అనువాద గ్రంథములేకాక సంస్కృత ప్రాకృత గ్రంథములను కూడ వాడెదరు. కాని మహమ్మదీయుల దాడులవలన చాలవరకు గ్రంథములు విగ్రహములు నాశనమయ్యెను. బౌద్ధ గ్రంథములలో గొప్ప జ్యోతిష శాస్త్రవేత్తలు " ఆర్యదేవ" "దిజ్నాగ" "ధర్మరక్షిత" చంద్రకీర్తి ,శాంతి రక్షిత, కమల శిఖ, మున్నగువారి రచనలుండెను. అవి ఇప్పుడు లభ్యపడవు. ధ్వంసము చేయబడిన గ్రంథములలో - "చంద్ర"- వ్యాకరణము "సూత్రదత్త"- "ఉనాధిపధ", 'వృత్తికపంచిక "మున్నగు విజ్ఞాన గ్రంథములుండెను. ఇంకనులోకానంద - నాటకము శ్వఘోష మతిచిత్ర, హరిభద్ర, ఆర్యసూత్ర, కాళిదాస మేఘదూత మొదలయిన సిద్ధ గ్రంథములేకాక దండి, హర్షవర్ధన, క్షేమేంద్ర, మున్నగువారి రచనలు ఇంకను అష్టాంగ హృదయము, చికిత్సా శాస్త్రములతోపాటు ఇంకెన్నో రచనా గ్రంథములను, బౌద్ధమత గొంపాలలో, చదువుచుండిరి. మొదటి గ్రంథము - "కాంజుర్" - కు సంబంధించినంత వరకు ఏడవ దలైలామా సమయములో క్రీ. శ. 1728 ప్రాంతమున అనునదింపబడినట్లుగా కొందరు 17వ శతాబ్దిలో 5వ దలైలామా సమయములో

అనువదింపబడినట్లు మరికొందరు చెప్పుచుందరు. వీటి ముద్రణ చెక్కలపైనను రాగి ఫలకములపైనను జరిగినట్లు తెలుపబడినది. బౌద్ధుల మత వాఙ్మయములో ''దీపంకరుడు'' వ్రాసిన ''శ్రీజ్ఞానము'' యను గ్రంథము అత్యంత ప్రాధాన్యత కల్గియున్నది. మన దేశములో విలుప్తమైపోయిన కొన్ని ప్రాచీనమత శాస్త్ర గ్రంథప్రతులు టిబెట్‌లోని గొంపాలలో లభించినట్లుగా మేడమ్ బ్లావెట్స్కీ, రాహుల్ సాంకృత్యాయన్ మున్నగు పండితులు ప్రకటించియున్నారు.

మహ్మదీయ ఇతర దండయాత్రల భయమువలన హిమాలయ ప్రాంతములలో దుర్గమమగు కొండ శిఖరములపై గల అనేక గొంపాలలో దేవతా విగ్రహములయెదుట లేక విగ్రహముల క్రింద లేక తదితర రహస్య స్థలములలో వేలాది భూర్జపత్ర గ్రంథములను భూస్థాపితముచేసి ఆయా లామాలు భద్రపరచుచుండినట్లు పలువురు చారిత్రక పరిశోధకులు గమనించి యున్నారు.

**టిబెటు పంచాంగము :**

టిబెటులో మనలాగే ప్రభవ సంవత్సరమునుండి మొదలగునట్లు సంవత్సరములు ''రాబ్యుంగ్''తో ప్రారంభమై అరవై సంవత్సరములు ఐదు భాగములుగా ఒక్కొక్క భాగము పన్నెండు సంవత్సరములుగా విభజింపబడెను. అందులో ప్రతి ఏడవ సంవత్సరము పవిత్రమైనదిగా మన కుంభమేళా లాగ భావింతురు. కైలాస మానస పరిక్రమ ఈ ఏడవ సంవత్సరములో చేసినచో పదమూడు సంవత్సరముల ఫలితము లభించునని భావించి చాలమంది ఆ పరిక్రమ చేయుదురు. మానససరోవర ప్రాంతీయులకు జనవరి పదమూడవ తారీఖు (అనగా మన సంక్రాతిరోజు) ప్రభుత్వము వారికి ఫిబ్రవరి పన్నెండవ తేదీనాడు నూతన సంవత్సరముగా పాటింతురు. ఈ నూతన సంవత్సర సందర్భమున పదినుండి పదిహేను రోజులవరకు సన్యాసులు మొదలు సామాన్య ప్రజలవరకు కుటుంబ సమేతముగా పండుగల వినోదములుజరుపుకొందురు. వారు అష్టమినాడు దేవికి ''చెందు'' రోజుగాను పౌర్ణమినాడు బుద్ధుని దినముగాను పాటింతురు. వారి పంచాంగము క్రీ.శ. 1020 సం.ర ప్రాంతమున కాశ్మీర పండితుడగు సోమనాథుని ''కాలచక్ర జ్యోతిష'' మను గ్రంథము ననుసరించినట్లుగా ఆధారములు కలవు.

**టిబెటు మణిమంత్రము :** దీని గురించి ఇదివరకే వ్రాసితిని. ఈ మంత్రమును చాల పవిత్రమైనదిగా-మన గాయత్రీ మంత్రములాగ-వారు భావింతురు. దీనిని ప్రథమముగా ''అవలోకితేశ్వరుడు'' - అమితాబబుద్ధుని తండ్రి-కనిపెట్టినట్లుగా చెప్పబడినది. ఈ మంత్రము '' ఓం మణి పద్మే హుంహ్రి'' - అనగా ఓ పద్మములోగల

సృష్టికర్తాయని చెప్పబడెను. ఈ మంత్రము టి బెట్టులోని ఆడ మగ పిన్న పెద్ద సన్యాసి గృహస్తు మొదలగు అందరి పెదవులపై ఎల్లవేళలను పఠింపబడుచుండును. ఈ మంత్రము శిలా ఫలకములపై ఇండ్ల గోడలపై ,వస్త్రములపై, బల్లలపై ప్రతి ఇంటిలోను అందరకు కన్పడు ప్రతి వస్తువుపైనను, గుహలలోను, ఎముకలపైన, ధ్వజముల పైన ,వ్రాసియుంచుదురు. కొందరు జపచక్రమును ఎల్లవేళల చేతితో త్రిప్పుచుందురు. ఈ చక్రములలో కాగితముపై జపము చేసియున్న వెయ్యినుండి పదివేలు, లక్షవరకు సంఖ్యలను వ్రాసి అందులో ఉంచుదురు. ఈ చక్రము ఒక చుట్టు త్రిప్పితే ఎంత సంఖ్య జపము జరిగెనో అన్నిసార్లు త్రిప్పినట్లుగా లేదా నోటితో అన్నిసార్లు జపించినట్లుగా నమ్మెదరు.

**టిబెటు గణితము** : టిబెటనులు గణితశాస్త్రములో వెనుకబడిరో ఏమో తెలియదు. కాని బ్యాంకులలోను ఇతర లెక్కలు చేయవలసిన చోట్లను లెక్కలు అవసరమున్న ప్రతిచోటను మన పిల్లలకు పలకలపైనున్న సన్నని తీగలలోనుండు గుండ్లు లాంటివే ఉపయోగించుచు కూడికలను తీసివేతలను చేయుదురు. నోటితో వారు వెంట వెంటనే - మనలాగ - లెక్కలు చేయలేరు. ఇది మేము చాలచోట్ల బ్యాంకులలో కూడ చూచితిమి. భౌతిక విజ్ఞానముకంటె ఆధ్యాత్మిక సిద్ధికే ఈ టిబెటనులు అధిక ప్రాధాన్యత నిచ్చెదరని తెలియుచున్నది. లెక్కల గురించి పదిహేను సం॥ రాల క్రింద అచట చూచిన విషయము ఆనాడు వింతగాతోచెను. కాని నేడు మన దేశంలో, విద్యార్థులు కాలికులేటరు లేకుండా లెక్కలు చేస్తున్నారా? పైగా బ్యాంకుల్లో, ప్రతి దుకాణంలో లెక్కలవసరమున్న ప్రతి చోట ఇవి వాడుకలోనికి వచ్చినవి. అంటే బుద్ధికి లేదా మేధస్సుకి యే మాత్రము శ్రమ అవసరము లేకుండా పని జరుగుచున్నది. ॐ

శ్లో : అహం నిర్వికల్పో నిరాకార రూపో
విభుత్వాచ్చ సర్వత్ర సర్వేంద్రియాణాం
న చాసంగతం నైవ ముక్తి ర్న మేయం
చిదానందరూపః శివోఽహం శివోఽహమ్:

( ఇతి నిర్వాణాష్టకమ్)



# ముప్పది ఒకటవ అధ్యాయం

## ప్రశాంతముగా దార్చెన్‌లో

శ్లో : చాంపేయ గౌరార్థశరీరికాయై
కర్పూరగౌరార్థశరీరకాయ
ధమ్మిల్లకాయై చ జటాధరాయ
నమ శ్శివాయై చ నమ శ్శివాయ.
కస్తూరికాకుంకుమచర్చితాయై
చితారజఃపుంజవిచర్చితాయ
కృతస్మరాయై వికృతస్మరాయ
నమ శ్శివాయై చ నమ శ్శివాయ.

✍ ఆ రోజు 6-8-83న 'దార్చెన్', కైలాస 'బేస్ క్యాంప్'లో త్వరపడక, ఆలస్యంగా - లేచితిమి. కాఫీలు త్రాగి కొంతసేపు 'బాతాఖానీ' చేసితిమి. బాగా ఎండ కాసిన తరువాత ప్రక్కగా నున్న చల్లని నదీ ప్రవాహములో ఒక్కముక్క స్నానముతో శరీరము గడ్డకట్టినట్లయ్యెను. చాలాసేపు ఎండలో కూర్చుని సంధ్యావందనాది పూజ ముగించితిని. సుమారు 11 గం. లకు గది చేరితిని.

తదుపరి ఒక గంటకు 'డా॥ గోడ్బోలే' తదితరులు స్నానము చేసి వచ్చిరి. పిదప మేమందరము ఒక గదిలో చేరి మానససరోవరోదకముతో నట తెచ్చిన రంగురంగుల రాళ్ళను గణపతిని గౌరిని శివుని ఆవాహనమొనర్చి పూజ లొనర్చితిమి. శ్రీ సూక్త, పురుషసూక్త సహిత రుద్రాభిషేకము మున్నగు పూజలతో దాదాపు రెండుగంటలు గడచినవి. ✍

ఆ తరువాత మనస్ఫూర్తిగా ఆ పరమశివుని ఈ విధముగా స్తోత్రము చేసి భక్తి పారవశ్యముతో మైమరచితిమి.

<u>దండకము</u> :- శ్రీ కంఠ లోకేశ లోకోద్భవస్థానసంహారకారీ మురారిప్రియా చంద్రధారీ మహేంద్రాదిబృందారకానంద సందోహ సంధాయి పుణ్యస్వరూపా విరూపాక్ష దక్షాధ్వరధ్వంసకా దేవ నీదైన తత్వంబు భేదించి బుద్ధిం బ్రధానంబు గర్మంబు విజ్ఞాన మధ్యాత్మ యోగంబు సర్వక్రియాకారణం బంచు నానా ప్రకారంబులన్ బుద్ధి మంతుల్ విచారించుచున్ నిన్ను భావింతు రీశాన సర్వేశ్వరా శర్వ సర్వజ్ఞ సర్వాత్మకా నిర్వికల్ప ప్రభావా భవానీపతీ నీవు లోకత్రయీ వర్తనంబున్ మహీవాయుఖాత్మాగ్ని సోమార్కతోయంబులంజేసి

కావించి సంసార చక్ర క్రియాయంత్రవాహుండవై తాదిదేవా మహా దేవ నిత్యంబు నత్యంత యెాగస్థితిన్ నిర్మలజ్ఞానదీప ప్రభాజాల విధ్వస్తనిస్సార సంసారమాయాంధకారుల్ జితక్రోధరాగాదిదోషుల్ యతాత్ముల్ యతీంద్రుల్ భవత్పాదపం కేరుహ ధ్యానడిండీర ధారాను భూతిన్ సదాతృప్తులై నిత్యులై రవ్యయా భ వ్యసేవ్యా భవా భర్గ భట్టారకా భార్గవాగస్త్యకుత్సాదినానామునిస్తోత్ర దత్తావధానా లలాటే క్షణోగ్రాగ్ని భస్మీకృతానంగ భస్మానులిప్తాంగ గంగాధరా నీ ప్రసాదంబునన్ సర్వగీర్వాణ గంధర్వులున్ సిద్ధసాధ్యోరగేంద్రాసురేంద్రా దులున్ శాశ్వతైశ్వర్య సంప్రాప్తులై రీశ్వరా విశ్వకర్తా సురాభ్యర్చితా నాకు న భ్యర్థితంబుల్ ప్రసాదింపు కారుణ్యమూర్తీ త్రిలోకైకనాథా నమస్తే నమస్తే నమః.

**శివుడు అభిషేక ప్రియుడు !**

మన పురాణాదులందు బ్రహ్మ విష్ణు రామ కృష్ణ ఆంజనేయాదులగు భగవత్స్వరూపులనేకులున్నారు. అయినను వారందరిని నిత్యము అభిషేకింపరు. కాని పరమశివుడు అభిషేక ప్రియుడగుటచే ప్రతి శివక్షేత్రమునందును చల్లని స్వచ్ఛ జలముతో గోక్షీరాదులతో గంగోదకముతో ఫలుఫల రసాదులతో పంచామృతముతో ఇక్షురసముతో గంధ, బిల్వ, భస్మ, హరిద్ర, నారికేళ, అక్షతోదకములతోడను మరియు రుద్రాక్ష హిరణ్య నవరత్నోదకములతో కూడ అభిషేకించుట నేటికిని ఆచారమునందున్నది. ఆ విధముగా పరమ శివుడు తన్మయత్వము నొందు ననుటయే దీని పరమావధి అందుకే "అలంకార ప్రియో విష్ణు, అభిషేకప్రియశ్శివః" అన్నారు.

రుద్రుడగుచుటచే రౌద్రమును వీడుటకు గాను చల్లని పానీయాదులచే అభిషేకించుట అందులోని పరమార్థమైయుండి యుండును. అట్లొనర్చుటవలన ఆయన శాంతికాముడై చల్లని స్వామిగా కటాక్షించునని పెద్దలు వక్కాణించిరి. రుద్రుడు రుద్రుడే కాదు - భోళా శంకరుడు కూడ.

క్షీర సాగర మథన సమయమున దేవదానవులు వాసుకిని త్రాడుగను మంధర పర్వతమును కవ్వముగను చేసి మథించు సమయమున మున్ముందు హాలహల ముద్భవించెను. భారత ఆదిపర్వములో హాలహల ముద్భవించిన రీతి నీ దిగువ పద్యములో వివరించబడెను.

శా : క్షోణీచక్రభరంబు గ్రక్కదల దిక్కుల్ మ్రోయగా నార్చి య
క్షీణోత్సాహసమేతులై రయమునన్ గీర్వాణులుం బూర్వగీ
ర్వాణవ్రాతము నబ్ధి ద్రచ్చువెడద ద్వ్యాకృష్ట నాగానన
శ్రేణి ప్రోత్థ విషాగ్ని ధూమవితతుల్ సేసెం బయోదావలిన్.

చ॥ ఉడుగక యెండ్రొరుం జరచి యొక్కబలంబున దేవదానవుల్
వడి గొని వార్ధి నిట్లు ధరు వన్ దరువన్ విష ముద్భవిల్లి నల్
గడలను విస్ఫులింగములు గప్పగ బర్విన దాని జెచ్చెరన్
మృడుడు గడంగి పట్టుకొని మ్రింగి గళంబున నిల్పె బొల్పుగన్.

అట్టి భయంకర కాలకూట విషజ్వాలలను భరించి పరిహరించు నాధుడెవరును లేకుండిరి. తన్మూలమున సృష్టివినాశము సంభవించునను భయముచే దేవదానవులు శివుని ప్రార్థించిరి. భోళాశంకరుడు ఆ హాలాహలమునంతయు తన కంఠమున బంధించి నీలకంఠుడాయెను. ఆ పిదప విలయాగ్ని వెలువడగా దానిని తన ఫాలమున ధరించి ముక్కంటిడాయెను. (త్రినేత్రుడు).

క్షీర సాగర మధన ఫలితముగా అందుండి అమృతము ఐరావతము కల్ప వృక్ష కామధేనువులు మున్నగు నమేయ సంపదలు ఉద్భవించెను. వానిని దేవతలు దక్కించుకొనిరి.

హాలాహల విలయాగ్నులు భోళాశంకరుని పరము జేసినందున పార్వతీ దేవి కోపోద్రిక్తయై దేవతలను పుత్రపౌత్ర హీనులుగా శపించిన కారణమున వారు సంతాన విహీనులైరి.

రుద్రుడు హాలహల విలయాగ్నులకు స్థావరమైనందున శీతలపూర్ణమగు కైలాసాచలమును తన నిలయముగా నేర్పరుచుకొని కైలాసనాధుడయ్యెను. చల్లని చందమామను తలపై నిడుకొని చంద్రశేఖరుడాయెను. గంగను తన జటాజూటమున నిడుకొని ''గంగాధరుడ'' య్యెను. చల్లని నీటిచే అభిషేకింపబడు కారణమున 'కేదారనాధు' డయ్యెను. తత్కారణములవలన సదాశివుడు సర్వదా అభిషేకప్రియుడు. ఇది పురాణాంతర్గత విచారము.

సాంబుడు అభిషేక ప్రియుడే కాదు. చతుర్వేద ప్రియుడు మరియు గాన నాట్య ప్రియుడు. ప్రళయ తాండవ నృత్యకేళీ సందర్భమున సర్వసృష్టి లయమొందును. కావున ఆయన లయకారణ మహాశక్తి, కోరిన కోరిక లీడేర్చు భక్త సులభ ప్రసన్నుడు.

అందుకే ఒక భక్తుడు భోళాశంకరు నీ విధముగా ప్రార్థించెను.

సీ॥ తన చర్మము ధరింపు మనిన గజాసురు
కొంచెపు కోర్కె లాలించినావు
ఫాలసంద్రమునందు ప్రభవించిన విషంబు
తడయక కుత్తుకన్ దాల్చినావు

బాణాసురుని యింటబడి వాని మొగసాల
కాల్బంటురీతిగన్ గాచినావు
అహమని వచ్చిన హంతకుణ్ శిక్షించి
జడదారిబుడుతని సాకినావు.
గీ॥ తరతమ విభేద మెన్న వుత్తమము నీచ
మని గణింపవు భక్తుల నరయుపట్ల
నిన్ను పూజింప శ్రమపడుచున్న నాకు
శివశివా యింత సాయంబు జేయలేవె.

✍ ఇట్టి భోళాశంకరుని గణపతి - గౌరీదేవి పూజానంతరము రుద్రాభిషేక ఏకాదశ రుద్రాభిషేకములద్వారా ప్రసన్నుని గావించుకొనవ చ్చును. మహాన్యాస రుద్రాభిషేకము వేదమంత్ర సహితమైనందున సామాన్యులకు కఠిన సాధ్యము. అట్టిది వేదవేదాంగములు తెలిసిన పండితులకు మాత్రమే సాధ్యమగు విధానము.

శివునకు స్మశానప్రియుడు నందివాహనుడనియు పేర్లు గలవు. అట్లు పిలువబడుటకు కొన్ని శివ ధర్మములున్నవి. వాని నిచట పేర్కొందును.

## శివ ధర్మములు

**నందివాహనుడు :** పూర్వము జగత్సంహారము పిదప శివుడు పార్వతీ సమేతుడై ప్రళయ తాండవ మొనర్చు వేళ చిదాత్మయగు పరమాత్మ మాత్రమే వెలుగుచుండెను. సృష్టి వినాశమొందెను. ఆ వేళ ధర్మదేవత తాను నశింతునను భయముచే వృషభ రూపమున శివునాశ్రయించగా అతడు ధర్మదేవతను రక్షించుటకై నందిని తన వాహనముగా నొనర్చుకొనెను. నాటి నుండి శివుడు తన శక్తిచే ధర్మమును ధరించి వృషభ రూపమున పరివ్యాప్త మగుచున్నాడు.

**భస్మధారణ :** ప్రళయకాల సమయమున సర్వము నశించినను మృత్యుంజయుడు శ్మశానమందు తానొక్కడే నిత్యుడై క్రీడించుచు స్మశాన మందలి భస్మ- అస్తి కపాలముల ధరించి నిత్యుడై వెలుగుచున్నాడు. సర్వ లోకములు నాశనమైనను శివుడు స్థిరుడై భయ రోగ పాపాదుల దూరమొనర్చి నిర్మలమగు భస్మధారణ మొనర్చుకొని యున్నాడు.

**స్మశానవాసము :** శివుని పరమ ధర్మము జగత్సంహారలీల- కావుననే ఆయన శాశ్వత నివాసము రుద్రభూమి శ్మశానవాటిక.

**తాబేటి చిప్ప:** క్షీర సాగర మధనానంతరము కూర్మము [illegible]ంచ సముద్రమును అల్లకల్లోల మొనర్చువేళ శివుడు దానిని సంహరించి ఆ [illegible]ర్మాంగనును తన మొలత్రాడునకు బిగించికొనెను.

**వరాహ శృంగము :** విష్ణువు వరాహ రూపమెత్తి హిరాణ్యాక్షుని సంహరించిన పిదప ఆ వరాహము లోకమును పెకలించి స్వైర విహారము చేయుచుండ శివుడు దాని కోరలనూడ బెరకి తన వక్షస్థలమున యాభరణముగ ధరించియుండెను.

**గజ-సింహ-వ్యాఘ్ర చర్మధారి :** విష్ణువు నర సింహావతారమెత్తి హిరణ్యకశిపుని పరిమార్చి రక్తము ద్రావి సకల మానవ ప్రాణుల రక్తము గ్రోలుచుండ-శివుడు శరభ రూపమున నారసింహశక్తిని హరించి ఆ చర్మమును వస్త్రముగా ధరించియున్నాడు. మరియు పూర్వము వారణాసి యందు గజాసురుని శివుడు భైరవాకృతి నొంది సంహరించి గజాసుర చర్మ వస్త్రమును ధరించి యున్నాడు.

**భూత పిశాచ సర్ప భూషణుడు :** పూర్వము పితృవనమునందు మునులందరు శివుని గూర్చి ఘోర తప మాచరించుచుండగా శివుడు తవ మాయచే నవ యౌవన రూపియై దిగంబరుడై సాధు రూపమున సంచరించెను. ముని పత్నులు ఆయన అందచందములకు ముగ్ధులై మోహించి ఆ దిగంబరుని వెంటనంటిరి. అది చూచి మునులు కుపితులై శపించిరి. కాని వారి శాపములు వ్యర్థములయ్యెను. తరువాత వారు 'అభిచారిక' హోమము చేయగా హోమగుండము నుండి భీకరాకార అపస్మార ముద్భవించెను. మునులు ఆ దిగంబరుని పై దానిని ప్రయోగించిరి. శివుడు దానిని తన దక్షిణ పాదము క్రింద త్రొక్కి పట్టెను. ఆ మునులు జింకను వ్యాఘ్రమును శూలమును భూత భేతాళ సర్ప అగ్ని మున్నగు వానిని ఆ దిగంబరునిపై ప్రయోగించిరి. శివుడు వాని న న్నింటిని తన హస్తభూషణములుగా నొనర్చుకొనెను. ''అభిసారికా'' మంత్రములన్నియు ''ఢమరక'' మాయెను. అగ్నిగుండము నుండి ఉద్భవించిన భీకర స్వరూపులందరు శివునికి సేవకులైరి. చివరికి శివుడు మాయ నుపసంహరించి ప్రత్యక్షమై మునులెల్లరకు మోక్షమొసంగి యంతర్హితుడాయెను.

మా అందరివద్ద గల ఫలములన్నియు చేర్చి శివునకు నివేదించితిమి. మేమందరము తీర్థ ప్రసాదములు సేవించితిమి. మిగిలినది అందరము పంచుకొని గృహములకు తీసికొనిపోవుటకై భద్రపరచుకుంటిమి. మా పూజల ఫోటోలు కూడా తీయుట జరిగినది. తరువాత మా వంటలు చేసికొను ఓపిక లేక మా వద్ద నున్న ఫలహారములు తిని తృప్తిపడితిమి. తదుపరి నిద్రించి బడలిక తీర్చుకొంటిమి. సాయంత్రం దగ్గరలో గల ఒక లామాను దర్శించితిమి. ఆయనగారికి ''టిబెటు భాష'' తప్ప అన్యము రాదు - మా వెంట నున్న దోర్జియే లామా చెప్పు విషయములను హిందీలో అనువదించుట జరిగినది. మేము కొన్ని తాంత్రిక సంప్రదాయముల తెలిసికొంటిమి. మా పరివార మందలి 'దుష్యంత్' ''లామాలు తాంత్రికశక్తిలో అమోఘమైనవారు. ఇది యెంతవరకు నిజమని'' ప్రశ్నించిరి. ప్రస్తుతము అంత ఘనశ క్తులు గల వారు లేరని తేల్చుకొంటిమి.

శ్రీ చొక్కారావుగారు ''ప్రపంచ మానవులందు భక్తి భావన తగ్గిపోవుచున్న'' దనిరి. ''అది ఉద్ధరింపబడుట యెట్లు సాధ్యమని'' లామాను ప్రశ్నించిరి. లామా గారు సమాధానముగా ''సంఘమందు విస్తృతముగా అట్టి భావనా ప్రచారమవసరమని'' సెలవిచ్చిరి.

మా పరిజనము నేడు అన్నము చారు ఆలు కూరలతో పాటు పాలటిన్ను లందలి సమస్తమును ఖాళీ చేసి ఒక గిన్నె నిండుగా పరమాన్నమును కిస్మిస్-బాదాం పాలపొడి ముప్పగు వానిని చేర్చి మిక్కిలి రుచికరముగా సిద్ధము చేసిరి. షన్ముఖ సుందరంగారు రసమును (చారు) బాగుగా చేసిరి. మేమందరము 7 గంటలకే భోజనము చేయుట జరిగినది. మా వెంట నున్న రుచిగల పచ్చళ్ళు పొడర్లు వినియోగించుకొని కమ్మగా సాపాటు చేసితిమి - కడుపార భుజించి సంతృప్తి నొందితిమి.

శ్రీ చొక్కారావుగారు యెట్టి ఆహారమును తీసికొనజాలరైరి. బలవంతముపై కొంత పాయసాన్నము భుజించిరి. వారికి బంక విరేచనములు సాగినవి. కడుపులో నొప్పిగా నుండెను. జ్వరము అంతగా లేకున్నను బలహీనత మెండుగా నుండెను.

శ్లో. ''శీతేఽతీతే వసన మశనం వాసరాంతే, నిశాంతే
క్రీడారంభం, మలయదృశాం యౌవనాన్తే వివాహం
సేతో ర్బంధం పయసి గళితే వార్ధకే తీర్థయాత్రా''
విత్తే నష్టే వితరణగుణం కర్తు మిచ్ఛంతిమూఢాః.

అనగా చలికాలమంతా ముగిసిన పిమ్మట ఉన్ని వస్త్రములు తెచ్చుకొన్నట్లు ఆకలి లేనపుడు అన్నము భుజించున ట్లు తెల్లవారు జామున రతి జరుపుటకు సిద్ధమైనట్లు యౌవనం ఉడిగిన తర్వాత వివాహానికి పూనుకున్నట్లు చెరువునీరంతయు వెడలిపోయిన తరువాత కట్టవేయున ట్లు ముసలితనములో తీర్థయాత్రలు చేయుట కూడ పై వానికి సరిపడును. దానిచే విత్తమును సమయమును నష్టమగునే కాని ఫలితము శూన్యము. ఈలాటి పనులు చేయుటకు మూఢులు సిద్ధపడుదురని భావము.

నా ఉద్దేశ్యములో ముదుసలులు తీర్థయాత్రలు చేయకూడదని కాదు. అసలు హిందూధర్మ శాస్త్రముల ప్రకారము సమస్త సంసారబంధములను పరిత్యజించి, వాన ప్రస్థాశ్రమమున వయోవృద్ధాప్యము వచ్చిన తరువాతనే తీర్థయాత్రలకు వెడలేయాచారమున్నది. కాని ముసలితనము తీర్థయాత్రలకు అననుకూలమని పై శ్లోకము ద్వారా పండితులు తెలిపినను వారి ఉద్దేశ్యము అనారోగ్యపరులు జరాకృషులు వ్యాధిగ్రస్తులు కైలాస మానసములాటి దుర్గమ యాత్రలు సలుప సాహసించకూడదని వారి యభిమతమై యుండును.

యాత్రలు సులభ సాధ్యములు, కష్టసాధ్యములు, అసాధ్యములు అని త్రివిధములు. మనముండు స్థలములకు అందుబాటులోనున్న యాత్రలు కూడ నున్నవి. అవి సులభ సాధ్యములు. కొంత దవ్వున నున్నప్పటికి రవాణా సౌకర్యములులేకుండుటచే నవి కష్టసాధ్యములు. ఏ సౌకర్యములులేని ఇలాటి మహోన్నత పర్వత శిఖరాధిరోహణము లాంటివి అసాధ్యములని అవి కొందరికే పరిమిత మని భావించవలయును. అందుకే ప్రవరాఖ్యుడు మాయ, గయ, ప్రయాగ, అవంతి, కాశీ,మున్నగు క్షేత్రముల విడచి పాదలేపన ప్రభావమున హిమాలయా మంచుకొండలు చేరుట ''బుద్ధి జాడ్య జనిత ఉన్మాదము'' యని తన్ను తాను నిందించు కొన్నాడు. ☝

✍ వయో వృద్ధులగు శ్రీ చొక్కారావుగారి జ్వర ఇతర బాధల గాంచి నాకు పై శ్లోకము జ్ఞప్తికి వచ్చెను. అయినను వారు త్వరగా కోలుకోవాలని ఆ పరమ శివుని ప్రార్థించితిమి.

అనంతరము మేమందరము ఒక గదిలో సమావేశమై యదాలాపముగా ప్రసంగించుకొంటిమి. 'దార్చెన్' సమీపమందలి సువిశాలమగు మైదానమందు ఒక ఏరోడ్రోం నిర్మించినచో యాత్రికుల కష్టములు చాలావరకు తగ్గిపోవునను మీమాంస మాముందు వచ్చినది. ప్రయాణీకుల దూరభార సమస్య తేలికగా తీరిపోవు ననుకొంటిమి. ఢిల్లీ నుండి ఒకే ఒక గంటలో రావచ్చుననుకొంటిమి. మా వెంట వచ్చు డాక్టర్లు - పోలీసులు నిగం వారు వ్యయ ప్రయాసలు అనుభవించుట గూడ తప్పునుగదా యనుకొంటిమి. దానిపై శ్రీ చొక్కారావుగారు అలా వ్యయప్రయాసలు లేకుండా వచ్చుటలో సార్థకత యేమున్నది. భగవంతుని దర్శించుటలో బాధయున్నపుడే దానికి విలువ యుండునని సెలవిచ్చిరి. పూర్వము దూర పుణ్యక్షేత్రములకు కాలినడకనే సాగిన మహానుభావులు గొప్ప భక్తి తత్పరులు నిష్ఠాయుక్తులు. నేడు సుగమముగా వచ్చిన వారిలో భక్తి యేముండునని శ్రీ చొక్కారావుగారు తన అభిప్రాయమును వెలిబుచ్చిరి. అందులకు నేను సమాధానముగా నేడు సుగమమార్గము లేర్పడినవి కాబట్టి నడువ పనిలేదు. అంతటితో 'భక్తి' లేదనియా? భక్తి మానసిక మూలము దూర భారముతో వ్యయ ప్రయాసలతో నిమిత్తము లేదు. నేడు తిరుపతి శ్రీరంగమ బదరీ కేదారములకు బస్సులు నడుచుచున్నవి. మనకు భక్తి మూలము-బడలిక మూలము కాదుగదా-అయిన తమరు ఢిల్లీ నుండి తవాఘాటు వరకు బస్సులో యెందుకు వచ్చితిరి? కాలినడకన వచ్చినచో భగవంతుడు మిమ్ము బాగా మెచ్చుకొని యుండెడివాడు. అంతేగాక 'తక్లాకోట్' నుండి కూడా బస్సులోనే వచ్చితిరి. మొత్తంగానే నడచి వస్తే పుణ్యము దక్కి భగవంతుడనుగ్రహించేవాడు కదా అని హాస్యోక్తు లాడుకొంటిమి. పూర్వము యే కొద్దిమందో ప్రాణములకు తెగించి అతిదూర

యాత్రలు భగవద్దర్శనమునకై సాగించిరి. నేడు లక్షలాది జనులు సుకరముగా తమ భక్తి ప్రపత్తులు చాటుకొనుచున్నారు. నిజానికి భక్తి యనునది ఇంటివద్ద నున్నను లభించును. తల్లిదండ్రుల సేవ సంఘసేవ దీనజనోద్ధరణ ఇవన్నియు భక్తి సాయుజ్య మూలకములే కదా! నే నట్టి భావనకు తావులేదని యంటిని. ఇవన్ని మనోసంకల్ప సంబంధ ములైనవి - సౌకర్య సౌలభ్య సంబంధములు కావని వాదించితిని.

శ్లో. ''సంకల్పమూలః కామో వైయజ్ఞాః సంకల్ప సంభవాః।
వ్రతా నియమ ధర్మాశ్చ సర్వే సంకల్పజాః స్మృతాః (మను 3)

తా॥ ఎవరేని ఇచ్ఛారహితుడనని నిష్కాముడనని చెప్పినంత మాత్రముననే కాజాలడు. యజ్ఞ సత్యభాషణాది వ్రతముచే ధర్మా ధర్మములన్నియు సంకల్పముచే సిద్ధించును. కావున ఈ పుణ్యక్షేత్ర దర్శనానందము ఆత్మ సంకల్ప సంబంధమని వాదించితిని. మా తోటివారును నన్ను సమర్థించిరి. అందుకు శ్రీ చొక్కారావుగారు పూర్వ మహానుభావుల ఔన్నత్యము గురించి మాకు తెలయ దనిరి. వారి వాదనలో బలము లేకున్నను భావములో ఎంతో బలమున్నదని నే నెరుగుదును. హాస్యమునకు మాత్రమే వారితో వాదించితిని.

పూర్వపు విజ్ఞులు సుదూరప్రాంతముల నుండి ఈ కైలాసాచలాది పుణ్య క్షేత్రముల నడచి యాతనల ననుభవించి దర్శించి తరించిన వారు మా కన్న జ్ఞాన, దేహ దారుఢ్యములు దీర్ఘాయువు కల్గియుండిరనుటలో సందియము లేదు. నేటి కాల పరిస్థితుల ననుసరించి దేహస్థితుల ననుసరించి సౌకర్యవముల వినియోగించుకొనుచుండుట ఒక విధముగా అసమంజసమేమో?

అలనాడు రావణబ్రహ్మ కుబేరార్జిత పుష్పక విమానము ద్వారా ఆ కైలాసమునకు పరమేశ్వర దర్శనార్థ మేతెంచెను. ఆ పర్వత సుదూరములోనే పుష్పక విమానము తనంత తా నాగిపోయెను. అంత నారదుడు తటస్థపడి విమానముపై దర్శనాని కేగుట అహంకారమునకు నిదర్శనమని ప్రమధ గణముల ప్రభావముచే విమానమాగినట్లు ఇక ముందుకు సాగదని సాష్టాంగ దండప్రణామము లాచరించుచు కైలాస శిఖరము చేర నాదేశించెను. అయినను నందీశ్వరుడు రావణుని కైలాస ముఖ ద్వారమున నడ్డగించెను. అంతటి రావణ బ్రహ్మ రాక్షసతాల్ వద్ద ఘోరతప మాచరించెను. చివరికి వెండికొండ నెత్తబోయి భంగపడెను. ఇది పౌరాణిక గాథ.

ఈ ప్రస్తావనానంతరము మేమందరము నిదురలోనికి జారితిమి. మాబస్సు మొన్న రెండవ బృందమును 'హీర్' గ్రామమున దింపి వెనుకకు వచ్చి రేపు మమ్ము గొంపోవుటకై ఆ 'దార్చెన్' గ్రామములోనే వేచియుండెను.

శ్లో. ఝణత్వణ త్కంకణనూపురాయై
పాదాబ్జ రాజత్ఫణినూపురాయ
హేమాంగదాయై భుజగాంగదాయ
నమశ్శివాయైచనమశ్శివాయ.
విశాల నీలోత్పలలోచనాయై
వికాసిపం కేరుహాలోచనాయ
సమేక్షణాయై విషమేక్షణాయ
నమశ్శివాయై చ నమశ్శివాయ.



 ప్రతి దుఃఖ జీవియొక్క కన్నీటి బిందువును తుడుచుటయే గొప్ప వేదాంతము.

 ''బలము కావలెనన్న ఎక్కువసేపు స్నానము చేయవలె'' నని ఫ్రెంచి నాయకుడు నెపోలియన్ చెప్పెను. నిత్యము చన్నీటి స్నానము చేయువారికి పక్షవాతము రాదు.

# ముప్పది రెండవ అధ్యాయం

## తక్లాకోట్ తిరుగు ప్రయాణము

శ్లో : మన్దారమాలా లలితాలకాయై
కపాల మాలాంకితకంధరాయ ।
దివ్యాబంరాయై చ దిగంబరాయ
నమశ్శివాయై చ నమ శ్శివాయ.
అంభోధర శ్యామలకుంతలాయై
తటిత్ప్ర భాతామ్రజటాధరాయ ।
నిరీశ్వరాయై నిఖిలేశ్వరాయ
నమశ్శివాయై చ నమ శ్శివాయ.

7-8-83 ఉదయముననే లేచి 'టీ'లు మాత్రమే త్రాగితిమి. మా సామానులను బస్సుపై కెక్కించితిమి. అప్పుడు సమయము 7 1/2 గంటలు ఉదయము - ఏమైన సామానులు మరచితిమేమో పరిశీలించుకొంటిమి. మా ప్రయాణమును వింతగా చూస్తూ కొందరు టిబెటన్ యువతులు మాముందుకు వచ్చి యుండిరి. వారు తమ భాషలో యేదో మాట్లాడుకొనుచు నవ్వుచుండిరి. మా వద్ద మిగిలిన కొంత ఫలహారమును - పప్పును మరియు కొన్ని వంట సామాగ్రులను కూడ వారి కిచ్చివేసితిమి. ఇచ్చినవి వారు తినుచూ సంబరపడుచుండిరి.

మా బస్సు ప్రయాణమునకు సిద్ధమైనది. అందరము అందులోకి ఎక్కితిమి. ఒక గంటలో నదులు మైదానములు దాటుచు 'చెడ్డీ' క్యాంపు చేరెను.

నేను మాత్రము వెంటనే సరోవరమునకు వెళ్ళి స్నాన పూజాదికములు ముగించు కొంటిని.

బస్సు నిలిచిన ఒక గంటలో మా తోడివారు సామానులన్నియు కట్టి పెట్టిరి. టీ-టిఫిన్లు పూర్తియయ్యెను. అందరము మానస సరోవర పవిత్రజలమును డబ్బాలలో నింపుకొంటిమి. మా బస్సు 10 గంటలకు బయలుదేరినది. కైలాసనాధుని నినాదముతో భక్తి పారవశ్యంతో మా ప్రయాణము ముందుకు సాగినది.

మా బస్సునందు పరిచితుడైన 'లామా' మరియు 'దోర్జి' కూడ వచ్చుచుండిరి. బస్సు వడిగా మిట్టపల్లములను దాటుచూ 'రాక్షసతాల్' ప్రక్క నుండి ముందుకు సాగినది. నావద్దగల ఫలహారమును ప్రేమపూర్వకముగా 'లామా' మరియు 'కిశోర్' లకిచ్చితిని. వారు అప్యాయతతో వానిని స్వీకరించిరి. 'లామా' గారు

జపమాల ఒకవైపు త్రిప్పుకుంటూ ఫలహారమును తినుచుండిరి. 'లామా'ల మత విశ్వాసము నన్ను చకితుణ్ణి చేసినది. వీరిలో 'హిందూ బౌద్ధ' ఆచారములు సమ్మిళితమైయున్నవి. వీరి కట్టు-బొట్టు దేవతా విగ్రహారాధన పరికరములు భారతీయ సంప్రదాయమును గోచరింపజేయును. స్త్రీలు నల్ల పూసల హారములతో మెడను అలంకరించుకొందురు. ఇది ప్రాచీన కాలము నుండి మాంగల్య సూచకముగా అమలులోనున్నదని పురాతత్వ పరిశోధనలలో వెల్లడియైనది. శైవ-శాక్త-వైష్ణవ సంప్రదాయ సిద్ధములగు గంట జపమాల మంగళ హారతులిచ్చుట మన సంప్రదాయమునకు చేరువగా ఆచరణయందున్నవి. ముఖ్యముగా గమనింప దగినవి. సాలగ్రామ-రుద్రాక్ష-భస్మధారణ తిరుచూర్ణధారణ-శిలావైఖరి- ఈ అంశముల వివరణను 'దేవీభాగవతానుసారము పేర్కొనదలచితిని.' వీని ప్రాముఖ్యతను గమనింపగలరు.

సాలగ్రామము : దీనికి ప్రతీకగా దేవీ భాగవతమందలి నొక కథ నుదహరింపదగును.

'శంఖచూడుడు' దానవుడగు విష్ణుభక్తుడు. అతని భార్య 'తులసి' మహాపతివ్రత.

శివుడు శంఖచూడుని భక్తి నిష్ఠలను పరీక్షించుటకై అతనితో యుద్ధ మొనరించెను. 'తులసి' పాతివ్రత్య ప్రభావమున శంఖచూడుడు జయింపబడనందున శివుడు (విష్ణువు) శంఖచూడుని వేషమున తులసి పాతివ్రత్యమును హరించెను. తత్కారణమున 'శంఖచూడుడు' మరణించెను. వారిరువురికి కైవల్య ప్రాప్తి కలిగెను.

వారిరువురు భక్తికి ప్రాతిపదికగా నిలచినవే వైష్ణవదైవోపాసన యందు 'శంఖతోయము' 'తులసి తీర్థము' శివ-శంఖచూడుల యుద్ధ ప్రదేశమున 'తులసి' 'గండకీ' నదిగను-శంఖచూడుడు గండకీశిలగను మారిరి. ఈ 'గండకీశిల' లనే ''సాలగ్రామ'' మందురు.

ఈ ''సాలగ్రామశిలలు'' కీటకములచే తొలవబడి అనేక రూపాంతరములందు మనకు లభించుచున్నవి. దేవతార్చనలో తులసి తీర్థము మరియు శంఖోదకమునకు ప్రాధాన్యత కలదు. అందులో దక్షిణావర్త శంఖతోయము మరింత శ్రేష్ఠమని, పెద్దలనానుడి. వైష్ణవోపాసకులు, తులసి, శంఖ తీర్థములు సేవించనిదేమియు, భుజింపరని చెప్పుదురు.

ఒక రంధ్రముగల దానిని ''నీలశిల లక్ష్మీనారాయణ సంకేత''మందురు. నీలిమాలలేనిది ''లక్ష్మీజనార్థనము.'' రెండు తొలులు నాల్గు చక్రములు గలది.

''రఘునాదము''. రెండు చక్రములు మాత్రమేగల శిల ''వామనము''. రెండు చక్రములు వనమాలగలది ''శ్రీధరము''. గుండ్రని రెండుచక్రములు గలది. ''దామోదరము''. గుండ్రనిదై బాణము గుర్తుగలది ''రఘురామము''. ఏడుచక్రములు గల శిల ''రాజరాజేశ్వరము''. పదునాలుగు చక్రములుగల నీలిశిల ''అనంతము''. చక్రాకారమున రెండు చక్రములు ఒక శ్రీకారముగలది ''మధుసూధనము''. ఒకే చక్రము గలది ''సుదర్శనము''. గుప్త చక్రము గలది ''గదాధరము''. అశ్వముఖముతో రెండు చక్రములు గలది ''హయగ్రీవము''. వెడల్పు ముఖము గల్గి రెండు చక్రములు గలది ''నారసింహము''. ముఖభాగమున రెండు చక్రములు శ్రీకారముగలది ''వాసుదేవశిల''. సూక్ష్మ చక్రముతో నీలముగా అనేక రంగులతో అలరారునది ''ప్రద్యుమ్నశిల''. ఒక రంధ్రమున రెండు చక్రములు గలది ''సంకర్షణశిల''. గుండ్రని ఆకారము గలిగి పచ్చని రంగు గలది ''అనిరుద్ధము''.

దేవతార్చన సమయమందు సాలగ్రామశిల నుంచి పూజించిన భక్తులు సాయుజ్యమును పొందగలరని, సాలగ్రామార్చనమందు తులసి జలములతో పూజించుట మిక్కిలి శ్రేష్ఠవిధానముగా భావింపబడుచున్నది. పై వివరించిన సాల గ్రామములను వేర్వేరుగా ఆరాధించిన ఐహికాముష్మిక ఫలముల నందగలరని. చనిపోవు సమయమున తులసి జలమును నోట పోయుటచే మృతుడు మోక్షమును పొందునందురు. వైష్ణవ దేవతార్చనలో సాలగ్రామముల తులసీజలముచే నభిషేకింపనియెడల భార్యా వియోగము జరుగునని, శంఖోదకము వినియోగింపనియెడల దరిద్రము అరిష్టం మరియు వ్యాధిబాధల నొందుదురని విష్ణువు తులసికి వర మొసంగినాడట. గండకీనదీ తీరమున విష్ణువు శివుడు విహారము చేయుచుందురనుటవలన ఈ పుణ్యక్షేత్రమును భక్తులు సందర్శింతురు. ఇదే ప్రదేశమున ముక్తినాధ క్షేత్రమున్నది.

**భస్మము** : ఈ భస్మమహాత్మ్యమునకు మూలమగు ఒక పౌరాణిక గాధ దేవీ భాగవతమందు కలదు. ఇదేమన దూర్వాస మహాముని ఒకపరి నరకమున కేగుట తటస్థించెను. అత్తరి నరక కూపమందు అనేక బాధల ననుభవించుచున్న పాపులు దూర్వాస మహాముని కంటబడిరి. వెంటనే ఆ పాపుల బాధలన్నియు తొలగిపోయి వారు సుఖ సంతోషములందు నోలలాడుటను యమకింకరులు కని, ఈ వింతను యమధర్మరాజునకు తెలిపిరి. యమధర్మరాజు ఈ విచిత్ర పరిణామమున కచ్చెరువొంది కారణ మరయగా అది దూర్వాసుడు నుదుట ధరించిన భస్మరేఖల రేణువులు ఆ నరక కూపమందు పడుటయే యని యెరిగి అచ్చెరువొందెను. నేటికిని నరక కూపమందు పుణ్యకుండమగు ''పితృతీర్థము'' గలదని ప్రతీతి. కావుననే శైవారాధనమందు రుద్రాక్ష భస్మధారణ జరుపనిదే అది ఫలప్రదము కాదని ఆగమములు ఘోషించుచున్నవి.

దైవోపాసనలో భస్మధారణ విధులు కూడ ప్రాధాన్యత వహించినవి. మానవుడు తన శరీరముతో పాపకర్మలు కావించుచుండును. అందుచే నీ శరీరమును పాపపురుషుడందురు. పాపహరము కొరకు భస్మధారణ ఆవశ్యకమని శైవుల విశ్వాసమైయున్నది. భస్మధారణకు ఈ క్రింది ధ్యాన మవసరమని తెలుపబడినది.

శ్లో॥ ''రక్తాంబోధిస్థ పోతోల్లసదరుణ సరో
జాధిరుఢా కరాబె
శ్శూలం కోదండ మిక్షూద్భవమణిగుణమ
వ్యంకుశం పంచబాణాన్॥
బిభ్రాణాఽ సృక్కపాలం త్రినయనల సితా
పీనవక్షోరుహాఢ్యా
దేవీ బాలార్కవర్ణా భవతు సుఖకరీ
ప్రాణశక్తిః పరా నః.''

పాప పురుషుని దహించిన యనంతరము నీ యమృతముచే తడుపబడిన విభూతిని సర్వాంగములయందు ధారణ చేయనగును. ఈ భస్మము త్రివిధములు. దేవీ భాగవత సిద్ధాంతము ననుసరించి 1. గోమయ సంబంధము 2. నిత్యాగ్ని హోత్ర సంబంధము మరియు 3. లౌకికాగ్ని మంత్రపూరితమగు ఈ భస్మధారణల వలన లలాట లిఖిత కర్మదోషములు తొలగి సర్వ శుభములు చేకూరును.

**రుద్రాక్షలు** :- రుద్రాక్షయన సత్యమునందే దృష్టి కలిగియుండుట. ''రు'' యనగా సత్యము-మరియు ''అ నుండిక్ష'' వరకు ''50'' అక్షరముల సమూహమని యర్థము. శంకరుని త్రినేత్రములును రుద్రాక్షలు అనుట పరిపాటి. 16 అచ్చులలో షండ స్వరములైన ''ఋ, ౠ,'' ఌ, ౡ, లను తొలగించిన తదితరములు 12 సూర్యకళలు - వీనినే ''ద్వాదశాదిత్యులు'' అందురు. ఈ ద్వాదశాదిత్యులలో ''ం'' ''ః'' లు తొలగించిన శేషమగు 10 యక్షరములు అగ్ని కళలని చెప్పుదురు. ఈ కళలు చంద్ర-సూర్యాగ్ని సంబంధముచేత ''38'' యై రుద్రాక్ష జాతులుగా పేర్కొనబడినవి. ఈ రుద్రాక్షలను శివనేత్రములుగా భావించుట మంత్ర శాస్త్ర సంప్రదాయమై యున్నది.

ఈ రుద్రాక్షలందు 1 నుండి 14 ముఖములు గలవాని వేర్వేరు ఫలితములు క్రింద పేర్కొనబడుచున్నవి.

1. ఏకముఖ రుద్రాక్ష ''శివాంశ'' మగుట వలన బ్రహ్మహత్యా దోషములు తొలగిపోవును.

2. ద్వి-ముఖ రుద్రాక్ష ''అర్ధనారీశ్వరము'' గోహత్యదోషహారి.
3. త్రి-ముఖ రుద్రాక్ష ''అగ్ని'' స్త్రీ హత్యా పాపము తొలగును.
4. చతుర్ముఖి-''బ్రహ్మాంశ'' నరహత్యా పాపహరము.
5. పంచ ముఖి-''కాలాగ్ని రుద్రాంశ'' సర్వపాపహరము.
6. షణ్ముఖి-''కార్తి కేయాంశ'' బ్రాహ్మణ హత్యాదోషహారి.
7. సప్తముఖి-''(అ)కనంగము'' గోహత్య, స్వర్ణచోరత్వ హారిణి.
8. అష్టముఖి-''వినాయకము'' తప్పుడు సాక్ష్యం, పరస్త్రీ గమనంలాంటి పాపాలు తొలగును.
9. నవముఖి-''భైరవము'' సర్వపాపహరము, ముక్తి ప్రదాయిని
10. దశముఖి - ''జనార్దనము'' పిశాచాది దుష్ట శక్తుల, మరియు సర్ప విష హారిణి
11. ఏకాదశ ముఖి-'' ఏకాదశ రుద్రాంశము'' సహస్ర అశ్వమేధ ఫలమిచ్చును.
12. ద్వాదశ ముఖి - '' ఆదిత్యము'' గో, నరవధల హారిణి, సర్వరోగహారిణి, మృగబాధాహారిణి.
13. త్రయోదశ ముఖి ''ఇంద్రేయము'' సర్వసుఖ ప్రాప్తి, సర్వా భీష్ట ప్రాప్తి.
14. చతుర్దశముఖి - ''సాక్షాత్ హనుమత్ శివస్వరూపము. పరమపదఫల ప్రాప్తి. శివస్వరూపి.

7 నుండి 14 వరకు గల రుద్రాక్షలచే వ్యాఘ్రాది జంతు భయము పారద్రోలి సర్వవ్యాధుల తొలగించు రుద్రాక్ష ధారణచే సర్వ శుభములు చేకూరును. 108 రుద్రాక్షల మాలను ధరించి శివనామములు జపించిన ఇష్ట కామ్యములు సిద్ధించును.

రుద్రాక్షమాలను గంధపు నీటితోను పంచగవ్యముతోను శుద్ధోదకము తోను క్షాళనముచేసి ఆయా మంత్రములను జపించుట వలన ఫలసిద్ధులు పొందుదురు. రుద్రాక్షలే కాక ప్రవాళ, మౌక్తిక, స్ఫటికాది మాలలు కూడ, కంఠ మందు ధరించుట వాడుకలోనున్న ది. వైష్ణవులకు తులసిపూసలు జపమాలలోనుపయోగించుట ఆచారముగానున్నట్లు తెల్యును.

ముఖములు లేని రుద్రాక్షలను భద్రాక్షలందురు. వీనిని కూడ మాల చేసి ధరించిన రక్షణ చేకూరును. ఏకముఖ రుద్రాక్ష పరతత్వ ప్రకాశమునకును, సర్వశ్రేష్ఠమని చెప్పబడినది. ఇది లభించుట దుస్తరము. ఈ రుద్రాక్షలు హిమాలయము లందును నేపాళదేశమందు చెట్లకు కాయలుగా కాయును. ఇట్టి ఏకముఖి లభించిన అచటి రాజుగారికి సమర్పించవలసి యుండును. లేనిచో కఠినశిక్షకు పాత్రు లగుదురని చెప్పబడినది.

మంత్రశాస్త్రములో రుద్రాక్షలను శిరస్సున ఈశాన మంత్రముచేతను చెవులకు తత్పురుష మంత్రము చేతను, లలాటమున ఆ ఘోర మంత్రముచేతను హృదయమున వామదేవ మంత్రముచే చేతులు కాళ్ళయందు సద్యోజాతధార ణ చేయుట ఆవశ్యకమని విధింపబడినది.

దైవతార్చనక్రమ మందు పైన వివరించిన వాని ప్రాముఖ్యతను గ మనించుట అత్యావశ్యకముగా తలంచి వివరము లీయ బడినవి. గమనింప ప్రార్థన.

మా బస్సులో ఎత్తు పల్లములను దాటుచూ నదీ మార్గములందు వంకర టింకరగా పయనించుచూ 3 గం. మ. వరకు ''తక్లాకోట్'' పరిసరములకు ప్రవేశించితిమి. మరొక ½ గం. పిదప క్యాంపు నందు చేరితిమి. మాకు సంబంధించిన సామానులను గదులందు సర్దుకొంటిమి. శ్రీ రంగాచారి శిర్షాద్‌ల ద్వారా కీ. శే. లగు రామకృష్ణన్‌గారి మృతదేహము 5వ రోజున భారత పోలీసులకు అందింప బడినట్లు తెలిసికొంటిమి. ఆ దినము కాలాతీతమగుట వలన భోజనములు తయారుచేయుటకు వీలుపడలేదు. మా కోరికపై మాకు వేరుశనగ బ్రెడ్ మున్నగు టిఫిన్లు ఒక గంట వ్యవధిలో అందింపబడెను. మా ఆకలి తీరిపోయెను.

సాయంత్రము రోడ్డుపై అలా షికారునకు వెళ్ళి తిరిగి వచ్చి మా భోజనముల ముగించుకొంటిమి. మరుదినము కార్యక్రమ మేదియు లేనందున సమీప మందుగల ''ఖోచార్‌నాథ్'' దేవాలయమును దర్శించుకొనుటకై కొందరము ఉబలాటపడితిమి. కాని ప్రతి ఒక్కరికి రూ.80.00 ఖర్చగు ననుటచే అందరు వెనుకంజవేసిరి. నాకు సమ్మతమైనను ఫలితము లేకపోయెను. ఖోచార్‌నాథ్ దేవాలయ ప్రాశస్త్యమును గురించి మేము తెలిసికొంటిమి.

ఆ దేవాలయము 'టిబెట్'లో ఎంతో ప్రాముఖ్యత గలదియని దీనినే ''ఖేచరీ'' తీర్థమందురు. అది ''కర్నాలీ'' నదీతీర ప్రాంతమందున్నది. నేపాలు దేశము నుండి ''ఏడుగురు ఆచార్యులు'' అచటికి ఏడెత్తుల వెండిని తీసికొని వెళ్ళి మరల ఏడేండ్లవరకు తిరిగి రాలేదట. ఆ ఆచార్యులు స్థానిక రాజునకు సమర్పించు కొనిన వెండితో ఆ రాజు ''జాంబియాంగ్'' అను స్వయంభూనాధుని లింగమును ప్రతిష్టించెనట.

అట్టి స్వయంభూలింగమును ''కర్దంగ్'' రాజు ఆ స్వయం భూలింగ ఆ దేశముతో 'జాంబియాంగ్'' తీసికొని వెళ్ళుచుండగా ''కొర్చక్'' అనుచోట లింగమును కొనిపోవుచున్న బండి ఆగిపోయెనట. ఆ లింగము నుండి ''కొర్చక్'' యను ధ్వని నిరంతరముగా రాగా ఆ స్థానమందే దేవాలయ నిర్మాణము జరిగినట్లు చెప్పుదురు.

దేవాలయ నిర్మాణము పిదప ఏడు రోజుల వరకు దేవాలయ ప్రవేశము నిషిద్ధమను ధ్వని వచ్చెనట. ఆ ఏడు రోజుల వ్యవధిలో దేవలోకమునుండి విశ్వకర్మలు వచ్చి ఆ స్వయంభూనాధునకు సింహాసనము సిద్ధపరచిరట.

పిదప ఆ స్వయంభూలింగము తనను ''జే ఛూడోమా'' (తార) యున్న చోటున ప్రతిష్ఠింపవలసినదిగా మరల ధ్వనించెనట. అట్లే ప్రతిష్ఠింపనైనది. భక్తులు పవిత్రమగు భక్తి భావనతో కర్నాలినది యందు స్నాతులై శుద్ధులై స్వయంభూనాధుని దర్శించుకొనినచో అనేక జన్మల పాప వినాశము గావింప బడునని ఆ పవిత్ర లింగము స్వయముగా నుడివినట్లు స్థానికుల విశ్వాసము. ఈ దైవమున కపచారము గావించు వారలు రక్తం గ్రక్కుకొని చనిపోదురనియు భక్తితో సేవించిన సంతాన ప్రాప్తి కలుగునని స్వయముగా ఖే[illegible]నాథుడే సెలవిచ్చి యున్నాడని దీనిని టిబెటన్లు మిక్కిలిగా విశ్వసింతురు.

ఆ దేవాల[illegible]దు వెండితో నిర్మితమైన 5' ఎత్తు గల సింహాసనమున 'మంజుఘోషుడు'ను [illegible] జాంబియాంగ్ ఛంరిసిగ్ యను అవలోకితేశ్వరుడు కలరు. మరొక దిశ[illegible] 'ఛాంగ్నాదోర్జె' యను వజ్ర పాణియు ప్రతిష్ఠింపబడి యున్నారు.

మంజుఘోషు[illegible] ముఖము పసుపు వర్ణము తోను, అవలోకితేశ్వరుని ముఖము తెలుపు వర్ణముతోను, [illegible]పాణి ముఖము నీలమురంగులోను యున్నవి. ఆ ఖేచర దేవతా విగ్రహములు త్రి[illegible]త్మకమైన దైవమునకు గుర్తుగా భాసిల్లుచు ప్రాముఖ్యత గలిగియున్నవి.

అంతేగాక ఆ దేవాలయ శిల్ప[illegible]దు 'మైత్రేయ' మూర్తి మరియు బుద్ధుని సప్తావతారములు సప్త ముద్రలు మలచబడియున్నవి. వీనినే సప్త ఋషులని కూడ భావింతురు.

'ప్రజ్ఞా పారమిత' దేవికి సంబంధించిన ఐదు విగ్రహములు కూడా ఆ దేవాలయమందు ప్రతిష్ఠంపబడి యున్నవి.

తారాదేవి యొక్క '22' అవతారములు గూడా అచ్చట పూజింపబడుచున్నవి.

'ప్రజ్ఞాపారమిత' దేవి పంచ విగ్రహములు దుర్గ యొక్క పంచ రూపములగు దుర్గ రాధ లక్ష్మి సరస్వతి మరియు సావిత్రియై యుండవచ్చును.

అచటి గ్రంథాలయమందు 'తంజూర్', 'కంజూర్' యను పవిత్ర మత గ్రంథములు భద్రపరుపబడి యున్నవి.

ఇట్టి ప్రఖ్యాత దేవాలయమును దర్శింపలేకుండుట మా దౌర్భాగ్యముగా భవించి విచారపడితిమి.

బస్సు ఎత్తు పల్లముల ప్రయాణ బడలికచే త్వరలోనే నిద్రలోనికి జారితిని.

శ్రీచొక్కారావు గారు నాడు కూడ ఆహారమేమియు గైకొనలేదు. రుగ్మత భల్లుకపు పట్టులా వదలలేదు. ఈ భల్లూకపు పట్టు గురించి ఒక గాధ కలదు. ఇద్దరు మిత్రులు కలిసి ప్రయాణము సాగించుచుండిరి. కొంత దూరమేగిన తర్వాత నొకనది వచ్చెను. ఆ నదిలో నల్లని వస్తువేదో కొట్టుకొని పోవుచుండుట మిత్రు లిరువురు గాంచిరి. అందులో నొకడు దానిని గొంగళిగా భావించి తెచ్చుకొన సమకట్టి నదిలో దూకెను. ఆ నల్లనిది గొంగళిగాదు. అదొక యెలుగుబంటు. అది ఈతనిని గట్టిగా పెనవేసుకొనెను. అతను ఎంత ప్రయత్నించినను వదలకుండెను. గట్టుపై నున్న మిత్రుడు దానిని వదలి గట్టుపైకి రమ్మని కేకవేసెను. నదిలోని మిత్రుడు తానెప్పుడో వదిలితి నని కాని అది తనను వదలుట లేదని సమాధానమిచ్చెను. భల్లూకము ప్రాణాపాయ స్థితిలో నున్నను పట్టినపట్టు విడువదు. అందుకే భల్లూకపు పట్టుకు ప్రాముఖ్యత వచ్చెనేమో!

శ్లో. ప్రపంచ సృష్ట్యు న్ముఖలాస్యకాయై
సమస్త సంహారక తాండవాయ
జగజ్జనన్యై జగదేక పిత్రే
నమ శివా యై చ నమ శ్శివాయ.
ప్రదీప్త రత్నోజ్జ్వల కుండలాయై
స్ఫురన్మహాపన్నగ భూషణాయ.
శివాన్వితాయై చ శివాన్వితాయ
నమశ్శివాయై చ నమశ్శివాయ.
ఎతత్పఠే దష్టక మిష్టదం యో
భక్త్యా స మాన్యో భువి దీర్ఘజీవి।
ప్రాప్నోతి సౌభాగ్య మనంతకాలం
భూయా త్సదా తస్య సమస్త సిద్ధిః.
( ఇతి అర్ధనారీశ్వర స్తోత్రమ్)



# ముప్పది మూడవ అధ్యాయం

## తక్లాకోటులో విశ్రాంతి

శ్లో : సౌరాష్ట్ర దేశే విశదేతిరమ్యే
జ్యోతిర్మయం చంద్రకళావతంసం।
భక్తి ప్రదానాయ కృపావతీర్ణం
తం సోమనాథం శరణం ప్రపద్యే.
శ్రీశైలశృంగే విబుధాతిసంగే
తులాద్రి తుంగేపి ముదా వసంతం।
త మర్జునం మల్లికపూర్వ మేకం
నమామి సంసారసముద్రసేతుమ్.

✍ 8.8.1983 ఉదయమే తక్లాకోట్‌లో విశ్రమించిన పిదప లేచి స్నానాదులు ముగించుకొంటిమి. అనంతరము 9 గంటలకు పిలుపు రాగా టిఫిన్లు చేయుట జరిగినది. ఆ తదుపరి మా సామానంతయు సిద్ధపరచుకొని చెకింగ్ నిమిత్తము తెమ్మనిరి. అట్టి సామాను ఆ రోజే గుఱ్ఱములపై వేసికొని ''పాలా'' గ్రామము చేరి మరునాడు ''లిపుపాస్''కు చేరవేయవలసి యుండెను. అదే ప్రకారము మా సామానంతయు ఒకరొకరిదే సరిగా లెక్కించుకొని మాకు సంబంధించిన పాస్‌పోర్టులపై ముద్రలు వేయుట కూడా జరిగెను. పూర్తి సామామల బాధ్యత వారికి ఒప్పగించితిమి. మా వద్ద కేవలము వీపునకుండే బ్యాగులు కెమెరాలు మాత్రమే యుండి పోయెను.

మా క్యాంపునందుగల ఒక సహకర విక్రయ కేంద్రమందు మా మిత్రులు కొంతమంది చేరి, చేరుమాళ్ళు, బొమ్మలు, పుస్తకాలు, సిగరెట్లు వగైరా కొనిరి. అచ్చట ప్రతిదీ అధిక ధర యగుటచే నేను మాత్రము కేవలము జ్ఞాపకార్థమునకై ''పాటాలాప్యాలెస్ ఆల్బమ్'' నొక దానిని మరియు మాప్రియ మిత్రుడగు ''యుగల్‌శర్మ'' కొరకు ఒక చైనా సిగరెట్ ప్యాకెట్ నొకదానిని కొనుటజరిగినది.

పిదప మేమందరము బ్యాంక్‌నకు వెళ్లి మా దగ్గరి ''యువాన్''లను ''యు.స్. డాలర్ల'' క్రిందకు మార్పించితిమి. మాలోని చాలా మంది చైనా చిల్లర నాణెములను సంగ్రహించుకొనిరి. ఆ పిదప క్యాంపు చేరితిమి.

సుమారు ఒంటి గంటకు భోజనములకు బయలు దేరితిమి. మా వద్ద గల పిండిపొడులు పచ్చళ్లతో భోజన మారగించితిమి. భోజనానంతరము కొంతసేపు విశ్రమించి ఆ పిదప నేను మాత్రము గాఢనిద్రాపరవశుడ నైతిని.



9వ నెం. మోతిలాల్ నెహ్రూ మార్గ్‌లో మిత్ర బృందంతో



కైలాస శిఖరము



తక్లాకోట్ నుండి హిమాలయ హిమ శిఖర పంక్తులు.



శిథిల గొంపాల రాళ్ళపై ప్రణవ మంత్రము.



మబ్బు వీడిన కైలాస దృశ్యము.



కైలాస పరిక్రమ చేయుచున్న లామాలు.



మానస సరోవర గట్టు నుండి వెనుక కైలాస శిఖరము



మానస సరోవరము వెనుక కైలాస దృశ్యము.

మా సహయాత్రిక బృందము వారందరు 'చైనా కల్చరల్ హాల్' లో చేరి చైనా అమ్మాయిలతోను అనువాదకులతోను కలిసి ఎవరి భాషలందు వారు పాటల కార్యక్రమమును ఆనందముగా 4 గం॥ ల వరకు జరుపు కొనిరి. ఉభయ దేశముల జాతీయ గీతాలాపనముతో కార్యక్రమము ముగిసెను.

ఆ సాయంత్రము మేమందరము వాహ్యాళి నిమిత్తమై ఊరి బయటకు వెళ్లితిమి.

మా క్యాంప్ భవనమందు గ్రూప్ ఫోటో ఒకటి తీయుట జరిగినది. ఒక చైనీయుడు మేము ఈ గ్రూప్ ఫోటోలను తీసికొనుట జరిగినది.

ఆ రోజు శరీర బడలిక లే కుండెను. రోజంతయు విశ్రాంతిగా గడచెను. మా జట్టులో చాలా మంది సదాచార సంపన్నులుగా నుండుట నా కెంతయో సంతసము చేకూర్చినది. ఈ సందర్భమున మన శాస్త్ర సంబంధమగు సదాచార విధులను గూర్చి కొంతగా వివరింపదలచితిని. నేటి తరము యువకులు నైతిక బాధ్యతలను మరచి యెటుపయనించుచున్నారో ఆవశ్యము ఆలోచింప దగిన విషయము. ఇప్పట్టున తల్లిదండ్రుల బాధ్యత యెంతయేని అవసరమని నాకు తోచినది. పెద్దలగువారు నేటి సమాజమును నైతిక విధుల యెడ ప్రోత్సహించుచో దేశము సుఖ శాంతులకు నిలయ మగునని నాకు తోపబడెను.

శాస్త్ర సంబంధ మగు కొన్ని సదాచార విధులను వివరించుటకు ప్రయత్నించు చున్నాడను.

## సదాచార వ్యూల సూత్రవులు

1. అహింస 2. సత్యము 3. అస్తేయము 4. బ్రహ్మచర్యము 5. అపరిగ్రహము.

**అహింస** : అహింస యన ఏ ప్రాణి నైనను హింసింపరాదని భావము: హింసయందు ప్రాణులను చంపుట బాధించుట కృశింపజేయుట శోషింప చేయుట క్షోభ పెట్టుట యనునవి విస్తృతార్థములు.

మహాభారతమందు 'ధర్మవ్యాధుడు' 'హింసను' గూర్చి ఇట్లు విపులీకరించి యుండెను.

ప్రతి మానవుడు ఏదో ఒక విధమున హింస గావించుచునే యున్నాడు. అట్లు చేయనిదే జీవితము గడపుట దుస్సాధ్యము.

ఈ జగత్తునందు మన దృష్టికి గోచరింపని యెన్నో ప్రాణులున్నవి. అగోచరమగు సూక్ష్మాతి సూక్ష్మ జీవులెన్నో కోటాను కోట్లుగా నశించుచున్నవి. జన్మించుచున్నవి. ఉచ్ఛ్వాస నిశ్వాస సమయములందు అనేక సూక్ష్మప్రాణులు నశించుచున్నవి. త్రాగునీటి యందు అనేక సూక్ష్మక్రిములున్నవి. అవియు నశించుచున్నవి. మనము నడచునపుడు నేలపై నున్న క్రిములు నశించుచున్నవి. రైతు భూమిని దున్నునపుడు భూమిలోని అనేక క్రిమిజాలము నశించుచున్నది. అగోచరమగు అల్పప్రాణులు నశించిపోవుట దృశ్యాయమానము కానందున అందు మానసికవ్యధ నొందుటకు వీలులేదు. కాని దృగ్గోచరమగు జీవులను హింసించుట మానవ కారుణ్యము ధర్మమునకు విరుద్ధము. కావున యెరిగి హింసించుట హింస - ఎరుగక చేయునది అహింసాత్మకము - సర్వోత్కృష్టమైన మానవ జన్మ దీనిని పాటించుటకు సాధ్యమైనంతవరకు ప్రయత్నించవలెను. హింసాహింసలమీమాంస అతిసున్నితమైనది. కావున సాధ్యమైనంతమేరకు అహింసను పాటించుట సముచితము. ☝

వాల్మీకి రామాయణములో నిలా చెప్పబడెను.

శ్లో : న మాంసం రాఘవో భుజ్త్కే న చాపి మధు సేవతే ।
వన్యం సువిహితం నిత్యం భక్త మశ్నాతి పఞ్చమమ్ ॥''

☝ ఈ పై మాటలు ఆంజనేయుడు లంకలో అశోకవనమున చెరయున్న సీతమ్మతో నుడివెను. రాఘవుడు సుఖకాలములోవలె మాంసమద్యములు సేవించ కుండెనట. కందమూలాది ఫలములు ''వానప్రస్థుల'' మాదిరి భుజించుచు చింతాక్రాంతుడై యుండెనట. మన మిట్టి శ్రీ రామచంద్రుని అవతారమూర్తిగా భావించి ఆలయములలో ప్రతిష్ఠించి పూజించుచున్నాము గదా ! ఇచట హింసయనగా కేవలము మాంసభక్షణమని భ్రమపడకూడదు. హింసయనగా

బలహీనులపై - బలవంతుల హింస

అజ్ఞానులపై - జ్ఞానుల హింస

పేదవారిపై - ధనికుల హింస

అబలలపై - సబలురగు పురుషుల హింస.

ఇట్టివి జరుగరాదు. మనము శ్రీరామచంద్రుని ఆదర్శ పురుషునిగా భావించినపుడు - ఆయన అరణ్య వాసమునకు ముందు మధుమాంస భక్షణము చేసినది గమనింపరాదు.

ఆయన గుణ విశేషములగు శౌర్యోదార్యాది బ్రహ్మచర్యా శ్రమ దమాది సద్గుణములు మరియు ఆయన పితృవాక్య పరిపాలన మున్నగువానిచే ఆ పురుషోత్తముని పూజనీయము గావించినవి.

పితృవాక్య పరిపాలన గావించిన వారిలో 1. తండ్రి హరిశ్చంద్రునికై కుమారుడు లోహితుండు జననితో బ్రాహ్మణుని యింట దాస్యము చేయుట. 2. అజీగర్తుని తనయుడు శునస్సేపుడు తన్నమ్ముడుపోయి యజ్ఞ వాటికాబద్ధుడై గాధి సుతుని ద్వారా విమోచనము బడయుట. 3. తండ్రి యాజ్ఞ అనుల్లంఘనీయమను శాసనముచే పరశురాముడు తన స్వంత జనని శిరము ఖండించుట. 4. తండ్రి యభీష్టము నెరవేర్చుటకై గాంగేయుడు ఆజన్మాంతము బ్రహ్మచర్యము వహించి రాజ్యము సోదరుల కిచ్చి భీష్ముడుగా పేరొందుట మున్నగునవెన్నో పూర్వగాధలు పితృవాక్య పరిపాలనకు ప్రతీకగా నిలిచియున్నవి.

ఈ మద్యమాంస సేవనలచే ఇంద్రియ ప్రకోపము వృద్ధి జెందునుగాన నిష్ఠాపరుల కవి నిషేధింపబడినవి. కావున పరోపకారమే పుణ్యమని పరపీడనమే పాపమని సర్వ గ్రంథముల సారము.

శ్లో : శ్రూయతాం ధర్మసర్వస్వం ।
యదుక్తం గ్రంథ కోటిభి ః।
పరోపకార ః పుణ్యాయ।
పాపాయ పరపీడనమ్.

ఈ అహింస త్రివిధమగు అవినా భావసంబంధతపము 1. వాచికతపస్సు 2. మానసిక తపస్సు 3. కాయిక తపస్సు యనునవి.

**1. వాచికతపస్సు :**

శ్లో. ''అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్।
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్చతే ।''

పరుషవచనములచే మాటాడకుండుట సత్య ప్రియ హితమగు వచనములచే స్వాధ్యాయియగు దానికే వాగ్ రూపక తపస్సందురు.

**2. మానసిక తపస్సు :**

శ్లో : మనఃప్రసాద స్సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః।
భావ సంశుద్ధి రిత్యే త త్తపో మానస ముచ్చతే ।''.

మనో అంతఃకరణములయందు దయయు ఇంద్రియ నిగ్రహము మితభాషణము చిత్తశుద్ధిగల్గియుండు ఆచారమునే మానసిక తప స్సందురు.

3. కాయిక తపస్సు :

శ్లో: దేవ ద్విజ గురు ప్రాజ్ఞ పూజనం శౌచ మార్జవం ।
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే ॥

దేవ ద్విజ గురు పండితుల పూజనము శుచిర్భూతుడై ఋజుమార్గవర్తనుడై బ్రహ్మచర్య అహింసలను పాటించుటను శారీరక తపస్సని చెప్పుదురు.

☝ఇవి సామాన్యులు పాటింపదగినవే యైనను కఠినమగు తపోనియమాదులును యున్నవి. అవి యమ నియమ ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధులను అష్టాంగ యోగములని గలవు. మహాత్ములు పై కఠోర యోగముల నభ్యసించి ఊర్ధ్వ రేతస్కులై ముక్తిని గాంతురు.

2. సత్యము : కల్లబొల్లి మాటలాడక ఉన్నదున్నట్లు చెప్పుటను సత్యమందురు. కొన్ని సందర్భములందు సత్యము చెప్పుట ప్రమాదకారిగా పరిణమింపవచ్చును. కావున ప్రాణాతురులను పరిణయాతురులను కాపాడు వేళలందు సత్యమును పాటింపకుండుటయు సముచితముగానే భావింపబడినది. వీనినే ధర్మ సూక్ష్మములందురు. ఇట్టి సత్యాసత్యములను ఔషధములను వాడు రీతిలో అతి జాగ్రత్తగా వాడవలసి యుండును. స్త్రీల పట్టున వివాహాది నిర్ణయ సందర్భములందు సంపదలకు భంగపాటు కలుగునెడ మానభంగసమయము లందు భయోత్పాత సమయములందు గో బ్రాహ్మణ సంరక్షణమున బొంకుట పాపరహితమని శుక్రాచార్యులు బలికి ఉపదేశించెను. దీనినే ఆపద్ధర్మమందురు.

స్వార్థ చింతనము పెనవేసికొన్న నేటి కాలమున అసత్యము, మాయ, మోహము దుష్టచింతనము, మోసము, ప్రబలముగా నగుపడుచున్నది. వీని పరిణామముచే సమాజమునకు అశాంతి అసౌఖ్యము అన్యాయము అనర్థము నొనగూడుచున్నది.

సత్య నిష్ఠ చాలా గొప్పది. ఇది కేవలము నిర్భయులకు నిస్స్వార్థులకు ర్మోహులకు మాత్రమే సుసాధ్యమైనది. దిగువ పద్యముల శ్లోకముల గమనింపుడు. ర్మ వ్యాధుడు కౌశికునితో నీ విధముగా నుడివినట్లు భారత అరణ్య పర్వములో ర్కొనబడెను. ☝

ఉ. భూత హితంబుగా బలుకు బొంకును సత్యఫలంబు నిచ్చు ద
ద్భూత భయాస్పదం బగు ప్రభూతపు సత్యము బొంకునట్లు ప్రా
ణాతురు డైనచో పరిణయంబున యందును బల్కు బొంకు స
త్యాతిశయంబ యండ్రు మహితాత్మక యిట్టివి ధర్మ సూక్ష్ముముల్.

ఇట్లే బలి చక్రవర్తికి శుక్రాచార్యు లీవిధముగా నుడివిరి.

ఆ. వారిజాక్షులందు, వైవాహికములందు
ప్రాణ విత్త మానభంగమందు
చకిత గోకులాగ్ర జన్మరక్షణమందు
బొంకవచ్చు నఘము బొంద దధిప.

☝ శృత్యనుసారము ''సత్యంవద''ను పాటించుటకు బదులుగా నేటి కాలములో ''సత్యంవధ'' మరియు 'ధర్మంచర' కు బదులుగా ''అధర్మంచర'' అమలగుట కానవచ్చుచున్నది. పూర్వము హరిశ్చంద్ర ధర్మరాజాదులు ఈ సత్యవ్రతముచేతనే ఐహికాముష్మికముల బడయగలిగిరి. ఏది యెట్లున్నను ఈ నిష్ఠ మిగతా వ్రతములకన్న మిన్నయై సర్వశ్రేయములకు మూలమైయున్నది.

**3. అస్తేయము :** అస్తేయమనగా తదితరుల వస్తువుల హరింపకుండుట తన ధర్మ మందు చోర ప్రవృత్తి మోసము లంచము మున్నగు దుర్లక్షణములు లేక యుండుటయే అస్తేయ మనబడును. బలవంతుడు బలహీనున కన్యాయ మొనర్చినను తన కన్న మిన్నయగు పరమాత్ముడున్నాడని తెలిసికొనుట పరమ సత్యమగు విషయము. ఇది గమనించి నడుచుకొనుటయే అస్తేయ వర్తనము. నేడు స్తేయము నాశ్రయించక ధనికులగుటకు ఆడంబర సౌఖ్య పదవులను సాధించుటకు పలు అక్రమాచరణలకు గురియగుట కాననగును. అది అధర్మ వర్తనమే యగును.

**4. బ్రహ్మచర్యము :**

బ్రహ్మచర్యమన దశేంద్రియ నిగ్రహము. జ్ఞానేంద్రియములు ఐదు ఇవి. 1. త్వక్ (చర్మము) 2. చక్షు (నేత్రము) 3. శ్రోత్ర (కర్ణములు) 4. జిహ్వ (నాలుక) 5. ఘ్రాణ (నాసికము)

పంచ కర్మేంద్రియములు : 1. వాక్ (మాట) 2. పాణి (చేతులు) 3. పాద (కాళ్ళు) 4. పాయువు (గుదము) 5. ఉపస్థ (మర్మస్థానము)

ఈ కర్మేంద్రియములైదును పంచ జ్ఞానేంద్రియములకు లోబడి యుండును.

బ్రహ్మచర్యశీలి పరస్త్రీని తల్లిగా భావించును. పరద్రవ్యము నపహరింప బూనడు. సమస్త ప్రాణులను తనవలె భావించును.

బ్రహ్మచారియగువాడు రథచోదకుడు అశ్వముల పగ్గములచే బిగించి సక్రమ మార్గమున నడిపించు రీతిని బ్రహ్మచారి తన శరీరమను రథమును పంచేంద్రియములను పగ్గములచే స్వాధీన మందుంచుకొని జీవిత యాత్ర సాగించును. ఈ వ్రత మత్యంత

కష్టసాధ్యమైనది. మహామునులగు విశ్వామిత్ర పరాశరులు ఇంద్రియ నిగ్రహమునకు గాను ఆకులలములు తినియు మేనకాధ్యప్సరసల వలపులకు లోనైరి. అయినను కఠిన తపస్సుచే ప్రయత్నించుటకు పూనుకొనవలెను. అదియే నిజమగు బ్రహ్మచర్యము. సంయమనమే శాంతికి సోపానము కాగలదు.

ఈ జ్ఞానేంద్రియ పంచకములు పంచతన్మాత్రలకు గురియై అలవాటు పడు కారణము చేతనే మానవాళి మనుగడ మహాద్భుత చర్యలకు దారితీయు చున్నది. చెవులు మంచి ధ్వనిని త్వక్కు మంచిస్పర్శను ఘ్రాణము సువాసనలను జిహ్వ మంచిరుచులను నేత్రములకు నయనా నందకర దృశ్యములను వాంఛించును. వీనిలో ఏ ఒక దానికిని విఘాత మేర్పడినా తృప్తియుండదు. అందుకే ఈ ఇంద్రియ లాలసతకు గురియై కష్టముల బొందక మితమును పాటించుటే బ్రహ్మచర్యావశ్యకతకు మూలము.

శ్లో. మాతృవ త్పర దారాం శ్చ పరద్రవ్యాణి లోష్టవత్।
ఆత్మవ త్సర్వ భూతాని యః పశ్యతి స పండితః॥

## 5. అపరిగ్రహము

అపరిగ్రహమన దొరికినంత దానితోనే పరి తృప్తినొందుట. "తృప్తిన్ జెందని మనుజుడు సప్తద్వీపముల జనిన జక్కంబడునే."

దురాశ దుఃఖమునకు చేటు - కావున కలిగినంతలోనే తృప్తినొందుట సముచితము.

ఆశాపాశములకు లోబడక స్వార్జితమగు పరిమిత ధనముతో సంతృప్తిని గాంచవలయును. ఇతరుల యాచించుట గృహస్థునకు పనికిరాదు. కష్టపడి పనిచేసి అర్థమును సంపాదించుటే గౌరవ ప్రదము. దిగువ పద్య-శ్లోకముల గమనింపుడు.

కం. వ్యాప్తిన్ బొందక - వగవక
ప్రాప్తం బగు లేశమైన పదివే లంచున్
తృప్తిం బొందని మనుజుడు
సప్తద్వీపముల నైన చక్కంబడునే.

శ్లో. హలాగ్రేన హతా మాతా - విషాన్నేన హతా స్సుతా ః।
మాతాపుత్రవిరోధాయ, హిరణ్యాయ నమో నమః.

అనగా ఒక గ్రామములో తల్లీకొడుకు లిరువురు వ్యవసాయమునకు సామి దున్నుచుండగా నొక లంకెబిందె బయల్పడెను. లంకె బిందెపై గల ఆశచే తల్లి కొడుకునకు దెచ్చు అన్నములో విషము గల్పును. అట్లే కొడుకు గూడ తనకే లంకె

బిందె దక్కవలయుననను పేరాశచే అన్నము తెచ్చిన తల్లిని నాగలిచే చావబాదెను. పిదప అన్నము భుజించి తనుకూడ మరణించెను. పైన లభించిన బంగారము యెవ్వరికిని, లభించకపోగా ప్రాణములను కూడా తీసిన కారణము పేరాసయే గదా!

✍ తరువాత 8 గం॥ రాత్రి భోజనములుచేసి అరగంట సేపు మాత్రమే చైనీయుల సినిమా చూసి త్వరగా పడుకొంటిమి. ఎందుకనగా రేపు ఉదయము 3 గం॥లకే మా ప్రయాణమని తెలిపిరి. చొక్కారావు గారి నీరసము తగ్గలేదు. బలవంతముగా పాలు వెల్లుల్లితో కొద్దిగా భోజనము చేయించితిమి. కడుపులో నొప్పి తగ్గకుండెను. దిన దినము వారి సమస్య గడ్డుగా మారుచుండుటచే త్వరగా మన జన్మభూమికి చేరవలెనను ఆతురత పెరుగుచుండెను.

శ్లో. అవంతికాయాం విహితావతారం
ముక్తిప్రదానాయ చ సజ్జనానాం
అకాలమృత్యోః పరిరక్షణార్థం
వందే మహాకాల మహాసురేశమ్.
కావేరికానర్మదయోః పవిత్రే
సమాగమే సజ్జనతారణాయ
స దైవ మాంధాతృపురే వసంత
మోంకార మీశం శివ మేక మీఢే.



## ముప్పది నాల్గవ అధ్యాయం

## జన్మభూమికి తిరుగు ప్రయాణము

శ్లో : పూర్వోత్తరే ప్రజ్జ్వలికానిధానే
సదా వసంతం గిరిజా సమేతం
సురాసురారాధిత పాదపద్మం
శ్రీ వైద్యనాథం తమహం నమామి.
యామ్యే సదంగేనగరేఽతిరమ్యే
విభూషితాంగం వివిధైశ్చ భోగైః
సద్భక్తిముక్తి ప్రద మీశమేకం
శ్రీనాగనాథం శరణం ప్రపద్యే.

✍ ఆ రోజు 9-8-83న మధ్యరాత్రి 1 గం. కే మమ్ములేపుట జరిగినది. నేను పెద్ద థర్మాసులోని నీరు బకెట్‌నందు పోసికొని స్నానమొనర్చుకొంటిని. అట్లే పూజ కూడ ముగించుకొంటిని. అందరితోపాటు నేను ప్రయాణమునకు సిద్ధమైతిని.

మాకు 2 గం.లకు టిఫిన్లు ఇచ్చుట జరిగినది. వెంటనే మేమందరము బయటకు వచ్చివేసితిమి.

అప్పటికే సుమారు 25 గుఱ్ఱములు మా ప్రయాణమునకు సిద్ధపరచిరి. వానిపై ఒక్కొక్కరకముగా లైట్ల వెలుతురులో అధిరోహించుట జరిగినది.

శ్రీ చొక్కారావుగారు అస్వస్థులైనందున ప్రత్యేక శ్రద్ధ వహించుటకు గాను నలుగురు మనుష్యులను యేర్పాటు చేయనయ్యెను. ఆయనగారిని గుఱ్ఱముపై యెక్కించుటకుగాను, చౌదరి, కిషోర్లు సాయపడిరి. అట్టి పని పూర్తి కాగానే నేను గుఱ్ఱముపై యెక్కుటకు ప్రయత్నించుచుంటిని.

ఇంతలో నాయెదుటనున్న అగ్రవాల్‌గారు గుఱ్ఱముపైనెక్కు ప్రయత్నములో తటాలున వెల్లకిలగా పడిపోయి కన్నులు తేలవేసెను.

వెంటనే నేను వడిగా వడిగా ఆయనను చేరి చెక్కిళ్ళు చెవులు అదిమి గట్టిగా వేడిమి పుట్టునట్లు రాయుట జరిగినది. అప్పుడే డా॥ 'గోడ్బోలే'ను కేకవేసి పిలిచితిని. ఆయనగారు వెంటనే వచ్చి అగ్రవాల్‌గారిని మెట్లపై పడుకొనబెట్టి ప్రథమ చికిత్సకు పూనుకొనిరి. అంతలోనే 'అగ్రవాల్'గారు మేల్కొని ''మీరంతా నాచుట్టు మూగినారు. యేమి జరిగిన'' దనిరి. తమరు గుఱ్ఱము యెక్క బోయి పడిపోయినారండి, అంటిమి.

''అబ్బే! అదేమిలేదు. ఆ నాకేమి కాలేదే'' యని వారనిరి. ఇంతలో కొంత 'యెలక్ట్రాల్' నీరు యిచ్చి ఆయనగారిని ఉపశమింప జేసితిమి. 5 నిముషములు గడచెనో లేదో మరల స్పృహ కోల్పోయి కళ్ళు తేలగించిరి. 2 నిముషముల అనంతరము స్పృహకు వచ్చి ''నాకేమి కాలేదండి'' యనెను. అది మాకు చాలా చిత్రముగా తోచినది. ఇంతకుముందే ఒకరితో బాధపడుచుండ రెండవవారు సిద్ధమైరి. వీరితో కలిసి ఆ చీకటిలో నదుల మధ్యగుండా యెలా దాటివెళ్ళగలమా అను సమస్య మమ్మ బాధింపదొడగెను. బహుశః యిట్టి విచిత్ర పరిణామమునకు కారణము యెత్తగు ప్రదేశములందు వారి రిక్త ఉదరములై యుండవచ్చును. ఇలాంటి పరిస్థితులలో మెదడునకు ప్రసారమగు రక్తము నిలిచిపోయి స్పృహ కోల్పోవుట జరుగుచుండుట సహజము. అట్టివారికి వెంటనే తగినంత ఆహారమివ్వనియెడల ప్రాణాపాయము గూడా సంభవింపవచ్చును. మా ప్రయాణమునకు క్రితము దినము అగ్రవాల్‌గారు ఉపవసించి యుండిరి. అదియే కారణమని మేమూహించియుంటిమి.

చివరకు మేమందరము సరిగా 3 గం. రాత్రి సమయమున గుఱ్ఱములపై నెక్కి మా ప్రయాణమును సాగించితిమి. కాని అంతా అగమ్యగోచరము ఎవరెక్కడ నున్నారో ఆ చీకటి సమయమున తోపజాలకుండెను. ఏ కొందరి వద్ద మాత్రమే బ్యాటరీటార్చిలుండెను. నావద్ద కూడా 'టార్చిలైటు' ఉండుట వలన మధ్య మధ్య అటు చొక్కారావుగారిని ఇటు అగ్రవాల్‌గారిని గమనించుచూ పరామర్శించుచూ జాగ్రత్తయని హెచ్చరించుచూ ముందునకు సాగుచుంటిమి. మావెంటనున్న 'షీ' ద్వారా ఇద్దరు మనుష్యులు ప్రత్యేకముగా గమనించుటకు గాను చెప్పియుంటిని.

మావెంట 'షీ' తో పాటు హిందీ నేర్చిన ఒక దుబాసి 'వాంగ్' అనునతడు కూడా యుండెను. ముఖ్యముగా అతి యెగుడు దిగుడు దారులందు నదులు దాటవలసినచోట మాప్రాణము లరచేతిలో పెట్టుకొని పయనించితిమి.

'కర్నాలి' నదిని దాటి 'తక్లాకోట్' బహిఃప్రదేశము చేరునప్పటికి మాకు కొంత ఊరట కలిగినది. అప్పటికీ చీకటి వ్యాపించియే యుండెను.

కొంత ముందునకు సాగితిమో లేదో నాలుగైదు గుఱ్ఱములు ప్రక్కనున్న పొలములోనికి మేతకు లాగినవి. వాని నాపుట దుస్సాధ్యమయ్యెను. కళ్లెము లెంతలాగి పట్టినను లాభము లేకుండెను. వెంటనే తోడి మనుష్యులు పరుగున వచ్చి బలవంతముగా వాటిని దారికి మరలించిరి.

నా గుఱ్ఱపు కళ్లెము ప్రక్కనున్న మరొక గుఱ్ఱపు కళ్లెములో ముడివడినది. గుఱ్ఱములు రెండు కదలక నిలిచినవి. నేను వెంటనే క్రిందికి దుముకగలిగితిని.

లేనిచో క్రిందపడు ప్రమాదము జరిగెడిది. కళ్లెముల చిక్కులు వదలి గుఱ్ఱములు దారికి రాగానే మరల నేను గుఱ్ఱముపై యెక్కితిని. ఆ విధంగా మా ప్రయాణము ఒడుదుడుకులతో సాగినది.

ఉదయము 7గం.ల వరకు 'పాలా' చేరితిమి. పూర్తిగా తెల్లవారెను. అచట అందరము గుఱ్ఱములు దిగితిమి. కాని దురదృష్టవశాత్తు శ్రీరంగాచారి గారు గుఱ్ఱము దిగుచుండగా ఒక కాలు కొక్కెములో ఇరుకుకొని' కాలు పై కై తలక్రిందికై సంకట స్థితిలోపడి పోయెను. గుఱ్ఱము పుణ్యమా యని అది కదలక యుండెను. లేనిచో పాపము ఆయనగారి కాలు యేమయ్యేడిదో! యెలాగో కాలు కొక్కెము నుండి విడివడి ప్రమాదము తప్పినది. చావు తప్పి కన్ను లొట్టబోయెనను సామెత యిదియే కాబోలు. తేనీరు పుచ్చుకొనుటకు ప్రయత్నించితిమి. కాని సాధ్యపడలేదు. వర్షము తుంపరగా పడుచుండెను.

పదినిమిషముల తరువాత తిరిగి మా ప్రయాణమును కొనసాగించితిమి. అగ్రవాల్‌గారు కాస్త కోలుకున్నట్లు అగుపడిరి. కళ్ళు తేలవేయలేదు. 'హరీ' యనలేదు. అది మాసుకృతము.

మాలోని యువకులు కొందరు తమ గుఱ్ఱములను దౌడుతీయించసాగిరి. ఒకరితో ఒకరు పోటీపడిరి. ఒకరినొకరు గేళి చేసికొంటూ ముందుకు సాగుచుండిరి. పరుగెత్తు గుఱ్ఱములతో పాటు మాగుఱ్ఱములు పోటీపడుటకు పాటు పడుచుండెను. ఇది గమనించిన మా పెద్దలగు శ్రీ రంగాచార్యులు, అగర్వాలులు యువకులను చీవాట్లు వేసిరి.

శ్రీ రంగాచార్యులుంగారు మాలోని పెద్దలు సత్వగుణ ప్రధానులని నేను భావించితిని. ఆయనగారి శాంతస్వభావము నన్నట్లు భావింపజేసినది.

నిజానికి సత్వగుణములను గూర్చి ఈ పట్టున కొంత వివరణ యిచ్చుట సమంజసమని భావించి దిగువన త్రిగుణ వివరముల పొందుపరచుచున్నాను. గుణములు మూడు విధములైయున్నవి. 1. సత్వగుణము 2.రజోగుణము 3. తమోగుణము.

## 1. సత్వగుణము:

☝ అరిషడ్వర్గములగు కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములను ఈ ఆరు శత్రువులను జయించగలిగినవాడే సత్వగుణ ప్రధానుడు. ఇట్టి వారు కోటిలో ఒకరు. ఇది మిక్కిలి దుస్సాధ్యమైన సాధనము. అతి తీవ్ర తపస్సు ద్వారానే దీనిని సాధింపజాలుదురు. పై ఆరు దుష్టగుణములను జయించుట యన నిర్వాణమునకు చేరువయగుట. అనేక మునులు ఋషులు తమ తీవ్ర తపస్సు ద్వారా వీనిని

జయించుటకు పూనుకొనిరి. కాని ఏదో ఒక దాని వలలో పడక తప్పలేదు. విశ్వామిత్రుడు మోహమున మేనకకు లోనయ్యెను. దుర్వాసుడు కోపమున భంగపడెను. (దైవ శరణాగతి వీరి లక్షణము) పరశురాముడు గర్వమున నమ్రశిరస్కుడాయెను. అయినను వారు సాధించి దేవర్షి, బ్రహ్మర్షులైరి. శాంత దమ శమాది, గుణములు సత్వమునకు రాచబాటలు.

సత్వగుణుల లక్షణము లేవన ఈశ్వర ప్రేమ, పరోపకారత్వము, స్నాన సంధ్యాది సత్కర్మలు, యజ్ఞ యాగాదులందు ప్రోత్సాహము, వేదశాస్త్ర పారంగత్యము, అధ్యాత్మిక చింతన, అన్న వస్త్రాది దానధర్మాభిలాష, తీర్థయాత్రాభిలాష , వ్రత ఉద్యాపన ఉపవాసాదులందభీష్టము మున్నగునవి లక్షణములు. అంతేగాక దేవస్థాన, తటాక, సత్రాది ప్రజోపయోగ నిర్మాణేచ్ఛ, కళారాధన, పోషణ, హరికథాది భజనలందు ప్రీతి, దేవళములందు పవిత్రత పాటించుట ,భగవదుత్సవములలో నిమగ్నమై యుండుట మున్నగు లక్షణములు గలవారు సత్వగుణులు. ఇంకను వీరికి, కీర్తి, ప్రతిష్ఠలకై పాటుపడుట, అతిథి, అభ్యాగతుల నాదరించుట, నీలాపనిందల లెక్కింపకుండుట, సహనము, ఓర్పు , శాంతి, క్షమ, దయ, దీనజనోద్ధరణ, దిక్కులేని కళేబరముల, సంస్కారముల సల్పుటయు ముఖ్య లక్షణములు. ఇంకను శివుని, బిళ్వ పత్ర పుష్పములతో, నర్చించుట, అజ్ఞానుల విజ్ఞానుల గావించుట, ఇతరుల బాధలను, తమవిగా భావించుచు, సాయుజ్యముక్తికి, పాటుపడుట, మున్నగునవన్నియు సత్వగుణుని లక్షణములు.

## 2. రజో గుణము :

పైన వివరించిన అరిషడ్వర్గములతో అంటియు అంటని చందమున నుండి ప్రాభవములకు, ప్రాకులాడువారు, రజో గుణ సంపన్నులు, సత్వగుణ సాధనమునకై ప్రాకులాడు స్వభావము వీరియందు కొంతగా కనిపించును. దైవ భీతి కలిగియుండుట, వీరి లక్షణము. (రజోగుణులు మధ్యమశ్రేణివారు.) ☝

శ్లో. ఊర్ధ్వం గచ్ఛంతి సత్వస్థా ః మధ్యే తిష్ఠంతి రాజసాః।
జఘన్య గుణవృత్తిస్థా అధో గచ్ఛంతి తామసా ః. (గీత)

☝ దేహము, గృహము, భార్యాపుత్రాదులు, నావియని తనకై తనవారికై నెల్ల వేళల పరితపించు స్వభావము గలవాడు రజోగుణుడు. తృప్తిగా భోజన వస్త్రవాహనముల వినియోగించుట, సేవకులచే, సేవలొందుట, ఇతరుల ద్రవ్యము, నభిలషించుట, దానధర్మ జపతపాదుల నాచరించకుండుట కూడ వీరి లక్షణము. లోభత్వము, నిరంతర ధనార్జన, సర్వకళా సౌందర్యములు తనకే గలవని మురుయుట,

సర్వజ్ఞుడనని విఱ్ఱవీగుట మున్నగు లక్షణములు వీరికుండును. అంతే కాక తనుమాత్రమే సుఖుడై తనవారియందధికవలపు గలిగి ఎదుటివారి వైభవమునుజూచి ఓర్వలేక వారి సర్వనాశనము కోరుకొనుటయు వీరి స్వభావము. కనబడు సమస్తము వాంఛించి శృంగార నట గీతములయందు హృదయ ముంచి ఐకమత్యమున్నచోట తగవుల బెట్టుట, నీచసాంగత్యము భోగలాలసత మత్తుపదార్థసేవ సంసార భవబంధమున మునిగితేలుట వీరి లక్షణము. ఉపవాసమును సైతము ప్రాణాంతకముగా భావించి తన దేహమును మధుర పదార్థ సేవనచే గాపాడుకొనుట పోషించుకొనుట, మున్నగువానిచే తన్ను దాను జన్మ మృత్యుభ్రమణములో బడవేసికొనువాడే రజోగుణుడు.

### 3. తమోగుణము :

ఈ గుణ స్వభావులు నూటికి నూరుపాళ్ళు దుష్ట గుణములు కలిగి ఇతరులకు అపకారము తలపెట్టుటయే వృత్తిగా గలిగి నశించిపోవుచుందురు. వీరినే దైత్యులు - రాక్షసులనెడివారు. తమ బల సంపన్నత - ఈర్ష్య, ద్వేషముతో కూడుకొనిన వృత్తి గలిగియుందురు. వీరియందు దైవభక్తి విశ్వాసములు శూన్యము. వీరు పాషండులు (తమోగుణులు అధమ శ్రేణివారు).

వీరు దుఃఖము జెందినచో, క్రోధమునకులోనై తరతమ భేదమెంచక దండించుట, ప్రాణముల దీయుట, తన ప్రాణముల సహితము లెక్కచేయకుండుట, యుద్ధముల వినోదముగా దలంచుట వీరి స్వభావము. కపటము, పరులనాశనము, ధనార్జన, గోబ్రాహ్మణ స్త్రీలహింసించుట, కలహములపై మక్కువయును వీరి లక్షణవులు. ఇంకను వీరు సత్కర్మ భక్తి ప్రపత్తిహీనులుగను, పాపభీతి లేకుండగను, సర్వదోష భూయిష్టులుగ నుండుట వీరికి సహజము. అంతేగాక వీరు దేవతా ప్రసన్నములకై శస్త్రాదులచే గాయములు చేసికొనుట క్షుద్రశక్తుల నుపాసించుట, మున్నగువానియందు మక్కువ గల్గియుందురు. వీరే తమోగుణ ప్రధానము గలవారని భావించవలయును.

శ్రీమాన్ రంగాచార్యులుగారితోపాటు నేను కూడ ''గుఱ్ఱములను పరుగెత్తించ కూడ'' దనుటలో ఏకీభవించితిని. నివారింపగలిగితిని.

మా గుఱ్ఱములన్నిటికన్న చివర శ్రీ చొక్కారావుగారి గుఱ్ఱము నడచు చుండెను. ఆయన వెంట ఇద్దరు మనుష్యులుండిరి. వారు నెమ్మదిగా వచ్చుచుండిరి.

అట్లో యిట్లో, మేము మైదానమును దాటి ముందున్న ఒక నది చెంతకు చేరితిమి. వానచినుకులు యథాతథముగా నుండెను. ఆకాశమంతయు మేఘావృతమై యుండెను.

ఆ సమయాన నామనస్సు నానెత్తిపైనుండిన టోపీ పైకి పరుగిడెను. అది నానెత్తిపై లేకుండెను. దాన్నికై అన్వేషణ ప్రారంభమయ్యెను. చౌదరి యోగేష్ గారలు దానిని కనిపెట్టిరి. ''అంకుల్ అదిగో మీటోపీ అక్కడ పడివుంది.'' అని కేక వేసిరి. అది గమనించిన నేను నదిని దాటుచూ వెంటనున్న మనుష్యులకు చూపి దానిని తేవలసినదిగా కోరియుంటిని. ఆ ప్రకారమే వారు తెచ్చియిచ్చిరి. అది తడిసి ముద్దయైపోయెను. దానిని గురించి కొంత వేదాంత భావముతో ఇట్లు పరితపించితిని. ''అయ్యో! నీవు పదిదినముల నుండి నాసాథీవై విడిపోయి తిరిగి నాకంటబడి నాదరికి చేరితివి. ఇది నా పురాకృత సుకృత''మని భావించి విచారించితిని. దాని ఎడబాటున ''ఋణానుబంధ రూపేణ పశుపత్ని సుతాలయ'' అను శ్లోకము జ్ఞాపకము వచ్చెను.

నదిని దాటి నిటారుగు కొండరాళ్ళను దాటుటలో మా గుఱ్ఱములు మిక్కిలి డస్సిపోయెను. ఇరుకైనరాళ్ళ బాట యగుటచే గుఱ్ఱములు విచిత్రముగా ఒక దాని వెనుక నొకటి పయనింపవలసి వచ్చెను.

అతికష్టముతో 2 కిలోమీటర్ల ఎత్తుపైకి మంచునకు చేరువగా గుఱ్ఱములపై నుండి స్వాధీనము తప్పుచూ వెనుకకు జారుచూ భయోత్పాతముతో 9 గంటల వరకు దట్టమగు మంచు ప్రదేశమును చేరుకుంటిమి.

మా తదుపరి 15 నిమిషములకు శ్రీ చొక్కారావుగారు చేరుకొనిరి. వారిని రంగాచారిగారిని వేరే మంచి గుఱ్ఱములపై నెక్కించి మంచును దాట వేయుచూ ''లిపూ' అగ్రమువరకు చైనీయుల సహాయమున చేరగలిగిరి. దట్టమగు మబ్బు ప్రభావమున ధారాపాతమగు చినుకులవలన ముందు దారి కనబడకుండెను.

హిందీ ఎరిగిన చైనీయుడు ''వాంగ్'' ఆ మార్గమున యెప్పుడు రాకుండెను. అతడు బక్కపలచని నిర్బలుడగుటచే తాను పైకి రాలేనని చెప్పెను. మేము అతనికి వీడ్కోలు పలికి నెమ్మది నెమ్మదిగా ముందుకు సాగుచుంటిమి. అధిరోహణమందు కొందరు ముందు కొందరు వెనుకగుట సహజమే కదా.

నేను, ధావే, కులకర్ణిగారలు ఎంతో జాగ్రత్తగా అతి ప్రయాసతో వగర్చుచూ మధ్యమధ్య ఆగుచూ పైకి పోవుచుంటిమి. నాకు మధ్య మధ్య 10 రోజుల క్రితము మరణించిన 'రామకృష్ణన్'గారు జ్ఞాపకము వచ్చుచుండిరి. అది ఒక భయావహ యాత్ర. ఎత్తగు మంచుకొండల నడుమ ఏమగునోయను భయము నన్ను వెన్నాడుచుండెను.

అందరికన్న చివరిగా మేము ముగ్గురము. దాదాపు 10½ గం.లకు పూర్తిగా పైకి చేరుసరికి మబ్బులు విడిపోయి చినుకులు ఆగిపోయెను.

అచటకు చేరగానే మన భారత భూభాగ దర్శనమైనది. మన వీర జవానులు అగుపడిరి. పట్టరాని సంతోషము కలిగినది. యుద్ధరంగమున గెలిచినంత ఆనందోత్సాహము వెల్లివిరిసినది. కేవలము గ్రంథములందు, సినిమాలందు, విజయ వీరవిహార ఆనందోత్సవములు ప్రస్ఫుటించును. కాని నా నిజ జీవితమున నిలాటి భావోత్సాహము కలుగుట ప్రథమానుభవము. అది నన్ను నేనే మైమరపించునంతటి ఆనందము కలుగ జేసినది.

మాకు 5వ బ్యాచ్‌వారు అచట తారసపడిరి. వారికి మేము వాతావరణము బాగున్నదని ధైర్యము చెప్పి అభినందించగా వారు క్రిందికి దిగుట ఆరంభించిరి.

నేను మాతో అగ్రమువరకే తెంచిన 'షీ'తో సెలవు తీసుకొని, కొన్ని మంచు దృశ్యముల ఫోటోలు లాగి, పైకి చేరువరకు మాలోని చాలామంది క్రిందికి దిగుచుండిరి. గుర్రములపై సామానులు వేసి వారు కూడా కదలిరి.

అగ్రవాల్ నేను మాత్రమే మిగిలి ముందుకు సాగితిమి. మేమిరువురము నెమ్మదిగా ½ కి.మీ. దట్టమగు మంచులో క్రిందికి దిగి 'జెడ్' ఆకారముతో మలుపులు తిరుగుచూ క్రిందికి చేరితిమి.

నేను అగ్రవాల్ నిగం వారు మరియు పోలీసు జవానులు పిచ్చాపాటి మాట్లాడుకొనుచూ నడచుచుంటిమి.

ఎక్కువ అలసిపోకుండానే 11½ గంటలకు 'నభీడాంగ్' క్యాంపు చేరితిమి. అచట ఆరుబయట ఎండలో మేమందరము విశ్రమించితిమి. నేను ఒక చోట వెల్లకిలా పడుకొంటిని.

సుమారు 12½ గంటలకు మాకు భోజనము వడ్డించుట జరిగినది.

డాక్టరుగారు చొక్కారావుగారిని పరీక్షించి మందులీయుట జరిగినది.

కొంతసేపటికి మరల మా ప్రయాణ మారంభమైనది. దారి ప్రమాద రహితముగా సాఫీగా నుండుటవలన మాకంతగా అలసట కలుగలేదు.

మాలోని కొందరు బాడుగ గుఱ్ఱములపై పయనించుచుండిరి. నేనుఅగర్వాల్ ధావే మరియు గోడ్బోలేగారు ఒక బృందముగా నేర్పడి వినోదముగా మాట్లాడుకొనుచూ నెమ్మదిగా నడచుచుంటిమి.

ధావేగారు వెనుకబడిరి. ఆయనకు తోడుగా అగ్రవాల్ సహకరించుచుండెను. గోడ్బోలే ముందుముందునకు సాగి పోవుచుండిరి. నేను త్వర త్వరగా ఉత్సాహంగా

ముందుకు నడచుచూ వెనుకనున్న వారికై నిరీక్షించుచూ మధ్యమధ్య వారు వచ్చువరకు విశ్రమించుచూ పోవుచుంటిని.

మధ్య నదీ సంగమము తారసిల్లగా వారందరు హాయిగా చాలా సేపు విశ్రమించిరి. కాని నేను మాత్రము ఒక్కడనే ముందుకు సాగుతూ 4 గంటల వరకు 'కాలాపానీ' టెంట్ చేరి 'టీ' పుచ్చుకొంటిని. తదుపరి కొంత తడవకు అందరు వచ్చి చేరిరి.

మా పాస్‌పోర్టులను చెకింగ్‌చేసి తిరిగి యిచ్చివేసిరి. తరువాత 7 గంటలకే ఆరుబయట భోజనములు ఆరగించితిమి. హాయిగా కొంతసేపు విశ్రమించి ఆ తదుపరి నిద్రలోకి జారితిమి.

శ్లో. మహాద్రిపార్శ్వే చ తటే రమంతం
సంపూజ్యమానం సతతం మునీంద్రై
స్సురాసురై ర్యక్ష మహోరగాద్యైః
కేదార మీశం శివ మేక మీఢే.
సహ్యాద్రిశీర్షే విమలే వసంతం
గోదావరీ తీర పవిత్రదేశే
యద్దర్శనా త్పాతక మాశు నాశం
ప్రయాతి తం త్ర్యంబక మీశ మీఢే.



# ముప్పది ఐదవ అధ్యాయం

## కాలాపానీ నుండి గుంజి

శ్లో. సుతామ్రపర్ణీ జలరాశియోగే నిబధ్య సేతుం విశిఖైర సంఖ్యై ః
శ్రీరామచంద్రేణ సమర్పితం తం రామేశ్వరాఖ్యం నియతం నమామి.
యం డాకినీ శాకినికాసమా జే నిషేవ్యమాణం పిశాతాశనైశ్చ
సదైవ భీమాది పదప్రసిద్ధం తం శంకరం భక్తహితం నమామి.

ఆనాడు 10-8-83 రోజున ఉదయమే స్నానపానాదుల తీర్చుకొని సుమారు 8 గం.లకు నిదానముగా బయలుదేరి 'కాళి' మందిరమును చేరితిమి. కాళిమాత భవ్య దర్శనము గావించుకొంటిమి. తీర్థ ప్రసాదముల నచట గల బ్రాహ్మణపూజారి నొసగెను.

పిదప ముందుకు నడచి నది వంతెన దగ్గరకు చేరితిమి. మాలోని కొందరము బ్రిడ్జినుండి క్రిందికి దిగి సుమారు 20 మీ. నదీ తీరప్రాంతము నుండి చెట్టు పుట్టలను రాళ్ళను అధిగమించుచు కీ. శే. రామకృష్ణన్‌గారి శ్మశాన వాటికను దర్శించితిమి. వారి ఆత్మశాంతికై 2 ని. మౌనమును పాటించి ప్రార్థించితిమి. నిగం వారు ఉదయమే వారి అస్తులను మూట కట్టి వెంట తెచ్చిరి.

కీ. శే. రామకృష్ణన్‌గారు కేరళ రాష్ట్రీయులు. వారు జన్మించినది కేరళయైనను బొంబాయి నగరమును తమ నిజనివాసముగా నేర్పరుచుకొనిరి. మాతో వారు ప్రయాణమునకు సమకట్టి అనేక ప్రయాసల కోర్చి నడచుచూ చివరకు చైనా భూభాగమందు దివంగతులైరి. నేపాల్ భూభాగమందలి నదీ తీరమున దహన సంస్కారములు జరిగినవి. ఈ విధముగా మాలోని ఒక ప్రియమిత్రుని కోల్పోయితిమి. విధి వైచిత్రమునకు నివ్వెరపడితిమి. 'విధి లిఖితము అనుల్లంఘనీయము' - ఎవరికేది ఎచట సంప్రాప్తించునో ఎవరెరుగుదురు? భగవంతుని లీలలు చిత్రము గదా! మృత్యువు జ్ఞాని అజ్ఞానుల - రాజు పేదల ధనిక నిర్ధనుల సజ్జన-దుర్జనుల తారతమ్యమును గణింపక ఆయువు తీరగనే కబళించి వేయును. విధి ఎంతటి బలవత్తరమైనది యెరిగియు మానవుడు విఱ్ఱవీగుచుండుట చిత్రాతిచిత్రము గదా-మార్కండేయ ధృవ-ప్రహ్లాదులు మాత్రమే మృత్యువును జయింపగల్గిరి. అట్టివారు మిక్కిలి అరుదు. వారు పరమ భక్తాగ్రేసరులు. అమరులు. అవతారపురుషులగు-రామ-కృష్ణ-బుద్ధ-మహాత్మాగాంధీ గారలు కూడా మృత్యువును జయింపజాలరయిరి. సృష్టిలోని ప్రతిప్రాణియు నశింపవలసినదే. జననముతో మరణము లంకె వేసికొని యుండుట సహజము. కేవలము బ్రహ్మమే

నిత్యమైనది. తదితరములన్నియు అనిత్యమైనవేగదా యను వేదాంత విచారధార మదిలో మెదలెను.

జన్మయను విషయ చర్చ సందర్భమున పునర్జన్మ మరియు కర్మ సిద్ధాంతముల గూర్చి ఆలోచింపవలసియున్నది. ఇట్టిది మన హిందూ శాస్త్ర సంప్రదాయమందు మాత్రమే గలదు. దీనిని గూర్చి క్లుప్తముగా వివరించుటకు ప్రయత్నింతును. రామాయణ ఇతిహాసమందు ఇంద్రజిత్తు మరణ సందర్భమున శ్రీరాముడు ఇంద్రజిత్ భార్యయగు సులోచనతో ''నీ భర్త నీకు మరు జన్మయందు మరల లభించునట్లు'' అభయమిచ్చుచున్నాడనెను. దీనిని బట్టి అటు సులోచనా ఇంద్రజిత్తులిరువురకు 'పునర్జన్మ' గలిగినట్లు ఋజువగుచున్నది.

శ్లో. సుఖస్య దుఃఖస్య న కోఽపి దాతా
పరో దదాతీతి కుబుద్ధి రేవ
అహం కరోమీతి వృధాఽభిమానః
స్వకర్మ సూత్రగ్రథితో హి లోకః

సుఖ దుఃఖాదులిచ్చు వాడెవడును లేడు. అవన్నియు పూర్వజన్మ సంచితములే. మానవులు కర్మసూత్ర బంధితులైన కీలుబొమ్మలు మాత్రమే రావణ సంహారణానంతరము ఆంజనేయుడు సీతాదేవికి రావణ మరణ శుభవార్త తెలియజేయగా సీతాదేవి ఆనందించి, ఆంజనేయుని వరము కోరుకోమనును. అతని కేమియు పాలుపోక సీతమ్మను హింసించిన రాకాసుల వధించకోరుకొనును. అందుకు సీతాదేవి రావణుడే మరణించిన తరువాత వీరందరును మరణించిన వారేయని తన నుదుట వ్రాసిన వ్రాత నెవరు తప్పింతురని అందు నితరుల దోషమేమియు లేదని అనుభవించవలసినదే యని నీతి బోధ చేయుట పై శ్లోకభావము. అంతేగాక భారతారణ్య పర్వములో ధర్మవ్యాధుడు కర్మ సిద్ధాంతము నీ విధముగా తెలియచేయును.

సీ॥ నీతిమంతులు ధర్మనిరతులు దక్షులు
నగువారు జేయు కార్యములు కొన్ని
సిద్ధి బొందవు దుష్టచిత్తులు క్రూరులై
చేయు కొన్ని విశేషసిద్ధి బొందు
నూరక యుండంగ నొందు కొందరు విపు
లార్థముల్ కొంద రాయాసపడియు
నిష్ఫలారంభులై నిలుతురు కొందరు
పేదవారకి ప్రజ పెల్లుబొడము

తే॥ నర్థవంతులు కొందరి కర్థి నధిక
దానములు ధర్మములు సువ్రతములు సేయ
ప్రజలు బుట్టరు విను మిట్టి భంగి సుమ్ము
కర్మఫల మాత్మతంత్రంబు గాక యుండు.

☝ అనగా నీతి మంతులు కొందరు దక్షతతో శ్రద్ధతో సద్భావనతో చేయు పనులు కొన్ని నెరవేరవు. కాని దుర్మార్గులు క్రూరులు దుష్ట భావముచే చేయు పనులు కొన్ని శీఘ్రముగా నెరవేరును. అట్లే తిండికి లేని గుడిసెవాసులకు అధిక సంతానము - ధన ధాన్యములు గల్గి దాన ధర్మవ్రతములుచేయువారికి కొందరికి సంతానము కరువగును. అని పై పద్య తాత్పర్యము. నేడు సమాజములో కొందరు తనవారిని పెద్ద చదువులు చదివించాలని పెద్ద ఉద్యోగము లిప్పించాలని బుద్ధిమంతుల చేయవలెనని అధిక ధనము సంపాదించవలెనని యెన్నో కోరికలచే సతమతమగుచున్నారు.

ఎంతవరకు అవన్నియు సిద్ధించును. నేటి రాజకీయాది యనేకరంగములలో విశేషముల గమనించినచో వారివారి ప్రారబ్ధముల గురించి ఆలోచించువారు చాలా అరుదుగా కనిపించుచున్నారు. ☝

శ్లో॥ ''అన్యధా చింతితం కార్యం దైవ మన్యత్ర చింతయేత్॥
రాజకన్యాపహారయ తీవ్రభల్లూకభక్షవత్.''

☝ అనగా ''తానొకటి తలచితే దైవమొకటి తలచు''నను ఆర్యోక్తిని పై శ్లోకము తెలియచేయుచున్నది. ఒక నగరములో నొక బ్రాహ్మణుడు రాజకుమార్తెకు విద్యలు నేర్పెడివాడు. ఆ బ్రాహ్మణునికి ఆ కన్యపై కామము జనించి, ఆమెను వివాహమాడ సంకల్పించెను. అందుకత డొక ఉపాయమాలోచించెను. ఆ రాజుగారు శుభాశుభములను గూర్చి జ్యోతిష్యమును గూర్చి ఈ విప్రునిచేతనే తెలిసికొను చుండెడివాడు. అదను గ్రహించిన విప్రుడు రాజుగారికి తన కూతురువల్ల రాజ్య భ్రష్టత్వము కలుగునని ఆమెను సముద్రమున బడవేయ సలహా నొసగెను. రాజు అలాగే ఆమెనొక పెట్టెలో బెట్టి బడవేసెను. దైవవశమున వేటకు వచ్చిన మరొక రాజకుమారునికి ఆ పెట్టె లభించెను. పెట్టెలోని రాకుమారిని గాంచి తీసికొని వెడలిపోయెను. రాకుమారుడు తాను వేటాడిన భల్లూకము నా పెట్టెలో బంధించి సముద్రమున బడవైచెను. సలహా నొసగిన బ్రాహ్మణుడు ఆ పెట్టెను దెచ్చి రాకుమారిని వివాహమాడుటకై సంతోషముతో పెట్టెను విప్పెను. పెట్టెనుండి బయటపడిన భల్లూకము విప్రునిపై బడి కొరికి చంపివేసెను. ☝

మనము చేయు పనులవరకే పరిమితమై ఫలితమంతయు ఆ పరమాత్మునిపై వేయవలయునని మనము కావాలనుకున్నవి లభించుట మన చేతిలో నుండదను నీ గీతాశ్లోకము బోధించుచున్నది.

శ్లో॥ ''కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన
మా కర్మఫల హేతుర్భూః ర్మాతే సంగోఽస్త్వకర్మణి''.

నీకు కర్మమునందే అధికారము గలదు. కర్మ ఫలముల నాశించక నీవు చేయవలసిన కార్యములనెల్ల చేయుచుండుము. అదియే నీ కర్తవ్యము. అంతేగాక అనన్య భక్తితో నాపై భారముంచి కర్మలను చేయుమని ఈ శ్లోకము తెల్య చేయుచున్నది.

శ్లో ॥ ''సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః''

అట్లే భగవంతునిపై సర్వభారముంచి ''అన్యధా శరణం నాస్తిత్వ మేవ శరణం మమ; తస్మాత్ కారుణ్య భావేన రక్షరక్ష జనార్ధన ః'' యని సంపూర్ణ విశ్వాసముతో ప్రార్థించినచో ఆ భగవంతుడు తనకు గల షట్ అభయములలో నేదో నొక దానితో తప్పక కాపాడును. ఆ అభయములేవన-

శ్లో ॥ వాత్సల్యా దభయ ప్రదానసమయా దార్తార్తినిర్వాపణా
దౌదార్యా దఘశోషణా దగణిత శ్రేయ ః పద ప్రాపణాత్
సేవ్యః శ్రీపతి రేక యేవ జగతా మేతేచ షట్ సాక్షిణః
ప్రహ్లాదశ్చ విభీషణశ్చ కరిరాట్ పాంచాల్య హల్యా ధ్రువ ః

☝ పరమాత్మ పై తెలిపిన ఆరు అభయములచే ఒక్కొక్కరిని కాపాడి ఆ అభయములచే సదా భక్తుల బ్రోతునని నిరూపించుకొన్నాడు.

1. వాత్సల్యముచే ప్రహ్లాదుని గాపాడెను. 2. అభయప్రదానముచే విభీషణుని బ్రోచెను. 3. ఆర్తినిర్వాపణచే గ జేంద్రుని గాపాడెను. 4. ఔదార్యముచే పాంచాలిని రక్షించెను. 5. అఘశోషణత్వముచే అహల్యా శాపవిముక్తి గావించెను. 6. శ్రేయఃపదప్రాప్తిచే ధృవుని సదా వెలుగొందునట్లు వరమిచ్చి గాపాడెను. ☝

ఇక వారు చేయుచున్న దారుణముల కవధులు లేక వందల వేల సంవత్సరములు జీవింతుమను భ్రమ జెందుచున్నట్లు తోచక మానదు. భాగవత పద్యములో

శ్లో॥ ఆశాపాశము తా కడున్ నిడుపు లే దంతంబు రాజేంద్ర వా
రాశి ప్రావృతమేదినీవలయ సామ్రాజ్యంబు చేకూరినన్

గాసిం బొందిరిగాని వైన్య గయభూకాంతాదులున్ అర్థకా
మాశన్ బాయగ నేర్చిరే భువి నిజాశాంతంబులన్ జూచిరే !

కాని వారి వారి కర్మానుసారమే ఫలితములు గలుగునని గమనించుట లేదు. ఎంత ప్రయత్నించినను ఎంత దురాశ పడినను నుదుట వ్రాసినంత మాత్రమే లభించునని తెలిసికోవలసియున్నది. '' ఓడలు బండ్లు బండ్లు ఓడలగుట'' యు యథార్థము. అంతేగాక ఇపుడో అపుడో ఈ దేహము మృత్యువాత బడక మానదు. మృత్యుముఖములో నున్న సమయములో గూడ సంపాదనాపేక్ష వదలని వారును యున్నారు.

అలాటివారి గురించి ఈ శ్లోకము తెలియజేయుచున్నది.

శ్లో. ''యథాఽహిగ్రస్తమండూకో దంశాన్ భక్షితు మిచ్ఛతి
తథా మృత్యువశో లోకో భోగాన్ భోక్తుం సమిచ్ఛతి.''

కప్ప పామునోట బడి ప్రాణాపాయములోనున్నను దాని ముందువాలిన ఈగలను మ్రింగబోవునట్లు జరామరణములు లేనివారివలె రోగగ్రస్థులై వృద్ధులై నితర విధముల మరణశయ్యపై యుండికూడ ధనార్జనకు భోగలాలసతకు తహతహ పడుచుండుట ఎంతేని ఆశ్చర్యకరము.

ఈ జన్మజన్మాంతర కర్మల తొలగించుకొనుటకు మన ఆచార్యులు పలు ఉపాసనాధ్యాత్మిక విధులు నిర్దేశించియున్నారు. దీనినే సాధనకాండయని యందురు.

నాశమొందునది శరీరము. నిత్యమైనది ఆత్మ. మానవులు తమ కర్మానుసారము క్రిమికీటకాదులు మొదలు పశుపక్ష్యాది జన్మల నెత్తవలసియుండును. ''అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభం'' యను శ్లోకార్థ రీతిని జీవులన్నియు తమ తమ కర్మఫలములను బట్టియే వేర్వేరు జన్మలను పొందుచు పుణ్యాపాపముల మాత్రమే వెంట నంటుచుండునని గీతాశ్లోకము ద్వారా తెలియును.

''జాతస్య హి ధ్రువో మృత్యు
ర్ధ్రువం జన్మ మృతస్య చ
తస్మా దపరిహార్యేఽర్థే
న త్వం శోచితు మర్హసి.'' (గీత)

హిందూ ధర్మ శాస్త్రానుసారము సర్వప్రాణుల పంచభూతాత్మక మగు శరీరములు నశించినను, ఆత్మకు మాత్రము మృత్యు వుండదు. అది ''మనుష్యుడు తన జీర్ణవస్త్రమును వదలి నూతనవస్త్రమును ధరించు మాదిరి'' కర్మానుసారము వేర్వేరు శరీరములను పొందుట అనునిత్యము జరుగుచునేయుండును.

''వాసాంసి జీర్ణాని యధా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి
తధా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ.'' (గీత)

ఇది ఎడతెగని ధారవాహిక వంటిది. 'పునరపి జననం పునరపిమరణం' అను సంప్రదాయానుసారం జనన మరణముల పరంపర యెడ తెగనట్టిది.

మాయామోహితమగు ఈ జగత్తునందు మానవులు ఈ సంపదలన్నియు నావి యను భ్రమయందు చిక్కుకొని, 'తన చుట్టు వల నల్లుకొని అందే చిక్కుకొని మరణించు సాలెపురుగు క్రియ మరణించుచున్నాడు. ఎవ్వియును తన వెంట రావనుట తెలిసియు మాయాచక్రభ్రమణమందు చిక్కుకొని యుండుట అతి విచిత్రమగు జీవన విధానము కదా!

మల, మూత్ర-రక్త-మాంస సంబంధయుతమగు ఈ హేయ శరీరమును గూర్చి మానవుడాలోచించుచు - ఆశాజీవియై నిరంతరము లోభమోహములకు వశుడై మరణానంతరము హీనజన్మలకు మూలమగుచున్నాడు.

'సత్కర్మలతో సత్ఫలితములు' అను మాటలు మరచిపోవుచున్నాడు. 'అనేక జన్మల సుసంస్కారములచే ఉత్తమ జన్మల పొందుననుట' భగవద్గీత నొక్కి వక్కాణింపుచున్నది. అయినను దురాశచే దుఃఖమును చేటునను కోరికొనితెచ్చుకొనుచున్నాడు. దురాశ యనునది ఎట్టి ప్రబలమగు మాయాపాశము!

ఇట్టి మాయామోహితమగు బంధమును తొలగించుకొనుటకుగాను మన వేదశాస్త్రములు అనేక తరుణోపాయములను సూచించియున్నవి. వానినను సరించినపుడే ఉత్తమ జన్మల పొందుటకును లేదా జన్మరాహిత్య సాయుజ్యమును పొందుటకును సదవకాశములున్నవి. సత్కర్మముల సాధించుట కష్ట సాధ్యమే యైనను సాధించుటకు ప్రయత్నించుట మానవ ధర్మము. మానవ జన్మ అన్ని జన్మలకన్న ఉత్కృష్ట ఉత్తమ జన్మము. ఇది మరల దొరకుట దుస్సాధ్యము. కావుననే 'పునర్జన్మ' కలదను ప్రగాఢ విశ్వాసముచే ఉత్తమ కర్మలనే చేయుటకు ప్రయత్నింపవలెనని ధర్మశాస్త్రములు తెలుపుచున్నవి.

'అస్తే-జాయతే-వర్ధతే-పరిణమతే-అపక్షీయతే-వినశ్యతే' అను షట్కర్మల పరంపర తల్లిగర్భమున ప్రవేశించినది మొదలు బయటపడి దిన దిన ప్రవర్ధమానమై బాల్య, యౌవన, వృద్ధాప్యములను, పొంది దుర్బలుడై చివరకు చనిపోవుట సహజ ధర్మమై యున్నది.

ఈ వేదాంత సద్భావనలతో వెనుదిరిగి వంతెనను చేరి అచట గల ఉష్ణ గుండమును చూచి మా మిత్రులతో యస్.పి.ఎఫ్. జవానులతో కలిసి ముందుకు సాగితిమి. ఎత్తు పల్లములను వంకరటింకర దారులను 'కాళీ' నది వెంబడే దాటుచూ ప్రకృతి సుందర దృశ్యముల పరికించుచూ సుమారు ఒంటిగంట వరకు 'గుంజి' క్యాంపును చేరితిమి.

'గుంజి' క్యాంపు నందు భోజన మొనర్చి, కొంత విశ్రాంతిని పొందితిమి. ఆపైన మాలో కొందరికి అచ్చటినుండి సుమారు 18 కి.మీ. దూరమున గల 'బుద్ధి' క్యాంపును చేరవలెనను భావన కలిగినది. కాని అతి ప్రయాస వలన అది నాడు సాధ్యము కాదని నిర్ణయించుకొంటిమి.

సాయంత్రము 4 గంటలకు లేచి, సుమారు ఒక కి.మీ. దూరమందు గల 'వ్యాసమందిరమును। నేను ధావేరాు దర్శించితిమి. అచటనున్న కొన్ని పురాతన గ్రంథముల చూచి ఫోటోలు తీసితిమి. తిరిగి క్యాంపు చేరితిమి.

మాలోని మిత్రులు కొందరు పరిసర గ్రామమందు యేదో మేలా జరుగుచున్నదని చూచుటకు వెళ్ళియుండిరి.

మేము చేరిన కొద్ది సమయుమునకే వర్ష మారంభమయ్యెను. 'మేలా'కు వెళ్లిన మిత్రులు తడిసి వచ్చిరి.

'మేము' ముందుగల క్యాంపునకు వెళ్లకపోవుటయే మంచిదైనది' అని తలంచితిమి. 8 గం.లకు భోజనములు ముగించుకొంటిమి. నిదురలో మునిగితిమి.

శ్రీ చొక్కారావుగారికి కడుపు నొప్పికిగాను మందులిచ్చినను తగ్గదయ్యెను. వారు ఆహారమును తీసుకొనజాలరైరి. పాలు చారు లాంటి ద్రవ పదార్థములు కూడా వారికి గిట్టక వాంతు లగుచుండెను. వారు మిక్కిలి బాధపడుచునే ఆమాత్రముగా నిదురించిరి. చొక్కారావుగారికి నాతో ఇతర పెద్దలకు మాలోని యువకులగు శ్రీ కిశోర్, శ్రీ చౌదరి మున్నగువారలు సహకరించుచు పరిచర్యలు చేయు చుండిరి.

శ్లో. సానంద మానందవనే వసంత
మానందకందం హతపాపబృందమ్
వారాణసీనాథ మనాదనాథం
శ్రీ విశ్వనాథం శరణం ప్రపద్యే.
ఇలాపురే రమ్యవిశాలకేஉస్మిన్

సముల్లసంతం చ జగద్వరేణ్యమ్
వందే మహోదారతర స్వభావం
ఘృష్ణేశ్వరాఖ్యం శరణం ప్రపద్యే
జ్యోతిర్మయ ద్వాదశలింగకానాం
శివాత్మనాం ప్రోక్త మిదం క్రమేణ
స్తోత్రం పఠిత్వా మనుజోఽతిభక్త్యా
ఫలం తదాలోక్య నిజం భజేచ్చ.
(ఇతి శ్రీ ద్వాదశ జ్యోతిర్లింగ స్తోత్రమ్)



# ముప్పది ఆరవ అధ్యాయం

## 'గుంజి నుండి బుద్ధి' కి

శ్లో. ఉద్యద్భాను సహస్ర కోటి సదృశాం కేయూరహారోజ్జ్వలాం
బింబోష్ఠీం స్మితదంతపంక్తి రుచిరాం పీతాంబరాలంకృతామ్
విష్ణుబ్రహ్మ సురేంద్ర సేవితపదాం తత్త్వ స్వరూపాం శివాం
మీనాక్షీం ప్రణతోఽస్మి సంతత మహం కారుణ్య వారాం నిధిమ్.

✍ తేది 11-8-1983రోజున ఉదయమే లేచి నిత్యకృత్యముల ముగించుకొని ఉదయం 7½ గంటలకు ప్రయాణమునకు సిద్ధమైతిమి.

మేము 'బుద్ధి'కి వెళ్ళుదారి మధ్యమధ్య పడు చినుకులచే జారుడుగా నుండుటచే మాలోని వృద్ధులగువారు గుఱ్ఱములపై వచ్చుచుండిరి. మేమందరము నెమ్మదిగా ప్రకృతి సుందర దృశ్యములగువృక్ష-పర్వత-మేఘ సముదాయమును తిలకించుచూ ముందునకు సాగుచుంటిమి

చిట్టచివరగా నేను మాథుర్ - శ్రీమతి రశ్మి డా॥ గోడ్బోలే మరియు SPF జవానులు నడక సాగించుచుంటిమి.

సుమారు 11 గంటలవరకు ''దార్చ్యుంగ్'' గ్రామమునకు ముందుగల కొయ్యవంతెన నొక దానిని దాటి నేపాల్ భాగమును చేరితిమి.

అచ్చట వ్యాసమందిరమునుదర్శించితిమి. వ్యాస భగవానుడు వేదముల విభజించి పురాణ ఉపపురాణములుగా విభజించి మహాభారతమును రచించుటేగాక పాండవ- కౌరవ చంద్రవంశమును తన ఇంద్రియాతీత ప్రభావమున నిలిపిన వాడాయెను. ✍

శ్లో. ''వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేః పౌత్ర మకల్మషం
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్॥''

తా॥ ఓ వ్యాస భగవానుడా! నీవు సప్తఋషి సముడవు. శక్తి మహరుషి మనుమడవు. పరాశర మహర్షికి పుత్రుడవు. తపోనిధి శుకునకు తండ్రివి.

☝ వేదవ్యాసుడు నారాయణ ఋషిమండలములోని వాడు. నారాయణుడే శ్రీమన్నారాయణుడు; భగవానులలో ప్రధముడు. ఆ తరువాత నారద భగవానుడు, వశిష్ఠ భగవానుడు, వ్యాసభగవానుడు, శుకభగవానుడు వీరైదుగురు శ్రీమన్నారాయణునితో సమానులు. వ్యాస భగవానుడు సప్త ఋషిసముడైనను సప్తర్షి మండలములో మాత్రము లేడు. ☝

సప్తర్షులనామములేవన

శ్లో. కశ్యపో௨త్రిః భరద్వాజో విశ్వామిత్రో௨థగౌతమః
వసిష్ఠో జమదగ్నిశ్చ సప్తైతే ఋషయ స్తథా.

వ్యాసవిరచిత భారతము గురించి భారతాది పర్వములోని నీ దిగువ పద్యము పరికింపుడు.

సీ. ధర్మ తత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని
యధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రం బని
కవివృషభులు మహాకావ్య మనియు
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహ మని
యైతిహాసికు లితిహాస మనియు
బరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్చ
యం బని మహి గొనియాడుచుండ

ఆ. వివిధ వేద తత్త్వవేది వేదవ్యాసు
డాది ముని పరాశరాత్మజుండు
విష్ణు సన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండ జేసె భారతంబు.

☝ వ్యాసమహర్షిని భగవదవతారముగా భావింపనైనది.

భాగవత సిద్ధాంత రీత్యా దిగువ భగవదవతారముల గమనింపగలరు.

1. ఆదివ రాహావతారము (వసుధోద్ధరణము - హిరణ్యాక్ష వధ)
2. యజ్ఞావతారము (ఋచి ఆకూతుల సంతానమై ప్రపంచ పీడను తొలగించుట జరిగినది)
3. కపిలావతారము (కర్దమ, దేవహూతుల సంతానమై బ్రహ్మ విద్యా నిష్కర్తగా కృత యుగారంభము జరిగినది.)
4. దత్తాత్రేయావతారము(యోగశాస్త్రకర్తగా సిద్ధినొందుట)
5. కుమారావతారము (సనకసనందనులు - ఆత్మ విద్యా ప్రసాదకులు ఈ విద్య గత ప్రళయమున నశించినది.)
6. నరనారాయణావతారము (దక్షపుత్రికయగు మూర్తికి ధర్మునికి జన్మించిరి. అమోఘ తపోశక్తి సంపన్నులు)
7. ధృవావతారము (ధృవుడు ఘోరతపస్సు వలన ధృవతారగా రూపొందుట)

8. పృథు అవతారము (భూమినుండి దుగ్ధమను పిదికినవాడు)
9. ఋషభావతారము (మేరుదేవీనాభుల సంతానము) పరమహంసగా అమరుడయ్యెను.)
10. హయగ్రీవావతారము (యజ్ఞదేవతగా వేదములను క్రోడీకరించెను)
11. మత్స్యావతారము (వైవస్వతమనువునకు మత్స్యరూపమున చిక్కి ప్రళయార్ణవమునుండి వేదముల నుద్ధరించుట)
12. కూర్మావతారము (సముద్రమథనము ద్వారా సమస్తైశ్వర్యముల ప్రసాదించిన వాడు)
13. నృసింహావతారము (హిరణ్యకశ్యప వధ, భక్త ప్రహ్లాదు నుద్ధరించుట, భక్తియోగ ప్రబోధము)
14. హరియవతారము (గజేంద్ర రక్షణము-శరణాగతతత్వ ప్రబోధము)
15. వామనావతారము (బలినుండి, ముల్లోక సంగ్రహణము - పునరుద్ధరణ)
16. హంసావతారము (ఇయ్యది నారద లక్షణ వ్యక్తవ్యము)
17. మన్వంతర పర్యంతావతారము (మన్వంతర పర్యంతము కొనసాగునది) మనువులు ప్రజాపతులు, సప్తర్షులు
18. ధన్వంతరీ అవతారము (ఆయుర్వేద శాస్త్రకర్త)
19. పరశురామావతారము (భూలోకమును హైహయరాజ హస్తములనుండి తొలగించి కశ్యప ప్రదాన మొనరించుట)
20. శ్రీరామావతారము (రావణహస్తగత దైవీశక్తుల విముక్తత - దుష్టశిక్షణ - శిష్టరక్షణ)
21. శ్రీకృష్ణబలరామావతారము (దుష్టశిక్షణ - ధర్మరక్షణ) కౌరవ దమనము - పాండవోద్ధరణము)
22. వ్యాసావతారము ( వేదశాఖల విభజన - పురాణ రచనము - భరత వంశోద్ధరణము)
23. బుద్ధావతారము (కర్మకఠోరమగు వేదవిద్యను, నూతన తత్వ సిద్ధాంతముల ద్వారా దేశ విదేశాలలో బహుళ వ్యాప్తి)
24. కల్క్యావతారము (కలికాల సృష్టి విఘాతచర్యల దునుమాడి, ధర్మమును పునః ప్రతిష్ఠాపించుట)

### భారతీయ పౌరాణికానుక్రమణికానుసారము పురాణ పురుషుల కాలనిర్ణయము

| | | | |
|---|---|---|---|
| 1. | భీష్మజననము | B.C. | 3396 |
| 2. | వేదవ్యాస జననము | '' | 3374 |
| 3. | వైశంపాయన జననము | '' | 3300 |

| | | | |
|---|---|---|---|
| 4. | యాజ్ఞవల్క్య జననము | '' | 3280 |
| 5. | కణ్వమహర్షి జననము | '' | 3250 |
| 6. | బోధాయన జననము | '' | 3200 |
| 7. | సప్తఋషిమఖ ప్రవేశము | '' | 3176 |
| 8. | యుధిష్ఠిర పట్టాభిషేకము | '' | 3176 |
| 9. | జూదమున పాండవరాజ్యహరణము | '' | 3151 |
| 10. | కీచక సంహారము | '' | 3139 |
| 11. | మహాభారత సంగ్రామము | '' | 3138 |
| 12. | యుద్ధానంతర యుధిష్ఠర పట్టాభిషేకము | '' | 3138 |
| 13. | పరీక్షిత్తుజననము | '' | 3138 |
| 14. | ఇక్ష్వాకువంశ బృహద్యశ పట్టము | '' | 3138 |
| 15. | (మార్జారి), మగదరాజ్య పట్టాభిషేకము | '' | 3138 |
| 16. | నేపాళాధిపతి (గాలి) పట్టాభిషేకము | '' | 3138 |
| 17. | కాశ్మీరరాజు (గోనందుని) పట్టాభిషేకము | '' | 3139 ½ |
| 18. | శ్రీకృష్ణ నిర్యాణము | '' | 3102 |
| 19. | కల్యాది ప్రారంభము | '' | 3102 |
| 20. | ద్వారకానగర సముద్రమగ్నత | '' | 3102 |
| 21. | యాదవవంశ నాశనము | '' | 3102 |
| 22. | పరీక్షిత్ పట్టాభి షేకము | '' | 3001 |
| 23. | కాశ్మీరాబ్దము (యుధిష్ఠర శక ప్రారంభకాలము) | '' | 3076 |
| 24. | పరీక్షిత్తు మరణము | '' | 3041 |
| 25. | జనమేజయ పట్టాభిషేకము | '' | 3041 |
| 26. | ఆర్యభట్టు (గణిత శాస్త్రవేత్త) | '' | 2742 |
| 27. | బుద్ధుని జననము | '' | 1887 |
| 28. | బుద్ధనిర్యాణము | '' | 1807 |
| 29. | చాణక్య సమకాలిక (మహాపద్మనందుడు) | '' | 1634 |
| 30. | చంద్రగుప్తమౌర్యుడు | '' | 1534 |
| 31. | అశోక చక్రవర్తి | '' | 1472 |
| 32. | యవనాధిపది (ఆంటియోపి) | '' | 1472 |
| 33. | పాణిని (వ్యాకరణకర్త) | '' | 1400 |
| 34. | యవనరాజు (మిళిందుడు) | '' | 1320 |
| 35. | నాగార్జున యోగి | '' | 1294 |
| 36. | కనిష్కుడు | '' | 1294 |

| | | | |
|---|---|---|---|
| 37. | పుష్యమిత్ర పట్టాభిషేకము (పతంజలి సమకాలీనుడు) | '' | 1218 |
| 38. | వర్ధమాన మహావీరజననము | '' | 599 |
| 39. | కుమారిలభట్టు (మీమాంసకర్త) | '' | 557 |
| 40. | ఆదిశంకర జననము | '' | 509 |
| 41. | గోవింద భగవత్పాద నిర్యాణము (శంకరుల గురువు) | '' | 493 |
| 42. | మండనమిశ్ర సురేశాచార్య | '' | 491 |
| 43. | ద్వారకాపీఠ స్థాపనము | '' | 491 |
| 44. | ఆదిశంకర నేపాళయాత్ర | '' | 488 |
| 45. | ఆదిశంకర జ్యోతిర్మఠ స్థాపనము | '' | 486 |
| 46. | గోవర్ధన మఠస్థాపనము (ఆదిశంకరుల) | '' | 485 |
| 47. | కంచికామకోటీ పీఠ స్థాపనము '' | '' | 482 |
| 48. | శృంగేరి శారదామఠ స్థాపనము '' | '' | 484 |
| 49. | శృంగారనైషధకర్త (శ్రీహర్షుని కాలము | '' | 457 |
| 50. | చంద్రగుప్తుని పట్టాభిషేకము | '' | 327 |
| 51. | అలగ్జాండర్ దాడి | '' | 326 |
| 52. | ఉజ్జయిని విక్రమాదిత్య పట్టము | '' | 82 |
| 53. | కాళిదాస మిహిరుడు | '' | 57 |
| 54. | శాలివాహనశకము | (A.D.) | 78 |
| | | (క్రీస్తు మరణానంతరం) | |
| 55. | భాస్కరాచార్యుడు | '' | 486 |
| 56. | భోజరాజు | '' | 638 |
| 57. | శ్రీ రామానుజాచార్య | '' | 1017 |
| 58. | శ్రీ మధ్వాచార్య | '' | 1119 |
| 59. | (మహ్మద్ ఘోరీచే) పృథ్వీరాజ్ రాసో వధ | '' | 1193 |
| 60. | భారతదేశ (విక్టోరియారాణి పాలనము) | '' | 1857 |

మన ప్రాచీనులు కాల విభజనను, దేశ చరిత్రను పై విధముగా పొందుపరచి యున్నారు.

నేపాల్‌వ్యాస మందిర దర్శనానంతరము నేపాల్ దేశీయులతో కొంతసేపు ముచ్చటించి మరల ప్రయాణము సాగించి గార్బ్యాంగ్ గ్రామము చేరితిమి.

Indian R.A.W. ఆఫీసర్ శ్రీ శర్మగారు మమ్ముల తమ నివాసమునకు ఆహ్వానించి పై అంతస్తునకుకొనిపోయి టీతో సత్కరించిరి. తక్లాకోట్ గ్రామ విశేషముల మమ్మడిగి తెలిసికొనిరి.

చైనా ప్రాంత విశేషములను చైనా వారి ప్రవర్తనము వారి ఆదర మర్యాదల గూర్చి అడిగి తెలిసికొనిరి. మాకు తెలిసినంతవరకు వివరించితిమి.

''మిలిటరీ స్థావరముల గూర్చి చైనీయులచే తెలిసికొనగోరితిమి. కాని వారు సరియగు వివరములను గాని వారి ఎత్తు ప్రదేశముల నిర్దేశనముగాని చేయుటకు నిరాకరించిరి.''

ఒక చిన్న సంఘటన ఆ ప్రాంతములో జరిగినది తెలిపితిమి. మా లీడరు గారగు డా॥ గోడ్బోలే మరియు బందోపాధ్యాయ గారలు వాహ్యాళికై మానససరోవర ప్రాంతమునకు వెళ్లిన సందర్భమున చైనా మిలటరీ వర్గము వారు తమను జీపులో వెంబడించి కెమెరాను తుపాకులతో భయపెట్టి లాగుకొనుటను తెలిపితిమి. వారికి మేము యాత్రికులమని తెలియజేయుట అతికష్టమయ్యెను. చివరకు వారిని జీపులో కూర్చుండజేసి బేస్ క్యాంప్‌నకు చేర్చుటను గూర్చి తెలిపితిమి. కైలాస్ క్యాంప్ నందలి భాషలు తెలిసిన 'దోర్జీ'ని కూడా అనుమానించిరి. ఆ విధముగా మాకు కొంత కాలాతీతము జరిగినది.

సుమారు 1½ గం. ల కాలక్షేపానంతరము (శ్రీ) శర్మ గారితో సెలవు తీసికొని గ్రామపు జారుడు దారిగుండా మా నడక సాగించితిమి. చాలా జాగ్రత్తగా పైకెక్కుచూ ప్రకృతి రామణీయక దృశ్యముల పరిశీలింపుచు ఎత్తున నున్న ఒకనది చెంత కొంతసేపు విశ్రాంతి గైకొంటిమి.

ఆకలి దహించి వేయుటచే నా వద్ద నున్న ఫలహారములను బిస్కెట్లను అందరము ఆరగించితిమి.

ప్రక్కగా నున్న కఱ్ఱ వంతెన క్రిందగా ప్రవహించుచున్న నిర్మలమగు నీరును గ్రోలి అచ్చట నున్న మంచు దిబ్బ ఫోటోలను లాగితిమి.

సుమారు 20 ని॥ లు అచ్చట గడపి తిరిగి నడక సాగించితిమి. చాలాపైన గల 'ఛెయ లేక్ పాస్' చేరు వరకు మిక్కిలి డస్సి చెమటలు కారదొడగెను.

మరికొంత దూరము పోవుసరికి అచ్చట మనోహరమగు పూదోట అగుపడినది. ఆ అలసటను తొలగించు కొనుటకుగాను అచ్చట కొంతసేపు విశ్రమించి ఆ ఆనంద సంభరిత వాతావరణ మందు ముగ్ధులమై యుంటిమి.

ఆ సు సమయమున వివిధ తాపముల తీరు నా మనస్సున మెదలినది. వానిని గూర్చి క్లుప్తముగా విశదపరతును. గమనింపగలరు.

తాపములు అనేకవిధములు. తాప మన బాధా విముక్తికై పోరు తపన. అవి అన్నతాపము (ఆకలి గొన్నప్పుడు) దాహతాపము (దప్పిగొన్నప్పుడు) ఆనందతాపము

(దేహ బాధకలిగి నప్పుడు) వాంఛా తాపము (కోరిక లీడేర్చు కొనగోరినపుడు) ఇట్టివి తీరినపుడు కలుగు ఆనందము తృప్తికి అవధులుండవు.

ఈ తాపములు అధ్యాత్మికతాపము - అధి భౌతిక తాపము - అధి దైవిక తాపములని మువ్విధములు.

అధ్యాత్మిక తాపమందు జ్ఞాన కర్మ పంచకములగు తలనొప్పి కళ్లనొప్పి కర్ణవేధమేధో వ్యాధులు, అరుచి మరియు శారీరక బాధలగు వ్రణములు గాయములు గజ్జి చీడ తామర ఉదరశూలలు కుష్టు బొల్లి ఇత్యాదివి అతిపీడా కరములు. అట్టివి ఉపశమించిన ఎంతయో ఆనందింతుము.

ఆధి భౌతికములందు జలచర భూచర సంబంధమగు క్రూర జంతువిష క్రిమికీటకాదుల బాధయేగాక తుఫానులు భూకంపములు, కరువు కాటకములు అగ్ని ప్రమాదములు మొదలగునవి ఉండును.

అధి దైవికమునందు ప్రాణమున్న తరి కలుగు దారిద్ర్య విషమరోగ బాధలు. ప్రాణానంతరము కర్మ ఫల నరక యాతనముతో కూడి యుండును. (''పూర్వ జన్మకృతం పాపం వ్యాధిరూపేణ పీడితం''.)

నిజ మాలోచించిన జన్మ మిక్కిలి దుఃఖ భూయిష్టమైనది. కావుననే మన ధర్మశాస్త్రము లన్నియుముక్తి పథమున పయనించుమని వానికి పెక్కు ధర్మ మార్గముల నీతి పథముల నేర్పరచి యున్నారు.

బుద్ధ దేవుని 'నిర్వాణ' సూత్రము - ''వాంఛల పరిహరింపుము. దుఃఖో పశమనము'' కలుగు ననుటయే.

బుద్ధుడు 'పునర్జన్మ' నొప్పుకొనలేదు. నిరంతరముగా పుట్టుచూ చచ్చుచున్న ప్రాణులన్నియు తాత్కాలికోపశమనమగు నిర్వాణమును కోరవలె నన్నదియే ఇందలి సారాంశము కాబోలు.

బుద్ధ దేవుని 'పునర్జన్మ లేదనుటను' మన వైదికులు ఒప్పుకొనలేదు. బౌద్ధము పాషండమత' మనియు ధిక్కరించిరి.

వైదిక విదులగు వారు ప్రాణులన్నియు తమ సుకృత దుష్కృతములకు గాను మరు జన్మములందు తగు ఫలములు తప్పక అనుభవింతురని నిర్ధారించిరి. ''సాలీడు-సర్పము-ఏనుగు బోయడు శివసాయుజ్యమును పొందిన పౌరాణిక గాథ ఇందుల కుదాహరణము''. అనేకానేక జన్మల సంస్కారముల మూలమున మానవులు ఉన్నత స్థితిని పొందుచుందురనియు తెల్పుచున్నారు.

✍ పూదోట విశ్రమానంతరము తిరిగి ప్రయాణమును ప్రారంభించితిమి. ఇటనుండి మెట్లు నిటారుగాయుండుట వలన దిగుట ప్రయాసకరముగా నుండెను. డా. గోడ్బోలే గారికి కాలి పిక్కయందలి నరములు బిగిసికొని పోవుటచే వారు ఏ మాత్రము దిగజాల కుండిరి.

మేము కొంత మేరకు క్రిందికి దిగి డా. గోడ్బోలే గారికై వేచి యుంటిమి. వారు పోలీసు వారి సహాయముతో నెమ్మదిగా తీసుకొని రాబడుచుండిరి. ఒక్కొక్క మెట్టు ఒంటికాలుతో దిగివచ్చుట కాన య్యెను.

ఆ విధంగా మిక్కిలి ప్రయాసతో 'బుద్ధి క్యాంప్' చేరువరకు 4½ గం. లయ్యెను.

అంతకు పూర్వమే చేరిన మా మిత్రులు క్యాంప్‌నందు భుజించి పడుకొని యుండిరి. మేము కూడా భుజించి పడుకొంటిమి. ఆ సాయంత్రము 6 గంటల సమయమున వర్షము ప్రారంభమైనది. పడుకొనుటకు ముందు మాకు పకోడీలు తినవలెనను కోరిక కలిగినది. కోరుటయే తడవుగా 'నిగం' వారు మాకు పకోడీలు అందించిరి. అప్యాయముగా తింటిమి.

ఆ క్యాంప్ నుండి రేపు ప్రయాణము చేయవలసిన దారి చాలా ప్రమాదకరమైన దైనందున శ్రీ చొక్కారావు గారు బహుప్రయాస నొందుదురని భావించి హెలికాప్టర్ ద్వారా వారిని పంపుటకు గాను ప్రయత్నింప సంకల్పించితిమి. కాని అది వచ్చుటకు చాలా సమయము తీసుకొనునని అంత వరకు తానొక్కడిని ఉండజాలనని ప్రాణములు పోయినా మాతోనే ప్రయాణము సాగింతునని మొరాయించిరి.

మేము శ్రీ చొక్కారావు గారికి జావ కాచి యిప్పించితిమి. తదుపరి మేము భోజన మొనర్చితిమి.

శ్రీ చొక్కారావు గారికి ఆ జావ యిముడక వాంతి చేసికొనిరి. కడుపు నొప్పి అధికమయ్యెను. వారికి తగు చికిత్స జరుగుచుండెను. కామెర్ల వ్యాధిసోకి యుండ వచ్చునని అనుమానమును డాక్టరు గారలు వ్యక్తపరచిరి.

ఇలా నాటి మా కార్యక్రమము ముగిసి గాఢ నిద్రలో మునిగితిమి. ✍

శ్లో. ముక్తాహార లసత్కరీటరుచిరాం పూర్ణేందు వక్త్రప్రభాం
శింజన్నూపుర కింకిణీ మణి ధరాం పద్మ ప్రభాభాసురామ్
సర్వాభీష్ట ఫలప్రదాం గిరిసుతాం వాణీ రమాసేవితాం
మీనాక్షీం ప్రణతోஉస్మి సంతత మహం కారుణ్యవారాంనిధిమ్.



# ముప్పది ఏడవ అధ్యాయం

## బుద్ధి నుండి మాల్పాకు

శ్లో. శ్రీ విద్యాం శివవామభాగనిలయాం హ్రీంకార మంత్రోజ్జ్వలాం
శ్రీ చక్రాంకితబిన్దు మధ్యవసతిం శ్రీ మత్సభానాయికామ్
శ్రీ మత్షణ్ముఖ విఘ్న రాజజననీం శ్రీ మజ్జగన్మోహినీం
మీనాక్షీం ప్రణతోఽస్మి సంతత మహం కారుణ్య వారాంనిధిమ్.

✍ తేది 12-8-83 ఉదయమే కాలకృత్యములు తీర్చుకొని స్నానానంతరము సంధ్యగావించు కొంటిని. పిదప టిఫినుతేనీరుసేవించితిమి.

మా ప్రయాణము 7½ గం.లకు మొదలైనది. వంతెన పై నుండి నదీ మార్గమును దాటి ఆపై వచ్చు ఎగుడు దిగుడులను అధిగమించుచూ నడచుచుంటిమి. అక్కడక్కడ మెట్లను గూడా ఎక్కుట జరిగెను.

నాటి దారి అస్తవ్యస్తముగా నుండుటచే శ్రీ చొక్కారావుగారిని అగ్రవాల్‌గారి మరియు పోలీసువారి సహకారముతో ప్రయాణము నెమ్మదిగా సాగుచుండెను.

అతి ఎక్కుడు ప్రదేశములందు గుఱ్ఱముపై నుండి జారకుండునట్లు తగు కట్టుబాట్లతో వారుసహకరించుచుండిరి.

మా ప్రయాణమును మేము కొంత దూరము సాగించిన పిదప నా నెత్తిపై నుండెడి టోపీ జ్ఞాపకమునకు వచ్చినది. అట్టి టోపీని నేను బుద్ధి క్యాంపునందు ఒక గోడకు తగిలించియుంటిని. ఆ టోపి గోడపై యెత్తున మొలకు తగిలించి యుండుటచే సామాన్లు సర్దు పోర్టర్ల దృష్టి దాని పైకి వెళ్లకుండెను. అది నా ప్రియమగు టోపీయగుటచే దానిని గురించి కొంత బాధపడితిని. ''ఏదైనను ఋణానుబంధమే కదా''యని సరిబెట్టుకొంటిని. వెనుకకు తిరిగిపోవలెనన్న చాలా దూరము వచ్చి వేసితిమి. పైగా నడచు ఓపిక కూడా నశించినది. కాబట్టి దానికి స్వస్తి వాచకము పలికితిని.

నామిత్రుడగు కిశోర్ నేను లోకాభిరామాయణము చెప్పుకొంటూ ఒక చోట సుందరమగు జలపాతమును గాంచితిమి. మాలోని ఉబలాటము కొద్దీ దానిని సమీపించి హాయిగా కూర్చుంటిమి. అచ్చట నా చెంతగల ఫలహారమును భుజించితిమి. కడుపార జలపాత నిర్మలమగు నీరును త్రాగితిమి.

ఆ సందర్భమున ఒక దంపతుల జంట వారినంటి ఒక చిన్నవాడు తండ్రి భుజములపై స్వారిచేయుచూ పోవుచుండుట కాననయ్యెను. వారి ప్రేమాతిశయము సంతానమందలి మమత నన్ను ముగ్ధుని చేసినది.

వారి గమనము బుద్ధి క్యాంపు వైపునకు సాగుచుండెను. వారు మధ్య తరగతి వారిగా కన్పట్టిరి. అన్ని అవస్థలు మధ్య తరగతి కుటుంబమునకే. అటు పైకి వెళ్ళలేరు; క్రిందికి దిగజారలేరు. దైవభీతియు వారికి మెండు.

అతడి భార్యనుదుట గల రూపాయి బిళ్ళంత బొట్టు ఆ ముఖమునకు అందమును తేజస్సును చేకూర్చుచుండెను.

ఆమె తన పతి ననుసరించుచు దారి పొడవున సీతవలె బాధలను భరించుచూ తమ నిర్ణీత లక్ష్యమును చేరు పట్టుదలను గోచరింపజేయు చుండెను.

భర్త తన భార్యను పార్వతీరూపమున చూచుచున్నట్లును భార్య తన భర్తను పరమశివునిఅవతారముగా భావించుచున్నట్లును ఆ దంపతుల దృశ్యము నాకనులకు గోచరించినది.

వారిరువురి ప్రయాణమున వారిలోని వేర్వేరు రూపములను ఆఫాలనేత్రుని యేక రూపమున అర్ధ నారీశ్వరునిగా దర్శించుటయేమో. పతివ్రత లిట్టి వారేయను భావము నాలో తళుక్కున మెరసినది.

అంతటితో ఆగక పూర్వ- అధునాతన పతివ్రతా లలామలయెడ భావములు పరుగెత్త సాగినవి. వానిని క్లుప్తముగా నిట పేర్కొందును. ✍

☝ మహాభారత-రామాయణ కావ్యకర్తలగు వ్యాస వాల్మీకులు నాటి పతివ్రతాశిరోమణుల గూర్చి యెంత చక్కని పాత్ర పోషణము గావించిరో అట్టివి నేటికిని చెరగని ముద్రలై మన స్త్రీ జాతికే వన్నె తెచ్చునవిగను మార్గదర్శికముగను భాసింపుచున్నవి.

త్రేతా-ద్వాపర యుగములందలి సీత అనుసూయ ద్రౌపది-చంద్రమతి-సావిత్రీ సులోచన లీ కోవకు జెందినవారే.

1. సావిత్రి పాతివ్రత్య మహిమచే, మరణించిన, తన పతిప్రాణములను యమధర్మరాజును వాగ్రూపమున జయించి తిరిగి పొందినది. అంతేగాక తన అత్తమామలకు దృష్టియు రాజ్యమునుసంపాదించి పెట్టినది.
2. సత్యహరిశ్చంద్రుని భార్య చంద్రమతి పుత్రసహితముగా తన్నుమ్మడు బోయి భర్తకు యెదురు చెప్పక బ్రాహ్మణుని యింట దాస్యము జేసి పతివ్రతాధర్మము నెరవేర్చి చివరకు శుభముల బడసి ప్రఖ్యాతిగాంచినది.
3. సీతాదేవి శ్రీరామచంద్రునితో అడవులలో ఎనలేని యిడుములబడి రావణుని రాజ్యమున చెరబడి చివరకు అగ్నిలో దూకి తన పాతివ్రత్యమును నిరూపించుకొన్నది.

4. ద్రౌపదియు పంచపాండవుల నేవురిని సమదృష్టితో జూచి భార్యగా తల్లిగా రంభగా మంత్రిగా దాసిగా సేవలు చేయుటేగాక కందమూలాది ఫలములను పతులతో భుజించి వనవాసములో ఎన్నెన్నో యాపదలకు గురియై తనపాతివ్రత్య మహిమచే భక్తిచే శ్రీకృష్ణపరమాత్మయగు పురుషోత్తముని యనుగ్రహమును బడసినది. శక్తి స్వరూపిణిగా పేరందినది.

5. సుభద్ర అర్జునుడు బృహన్నలగా మారినను అడవులకు బోయినను ఆత్మసంయమనముతో పాతివ్రత్యము గాపాడుకొన్నది.

6. అనసూయ అత్రిమహాముని భార్య. ఆమె తన పాతివ్రత్యముచే త్రిమూర్తులనే చంటిపిల్లలుగా మార్చివేసి వారి కోరిక ప్రకారం అన్నము తినిపించి లాలించిన పతివ్రతా శిరోమణి దత్తాత్రేయావతార జనయిత్రియై విఖ్యాతినందినది.

7. సుమతి తన పాతివ్రత్యమహిమచే సూర్యుని గమనమును నిరోధించి జగత్తులోని దేవ దానవ మునుల బ్రహ్మ విష్ణు మహేశ్వరులనే చకితుల గావించినది. మరియు తన భర్తయగు కౌశికుడు సప్త వ్యసనములకు లోనుగాగా కృష్టువ్యాధి గ్రస్తుడైనను ఆతని కోర్కెలదీర్చ ప్రయత్నించినది. చివరకుసర్వ శుభముల బొందినది. తన పతి మహాముని యగుటకు తోడ్పడి జన్మ చరితార్థము జేసికొన్నది.

ఇట్లు ఎందరెందరో మహా పతివ్రతలు తమ పాతివ్రత్య మహాత్మ్యముచే అసాధ్యములను సుసాధ్యములు చేసిన సంఘటనలనెన్నో మన పురాణములలో కాననగును.

నేటి ఆధునిక స్త్రీలు కొందరి భావనలు పాతివ్రత్యమునకు భిన్నముగా నున్నవి. పతికి బానిసలుగా బ్రదుకుటయా యను విపరీతార్థములు తీయుట చింతాజనకము. అది వారి అహంభావమునే నిరూపించును. భార్యాభర్తలు బండికి గల రెండు చక్రముల మాదిరిగా సవ్యముగా నడచినచో 'సంసార రథము' మూడు పూవులారు కాయలుగా వికసించును. సేవాభావము ఓర్పు నమ్రత ప్రేమ దయ ఇత్యాది సుగుణములకు స్త్రీయే నిలయము. భూభారమును వహించునదియు భూమాతయే కదా! త ల్లిగా నితరవిధములుగా భర్తను పిల్లలనుసాకే సామర్థ్యము స్త్రీకే యున్నదనుటలో యేమాత్రము సందేహము లేదు. అయిన నేటి స్త్రీలు అబలలు కాదనియు నిరూపించుకొనుచు అన్ని రంగాలలో ముందంజ వేయుచున్నారు. అంతమాత్రము చేత భార్యలకు బదులు స్త్రీలు భర్తలగుదురా? కుటుంబ జీవనములో భార్యాభర్తలు, తమ తమ స్వాతంత్ర్య హక్కుల కొరకై పోటీ

తరముగాదు. కేవలము అహంభావముల చేతనే సతిగాని పతిగాని వారి వారి ఉత్తమ జన్మల సుసంస్కారములను వీడి అనర్థములను కొని తెచ్చుకొనుచున్నారు. సంసారమును సాగరముగా మార్చుకొనుచున్నారు. ఇంకా కొందరు రాకాసి భార్యల గురించి ఈ పద్యం గమనించండి.

శ్లో॥ కాలు బెట్టిన తోనె కాంతలు మెడవిరచి, నిండు సంసారంబు రెండు జేసి
తన మగడెంతయార్జన పరుడైనను, పొరుగుపుల్లమ్మ కాపురము మెచ్చి
ప్రాణేశుడొకటి తెల్పగతానొకటి సల్పి, యదియేమనిన కస్సుమనుచులేచి
విభుడెందులకొ నేగివిసిగి యొక్కటియన, పెళ్ళు పెళ్ళున పదివేలు గుప్పి

తే॥ పట్టజాలక పెనిమిటి గొట్టనేని
భావికిని యేటికిని పదిపరువులెత్తి
భర్త యెముకలు గొరికేగి భార్య చేత
కాపురము కంటే యమపురము గల దేవేరు.

(తాళ్ళూరి నారాయణదాసు)

అలాగే కొందరు మూర్ఖ పురుషుల విషయంలోను, ఈ పద్యం చూడండి.

సీ॥ అర్థాంగలక్ష్మియైనట్టి యిల్లాలిని, తన యింటిదాసిగా దలచువారు,
చీటికి మాటికి చిరబిరలాడి బెండ్లాముపై చెడును మాట్లాడువారు,
పడుపుకత్తెల యిండ్ల బానిసేంద్రై ధర్మ, పత్నియన్నను మండి పడెడివారు.
బయట అందరి చేతబడి వచ్చి యింటను, పొలతి నూరక
తిట్టిపోయువారు.

తే॥ పెట్టిపోతల పట్ల గలట్టి లోటుల
తిట్టి కొట్టులతోడను, తీర్చువారు
ఖలులు కఠినులు హీనులు కలుషమతులు
కలరు పురుషులలోన పెక్కండ్రు జగతి. (తా ''నా)

కౌశికుడంతటివాడు సప్తవ్యసనములకు లోనుకాగా సామాన్య మానవుల విషయము చెప్పనేల. కావున అట్టి సప్తవ్యసనముల గురించి తెలిసికొనుట యవసరవ భావించనైనది.

మానవ జాతికి సంబంధించిన స్త్రీ, పురుషులిరువురును 'మహాభార మందలి దిగువ నీతి పద్యమాలికను గ్రహించి నడచుకొనవలసినదిగా పెద్దల బోధించిరి.

తే॥ వెలది జూదంబు పానంబు వేట పలుకు
ప్రల్లదంబును దండంబుపరుసదనము
సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ముసేత
యనెడు సప్తవ్యసనముల జనదు తగుల.

పైవాని ఫలితములు స్త్రీపురుషులిరువురి యెడ సమానముగ ప్రసరించు ననుట యదార్థవిషయము.

1. వెలది : 'కామాతురాణాం న భయం న లజ్జా'

వేశ్యాలోలుడగు వాడు ధన మాన ప్రాణముల లెక్కింపడు. ఆ విధముగా అధఃపతనమును పొందును.

2. జూదము: జూదమున ధర్మరాజువంటి సుగుణశీలి తన సర్వస్వమును కోల్పోవుట జరిగి భిక్షాటనచేసి కందమూలఫలము లారగించవలసి వచ్చినది.

3. పానము: త్రాగుడువలన శరీరారోగ్యము నశించి అనేక వ్యాధి బాధలకు గురియగును, మరణము ప్రాప్తించును.

4. పరుషవాక్కులు: కఠినముగా మాటాడువాడు ఇహపరములకు దూరుడై అవసానకాలమున ఏకాకియై మరణించును.

5. దండనము: దండించుటకలవాటు పడినవాడు సర్వజనులచే దూషింపబడి చివరకు ఏదో ఒకరోజున పరులచే మడియును.

6. పంతము: మొండి పట్టుదలగలవాడు మూర్ఖుడు. ఇంగిత జ్ఞానమును సమయస్ఫూర్తిని కోల్పోయి తన సర్వస్వమును కోల్పోయి నష్టజాతకుడగును.

7. దుర్వ్యయము: విచక్షణారహితముగా దుర్వ్యయము చేయువానికి చివరకేమియు మిగులక ఏకాకియై బంధుమిత్రులచే తృణీకరింపబడి దుఃఖితుడై తన భవిష్యత్తును భయంకరాంధకారముగా జేసికొనును. చివరకు భిక్షాటనకు దిగవలసి వచ్చును. ఫలితముగా ఎల్లవేళల అసత్యముల బలుకుచు పరువుప్రతిష్ఠలు గంగపాలై జీవితమే సర్వనాశనమగును. తల్లిదండ్రుల పాపానికి వారిసంతానము కూడా భాగస్వాములై తత్పాపమనుభవించవలసివచ్చును.

కావున అన్ని పరిస్థితులయందు ఈ సప్త దుర్వ్యసనముల వీడునదిగా తెలియవలయును. పై భావనలు నాలో కలిగి విచిత్ర పరిణామములకు దారి తీయు వ్యసనముల గురించి వ్యధ చెందితిని.

నేను మరియు కిశోర్ ఆ దంపతులను ఆపి వారితో నాటోపీ గురించి వివరించి వెనుక వచ్చు నిగంవారికి తెలుప వలసినదిగా కోరితిమి.

మేము కొంతసేపు వేచి ముందుకు ప్రయాణమై చాలా ఎత్తునకు యెక్కుచూ ఆయాసపడుచుంటిమి.

అచ్చటి చక్కని ప్రకృతి దృశ్యములు మా ఆయాసమును చాలావరకు మరపింపజేసినవి.

మధ్యాహ్నము 12½ గంటలకు 'మాల్పా' విడిదికి చేరి ఒక మూల విశ్రమించి తదనంతరము భోజనములు ముగించుకొంటిమి.

దాదాపు 2 గంటలకు మా సామాను మరియు వానితో నా టోపీ కూడా వచ్చి చేరెను.

ఆటోపీ ఉదంతము నాకు చాలా చిత్రముగా తోచినది. 'ఋణానుబంధ' మగుట మూలమున అది నన్ను వదలలేదు.

కొందరు మిత్రులు ఆ టోపిని నానుండి పొందుటకు విశ్వప్రయత్నము చేసిరి. వారి బలవంతము నన్ను దాని నివ్వకూడదను ధృడ నిశ్చయమునకుదారితీసినది.

కొందరు ఢిల్లీ చేరిన పిదప నైనను దానిని తీసికొందుమని ప్రతిజ్ఞ బూనిరి. కాని అలా జరుగలేదు.

కొంతసేపు విశ్రమించిన పిదప సాయంత్రము అలా షికారుగా నదీ ప్రవాహ ప్రాంతమునకు వెడలి చూసి వచ్చితిమి.

రాత్రి భోజనానంతరము యెవరిచోట వారలము విశ్రమించితిమి. ఆ తదుపరి నిద్రలోనికి జారితిమి.

నాకు మాత్రము నాటి రాత్రి ఎందువలననో గొంతు నొప్పి మూలముగా చాల బాధ గల్గి సరిగా నిద్ర రాకుండెను డాక్టరుగారు యిచ్చిన గుళికలను వేసికొంటిని. వాని మూలమున కొంత బాధానివారణ జరిగినది.

ఈ సందర్భమున నాలో శరీరతత్త్వవిచారణ ప్రారంభమాయెను. అదేమన ఈ పాంచభౌతిక శరీరమునకు ఎప్పుడు ఏ వ్యాధి ఏ ఆహారలోపమున కలుగునో అది తెలియజాలనిదికదా అనుకొంటిని. ✍

☝ దేహము విచిత్ర స్వభావములతో కూడినది.

ఈ పాంచభౌతిక స్థూల సూక్ష్మ శరీరములగురించి తెలుపుట అవసరముగా భావించి తెలియజేయుచున్నాడను.

1. రాళ్ళు గుట్టలు-గ్రామనగరములు-మందిరములు-ద్వీపములు ఖండములు-84 లక్షల జీవులు-మైదానారణ్యములు-వృక్షాదులు జడము-కఠినముగల పదార్థములన్నియు 'పృథివి' యని చెప్పబడినవి.

2. ''క్షార క్షీర సురా సర్పిర్దధి ఇక్షుర్జలం తదా'' యనునవి ఉప్పు, పాల, జల సముద్రములు మద్య, మధు, ఘృత జలములు అన్నియు 'అప్పు' అని చెప్పబడినవి.

అవేకాక అమృతము, పాదరసము, విషము, వృక్షరసము, స్వేద, మూత్ర, శ్లేష్మ, భాషాదులును అప్పు (జలము) గా చెప్పబడినవి.

3. చంద్ర, సూర్య, తారాగణము, అగ్ని, ఉరుము, పిడుగు, ప్రళయాగ్ని, రుద్రాగ్ని, కాలాగ్ని , భూగర్భాగ్ని, బడబాగ్ని మున్నగు తేజోవంతములన్నియు 'తేజము' యనబడును.

4. ''చంచలత్వము, చైతన్య రూపము, గలిగి తేజమును ప్రసారించునదే వాయువు'' యనబడుచున్నది.

సృష్టిలోని అనేక వ్యాపారములకు హేతువు నీ 'వాయువు'. ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన అను పంచ ప్రాణములును, నాగ, కూర్మ, వృకర, దేవదత్త, ధనుంజయము లను పంచ ఉప ప్రాణములును చంద్ర, సూర్య, తారాగణ, స్థిర, కారణము కూడ, 'వాయువు' దే య్యై యున్నది.

5. ''నిర్మలముగ నిశ్చలముగ అవకాశ రూపముగ రిక్తముగ నుండునది ఆకాశము''.

ఇది సర్వవ్యాప్తియై పై నాలుగు భూతముల తనయం దిముడ్చు కొన్న శ్రేష్టమైన పంచమహా భూతము. కామ, క్రోధ, లోభ, మోహ, భయ, అజ్ఞాన, శూన్య, త్వమను సప్త గుణము లుండుటవలన 'బ్రహ్మ' మని భావించ వీలులేదు. ఎండ మావుల జూచి నీరుగా భ్రమించినట్లు ఆకాశమును జూచి ''బ్రహ్మ'' మని భ్రమించకూడదని పెద్దల అభిమతము.

ఇవన్నియు స్థూల పంచమహాభూతము లనబడును. ని

ఈ పంచ మహా భూతములు బ్రహ్మమందు మూల మాయ గలిగి దాని నుండి గుణమాయ జనించి మాయ నుండి సత్వరజో గుణములు ఉద్భవించెను.

ఆ తదుపరి తమోగుణమునుండి పంచ మహాభూతము లుద్భవించినట్లు తెలియజేయబడినది.

వీనిని విశదముగా తెలిసికొనుటకు సూక్ష్మ పంచభూతముల గురించి తెలియజేయబడినది.

శ్లో. స్వర్గే మర్త్యేచ పాతాళే యత్కించి త్సచరాచరం
సర్వం త త్పాంచభౌతిక్యం షష్టం కించిన్న దృశ్యతే

ఈ పైన పేర్కొనబడిన స్థూల పంచ మహా భూతములలో ఒక్కొక్క దానియందును పంచ భూతములున్నందున వీనిని సూక్ష్మ పంచ భూతములని పెద్దలు చెప్పిరి.

1. పృథ్వియందలి కఠినత్వమే పృథ్వి. మృదువులోనిదే జల లక్షణము దానిలోని కాఠిన్యమే భాసాగ్ని లక్షణము. కఠినత్వములోని నిరోధనమే వాయువు.

మరియునాకాశము సర్వవ్యాపి కాన పృథ్వి యం దీవిధముగా సూక్ష్మ పంచభూతములున్నట్లు పేర్కొనబడినది.

2. జలమునకు గల మృదుత్వము జలము. మృదువు నందలి కఠినత్వమే పృథ్వి. జలమున జలమున్నది. దానిలోని మృదువులో తేజమున్నది. జలములోని నిస్తబ్దతలోనే వాయువున్నది. జలములోను ఆకాశముండియే యున్నది. కావున జలములో సూక్ష్మ పంచ భూతములున్నవి.

3. 'తేజము' నందు గల తీక్షణమే ''పృథ్వి''. తేజమున మృదువుగా నగుపడు అగ్ని భాసమే జలాంశము. తేజమున తేజముండుట నిర్వివాదము. తేజము లోని అగ్ని సంచలనమే ''వాయువు'' మరియు అందలి స్తబ్దత '' ఆకాశము''.

4. వాయువునందు గల జడత్వము శక్తి లేక ఝుంఝూ మారుతము ''పృథ్వి'' దానిలోని కోమలత్వమే 'జలము'. వాయువు భాసమే అగ్ని స్వరూపము. మరియు వాయువులో వాయువు ఆకాశముండుట విశేషమేమియు గాదు.

5. ' ఆకాశము'ను అవకాశమనియు శూన్యము అజ్ఞానము జడత్వము అనియు తెలుపుదురు. ఈ జడత్వమే పృథివి. మృదుత్వమే 'జలము'. అజ్ఞానము శూన్యత్వమే తేజో లక్షణము. అకాశమందు ఆకాశము వాయువుండియే యున్నవి.

కావున పంచస్థూల భూతములలో ప్రతి దాని యందును సూక్ష్మ పంచభూతములు గర్భితమైయున్నట్లు ధృవీకరించబడినది.

ఈ విధముగా వేదాంత విచారణలో మునిగి మెల మెల్లగా నిదురలోనికి జారి పోయితిని.

శ్లో. శ్రీ మత్సుందరనాయికాం భయహరాం జ్ఞానప్రదాం నిర్మలామ్
శ్యామాభాం కలమలాసనార్చితపదాం నారాయణస్యానుజామ్
వీణావేణు మృదంగ వాద్య రసికాం నానా విరాడంబికాం
మీనాక్షీం ప్రణతోఽస్మి సంతత మహం కారుణ్య వారాం నిధిమ్.
నానా యోగిమునీంద్ర హృద్య వసతిం నానార్థ సిద్ధి ప్రదాం
నానా పుష్ప విరాజితాంఘ్రి యుగళాం నారాయణే నార్చితామ్
నాద బ్రహ్మమయీం పరాత్పర తరాం నానార్థ తత్వాత్మికామ్
మీనాక్షీం ప్రణతోఽస్మి సంతత మహం కారుణ్య వారాం నిధిమ్.

(ఇతి మీనాక్షీ పంచరత్నమ్)



# ముప్పది ఎనిమిదవ అధ్యాయం

## మాల్పా నుండి జిప్తి

శ్లో. వేదో నిత్య మధీయతాం తదుదితం కర్మ స్వనుష్ఠీయతామ్।
తేనేశస్య విధీయతా మపచితిః కామ్యే మతి స్త్యజ్యతామ్।
పాపౌఘః పరిధూయతాం భవసుఖే దోషోఽను సంధీయతామ్।
ఆత్మేచ్ఛా వ్యవసీయతాం నిజగృహా త్తూర్ణం వినిర్గమ్యతామ్.

✍ తేది 13-8-83 రోజున ఉదయమే నిత్యకృత్యములు ముగించుకొని 7 ½ గంటలకు పర్వతారోహణ అవరోహణములతో సప్తవర్ణయుతమగు ఇంద్రధనుస్సు యొక్క ఛాయ గ్రహణముల తీయుచూ ముందుకు సాగుచుంటిమి.

ఆదారి దుర్గమమగను ప్రమాద పూరితముగా నుండెను. శ్రీ చొక్కారావుగారు ఈ నిటారగు దారిని అధిగ మించినచో మేము ధన్యులమే యని భావించి యుంటిమి. అట్టి దారి గుఱ్ఱములకు సహితము వశపడరానిది. శ్రీ చొక్కారావుగారికి నడచు జవసత్వములు లేకుండెను. నాడు రెండవ గుఱ్ఱమును కూడ బాడుగకు కుదుర్చుకొని ఇరువురు మనుష్యులు ఇరువైపుల ఆయనగారిని సంబాళించు కొనుచూ ప్రయాణము సాగించితిమి. మొదటి గుఱ్ఱము అలసిపోగా రెండవ గుఱ్ఱమును ఉపయోగించుకొనిరి.

మేము ఒకానొక జలపాతమును దాటి ముందునకు సాగితిమో లేదో మా వెనుకనున్న కొండ చరియలు విరిగిపడుట తటస్థించుచుండెను. నిజమునకు అట్టి సంఘటనలు అతిభయంకరమై తోచుచుండెను. 50 మీ. నుండి గొప్ప శబ్దముతో విరిగిపడుట విస్మయము కలిగించుటే గాక గుండెలదర జేయుచుండెను. ప్రకృతిలీలలు చిత్రాతి చిత్రములుగదా! ✍

☝ గ్యాంగ్‌మన్‌లు దారులు మలచుటలో సిద్ధహస్తులై యుందురు. వారికది పెన్నతో పెట్టిన విద్య. వారి సహన చాకచక్యములు చూడదగినవే కాని వర్ణింప నలవి కాదు. ఒక్కొక్కప్పుడు ప్రాణాపాయముగూడా సంభవింపవచ్చును. యాత్రికులను వేయి కళ్ళతో కనిపెట్టుచూ సునాయాసముగా దాటవేయుదురు. నిరంతరము అది ఒక భయంకర పోరాటము. యాత్రికులకు అది నూతన అనుభవమగుటచే భీతినందుట సహజమే. కొండచరియలు విరిగి పడుట ద్వారా పాతదారులు మటుమాయమగును. క్రొత్తదారులు యేర్పరచుచుందురు. ఈ విధంగా అనుక్షణం భయభ్రాంతులమగుచు ముందునకు సాగుచుంటిమి. సృష్టి లీలలు అద్భుతములు ఆశ్చర్యజనకములు దురవగాహ్యములు. ఈ సృష్టి రహస్యము వెనుక సూత్రధారియగు పరమేశ్వరు డొక డున్నాడని తోపింపజేయును. ఇది సహజమే కదా!

పరమేశ్వరుని ఉనికిని హేతువాదులు తిరస్కరింతురు. లోక వ్యవహారములను ప్రకృతి సిద్ధముగా జరుగు ప్రక్రియలుగా భావింతురు. వారు ధార్మిక సందేశముల బొందరు. వారినే శరీరవాదులని, లోకాయుతులని, చారువాకులనీ, ప్రాచీన గ్రంథాలలో పేర్కొనుట గమనించదగినది.

మహానుభావులగు తపోసంపన్నులు తమ అతీత జ్ఞాననేత్రముల ద్వారా భగవంతుని ఉనికిని గమనించియున్నారు. వారు సాక్షాత్ పరమేశ్వర దర్శనమును పొంది బ్రహ్మానంద భరితులై అమరులై భాసించుచున్నారు.

పోతన భాగవతమందు ఈశ్వర మహిమ నిట్లు వర్ణించియున్నాడు. ☝

ఈశ్వరుండు విష్ణు డెవ్వేళ నెవ్వని ।
నేమి సేయు పురుషు డేమి యెరుగు ।
అతని మాయలకు మహాత్ములు విద్వాంసు।
లణగి మెలగుచుందు రంధు లగుచు.

☝ కావున ప్రకృతి చిత్రవిచిత్ర లీలలన్నియు భగవత్ చేష్టితములుగా నెరుగవలెను. ఇలాటి భూస్ఖలనములు కోట్ల సంవత్సరముల నుండి జరుగుచునే యున్నవి. ఈ హిమాలయములన్నియు నొకానొక సందర్భమున సముద్ర గర్భితములే యని తెలిసికొంటిమి.

ఈ సృష్టి రచనలో యుగము లంతరించుచు ఆవిర్భవించుట జరుగుచునే యున్నది.

మన పౌరాణికాధార ప్రకారము కృతయుగము త్రేతాయుగము ద్వాపర యుగము గడచి కలియుగము గడచుచున్నది. వీనికి సంబంధించిన మన పంచాంగ కర్తల భారతీయ కాలవిభజన నీ దిగువ చూపబడినది.

**భారతీయ కాల విభజన పద్ధతి :**

భారతీయ కాల విభజన పద్ధతిలో వైదిక సిద్ధాంతము దిగువ విధముగా వివరింపబడినది.

మం. ''శిక్షా విభిందో అస్మై చత్వార్యయుత
దధత్ అష్టాపరసహస్రా''

అనగా చత్వారి = 4 అష్టాపర = 4x8 = 32 ఆయుత = 10,000 సహస్ర = 1000 ఈ సంఖ్యలను సమీకరించినచో 432 కోట్లు సం॥లు అగును. ఇది బ్రహ్మకు ఒక్కరోజు అగును. దీనినే బ్రహ్మకల్పమందురు.

మం. "గౌరీ మిమాయ సలిలాని తక్షతి యేకపది ద్విపది సా చతుష్పదీ"
అష్టాపది నవపదే బభూవుషి సహస్రాక్షరా పరమే వ్యోమన్.

బ్రహ్మయొక్క అహోరాత్రి 8,64000 అక్షరములతో విభజింపబడియున్నది. ఒక్కొక్క అక్షరమునకు 10,000. కావున బ్రహ్మ యొక్క అహోరాత్రములు 8,64000x 10,000=864 కోట్లు సం॥ములు.

సృష్టిక్రమమును గురించి ఋగ్వేదమున నీ విధముగా తెల్పబడెను.

మం. "యా ఓషధీ పూర్వా జాతా దేవేభ్యః త్రియుగం పురా."

అనగా దేవ సృష్టికి మూడు యుగముల పూర్వము ఓషధీ సృష్టి జరిగెను. అనగా 3x 43.20 లక్షలు = 129.60 లక్షల సం॥లు.

అధర్వణవేదములో
"శతం తేఽయుతం హాయనాన్ ద్వే యుగే త్రీణి చత్వారి క్రుణ్మః"
అనగా మానవుల 432 కోట్ల సం॥లు బ్రహ్మకొక రోజుయని యర్థము.

మం. "పరమేష్ఠి దేవమానేనక సహస్ర సంవత్సరం తపశ్చార."

అనగా బ్రహ్మ వేయి దేవవర్షములు 1000x360 = 3,60,000 దేవ సం॥లు తపస్సు చేసెను.

మం. "వత్సర శతం బ్రహ్మమానేన బ్రహ్మణః పరమాయు ప్రమాణం."

అనగా బ్రహ్మ మాన ప్రకారము 100 సం॥ లు బ్రహ్మ యొక్క ఆయువు. ఈ శృతిలో దేవమానమును గూర్చి చెప్పబడియున్నది.

శ్లో. "దైవే రాత్ర్యహని వర్షం ప్రవిభాగ స్తయో పునః
అహస్తత్రోదగయనం రాత్రి శ్యాద్దక్షణాయనమ్."

అనగా ఒక మానవ సం॥ము దేవమానమున ఒక అహోరాత్రియగును. ఇందులో నెలలు ఉత్తరాయణము 6 నెలలు దక్షిణాయనమని చెప్పబడెను.

శ్లో. "దైవికానాం యుగానాం తు సహస్రం పరిసంఖ్యయా
బ్రహ్మమేక మహర్జ్ఞేయం తావతి రాత్రి రేవచ."

అనగా వేయి దేవ యుగములు బ్రహ్మకు ఒక పగలు మరియు వేయి దేవయుగములు ఒక రాత్రి యగును.

ఇవే విషయములు సూర్య సిద్ధాంతములోను మహాభారత అరణ్య, శాంతి పర్వములోను వ్యాసభగవానుడు వివరించియున్నాడు.

ప్రస్తుత శ్వేతవరాహ కల్పము :

| | | |
|---|---|---|
| 18 రెప్పపాటు కాలము | = | 1 కాష్ఠ |
| 30 కాష్ఠలు | = | 1 కల |
| 30 కలలు | = | 1 ముహూర్తము |
| 30 ముహూర్తములు | = | 1 దివారాత్రము |
| 15 దివారాత్రములు | = | 1 పక్షము |
| 2 పక్షములు (శుక్ల కృష్ణపక్షములు) | = | 1 మాసము |
| 12 మాసములు | = | 1 సంవత్సరము (6 నెలలు ఉత్తరాయణము 6 నెలలు దక్షిణాయనము) |
| 30 సంవత్సరములు | = | 1 దేవ మాసము |
| 360 సంవత్సరములు | = | 12 దేవ మాసములు |
| | = | 1 దేవ సంవత్సరము |

4800 దేవ సం॥లు = 17,28,000 మానవ సం॥లు = కృతయుగము

3600 దేవ సం॥లు= 12,96,000 మానవ సం॥లు = త్రేతాయుగము

2400 దేవ సం॥లు= 8,64,000 మానవ సం॥లు = ద్వాపరయుగము

1200 దేవ సం॥లు=4,32,000 మానవ సం॥లు = కలియుగము

మొత్తము :

12,000 దేవ సం॥లు = 43,20,000 మానవ సం॥లు = దేవయుగము = మహా యుగము

1,000 దేవ యుగములు = 432 కోట్ల సం॥ = బ్రహ్మదినము లేక ఉదయకల్పము

1000 దేవ యుగములు = 432 కోట్ల సం॥ = బ్రహ్మరాత్రి లేక కశ్య కల్పము లేక మహాయుగము.

2000 దైవ యుగములు లేక మహాయుగములు = 864 కోట్ల సం॥లు = బ్రహ్మఅహోరాత్రులు

30 బ్రహ్మహోరాత్రములు లేక 60,000 మహాయుగములు =
= బ్రహ్మ ఒక మాసము x 12 = బ్రహ్మ సం॥ము

100 బ్రహ్మ సం॥లు=బ్రహ్మ జీవితకాలము

బ్రహ్మ దినములో 14 మనువులు గడచిపోవుదురు. ఒక్కొక్క మనువు 71 మహాయుగములు అనగా 71x43,20,000 = 20,67,20,000 మానవ సంవత్సరములు.

ఈ క్రింది పట్టిక ద్వారా మనువుల కాలము లేదా మన్వంతరములు తెల్యచేయనైనది.

6 మనువులు=6x71=426 మహాయుగములు=1840320,000 సం॥లు

27 మహాయుగములు వైవస్వత ఏడవ మనువు = 116640,000 సం॥లు

కృతయుగము 28వ మహాయుగము = 1728000 సం॥లు

త్రేతాయుగము=1296000 సం॥లు

ద్వాపర యుగము = 864000 సం॥లు

కలియుగము (కలి 5056 ఎ.డి.) = 5056 సం॥లు

మొత్తం : 196,08,53,058 సం॥లు

7 జలప్రళయములు, కృత యుగ సమము =

7x1728000 = 12096000 సం॥లు

మొత్తము : 197,29,49,056 సం॥లు

బ్రహ్మ మేలుకాంచిన 51 సం॥పు మొదటి దినము ఇపుడు నడుచుచున్నది.

బ్రహ్మ యొక్క ధ్యాన సమయము యిప్పటివరకు 170,64000 సం॥ గడచినది.

బ్రహ్మ సృష్టి ప్రారంభించినప్పటి నుండి గడచినవి = 1955885056 సం॥లు.

ఇంతవరకు ఆరుమన్వంతరములు గడిచి ఒక్కొక్క మన్వంతరము చివర ఒక్కొక్క ప్రళయము వచ్చినట్లు పునఃసృష్టి జరిగినట్లు పౌరాణికులు విశదీకరించి యున్నారు. ఇప్పటికి స్వాయంభువ, స్వారోచిష, ఉత్తమ, తామస, రైవత, చాక్షుషమనువులార్గురు గతించిరి. ప్రస్తుతమువైవస్వతమనువుకాలమున నడుచుచున్నది. రాబోవుకాలమున, సావర్ణి, దక్షసావరిణ బ్రహ్మ సావర్ణి, ధర్మసావర్ణి, రుద్రసావర్ణి, ఇంద్రసావర్ణియును ఏడుగురు మనువులు రాగలరని దైవజ్ఞులు పంచాగములలో గణించివ్రాయుచున్నారు. ( విష్ణుధర్మోత్తరమహాపురాణము)

ప్రస్తుత వైవ స్వతమనువు ఆయుః ప్రమాణము = 306720000 సం॥లు

ప్రస్తుత వైవస్వతమనువు కాలము నేటి వరకు గడచినది 120538056 సం॥లు

వైవ స్వతమనువు గడుపవలసిన భవిష్యత్కాలము 186186944 సం॥లు.

పై వివరముల వలన దిగువ నిర్ధారణలు తేలుచున్నవి.

1. బ్రహ్మ 51వ సం॥పు మొదటి దినములో యున్నాడని శాస్త్రాధారము.

2. ఇప్పటివరకు 30 ఘటికలు 42 విఘటికలు లేక 195588505 సం॥లు గడచినవి.

3. ఈ విధముగా మన పంచాంగకర్తలు పైన తెల్పిన ఆధారములచే పంచాంగములను వ్రాయుచున్నారు.

పౌరాణికాధారము ప్రకారము బ్రహ్మ విష్ణు మహేశ్వర శక్తి ఆయుః ప్రమాణ మీవిధముగా చెప్పబడవినది. ☝

శ్లో. ''చతుర్యుగ సహస్రాణి దినమేకం పితా మహం
పితామహ సహస్రాణి విష్ణోర్ఘటిక మేవ చ.
విష్ణోరేక సహస్రాణి పలమేకం మహేశ్వరం
మహేశ్వర సహస్రాణి శక్తే రర్థ పలం భవేత్.''

☝ ఇట్టి శక్తులు అనంతముగా నుండి సృష్టి రచనా కార్యక్రములు జరిగి పోవుచున్నవ ని పౌరాణికులు నమ్ముచున్నారు.

ఇలా సృష్టి రచనలలో యుగములంతరించుచూ ఆవిర్భవించుచున్నను ''బ్రహ్మము'' మాత్రము నిశ్చలమై ఏలాటి మార్పులు లేక నిలచి యున్నది.

మాయ బ్రహ్మముల గురించి విచారించినచో అంతా అవాగ్మానస గోచరము. రతనాలు కావలసిన వారికి రాళ్ళను యేరుట తప్పనిసరి యగును. కావున పాఠకులకు విస్తారమైనను వాని గురించి కొంత విపులీకరించుట భావ్యమని తోచినది.

ఇట్టి బ్రహ్మములు పదునాలుగని శృత్యనుసారము తె లియుచున్నది. 1. శబ్ద బ్రహ్మము. 2. ఓమిత్యేకాక్షర బ్రహ్మము 3. ఖంబ్రహ్మము. 4. సర్వబ్రహ్మము. 5. చైతన్య బ్రహ్మము 6. సత్తా బ్రహ్మము. 7. సాక్షిబ్రహ్మము. 8. సగుణ బ్రహ్మము. 9. నిర్గుణ బ్రహ్మము 10. వాచ్య బ్రహ్మము 11. అనుభవ బ్రహ్మము 12. ఆనంద బ్రహ్మము 13. తాదాకార బ్రహ్మము 14. అనిర్వాచ్య బ్రహ్మము.

వీనిలోని నిజమైన శాశ్వత బ్రహ్మమును పరిశీలించి తెలిసికొని మిగతావి అశాశ్వితములని పరిత్యజింప వలెనందురు.

ఈ బ్రహ్మము వివరముల నెరుగుట ఎంతేని కష్టతరము. ఇట్టిది ఆకాశము కంటె నిర్మలముగను విశాలముగను వ్యాపించి యున్నది. 21 స్వర్గములు,

7 పాతాళములు కలిసిన నొక బ్రహ్మాండమగును. ఈ బ్రహ్మాండము సర్వ దిశలందు వ్యాప్తమై స్థల జల పాషాణ ఆకాశాది సర్వ ప్రదేశములందు నిండియున్నది.

శరీరమందంతయు బ్రహ్మాండమే వ్యాపించి యున్నది. సృష్టిలోనున్న ఈ బ్రహ్మము సృష్టి ఆవల నెంత వరకు వ్యాప్తమై యున్నదో అనూహ్యము.

బ్రహ్మమును కొంతవరకు ఆకాశముతో బోల్చుకొనవచ్చును. ఇత్తడికి నలుపు లేనిచో బంగారమగునట్లు ఆకాశమునకు శూన్యమే లేకున్న అది బ్రహ్మమే కాని ఆకాశము మాత్రము బ్రహ్మము కానేరదు.

కావుననే ఉన్మనీయావస్థ విజ్ఞానవృత్తి పరబ్రహ్మమున లీనమైన నచట కేవలము పరబ్రహ్మ మఘండునని యోగులు సిద్ధులగువారు అనుభవ పూర్వకముగా తెలిపియున్నారు. అనిర్వచనీయమగు నీ వృత్తి దశయే ఉన్మనీయావస్థ. అదే యెల్లరకు విశ్రాంతి. ఇదియే జ్ఞానులకు ఉపాధిరహిత సమాధి. త్రిమూర్తులును ఈ బ్రహ్మమునకు లోబడువారే. బ్రహ్మ ప్రళయమున అన్ని తుడిచి పెట్టబడినను పరమాత్ముడు సర్వకాల సర్వావస్థలయందు అచంచలుడు. బ్రహ్మ నిరూపణ మెరిగిన వారిని బ్రహ్మవిదులని 'బ్రాహ్మణు'లని పెద్దల అభిమతము. బ్రహ్మము బహు విధములుగ భాసించినను అది ఒక్కటేయని భిన్న భిన్న మతములవారు వివిధ రీతుల వివిధ యనుభవములతో దీని నంగీకరింతురు.

బ్రహ్మమునకు నిర్మలము నిశ్చలము శాంతత అరూపత అలక్ష్యత అగోచరత అచ్యుత అనంత అపరంపర అదృశ్య అతర్క్య, మున్నగు నామములు గలవు. అంతేగాక నాదరూప, జ్యోతిరూప, చైతన్యరూప, సత్తారూప, సాక్షిరూప, సత్‌రూపములను నామములు గలవు. మరియు ఈ బ్రహ్మమును శూన్య, సనాతన, సర్వేశ్వర, సర్వజ్ఞ సర్వాత్మ జగ జ్జీవన సహజ సదోదిత శుద్ధ బుద్ధ శబ్దాతీత విశాల విస్తీర్ణ విశ్వంభర విమల వ్యోమాకాశ పరమాత్మ పరమేశ్వర ఏకరూప జగదాత్మ జ్ఞానధన పురాతన చిద్రూప చిన్మాత్ర లను అనేక నామములు గలవు.

సృష్టిలోని ముఖ్యాతి ముఖ్య రహస్యము 'బ్రహ్మము'

సృష్టి అష్ట విధములు. అవి : 1. కల్పనా సృష్టి 2. శాబ్దిక సృష్టి 3. ప్రత్యక్ష సృష్టి 4. చిత్రలేపన సృష్టి 5. స్వప్న సృష్టి 6. గాంధర్వ సృష్టి 7. జ్వర సృష్టి 8. దృష్టి బంధన సృష్టి.

ఈ బ్రహ్మము ఒకే విధముగా అఖండముగా వ్యత్యాస రహితముగా నున్నదని ఇట్టి స్థితి బ్రహ్మమున కెలా వచ్చినదని వేద శృతులు సహితము 'నేతి నేతి' యని నుడువుచున్నవి. ''యదృష్టం త న్నశ్యతే'' యను శృత్యనుసారము కనబడున దెల్ల

నశించునదే. ఇట్టిది స్వప్నమున గాంచు అనేక విషయములు మెలకువరాగానే అన్నియు మాయ మగునట్లు సృష్టియంతయు మాయచే నిండి యున్నది.

బ్రహ్మము మాయకు గల వ్యత్యాస మిట్లున్నది. :

| బ్రహ్మము | మాయ |
|---|---|
| 1. ఉపాధి రహితము | ఉపాధిరూపము |
| 2. కనుపించదు - నిత్యము | కనుపించును - అనిత్యము |
| 3. కల్పాంతమున అవినాశ | కల్పాంతమున-నాశమగును |
| 4. సమముగా నుండును-భాసింపదు | విషమరూపము-భాసించును. |
| 5. నిర్మలము - అనిర్మితము | మలినము-నిర్మితము |
| 6. అజ్ఞానము - రుచింపదు | జ్ఞానము రుచించును |
| 7. అలక్ష్యము-చెడదు | లక్ష్యమైనది-చెడును |
| 8. అప్రత్యక్షము-వృద్ధిలేనిది | ప్రత్యక్షము-దినదినాభివృద్ధి గలది |
| 9. అమరము-అసాక్షము | మరణించునది-సాక్షమైనది |
| 10. ధారణాశక్తిచే నవగతము కాదు | అవగతమగును |
| 11. ఏ పక్షమునకు చేరదు | జ్ఞానా జ్ఞానము గలది. |
| 12. అభిన్నము-సూక్ష్మము | భిన్నము-స్థూలము |
| 13. తెగదు-మలినపడదు | తెగిపోయి మలిన మగును. |
| 14. నిర్వికార నిరంజనము | నానారూపధారణచే సర్వము చేయును |
| 15. శాశ్వత రూపము | పంచభూతాత్మక - అనేక రూపము |
| 16. సారవంతము - నిరిచ్ఛామయము | సారరహిత ఇచ్ఛామయము |
| 17. అద్యంత రహితము - పతనరహితము, | అద్యంత-పతనము గలది |
| 18. విశాలము స్థూలము అఖండ ధనము | సూక్ష్మ పంచ భూతాత్మకము |

వేడి చేత పాలను నీటిని వేరు పరచునట్లు బ్రహ్మము బ్రహ్మైక్యముచే సాధింపవచ్చును.

'జీవభూతః సనాతనః' యనునట్లు బ్రహ్మము ఆత్మయు ఒకే విధముగా సర్వకాల సర్వావస్థలయందుండును.

సృష్టిలో గల మానవులు నాలుగు విధములుగా పేర్కొనబడిరి; వారు

1. **బద్ధులు** : స్వార్థము సంసారము వీరికి ప్రపంచముగా తోచును; నానా విధ పాప కార్యము లొనర్తురు. భక్తి జ్ఞాన వైరాగ్యముల నెరుగక దుర్వ్యసనములకు లోనగుదురు.

2. **ముముక్షువు** : పాపముల గుర్తించి పరితపించి సంసార భవ బంధముల వీడుటకు ప్రయత్నించును.

3. **సాధకుడు** : సాధు సాంగత్యము ఆత్మ జ్ఞాన నిరంతర సాధన అధ్యాత్మిక ద్వైతములందు ప్రీతి, సారా సార విచారము, దేహము నందుండియు విదేహుడై పంచభూతాత్మిక ప్రపంచమును స్వప్నముగా నెరుగును. పరమార్థ సాధకుడై యొప్పును.

4. **సిద్ధుడు** : తానే బ్రహ్మయై సంశయరహితుడై సత్యమును గుర్తించి అహమాత్మగా నిరాకార నిర్గుణుడై వర్తించును.

పై విషయముల గ్రహించి మాయా మోహముల వీడు ప్రయత్నమున నుండుట శ్రేష్ఠము. అదియే ముక్తి మార్గము అని దాసబోధాకారుని యభిమతమై యున్నది.

ఈ విధముగా పరమేశ్వర మహిమను కాలగమనమును గూర్చి విచారించిన పిదప నెమ్మదిగా పరస్పరము చేయూత నిచ్చుకొనుచూ నదీప్రవాహము చెంతవరకు సాగితిమి.

ప్రవాహ పార్శ్వములందు పడియున్న శిల లాధారముగా సుమారు 100 మీ. దాటగలిగితిమి. ఈ విధముగా నదిగట్టునకు చేరితిమి.

ఆ దినమున గుఱ్ఱపు బాడుగలు తీసికొన్న వారందరు నడచుచునే ప్రకృతి సిద్ధమగు దృశ్యముల నవలోకించుచూ అపరిమితానందమును అనుభవించిరి.

నిటారుగుదారులవలన గుఱ్ఱములు యెక్కుటకు వీలుపడలేదు. భయంకరమగు లోయ మార్గములందు కత్తి వంతె నలపై నుండి నడచుట జరిగినది. అది ఒక సర్కస్‌ఫీటువలె గోచరించినది.

నదీ ప్రవాహపు హోరు గుండెల నదర జేయునదిగా నుండెను. చెవులు గింగురు మనుచుండెను.

ఆ విధముగా పయనించుచూ ముందుగల ఒక చిన్న హోటలు చేరితిమి. అచ్చట 'టీ-టిఫిను' సేవించి విశ్రమించితిమి.

అచ్చట 'టీ-టిఫిను' సేవించి విశ్రమించితిమి.

తదుపరి మామిత్రులు కొందరు ముందునకు సాగిపోయిరి. శ్రీ చొక్కారావుగారు అగ్రవాల్‌గారు గుఱ్ఱములకై యెదురు చూచుచుండిరి. పోలీసువారు వారికి సహాయకులుగా నుండిరి.

నేను గోడ్బోలే గారు 'వాకిటాకి' జవానులు తోడు రాగా ముందునకు సాగితిమి.

అది నిటారగు మార్గమగుటచే నేను ఎగశ్వాసతో బాధపడుచుంటిని. అలసట మితిమీరిన సందర్భములందు అచ్చటచ్చట ఆగుచు మరల ముందుకు సాగుచుంటిమి.

ముందున్న శ్రీ షణ్ముగ సుందరం గారిని చేరువరకు పూర్తిగా బడలిక నొందితిని.

ఇరువురము కలిసి మధ్యమధ్య ఆగుచు నీరు త్రాగుచు పిప్పర్‌మెంట్లు నోట వేసికొనుచు గొప్ప అనుభూతిని పొందుచూ ముందునకు సాగుచుంటిమి.

చాలా పైకి వెళ్ళిన పిదప అచట మిలటరీవారు 'బంకర్లు' యేర్పరచుకొను చుండుట గమనించితిమి.

వారిని మేము చేరినప్పుడు సాదరముగా మమ్ము భోజనమున కాహ్వానించిరి. మేము కేవలము 'టీ'లు మాత్రమే స్వీకరించితిమి.

'కుమార్' రేపు నన్ను దారిలో కలియుదునని చెప్పెను.

'టీ' సేవనానంతరం ముందునకు సాగి సుమారు 3 గం.ల వరకు జిప్తి క్యాంప్ చేరి అచ్చట భోజనములు ముగించుకొని విపరీతమగు అలసట కారణముగా త్వరలో నిద్రలోకి జారుకొంటిమి.

శ్రీ చొక్కారావుగారి గుఱ్ఱము అలసిపోగా వేరే గుఱ్ఱముపై యెక్కించి తోడుగా అగ్రవాల్‌గారు పోలీసువారు సహాయ పడుచుండిరి.

గుఱ్ఱమును దిగనీయకుండా 4½ గంటలు నిరంతరముగా ప్రయాణము సాగించిరి. నేటితో వారి గండము చాలావరకు గడచినట్లయ్యెను. వారుకూడా తమ భోజనములు ముగించుకొని నిదురించిరి.

ఇకముందున్న దారి ఇంత నిటారుగా లేకుండెను. ఎగుడు ఎక్కువగా నున్నట్లులేదు.

రేపటి ప్రయాణమందు చొక్కారావుగారికై మిలటరీ క్యాంపు వారిని విచారించి

వీలగుచో హెలికాప్టర్ తెప్పించుటకు నిర్ణయించుకొంటిమి. అచ్చట హెలీపాడ్ ఉండుటవలన అది సుసాధ్యమే యని భావించితిమి. మా తిరుగు ప్రయాణమందు ఏ క్యాంపులోగూడ డాక్టర్ పరీక్షలు జరుగలేదు. మేమెవ్వరము అస్వస్థులుగా లేకుంటిమి. మరో కారణము యింటిదెస ప్రయాణమై యుండవచ్చును. అయినను అవసరమగు మందులు మాకు డాక్టర్‌గారి ద్వారా లభించుచుండెను.

సాయంత్రము కొంతసేపు బాతాఖానీ తర్వాత భోజనములు ముగించి యెవరి స్థానములలో వారు విశ్రమించి నిదురించితిమి.

శ్లో : సంగస్సత్సు విధీయతాం భగవతో భక్తి ర్దృఢాఽధీయతామ్
శాంత్యాదిః పరచీయతాం దృఢతరం కర్మాశు సంత్యజ్యతామ్
సద్విద్వా నుపసృప్యతాం ప్రతిదినం తత్పాదుకా సేవ్యతామ్
బ్రహ్మైకాక్షర మర్థ్యతాంశ్రుతిశిరో వాక్యం సమాకర్ణ్యతామ్॥



 కాళిదాసు ''పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్'' అని నుడివెను. పరులకుపకారము చేయుట పుణ్యము. పరులను పీడించుట పాపము.

# ముప్పది తొమ్మిదవ అధ్యాయం

## సిర్ఖా ప్రయాణము

శ్లో. వాక్యార్థశ్చ విచార్యతాం శ్రుతిశిరః
పక్ష స్సమాశ్రీయతాం ।
దుస్తర్కా త్సు విరమ్యతాం శ్రుతిమత
స్తర్కోఽనుసంధీయతాం।
బ్రహ్మాఽస్మీతి విభావ్యతా మహరహ
ర్గర్వః పరిత్యజ్యతాం।
దేహేఽహంమతి రుజ్ఝ్యతాం బుధజనైః
వాదస్సముత్సృజ్యతామ్.

తేది 14-8-83 రోజున ఉదయము మా నిత్య కృత్యముల పూర్తి గావించుకొని అనంతరము మా ముందు కార్యక్రమమును ప్రారంభించితిమి.

ఆ దినమున నేను శ్రీ కిశోర్‌గారు సుందర దృశ్యముల ఫోటోలు తీయుటలో నిమగ్నమైతిమి.

మా గతదిన నిర్ణయానుసారము మిలటరీ క్యాంపునకు వెళ్ళి అచ్చట హెలీక్యాప్టర్‌ను గురించి విచారించితిమి.

అచ్చట సైనికాధికారిగాని సైనిక డ్యాక్టర్‌గాని లేకుండిరి. అచ్చటి టెలిఫోన్ కూడా సరిగా పనిచేయనందున ఆ విషయంలో మా లీడర్‌గారు విఫలులైరి. చేయునది లేక మేము గూడా ఆ ప్రయత్నము నుండి విరమించుకొంటిమి.

అక్కడి నుండి మేము కొంత ముందునకు సాగి ''సింఖోలాగడ్' వద్ద మాకై నిరీక్షించుచున్న శ్రీ కుమార్ మిలటరీ మిత్రుని కలిసికొంటిమి. ఆయనగారు మాకు పళ్లు, బిస్కట్లు, టీ యిచ్చిరి. వాని నారగించి ఆయనతో కొంత ముచ్చటించి సెలవు తీసుకొని ముందునకు సాగితిమి.

''ర్గ్లింగ్‌టాప్'' ఎక్కుట ఈ ప్రయాణమందలి ప్రత్యేక విశేషము. ఆ అతి యెత్తైన కొండ నెక్కుటలో చాలా అలసటకు గురియైతిమి. ముచ్చెమటలు పోయదొడగెను. కాళ్ళు విపరీతముగా లాగదొడగెను. నీరస మధిక మయ్యెను.

ఆ సందర్భములో పై నుండి క్రిందికి దిగుచున్న గుఱ్ఱములకు గాడిదలకు కట్టిన గంటల గణగణ శబ్దము మాకు వినిపించెను. ఆ వెనుక అరవ బృందము వారు ఒకరిద్దరుగా యెదురు పడిరి.

వారు మమ్ముల కలసికొనుటయే తడవుగా మమ్ముల పరామర్శించి మా పాద ములకు ప్రణమిల్లుట మొదలు పెట్టిరి. అట్లు చేయుటను మేము నివారించితిమి. అట్లు చేయుటలోని వారి ఉద్దేశ్యము మేము కైలాసనాధుని దర్శించి వచ్చుటయేనని మేము భావించితిమి. వారి భక్తి ప్రేమపూర్వక గాఢాలింగనములు మమ్ముల పరవశులను చేసినవి.

వారు మమ్ము సర్వము సాధించిన వారుగా భావించిరి. పరమేశ్వర భక్తిలో నుండు పారవశ్య మహాత్మ్య మెంతటిదో మేము అర్థము చేసికొంటిమి. ఆ బృందములో ఒకరిద్దరు తెలుగువారై యుండిరి. అది నన్ను ప్రభావితుని ముగ్ధుని చేసినది. మన తెలుగు వారిని దూరప్రదేశములందు చూచినప్పుడు యెంత ఆర్ద్రతనొందుదుమో నా కప్పుడర్థమైనది. స్వభాష-స్వజాతి ప్రేమ ఎంతటి గాఢతరమైనది.

వారికి మేము కైలాసగిరి విశేషములను చెప్పుటయేగాక వాతావరణ విషయములో అంత పెద్ద యిబ్బంది యేర్పడదని ధైర్యవచనములు చెప్పితిమి. వారు మిక్కిలి సంతసించిరి.

6వ బృందము వారు క్రిందికి దిగుచుండిరి. మేము పైకి ఎక్కుట ప్రారంభించితిమి.

సుమారు 11 గంటల వరకు ''ర్గుగ్లింగ్‌టాప్' నధిరోహించి విజయగర్వమును పొందితిమి. నాడు ఇది ఒక్కటియే మాకు ప్రయాస నెక్కువగా కలిగించినది.

ఆ తదుపరి సాగు మా ప్రయాణము 'తవాఘాట్' వరకు దిగుడుదారి. అందువల్ల ప్రయాసమెక్కువగా లేకున్నను ప్రమాద భరితమై యుండెను.

'ర్గుగ్లింగ్‌టాప్' పై ఒక 10 నిమిషములు విశ్రమించి మరల మెట్లపై నుండి దిగుట ప్రారంభించితిమి.

మా మిత్రులు కొందరు ముందునకు వెళ్ళిపోయిరి. కొందరు వెనుకపడి యుండిరి.

మాకు ఆ మెట్లు పూర్తిగా దిగివచ్చుటకు సుమారు ఒక గంట పట్టినది.

దిగువగల హోటలు చేరి అచ్చట 'టీ-టిఫిన్లు' గావించితిమి. మేము శ్రీ చొక్కారావు గారికై వేచియుంటిమి. వారు గుఱ్ఱముపై పోలీసుల సహాయమున వచ్చుచుండిరి. వారు క్రిందికి చేరగానే విశ్రాంతి నిమిత్తము హోటలు ముందు గద్దెపై పరుండిరి.

మా 22 మంది బృందమునందు శ్రీ రామకృష్ణన్‌గారు దివంగతులగుటయు శ్రీ చొక్కారావుగారి ఈ విషమ పరిస్థితియు మమ్ము ఆందోళన పరచు చుండెను.

మాలోని అందరకు కొద్దో గొప్పో శారీరక మానసిక బాధలు లేకపోలేదు. మా గృహములను యెప్పుడు చేరుదుమాయను ఆరాటము హెచ్చుచుండెను.

ఈ సందర్భమున నాలో కలిగిన శరీరతత్వ విచారణను వివరింప దలచితిని.

ఈ దేహము పంచ భూతాత్మికము. వీని పంచీకరణ తత్వములు దిగువ విధమున తెలియజేయబడినవి.

1. అంతఃకరణము 2. వ్యానము 3. శ్రవణము 4. వాక్కు 5. శబ్దము అనునవి ఆకాశరూపము.

స్ఫురణ రూపమున నాభిస్థానమునుండి బయలుదే రు వాణి పరావాణి.

ధ్వనిరూపము హృదయ స్థానమైనది. 'పశ్యంతివాణి'. కంఠము స్థానమై బయలుదేరినది. 'మధ్యమవాణి'. అక్షరముల ఉచ్చారణచే వెలువడు వాణి 'వైఖరి'. పరావాణికి ఉనికి పట్టగు నాభిస్థానమే అంతఃకరణమునకు ఉనికిపట్టు.

నిర్వికల్పావస్థ యందు కలుగు స్ఫురణయే 'శూన్యాకారస్మరణ' 'అంతఃకరణ' లేక 'చేతనా శక్తి' యనబడును.

ఒక పనిని చేయుదునా లేదా యనుభావమే మనస్సు. సంకల్ప విక ల్పాదులే మనోధర్మము.

మనస్సు ద్వారా కలుగు సందేహమునకు చేయు నిర్ణయమే 'బుద్ధి' అభిమానముచే దానిని చేయుదు నను నిర్ణయమే 'అహంకారము'.

1, ఇట్లు స్మరణము సంకల్పము మనస్సు బుద్ధి అహంకారము ''ఆకాశ రూపము'' ఇవి అంతఃకరణ పంచకములు.

ఇవన్నియు నొక్కటిగనే యున్నను కార్యరూపమున వేరువేరుగా పంచవృత్తుల కలిగి వాయురూపమున పంచప్రాణులైనవి.

2. మనస్సు సమానము, త్వక్కు, పాణి, స్పర్శ ''పవన రూపములు''.

3. బుద్ధి ఉదానము నయనము చరణము రూపము ''తేజోరూపములు''.

4. చిత్తము, అపానము, జిహ్వ, శిశ్నము, రసము - జలరూపములు''.

5. అహంకారము, ప్రాణము, ఘ్రాణము, గుదము, గంధము ''పృధ్వీరూపము''.

1. వ్యానము 'సర్వాంగములందు', సమానము 'నాభియందు', ఉదానము 'కంఠమునందు', అపానము 'గుదమందు', ప్రాణము 'నాసికయందు' గలవి పంచప్రాణములనబడును.
2. చెవులు, చర్మము, కన్నులు, నాలుక, ముక్కు, ''జ్ఞానేంద్రియ పంచకము''.
3. వాక్కు, చేతులు, పాదము, శిశ్న గుదములు ''పంచకర్మేంద్రియములు''. ఇవన్ని చేయు కార్యములను ''పంచతన్మాత్రలు'' అందురు.
4. అంతఃకరణ ప్రాణ జ్ఞాన కర్మలు ''విషయేంద్రియ పంచకములు''.
5. శబ్దము రూప రస గంధ స్పర్శలు ''జ్ఞానేంద్రియ పంచకములు''.

ఇట్లు పైన తెల్పిన భూతతత్వములన్నియు 25 కలిసి 'సూక్ష్మ దేహము' అగునని శాస్త్రాభిమతము. అట్లే స్థూలమునకు 25 తత్వములు గలవు.

1. కామ, క్రోధ, శోక, మోహ, భయములు ''ఆకాశరూపములు''
2. చలనము, వలనము, ప్రసరణము, నిరోధనము, ఆకుంచనము, ''వాయు గుణములు''
3. వీర్యము, రక్తము, లాల, మూత్ర, స్వేదములు ''జల లక్షణములు''.
4. ఆకలి, దప్పి, అలసట, నిద్ర, మైధునము ''తేజోగుణములు'',
5. అస్థి, మాంసము, త్వక్కు, నాడి, రోమములు ''పృథ్వీ లక్షణములు''.

ఈ పాంచ భౌతిక స్థూల లక్షణములను 'స్థూల దేహ' మందురు.

ఈ రెండు స్థూల సూక్ష్మ దేహములతోపాటు కారణ (అజ్ఞాన) మహా కారణ (జ్ఞాన) మనువానితో దేహములు నాలుగు.

ఈ 'తను'-చతుష్టయమునకు తత్వములు వివరింపనైనవి.

1. స్థూల, సూక్ష్మ ,కారణ ,మహాకారణము, లనునవి నాలుగు దేహములు.
2. జాగ్రత్త, స్వప్న, సుషుప్తి, తురీయ, అవస్థలు నాలుగు.
3. విశ్వము, తైజసము, ప్రాజ్ఞము, ప్రత్యగాత్మ యనునవి నాల్గు అభిమానములు.
4. నేత్రము, కంఠము, హృదయము, శిరస్సు యనునవి నాల్గు 'స్థానములు'.
5. స్థూలభోగ, వివిక్తాభోగ, ఆనందభోగ, ఆనందావభాసభోగములు నాలుగు.
6. ఆకార, ఉకార, మకార ,అర్ధమాత్రలని, నాలుగు మాత్రలు.
7. తమము, రజస్సు, సత్వము, శుద్ధసత్వముయనునవి 'నాల్గు గుణములు'.
8. క్రియాశక్తి, ఇచ్ఛాశక్తి, ద్రవ్యశక్తి, జ్ఞానశక్తి, యనునవి 'నాల్గు శక్తులు'.

పైన తెల్పిన 32 తత్వములు స్థూల సూక్ష్మ దేహ 50 తత్వములు కలిసి 82 తత్వములు తెలుపబడినవి.

ఇవి కాక కారణ, మహాకారణమను, జ్ఞానా, జ్ఞానములు కలిసి మొత్తము 84 యగును.

ఈ తత్వములన్నియు మాయగా నెరిగి దేహముతో బాటు పంచ భూతాత్మక మాయను శోధించి కనుగొనవలెననియు జ్ఞాన వివేకములతో పరాత్పరుని శోధించవలెనని 'దాసబోధ' యందు వివరింపనైనది.

హోటల్ గద్దెపై విశ్రమించిన శ్రీ చొక్కారావుగారు అతి ప్రయాసతో లేచి కూర్చొనిరి. వారి చెంతనే అగ్రవాల్ గారుండిరి. వీరు బడలిక మూలమున ప్రయాణము చేయు స్థితి యందు లేకుండిరి. అయినను ప్రయాణము తప్పదయ్యెను.

మాకు దారి దిగుడుగా నున్న కారణమున ప్రయాణము చురుకుగా సాగుచుండెను. దగ్గరగల గ్రామము నొక దానిని త్వరలోనే చేరితిమి.

మా వెంట ఇద్దరు పోలీసు వారుండి మార్గదర్శకత్వము వహించుచుండిరి. గ్రామపు పొలిమేర నుండి ఇరుకగు ప్రమాదపూరితమగు గడ్డి దారిని పిల్ల దారిగా చేసికొని నడక సాగించితిమి. ఆ దారి ముందుగల క్యాంప్‌నకు కురుచదారిగా భావింపనైనది. ఇరుకగు సన్నదారి యగుటచే ఏమాత్రము ఏమరు పాటు కలిగినను పడిపోవు ప్రమాదము లేకపోలేదు. కాబట్టి అతి జాగ్రత్తగా నడువవలసి వచ్చెను.

కొంతదూరము నడచిన పిదప వర్ష మారంభమైనది. మేము పైక్యాంప్ చేరునప్పటికి 3 గంటలైనది. అప్పటికే అచటికి చేరిన వారందరు భోజనములు ముగించుకొనిరి.

'పంగు' క్యాంప్ దగ్గరలో నున్నందున మాలోని కొందరు యువ మిత్రులు తమ సామానులను బయటనే వుంచిరి. అవి యెక్కువగా వర్ష కారణమున తడువలేదు. ఇంత త్వరలోనే ప్రయాణము పునః ప్రారంభించుటకు మాలోని కొందరకు సమ్మతముగా లేకుండెను. ఇట్లు త్వరగా ప్రయాణము సాగించుట వలన ఢిల్లీ ఒకరోజు ముందు చేరవచ్చునని వారి భావనయై యుండెను. కాని మాలోని యెక్కువ మంది పునః ప్రయాణమునకు సమ్మతింప నందున మరుసటి దినమునకు ప్రయాణము యధావిధి వాయిదా పడెను.

ప్రయాణము మరుసటి దినమునకు వాయిదా పడుటకు దిగువ కారణములు తోడైనవి. మాపోరును 'పిట్టపోరు పిట్టపోరు పిల్లితీర్చె'' నన్నట్లు విపరీతమగు 2 గం. ల వర్షము తోడై ముందుకు సాగనివ్వలేదు. పైగా శ్రీ చొక్కారావు గారి

దేహస్థితిపూర్తిగా అస్వస్థమై పోయినందున వారికి తప్పనిసరిగా స్ట్రెచర్ అవసర సహాయ మేర్పడినది. మాలోని కొందరు ఆ రోజే ప్రయాణమునకు పూనుకొని సమీప గ్రామమున స్ట్రెచర్ మోయు మనుష్యులను వెదకి తెచ్చుటకుగాను కొందరిని నియోగించిరి. వారు ప్రక్క గ్రామమునకు వెళ్ళి అచట మేలా ఒకటి జరుగుచుండుట వలన మనుష్యులు లభ్యమగుట లేదను చల్లని కబురును తెచ్చిరి. పైగా గుఱ్ఱముల మనుష్యులు గూడా మొరాయించిరి. మేము వంటలు చేసికొనేదెప్పుడు? మరల బయలు దేరేదెప్పుడు? అను చిక్కు సమస్య తెచ్చి పెట్టిరి. పై కారణము లన్నిటి వలన ప్రయాణము తప్పనిసరిగా మరుసటి దినమునకు వాయిదా పడినది. వర్ష కారణముగా సామానులు లోనికి చేర్చబడెను. భోజన సమయ మగుట వలన శ్రీమతి రశ్మిగారు మాకు భోజనము వడ్డించుట జరిగినది. కొంత మాటా మంతీ రాత్రి భోజనము గాఢనిద్ర నాటి మిగతా కార్యక్రమము.

శ్లో: క్షుద్వ్యాధిశ్చ చికిత్స్యతాం ప్రతిదినం
భిక్షౌషధం భుజ్యతామ్
స్వాద్వన్నంనతు యాచ్యతాంవిధివశా
త్ప్రాప్తేన సంతుష్యతాం
శీతోష్ణాది విషహ్యతాం న తువృథా
వాక్యం సముచ్చార్యతామ్
ఔదాసీన్య మభీప్స్యతాం జెనకృపా
నైష్ఠుర్య ముత్సృజ్యతామ్॥
ఏకాంతే సుఖ మాస్యతాం పరతరే
చేత స్సమాధీయతామ్
పూర్ణాత్మా సు సమీక్ష్యతాం జగదిదం
తద్బాధితం దృశ్యతామ్
ప్రాక్కర్మ ప్రవిలాప్యతాం చితిబలా
న్నాప్యుత్తరైః శ్లిష్యతామ్
ప్రారబ్ధం త్విహ భుజ్యతా మథపర
బ్రహ్మాత్మనా స్థీయతామ్॥

(ఇతి ఉపదేశ పంచకమ్)



# నలుబదియవ అధ్యాయం

## ధార్చులా ప్రయాణము

శ్లో. ఓం ఓం నమః ప్రణవార్థార్థ స్థూల సూక్ష్మ క్షరాక్షర ।
వ్యక్తావ్యక్త కళాతీత ఓంకారాయ నమోనమః.
న నమో దేవాదిదేవాయ దేహసంచార హేతవే
దైత్యసంఘ వినాశాయ నకారాయ నమోనమః.
మో మోహనం విశ్వరూపం చ శిష్టా చార సుపోషితమ్।
మోహ విధ్వంసకం వందే మోకారాయ నమోనమః.
నా నారాయణాయ నవ్యాయ నరసింహాయ నామినే ।
నాదాయ నాదినే తుభ్యం నాకారాయ నమోనమః.

తేది 15-8-83 రోజున ఉదయమున 7 గంటలకు లేచి కాలకృత్యముల అనంతరము ఉపాహారములను ముగించుకొంటిమి. పిదప ప్రయాణమునకు సిద్ధమైతిమి.

ఏ విధముగానైన ఒకరోజు ముందు ఢిల్లీ చేరవలెనను ఉబలాటము, పట్టుదల మాలోయెక్కువైనది. అందుకే త్వరత్వరగా ప్రయాణము సాగించి మొదట 'ధార్చులా' చేరి అచట భోజనములు ముగించుకొని 'పిథోరాగడ్' లో రాత్రి మకాం చేయవలెనను ఆలోచనతో ముందునకు సాగితిమి.

అచట నుండి పంగు 2 కి.మీ. యెత్తగు ప్రదేశము. కావున నెమ్మదిగా నడక సాగించుచూ 'సోసాయనే' గ్రామ మధ్యము నుండి దిగుడు దారిగా నున్నందున వేగమును లంకించుకొంటిమి.

శ్రీ చొక్కారావుగారు ప్రతిరోజు ప్రయాణించు గుఱ్ఱమునేగాక మరొక యెత్తు తక్కువగల కంచర గాడిదను నేడు కూడా యేర్పరచుకొనిరి.

పెద్దలు ధావే కులకర్ణిగారలు గుఱ్ఱములు నిటారు దిగుడులో పనికిరావని భావించి నడచి వెళ్లుటకే నిశ్చయించుకొనిరి.

మా వెంటనున్న ఎస్.పి. ఎఫ్. జవాను రేడియో మీట నొక్కి ఆన్ చేసెను. ఆ సందర్భమున మాకు కీ॥ శే॥ శ్రీమతి ఇందిరాగాంధి గారి ప్రసంగపు చివరిమాటలు వినవచ్చెను. ఆనాడు 15వ ఆగష్టు స్వతంత్ర దినోత్సవమనునది మాలో యెవరికిని జ్ఞాపకము రాలేదు. అచ్చటచ్చటగల కొండకోన గ్రామాదులందు కూడా స్వతంత్రదినోత్సవపు జాడలు కానరాలేదు. మా ధ్యాసయంతయు యెప్పుడు ఢిల్లీ

చేరుదుమా- మాగ్రామముల నెప్పుడు దర్శింతుమా-మావారలనందరిని ఎప్పుడు కలిసి కొందుమాయను తలంపులే తప్ప మరేమియు ధ్యాసకు రాకుండెను. దేహ చింతనము పరివార బంధుజన చింతనమే తప్ప - దేశ స్వాతంత్ర్య దిన ఆభాసయే లేకుండా పోయినది. స్వజన-స్వగ్రామ మమతా మోహము లెంత బలీయమైనవి.

ఈ సందర్భమున 'దేహము' ' ఆత్మ' గురించి కొంత ప్రస్తావింపదలచితిని.

మానవ దేహము- ఆత్మ రెండు ఒకదాని నొకటి పెనవేసికొనియున్నవి.

ఈ సంయోగ కారణమున ఉద్వేగము, చింత, జాగరూకత, ఆనందము మున్నగునవి జీవాత్మకు కలుగుచుండును.

అన్నము భుజించి సర్వకార్యములు చేయునది దేహమైనను కారణభూతమైనది ఆత్మయే.

దేహాత్మలు సర్వకాల సర్వావస్థలందును ఒకదాని నొకటి వీడకుండా నుండును.

ఆత్మ శరీరమును వదిలినప్పుడు దేహము వ్యర్థపదార్థమైపోవును.

స్వప్నావస్థయందు ఆత్మ శరీరము నంటి పెట్టుకొని యుండియే యెచ్చటెచ్చటికో తిరిగి వచ్చుచుండును.

మత్తు పదార్థ సేవనము వృద్ధాప్యదశ మున్నగువానిచే వివేకము సన్నగిలి ఆత్మ భ్రమ జెందుచుండును.

విషము భుజించిన శరీరము మాత్రమే చచ్చును కాని లేచిపోవునది మాత్రము జీవాత్మ.

పెరుగుట-తరుగుట-అనుభవించుట-సుఖదుఃఖాదులు శరీరమునంటి పెట్టుకొనియున్న జీవాత్మకే కలుగుచున్న వనుట యదార్థము.

దేహబాధకన్న - ఆత్మక్షోభ దుర్భరము - కావున ఆత్మకు క్షోభ కలిగించునంతటి మహాపాతకము మరొకటి లేదు.

ఆత్మక్షోభ కలిగించి తదనంతరము యెంతటి ధనధాన్యాదు లొసగినను అట్టిబాధ తొలగనేరదు.

దేహమును ఒక పుట్టతో పోల్చినచో అందలి జీవాత్మ పామువంటిదని చెప్పవచ్చును. ఈ పాము యెప్పుడు పుట్ట నుండి బయటపడునో తెలయజాలము. ఈ రెండి సంయోగ కథనమువలన త్రిలోక జ్ఞాన సంఘటన లెన్నియో లోకమున జరుగుచున్నవి.

దారముచే పుష్పహారము లాగున ఆత్మచే సంపూర్ణ జగత్తు గ్రుచ్చబడి యున్నది. (దారము ఉపమానము సంపూర్ణయదార్థముగాదు.)

ఆత్మ సర్వాంగములందు వ్యాప్తమైయున్నది. చెరకుగడయందు రసమున్నది. కాని చెక్కయందులేదు.

దేహి (ఆత్మ) దేహము (అనాత్మ) రెండు భిన్నములుగా నున్న దానినే 'పరమాత్మ' 'నిరంజన' మని చెప్పెదరు.

ఆత్మకు రాజు పేదయను భేదభావములు లేవు-పాపులందును పుణ్యులందును చీమ దోమ మరియు యేనుగులందును ఆత్మ ఏకీభావమున నున్నది.

అంతమాత్రమున అన్నియు సమమని చెప్పజాలము. కాకి హంస కాలేదు గదా! బురద గుంట యందలి నీరు గంగాజలము కానేరదు కదా ☝

శా. అంగం మాలినవాడు దాత యగునా అయిదారు గొడ్డేరులున్
గంగా నర్మద సింధు గౌత మగునా గంగెద్దు నేకంబుగన్
శృంగారించిన శంభుతేజి యగునా క్షీరాబ్ధిలో నెప్పుడున్
కొంగన్ ముంచిన రాజహంస యగునా గోరాజి వేమాన్వయా!

క॥ కెంగేల రామకృష్ణుని
బంగరుటుంగరము లుండ పండితు డగునా
రంగైన మచ్చలుండిన
సింగారపు టూరకుక్క సింగం బగునా? (సుబోధము)

☝ ఈ వ్యత్యాసములు ఆత్మ యందు లేకున్నను సత్సాంగత్యము సదాచారము సద్బుద్ధి సత్య సంకల్పత అనువాని మూలమున అంతరంగమును పరిశుద్ధపరచుకొనుట అతి ముఖ్యము.

ఆత్మ అగోచరమైనది - దీనిని వేదాదులే వివరింపజాలకున్నవి.

బ్రహ్మమందు గలుగు స్ఫురణమే అంతరాత్మ లక్షణము - జగదీశ్వరుడు. దీని నుండియే త్రిగుణములు - పంచభూతములు - అష్టధా ప్రకృతికి మూలమయ్యెను.

ఆత్మ వేగమును మించినది మరొకటి లేదు. ఆత్మ గుప్తమై యుండి అండపిండ బ్రహ్మాండములందు వ్యాపించి దేహమందలి సమస్త ఇంద్రియములకు ఆజ్ఞ నొసగుచూ ఆయా కార్యముల జరిపించుచున్నది. సర్వ సృష్టి యందు గల సర్వ కళలకు - సర్వవేద శాస్త్రములకు - లోకాలోక నిర్ధారణకు - సమస్త చరాచరమునకు

మూలము ఈ ఆత్మయే. అది చేయనిది లేదు. దానితో సమానమైనది మరొకటి లేదు.

ఆత్మ ఒక్కటే యైనను అది చేయు వింత అనేకము. జీవుడు (పురుషుడు) జీవి (స్త్రీ) ఈ రెంటి సంగమమున మాయ వలన ప్రపంచాభివృద్ధి కలుగుచున్నది. ప్రకృతి పురుష లనునదిదియే.

ఈ ఆత్మ జీవాత్మ - పరమాత్మ - అంతరాత్మ - సూక్ష్మాత్మ - శివాత్మ జగదాత్మ యను అనేక పేర్లతో దేవ దానవ మానవ - పశుపక్ష్యాదులం దెల్లెడల పూర్ణమై యున్నది.

ఆత్మ యోగమున సర్వము నడచుచున్నది. బ్రహ్మాదులు సహితము ఈ యోగముచే జరామరణముల పొందుచున్నారు.

వీనినే నాదరూప, జ్యోతిరూప ,సాక్షిరూప, సత్తారూప, చైతన్య రూప,-సత్య రూప ద్రష్ట' రూప మున్నగు నామములచే చెప్పబడెను. ఇదియే సర్వోత్తమము-పురుషోత్తమము రఘూత్తమము ఉత్తమోత్తమము త్రైలోక్యవాసియై వెలుగొందుచున్నది. నానా కలహ-కోలాహల-జనన మరణ సర్వకార్యములు ఆత్మవేననుట నిశ్చయము.

ఆత్మలేని జగత్తు శూన్యము. ఆత్మలేని దేహము మృతము.

శ్లో॥ యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్. (భగవద్గీత)

తులసి చెట్టునకు కొమ్మలపై నీరు పోసినను అవి వేరునే చేరును.

మఱ్ఱి చెట్టునకు అలా పోయలేము. దాని మూలముననే నీరు పోయవలసి యుండును. అప్పుడు అది బ్రదుకును.

అందుచే అందరికి పుణ్యము లభింపదు. నిష్కామమున చేయు సేవయే ఆత్మారాముని చెందును.

సారాసార విచారణచే ఆత్మశోధన మొనర్చి సత్సంకల్పము ద్వారా మానవ కల్యాణము చేకూరునని దాసబోధాకారుని యభిమతమై యున్నది.

పంగు గ్రామమునకు ఒక కిలోమీటరు ముందు నేను ఒక్కడనే మెట్లను వదలివేసి పోర్టర్లు నడచు పిల్లదారిని ఎంచుకొని చాలా జాగ్రత్తగా మెలకువతో నడచుచుంటిని. ఆ దారివలన Z ఆకారపు మార్గము తప్పి కొంత దగ్గర మార్గమేర్పడెను. నేను. క్రిందికి దిగుచు మరల మెట్ల మార్గమునకు వచ్చుచుంటిని.

ఒక మూలన మెట్ల మార్గముపైకి చేరుటకు అడుగు యెత్తి అడుగు వేయగా పొరపాటున నా కాలు బూటు ఒక రాయిపై బడినది. బూటు జారి సుమారు 3 మీటర్ల దూరము జారి రోడ్డు పైకి దొర్లితిని. నా అదృష్టవశమున పూర్వజన్మ సుకృతము వలన ఆ ప్రదేశము, లోయయో, నదియో, లేకుండుటచే ప్రమాదము తప్పినది. నేను పడిన బలమైన పాటుకు తల పగులుటో చేయి విరుగుటో సంభవించెడిది. కాని పూర్వ ఫలభాగ్యము దైవసహాయము వలన చిన్న గాయముతో సరిపోయినందులకు గండము గడచెనని తృప్తిపడితిని. మనకు లభించునవి యనుభవించునవన్నియు పూర్వఫలము చేతనే యని కవి వర్ణించును. ✍

చ. గుణవతియైన భార్య కులగోత్రము నిలిపెడి నందనుండు ర
క్షణల నొసంగు సత్ప్రభుడు కార్య విధాన మెరుంగు సేవకా
గణములు కష్ట కాలమున గాచెడి మిత్రుడు యిష్టదేవతా
ర్పణ మగు భుక్తి పూర్వఫల భాగ్యమయా గిరిజామనోహరా.

నేటి కాలములో కొందరు ప్రభువులు అనగా రాజ్యాధినేతలు యెంత సేపు తమను తమవారిని గురించే యోచింతురు ఒక బీద కవి వారి గురించి యిలా విలపించును.

మ॥ ధర సంపత్తతులెందు కిచ్చుతనకున్ దైవంబు యోచింపగన్
భరితోత్సాహము తోడబంధు జనులన్ బ్రాహ్మణ్యులన్ దీనులన్
నరయన్ అంధుల పంగులన్ సుజనులన్ నజ్ఞానులన్ హీనులన్
పరిరక్షించుటకిచ్చు గాదె పరికింపన్ మేటి సామ్రాజ్యముల్.

ఉ॥ ఒక్కని పొట్టకై యిడునె నొప్పగదేవుడు రాజ్యసంపదల్
చక్కని. రూప యవ్వనుల సామజయానలశయ్య సౌఖ్యముల్
చక్కగ యోజసేయుమిక సారమతీ అధికార శూరతల్
నిక్కముగావు చూడుమిక నిల్చును దీనజనోపకారముల్.

✍ పడినచోటు నుండి తిన్నగా లేచి దుమ్ము దులుపుకొని అటునిటు పరికించితిని. నన్నెవరును గ మనించినట్లు అనుమానము తోచలేదు. నా కెమెరాకు ఏమైనా నష్టము వాటిల్లెనాయని గాభరాపడి పరికింపగా ఎట్టి హానియు వాటిల్లలేదు. నాకు మాత్రము మందపు ఊలన్ ప్యాంటు ఎడమభాగపు పిరుదునకు తమలపాకంతటి ఒరపు యేర్పడి కొద్దిపాటి రక్తము వచ్చినది. మోచేయి కూడ కొంత రాపిడి పొందినది. ఈ రెండుచోట్ల బాధగా నుండెను. నావద్ద అయోడిన్ లేకుండెను.

ఇంతలో నా వెనుకనే శ్రీ రాంసింగ్ కుమారి చంచల్‌చడ్డా శ్రీమతి రశ్మి మరియు శ్రీ మాథుర్‌లు వచ్చుటను గమనించితిని. వారు మలుపు తిరిగి నా చెంతకు చేరిరి. నా గాయము గురించి వారికి తెలుప లజ్జపడితిని. మరియు ఆ దగ్గరలోనే గల హోటలుకు నెమ్మదిగా చేరి బాధచే అర గంట విశ్రమించితిని. వారు ముందుబడిపోయిరి. అచట హోటలుయందు రంగాచారిగారును విశ్రమించిరి.

తరువాత రంగాచారిగారితో కలిసి బయలుదేరి నదీ పాయలను దాటి ఎగుడు దారి ద్వారా పంగు క్యాంపు పరిసరములకు చేరితిమి. నేడు పంగు క్యాంపు వెడలు యవసరము లేకుండెను. నేటి మా బస 'ధార్చులా'. మేము క్రిందినుండి పైకి వెడలు సందర్భమున మా వెంట గల పోలీసు ఎస్. ఐ. మాకెదురు వచ్చి మాటాడెను. రంగాచారిగారు ముందు నడచిరి. నేను. ఎస్. ఐ. ఇరువురము మెల మెల్లగా క్రొత్తగా తయారగుచున్న రోడ్డు వెంట మాటాడుచు నడుచుచుంటిమి. పంగు క్యాంపు ఎదురుగా చాలా ఎత్తుపై నున్నది. రోడ్డు అర్ధచంద్రాకృతిలో యున్నది. నేరుగా ఎక్కి దిగగలిగితే ఈ రోడ్డును ½ కి.మీ. దూరములో కలియవచ్చును. కాని అది ఎక్కలేక సమమగు రోడ్డుపై 2 కి.మీ నడక పూర్తి చేసితిమి. ఎస్. ఐ. తన ట్రాన్సుఫర్ (బదిలీ) గురించి చెప్పెను. ఆయన తన అడ్రసు ఇచ్చి నా పతా గైకొనెను. మరియు వెనుకబడిన పంగు క్యాంపునకు నాతో సెలవు తీసికొని వెనుదిరిగి ఎక్కుచుండెను.

నేను ఒక్కడినే నెమ్మదిగా సమతల రోడు వెంబడే నడచుచు 'ఠానేదార్' చేరి టీ సేవించి విశ్రమించితిని. నా వెనుకనున్న కొందరు ఇంకను చేరకుండిరి. నేను 20 నిమిషముల తరువాత లేచి బాధపడుచు భయపడుచు దిగుట మొదలిడితిని. ఆ ఎస్. ఐ. గారు మరల వచ్చి నన్ను చేరెను. ఆయన పనికై నా వెంట ఢిల్లీ వరకు వచ్చుటకు నిశ్చయించుకొని భోజనము ముగించి తయారై వచ్చెను నేను మధ్య మధ్య ఆగుచు చాల నెమ్మదిగా దిగుచుండ ఆ ఎస్. ఐ. గూడ నాతోపాటు ఆగుచు ధైర్యము చెప్పుచు సహకరిస్తూ నావెంట నడచు చుండెను.

ఆ విధముగా మా చివరి పర్వత అవరోహణలో 2 గంటల ఎడతెగని ప్రయాసతోకూడిన ప్రమాదభరిత ప్రయాణము చివరి ఘట్టము పరిసమాప్తమాయెను. తవాఘాటు చేరితిని. కొందరు బస్సులవద్దను కొందరు హోటళ్ల వద్దను మాకై వే చియుండిరి.

నేను కూడా ఒక హోటలులో చేరి 'టీ' త్రాగి మిగతావారి రాకకై ఎదురుచూచుచుంటిని.

శ్రీ కులకర్ణి, ధావేగారలు, చాలా నీరసించి అలసి వెనుకబడిపోయిరి.

శ్రీ ధావేగారు ముందునకు సాగిపోయి ఎత్తుచోట కూర్చుండి 3½ గంటల వరకు కులకర్ణిగారికై నిరీక్షించుచుండిరి. అప్పుడే శ్రీ చొక్కారావుగారు గుర్రముపై వచ్చి చేరిరి. వారు పూర్తిగా అలసిపోయినందున వారిని హోటలు నందు పరుండబెట్టితిమి.

4½ గంటల వరకు ధావే కులకర్ణి గారలు పూర్తి కొండను దిగి బ్రిడ్జి వద్దకు చేర గానే గోడ్బోలే, చౌదరీగారలు ఎదురేగి భుజముల క్రిందగా చేతులు వేసి కర్ర వంతెనను దాటించి బస్సు వద్దకు చేర్చిరి.

మా బస్సు 4-40 ని.లకు బయలుదేరెను. ఉత్సాహపూరితముగా నినాదములు చేసితిమి. 'ధార్చులా' చేరితిమి. అచ్చట భోజనము చేయుటకు బదులు వేడి వేడి పకోడీలు కోరి చేయించుకొని ఆరగించితిమి. దాదాపు 4, 5 కిలోల పకోడీలు పెట్టినవి పెట్టినట్లు హారతి చేసితిమి.

నాడు 'పిథోరాగఢ్'' చేరి నిదురించు మా కలలు కల్లలాయెను. కొంత విశ్రాంతి తరువాత కాళ్లు చేతులు శుభ్రముగా కడిగికొని మా ప్రయాణమును నేపాలు దేశమందలి ఒక చిన్న గ్రామమునకు తీగవంతెనను దాటి చేరితిమి.

అక్కడ నేను కొన్ని పెన్నులు చెప్పులు చైనా వస్తువులను దాదాపు రు. 300-00 వి ఖరీదు చేసితిని.

మాతోడి వారుకూడ చాలా వస్తువులను కొనిరి.

ఆ పిదప తిరిగి మా క్యాంపు చేరుకొని దివ్యమగు భోజన మారగించితిమి. మాకు పెరుగు-చట్నీ- రెండు రకాల శాకములు మరియు చపాతీలు వడ్డించిరి. సుమారు నెల పిమ్మట ఇట్టి సంతృప్తికరమైన భోజనము మాకు లభ్యమాయెను.

అలసట కారణముగా త్వరగా నిదురలోనికి జారితిమి.

శ్లో. రా రామచంద్రం రఘుపతిం పిత్రాజ్ఞా పరిపాలనం
కౌసల్యాతనయం వందే రాకారాయ నమోనమః.
య యజ్ఞాయ యజ్ఞగమ్యాయ యజ్ఞరక్షకరాయ చ
యజ్ఞాంగ రూపిణే తుభ్యం యకారాయ నమోనమః.
ణా ణాకారం లోకవిఖ్యాతం నానాజన్మఫలప్రదం
నానాభీష్టప్రదం వందే ణాకారాయ నమోనమః.
య యజ్ఞకర్త్రే యజ్ఞభర్త్రే యజ్ఞరూపాయ తే నమః
సుజ్ఞానగోచరాయాఽస్తు యకారాయ నమోనమః.

ఓం ఓంకారమంత్రసంయుక్తం నిత్యం ధ్యాయంతి యోగినః
కామదం మోక్షదం తస్మై ఓంకారాయ నమోనమః.
నారాయణః పరం బ్రహ్మ నారాయణః పరం తపః
నారాయణః పరో దేవ స్సర్వం నారాయణ స్సదా.

(ఇతి వైష్ణవాష్టాక్షరీ స్తుతిః)



నిత్యం ధ్యాయంతి యోగినః
ఓంకారాయ నమోనమః.
నారాయణః పరం తపః
ర్వం నారాయణ స్సదా.
వైష్ణవాష్టాక్షరీ స్తుతిః)

స్కేలు 1అం= 9·6 మైళ్లు



మానస సరోవర తరంగములు రంగురంగుల రాళ్ళు ఏరుచున్న మిత్రులు.



మొదటి రోజు కైలాస పరిక్రమలో యాకులు వెనుక రాక్షసతాళ్



చొక్కారావుగారితో రాక్షసతాల్ గట్టున



బుద్ధి గుంజి మధ్య నది ఎడమ మనదారి, కుడికి నేపాల్‌వారి దారి.



తక్లాకోట విడిదిలో చైనీయులతో



మానస సరోవర గట్టున పూజాభిషేకములతో.



లిపు పాస్ వద్ద మంచుపై ప్రయాణము



మొదటి రోజు మానస సరోవర పరిక్రమ

# నలుబది ఒకటవ అధ్యాయం

## పురాణ కాలంనుండి - పురోగమనకాలం వరకు

శ్లో. త్రిదళం త్రిగుణాకారం త్రినేత్రం చ త్రియాయుధం
త్రిజన్మ పాప సంహారం ఏకబిల్వం శివార్పణమ్
త్రిశాఖై ర్బిల్వ పత్రైశ్చ హ్యచ్ఛిద్రైః కోమలై శ్శుభైః
శివపూజాం కరిష్యామి ఏకబిల్వం శివార్పణమ్.

☝ ఈ ప్రకరణము పాఠకులకు కొంత విసుగు కల్గించవచ్చును. కాని మన పురాణ ఇతిహాసములలో కైలాస మానససరోవర యాత్ర ప్రాశస్త్య ఔన్నత్యమును తెలుపుటేకాక - ఈ పవిత్ర పుణ్య క్షేత్ర దర్శనము ప్రతి హిందువునకు చాల ముఖ్యమనియు, జన్మసార్ధకము కాగలదనియు చెప్పబడెను. ఎటువంటి సదుపాయములు లేని నాటి కాలములో కూడ మన పూర్వులు ఈ కైలాసయాత్ర జరుపుచుండిరి. వారు దీని దర్శనార్ధం ఎంతెంత సాహసకృత్యములు చేసిరో ఎన్ని బాధలుపడిరో దర్పణములుగా గల మా అనుభవములను బట్టి ఊహించశక్యముగాకున్నది. నేటి సదుపాయాలున్న కాలంలో యాత్రచేసిన మేమే ఇన్ని బాధలకోర్చుకొని, కష్టములబడగా -ఇది మమ్ములను చూసి ఇతరులు గర్వించదగిన విషయము ఈ ప్రకరణ పఠనము అనంతరము ఉండదు.

స్వామి ప్రణవానందగారు ఆ యాత్రలో చేసిన పరిశోధనలో మా శోధన సూది మొనంతైనను కాదు. అయినను ఆ యాత్రకుగల ప్రాధాన్యత కూడ అందరికీ తెలియవలెనెడి ఉద్దేశ్యముతో విసుగు చెందక దీనిని చదువగలరను కోరికతో విపులముగా వ్రాయుచున్నాను.

వేద పురాణకాలమునుండియు ఆ మానస సరోవర కైలాసముల దర్శించి తప మొనరించిన వారు మన పూర్వులలో ఎందరెందరో ఉన్నట్లుగా పురాణగాధలచే తెలియజేయబడినది. సృష్టికర్త బ్రహ్మ, లయకర్త శివుడు, స్థితికర్త శ్రీమహావిష్ణువు అచ్చట తపమొనరించినట్లుగా గాథలున్నవి. అగస్త్యుడు, మరీచి, వశిష్ఠుడు మున్నగు మహర్షులు అచట నివసించు వారనియు చెప్పబడినది. శ్రీబహ్మదేవుడు ఆ (మానససరోవర) సరస్సును సృష్టించిన తరువాత, రాజహంస రూపంలో అందు ఈదెనట. కృత యుగంలో మాంధాత మహారాజు, త్రేతాయుగంలో రావణ బ్రహ్మ, ద్వాపరయుగంలో భీష్ముడు, కలియుగంలో శంకరాచార్యుడు ఆ కైలాస పర్వత ప్రాంతాలలో శివానుగ్రహప్రాప్తికై తపమొనరించిరి. రామాయణములో కైలాసమానస

సరోవర ప్రసక్తి కనబడుతుంది. 5050 సం॥ పూ. పాండవులు రాజసూయయాగము చేయు సందర్భమున అర్జునుడు ఆ ప్రాంతమును జయించి అక్కడి రాజుల వద్ద నుండి ఎన్నో కానుకలు తెచ్చినట్లుగా భారతములో వ్రాయబడి యున్నది. దత్తాత్రేయమహర్షి, వ్యాసమహర్షి, భీమసేనుడు దానిని దర్శించిన నిదర్శనములున్నవి. నరనారాయణులచటనే హంసలుగా మారి ఘోర తపస్సు చేసిరట. అశోక చక్రవర్తి క్రీ. పూ. 302 సం॥ లో తన సామంతరాజగు కత్యూరి నందదేవుని ఆ ప్రాంతమును చూసి. వచ్చుటకు పంపగా అతడు టిబెట్టును (హూణదేశము) జయించి తిరిగి వచ్చుచు కైలాసమును దర్శించినాడు. అతడు రెండవ సంవత్సరమున మరల కైలాస దర్శనము చేసినట్లు ఆధారములు కలవు. ప్రసిద్ధ చైనా యాత్రికుడు ''హ్యూవాన్‌సాంగ్'' కూడ తన రచనలలో కత్యూరి రాజు ఆ ప్రాంతమును పరిపాలించినట్లు వ్రాసినాడు. చైనాయాత్రికు లెందరో మానస ఖండము నుండి ఉంతాధురాపాస్ ద్వారా భారతదేశమును చేరి నలందా విశ్వవిద్యాలయములో బౌద్ధమతము నభ్యసించి ఆయా బౌద్ధ క్షేత్రములను దర్శించినట్లు మన చరిత్రలో గలదు.

జగద్గురువు ఆదిశంకారాచార్యుల వారు వారి జీవన సంగ్రహములో వారి ఆత్మ (దేహమును చాలించిన తర్వాత) ఆ కైలాసమునకు చేరినట్లు కొందరు చారిత్రకులు తెల్పిరి. 'గేవా గోజంభా'' యను నతడు ప్రథమముగా కైలాస మానసపరిక్రమను కనుగొన్నట్లుగాను తరువాత భారతదేశము నుండి ఏడుగురు శాస్త్రజ్ఞులు అచటికి వెళ్ళి 'ఖోచార్' దర్పణమొసగి ఆ రాజునుండి ఏడెత్తుల బంగారమును బహుమతిగా పొంది కైలాస మానసములను దర్శించినట్లుగా తెలుపబడినది. అచార్య ''క్షంతరక్ష'' గురుపద్మ సంభవులు కూడ ఆ ప్రదేశమును దర్శించిరట. ప్రథమ తీర్థంకరజైన వృషభదేవుడు కైలాసమునందే నిర్యాణము చెందినట్లు తెలియును. క్రీ. శ. 1027 లో కాశ్మీర సోమనాథ పండితుడు ఆ ప్రదేశమును తిలకించి ''కాలచక్ర జ్యోతిష'' మను గ్రంధమును టిబెట్టు భాషలోని కనువదించినట్లును వీరి వెంట పండిత ''లక్ష్మీకరులు'' మరియు ధనశ్రీ చంద్రరాహుల్ వెళ్ళినట్లుగా తెలియుచున్నది. పదకొండవ శతాబ్దిలో ''సిద్ధమూరిపా''యను టిబెట్టు కవి - మానస ఖండములో చాల ఏండ్లు నగ్నముగ తపస్సు చేసినట్లును లక్షల గేయములను రచించినట్లు కైలాస పురాణ గాధలు తెలియజేయును. ఆచార్య ''దీపంకరశ్రీ'' జ్ఞానులు విక్రమశిల విశ్వవిద్యాలయమునుండి ''ఛాంగ్‌ఛుపో'' యను టిబెటురాజు ఆహ్వానముపై క్రీ. శ. 1042 సం. ప్రాంతమున వెళ్ళి అచట బౌద్ధమతము నుపదేశించి టిబెటు భాషలో అనేక పుస్తకముల ననువదించి మానస ఖండమును తిలకించి ప్రస్తుత ''గుసుల్ గొంపా''లో ఒక వారముండి మరొక వర్షాకాలమును ''ఖోచర్‌నాథ్'' లో గడిపినట్లుగా ఆయనయొక్క టిబెటు దేశ శిష్యుడు ఆ ఆచార్యుని జీవిత గ్రంథములో

తెలిపియుండెను. ఆ ఆచార్యుడు వాడిన వస్తువులు ఆయనపైగల గౌరవము భక్తిచే మొన్నమొన్నటి వరకు డోల్మాపాస్‌న గల ''నిథాంగ్ గొంపా''లో భద్రపరచినట్లు కూడ అందులో వివరించెను. ఈ దీపంకరుని టిబెటనులు ఆదిబుద్ధుని అవతారముగా నేటికిని ఆరాధించుచున్నారు.

16వ శతాబ్దిలో అక్బరు చక్రవర్తి మహా పవిత్రమైన గంగానది ఉత్పత్తి స్థానమును నిర్ణయించుటకు ఒక బృందమును ఆ ప్రదేశమునకు పంపగా వారు మానస సరోవరమును పరిక్రమించి సట్లెజ్ బ్రహ్మపుత్ర నదులు మానస సరోవరమునుండి పుట్టినట్లును సరయునది రాక్షసతాళ్ సరస్సు నుండి పుట్టినదనియు తె లిసికొనిరని చరిత్రలో కలదు.

క్రీ. శ. 1625 ప్రాంతమున పోర్చుగీసు క్రైస్తవుడు ''ఆంటోనియో'' ఆ పర్వతములోని ''మానాపాస్'' కనుమ ద్వారా ''ఖాబ్రాంగ్''కు చేరి అచట ఒక చర్చి నిర్మించుటకు పునాదిరాయి వేసినట్లుగా కూడ తెలుపబడినది. ''రామ చరిత మానస్'' గ్రంథములో గోసాయి ''తులసీదాసు'' మానస సరోవర ఖండమును ద ర్శించి కైలాస శిఖరమువద్ద శివపార్వతులు పెద్ద మఱ్ఱి వృక్షము క్రింద కూర్చుండి తపమాచరించినట్లుగా నుడివిలట్లు, వ్రాయబడెను.

ఆ మానస ఖండ యాత్రికులను టిబెట్‌లో దొంగలు దోపిడీలు చేసి నానా యిక్కట్లకు గురి చేయుచుండిరి. ఆ సంగతిని కుమాయూన్ మండల మహారాజాగారైన ''రాజా బాల్ బహదూర్ చంద్''. ఆ టిబెట్టు దేశమును జయించి మానసఖండ్ దర్శించి టిబెట్టుకు పోయే దారులన్నిటిపై ఆధిపత్యము వహించి భారతదేశ వ్యాపారులపై టిబెటనులు వసూలు చేయు సుంకము లన్నింటిని రద్దుచేసినట్లుగా తెలియుచున్నది. దొంగలబాధ కలుగకుండ టిబె టనులతో ఒడ ంబడిక చేసిరి. కాని తరువాతవారు యధాప్రకారముగా పన్నులు వసూలు చేయుచుండిరి. ఆ మహారాజ మానసఖండ్ యాత్రీకులకు ఉచిత వసతి వస్త్ర భోజన సౌకర్యములకై అయిదు గ్రామముల ఆదాయమును ప్రత్యేకించి నట్లు తెలుపు ఒక రాగి ఫలకము ఇటీవల లభించినది.

క్రీ. శ. 1715 లో రోమన్ క్యాథలిక్ ఫాదర్ (క్యాథలిక్ క్రిష్టియను మత ప్రచారకుడు) ''డెసిడెరి'', ''ఫెర్రి'' యను వానితో ''లేహ్'' (పట్టణము) ద్వారా ''లాసా'' కు పోయి అచట నుండి మానస ఖండ్ చేరుకొని గంగానది, సింధునది, సట్లెజ్ నదులు ఆ ప్రాంతము నుండియే వెలువడినవని వ్రాసిన నిదర్శములు కలవు. కాని వాగా నదుల సరియగు జన్మ స్థలములను చూపలేక పోయిరి. క్రీ. శ. 1717 లో చైనా చక్రవర్తియైన ''కంగ్‌హి'' కూడ ఆ ప్రాంత విశేషముల అధ్యయనములకు

కొందరు హోన్ లామాలను పంపెను. క్రీ. శ. 1770 ప్రాంతములో బ్రిటిషు ఇండియా గవర్నర్ జనరలు అయిన ''వారన్ హేస్టింగ్స్'' కూడ ఆ మానస ఖండ్ ప్రదేశములను పర్యటించి ఆ నదుల పుట్టుకను కనుగొనెను. క్రీ.శ. 1770-1780 మధ్య కాలంలో ''ఊర్ధ్వ బాహు''డను సన్యాసి బాల్స్ బుఖారా, సమర్‌ఖండ్, లాసా చైనా మున్నగు ప్రదేశములలో పర్యటించి బ్రహ్మ పుత్ర నది మానస సరోవరము నుండి, సరయునది, రాక్షసతాళ్ సరస్సు నుండి ఉద్భవించినదని తెలిపి యుండెను.

''మూర్ క్రాఫ్టు'' మరియు ''హెర్సే'' యనువారీ మానస ఖండ్‌ను దర్శించి ''దేవసింగ్'' అనే అనుభవజ్ఞుడైన స్థానిక పట్వారీ సహాయముతో ఆ ప్రదేశమంతయు తిరిగిరి. 1841 సంవత్సరములో జనరల్ ''జొరావర్ సింగ్'' పడమటి టిబెటును జయించి తరువాత చైనీయులచే హతుడయ్యెను. 1886 లో ''కెప్టెన్ హెన్రీ స్ట్రెచ్'' అనునతడు ధర్మాపాస్ కనుమ ద్వారా ఆ ప్రాంతమును జేరి రాక్షసతాళ్, ఛియుగొంపా. ధర్మయాన్తి, గంగాఛూ లను చూచి వచ్చెను. గణేశ స్వామియను విశాఖ వాస్తవ్యుడగు బ్రాహ్మణుడు 1850 ప్రాంతమున కాశిలో సిద్ధత్రైలింగ స్వామిగా పేరొంది అనేకసార్లు మానస ఖండ్‌ను దర్శించి దాదాపు 280 సంవత్సరములు బ్రతికినట్లు గాను 1887లో పరమపదించినట్లుగను చెప్పెదరు. 1865లో కెప్టెన్ హెచ్. ఆర్. స్మిత్ ; ఏ. యస్. హారిసన్ అనువారలిరువురు అచటికి వెళ్ళి తార్చెన్ (దార్చెన్) చెర్కిస్ గొంపా నుండి గోర్టాక్ ద్వారా తిరిగి వచ్చిరి. అదే సంవత్సరము ''ఆడ్రియస్ బెన్నెట్'' అను నతడు కూడ యాత్ర చేసి వచ్చెను. 1856లో సర్వే ఆఫ్ ఇండియా ఆఫీసునుండి కొందరు సర్వేచేయుటకై వెళ్ళి ఆ ప్రదేశములను పూర్తి సర్వే చేసి పై నదుల పుట్టుకలను స్థిరీకరించిరి. జపాను దేశ బౌద్ధులు కూడ 1900 సంవత్సర ప్రాంతమున 'మానస ఖండ్'' దర్శనము చేసి ఆయా నదుల ఉనికిని కనుగొనిరి.

క్రీ. శ. 1907 - 1908 సంవత్సర ప్రాంతమున ఒక స్వీడిష్ ఔత్సాహికుడు స్వీడన్ దేశ రాయబారి) డాక్టర్ ''స్వెన్ హెడిన్'' అనునతడు లడక్ ద్వారా మానస ఖండమును చేరి ఆ సరోవరమున కాన్వాసు పడవలో పయనించి సరస్సులోని విశేషములను తెలిసికొని కైలాస్ ప్రాంత నదుల జన్మస్థలములను కనుగొన్న ప్రథమ యూరపు దేశస్థుడుగా గుర్తింపు బొందెను. ఆయన రెండు సంవత్సరములా ప్రదేశములో వసించి సంపూర్ణ అనుభూతి పొంది సాగించిన రచనలు 1. ''ట్రాన్స్ హిమాలయా'', 2. ''స్వర్ణ టిబెటు'' మొదలగు - గ్రంథములు చాల ప్రఖ్యాతమైనవి. ఇవే కాక ఆయన చాల ముఖ్యమైన నదుల రేఖా పటములను కూడ తయారు చేసెను. వీరి పుస్తకములలోని రచనలు మనోరంజకముగను అద్భుతముగను హాస్యముగను పఠనీయములై యున్నవి. అతని ఈ సాహస కృత్యములవలన టిబెటు దేశస్థులకే గాక మనదేశీయులకు కూడ చాల ఉపయోగము జర్గినది. సర్వే ఆఫ్ ఇండియా

డిపార్ట్‌మెంటు ప్రధాన కార్యాలయములో నేటికిని వీరి పటములను పెట్టి గౌరవించుచున్నారు. ఈయన రచనలు ఖగోళ శాస్త్రజ్ఞులకు సాహసికులకు అన్వేషకులకు యాత్రీకులకు కూడ ఉపయోగకరములై యున్నవి.

1908 లో బొంబాయి వాస్తవ్యులు ''హంసస్వామి'' మానస ఖండ్‌నకు ''లిపుపాస్'' ద్వారా వెళ్ళి అచట పన్నెండు దినములుండి తన అనుభవములను మరాఠి భాషలో నొక పుస్తకము వ్రాయగా ఆయన శిష్యుడైన ''పురోహితస్వామి'' ఆ గ్రంథమును ''హోలీ మౌంటె న్'' (పవిత్ర పర్వతము). అని పేరు పెట్టి ఆంగ్ల భాషలోనికి అనువదించెను. ఇందులో వారు ''గౌరీకుండ్''లో దత్తాత్రేయుని ప్రత్యక్షముగా గాంచినట్లును, ఇంకను ఆయన తన 15 గంటల ప్రయాణమును 15 నిముషాలలో పూర్తిచేసినట్లును ఇంకను ఎన్నో మహిమలు గల గాధా విషయములను, తెల్పిరి. 1924లో శ్రీ ప్రణవానందస్వామిగారి గురువులు 108వ శ్రీ జ్ఞానానందజీ మహారాజుగారు, తన దేహముపై కౌపీన మొక్కదానితోనే కైలాస్ మానస యాత్ర చేసి వచ్చిరి. 1922 లో లాహోరు పట్టణమునకు చెందిన ''రాయ్‌బహదూర్ కశ్యప్''గారు 1926లో ''హగ్ రుట్లెడ్జు''గారును 1927లో శ్రీ జయేంద్రపురి మండలేశ్వర్ తన 25 మంది శిష్య సాధువులతోడను 1929 లో కేరళ నుండి శ్రీ తపోవన్‌జీ మహారాజ్ గారును మానస ఖండ్‌ను దర్శించినట్లుగా తెలియుచున్నది.

1931లో మైసూరు మహారాజు శ్రీ కృష్ణరాయ ఒడయార్ బహద్దుర్ గారు సతిమణియైన శ్రీమతి సుర త్కుమారదేవి రాణితో సహా ''దండీ'' (పల్లకీ) సహాయమున మానస సరోవర యాత్ర జరిపినట్లును వారి వెంబడి ''శ్రీస్వామి శివానంద్‌జీ'' గారు, శ్రీ స్వామి ''అద్వైతానందజీ'' గారులు కూడ యాత్రలో పాల్గొనినట్లును ఆధారములు గలవు. 1933లో స్వామి శ్రీ కృష్ణమాచారిగారు మానస ఖండ్‌ను దర్శించి వచ్చుచుండగా మన దేశము చేరుటకు రెండురోజుల ప్రయాణ వ్యవధి ఉన్న ప్రదేశములో బందిపోటు దొంగలచే వధింపబడిరి. 1933 లో శ్రీ శ్యామ్ ప్రసాద్ ముఖర్జీ సోదరుడైన శ్రీ ఉమాప్రసాద్ ముఖర్జీ యాత్ర చేసిరి. 1937లో బ్రహ్మచారి ''ఓం సత్యం'' గారు తీర్థపురిలో ఒక సంవత్సరకాలముండి మానస పరిక్రమలో మంచుపై కాలుమోపగా క్రిందగల నీటిలో మునిగిపోయి దివంగతులైరి. అదే సంవత్సరములో శ్రీ నారాయణస్వామిజీగారు గుజరాత్‌లోని తమ స్త్రీ శిష్య బృందముతో సహా మానస ఖండ్ దర్శించి పరిక్రమ చేసినారు. 1938 సంవత్సరములో శ్రీ ఆనందమయిజీ వారును 1935 నుండి 1941 వరకు ఏడు సంవత్సరములుగా శ్రీ నారాయణా శ్రమ ఆధిపతిగా ఉన్న నారాయణస్వామి వారును వారి భక్త శిష్యబృందమును కలసి ప్రతి సంవత్సరము

కైలాస యాత్రను జరిపినారు. వీరు మానస సరోవరము ప్రక్కన ''మానసవిశ్రమశాల'' నిర్మించుటకెంతో ప్రయత్నము చేసిరి. 1941లో శ్రీ కైవల్యానంద్‌జీగారు ఈ యాత్ర జరిపిరి.

''బార్‌వెల్లి'' గారు 1941 సంవత్సరములో తమ మిత్ర బృందముతో ఖోచార్ నాథ్ తీర్థపురి నుండి మానసఖండ్‌ను పరిక్రమించిరి. 1943-44లో ఒక లింగాయతుడు ''శ్రీకైలాస్‌శరణ్'' అను కర్ణాటకుడు వందసార్లు కైలాస పరిక్రమ పన్నెండు సార్లు మానస పరిక్రమను పూర్తి చేసిరి. అట్లు చేయుట కొందరు స్థానిక లామాలకే అసాధ్యము. 1934లో టి. యస్. కృష్ణస్వామి, శ్రీ కల్యాణసుందరముగారు ఈ రెండు పరిక్రమలను పూర్తిచేసి వచ్చిన ప్రథమ తమిళులు. 1945 సంవత్సరములో ''సలీం ఆలీ'' యను బొంబాయి వాస్తవ్యుడు సర్వే చేయుట గురించి ఆ ప్రాంతములకు పోయెను. అదే సంవత్సరము ఆంధ్రదేశమునుండి శ్రీమతి లోపాముద్రయను నామెయు ఆమె సహచరురాలును గుంటూరు పట్టణము నుండి ఆ యాత్రను జరిపిన ప్రథమాంధ్ర స్త్రీలు. మహాత్మాగాంధీగారి అస్థికలు 1948 ఆగష్టు 8వ తేదీన మానస సరోవరములో వారి సన్నిహిత మిత్ర బృందముచే నిమజ్జనము గావించబడెను.

శ్రీ ప్రణవానంద స్వామి గారు తూర్పు గోదావరి జిల్లా వాస్తవ్యులు వీరు 1896 జన్మించిరి. వీరి అసలు పేరు ''కనకదండి వెంకటసోమయాజులు''. వీరు 1919లో లాహోరు కాలేజీలో పట్టభద్రులైరి. కొద్దిరోజులు రైల్వేలో ఉద్యోగముచేసి అది గిట్టక రాజీనామా చేసి గాంధీగారి అధ్వర్యములో జరుగుచున్న సహాయ నిరాకరణోద్యమములో పాల్గొనిరి. దేశభక్తి మానవ ప్రేమ సేవాభావములు వారికి పిత్రార్జితములు. 1920-1926 వరకు వీరి జిల్లాలో వీరు ప్రముఖ కాంగ్రెసు కార్యకర్తగా నుండిరి. తరువాత వీరు పూర్తిగా భక్తి మార్గములోనికి దిగి హిమాలయ పర్వత శ్రేణులలో పర్యటించి సత్యాన్వేషణాభిలాషియై స్వామి ఆచార్య నూటఎనిమిదివ జ్ఞానానంద మహారాజ్‌గారి వద్ద ఉపదేశము పొందిరి. ఈ స్వామి ఆచార్యగారు 'బెర్లిన్', బ్రిస్‌బెన్', 'పెరాగు', 'లివర్‌పూల్' మున్నగు విదేశ పట్టణాలలో పదిహేను ంవత్సరములు స్థూల, ద్రవ్య, సాకార, ఇంద్రియ గోచర, శరీరముల రిశోధనాగారాలలో పరిశోధకునిగా పనిచేసిరి. ఇవేకాక ఈ ఆచార్యులవారు ''ఎక్స్-రే'', ''బీటా-రే'' అయస్కాంత ఐసోటోప్, న్యూక్లియర్ ఫిజిక్సు మున్నగు భౌతిక స్త్రవిషయముల పైన గూడ పరిశోధనలు సాగించిరి. వీరు ఢిల్లీలోని నేషనల్ జికల్ లేబొరేటరీలో అనుభవజ్ఞుడైన ఆఫీసరుగా పనిచేసిరి. ఇట్టి ప్రసిద్ధ ఆచార్యుల ారు సన్యాసము తీసుకొని స్వామి ఆచార్యగా పిలువబడుచుండిరి. కనకదండి

సోమయాజులు గారు ఆ స్వామి ఆచార్యగారి వద్ద ఉపదేశము పొంది సన్యాసాశ్రమమును స్వీకరించి ప్రణవానందస్వామిగా పేరు మార్చుకొనిరి. స్వామి ఆచార్యగారి వద్ద వీరు కొన్ని భౌతిక దైవజ్ఞాన సత్యములను గ్రహించిరి.

తరువాత శ్రీ ప్రణవానందస్వామివారు ఇరవైమూడు సంవత్సరములు హిమాలయ ప్రాంతములో ఆత్మ సంబంధమగు విషయముల ''సాధనకు'' పాటుపడిరి. ఆ సమయములోనే హిమాలయ పర్వత భూగోళ సంబంధ శాస్త్రాధ్యయనము కూడ జరిపియుండిరి. వీరు గంగోత్రిలో గుడి తలుపులను మూసి వేసిన తర్వాత ఒక్కరు లోపలనే వుండి సంవత్సరము ఒంటరిగా గడిపిరి. (గంగోత్రిలో దేవాలయమును సంవత్సరమున కొకసారే తెరచి కొన్ని దినములు మాత్రమే దర్శనము కొరకై విడిచి మూసివేయుదురు. మరల సంవత్సరమునకే దాని తలుపు తీయుదురు.) వీరు ''గోముఖి'' యొక్క మంచు ప్రదేశమగు ''గంగోత్పత్తి'' స్థావరమును అనేక పర్యాయములు దర్శించిరి. 1928లో కైలాస మానస సరోవరములను మొదటిసారి ''లేపూ ద్వారా'' దర్శించివచ్చిరి. అప్పటినుండియు వీరు ప్రతి సంత్సరమును తప్పకుండా మానస సరోవర ప్రాంతమునకు యాత్రలు చేయుచుండిరి. ఆరు మాసములు మొదలు పదహారు మాసముల వరకు నీరు ఘనీభవించి ఆ ప్రాంతమంతయు మంచుగడ్డగా మారి ఏ జీవియు జీవించడానికి వీలుగాని వాతావరణములో గూడ ఆయన అచటనే యుండిరి. వారు భూగోళ, భూగర్భ, వృక్ష, జంతు, పురాతత్వ, శాస్త్రములలో ఆ ప్రదేశమున పరిశోధనలు జరిపిరి. వారు మన దేశమునుండి కైలాస్‌కు గల దాదాపు అన్ని మార్గముల నుండి ప్రయాణములు చేసిరి. వారు మానస, రాక్షసతాళ్ సరస్సులు ఘనీభవించి గడ్డకట్టిన స్థితిలో కూడ అచటనే యుండి ఆయా సరోవరములలో ఆ సమయములలో కలుగు సమస్త పరిణామములను పరిశోధించి ఆ మంచు సరోవరములపై పర్యటించియున్నారు. వారి ధైర్య సాహసములు, ఓర్పు, కౌశల్యము, సాధన, కృషి, జిజ్ఞాస, శ్రద్ధ, అన్నింటిని మించి ఆత్మ స్థైర్యము మానవ మాత్రునికి ఉహించుటకు కూడ శక్తికి చాలనివిగా చెప్పకొనవచ్చును. వారు కైలాస పర్వతమును 23 సార్లు మానస సరోవరమును 25 సార్లు పరిక్రమించి ప్రపంచములో వారికి ఎవ్వరు సాటిరారని నిరూపించిరి. వారు చాల గొప్ప సాధకులు, దైవత్వము మూర్తీభవించినవారు.

శ్రీ ప్రణవానంద స్వామివారు టిబెటనులకు చిరపరిచితులు. వారు అచటి ప్రభుత్వోద్యోగుల చేతను, లామాలచేతను, చివరికి మామూలు ప్రజల చేత కూడ ఎంతగానో ప్రేమించబడి, గౌరవించబడిరి. వారు ధనిక బీద భేద భావములేక అందరు జనులకు మందులనిచ్చి వైద్యము చేయుచు ఇతర సలహాల నొసగుచు ప్రజాసేవ

చేసిరి. వారు ''డా॥ స్వెన్ హెడిన్''గారు నిర్ధారించిన నాల్గు నదులను సరియైనవిగా నిర్ధారణ చేయుటే కాక వాని యొక్క జన్మస్థానములను కిలోమీటరు కొలతలతో సహా ఏది ఎచట ఉద్భవించుచున్నదో సరిగ్గా నిర్ధారణ చేసిరి. దీని వలన ప్రపంచములోని భూగోళ శాస్త్రజ్ఞులకు హిమాలయ పరిశోధకులకు జిజ్ఞాసాపరులకు నూతనోత్సాహము కలిగినది. పైగా వారు భారతదేశము నుండి ఏ ఏ మార్గములద్వారా కైలాస మానస సరోవరములు ఎంతెంత దూరములో యున్నవో, ఎంత ఎత్తు నుండి పయనించాలో నిర్దిష్టముగా పటములద్వారా తెలియజేసి యాత్రీకులకు ఎనలేని ఉపకారము చేసి యున్నారు. వారి యొక్క అమూల్యమైన కృషికి ఫలితముగా లండన్‌లోని ''రాయల్ జియోగ్రఫికల్ సొసైటీ'' మరియు ''సర్వే ఆఫ్ ఇండియా'' పటములలో సర్వేయర్ జనరల్ గారి గుర్తింపు పొందినవిగా, మన్ననలందినవిగా చేర్చబడినవి.

శ్రీ ప్రణవానందస్వామిగారు సాంకేతిక నిపుణులు కాకున్నను భూగోళ శాస్త్రజ్ఞులు కాకున్నను, ఏ ఇతర యూరోపియనులకు తీసిపోనట్టి శాస్త్రీయ పరిశోధనలు గావించి స్వదేశ ఔత్సాహికులకు, మార్గదర్శకులు కాగల్గిరనుటలో సందేహము లేదు. వారి రచనలు కొన్ని లండన్‌లోని ''రాయల్ జియోగ్రాఫికల్ సొసైటీ'' వారును, కలకత్తా ''జియో గ్రాఫికల్ సొసైటీ'' వారును వారి ''రివ్యూ''లలోను '' ఇండియన్ జియోగ్రాఫికల్ జర్నల్స్''లోను ఉన్నత ప్రమాణములు గలిగిన ఇతర పత్రికలలోను ప్రచురితముచేసి వారి ఆమోదముద్ర వేసిరి. వారు కలకత్తా విశ్వవిద్యాలయములో ''టిబెటు పరిశోధన''పై నొసగిన ఒక ఉపన్యాసము ''డా. లాంగ్ స్టాఫ్'' మరియు ''డా. సోమర్‌వెల్'' అను భూగోళ శాస్త్రజ్ఞుల మన్ననల బడసెను. వారు "Pilgrims Companion to the Holy Kailas & Manas Sarovar" (కైలాస మానస సరోవర యాత్రీకుల మార్గదర్శి) అను పుస్తక రచనను ఇంగ్లీషు భాషలో ప్రచురించిరి. తరువాత దానిని విశదీకరించుచు "Kailas Manas Sarovar" (కైలాస్ మానస సరోవర్) అను మూడు వందల పేజీల గ్రంథముగా విస్తరించి ప్రచురించినారు.

ప్రస్తుతము ఆ గ్రంథములో కైలాస మానస సరోవరములతోపాటు టిబెటు యొక్క పూర్తి వివరములు అనగా పౌరాణిక, సాంఘిక శాస్త్రీయ, మతపరమైన ఆయా వివరణ లన్నియు లభించును. వీని అనువాదములు గుజరాతి, తెలుగు, బెంగాలీ, మరాఠీ, తమిళం, కన్నడ భాషలలో రానున్నట్లుగను తెలిసినది. వారు తెలుగులో వెయ్యి పేజీల''శ్రీమద్భగవద్గీత'' పై టీకా తాత్పర్య అనువాదము చేసిరి. వారు ''జన్మ భూమి'' మరియు ''జ్ఞాననౌక'' యను పడవలలో మానస సరోవర

రాక్షస తాళ్ గౌరి కుండ్‌లలో పర్యటించి పలురకములైన భూగర్భ పరిశోధనలు జరిపి వాని లోతుపాతులను చుట్టు కొలతలను నిర్ధారించిన ప్రథములు. టిబెటనులు కూడ వారు చేసినంతగా పరిక్రమలు చేయలేదు. వారు ఏ భారతీయుడు చేయలేని కైలాస ఉత్తర దక్షిణ పీఠ భాగములలో ''ఖాండో సంగ్లమ్ పాస్'' ద్వారా ఏకాంతముగ పరిక్రమ చేయుటేకాక ఇతర మూడు ''పాస్'' (కనుమ)లను కూడ పరిశోధించి వానిద్వారా 18,000 అడుగుల ఎత్తైన భూభాగముపై ప్రయాణించుట ఎంతో సాహస భరిత ప్రమాదచర్యయనుటలో సందేహములేదు. వారు అచటి అతి పురాతన భూశిలలు తెచ్చి పరీక్ష చేయించగా అవి పందొమ్మిది కోట్ల సంవత్సరముల అతి పురాతనమైన శిలలని నిర్ధారించిరి. వారు బీడుపడియున్న ''భూగుహ''ను కూడ- ''పాంగ్థా''లోనున్న దానిని పరిశీలించుటేకాక వందల సంఖ్యలో శిలలను ఎముకలను పురాతన లోహ పదార్థములను మూలికలను పరీక్ష నిమిత్తమై తెచ్చిరి. వారు మానస రాక్షసతాళ్ సరస్సులమధ్యగల ప్రదేశములో బంగారము కలదనియు ఆ ప్రాంతములో రేడియోధార్మిక శక్తిగల లోహములున్నట్లుగను కూడ కనుగొని యున్నారు.

శ్రీ శ్రీ శ్రీ ప్రణవానందుల వారి సేవలను మన విశ్వవిద్యాలయములు ఉపయోగించుకొన వచ్చును. స్వామిగారు కర్మయోగి, ఆత్మజ్ఞాన సాధకులు, పరిశోధకులు, శాస్త్రవేత్తలు, చరిత్ర కారులు, సాహసికులు, హఠరాజ యోగముల తెలసిన తాపసి. ప్రస్తుతము వారు ఉత్తర ప్రదేశ్‌లోని పిథోరాగడ్ జిల్లాలో స్థిర నివాస మేర్పరచుకొని తొంభై సంవత్సరముల వయస్సులో కూడ పుస్తకముల పరిశోధనల మధ్యనే కాలము గడుపుచున్నారు. అపుడపుడు సాంస్కృతిక ధార్మిక యజ్ఞ యాగాదులను ఆలయ నిర్మాణములను శాస్త్ర సాంకేతిక సమ్మేళనములను, సందర్శించి సందేశముల నిచ్చుచున్నారు. ఇంతటి మహానుభావుని దర్శించి ముచ్చటించి వారి ఆశీర్వాదములు పొంది వారితో ఫోటోలు కూడ దిగ డి భాగ్యము నాకు నా మిత్రులకు కలిగినందులకు చాల సంతోషభరితులమైతిమి. ఒక్క మాటలో చెప్పవలెనన్నచో వారు పరిశోధించనివి వారి దృష్టిని పడనివి ఏ మతము, ఏ శాస్త్రము, ఏ పురాణమును లేదని చెప్పవచ్చును. 1962 సంవత్సరము తరువాత వారు మానస సరోవరము పోయినట్లు కన్పించదు. ఈ గ్రంథ ద్వితీయ ముద్రణ 1998 లో జరుగు చున్నది శ్రీ ప్రణవాలందులవారు వారి 99వ యేట అనగా 3 సం॥ ల పూర్వం పరమపదించిరని తెల్యచేయుటకు చింతిస్తున్నాను. కీ. శే. శ్రీ ప్రణవానందుల వారి ఆధ్వర్యంలో, రాజమండ్రికి 20 Km ల దూరములో గల ''మందపల్లి '' లోని ప్రఖ్యాత శనేశ్వర దేవాలయమునకు సమీపంలో ఆలయము నిర్మించి అరుదైన శిలా ''శ్రీ చక్రము'' ను ప్రతిష్ఠించిరి. అమోఘమైన, శక్తి, మహిమ ఆ శ్రీ చక్రమునకు కలదని ప్రస్తుతింతురు. నాకును 1996 లో ఆ ఆరామ

దర్శన భాగ్యం కల్గినది - ప్రతినిత్యం పూజా నివేదనలు క్రమంగా జరుగుచున్నవి - ఇంతటి ఘన కీర్తి వహించిన కీ॥ శే॥ శ్రీ ప్రణవానందురవారు ఆంధ్రుడగుట మనకెంతయో గర్వకారణముకదా!

1983లో దాదాపు 6,000 మంది దరఖాస్తు చేయగా 200 మంది నియుక్తులై వారిలో దాదాపు 150 మంది వరకు మాత్రమే ఈ యాత్ర సలిపి తిరిగి వచ్చిరి. అందులోని నాల్గవ బృందములో నేను ఆ కైలాస మానస సరోవర సందర్శనము చేసి వచ్చిన కొలది అనుభవములను ఈ పుస్తక రూపమున ప్రచురితము గావించుటకు కృషి జరిపితిని. ఏ బృందములోను యాత్రికులు మరణించలేదు. ఒక సహ యాత్రికుడు మరణించిన ప్రథమ బృందము మాదే. ఈ రచన సాగించు సమయమువరకు ఏడవ బృందములో 21-9-1983న ఇరువురు మరణించిన దుర్వార్త తెలిసినది. ఆ యాత్రలో మరి ముగ్గురు యాత్రీకులు మంచు తుఫానుచే త్రోవ తప్పి, అతి కష్టముతో ఢిల్లీకి చేరిరట. కాగా 8వ బృందమువారు "లిపుపాస్" వరకు వెళ్లి వాతావరణ మనుకూలించక యాత్ర పూర్తి చేయకుండానే తిరిగి రావలసి వచ్చినది.

ఇట్లు ఎందరో మహానుభావులు పురాణ కాలం నుండి నేటివరకు ఈ పవిత్ర యాత్ర చేసినవారు చిరస్మరణీయులై యున్నారు.

శ్లో. అఖండబిల్వపత్రేణ పూజితే నందికేశ్వరే
శుధ్యంతి సర్వపాపేభ్యః ఏకబిల్వం శివార్పణమ్.
సాలగ్రామ శిలా మేకాం జాతు విప్రాయ యోఽర్పయేత్
సోమ యజ్ఞ మహాపుణ్యం ఏకబిల్వం శివార్పణమ్.



# నలుబది రెండవ అధ్యాయం

## మన దేశము నుండి కైలాస - మానస సరోవరమునకు గల దారులు

శ్లో. దంతి కోటి సహస్రాణి వాజపేయ శతాని చ
కోటి కన్యామహాదానం ఏకబిల్వం శివార్పణమ్.
పార్వత్యా స్స్వేదతోత్పన్నం మహాదేవస్య చ ప్రియం ।
బిల్వవృక్షం నమస్యామి ఏకబిల్వం శివార్పణమ్.

(1) ఢిల్లీ నుండి బస్సు ద్వారా మురాదాబాద్ రాంపూర్ రుద్రపూర్ టనక్ పూర్ పిథోరాగడ్ ధార్చులా తావాఘాట్ వరకు బస్సు సౌకర్యము గలదు. అచటి నుండి దార్చ్యాంగ్ కాలాపానీ లిపుపాస్ నుండి తక్లాకోట్ ద్వారా 880 కి.మీ. దూరము; 16,750 అడుగుల ఎత్తు దాటుట. ఈ మార్గమే మిగతా మార్గములకంటె సులభమై సురక్షితమైన మార్గమని దీని ద్వారానే ఎక్కువ మంది యాత్రీకులు ప్రయాణము చేయుదురు. భారత ప్రభుత్వ విదేశాంగ శాఖ వారు ఈ దారినే యాత్రా బృందముల పంపుచున్నారు. మేమును ఈ మార్గముననే అచటికేగి వచ్చితిమని మీకు చెప్ప పనిలేదు.

అల్మోరా పెద్ద పట్టణము. పూర్వము అచటివరకు బస్సులుండెను. అచటి నుండి నడచివెళ్ళవలసి యుండుటచే ఆ మార్గ వివరములు క్రిందనీయబడినవి.

(2) ఆల్మోరా ఆస్కోట్ ఖేలా ధార్మాపాస్ ద్వారా గ్యానిమా మండి ద్వారా 18,510 అడుగుల ఎత్తుగల ప్రదేశము ద్వారా మార్గము; దూరము 365 కి.. మీటర్లు.

(3) ఆల్మోరా భాగేశ్వర్ మిలామ్ ద్వారా ' ఉంతాధురాపాస్' (17,590 అడుగుల ఎత్తు) నుండి ''జయంతిపాస్'' (18,500 అడుగుల ఎత్తు) ద్వారా ''కుంగి బింగ్రిపాస్'' (18,300 అ. ఎత్తు) ద్వారా జ్ఞానిమా మండి; దూరము 340 కి. మీటర్లు.

(4) 'జోషిమఠ్' నుండి దుంజన్ నితిపాస్ (16,400 అ. ఎత్తు) ద్వారా 'తోజన్ లా పాస్' (16,350 అ. ఎత్తు) ద్వారా 'సిచ్చిలిమ్ మండి', ' గ్యానిమామండి' ద్వారా; దూరము-260 కిలోమీటర్లు.

(5) ''జోషి మఠ్'' నుండి ''గుంలానితిపాస్'' (16, 600 ఎత్తు) ద్వారా 'నంబ్రామండి' 'సిచ్చిలిం మండి' 'గ్యానిమామండి' ద్వారా; 320 కిలోమీటర్లు.

(6) 'జోషీ మఠ్' నుండి హోటినితి పాస్ (16, 400 అ. ఎత్తు) ద్వారా 'గ్యానిమామండి' మీదుగా; 260 కిలోమీటర్లు.

(7) 'బదరీనాథ్' నుండి 'మానాపాస్ (18,400 అ. ఎత్తు) ద్వారా ''ధూలింగ్‌మఠ్'' దాపా నాబ్రా 'గ్యానిమా మండి' ద్వారా; దూరము 380 కిలోమీటర్లు.

(8) 'ముఖుహ గంగోత్రి' నుండి 'నీలింగ్' ద్వారా 'జెలుభాగాపాస్'' (17, 490 అ. ఎత్తు) ద్వారా ''పూలింగ్ మండి'' ధులింగ్‌ధాపా 'గ్యానిమా మండి' ద్వారా; దూరము 385 కి.మీ.

(9) సిమ్లా నుండి 'రాంపూర్' 'షిబిపాస్' (15,400 అ. ఎత్తు) షిరిలింగ్ లా పాస్ (16, 400 అ. ఎత్తు) లోభెలా (18, 510 అ. ఎత్తు) చార్ ఘూట్‌లాపాస్ (16,200 అ. ఎత్తు) తీర్థపురి ద్వారా; 760 కి.మీ. దూరము.

(10) శ్రీనగర్ నుండి జోజిలాపాస్ (11,580 అడుగుల ఎత్తు) నమ్మిక్ పాస్ (13,000 అ.) పోటులాపాస్ (13, 450 అ.) లీహ్ త్సగంగా పాస్ (17, 500 అ. దేర్ చోక్, గార్టక్, బార్గాట్లా, తీర్థపురి ద్వారా; 970 కి.మీ.

(11) ఖాట్మండు (నేపాలు) నుండి టింకర్‌పాస్ (18,500 అ.) ముక్తి నాథ్, ఖోచార్‌నాథ్, ద్వారా; దూరము 1300 కి.మీ. ఇచటినుండి ప్రస్తుతము మానస సరోవర్ వరకు రోడ్డు సౌకర్యము గలదు. 1996లో ఈ మార్గలో నే అవధూత శ్రీ శ్రీ శ్రీ గణపతి సచ్చిదానందస్వామివారు ఈ యాత్ర సలిపి వచ్చిరి.

(12) 'లాసా' నుండి 'తాషిలుంపో' ద్వారా; దూరము 1300 కి.మీ.

పూర్వీకులు వారివారి శక్తి యుక్తి భక్తి స్తోమతల ననుసరించి పైదారుల వెంబడి యాత్రలు చేసెడివారు. కాని ఇపుడు ఈ మార్గములన్నియు భారత చైనా సైనికులచే కాపలా కాయబడుచు యాత్రికులకు అనుమతి లభించుట దుర్లభము.

## కైలాస మానసముల నెలా దర్శించాలి :

భారత చైనాల ఒడంబడిక గురించి ఇదివరకే తెలిపియుంటిని. మరల ఈ ఒడంబడిక పునరుద్ధరింపబడినచో మరో మూడేండ్లు ఈ యాత్ర చేయు అవకాశము లభించును. ఈ పుస్తక ప్రచురణ సమయమునకు 1984, 1985 బృందములు వెళ్ళి వచ్చినవి. ప్రతియేటా ఏప్రిల్ మాసములో రేడియో టెలివిజను వార్తాపత్రికల ద్వారా ఈ యాత్ర గురించి భారత విదేశాంగ శాఖవారు ప్రయాణము చేయు అభ్యర్థుల నుండి దరఖాస్తులు పెట్టుకొనుటకు ప్రకటన చేయుదురు. దరఖాస్తుదారు తన

దరఖాస్తుతోపాటు పాస్‌పోర్టు నెంబరును కూడా పంపాలి. పాస్‌పోర్టు లేని వ్యక్తికి 'వీసా' దొరకదు. కావున ఇది చాల ముఖ్యము. అట్లు వచ్చిన దరఖాస్తులను పరిశీలించి లాటరీ ద్వారా రెండు వందల మందిని మాత్రమే ప్రతి సంవత్సరము ఎన్నుకొందురు. ఈ రెండు వందల మందిని ఎనిమిది బృందములుగా చేసి ప్రతి బృందములో ఇరువది యైదు మంది యాత్రీకులను నిర్ణయింతురు. వారము రోజులు ముందుగా ఆయా బృందములలో నిర్ణయించబడిన వారికి ప్రయాణ తేదీలతో సహా వివరములను టెలిగ్రాం ద్వారా తెలియజేయుదురు. వారు తెలియజేసిన తేదీనాటికి పాస్‌పోర్టుతో సహా ఢిల్లీలో విదేశాంగ శాఖ కార్యాలయములో అభ్యర్థి హాజరు కావలెను. హృద్రోగము, ఊపిరితిత్తుల వ్యాధి, బి.పి. (బ్లడ్‌ప్రెజర్) మొదలగు వ్యాధులున్నవారు ఈ యాత్రకు ప్రయత్నము చేయుట వ్యర్థమగును. ఈ వచ్చినవారిని విదేశాంగ శాఖవారు ఢిల్లీలోని గవర్నమెంటు ఆస్పత్రులలో పెద్ద డాక్టర్ల వద్దకు శరీర పరీక్షకై పంపుదురు. ఆ డాక్టర్లు వీరిని పరీక్షలు చేసి శారీరక లోపము లేదని ప్రయాణము చేయుటకు తగిన శక్తి సామర్థ్యము గలదని ధృవీకరించినవారినే ప్రయాణమునకు అనుమతించెదరు. దాదాపు రు. 3000/- వరకు మన భూభాగములోను రు. 3,500/- చైనా భూభాగము లోను వ్యయము తప్పనిసరిగా జరుగును. ''ధన మూల మిదం జగత్'' అన్నారు గదా! దేహదార్ఢ్యముతోపాటు ఈ యాత్ర చేయుటకై ధనము కూడా అవసరము. అంతేకాక ధనహీనుని కైలాసవాసుడు కూడ అనుమతించడు. 1997 సం॥ వరకు ప్రతెయేడు 200 మందిని ఎంపిక చేయుట, శరీర పరిస్థితిననుసరించి వారిని కైలాస దర్శనానికి పంపుట జరిగినది. ప్రస్తుత ఖర్చులు మొత్తం రు. 30,000/-ల పైనగునని తెలిసినది. ధనహీనుని -

శ్లో. మాతా నిందతి నాభినందతి సుతో భ్రాతా న సంభాషతే
భృత్యఃకుప్యతి నానుగచ్ఛతి సరః కాంతాపి నాలింగతే
విత్త ప్రార్థన శంకయా న కురుతే సల్లాప మాత్రం సుహృత్
తస్మాత్ విత్త ముపార్జయ; శృణుసఖే విత్తేన సర్వే వశే.

తా॥ ధనహీనుని తల్లి తిట్టును. సుతులు లెక్క చేయరు. అన్నదమ్ములు మాటాడరు. సేవకులు కోపగించుకొందరు. ఇతరులు తన్ననుసరింపరు. భార్య ఆలింగనమును కూడ సహించదు. చుట్టములతో మాటాడిన డబ్బుకై వచ్చినాడని శంకించి మాటాడరు. అందుచేత ఓ సఖుడా! విత్తము సంపాదించుము. దానిచే అందరును వశులగుదురు.

అట్లే ధనమున్న వానిని-

శ్లో. యస్యాస్తి విత్తం స నరః కులీనః సపండితః స్వశ్రుతవాన్ విధిజ్ఞః
స ఏవ వక్తా స దర్శనీయః సర్వే గుణాః కాంచన మాశ్రయంతి.

తా॥ ధనము గలవాడే కులములో పెద్ద. వాడే పండితుడు. అతడే వినదగినవాడు. చూడదగినవాడు. అతని ఆజ్ఞ ప్రజలకు శిరోధార్యము. ఆతడే మాటాడదగినవాడు. అన్ని సద్గుణములు ధనికునందుండునని ప్రజలు భ్రమ పడుదురు.

అందుచే విత్తము మినహా ఈ యాత్రకు సిద్ధపడుటయు వృధా ప్రయాస కాగలదు. విత్తము సంపాధించలేని వాని లక్షణములిలా యుండును.

శ్లో. అతిదాక్షిణ్య యుక్తానాం శంకితానాం పదే పదే
పరాపవాదభీరూనాం దూరతో యాంతి సంపదః.

తా॥ పెద్దగా దాతృత్వము గలవాడు, పని జరుగునో లేదో యను శంక గలవాడు, లోకాపవాదునకు భయ మొందువాడు సంపదలకు దూరమగును.

✍ ఇది భోజన, వసతి, బస్సు సౌకర్యములకొరకై అవుసరము. చైనా ప్రాంతము నుండి తిరిగి వచ్చుటకు గుర్రములు ఫోటోలు తీసుకొనుటకు ఫిల్మురీళ్ళు, వేడిగా నుండు వస్త్రములు మందులు మున్నగువానికి ఇంకొక రు. 3,000లు దాదాపుగా ప్రతి ప్రయాణీకునకు అవుసరము. మొత్తము ప్రయాణమంతయు పర్వత ప్రాంతములో కాలి నడకన చేయువారికి కొంత ఖర్చు తగ్గును. ఈ యాత్రకు వయసుతో నిమిత్తము లేకున్నను 20 సం. నుండి - 65 సం.ల వయస్సు మధ్యగలవారు ఆడ మగ కూడ చేయవచ్చును. ప్రయాణీకులకు ముఖ్యముగా కావలసినది వారివారి ధైర్యము, శరీర దారుధ్యము, సహనశక్తితో పాటు మనోనిబ్బరము, పట్టుదల, ధృడముగా నుండవలెను. ఈ యాత్ర కేవలము కైలాస మానస సరోవరములకే కాని, టిబెట్టుగాని, లాసా గాని మరే ఇతర ప్రాంతములకు పోవుటకు అనుమతించరు.

**ప్రయాణమునకు కావలసిన వస్తువులు :**

మంచి ఉన్ని రగ్గులు కాని ''స్లీపింగ్ బ్యాగ్స్'' కాని లిపులేఖ్ వరకు అవుసరము. పడుకొనుటకై ప్రక్కకు కావలసినవి చైనా భూ భాగములో వారే ఇచ్చెదరు. శరీరమును చలిబాధ నుండి రక్షించుకొనుటకై ఉన్నిపాంటులు కోట్లు, ఓవర్‌కోటు, విండ్ చీటరు పైన క్రింద వేసుకొనుటకు ఉన్ని ఫుల్ బనియను పైజామా (చుడిదార్) ఉలన్ స్వెట్టర్లు (కనీసం రెండు) మఫ్లర్ మంకీ టోపీ లేదా ''కౌబాయ్‌టోపి'' చేతులకు గ్లౌజులు నల్లకళ్ళద్దాలు (మంచును చూచునపుడు మంచులో నడచునపుడు) రెండు మూడు జతల మేజోళ్ళు (ఊలువి) హంటర్‌బూట్లు, గొడుగు, రైన్‌కోటు,

పిప్పరమెంట్లు, విటమిన్ 'సి' మాత్రలు, క్లోరిన్ మాత్రలు నీళ్ళ చెంబు, లేక నీళ్ళ సీసా, వ్యాసిలీన్ ఫలహారములు, మున్నగునవి 5 నుండి 10 కేజీల వరకు ఎల్లవేళల కూడ తన వెంట ఉండవలెను. వీనితోపాటు నెత్తిన టోపీ చంకలో కెమెరా చేతిలో కర్ర ముఖ్యము. ఇవికాక పప్పులు బియ్యం కాఫీ టీ పాలు పొడరు మొదలైనవి, సామాను మానస, కైలాస పరిక్రమలో, అవసరమగును.

## యాత్రలో వ్యాధుల సంభావ్యత :

పర్వతములపై ఎత్తు ప్రదేశములలో ముఖ్యముగా గాలిలో ఆమ్లజని లోపించును. అట్టి పరిస్థితిలో మనకు అలవాటుండదు. అందుచే కొన్ని వ్యాధులు ఆమ్లజని లోపము వలన కలుగవచ్చును. అందుకే ఆయా వ్యాధులకు సంబంధిన మందులు వెంట ఉంచుకొనవలయును. ఆమ్లజని లోపమువలన - కళ్ళు తిరుగుట వాంతులు విరోచనములు బంక విరోచనములు, జలుబు, దగ్గు, కడుపునొప్పి, మలబద్ధకము, కలరా, ఎనిమియా, తలనొప్పి నోటి నుండి లేక నాశిక నుండి గాని మలము నుండి గాని రక్తము పోవుట, ముఖము, పెదవులు మున్నగు బయటికి కన్పించు శరీర భాగములలో పగుళ్ళు, ఈ పగుళ్ళ నుండి ఒక్కొకసారి రక్తము స్రవించుట, ప్రయాణములో దెబ్బలు తగులుట, మొదలైనవి వారి వారి శరీర లక్షణములను బట్టి సంభవించవచ్చును. కొందరికి ఏ బాధయు లేకుండా హాయిగా తిరిగి వచ్చుటకు వీలగును. పై రోగము రావచ్చునని సూచనే కాని తప్పక వచ్చునని చెప్పలేము. అయినను వీటి కొరకై కొన్ని మందులు జాగ్రత నిమిత్తము ఉంచుకొనుట, చాలా శ్రేయస్కరము.

## ముఖ్య గమనిక :

(1) చలి వాతావరణములలో ముందు జాగ్రత్త చాల అవుసరము. కావున ఛాతి అరచేతులు అరికాళ్ళు చెవులు చెక్కిళ్ళు తల మున్నగు అవయవములకు ఎట్టి పరిస్థిలోను గాలి తగులకుండ కాపాడుకొనవలెను.

(2) ప్రతిరోజు పెదవులకు చెక్కిళ్ళకు ఏద్దైనా లేపనముగాని వ్యాస లీన్గాని తప్పక రాసుకోవాలి.

(3) కొండలపై నుండి వచ్చు జలప్రవాహము నీటిలో క్లోరిన్ బిళ్ళలు కల్పి నీరు త్రాగాలి.

(4) చల్లటి నీరు గల నదులలో స్నానము చేయకూడదు. ఒకవేళ చేసినా వెంటనే శరీరము శుభ్రముగా తుడుచుకొని వెంటనే వేడినిచ్చు బట్టలు ధరించాలి.

(5) పూజలు చేయునపుడు కూడ వేడినిచ్చు ఉన్ని బట్టలు ధరించే చేసుకోవాలి. పట్టు వస్త్రములుగాని తడిబట్టలుగాని పూర్తిగా వర్జ్యములు.

(6) ''జైసా దేశ్ వైసా భేష్'' - (దేశమును బట్టి వేషము) అనే సామెత ప్రకారం నడచుకోవాలి.

శ్లో. దర్శనం బిల్వ వృక్షస్య స్పర్శనం పాపనాశనం
అఘోర పాప సంహారం ఏకబిల్వం శివార్పణమ్.
మూలతో బ్రహ్మ రూపాయ మధ్యతో విష్ణురూపిణే
అగ్రత శ్శివరూపాయ ఏకబిల్వం శివార్పణమ్.
బిల్వాష్టక మిదం పుణ్యం యః పఠే చ్ఛివసన్నిధౌ,
సర్వపాప వినిర్ముక్తః శివలోక మవాప్నుయాత్॥
(ఇతి బిల్వాష్టకమ్)



 మాండవ్యుడు చిన్నతనములో తూనీగల రెక్కలకు ముల్లుగుచ్చిన పాపమునకు రాజుచే కొరత వేయించబడెను. అందుచే మన పిల్లలు జీవులను హింస పెట్టకుండ చూడవలయును.

# నలుబది మూడవ అధ్యాయం

## బస్సులో చంపావతి ప్రయాణము

శ్లో. బ్రహ్మమురారి సురార్చిత లింగం
నిర్మల భాసిత శోభిత లింగం
జన్మజ దుఃఖ వినాశక లింగం
త త్ప్రణమామి సదా శివలింగం.
దేవముని ప్రవరార్చిత లింగం
కామ దహన కరుణాకర లింగం
రావణ దర్ప వినాశక లింగం
తత్ప్రణ మామి సదా శివ లింగమ్.

✍ ది. 16-8-83వ తేదీ నాటి ఉదయమే స్నాన సంధ్యలు అల్పాహారములు ముగించితిమి. అంతకు ముందు రాత్రి చేసిన నిర్ణయము ప్రకారము ఒక ఆరోగ్య కేంద్ర జీపులో ఉదయము ఆరుగంటలకే శ్రీ చొక్కారావుగారిని పిథోరాగడ్‌కు పరీక్ష నిమిత్తమై అగర్‌వాల్‌గారు వెంట ఉండి తీసుకొని వెళ్ళిరి. బస్సులో మా సామానంతయు ఎక్కించేసరికి మా మిత్రులు ఇరువురు రాత్రి కొన్న వస్తువు ఏదో దుకాణదారునికి తిరిగి ఇచ్చివేయుటకు నేపాల్ గ్రామము వెళ్ళిరి. మేమెంత త్వరపడినను వారు వచ్చుట ఆలస్యమయినందున లాభములేక పోయెను. చివరకు వారు తొమ్మిది గంటలకు తిరిగి వచ్చిరి. వెంటనే భగవన్నినాదములతో మా బస్సులో ప్రయాణము నారంభించితిమి. దారి ప్రక్కనే కాళిగంగా పర్వత జలపాత లోయల వృక్షముల గ్రామముల దృశ్యములను గాంచుచు బస్సు ప్రయాణము చేయుచుంటిమి. నా ప్రక్కనే కూర్చున్న దిలీప్, ఎడమ సీటులో కూర్చొన్న మాథుర్ ఇరువురును బస్సు మలుపులు తిరిగినపుడల్ల వాంతులు చేసుకొనుచుండిరి. కొంతసేపు కళ్ళు మూసుకొని పడుకొనుచుండిరి. ఒంటిగంటవరకు పిథోరాగఢ్ గెస్టుహౌసు చేరితిమి. భోజనములు ముగించువరకు చొక్కారావుగారు, అగర్‌వాల్‌గారు వచ్చి చేరిరి. వారు నేడు కొంత ఉత్సాహముగా నుండిరి. వారు కూడ భోజనము చేయగనే మరల ప్రయాణమై పిథోరాగఢ్‌లోని కూడలిలో బస్సు ఆగగా మేమంతా దిగి దగ్గరలోనే గల శ్రీ ప్రణవానందస్వామి వారి గృహమునకు వెళ్ళితిమి. వారికి నమస్కరించి మాట్లాడితిమి. కొందరు వారి వద్ద గల కొన్ని పుస్తకములను కొనిరి. వారితో కొన్ని ఫోటోలు కూడ దిగితిమి. శ్రీ చొక్కారావుగారు స్వామిజీతో మాట్లాడిన తర్వాత చొక్కారావుగారి వ్యాధి 50% తగ్గిపోయెను. మేమందరము వారి వద్ద శలవు తీసికొని దగ్గరనే బజారులో

గల ఒక హోటలులో టీ త్రాగి బస్సెక్కితిమి. మళ్ళీ దారి పొడగునా వంతెనలు నదులు లోయలు పర్వతముల ప్రకృతి దృశ్యముల నానందముతో చూచుచు పైకి ఎక్కుచు దిగుచు మలుపులు తిరుగుచూ మా మిత్రులు మరల వాంతులు చేయుచుండ ఎంత త్వరగా గమ్యస్థానము చేరుదుమా అని ఎదురుతెన్నులు చూచుచు ఇంకా ఒక్కరోజు ఎట్లు గడుచునా యని ఆరాటపడుచు, ఆవేదన చెందుచు, మనశ్శాంతి లేక ప్రయాణము సాగించుచుంటిమి.

ఎన్ని దానధర్మములు చేసినను ఎన్ని పుణ్యతీర్థములు దర్శించినను ఎంత ధనము సంపాధించినను నేటి కాలములో మనశ్శాంతి ప్రతివారిలో కరువగుట సర్వసాధారణముగా చూచుచున్నాము. నేటికాల పూర్వకాల పరిస్థితికి చాల వ్యత్యాసము కలదు. వెనుకటిది తాబేలు వేగము. నేటిది వాయువేగము. వెనుకటి సంపాదనలో (కొద్ది సంపాదనయైనను) పిల్ల పాపలు తినగా ఇతరులకు కూడ కొంతపెట్టి తృప్తి చెందిరి. నేటి కాలములో ఎంత కఠిన పరిశ్రమ చేసినా ఒక కుటుంబమునకు సరిపడు ఆదాయము వచ్చుట కష్టముగా యున్నది. మానవులకు తృప్తి యనునది లేదు. మానసిక శాంతి లేదు. శాంతి లేని జీవనమునకు సాఫల్యము లేదు. కావున మనఃశ్శాంతికి నేటి కాలములో కొన్ని కనీస నియమములు మానవుడు పాటించి సుఖ శాంతుల బొందుట ఎంతేని అవుసరమై యున్నదని పెద్దల యభిమతము. కావున వాని గురించి కొంత క్లుప్తముగా పొందుపరచనైనది.

## కలికాలములో మానవుని కనీస కర్తవ్యము

పృథ్విలో ఇప్పటికి మూడు యుగములు గడచి నాల్గవ యుగమగు కలియుగ ప్రథమ పాదములో మనము సంచరించుచున్నాము. ఈ కాలపు మానవులలోని ప్రాణము రక్తగతమని చెప్పుదురు. పూర్వకాలములోవలె మానవునికి శాంతి సౌభాగ్యము భక్తి ముక్తుల సాధనకు తగినంత సమయము లేదు. అందుకే సూక్ష్మములో మోక్షము కావలసిన రోజులివి.. అందుకే ఉపనిషత్ శ్లోకమున :

శ్లో. యద్దివ్యనామ స్మరతాం సంసారో గోష్పదాయతే।
స్వానన్య భక్తి ర్భవతి తద్రామం పరమాశ్రయే.

నారదమునికి బ్రహ్మదేవుడు చెప్పిన దేమనగా - కలియుగములో జనులు పడు బాధల నివారణకుగాను ఈ కాలమునకు తగిన విధముగా జనులు ఏ నియమనిష్ఠలు గరపలేకున్నను ఏ శుచి శుభ్రత పాటింపకున్నను ఏ స్నాన సంధ్యలు చేయలేకున్నను అవస్థా భేదము లేకుండను ఏలాంటి ఉచ్చ నీచ జాతి భేదము లేకుండను ''హరి'' యను రెండక్షరములను సమయము దొరికి నపుడెల్ల స్మరించిన చాలునని - ''హరే రామ హరేరామ రామ రామ హరేహరే హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరే హరే'' -

యను పదహారక్షరములను రేయింబగళ్ళలో వీలు చిక్కినపుడెల్ల స్మరించినచో సమస్త పాతకములు తొలగి లోక బంధ విముక్తుడై విష్ణు సామీప్య ముక్తిని సంపాదించవచ్చునని బ్రహ్మదేవుడు నారదునకు స్వయముగా చెప్పెను.

దీనినే ''కలిసంతారణ'' మనియు కూడ యందురని చెప్పెను. అందుకే నేమో మనదేశ వాసులకన్న ఎన్నోరెట్లు ఇతర దేశస్థులు ఈ ''హరేరామ హరేకృష్ణ'' సంఘములు స్థాపించి దేవాలయములు గోపురములు నిర్మించి భక్తి ప్రపత్తులతో ఆ దివ్యమంగళరూపుని స్మరించుచు తన్మయత్వ మొందుచు ఆ నామ - ఉచ్చారణ ప్రభావము నెంతగానో ప్రచారము చేయుచున్నారు. దీనికి నిదర్శనముగా ISCON సంస్థ వారు, చైతన్య మహాప్రభు ఉపదేశాలను, గౌడీయ సాంప్రదాయాను సారం, ప్రపంచ వ్యాప్తంగా ప్రభోధిస్తున్న భక్తి, వేదాంత స్వామి ప్రభుపాదుల కృషి మనందరికి విషదమే కాక శ్లాఘనీయము. ఇంతేకాక వారు భక్తి పారవశ్యములో మునిగి సంసార భవబంధములకు దూరమై శాంతిని ఆత్మజ్ఞానమును పొందు ప్రయత్నము చేయుచున్నట్లు కానవచ్చుచున్నది. అజ్ఞానులకు పాపములు చేయువారికి ఆయా దేవతామూర్తుల దర్శనమే శరణ్యమని ఈ క్రింది శ్లోకముచే తెలియుచున్నది.

శ్లో. అగ్నౌ దేవో ద్విజాతీనాం యోగినాం హృదయే తథా ।
ప్రతిమా స్వల్ప బుద్ధీనాం ॥

శ్లో. నిర్విణ్ణానాం జ్ఞానయోగో న్యాసినా మిహ కర్మసు ।
న నిర్విణ్ణో నావిషక్తో భక్తి యోగోఽస్య సిద్ధిదః ॥

ఈ భాగవత శ్లోకము ద్వారా నేటి మానవులకు భక్తి యోగమే ఉత్తమ పురుషార్థమని తెలియజేయ బడినది.

మన దేశములో ఉన్నన్ని దేవాలయములు, గోపురములు, ఆరామములు, ధార్మిక గ్రంథములు, ప్రజలలో ఆధ్యాత్మిక చింతన ధార్మిక ప్రవర్తన ప్రభోదించేవి వేరే ఇతర దేశములలో లేవనుట యదార్థము. వీనియొక్క ఔన్నత్యమును వానిచే గల్గు ఆత్మజ్ఞానము మనశ్శాంతి మున్నగునవి తెలిసికొనియే పాశ్చాత్యులు నేడు ఈ పై కార్యక్రమములు చేపట్టిరని వేరే చెప్పనక్కరలేదు. మానవుడు ఎంత కష్టించినను ఎంత సంపాదించినను నేటి కాలములో సరిపడుట లేదనునది వాస్తవమై యున్నది. కాని రోజుకు ఇరవై గంటలు శ్రమ పడియు మనశ్శాంతి లేని జీవితము వ్యర్థము. శారీరక శ్రమ ఎంత చేసినను దానికి తగు మనశ్శాంతి లేకపోయిన మానవుడు క్రుంగిపోవును. ఈ మనశ్శాంతికి పైన తెలిపిన సాధనలు కొంత విశ్రాంతి, వానికి తోడు కొన్ని వినోద కార్యక్రమములు మానవునకు అవుసరము.

మన దేశీయులు కొందరు ఈ ఆరామములకు విగ్రహారాధనకు శుద్ధ వ్యతిరేకముగా నున్నారు. భగవంతుడు నిరాకారుడు నిరంజనుడు సర్వవ్యాపియని చెప్పుచు శూన్యుడైన పరమాత్మను శూన్యము ద్వారానే ధ్యానంచవలెనని కొందరు బోధింతురు. కాని మనము భగవంతునికి ఇన్ని చేతులు ఇన్ని కాళ్ళు గదాయుధము చక్రము మున్నగునవి ఉన్నట్లు ఊహించి ఆయా విగ్రహములను తయారుచేసి ఆయా దేవతల రూపములు నామములు ఆయుధములు వగైరా శిల్ప రూపమున తయారుచేసి సంపూర్ణమైన యాస్వరూపమును గాంచి మనసారా ధ్యానించ ప్రయత్నింతుము. ఈ చంచలమైన మనస్సు కనీస మా విగ్రహమును చూచియైనను ఆ దేవునియందు మనసును లగ్నము చేయుట కొంత సాధ్యపడును. ఇది మన సిద్ధాంతము. ఎదురుగా నున్న విగ్రహము పైన మనస్సు నిలుపుటయే దుస్తరమైన ఈకాలంలో శూన్యములో దేవునిపై యెట్లు మనస్సు లగ్నము చేయగలరో అర్థము కాకున్నది.

అయినను అసలు భగవంతుడు సాకారుడా నిరాకారుడా యను ప్రశ్న యటుంచి మన దేశములో యుగ యుగముల నుండియు ఈ భగవదారాధన తీర్థయాత్రలు ఎందరెందరో తపోధనులు సాక్షాత్ భగవత్ స్వరూపులు కూడా చేయుచు వచ్చుచున్న సంగతి అందరికి విశదమే. ఆదిశంకరుల లాంటి ఎందరో మహానుభావుల ద్వారా ఆలయములలో ఆగమశాస్త్ర ప్రకారము ప్రతిష్ఠించిన విగ్రహముల ద్వారా దైవభక్తి ప్రబలి ప్రజ్వరిల్లిన మాట వాస్తవ దూరము కాదు గదా!

ఈ భగవద్భక్తి ఆరామదర్శనము భగవన్నామ స్మరణ మున్నగునవి కేవలము మానవుని నమ్మకమునకు సంబంధించిన విషయములు. ఈ లోకములో కోట్లాది జనులు దేవాలయములకు ఎందుకు వెళ్ళుచున్నారు? ఎందుకు విగ్రహముల పూజించుచున్నారు? ఎందుకు అనేక శ్రమల కోర్చి ధనము వెచ్చించి మార్గములో రాబోవు నెన్నియో ఆటంకముల నెదుర్కొని ప్రాణములను కూడ లెక్క చేయక ఆయా సుదూర ఆలయముల విగ్రముల దర్శించి భక్తి ప్రపత్తులతో పూజించి తన్మయత్వము బొందుచు మనశ్శాంతిని బొందుచున్నారు కదా ! పైగా ఈ విగ్రహములను నిజముగా భగవంతుడని నమ్ముట చేతనే జనులు సహజముగా జంకు నొంది చేసిన చెడ్డ పనుల మన్నించుమనియు భవిష్యత్తులో చెడ్డ కార్యముల చేయకుండ తగిన మనోనిబ్బరము ప్రసాదించుమని వేడుచు అట్టి చెడుపనులు చేయకుండ సత్ప్రవర్తన అలవాటు చేసుకొందరు గదా! కాబట్టి ఈ విగ్రహారాధన వలన కలిగెడు నష్ట మేదియో తెలియుటలేదు.

ఈ భగవద్భక్తి, ధర్మము, సత్యము, శుచి శుభ్రతలు గలిగిన చోటనే శ్రీ మహాలక్ష్మి నివసించునని వారికి ధనధాన్య సౌభాగ్యములు కలుగజేయునని భారత అనుశాసనిక పర్వములో తెలుపబడెను.

సీ. నిత్య సత్యులు శౌచనిరతులు గురుభక్తు
లప్రమత్తులు దక్షు లమలమతులు ।
సత్కర్మపరులు విజ్ఞానము దపము దా
నము బ్రహ్మ చర్యంబు శమము గల్గు ।
వారలు ప్రీతి నావసియించు నిక్కలు
క్రూరు నాస్తికు గృతఘ్నుని గుబుద్ధి ।
వర్జింతు నెంగిలి వర్జించి యిలువది
ఘటశుద్ధి కలిగిన కాంతలందు ।
తే. నిల్తు వల్లభ ప్రతికూల నిష్ఠురాత్మ
నన్యమందిరగామిని నధికనిద్ర ।
యైన మానిని దొరగుదు నబ్జినీ త
టాక తరుషండ పుష్పవాటముల నిలుతు.

అనగా నిత్యము శౌచము, సత్యము గురుభక్తి మున్నగునవి కల్గిన దక్షులచెంత, సత్కర్మలాచరించుచు విజ్ఞానము కలిగి తపము, దానము, బ్రహ్మచర్యము, శమదమాదులు కల్గియున్న వారిచెంత ప్రీతితో నుందునని సాక్షాత్ మహాలక్ష్మియే చెప్పినది. మరియు క్రూరుని నాస్తికుని కృతఘ్నుని కుబుద్ధిని శుచిశుభ్రత లేని కాంతలను ఎంగిలి ఆకు మాదిరి విసరి వేయుదుననియు చెప్పెను. అంతేకాక చెడు ప్రవర్తన కల స్త్రీని, అధిక నిద్రబోవు స్త్రీని కూడ వర్జింతుననియు శ్రీ మహాలక్ష్మి చెప్పెను. మరియు పైన తెల్పిన చోటులనే కాక తటాకముల లోని కమలములలో ఆమెయొక్క సదా నివాసమై యున్నదని భావము.

కావున మానవులకు ఆయురారోగ్య ధనధాన్య పుత్ర పౌత్రాభి వృద్ధి ముక్తి మొదలగు శుభములు గలుగుటకు సన్మార్గము, సత్యము, సత్ప్రవర్తన, భక్తి దాన ధర్మములు, ఆరామ దర్శనము, భగవత్ప్రార్థన, సద్గ్రంథ పఠనము, సత్సాంగత్యము, పౌరాణిక శ్రవణము, మాతా పితరుల సేవ, గురువుల సుశ్రూష , తోటి మానవుల ప్రేమించి, ఈర్ష్యా ద్వేషముల విడనాడుట, మున్నగునవి యెంతేని యవసరమై యున్నవి. వీనిచే ముఖ్యముగా మనశ్శాంతి ఆత్మశాంతి తృప్తి తప్పక బడయుదురు. ఇవి పొందలేని జీవితము వ్యర్థము.

మరియు దాన ధర్మములలో కెల్ల అన్నదానము శ్రేష్ఠము అని శాస్త్రములలో చెప్పినను ఆ అన్నదానముతో తాత్కాలిక తృప్తి మాత్రమే కల్గును. కాని ఈ భోజనము పెట్టుటలోనే తినువానికి చాలునని తృప్తినిచ్చును. మిగతా దానములలో దేనికిని చాలునను తృప్తిలేదు. అయినను విద్యాదానము భక్తి మార్గముల నుపదేశించు దానము చాల

విలువైనదిగా గ్రహించవలెను. ప్రతి వ్యక్తి తాను భక్తి జ్ఞానము కలవాడైనంతమాత్రమున సరిపోదు. ఒక జ్ఞానవంతుడు భక్తి జ్ఞానములు తెలువని అజ్ఞానవంతునికి ఒక్కనికైనను భక్తి జ్ఞానములను బోధించి సన్మార్గుని చేయుటవలన యెంతేని పుణ్యము లభించునందురు. కావున జ్ఞానము సచ్ఛీలము మానవునికి ప్రధానము. ఇది ప్రతి వారికి చిన్న పిల్లలుగా నున్నప్పటి నుండి నేర్పినచో ఈ దేశమున చెలరేగు అతివాద తత్వము సమసిపోయి రాబోవు తరములో నైనా ప్రజలు సుఖజీవనులు కాగలరు.

భక్తి లేనివాని పుట్టుక పోతన్నగారు భాగవతములో తల్లుల పొట్ట చేటుకని నిందిస్తాడు. అట్లే భక్తిహీనుని గురించి

శ్లో. హస్తౌ దాన వివర్జితౌశ్రుతి పుటే సారస్వత ద్రోహిణీ
నేత్రే సాధువిలోకనేన రహితే పాదౌన తీర్థాగమౌ
అన్యాయార్జితవిత్తపూర్ణముదరం గర్వేన తుంగం శిరః
రేరే జంబుక ముంచ ముంచ సహసా నీచస్య నింద్యం వపుః!

(తాళపత్రము)

తా॥ రెండు నక్కలు ఒక మృత కళేబరమును చూచి వలయునాహారము లభించెనని మురిసిపోయినవి. అందులో నొక జంబుకము ఆ కళేబరము నారగింపబూనగా రెండవది ఆ కళేబరము నీచమైనది, నింద్యమైనదియని దానిలోని ఏ భాగమును తినుట ఋషకరించదని పాపము మూటగట్టుకోవద్దని వారించును. ఎట్లన అతను బ్రతికున్నన్నినాళ్ళు చేతులు దానము చేయలేదు. చెవులు సారస్వతమును వినలేదు. నేత్రములు సాధుసజ్జనుల గనలేదు. పాదములు ఏ తీర్థయాత్రలు చేయలేదు. కడుపు తిందువా అన్యాయార్జితముతో నిండియున్నది. శిరము గర్వముచే విర్రవీగెను. అందులకై ఓ సాహస జంబుకమా! ఆ కళేబరములోని భాగములన్నియు వ్యర్థములు వర్జ్యములు పాప కూపములు.

సాయంత్రము ఏడు గంటలకు మేమా బస్సు ప్రయాణములో 'చంపావతి' బంగళా చేరితిమి. కాఫీలు సేవించి కొంత మాటా మంతీ అయిన తరువాత భోజనములు ముగించి త్వరగా పడుకొని నిదుపోయితిమి. శ్రీ చొక్కారావుగారికి క్రింది ప్రాంతము చేరిన కొలది శరీరము స్వస్థతకు వచ్చుచుండెను.

ది. 17-8-1983వ తేదీన ఉదయమే లేచి నిత్య కృత్యములు ముగించి 'టీ' మాత్రమే త్రాగి త్వరగా మా గమ్యస్థానము చేరాలనే సంకల్పముతో ఆతురతతో ఆరు గంటలకే బస్సెక్కి ప్రయాణమైతిమి. ప్రకృతి దృశ్యముల చూచుచు నదులను దాటుచుండగా నాడు మాకు ఒక పెద్దనది ''శారదా'' పేరుగలది కన్పించెను. దానిని

దాటితిమి. ఆ నది కాళిగంగా నదిలో కలియును. కొండలు ఎక్కుచు దిగుచు ఎన్నో ప్రమాద భరితమైన గుడ్డి మలుపులు తిరుగుచు పెద్ద పెద్ద దేవదారు వృక్షముల మధ్యనుండి తొమ్మిది గంటలకు టనక్‌పూర్ చేరితిమి. అంటే మూడు వందల కిలోమీటర్ల ఘాట్ రోడ్డు దాటి మైదానము చేరితిమి. అందరము అక్కడ ఉన్న మంచి హోటలులో ఎవరికి తోచినది వారు కడుపార ఉపహారము భుజించితిమి. కాఫీలు త్రాగితిమి. ఆ రోజు సద్బ్రాహ్మణుడైన డా. గోడ్బోలే జన్మదినము తటస్థించినందున మా హోటలు ఖర్చంతయు వారే భరించిరి. తరువాత మరల బస్సులో బయలు దేరితిమి. మా అందరికి ఎపుడు ఢిల్లీ చేరుదుమా యని ఆదుర్దా తప్ప ఏమియును మనసులలో ధ్యాసరాకుండెను. కనుక ఎవరును ఏమియు బస్సులో మాట్లాడలేదు. దాదాపు ఒంటి గంటకు ''రుద్రపూర్'' చేరితిమి. నిగం వారు భోజనము చేయమని మాకు చెప్పగా మాకు ఆకలి లేదనియు త్వరగా పోవుదమనియు అందరము ముక్త కంఠముతో చెప్పగా బస్సు బయలు దేరినది. ఆ లోగా శ్రీ అగర్వాల్ గారు బస్సు దిగిరి. వారు రైలులో లక్నో పోవలసియుండెను. మేమందరము వారికి వీడ్కోలు చెప్పి బయలుదేరితిమి. మధ్యలో ఎచటను బస్సు ఆగలేదు. అట్లే ''మురాదాబాద్'' చేరువరకు సాయంత్రము నాలుగు గంటలయ్యెను.

డ్రైవరు అవిశ్రాంతముగా బస్సు నడిపి విసిగి పోయెను. టీ త్రాగి కొంత విశ్రాంతికై అతడు బస్సు ఆపి దిగెను. మేము కూడ బస్సు దిగి టిఫినులు కాఫీలు సేవించితిమి. మరల ప్రయాణము మొదలయ్యెను బస్సు వేగముతో ముందుకు దూసుకొని పోవుచున్నను తొందరగా చేరవలెనన్న ఆదుర్దావలన, మాకు ఆ బస్సు ఎద్దు బండి వలె నెమ్మదిగా పోవుచున్నట్లుగా తోచుచుండెను. గమ్యస్థానము దగ్గరైన కొలది మా ఆదుర్దా ఎక్కువ కాజొచ్చెను. అట్లే సాయంకాలము ఆరు గంటలకు ఢిల్లీ పరిసరములకు చేరుకొంటిమి. సాయంకాల సమయము కావున యమునా బ్రిడ్జిపై విపరీతమైన వాహనముల రద్దీ మూలమున మా బస్సు ముందునకు పోజాలక ఆగిపోయెను. మాకు ఆవేదన ఎక్కువగుచుండెను. మా ముందు వాహనములు కదలగా వానితో మా బస్సుకూడ కదలెను. దారిలో మళ్ళీ రోడ్లకూడలి స్థలములవద్ద ఎర్రలైట్లు వచ్చుచుండుటచే బస్సు ఆగుచు నడచుచు ప్రయాణము సాగుచుండెను. ఆ ఢిల్లీ మహానగరము యొక్క వాహనముల హోరులో హారనుల మ్రోతలతో చెవులు దిమ్మెక్కుచెండెను. ఎలాగైతేనేమి! చిట్ట చివరకు సరిగా సాయంత్రము ఆరుగంటల నలభై యైదు నిముషములకు జనపథ్ రోడ్డులోని చంద్రలోక్ భవనముముందు మా బస్సునకు బ్రేకు పడగా మాలోని ఆనందపు వెల్లువ పెల్లుబికి కట్టలు త్రెంచుకొనెను. ✍

శ్లో. సర్వ సుగంధి సులేపిత లింగం
బుద్ధి వివర్ధన కారణ లింగం
సిద్ధ సురాసుర వందిత లింగం
తత్ప్రణమామి సదా శివలింగమ్.
కనక మహామణి భూషిత లింగం
ఫణిపతి వేష్టిత శోభిత లింగం
దక్ష సుయజ్ఞ వినాశన లింగం
తత్ప్రణమామి సదా శివలింగమ్.



దమనము (నిగ్రహము) వల్ల దేవతలు, రాక్షసులు , దానముచే మానవుడు తరించునని ఉపనిషద్వాక్యము.

# నలుబది నాల్గవ అధ్యాయం

## ఢిల్లీలో - మరియు - పిల్లలలో

శ్లో॥ కుంకుమ చందన లేపిత లింగం
పంకజ హార సుశోభిత లింగం
సంచిత పాప వినాశక లింగం
త త్ర్ప్రణమామి సదా శివలింగమ్.
దేవగణార్చిత సేవిత లింగం
భావై ర్భక్తిభి రేవ చ లింగం
దినకర కోటి ప్రభాకర లింగం
త త్ర్ప్రణమామి సదా శివలింగమ్.

ఆగష్టు పద్దెనిమిదవరోజు దాదాపు పదిగంటలకు పదిహేనుమంది గల మా 'జై కైలాష్' బృందము మోతీలాల్ నెహ్రూ మార్గ్ లోని తొమ్మిదవ నెంబరులోని మా అన్నగారి యింటికి వచ్చిరి. రెండు గంటల సేపు పిచ్చాపాటీ మాట్లాడుకొనిన తర్వాత టీలు త్రాగి ఫోటోలు దిగిన తర్వాత వారందరు వెళ్ళిపోయిరి. ఇంటికి వచ్చిన ఇతర మిత్రులకు అమృతమునిచ్చి విశేషములను తెల్పి భోజనానంతరం విశ్రమించితిని. ఆ రోజు సాయంత్రం మిత్రుడు దిలీప్‌గారి ఇంటికి నేను డా. గోడ్బోలే, ఘోషదాదా, కిషోర్, మాథుర్, రశ్మి గారలము పోయి వారి యింటిలో వేడివేడి పకోడీలు తిని టీలు త్రాగి పిచ్చాపాటి మాట్లాడి ఇల్లు చేరితిని. టి.వి. కార్యక్రమములు చూచి భోజనము చేసి పడుకొంటిని.

యాత్రలలో, ప్రయాణములలో, సంఘ సేవలలో, ఇతరత్రా కొందరు మిత్రులై కొన్ని నేలలో, రోజులో సంఘీభావముతో విడరాని బంధము పెంచుకొనుట జరుగును. వారు విడిపోవునపుడు ఎనలేని బాధా తప్పలగుదురు. దాదాపు ఆలాటి మిత్రత్వము ఈ శ్లోకము లాగా యుండునేమో.

శ్లో॥ ఇదంకాష్ఠం, మిదం కాష్ఠం, నదిమధ్యేయది సంగమం
సంయోగచ్ఛ, వియోగచ్ఛ, కాతత్ర పరివేదన.

తా॥ ఆ ఒడ్డు, ఈ ఒడ్డునుండి ఒక్కొక్క కొయ్య మొద్దు ప్రవాహములో కొట్టుకొనివచ్చి కలసి కొంతదూరము ప్రవహించును. ప్రవాహము చీలినచోట అవి చెరొకవైపు చీలిపోవును. అలాటిదే ఈ మైత్రియని దానికి చింతించవలసిన పనిలేదని తాత్పర్యము.

19వ ఆగష్టు దినమున పూర్తిగా విశ్రాంతి తీసుకొంటిని. కన్నాడ్ సర్కిల్‌కు పోయి ఫోటోలను డెవలపు కొరకు ఇచ్చి వచ్చితిని. భోజనానంతరం మా అన్నగారు

ఈరాన్ పోవుచుండగా విమానాశ్రయమునకు పోయి వారికి వీడ్కోలు చెప్పి తిరిగివచ్చు దారిలో గల శర్మగారల గృహము పోయి మానసోదకము నొసగి వారితో చాలసేపు మాట్లాడి ఇంటికివచ్చి టి.వి. చూచి భోజనము ముగించి పడుకొంటిని.

ఆగష్టు ఇరవై తేదీన స్వగ్రామ ప్రయాణమునకు సిద్ధమైతిని. పన్నెండు గంటలకు భోజనము ముగించి ఫోటో స్టూడియోకు పోయి దాదాపు 250 ఫోటోలను తీసుకొని మిత్రులైన శర్మగారింటికి వెళ్ళితిని. వారందరు ఆ ఫోటోలను చూచి ఎంతో సంతోషించిరి. కొంతసేపైన తర్వాత మరల కొత్త ఢిల్లీ స్టేషనుకు బయలుదేరగా నాతో శ్రీ యుగల్ శర్మ, శ్రీ కమల్ శర్మలు కూడా నన్ను రైలెక్కించుటకు వచ్చిరి. స్టేషనులో కిషోర్, డా॥ మోఖా, చొక్కారావుగారలు కూడ ఆ ఆం.ప్ర. ఎక్స్‌ప్రెస్‌లో నాతో పాటు వచ్చుచుండిరి. చొక్కారావుగారు దాదాపు పూర్తి ఆరోగ్యవంతులైరి. మందులుకూడ వాడుచుండిరి. మమ్ములను కలయుటకు దిలీప్ స్టేషనుకు వచ్చి మాకు పాదాభివందనము చేసి వీడ్కోలు ఇచ్చెను. రెండు గంటల పది నిముషములకు రైలు బయలుదేరినది. శర్మలు, దిలీప్‌లు వెడలిపోయిరి.

ఫోటోలను చూచుచు ఆనందించుచు యాత్రా స్మృతులను జ్ఞప్తికి తెచ్చుకొనుచు రోజంతయు రైలులో ప్రయాణించితిమి. ఆ రైలులోనే మిత్రులు సత్యప్రసాద్ నరసింహారావుగార్లు కూడా నావద్దనే కూర్చుండిరి. అందరము మాట్లాడుకొనుచు 'ఝాన్సీ' రైలు స్టేషనులో అల్పాహారములు ముగించి నిదురించితిమి. ఫోటోగ్రాఫ్‌లలో దృశ్య సౌందర్యముల పూర్తి గా ప్రతిబింబించడం సాధ్యముకాదు. అవి పరిమాణమును గాని, దిక్చక్ర సీమలను గాని సరిగా చూపవు. పోలికలను మాత్రమే ప్రదర్శించినా ఆ చిత్రములను చూచియే అమితానందముబొందుటకన్నా చేయగల్గినదేముండును.

ది. 21-8-1983 రోజున పన్నెండు గంటలకు మారైలు కాజీపేట జంక్షన్ చేరినది. స్టేషను వద్దకు నా కుమారులు చి॥ మదన్‌మోహన్, చి॥ రాజమోహన్‌లును వారితో పాటు మా అక్కగారి మనమడు చి॥ వెంకటేశ్ కూడా వచ్చిరి. ముందుగా నన్ను నాగడ్డమును చూచి గుర్తించకున్నా తర్వాత గుర్తించిరి. నాకు వారందరును పాదాభివందనము చేసిరి. నేను, కిషోర్ చొక్కారావుల వద్ద సెలవు తీసుకొని ఆటోరిక్షాలో హన్మకొండలోని నాయింటికి చేరువరకు నాకై ఎదురుతెన్నులు చూచుచున్న నా కుమార్తెలు కు॥ గీత, కు॥ అనితలు, శ్రీమతి లతయు నా వేషమును చూచి ముందు నివ్వెరపోయి వెంటనే అమాంతంగా వచ్చి కౌగలించుకొని అమితానందభరితులైరి. ఎన్నో సంవత్సరముల తరువాత చూచినట్లుగా వారి ఆనందమునకు అవధులు లేకుండెను. నాభార్య శ్రీమతి సరస్వతి నేను బాగా చిక్కిపోయినానని ఆహారము సరిగా దొరకలేదా యని బాధపడినది. తర్వాత అందరు నాకు పాదాభివందనము చేసిరి.

కుశల ప్రశ్నల తర్వాత స్నాన పూజలు ముగించి దాదాపు మూడు గంటలకు అందరము కలసి నాకై ఏర్పాటు చేసిన విందు భోజనము చేసితిమి. ఆ తరువాత పిల్లలందరు ఆ ఫోటోలను చూచి ఎంతో మురిసిపోయిరి. నా రాకను పురస్కరించుకొని బంధువులు మిత్రులు చాలమంది ఇంటికి వచ్చిరి. పెద్దలకు నేను నమస్కరించగా పిన్నలు నాకు పాదాభివందనలు చేసిరి. అందరికి మానస అమృతము నొసగితిని.

ఆ సాయంత్రము మా ''రుక్మిణీ సీతారామారావు స్మారక విద్యాలయము'' ప్రిన్సిపాలు గారైన శ్రీ కన్నయ్యగారు ప్రస్తుతము కీ॥ శే॥ వచ్చి విశేషములను విని ఎంతో ఆనందించిరి. నన్ను అభినందించిరి. మరియు నా యాత్రానుభవములు పుస్తక రూపమున వ్రాసి అచ్చు వేయవలసినదని ప్రథమముగా వారే నన్ను కోరినారు. ఆ సమయములో నాకు ఆ వాంఛ లేకున్నను - అప్పట్లో పత్రికాభిముఖంగా ఓ వ్యాసము వ్రాసి ప్రచురిస్తే చాలునని మాత్రమే - భావించితిని.

ఆ రోజు మా స్వగ్రామమైన 'వంగర' నుండి నా రెండవ అన్నగారైన మాధవరావుగారు కూడా రాగా వారికి పాదాభివందనము చేసి తీర్థప్రసాదములు ఇచ్చితిని. ఆ తర్వాత కూడ చాలామంది పిన్నలు పెద్దలు స్త్రీ పురుష బంధువులెల్లరు వచ్చి నాయాత్ర గురించి అడుగుటయు - నేను పదేపదే చెప్పినదే చెప్పుటయు చాలసేపు జరిగెను. అట్లు 13-7-1983 ఉదయము అక్కడ ఇంటి నుండి బయలుదేరిన నేను 21-8-83 అనగా దాదాపు మండలం రోజులకు క్షేమముగా తిరిగి చేరిన నేను ఈ యాత్రను నా పూర్వజన్మ సుకృతంగా భావించి నాకు జన్మనొసగిన పుణ్యదంపతులు నాతల్లి తండ్రులు, కరుణామూర్తులు కీ॥ శే॥ రుక్మిణీ, సీతారామారావుగారల వరముగా భావించి ఆనందించి తృప్తి చెంది ఆది దంపతులగు గౌరీ కైలాసనాధులకు మనఃపూర్వక శత సహస్ర కుసుమాంజలులు సమర్పించితిని.

## మా బృందములోని మిత్రుల అభిప్రాయములు

### శ్రీ దిలీప్‌కుమార్ :

న్యూఢిల్లీ 27-1-84

ప్రియమైన అంకల్ రావుగార్కి నమస్కారములు. మీరు పుస్తక రచన గావించుచున్నందులకు అమితానందము బొందుచున్నాను. అది తప్పక సఫలీకృతమగును. ఈ యాత్రలో మన నాల్గవ బృందములాటి బృందము మరేది లేదని భావిస్తాను. దేశము నలుమూలల నుండి మన బృందములో వచ్చినారు. ఇది సాహస కఠినయాత్ర. ప్రజా సహకారము క్రమపద్ధతి దీనికెంతో అవసరము. ప్రపంచములో కెల్లా పవిత్రమైన ఈ క్షేత్ర దర్శనము ధార్మిక సంబంధము. నాకు ఇంకా కొన్ని క్షేత్రములు దర్శించాలని

కాంక్ష గలదు. ఈ దారులు సౌకర్యము ఇంకా మెరుగుపడాలి. ప్రభుత్వము చొరవ తీసికోవాలి. వైద్య భోజనాది సదుపాయాలు ఇరువైపుల మెరుగుపడాలి.

ఇట్లు
దిలీప్‌కుమార్

**శ్రీ చౌదరి :**

నాగపూర్ 2-2-84

ప్రియమైన అంకల్‌కు నమస్కారములు. మీరు వ్రాయు పుస్తకము ఎంతో రమణీయముగను వివరణాత్మకముగను వుండి మీకు ఖ్యాతి తేగలదని విశ్వసిస్తున్నాను.

నాకు ఈ యాత్ర కఠినమైనదైనను ఆహ్లాదము కల్గినది. ఈ యాత్ర యొక్క ఆధ్యాత్మిక ప్రాముఖ్యము తెలిసిన బాగుండెడిది.

నాకు ఈ యాత్రపై గల కుతూహలమే ప్రేరేపించినది. మన బృందములో అందరు ఎంతో సహకారముతో యున్నారు. నాకేలాటి యిబ్బంది జరుగలేదు. ఇంకా యాత్రలు చేయతలంపున్నది. చైనా వైపు సౌకర్యములు మెరుగుపడాలి. కైలాస మానస పరిక్రమల్లో గైడ్లు అవసరము. అచట వినాశమైన గొంపాల వివరము తెల్పవలసియున్నది. మీకు ఏ అవసరమున్నను నన్ను యధాశక్తి వినియోగించుకోగోరుచు మరొకసారి మీకు, ఆంటికి నమస్కారములు తెల్యచేస్తు విరమిస్తున్నాను.

ఇట్లు
వి. డబ్ల్యు. చౌదరి

**డా. కమలా మోఖా :**

నాగపూర్ 22-1-84

అంకల్ రావుగార్కి నమస్కరించి నూతన సంవత్సర శుభాకాంక్షలు. మధ్య మధ్య లేఖలు వ్రాయుచు మీ ఆశీర్వాదములు పంపగలరు. ఈమీరు వ్రాయు పుస్తక ప్రామాణికతకు విషయ సంగ్రహతకు పౌరాణిక గాధల తెల్పుచు పండితుల అభిప్రాయముల సేకరించు మీ వజ్ర సంకల్పముచే భావితరాలకు మీ సంగ్రంథముచే యెనలేని లాభము చేకూరుటే కాక మీకు ఖ్యాతి తెచ్చునని విశ్వసిస్తూ ఆనందించుచున్నాను.

ఈ యాత్ర నాకు ఒక కలగా ఆత్మ సంబంధిని యైనదే యనుట యధార్థ విషయము. ఇది అతి పవిత్ర యాత్ర యని ఇంతకు మిక్కిలిలేదని నా విశ్వాసము. నా యొక్క విద్యాదేవత మానస సరోవరమున ప్రత్యక్షముగా ఆదిశక్తి అవతారమున సాధకులకు సాధన ద్వారా ఇచ్చు సాక్షాత్ శక్తిరూప పవిత్ర ప్రదేశము.

రావణుడు తపమొనరించినది దేవతలు స్నానమొనరించునది ఆ సరోవరము. అందుకే ఆ జలము అతిపవిత్రమైనది. నే నా జలమును చిరకాలముంచుకొని స్పృశిస్తు పావనమగుదును. సాధువులు సిద్ధులు అచటి ప్రశాంత వాతావరణముచే జ్ఞానమధువును గ్రోలుచుందురు. ఓషధీ సంపదయు నచటగలదని నా విశ్వాసము.

పర్వతారోహణ గురించి నాకు తెల్యకున్నను మీ అందరి సహకారముచే నే బాధలు లేక యాత్ర సలిపినాను. రు. 3000/- సరిపోవునని తప్పుడు సమాచారము టి.వి.లో ప్రభుత్వము వారు యిచ్చినారు. నాలా ధనహీనులకు దీనిచే యిబ్బంది జరుగును. కఠినయాత్రచే కల్గిన బాధలన్ని ఉపశమించినవి. ఇపుడు ఎంతటి కఠిన యాత్రలు చేయనైన సాహసించగలను. ఆత్మ జ్ఞానము లాటివి వీనిచే ప్రాప్తించునని నమ్ముచున్నాను. మీరేదేని యాత్ర తలపెడి తే నాకు తెల్యచేయగలరు.

లిపుపాస్ నుండి గుర్రపుస్వారీవల్ల చాలా బాధలు గలిగినవి. రోడ్డు వేసి వాహన సౌకర్యము క ల్గించుట అవసరము. మన ప్రభుత్వము అంతర్జాతీయ యాత్రలు ఏర్పాటు చేసి విశాల దృక్పథమును కనబరచాలి.

ఈ మధ్యనే **Flying Club SPL** లో చేరినాను. అవకాశము వస్తే **Space Research Centre** లో చేరు వాంఛ యున్నది. మీకు, ఆంటికి నా యొక్క గౌరవ నమస్సులు. నేనేదేని సేవ చేయగలిగితే నిరభ్యంతరముగా నెల్లపుడు స్వాగతము తెల్యచేయుచున్నాను.

ఇట్లు
కమలా మోఖా

**ఘోష్ దాదా :**

కలకత్తా 16-2-84

ప్రియమైన రావుజీగార్కి నమస్కారములు,

మీరు పుస్తకము వ్రాయుచున్నారని తెలిసి యెంతో ఆనందించుచున్నాను. బెంగాలీలో ఈ యాత్ర గురించి వ్రాయుట నేనును మొదలిడినాను. మీవద్దల గల వివరముల నాకు పంప ప్రార్థన.

చాలా రోజుల నుండి ఈ యాత్ర పగటికలగా నుండెను. ఎందుకనగా లోగా బదరీ, కేదార, పశుపతినాథ, పంచకేదార, గంగోత్రి, యమునోత్రి, గోముఖి, హేమకుండ్, ముక్తినాథ్, అమర్‌నాథ్ యాత్రలన్నియు చేసినాను. దక్షిణాదిలో ద్వారకా, క న్యాకుమారి, అండమాన్ నికోబార్ కూడా మరోసారి వెళ్ళి వచ్చినాను. పై వానికి ఈ యాత్రకు ఎంతో భిన్నత్వము కలదని సగర్వముగా చెప్పగలను. నేను ఈ దారి

వెంట తిరిగిరాలేను. ఇల్లు చేరను. అను తలంపుతో ప్రయాణించినను భగవంతుడు కరుణించి ఇల్లు చేర్చినాడు.

నేను ఒక సామాన్యుడిని. డబ్బు అంతగా వె చ్చించే పరిస్థితి లేకున్నా క్షేత్ర దర్శనముల ముందు అది తృణప్రాయము. యాత్రలో ఇరువైపుల మనషులు సహకరించినారు. మీరందరును నాకు సహకరించి ప్రేమ చూపినారు. కాని ఈ ముసలివాడే ఎవరికి సహకారి కాలేదు. మన 4వ బృందములో గల సహృదయులు, భక్తులు, విద్యావేత్తలు వేరే బృందములో లేరనే నా నమ్మకము. నాకు హిమాలయాకర్షణ మెండగుటచే నన్ను గృహమునకు విముఖుని గావించినది. ఇరువైపుల సదుపాయములు బాగున్నవి. కాని పరిక్రమలు రెండుకు బదులు 3 రోజులుంటే బాగుండెడిది. తక్లాకోట్ గెస్ట్‌హౌజులో స్నాన, లాట్రిన్ వసతులు లేక ఇబ్బందిగా యుండెను; అవి యేర్పాటు చేయాలి. ఈ యాత్రకు ముందుముందు 50 సంవత్సరములలోపు వారినే యెన్నిక చేస్తారని విన్నాను. అది చాలా అన్యాయము. అది జరుగకుండా చూడగలరు. చాలా కృతజ్ఞతలు; మరో సారి శుభాకాంక్షలు.

ఇట్లు
ఘోష్‌దాదా

ఈ కైలాస యాత్రలో 1985 సంవత్సరపు బృందములు మరికొన్ని సౌకర్య సౌలభ్యములు బొందినట్లు తెలిసినది. కైలాస పరిక్రమ 3 దినములు మానస పరిక్రమ 3 దినములు మరియు ఖోచార్‌నాథ్ దేవాలయ దర్శనము మరియు కైలాస మానస క్యాంపులలో మరొక రోజు నిలుచు యేర్పాటు చేసినట్లు తెల్సినది.

తక్లాకోట్‌లో వసతులు బాగానే యున్నవి; కాని బహిర్ మరియు స్నాన వసతులు అధ్వాన్నముగా యుండెను. వాని గురించి అచటి వారికి తెలిపియుంటిమి. బహుశః బాగుపరచవచ్చునని ఆశిద్దాము. ఇంకో ముఖ్య విషయమేమనగా ఇరువైపుల ఒక్కొక్క యాత్రీకునిపై వసూలుచేయు డబ్బు చాలా అధికముగా యున్నది. దీనిని ఇరు ప్రభుత్వములు తగ్గించవలసిన ఆవశ్యకత యున్నది. మరొక ముఖ్య లోటు యేమనగా చైనా స్వదేశ, పొరుగు దేశ, వార్తావిహీనముగా నున్నది. అచట యేమి జరిగినను భారతదేశమునకు తెల్యజేయుటకు కేవలము 22 కి.మి. దూరము; తక్లాకోట్ మన సరిహద్దుకు యున్నా వార్త తెలియుటకు అయిదారు రోజులు పట్టును. కావున దీనికి యేదైనా సులభ మార్గ మాలోచించి యేరోజుకారోజు మన బృందము యెచట యే పరిస్థితులలో యున్న వార్తలు లిపుపాస్‌కు అందించుట యెంతేని అవసరమై యున్నది. ఈ రెండవ ముద్రణ జరుగు సమయానికి పై communicatoin బాధలు చాలా వరకు తొలగియుండును. నేడు దేశవిదేశాలకు నిమిషాలలో వార్తలు, సందేశాలు ఫోన్ల ద్వారా T.V. ల ద్వారా చేరుచున్న విషయము మీరెరుగుదురు కదా!

శ్లో. అష్టదళో పరి వేష్టితలింగం
సర్వసముద్భవ కారణలింగం
అష్ట దరిద్ర వినాశన లింగం
త త్ప్రణమామి సదా శివలింగమ్.
సురగురు సురవర పూజితలింగం
సురవర పుష్ప సదార్చితలింగం
పరమపరం పరమాత్మకలింగం
త త్ప్రణమామి సదా శివలింగమ్.
లింగాష్టక మిదం పుణ్యం యః పఠే చ్ఛివసన్నిధౌ
శివలోక మవాప్నోతి శివేన సహ మోదతే.
(ఇతి లింగాష్టకమ్)

శ్లో: ''కరచరణకృతం వా కర్మ వాక్కాయజం వా
శ్రవణ నయనజం వా మానసం వాஉపరాధం
విహిత మవిహితం వా సర్వ మేతత్ క్షమస్వ
శివ శివ కరుణాబ్ధే శ్రీ మహాదేవ శంభో!''



 మాండవ్యుడు చిన్నతనములో తూనీగల రెక్కలకు ముల్లుగ్రుచ్చిన పాపమునకు రాజుచే కొరత వేయించబడెను. అందుచే మన పిల్లలు జీవులను హింస పెట్టకుండ చూడవలయును.

 మాంసాహారము విసర్జించినవానికి నూరేండ్ల తపస్సుచేసిన ఫలము కలుగును.

 సత్యంవద, ధర్మంచర' వేదవాక్యము, భారతం దీనిని చక్కగా వివరించెను.

 అహింసాపరులడు అందముగా, ఆరోగ్యముగా, ఐశ్వర్యవంతుడై పు ట్టును.

# నలుబది ఐదవ అధ్యాయం

## తీర్థములు వాని ప్రాశస్త్యము

శ్లో. గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసమ్ ।
రామాయణ మహామాలా రత్నం వందేఽనిలాత్మజమ్.
అఙ్జానానన్దనం వీరం జానకీ శోకనాశనమ్ ।
కపీశ మక్ష హన్తారం వందే లంకాభయంకరమ్.
ఉల్లంఘ్య సిన్ధో స్సలిలం సలీలం ॥
య శ్శోక వహ్నిం జనకాత్మజాయాః
దాయ తేనైవ దదాహ లంకాం ।
నమామి తం ప్రాఞ్జలి రాఞ్జనేయమ్.

స్నానము సంధ్య తీర్థాటనముల వలన కలుగు ఫలములు జ్ఞానులకు బాగుగా తెలియును. వానిచే సాధుజన సమాగమము సారాసార విచారము నెరిగి భక్తులకు నీశ్వర ప్రాప్తి సుగమ మగును. గురుభజన సత్య స్వరూపము గుర్తించ వీలగును. వివేకముతో గురు రూపమున లీనము గావచ్చును. తీర్థ యాత్రలచే దేశాటనచే ననేక ఫలములు గలుగును.

శ్లో. తీర్థే తీర్థే నిర్మలం బ్రహ్మ బృందమ్।
బృందే బృందే తత్త్వ చింతానువాదః।
వాదే వాదే జాయతే తత్త్వ బోధో ।
బోధే బోదే భాసతే చంద్రచూడః.

యాత్రలచే వివిధ ప్రదేశములందు వాసము చేయవలసి వచ్చుటచే వివిధ ఆధి భౌతిక తాపానుభవము గలుగును. భిన్న భిన్న మానవ సమాగమముచే భిన్న భిన్న ప్రవృత్తుల మానవ పరిచయము గలుగును. వివిధ ప్రదేశములందు గల ధార్మిక సామాజిక రాజకీయ ఆచార వ్యవహార శోధన గలుగును. సాధు సాంగత్యముచే ఆధ్యాత్మిక రహస్యముల గ్రహించ వీలగును. లోక జ్ఞానము వృద్ధి యగును. ముఖ్యముగా ప్రకృతి ప్రసాదించిన శృంగార చమత్కార రమణీయ దృశ్య సందర్శనా భాగ్యము గలిగి నయనా నందకరమై పరమానందము బొంద వీలగును.

తీర్థ యాత్రలచే జ్ఞానధారణ జ్ఞాన వైరాగ్య భక్తి ప్రపత్తులు యలవడి పరమార్థ సాధనకు తోడ్పడును. ఏకాగ్ర చిత్తము మిధ్యా భాషణము దురాచార దుష్ప్రవృత్తి దుష్కార్యముల దూరీ కృతము జేయు సమర్థత జేకూరును. దానములు వ్రతములు తీర్థాటన ఇత్యాది సేవనవలన సాపేక్షములే. శారీరక సంబంధ పాపము తీర్థ స్నానాదులచే

విమలమగును. కాని కర్మకృత మాలిన్యము వీడదు. కావున చిత్తము వహించి జ్ఞాన నిష్ఠ ద్వారా స్వధర్మ పాలన సత్యాహింసల పాలన మాతా పితరుల మానవ దీనజన సేవల ద్వారా కూడ సకల పుణ్య తీర్థ ఫలితములు సకల కళ్యాణములు చేకూరును. ☝

చ. సార విచార చిత్తు డగు సాధువు శక్తి కొలంది గాగ నా
చార విధాన లక్షణము సల్పుట ధర్మము ఆతడే సదా
చార విదూరుడైన యెడ జాతికి ధర్మ నెరుంగ జేయును
ద్ధారకు డెట్లు తా నెటుల తత్త్వ మతండు గ్రహింపజాలెడిన్

చ. అనిశము తీర్థయాత్రలకు నైతిరిగాడు జనుండు దైవతం
బును గుర్తింపగావలయు బూనికతోడుత నంతరాత్మనుం
గనవలె శ్రద్ధ గల్గి మనగావలె నట్లొనరిపంకున్నచో
జనిఫల మేమి తీర్థముల చాయకు లేవె శివాదులంతటన్. (దాసబోధ)

☝ పురాణ ప్రసిద్ధములైనవి దైవ ఋషి పితృ బ్రాహ్మణ తీర్థములని నాలుగు విధములు. ఇవి కాక స్థల జల పర్వత సంగమ ఆశ్రమ తీర్థములని వివిధ తీర్థముల ప్రశంసలు మన పురాణేతి హాసములలో కోకొల్లలు.

1. **స్థల తీర్థములు** : పూర్వకాలమున నేదో యొక సన్నివేశము జరిగి భగవంతుని జననమో లీలలో జరిగియున్న చోటులు ఉదా: అయోధ్య మధుర కాశి రామేశ్వరము ఇత్యాదులు.

2. **జల తీర్థములు** : జలము యొక్క పవిత్రత ఆ జలోద్భవమునకు ప్రాశస్త్యము గల్గి యుండును. ఉదా ! గంగా (భగీరధ ప్రయత్నముచే శివుని జటా జూటము నుండి ఉద్భవించినది) యమునా, సింధు, కావేరి, కృష్ణా మున్నగునవి.

3. **ఋషి తీర్థములు** : ఆది యందు ఋషులు వారు తప మాచరించుటతో యజ్ఞ యాగాదులు సలుపుటతో జరిగినవి. ఉదా: వ్యాసతీర్థము, కపిలతీర్థము మున్నగునవి.

4. **పర్వత తీర్థములు** : భగవంతుడు అవతారమెత్తియో మరే బలవత్తర కారణముననో నచట ప్రతిష్టింపబడుట. ఉదా: తిరుపతి శ్రీశైలము అన్నవరము సింహాచలము సుమేరువు గంధమాదనము యాదగిరి ఇత్యాది పర్వతములు.

5. **సంగమ తీర్థములు** : రెండు లేక ఎక్కువ నదులు సంగమించు నదీ తీరములు. వీనికి శాస్త్ర ప్రకారము 12 సం॥ కొకసారి అమోఘ శక్తులు గలుగును 'కుంభమేలా' జరుగునపుడు లక్షల సంఖ్యలో జనులచట స్నాతులగుదురు. అలహాబాద్

త్రివేణీ సంగమం కాళేశ్వర త్రివేణీ సంగమము సోన ప్రయాగ్ నంద ప్రయాగ్ కర్ణ ప్రయాగ్ మున్నగునవి లెక్కకు మించి యున్నవి.

ఉత్తర భారతదేశ హిమాచల ప్రాంతములో ముఖ్యమైనవి శివ శక్తి సంప్రదాయ తీర్థములు మరియు ఎనలేని దర్శనీయ క్షేత్రములు నున్నవి. అట్లే దక్షిణాదిలో వైష్ణవ సంప్రదాయ తీర్థములు విరివిగా నున్నను శివ క్షేత్రములు ననేకములున్నవి.

## హిమాచల ప్రాంత ముఖ్యక్షేత్రములు

✍ 1. **అమర్‌నాథ్** : ఇది కాశ్మీరు రాష్ట్రములో హిమ పర్వత గుహలో గల 13000 అ. ఎత్తు ప్రదేశమునగల హిమలింగము. శ్రావణ శుద్ధ పౌర్ణమికి ప్రతి యేడు వేలాది భక్తులు దర్శించి పావనమగుదురు. అచట గల పవిత్ర అమర గంగలో స్నానమాడి భక్తులు అమరనాథుని దర్శించి ముక్తిబొందుదురు. మంచు శివలింగముతోపాటు మంచు పార్వతి గణపతి యొక్క హిమమూర్తులను చూడనగును.మంచు లింగము శ్రావణమాసములో పెరుగుచు పౌర్ణమినాడు పూర్ణ లింగమై మరి 15 రోజులకు అనగా అమావాస్య వరకు ఏమీ యుండదు. గాధ : అనాది కాలమున శివపార్వతులు ''జీవుని జనన మరణ రహస్యమును'' చర్చించుచుండ అప్పుడే గ్రుడ్ల నుండి బయటపడిన రెండు పావురము పిల్లలు ఆ రహస్యము వినెను. అందుకై ఆ పావురములు జరామరణరహితమయ్యెను. ప్రతి సంవత్సరము పౌర్ణమి రోజు అంతటి చలిలో మంచులో నవి యాత్రికుల నమరత్వము బొందించుటకు దర్శన మిచ్చును. తర్వాత నవి అగుపడవు. శ్రీనగర్, పఠాన్‌కోట్, చందన్‌వాడి, పహల్గాం ద్వారా గల దారి గుర్రము నడక ద్వారా భయంకర చలిలో మంచులో పయనించవలసి యుండును.

2. **వైష్ణవీదేవి** : ఈ దేవి స్వయముగా తన త్రిశూలముచే నిర్మించుకొన్నదని ప్రతీతిగలదు. కాశ్మీలో జమ్మూ నగరమునకు 31 మైళ్ళ దూరమునగల గుహాలయము. సంవత్సరమంతయు నీ దేవిని దర్శించవచ్చును. దేవీ నవరాత్రి ఉత్సవ సందర్భమున ప్రజావెల్లువ అధికము.

3. **జ్వాలాముఖి** : అమృత్‌సర్ పఠాన్‌కోట్ రైలుమార్గమున జ్వాలా ముఖి స్టేషను నుండి 13 మైళ్ళు బస్సు ప్రయాణము ద్వారా పోనగును. శతాబ్దముల తరబడి నీ క్షేత్రమున అఖండ అగ్నిజ్వాలలు వెలుగొందుచున్నవి. సతీ దేవి ఖండిత ''జిహ్వా'' ప్రదేశమని పౌరాణిక గాధ.

4. **వజ్రేశ్వరి** : అష్టాదశ శక్తి పీఠములలో నొకటి. సతి ఖండిత శిరః ప్రదేశమని ప్రతీతి.జ్వాలాముఖికి 18 కి. మీ. దూరమున కాంగ్డా వద్ద గలదు. చైత్రాశ్వీజ మాసములలో నుత్సవములు జరుగును.

**5. బైద్యనాథ మందిరము** : కాంగ్డాకు 70 కి.మీ. దూరము. ఇది శివాత్మలింగముగా ప్రసిద్ధి. చిన్న కొండపై గలదు. రావణుడు కైలాసము నుండి ఈ ఆత్మ లింగము గొనిపోవుచుండ విష్ణువు వేషధారియై ఉపాయముచే లింగమును భూమిపైనుంచి అంతర్ధానమైనట్లు పౌరాణిక గాథ.

**6.తారణ్ మాతా మందిర్** : ఇది మండి నగరమునకు 450'ల ఎత్తు కొండపై గలదు. మూలవరులు తారణ మాతాదేవి.మూలమూర్తి ఉగ్ర తార మహోగ్ర దేవతల నామములతో త్రిశిరదేవి విగ్రహ మున్నది. మధ్య శిరస్సు నామముచే తారన్ మాతా మందిర్-కొండ-లోయలకును పేర్లు గలవు. అత్యంత మహిమోపేతముగుదేవి. ఇచట నుండి కొంత పైకెక్కినచో కులూ లోయ పర్వతమంచు శిఖరముల సౌందర్యశోభ గాంచనగును.

**7. బిజిలీ మహాదేవ మందిర్** : ఝూరీ గ్రామమునకు 10 కి.మీ. దూరము. పర్వతాగ్రమున ఆలయము. రాత్రిళ్ళు వాస యోగ్యము కాదు. 60'ల ధ్వజస్తంబ మీమందిరమున గలదు. ప్రతి యేడు ఆ ధ్వజస్తంభము పై "పిడుగులు" పడుటయు స్తంభము ద్వారా పిడుగులోన గల శివలింగము బ్రద్దలగుట పూజారి గంజితో దానిని అతుకుట ప్రతిష్ఠించుట ప్రతి సంవత్సరము ఇలా జరుగుట అచటి విశేషము.

**8. హరిద్వారము** : డెహ్రాడూన్ పట్టణమునకు 40 కి.మీ. దూరాన గల పెద్ద పట్టణము. అనేక మందిరములు, ఆశ్రమములు, ధర్మశాలలు, హరిని దర్శించు దోవలోని ముఖద్వారాము, గంగాతీర పుణ్యక్షేత్రము. మానసాదేవి మందిరము పర్వతాగ్రమున గలదు. పైకి పోవుటకు 'ఊయల' మార్గము గలదు. అంజనేయధామ్ శ్రీ కృష్ణధామ్ మున్నగున వెన్నో ఆలయములున్నవి.

**9. హృషీకేశము** : పెద్ద పట్టణము. గంగమైదానమున చేరు క్షేత్రము. హిమవ పాదభూమి. హరి ద్వార్ నుండి 11 కి.మీ. అనేక సత్రములు, మందిరములు గలవు. లక్ష్మన్ ఝూలా, 14 అంతస్థుల మందిరము, గీతా మందిరములు ఆకర్షణీయములు నయనానందకర సిద్ధ సాధు క్షేత్రము.

**10. యమునోత్తరి** : యమునా నది జన్మస్థానము. 11000'ల ఎత్తు. హృషీకేశమునకు 210 కి.మీ. కేదారనాథ మార్గములో కొంత పైన గలదు. ఇచట 194.7 డిగ్రీల వేడిగల ఉష్ణ గుండము ధారలు గల "తప్తకుండము" గలదు. బంగాళాదుంపలు బియ్యము మూటగట్టి అందుంచిన పక్వమగును. యమునాదేవి మందిరములో తాబేటి పైనున్నది.

**11. ఉత్తరకాశి** : ఉత్తరప్రదేశ రాష్ట్రములో నొక జిల్లా కేంద్రము. వేదశాస్త్ర పురాణ పండితుల కావాసము. జప తప నిష్ఠా గరిష్ఠుల నిలయము. వరుణ,అస్సీ

నదుల సంగమము. ఏకాదశ రుద్రమందిర్ కాశీ విశ్వనాథమందర్‌లలో ధ్వజ స్తంభములకు బదులుగా ఇరవై అడుగుల త్రిశూలములున్నవి. ఇవి గాక అచట కోటీశ్వర, గోపీశ్వర, కీర్తి వాసేశ్వర, కాలభైరవ, పరశురామ దేవ, ఓంకారేశ్వర, శంకరాచార్య, లక్షేశ్వర మున్నగు మందిరములున్నవి.

**12. గంగోత్తరి :** ఇది ఉత్తరకాశీకి 70 మైళ్ళ దూరములో 10300 అ. ఎత్తున గంగ క్రిందికి దిగు పవిత్ర ప్రదేశము, మార్గమధ్యమములో దట్టమైన దేవదారు వృక్షములు రకరకాల ప్రకృతి పుష్ప వనములు కల్గి నయనానంద భరితమగు ప్రదేశము. ఇచటనే గంగా మాతాజీ మందిర మున్నది.

**భగీరథ చరిత్ర :** పూర్వము ఇచటికి 14 మైళ్ళు దూరమున సగర చక్రవర్తి అశ్వమేధ యాగము గావించెను. ఇంద్రుడు యాగాశ్వము నపహరించి తప మాచరించు కపిల మహాముని చెంత నుంచెను. గుర్రము జాడ తెలిసికొనుటకు సగరుని పుత్రులు భూమిని త్రవ్వుచు వెదకుటచే తర్వాత నవి సాగరము లయ్యెను. వీరందరు కపిలముని చెంతకు చేరి దొంగవని తూలనాడగా కపిలుడు శపించి వారందరిని భస్మము గావించెను. భస్మమైన వారికి కర్మల గావించుటకు గంగోదకము కావలసి వచ్చెను. కాని స్వర్గమున నున్న గంగను తెచ్చుటకు వారి కుమారులకు మనుమలకు చేతకాకపోయెను. చివరకు వారి ముని మనుమడు భగీరథుడు పితృకర్మల చేయ సంకల్పించి ఆ ప్రదేశమున ఘోర తపమొనరించి యనేక విఘ్నముల నెదుర్కొని శివజటాజూటమునగల గంగా దేవిని ఈ స్థలమున భూలోకమునకు దింపెను. ఉత్తరియనగా దిగుట. కావున గంగ దిగిన ప్రదేశము కావున 'గంగోత్తరి' యని ప్రసిద్ధి గాంచినది.

**13. గోముఖి :** ఇది గంగోత్తరికి 14 మై. దూరమునగల గంగావతరణ ప్రదేశము. చాలా కఠినమై ప్రమాద భరితమయిన మంచు దారి యున్నది. దీని పై భాగమున 0 చ.మై. విస్తీర్ణముగల సమతల ప్రదేశము 'అలకాపురి' అనగా కుభేరుని నగరముగా ప్పుదురు. ఇపుడచ టంతయు మంచుచే నిండి యున్నది. దీని క్రింది నుండియే ంచు కరగి నురగలతో అతి వేగముగా ప్రవహించును గాన 'గంగాభవాని' యాయెను. ఈ ప్రదేశమున ఏ వసతి లేకుండుటచే అదే రోజు తిరిగి గంగోత్తరి చేరవలయును. ఈ ప్రదేశమునకు తూర్పునగల స్వర్గారోహణ పర్వత, నారాయణ పర్వతములు, బదరీ క్షేత్రములు గలవు. కాని అవి దాటుట అసాధ్యము. పశ్చిమమునగల నీలకంఠ పర్వతము దాటిన కేదారనాథ క్షేత్రము గలదు. 22000' ఎత్తున్న ఈ పర్వతమును దాటుట దుస్సాధ్యమేకాని ఆంధ్రుడగు నెల్లూరు జిల్లా వ్యాస్తవ్యుడు శ్రీ సుందరానంద స్వాములు గారు మాత్రము దానిని దాటి బదరీ క్షేత్రము చేరినట్లు గాథ కలదు.

**14. అగస్త్యముని :** రుద్రప్రయాగ నుండి 18 కి.మీ. దూరమున నున్నది. బస్సు సౌకర్యము గలదు. అగస్త్యముని తపమొనరించిన పుణ్యక్షేత్రము.

**15. గుప్తకాశి :** ఇది రుద్ర ప్రయాగ దాటిన తర్వాత గలదు. పుష్పలతాదులచే పరిమళించు క్షేత్రము. ఇచట విశ్వనాథాలయము అర్ధనారీశ్వరాలయములు స్ఫటిక విగ్రహములు అందు విరాజిల్లుచుండును. మహానంది క్షేత్రమునగల కుండములాటి కుండము 4' అడుగుల లోతుగల్గి ఎల్లవేళల రెండు నీటి ధారలచే నింపబడుచుండును. దీనికి దగ్గరలో ఊఖీమఠము గలదు.

**16. త్రిజోగీ నారాయణము :** ఇచట గంగోత్తరి, యమునోత్తరి నుండి వచ్చు మార్గములున్నవి. ఇది చాలా పురాతన క్షేత్రము. పార్వతీ పరమేశ్వరుల కళ్యాణ మిచట జరిగినట్లు ఆధారములు చూపబడినవి. జగత్పితరుల కళ్యాణమున రగిల్చిన హవనాగ్ని నేటికిని ప్రజ్వరిల్లుచున్నది. వసతులున్నవి. యాత్రీకులు భస్మము తెచ్చుకొందురు. 3 కి.మి నడచి లేదా గుర్రములపై ప్రయాణము.

**17. గౌరీకుండము :** ఈ ప్రదేశమున నొక వేడి నీటి కుండమున్నది. ఇది చాలా చలిగల ప్రదేశము. అయినను ఈ వేడి నీటి కుండమున యాత్రికులెల్లరు స్నాన మాచరింతురు. ఇచటి వరకు బస్సుల సౌకర్యమున్నది. ఇట నుండి కేదార నాథము 22 కి.మీ. గుర్రాలపై కాని నడిచికాని వెడలవలయును. మందాకినీ న దీ తీరము.

**18. కేదార నాథము :** ఇది ద్వాదశ జ్యోతిర్లింగములలో తొమ్మిదవది. దీని చుట్టు ఎత్తైన పర్వతములు సర్వదా హిమముచే కప్పబడి యుండును. 12000 అ ఎత్తున నున్నందున వృక్షములేకాక పొదలు కూడాయుండవు.ఈ ఆలయము మందాకినీ నదీ తీరమున గలదు. దీనిని పంచ నదీ సంగమ మందురు. ఆలయములో 4'( ఎత్తు, 4' అడుగుల వెడల్పుగల శిలాలింగము మూపురము ఆకారములోనున్నది. యాత్రికులెల్లరు స్వామిని తాకి అభిషేకించవచ్చును. దీని చెంత పంచ పాండవుల ఆలయ మున్నది. ఇట నుండియే పాండవులు ద్రౌపదితో స్వర్గధామమునకు వెడలిన మహాప్రస్థాన మార్గము గలదు. ఈ ఆలయము 6 మాసములు మూయబడియుండి మే నెలలో ద్వారము తెరచు సమయమున జ్యోతి దర్శనమును యాత్రికులనేకులు దర్శించెదరు. ద్వారములు బంధించిన 6 మాసముల వరకు జ్యోతి అలాగే వెలుగుచుండును. బదరీ క్షేత్రమున కూడ ఇలాగే యుండును. ప్రకృతి శోభాయమానముగా యుండును. శ్రీ శ్రీ శ్రీ ఆదిశంకరులు ఇచటనే సిద్ధిబొందిన చరిత్ర గలదు. వారి యొక్క సమాధి కేదారనాథాలయము వెనుకగా మందాకినీ నదీ తీరమున గలదు. ఇచట యెత్తు ప్రదేశము కావున ఆమ్లజని తగినంత లభించదు. బి.పి. గల వారికి కొంత కష్టమగును. వారు రాత్రి నిలువరాదు. మంచు ఎల్ల వేళల చాలా దగ్గరలో పర్వతములపై కనిపించి శోభ గొలుపును.

**19. పంచ కేదారములు :** పంచ పాండవులు ద్రౌపదీ సహితముగా మహాప్రస్థానమున బోవుచుండగా నీ ప్రదేశమున శివుడు మహిష రూపమున దర్శనమిచ్చెను. ఆ

ష్టమయమున భీముడు తన గదచే ఆ మహిషమును తరుమగా రుద్రనాధ్ యనుచోట ముఖము మాత్రము దర్శనమిచ్చెను. అందుచే రుద్రనాధ్‌లో గల లింగము మహిష ముఖముతో నున్నది. భీముడు అలా తరుమగా కేదారమందు ఆ మహిషము పృష్ఠరూపమున దర్శనమీయగా లింగాకారము పృష్ఠముగా నున్నది. అలాగే మహేశ్వర క్షేత్రమున ముందు కాళ్ళ రూపమున శివలింగము అలాగే కల్పేశ్వర్ యను క్షేత్రమున మహిషజటము దర్శింపబడినందున శివలింగము జటారూపమున నున్నది. అందుచే పైన తెల్పిన వివిధ వృషభాకృతిలో నున్న శివలింగములను పంచకేదారములని తెల్పచేయబడినవి.

**20. ఊకీమఠము :** కేదారనాధ్ నుండి తుంగనాధ్ వెడలు మార్గ మధ్యమున గల ఈ ప్రదేశమున పంచముఖ్. కేదారనాధుని దర్శించనగును. ఈ మందిరమున మాంధాత మహారాజు విగ్రహమును ఓంకారేశ్వర మహాదేవుడును కేదారనాధుని బంగారు ఉత్సవ విగ్రహములును గలవు. కేదారేశ్వరుని ద్వారబంధనానంతరము ఆరు మాసము లాయనకు నిచటనే పూజా విధులు జరుగును. తుంగనాధ పార్వతుల అష్టధాతు విగ్రహములు అర్ధనారీ నటేశ్వర విగ్రహము కాళీ చతుర్భుజ నారాయణ విగ్రహములు కూడ గలవు. ఇచటికి కొంతదూరమున గుప్త గంగానదియు గలదు.

**21. తుంగనాధము :** భీమచట్టీ నుండి 3 మై. ఎక్కిన తుంగనాధము వచ్చును. ఇచట ఆకాశ గంగాధార కొండపైన అమృతకుండమున బడుచోట యాత్రికులు స్నాన మాచరింతురు. తర్పణములు విడతురు. నల్లరాతి కట్టడపు శివాలయముపై బంగారు కలశ మున్నది. ఇచట కేదారనాధ మహేశ్వర రుద్రనాధ శంకరాచార్య కాలభైరవ ేదవ్యాస మున్నగుననేక అష్టధాతు విగ్రహముల గాంచనగును. ఇది 13000 అ. ెత్తున గల మహోన్నత శిఖరము గావున మేఘము లడ్డు రాకున్న భూతద్దములచే ంచ చూలి గంగోత్తరి నందాదేవి గంధ మాదన ధవళగిరి గౌరీశంకర్ మున్నగు హిమ ిఖరములే కాక బొంబాయి ఢిల్లీ మున్నగు నగరముల గాంచనగును. ఇచట చేరిన వారీ దృశ్య దర్శనముచే ప్రయాణబడలికనంతయు మరచి స్వర్గసీమ చేరిన అనుభూతి పొందుదురు.

**22. గోపేశ్వరము :** ఇచట గోపేశ్వర స్వయం భూలింగము పార్వతి విగ్రహము గలదు. పరశురాముడు 21 సార్లు క్షత్రియుల దునుమాడి మహేంద్రగిరికి తపస్సునకు వెడలునపుడు తన గండ్ర గొడ్డలి నిచట నాటినట్లు గాధలున్నవి. హరిద్వార్ నుండి బదరీకి వెడలుదారిచట కల్యును.

ముందుగా నిచట శ్రాద్ధ పిండతర్పణ లాచరింతురు. గంగోత్తరి యమునోత్తరిల కిటునుండి దారి గలదు.

**24. వ్యాసఘాట్ :** వ్యాసులవారు పూర్వ మిచట తప మొనరించిన గాధ కలదు. భాగీరథీ వ్యాసగంగల సంగమము.

**25. శ్రీనగరము :** ఇది బదరీ బోవు మార్గమున నున్న హిమాలయము లోయలలోగల సుందరనగరము. చాలా బస్సులు కలవు విశాలమైన కమలేశ్వరాలయమును శైవులు, వైష్ణవులు దర్శింతురు. శ్రీరామచంద్రుడే అచట నున్న శివుని సహస్ర కమలములచే నర్చించెనని ప్రతీతి.

**26. రుద్రప్రయాగ :** ఇది కేదారము నుండి వచ్చు మందాకినీ మరియు బదరీ నుండి వచ్చు అలకనందా నదుల సంగమము ఇది పంచ ప్రయాగలలో నొకటి. ఇచట రుద్రుడు నారదునకు గానవిద్య నుపదేశించిన ట్లు చెప్పుదురు. బదరీ కేదారము పోవు రోడ్డు మార్గము లిచట రెండుగా చీలి ఇరువైపుల బోవును.

**27. గరుడగంగ :** చమోలి, ఫిపల్ కోట్ దాటిన తర్వాత గల స్థలము. శ్రీ గరుడాళ్వారు ఇచట వేల సంవత్సరములు తపమాచరించిన ప్రతీతి గలదు. ఇచట నదిలో యాత్రికులు స్నానముచేసి చిన్న చిన్న రాళ్లు గైకొని గరుడ భగవానుని పాదములచెంత నుంచి అర్చించి వాని నింటికి గొనిపోయి పూజింతురు.

**28. జ్యోషిమఠ్ :** ఆది శంకరులు స్థాపించిన మఠములలో నిది యొకటి; అచట వారి ఆలయ మున్నది. బదరీనాథాలయము మూసిన 6 మాసములు ఉత్సవ విగ్రహముల కిచటనే పూజలు జరుగును. ఇచట నవదుర్గ, శివ, పార్వతి, గణేశ, నృసింహాలయములు కలవు.

**29. విష్ణు ప్రయాగ :** ఇది విష్ణు గంగ అలకనందానదుల సంగమ స్థానము. జోషి మఠము తర్వాత చాలా దిగుడులోనున్నది. ఈ నదుల ప్రవాహ వేగ మధికము.

**30. గురుద్వారా :** జ్యోషీమఠ్ తరువాత గల ఘాట్ చట్టి పాండుకేశ్వర్‌ల మధ్యన గలదు. భీమకుండ్ నుండి 12 మై. దూరమున గల ఈ క్షేత్రము శిక్కువారికి మహా పవిత్ర స్థానము. హైందవులు బదరీ కేదారములకు వెడలునట్లు శిక్కులు ఈ క్షేత్రము దర్శింతురు.

చట్టి

**31. హనుమాన్ చట్టి :** ఇచటి నుండి బదరీకి దారి ఎక్కుడు; పలురకముల పుష్పములతో నిండియుండను. ఈ ప్రదేశమెంతో ముచ్చట గొలుపును. వృక్షములు తగ్గిపోవును. ఆంజనేయాలయమున్నది.

**32. బదరీనాథ క్షేత్రము** : బదరీ కేదారములలో రావల్ సాహెబ్‌లను మలబారు నంబూద్రి బ్రాహ్మణులు పూజారులుగా యున్నారు. మే నెలలో ద్వారములు తీయు సమయమున వేల సంఖ్యలో యాత్రికులు దివ్యజ్యోతిని దర్శింతురు. 6 మాసముల క్రి తము ఆలయమున వెలిగించిన ఈ దివ్యజ్యోతి 6 మాసముల వరకు మలిగిపోకుండా వెలుగుచునే యుండును. అచటనేక వసతి సౌకర్యములు అంగళ్ళు, హోటళ్లు, ఆలయమువరకు బస్సు సౌకర్యము గలదు. దీనినే బదరికాశ్రమము బదరీనాధ్ ధాం, బదరీపురి మున్నగు నామములతో పిలతురు. ఇది 105వ దివ్యదేశము. ఇచట బదరీనారాయణస్వామి అరవింద వల్లితాయారు, తప్తకాంచన విమానము తప్తకుండతీర్థము, తూర్పు తిరుముఖ మండపము, విత్తిరుందతిరుక్కోలము. బదరీవృక్షము, నారాయణుడు పద్మాసనారూఢుడై జ్ఞానముద్రా జపలోలుడై నరునకు మంత్రోపదేశ మిచ్చుచున్నట్లుండును. నారాయణుని కుడివైపు కుబేరుడు, గణేశ్వరుడు, వామ భాగమున లక్ష్మీనారాయణమూర్తి, దిగువన ఉద్ధవ, నారద, గరుడాళ్వారులు మరియు తిరుమంగళ్వారు, పెరియళ్వారు, మంగళాశాసనములు గలవు. ఈ ఆలయమునకు ఎడమ ప్రక్క అమ్మవారి ఆలయము గలదు. ఆలయము ముందే వేడి నీటి గుండములు, స్త్రీ పురుషులకు వేర్వేరుగా నున్నవి. ఎంతటి చలిలోనైనా ఇందు స్నానములు చేయుచునే యుందురు. ఈ ఆలయమును ఆదిశంకరులు ప్రతిష్ఠించిరి. దీని చుట్టూర ఎత్తయిన మంచుచే నిండిన నరనారాయణ పర్వతములు గలవు. పాండాలను బ్రాహ్మణు లిచట పిండాదికములు చేయింతురు. ఆలయమున స్వామిని దూరమునుండే దర్శించవలయును స్వామినితాకనీయరు.

**33. బ్రహ్మ కపాలము** : బదరీనాధాలయమునకు ఒక పర్లాంగు దూరములో అలకానంద నది ఒడ్డున బ్రహ్మ కపాల శిలలు గలవు. దీనికొక గాధ యేమనగా పూర్వము బ్రహ్మ దేవుడు సరస్వతిని ప్రేమించగా శివుడు కోపించి బ్రహ్మను తన త్రిశూలముతో నొక తలను తెగ నరకెను. వెంటనే ఆ తల శివుని చేతి కంటుకొనెను. ఆ తల ఎంత ప్రయత్నించినను శివుని చేయిని వదలలేదు. బ్రహ్మ హత్యా పాపముచే శివుడు సర్వయాత్రలు గావించి చివరకు విష్ణుమూర్తి సలహా ప్రకారము ఈ బదరీ క్షేత్రమున గల ఈ ప్రదేశము చేరగనే బ్రహ్మ శిరస్సు శివుని చేతి నుండి జారి అచట పడిపోయి శివునికి పాపహరమాయెను. మాతాపితరులకు, పరలోక గత బంధువుల కెల్లరకు నిచట పిండ తర్పణములు యాత్రికు లెల్లరు చేయుదురు. ఇచట పిండములు పెట్టిన వారు జీవితములో పితరులకు పిండములు పెట్ట నవసరము లేదని చెప్పెదరు. బ్రహ్మార్పణముగా అక్షతోదకము వదలవచ్చును. కొందరిచట వారి తనయులు పిండము పెట్టరను సందేహముచే ఆత్మపిండమును పెట్టుకొందురని తెలిసినది.

ఈ క్షేత్రమున బదరీనారాయణ మందిరము, ఉష్ణ గుండములు మున్నగునవి కాక, అలకనందానది శంకరాచార్య విగ్రహము. వ్యాస గుహ గణేశ గుహలు, గౌడ పాదశిల, మానా దేవి వసుధార జలపాతము, లక్ష్మీవనము, మానా గ్రామము, చంద్రకుండ, సూర్యకుండ, చక్రతీర్థములు, సంజీవినీ పర్వతము లేక ద్రోణగిరి అలకాపురి స్వర్గారోహణ పర్వతము మున్నగునవి చూడనగును.

**34. వ్యాస గణేశ గుహలు :** ఆలయమునకు 3 మైళ్ళ దూరమున సరస్వతీ నదీ తీరమున నున్నవి. వేదమును నాల్గుగా విభజించి వేద వ్యాసుడుగా ఖ్యాతి చెందిన దీ ప్రదేశము. ఆయన ఇచటనే మహాభారత పురాణేతిహాసముల రచన నాశు కవితలో చెప్పుచుండ గణేశునిచే వ్రాయించగా ఇహమున జ్ఞాన భక్తి కర్మ సందేశముల నందించెను. తరువాత నారదుడు, శుక్రుడు, భృగు మహర్షి, ముచికుందుడు మున్నగువారీ గుహలలో తప మాచరించిరి. శ్రీ శంకరాచార్యులును కొంతకాల మీ గుహలలో నివసించిరని తెల్యుచున్నది.

**35. గౌడ పాదశిల :** గౌడపాదాచార్యులు శంకరాచార్యులకీ కొండ గుట్టపై నద్వైత సిద్ధాంతము నుపదేశించిరి. శంకరాచార్యులు నిచటనే మాండూక్యోపనిషత్కారికలు, దశోపనిషత్తులు, భగవద్గీత, బ్రహ్మ సూత్రములకు భాష్య రచన సాగించిరి. దీనికి సమీపమున సరస్వతీ అలకనందా సంగమమును కేశవ ప్రయాగ గలదు.

**36. మానాదేవి :** పర్వతముపై అలకనందా తీరమున గలదు. భారత దేశమునకు దక్షిణమున కన్యాకుమారి చివరెట్లో అట్లు ఉత్తరమున మానా గ్రామము చివరిది ఇచటి నుండియే బహుకఠినమైన మానాపాస్ ద్వారా మానససరోవర యాత్రకు పోవచ్చును. యాక్‌లు నిచట విశేషముగా నుండును. విపరీతమైన చలి యుండును. దగ్గరలో మాతామూర్తి ఆలయము గలదు.

**37. వసుధార :** ఇది 6 మై. దూరమున 230'' ల ఎత్తునుండి పడు జలపాతము. చుట్టును మంచుచే నిండిన కొండలు గలవు. ఈ వాహినియే అలకనందానది యనబడును. శివజటా జూటమునుండి పడిన గంగానది యొక్క ఒక పాయ యనియు రెండవది గోముఖినుండి వెలువడునదని పురాణ ప్రతీతి. ఇవి రెండును దేవప్రయాగలో సంగమమగునని తెల్యును. యాత్రికులిచట స్నానమాచరించి పునీతులై దృశ్యభాగ్యముచే పులకించి పోవుదురు.

**38. లక్ష్మీవనము :** ఇది లక్ష్మీదేవి చెలికత్తెలతో విహరించు ఉద్యానవనము. ఆ ప్రదేశమున నెచటను కానరాని యెనలేని వివిధ రకాల పూలు అచట పూయించి సృష్టికర్త తోటమాలి పనిచేయుచున్నాడు. పైన మంచు గప్పబడి యున్నను లోన

పూలు, గాజు జాడీలలో నుండి చూస్తున్నట్లు అగుపించును. భ్రమరములు ఆ పూవనములో అగుపింపక పోవుట అద్భుత విశేషము.

సూర్యచంద్ర కుండములు కొంత దూరమున ప్రక్కన గలవు.

**39. సంజీవినీ పర్వతము :** లక్ష్మణుడు మూర్ఛ నొందగా ఆంజనేయుడు ఈ పర్వతమునే గొనిపోయెను. ఎన్నో అమూల్య ఓషధు లిచట యున్నట్లు తెల్యుచున్నది. సంజీవినీ చెట్టు అందరికి కనిపించదు. రాత్రి వేళలో మాత్రమే అగుపించును. దీని యాకు తిన్నచో వారము రోజు లాకలివేయదు. గొప్ప సాధువులకే నొకసారి దీని దర్శనమై రెండవసారి లభింపదు.

**40. అలకాపురి :** ఉదయము 4 గంటలకు లక్ష్మీదేవి దేవకన్యలతో సభ జరిపి వీణావాదనచే నాట్యములు జరుపునను స్థలపురాణ ప్రశస్తి గలదు.నేటికిని సంగీత వీణానాట్య గంటల ధ్వని వినిపించును. కాని దేవకన్యల దర్శనము కాదు. దీని కుత్తరమున ఉత్తర ధృవనక్షత్రమునకు దిగువన నాల్గు నక్షత్రములు ఒకదాని చుట్టు మరొకటి తిరుగుచు గుత్తిగా నున్నవని మరియు అవన్నియు భ్రమణమున ఒకసారి ఒకే నక్షత్రముగను ఒకసారి రెండుగను, మరొసారి మూడుగను, మరొసారి నాల్గుగను కాన్పించును. పురాణ ప్రాశస్త్యానుసారము ఈ నాల్గు నక్షత్రములు బ్రహ్మగను క్రింది తెల్లని నక్షత్రము వీణాధారిణి సరస్వతియనియు క్రింద గల తేజోమయము పద్మముగను హంసగను వర్ణించి పేర్కొనిరి. ఈ వింతకు కారణము భూభ్రమణములో శిలలకు ప్రత్యేక సమయమున కలుగు ధ్వని ప్రకంపనములని శాస్త్రవేత్తల యభిమతము.

**41. స్వర్గారోహణ పర్వతము :** ఇది 23000ల అ. ఎత్తైన నిటారుగానున్న పర్వతము. ఈ పర్వత పాదముననే ద్రౌపది సహితముగా నల్గురు తమ్ములు విగత జీవులై కేవలము ధర్మజుడు, వెంట వెడలు కుక్క మాత్రమే స్వర్గము పైకి చేరినట్లు పౌరాణిక గాథల వల్ల తెల్యును.

**42. కర్ణప్రయాగ :** ఇది నంద ప్రయాగకు 12 మై. దూరమున గలదు. కర్ణుడు ఇచట సూర్యని గురించి తపమొనరించిన గాథ కలదు. ఇది అలకనందా కర్ణగంగ (పిండారా) నదుల సంగమము మరియు పంచప్రయాగలలో నొకటి.

**43. ఆదిబదరీ :** కర్ణ ప్రయాగకు 12 మై. దూరములో పురాతన దేవాలయములో ఆది బదరీనాథుని నీల విగ్రహము నాల్గువైపుల నితర దేవాలయములు పదునొకటి గలవు.

**44. నైనితాల్ :** ఇది కాఠ్ గోదాము స్టేషనుకు 40 కి.మీ. దూరమున గల సుందర ప్రదేశ పట్టణము. ఇది వేసవి కాలమున ధనికులుండు కొడైకెనాల్ లాటి చల్లని ప్రదేశ

నగరము. ఇచట నారాయణీ యను నయవానంద సుందర దర్శనీయ సరస్సు గలదు. అది పులస్త్య మహర్షుల తపోభూమి. నైనిదేవి హనుమాన్, రాధా-గిరిధారి మందిరములతోపాటు గురుద్వారా మసీదు చర్చి ఉద్యాన వనములును నున్నవి. దీనికి 18 కి.మీ. దూరములో ''భీమతాల్'' యను సుందర సరస్సు గలదు.

నేపాలు దేశము పూర్వము మన భారతదేశములోని అంతర్భాగమే. నేటికిని అచట హైందవ రాజ్యమే కాని ప్రస్తుతము స్వతంత్ర దేశమైన అచటి క్షేత్రములు.

**45. అయోధ్యా పురిధాం** : ఇది సీతామర్హి రైల్వేస్టేషను నుండి బస్సు మార్గమున చేరవలెను. సీతాదేవి జన్మించిన అయోధ్యా నగర రాజధాని. సీతాదేవి బాల్యక్రీడలు శ్రీరామచంద్రుడు శివధనుస్సు విరచిన పుణ్యభూమి, రామలక్ష్మణ, భరత, శత్రుఘ్నులకు సీతా, ఊర్మిళ, మాండవీ, శృతకీర్తులకు వివాహములు జర్గిన దేవభూమి. ముఖ్యమైన శక్తి పీఠములలో నొకటి. ఇచట ధనుష్ తీర్థము, రామమందిరము, జానకీమందిరము, లక్ష్మణాలయము, దశరథాలయము, రణమేలా (సీతాదేవి నాగటి చాలున లభించిన ప్రదేశము) సీతా కళ్యాణ మంటపం, కపిలేశ్వర, కూపేశ్వర, కోటీశ్వర, మిధిలేశ్వరాలయములు, మౌని బాబామందిర్ చూడదగు ముఖ్యములు.

ఇంకను నిచట గంగాసాగర్ ,రామసాగర్, సీతాకుండు,పురందరవ ర్, పాద ప్రక్షాళనసర్ విద్యా కూప, జ్ఞాన కూప, అగ్ని కుండ, విహార కుండ, రత్నసాగర్, పాలవిమోచనసర్ అందగరాగసర్, మదహాసర్, తిలహాసర్ మున్నగునవి దర్శనీయములు.

**46. కపిలవస్తు** : (తౌలీవా) బుద్ధభగవాను డిచటనే పెరిగి పెద్ద వాడైన తన తండ్రియగు శుద్ధోధనుని రాజధాని. బుద్ధుడు యశోధరను పెండ్లాడి 'రాహులు'డను తన యుని కని ఆత్మను తెలిసికొనుటకు భార్యాపుత్రుల వీడిన ప్రదేశము. ప్రస్తుత మది ఒక పల్లెటూరు మాత్రమే. ఇచట కపిలేశ్వరాలయము గలదు. తౌలీవా బుద్ధక్షేత్రము.

**47. రుమ్మిన్‌దేయి** : దీనికి లుంబినీ వనము యనునామములు గలవు. బుద్ధభగవానుడు తల్లియగు మాయాదేవి గర్భమున జన్మించిన స్థానము. ఆయన జన్మించిన స్థావమున నేటికి నొక చిన్న కొలనున్నది. ఇచట అశోకుని 36'ల స్థూపము, మాయాదేవి మందిరము, మహాబోధి మందిరము, శిథిలము లయిన పురాతన స్థూప విహారములు చూడదగును.

**48. పశుపతి నాథ మందిరము** : నేపాళ దేశ ముఖ్య రాజధాని ఖట్మండు (పురాతన నామము కాష్ఠమండపము)లోని ఇంద్రకీలాద్రి క్రింది భాగమున భాగేశ్వరి నదికి కుడివైపున ఎత్తు ప్రదేశమునగల ప్రకృతి శోభాయమాన మహాదేవ మందిరము. భాగేశ్వరి నదికి ఎడమవైపున దగ్గరలో గుహేశ్వరీ దేవి, శక్తిపీఠ మందిరమున్నది.

అర్జునుడు ఇచటనే పాశుపతాస్త్రమునకై, తపమొనరించి కిరాతరూపమున వచ్చిన శివు నెదుర్కొని యుద్ధముచేసి పాశుపతము సంపాదించిన కారణమున 'పశుపతి' నాథుడాయెను. ఇచటికి దగ్గరలో మత్స్యేంద్రనాథ్, కూర్మనాథ్, భూతనాథ్, గోకర్ణేశ్వర మందరిములు గలవు. మరియు స్వయంభూనాథ్ ఆలయమున 45'ల ఎత్తైన అరుదైన శివలింగము అడుగున 15 x 15 x 15 x 15'ల నాల్గు భాగములకు నాలుగు త్రినేత్రములు కల్గియున్నవవి. ఈ కన్నులు ఖాట్మండు పట్టణమున అనేక చోట్లనుండి అగుపడుచుండును. హిందూ బౌద్ధులును నిచట పూజలు సల్పుట విశేషము. ఇవి కాక న్యాతపాల, సిద్ధిలక్ష్మి ,మహాబుద్ధ మందిరములు గలవు. బుధనీలకంఠర్, యను దేవాలయములో బౌద్ధులు వైష్ణవులు శైవులు ఆయా దేవతా స్వరూపములుగా భావించి పూజించు యాచారము చాలా అపురూపము కల్గించును. మరియు మతము లన్నిటికిని భగవంతుడు ఒక్కడేయను మహాదాశయమును చాటుచున్నది. ఇందులోని మహామూర్తి క్షీరసాగరమున అలలో శేషతల్పమున నున్నట్లున్నది. ఇంకను వామనావతార త్రిశూల త్రిపురేశ్వర మందిరములును గలవు. ఖట్మండు నగరమున దర్శనీయములగు నితరములు ధరహరస్తంభము, పెరేడ్ గ్రౌండ్, రాష్ట్రమండప్, యను కొయ్య నిర్మితాలయము బసంతపూర్, దర్బార్ రాజభవనము, బసంతపూర్‌జా, మ్యూజియం, తలేజుమంగిర్, సింఘాద ర్బార్ , దర్బార్ స్క్వేర్ మున్నగునవి చూడనగును. ఈ నగరము చాలా సుందర పట్టణమే గాక హిమాలయపు మహోన్నత శోభను యినుమడింపజేయుట కిచట నుండి మౌంట్ ఎవరెస్ట్ కాంచనగంగ ధవళగిరి మున్నగు హిమోత్తుంగ శిఖరముల దర్శనభాగ్యము చేకూరును. ఈ ఖట్మండు నగరంలో చిన్న పెద్ద ఆలయములు పదివేలపై బడియున్నవి. దాదాపు ప్రతి ఇంటిముందు చిన్న ఆలయము అగుపడును.

**49. సాలగ్రామము** : ఇది 107వ దివ్యదేశము. ఈ సాలగ్రామము లనేక విధముల పూజల కుపయోగపడును. ఇవి అచట గల గండకీనదిలో లభించును. సాలగ్రామములలో సదా సర్వేశ్వరుడుండునని వీని గురించిన వివరము పూర్వ భాగములో విశదీకరించబడినది.

**50. ముక్తినాథము** : మహాతీర్థములు 3 కోట్ల యేబది లక్ష లని చెప్పుదురు. ఇందు స్వయం వ్యక్తములు ఎనిమిదిలో ముక్తినాథము ప్రధానమైనది. దివ్య తిరుపతులు 108 యని చిట్టచివరి దివ్యతిరుపతి ఈ ముక్తినాథమని చెప్పుదురు. శ్రీ రామానుజులు ఈ యాత్ర సలిపి దీని ఖ్యాతి నినుమడింపజేసిరి. శ్రీ త్రిదండి శ్రీ మన్నారాయణ జియ్యర్ స్వామి వారిచట 88వ శ్రీరామ మహాక్రతు స్థంబమును స్థాపించిరి. కైలాస మానస మహా యాత్ర ప్రయాసలకు సరిపడు శ్రమ, చలి, పర్వత చివర, నదీ అంచున, సన్నని దారి గలిగియున్న కఠినయాత్ర. 47 మై. మూడు దినముల పైబడి నడకదారి. కొండ చరియల మంచుతుఫానుల బెడద యధికము.

ఇది చాలా పురాతనమైన ఆలయము. గర్భగుడి 8' x 8' మాత్రమే కలదు. వసతులు లేవు. ఏమియు లభించదు. ఆలయ ప్రాకారమున కావల 20 గజములలో 108 గండకీ జలధారలుండుట విశేషము. ఈ ధారలు 40 మై. గుప్త మార్గము ద్వారా దామోదరుకుండ్ నుండి చక్రతీర్థ నారాయణ తీర్థమున జన్మించి వచ్చునను నానుడి గలదు. ఇటనుండియే గండకీ నది జన్మము. అంతటి చలిలో యాత్రికులీ 108 ధారల క్రింద వడివడిగా నడచుచు స్నానమాచరింతురు. పిండతర్పణాదులు సలుపుదురు. గర్భాలయము మధ్య భాగమున ముక్తినాధ పెరుమాళ్ళు చతుర్బాహువులతో పద్మాసనా రూఢుడై యుండి పైన సప్త ఫణిశేషుడు ఇరువైపుల శ్రీదేవి భూదేవి ఎదురుగా గరుడాళ్వారులు, గలవన్నియు ఉత్సవమూర్తులు. ఆలయము చుట్టూ గులాబిల్లాంటి కొండ తులసీ పూవులు దండిగా నుండును. ముక్తినాధుని ముఖారవిందముచే కలుగు తన్మయత్వము ధారలక్రింద స్నాన, శోభ వర్ణనాతీతము.

నేపాలు ప్రభుత్వ పూజారి ప్రతిరోజు పూజ సలిపినను నచట గల "జుమ్మా"లను కన్యలకే ఎక్కువ ప్రాముఖ్యము. ఈ కన్యల వద్దనే ఆలయ తాళములుండి తీయుట మూయుట దీపారాధన మున్నగు సేవలు సేయుచు సర్వస్వము ముక్తినాధుని కర్పించుకొని ఆయననే నాధునిగా భావించు ఆజన్మ బ్రాహ్మచారిణులగు దేవదాసీలని వీరినందురు.

వీరు 2 కి.మీ. క్రిందుగల ముక్తినాధ గ్రామమున నివసింతురు. గ్రామస్థులందరు దాదాపు బౌద్ధులే. ఈ గ్రామాచార ప్రకారము ప్రధమ చివరి సంతానము తప్ప, మధ్య నేర్పడిన స్త్రీ సంతానమంతయు ముక్తినాధ స్వామికి కైంకర్యము చేయుదురు. ఈ ముక్తి నాధాలయము 4 చిన్నగుహలలో 4 జ్వాలలచే ప్రజ్వరిల్లుచుండును. ఒకదాని క్రింద నీరు ప్రవహించును. దానిని జలజ్వాల అనియు రెండవ దాని క్రింద రాయియున్నందున దానిని జోని జ్వాల యనియు మిగతా రెండు భూమిపై నుండటచే స్వయం జ్వాల, మహాజ్వాలలని యందురు. వీని నెల్లవేళల దర్శింపవీలగును.

ఇచట నరసింహస్వామి ఆలయము, బౌద్ధాలయము సాలగ్రామ పహాడ్ మున్నగునవి గలవు. దీనినే సాలగ్రామ క్షేత్రమందురు. ఈ సాల గ్రామములు కృష్ణగండి. ముక్తినాధ మార్గమున నృశింగు కోల్గానరసింగునది మున్నగు ప్రదేశములకు 3, 4 దినముల ప్రయాణముతో నాయాచోట్ల విశేషముగా లభ్యమగును.

**51. తీర్థపురి :** ఇది ప్రస్తుతము టిబెట్టులో యున్నది. మా యాత్రామార్గమునకు ఎక్కువ దూరముండుటచే చూడ వీలుపడలేదు. జ్యోషి మఠము మీదుగా కైలాసము వెడలు దారిలో గలదు. ఇది సట్లెజ్ నదీ తీరమున నున్నది. భస్మాసురుడిచట తప మొనరించి శివుని వరప్రసాదము బొందినట్లు విష్ణువు మోహినీ రూపమున

భస్మాసురుని చేయి తన నెత్తినిడుకొనునట్లు చేయగా భస్మమైపోయిన గాధ యచటనేజరిగినట్లు జెప్పుదురు. అచట భస్మ పర్వతము గలదు. ఆ భస్మమును యాత్రీకులు వెంట దెచ్చుకొని తిలకముగా నుపయోగింతురు. ఇదిగాక గాంగ్‌టక్ జ్ఞానిమామండి లాసా మున్నగు పట్టణములున్నవి. వ్యాపార కేంద్రములు.

ఇవి కాక హిమాలయ ప్రాంతపు తూర్పు భాగమున డార్జిలింగ్, గౌహతిలో కామాఖ్యాలయము (దక్ష యజ్ఞాధచే 51 శక్తిపీఠములు) పరశురామ కుండము (పరశురాముడు 21 మార్లు క్షత్రియుల దునుమాడినది) షిల్లాంగ్, చిరాపుంజి, సీతాకుండ్ శివసాగర్ మున్నగు నెన్నియో దర్శనీయ క్షేత్రములున్నవి. వానన్నిటి వివరము కష్ట సాధ్యము.

భారతదేశపు దక్షిణమున గూడ ఎనలేని దివ్యక్షేత్రములున్నవి. వాని గురించి చాలామందికి తెలియును. వివరము సాధ్యపడదు. అందు ముఖ్యమైనవి.

రామేశ్వరము, ఆదిరంగము, మధ్యరంగము, అంతరంగము, జనార్థనము, దర్మసేవ, గోకర్ణము, మహాబలేశ్వరము, శేషాద్రి, గరుడాద్రి, తిరుపతి, కాళహస్తి శ్రీశైలము, బాలనరసింహము, పాలక నరసింహము, శచోటి వీరభద్రము (పంచలింగములు) కిష్కింద, పంపాసరోవరము, రుష్యమూకము, దేవగిరి, అమరావతి, కార్తికేయము, కరవీరము, మహాబలేశ్వరము, భీమశంకరము, అమరావతి, కోటిపల్లి, త్ర్యంబకేశ్వరము, నాసిక, పంచవటి సప్త దీర్ఘ తీర్థములు.

అన్నవరము, సింహాచలము, ద్రాక్షారామము, భద్రగిరి, బాసర జ్ఞానసరస్వతి విజయవాడ కనక దుర్గ, భద్రాచలము, కాళేశ్వరము, వేములవాడ, కొత్తకొండ, కొమురవెల్లి, యాదగిరి ఇత్యాది అనేక క్షేత్రములు మరియు వానివాని ప్రత్యేక ప్రాశస్త్యములును గలవనుట యెల్లరకు విశదమే.

## శ్రీ రాజ రాజేశ్వర స్వామి క్షేత్రమహిమ :

ఈ స్వామి కరీంనగరం జిల్లాలోని 'వేములవాడ' పట్టణమున వెలసియున్నాడు. ఈ క్షేత్రము చాలా పురాతన యుగమునకు చెంది దక్షిణ కాశిగా పేరొందిన దివ్య క్షేత్రము. తెలంగాణా ప్రాంతమున గల దేవాలయములలో ప్రథమ స్థాన మాక్రమించి యున్నది. శ్రీశైలము, రామేశ్వరము, కాళహస్తి, అమరావతి, కోటిపల్లి, ద్రాక్షారామము మున్నగు క్షేత్రముల మాదిరి ఈ పుణ్యక్షేత్రమును అశేషజనము నాకర్షించి ఐహికాముష్మిక సుఖ సంతోషముల నిచ్చుచు లక్షల సంఖ్యలో తెలంగాణ మహారాష్ట్ర ప్రాంతీయ కుటుంబములకు ఇలవేలుపుగా వెలసియున్నాడు, శ్రీ రాజరాజేశ్వరుడు.

ఇంద్రుడు వృత్తాసుర సంహార, బ్రహ్మ హత్యా పాప విమోచనమునకై ఈ క్షేత్రమున గల ధర్మ కుండములో స్నాతుడై దైవ దర్శనము చేసి పునీతుడైనట్లు పౌరాణిక గాధ కలదు.

భాస్కరుడు దక్షాధ్వరమున వ్రేల్చిడి హవిస్సును భక్షించగా తన హస్తము లూడి పోయెను. అతడీ క్షేత్ర దర్శనముచే పునః హస్తముల బొందిన గాధ గలదు. అందుచే నీ క్షేత్రమునకు భాస్కర క్షేత్రమను నామాంతరము గలదు.

భవిష్యోత్తర పురాణమున శ్రీరామచంద్రుడు సీతా సమేతుడై ఈ స్వామిని దర్శించి ఆరాధించిన గాధ గలదు.

ద్వాపర యుగమున పంచ పాండవులు ద్రౌపదీ సమేతముగా అరణ్యవాస సందర్భమున ఈ క్షేత్రము దర్శించి స్వామి నర్చించిన గాధ ఈ శ్లోకము వలన తెలియుచున్నది.

శ్లో. ధర్మరాజో రాజలింగం భీమో భీమేశ్వరం తథా ।
పార్థ ః శ్రీ బాలరాజన్య సహదేవశ్చ సాగ్రజః ।
ప్రతీచ్యాం శివయోః పూజాం చక్రతు ర్భక్తి సంయుతౌ ।
ద్రౌపదీ రాజ రాజస్య కళ త్రస్యచ పూజనమ్ ॥

పై గాధల ననుసరించి శ్రీ రాజరాజేశ్వర స్వామి క్షేత్రము ఎంతటి పురాతనమైనదో ఊహించవచ్చును.

ఆంధ్రదేశ సామంత రాజ చక్రవర్తులు మత సహనమున కు ప్రతీకలని ఈ క్షేత్రమున గల బౌద్ధ జైన విగ్రహములు నేటికిని తార్కాణముగా నున్నవి. వేములవాడలో నేటికిని గల శాసనములో పశ్చిమ చాళుక్య వంశోద్భవుడగు "చాళుక్యకుల తిలక" బిరుదాంకితుడు రెండవ యరికేసరి మహారాజును పెద్దనార్యుడను ద్విజుడు అర్థించగా శ్రీ రాజరాజేశ్వరుని పూజకై అతిథుల భోజన అక్షయాన్నదానమునకై "ఆదిత్యగృహ" మను సత్రమును గట్టించి యిచ్చెనని వ్రాయబడినది. ఇదిగాక స్నానాదులకొక తటాకము, ఆదాయమునకై వలసినంత భూమిని దానము జేసినట్లు ఆ శాసనము వలన తెలియుచున్నది. ప్రఖ్యాత కన్నడ "మహాభారత" రచయిత "పంప" గారు ఇచటివారేయని శ్రీ రాజ రాజేశ్వరుని కరుణబొంది రచనలు సాగించిన ఆధారములు గలవు. వేముల వాడ భీమకవి గారి "అప్పలన్నియు కప్పలాయెను. అన్నమంతయు సున్నమాయెను" కవిత ఎల్లరకు తేటతెల్లము. నేటికిని అచట గల బౌద్ధ జైన విగ్రహములచే నీ క్షేత్రము దాదాపు 2000 సంవత్సరములకు పూర్వమే మహోజ్వలముగా వెలుగొందినట్లు తెలియుచున్నది.

శ్రీ వ్యాస భగవానుడు

శ్లో. కృతేతు స్ఫటికాకార : త్రేతాయాం హరితద్యుతి :।
ద్వాపరేతు హరిద్రాభ : కలౌనీలోత్పలచ్ఛవి:.

యనినుడివినట్లు శ్రీ రాజరాజేశ్వరలింగము నీలమాణిక్యమువలె నునుపుగా వెలుగొందుచున్నది.

శ్రీ రాజరాజేశ్వర స్వామి సన్నిధికి భక్త జనము దాదాపు ప్రతి సంవత్సరము దర్శించుటకు వత్తురు. పైగా పుట్టు వెంట్రుకలు, అన్న ప్రాశనము, వివాహములు, పల్లకి, సేవ మున్నగు మొక్కుబడుల చెల్లింతురు. ఇచటి విశేషమైన మొక్కుబడి "కోడెను కట్టుట" భారత దేశములో నే క్షేత్రమునను ఈ యాచారము కన్పించదు. ధర్మదేవతకు శివుడు ప్రత్యక్షమై వరము కోరుమనగా "వాహనం తే భవిష్యామి సదాఽహం పార్వతీపతే" యని యడుగగా శివుడు "వాహనంభవమే ధర్మ సర్వదా లోకపూజిత :" యని యభయమిచ్చెను.

అనగా ధర్మ దేవత యెల్లపుడు శివునకి నందిరూపమున వాహనమై యుండి లోకమున జనులచే పూజింపబడుదువని వరమొసగెను. ఈ కోడెలను కట్టుట పూజించుట వృషభ రూపములోనున్న ధర్మదేవతను ప్రథమముగా పూజించుటయే యని విదితమగును. ఇట్టి సాంప్రదాయ మిచట తరతరాల నుండి నేటికిని వేల కుటుంబములు ఆచరించుచు మొక్కుబడులు చెల్లించుచు తరించుచు దిన దిన ప్రవర్ధమాన మగుచు భూకైలాసమువలె విరాజిల్లుచున్నది. భక్తుల యొక్క కోరిన యెల్ల కోరికలను ఈడేర్చు భక్తసులభుడు శ్రీ రాజరాజేశ్వరుడు.

ఈ స్వామి యొక్క లీలలు అమోఘములు. అంధులకు నేత్రదానము, కుంటికి కాళ్లు రావటము, శూలాది భయంకర చికిత్సా రహిత వ్యాధుల నిర్మూలన,, దనలాభము, పుంస్త్వము బొందుట , సంతానము బడయుట ,మున్నగునవి బొంధిన యనేక భక్తులు నేటికిని సజీవులై స్వామిని వేనోళ్ళ కీర్తించుచున్నారు. భక్తులు మొక్కిన మొక్కుబడులను యధావిధి తప్పక చెల్లించుట విశేషము. అలా చేయక మాట తప్పినవారు ఏదోనొక వ్యాధికి లేక వ్యాకులతకు గురియగుదురను శంక గలదు. అందుకే ఆ స్వామికి "మొక్కులపు" దేవుడని ప్రతీతి.

ఈ క్షేత్రమునగల ముఖ్యదేవతా విగ్రహములు శ్రీ లక్ష్మి గణపతి, శ్రీ రాజరాజేశ్వరుడు, పార్వతీదేవి, బాలరాజేశ్వరుడు, కోటిలింగములు, ఉమామహేశ్వరుడు, సోమేశ్వరుడు, త్రిపుర సుందరీదేవి, షణ్ముఖుడు, దక్షిణామూర్తి, చండికేశ్వరుడు, నందీశ్వరుడు, కీర్తిముఖుడు, బ్రహ్మ, విష్ణు, మహేశ్వర స్వరూప లింగము, శ్రీ రాజరాజేశ్వరీదేవి, చండికేశ్వరుడు, పంచముఖ పరమేశ్వరుడు,

జ్వాలాముఖి, సూర్య విగ్రహములు, మహమ్మదీయ చిల్లా -వల్లుబండ, తులసీవన ,రాధాకృష్ణులు, సీతారామస్వామి, కోదండరామస్వామి, కాశీవిశ్వేశ్వరుడు, బాలాత్రిపుర సుందరీ దేవి, మహిషాసుర మర్దినిలతోపాటు బౌద్ధ జైన మున్నగునెన్నియో విగ్రహములు గలవు. ఇది సాక్షాత్ హరిహర భేదరహిత పుణ్యక్షేత్రమై, ప్రతినిత్యము శివపూజతో పాటు, సీతారామ కళ్యాణోత్సవము, పల్లకీ సేవలు జరుపుట ప్రసిద్ధాచారమై యున్నది.

శ్రీ రాజరాజేశ్వర స్వామి ప్రతినిత్యము మునులచే సిద్ధులచే అర్ధరాత్రి సమయమున మానవ మాత్రులకు తెలియకుండ పూజింపబడుచుండునని మరియు యనేక నితర నిదర్శనములు దేవస్థానమువారి క్షేత్ర మహాత్మ్యములో వివరింపబడినవి.

ఇచట ధర్మగుండము, భీమేశ్వరాలయము, వీరాంజనేయ దేవాలయము, బద్ది పోచమ్మ ఆలయము, నగరేశ్వరాలయము, శ్రీ అండాళ్ వేణుగోపాలస్వామి ఆలయము, మహాలక్ష్మి కనక దుర్గాలయము, మున్నగునవి ప్రసిద్ధములు దర్శనీయములు.

ఇచట ప్రతినిత్యము సుప్రభాతము, ప్రాతఃపూజా అభిషేకములు, యాత్రికులచే అభిషేక దర్శనములు, అన్నపూజ, దేవతా నివేదన, ప్రదోష పూజ, కుంకుమ సేవ, పల్లకీసేవ, నిశి పూజ, పెద్దసేవ, ఏకాంత సేవ, మున్నగునవి యధాక్రమము జరుగుచుండును. వేముల వాడలో అధిక సంఖ్యలో ద్విజులు, వేద వేదాంగ, నిష్ఠాగరిష్ఠులుగాను, ఘనాపాఠులుగాను, కీర్తి ప్రతిష్టలు గడించినవారున్నారు. వారే ఈ స్వామికి అర్చకులు.

ఇచట శివకళ్యాణోత్సవము, శ్రీరామ నవరాత్రులు, హనుమజ్జయంతి, శంకరజయంతి, గజానన నవరాత్రులు, దేవీనవరాత్రులు, ధనలక్ష్మి పూజ, (దీపావళి) గీతాజయంతి, త్యాగరాజోత్సవములే, గాక శ్రావణ కార్తీక, ధనుర్మాసములందు, ప్రత్యేక పూజలు, జరుపబడును. ప్రతి ఉత్సవ సమయములోను, సంగీత సాహిత్య, హరికథాది కార్యక్రమములు, ఎల్లవేళల జరుగుచు మహావైభవోపేతముగా నుండుట ఈ క్షేత్రవిశేషము.

ధర్మకర్తల మండలి ఆధ్వర్యములో, ఈ దేవస్థానము ఎన్నో అభివృద్ధి కార్యక్రమములు జరుపుచున్నది. కళ్యాణ మంటపములు, ధర్మశాలల నిర్మాణము, సంస్కృత, వేదపాఠశాలలు, మంచినీటి, విద్య, వైద్య సౌకర్యములు మున్నగునవే కాక ధనాదాయము తక్కువ గల అనేక చిన్న దేవాలయముల అభివృద్ధికై ధార్మిక గ్రంధాది ముద్రణలకై, వైదిక పండిత, పోషణాదులకై 1981-83 వరకు గల ధర్మకర్తల మండలి కృషి సలిపినది. ఆ మండలిలో సభ్యునిగా నేనుము శ్రీ రాజరాజేశ్వరుని, పూజించి సేవించు నవకాశము కలిగినది. ఇలాంటి కార్యక్రమములు ఇంకను కొనసాగనున్నవి. ఈ

గ్రంథమునకు ఆర్థిక సహాయ మొనరించిన ఆ మండలికి మరియు సాంక్షన్ యిచ్చిన కమీషనర్‌గార్కి నా హార్దిక కృతజ్ఞతలు. ఇంతటి మహిమాన్వితము గలిగిన పుణ్యక్షేత్రమగు వేములవాడ శ్రీ రాజరాజేశ్వర స్వామిని దర్శించి స్వామి కరుణకు పాత్రులై భక్తులు పునీతులై ఐహికాముష్మిక సకల సౌభాగ్యముల బడయుదురు గాక

శ్లో. ఆంజనేయ మతిపాటలాననం
కాఞ్చనాద్రి కమనీయ విగ్రహమ్ ।
పారిజాత తరుమూలవాసినం
భావయామి పవమాన నన్దనమ్.
యత్ర యత్ర రఘు నాథ కీర్తనం
తత్ర తత్ర కృతమస్తకాఞ్జలిమ్
బాష్పవారి పరిపూర్ణ లోచనం
మారుతిం నమత రాక్షసాన్తకమ్.
మనోజవం మారుత తుల్య వేగం
జితేన్ద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్ ।
వాతాత్మజం వానర యూథ ముఖ్యమ్
శ్రీ రామదూతం శిరసా నమామి.
(ఇత్యాంజనేయ స్తుతి :)

శ్రీ రామచంద్ర : శ్రితపారిజాత : ।
సమస్త కల్యాణ గుణాభిరామ :
సీతాముఖాంభోరుహ చంచరీకో ।
నిరంతరం మంగళ మాతనోతు.
స్వస్తి ప్రజాభ్య : పరిపాలయంతాం ।
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశా :
గోబ్రాహ్మణేభ్య : శుభ మస్తు నిత్యం ।
లోకా స్సమస్తా స్సుఖినో భవంతు.
రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః ।
మంగళం కోసలేంద్రాయ మహనీయ గుణాబ్ధయే ।
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళమ్.

సర్వం శుభ మస్తు; సర్వం శివార్పణ మస్తు.

ఓం తత్సత్.

ఓం ఓం ఓం ఓం ఓం

# అనుబంధము -1

## హిమాలయము - మానస సరోవరము

సమశ్శివాభ్యాం నవయౌవనాభ్యాం
పరస్పరాశ్లిష్టవపుర్ధరాభ్యామ్ ।
నగేంద్ర కన్యా వృషకేతనాభ్యాం
నమోనమశ్శంకర పార్వతీభ్యామ్॥
సమశ్శివాభ్యాం సరసోత్సవాభ్యాం
నమస్కృతా భీష్ట వరప్రదాభ్యాం
నారాయణే నార్చిత పాదుకాభ్యాం
నమోనమ శ్శంకర పార్వతీభ్యాం ॥

రచన : డా. శ్రీ భాష్యం విజయసారథిగారు
ఆచార్యులు - సంస్కృతాంధ్ర కళాశాల - ఓరుగల్లు - ఆం. ప్ర.

ఆర్షవాణికి ఉత్తర భారతము కేంద్రం కాగా ఆచార్య వాణికి దక్షిణ భారతం నిలయమౌతుంది. ఉత్తర భారతంలో హిమాలయ పర్వతశ్రేణి అనంత విజ్ఞాన నిశ్రేణికగా వెలసినది. హిమాలయం దాని పరిసరములు ఇప్పటికిని ఎందఱో ఋషులు, సిద్ధులు,సాధకులకు ఆశ్రయమై యున్నది. మనం ఇప్పటికిని ఎఱుగని మంత్ర విజ్ఞానం ఆ పరిసరములయందు ప్రతి స్పందిస్తుంది. మంత్ర విద్య ఖండా ఖండ రూపంగా హిమాలయ పరిసరాలను కేంద్రంగా ఏర్పరచుకొని ఆవిర్భవిల్లింది. విరాట్పురుషుని అంగములుగా భూమిలోని వివిధ ఖండములు పేర్కొనబడినవి. హిమాలయం శిరస్సని, మానస సరోవరం మనస్సని మంత్రశాస్త్రం తెలుపుచున్నది. శిరస్సునందు సహస్రార పద్మం కలదు. ఈ సహస్రార పద్మమందు అమృత బిందువు స్రవిస్తుంది. అదే హిమాలయ పర్వతాగ్రంపై ప్రవహించే గంగాస్రోతస్సు అని పంచాంగుళీ విద్యాతత్త్వం తెల్పుచున్నది. సతీదేవి పంచత్వం పొందిన పిదప ఆమె అంగములు శీర్ణ శీర్ణముగా చెదరి పడిపోయినవి. ఆ పడిపోయిన అంగములే బ్రహ్మ కపాలం, కేదారం, మానసం, సారనాథం, బదరీక్షేత్రం అని యోగజ్ఞులనుచున్నారు. ఆమె అవ యవాలు ప్రతీకగా గొని ఛిన్న మస్త గుహ్యాకేశ్వరి, క్లిన్న భగ, మానసేశ్వరి ఆదిమంత్రాలు తద్దేవతలు ఏర్పడినారు. ''మానస రోధసి తపస్తపమానేన హిరణ్య స్తూపేన సమారాధితా మానసేశ్వరీ మానససరోంతరాళా దావిర్భూతా పప్రచ్ఛ కిం తే వరం వృణీష్వ ఇతి సహో వాచ మాత ర్దేహి మానసేశ్వరీ మంత్ర విద్యామ్ యయా భాసమానయా సర్వం కర తలామలకీభవతి వర్షే యశో మహః సహశ్చ సిద్ధ్యతి.'' అని పంచాంగుళీ విద్యాతంత్రమందు కలదు. ఇట్లు భౌతికంగా మన కగుపడే హిమాలయ పరిసరాలు

ఒకానొక విజ్ఞాన వైభవ మరీచి ఖండాలుగా భాసిస్తున్న దనుటలో విసంవాదం లేదు. తరతరాల మన వాఙ్మయం హిమాలయ పరిసరాలకు ఎంతో ప్రాధాన్యం ఒసగినది.

అధర్వణ వేదం హిమాలయమందు ప్రవహించే జలధారకు ప్రాశస్త్యం కల్పించింది.

హిమవతః ప్రస్రవంతి సింధౌ సంగమః అపోహ మహ్యాం
తద్ దేవీ ర్దదన్ హృద్ద్యోత భేషజమ్। యన్మే అక్ష్ణో
రాదిద్యోత పార్ష్ణ్యోః ప్రపదోశ్చయత్ ॥ (అధర్వణ 6వ కాండ 24)

మహాభారతం ఇతర పురాణములు హిమవత్పరిసర ప్రాంతములను వాటి విభూతిని విస్తృతంగా వర్ణించినవి. మహా భారతం, ఆది పర్వం - ''భారతమునకు ఉత్తర సీమపై వెలసిన విశాల పర్వతం హిమాలయం. అది స్థూలంగా పర్వతమైనను దాని అంతరాత్మ దేవతామయమైనది. వాలఖిల్యముని ఈ కొండపై తపస్సు చేసాడని తెల్పుతున్నది.'' శేషనాగుడు ఈ పర్వతంపై ఏకాంత వాసం గడపినాడట. వ్యాసుడు గాంధారీ బాలకుల రక్షణకై వ్యవస్థ ఏర్పరచి హిమాలయంపైన తపస్సు చేసినట్లు అదే పర్వమున కలదు. అర్జునుడు హిమాలయ యాత్ర కావించినట్లు కలదు. దేవర్షి నారదుడు సూర్యుని బోధానుసారము గీని శిఖరముపై ఘోర తపస్సు కావించినాడని సభాపర్వం తెల్పుతున్నది. మార్కండేయుడు బాలముకుందుని ఉదరములో హిమాలయం, హేమకూటాది పర్వతములను దర్శించినట్లు అరణ్య పర్వం తెలుపుచున్నది. ప్రావార కర్ణమను ఉలూకము మార్కండేయుని కంటే ఎన్నో ఏండ్ల ముందు పుట్టి ఇదే పర్వతంపై నివసిస్తున్నదని అరణ్య పర్వం తెలుపుచున్నది. మహర్షి శుకుడు హిమాలయ పర్వతమందు రెండు శిఖరములను దర్శించినట్లు, అందొకటి హిమగిరి శిఖరంకాగా, రెండవది మేరు శిఖరంగా భాసించిందని మహాభారతం తెల్పుతున్నది. హిమాలయ పరిసరములను గురించి మహా భారతం ఎంతో విస్తృతంగా వర్ణించినది.

మహాభారతం అరణ్యపర్వమందు మానస సరోవర ప్రశంస సంక్షిప్తంగా కలదు.

''ఏతద్ద్వారం మహారాజ! మానసస్య ప్రకాశతే
వర్షమస్య గిరేర్మధ్యే రామేణ శ్రీమతా కృతమ్.''
''ఏష వాతికషండో వై ప్రఖ్యాతః సత్య విక్రమః
నాభ్యవర్తత యద్ద్వారం విదేహానుత్తరం చ యః''
''ఏష ఉజ్జానకోనామ యవక్రీ ర్యత్ర శాంతవాన్
అరుంధతీసహాయశ్చ వసిష్ఠో భగవానృషిః''

''మహారాజా ! ఇది మానస ద్వారముగా ప్రసిద్ధి గడించినది. పర్వతము మధ్యలోనున్న ఈ ప్రదేశమున శ్రీరాముడొక సంవత్సరము నివసించినాడు. సత్య

విక్రమ దేశమునకే వాతికషండ మని పేరు. విదేహా దేశమునకు ఉత్తర భాగాన కలదు. అనగా ఈ దేశము మానస ద్వారమున ఉన్నదని తాత్పర్యము. ఈ మానస తీర్థమునే ' ఉజ్జానక' మందురు. ఈ ప్రదేశమున కార్తికేయుడు, అరుంధతితోపాటు వసిష్ఠుడు తపస్సుచేసి శాంతిని పొందిరి. ఈ సరస్సునకు 'కుశవరత' మను మరియొక పేరు కలదు. ఇందు మొలిచే పద్మములను 'కుశేశయ' మందురు. ఇక్కడ రుక్మిణి తపస్సు ద్వారా క్రోధమును జయించినది.

హరివంశం - వారసింహ ఖండమందు :

'కైలాస శ్చాపి దుష్కంపో దానవేంద్రేణ కంపిత ః
యక్షరాక్షస గంధర్వైః నిత్యం సేవిత కంధరః''
''శ్రీమాన్ మనోహరశ్చైవ నిత్యం పుష్పిత పాదపః
హేమ పుష్కర సంపన్నం తేన వైమానసం సరః
కంపితం మానసం చైవ రాజహంస నిషేవితమ్''

రాక్షసేంద్రుడు కదలింప నలవిగాని కైలాసగిరిని కదలించినట్లు అందు అందంగా హేమారవింద మంజులమై రాజహంస నిషేవితమై విరాజిల్లే మానస సరోవరమును కలచి వేసినట్లు కలదు.

రామాయణము - బాలకాండమందు :

'కైలాస పర్వతే రామ మనసా నిర్మితం పరం
బ్రహ్మణా నరశార్దూల తేనేదం మానసం సరః
తస్మాత్ సుస్రావ సరస ః సాఽయోధ్యామవగాహతే
సరః ప్రవృత్తా సరయూః పుణ్యా బ్రహ్మసరశ్చ్యుతా''

శ్రీరామా! కైలాస పర్వతమందు బ్రహ్మ తన మనస్సుతో ఒక సరస్సును నెలకొల్పినాడు. అందువలన ఆ సరస్సునకు ''మానస సరస్సు'' అని పేరు వచ్చినది. ఆ సరస్సు నుండే సరయూ నది జన్మించి ప్రవహిస్తూ అయోధ్యను పావనం చేస్తున్నది. అని విశ్వామిత్రుడు మానస సరోవరవర్ణన గావించినాడు.

మానస సరోవర పరిసరాలలో నివసించే సాధకులకు ప్రమథ గణాలతో పాటు పార్వతీ సహితుడై పరమేశ్వరుడు యుగాంత కాలమందు దర్శనమిచ్చునని అరణ్యపర్వం తెల్పుతున్నది. ఈ సరోవరం ఒడ్డుపై చైత్రమాసంలో యాజకులు శుభాభ్యుదయముల కామనతో యాగముల నొనరిస్తూ పినాక పాణియౌ శివుని పరివారంతో పాటు ఆరాధింతురని అదే పర్వం చెప్పుతున్నది. ఈ సరస్సులో స్నానమొనరించే వారి పాపములు తొలగి జితేంద్రియత్వం ఏర్పడుతుందని మానస స్నాతులు ఎన్నో శుభములను పొందుదురని అరణ్యపర్వం వర్ణించినది. ఈ

సరోవరమందు హంస రూపమున ఉండే మహర్షి అంపశయ్యపై పరుండియున్న భీష్ముని దర్శింప వెళ్లినాడని శాంతిపర్వం తెలుపుచున్నది.

మాన సరోవరం కుబేరుని క్రీడా సరస్సుగా రూపొందింప బడినదని అరణ్య పర్వం బోధిస్తున్నది. ఈ ప్రాంతముననే అలకానగరం కలదని మహాభారతం వర్ణించినది.

మానస సరోవరమును గుఱించి కాళిదాసాది మహాకవులు ఎంతో ముచ్చటగా వర్ణించినారు. భారతమాతకు మానసం మానసమని ఆధునిక కవులు వర్ణించారు. బాణుడు కాదంబరిలో మానస సరోవరమును ఎన్నో పర్యాయములు ప్రస్తావించినాడు. కథాముఖమందు ప్రభాతవర్ణనలో ''సంధ్యా ముపాసితుమ్ ఉత్తరాశావలంబిని మానస సరస్తీరమివ అవతరతి సప్తర్షిమండలే'' అని అతడు పేర్కొనినాడు. కైలాస పర్వత ప్రాంతమున దేవకూటము కలదని దాని ప్రక్కనే అచ్ఛోదమనే సరస్సు ఉందని కాదంబరీకర్త తెలిపినాడు. ఆధునికులు అచ్ఛోదమునే మానస సరోవరమని భావిస్తున్నారు.

'శైవ సిద్ధాంత శిఖామణి' అను గ్రంథమున కైలాస పర్వత వర్ణన ఘట్టమున

''హేమారవిందకలికా సుగంధిరసమానసే'' అని మానస సరోవర ప్రశంస కావింపబడినది.

భౌతికముగా కవులు హిమాలయ పరిసరముల ప్రాకృత సౌందర్యమును ఉపాసిస్తూ వర్ణింప, యోగజ్ఞులు మానసమును హృదయ పద్మంగా భావిస్తూ అందు విరాజిల్లే హృదయేశ్వరీ దేవతను తద్విద్యా ప్రసాదిత దివ్య చక్షుస్సుతో దర్శిస్తున్నారు.

జితశ్రములు మనీషి మాన్యులు శ్రీ పి. వి. మనోహరరావుగారు కైలాస మానస సరోవరాది యాత్రల ద్వారా తత్పరిసరములలో తత్త్వాన్వేషణ గావించి ఎన్నో అపూర్వ విషయములను వెలికి తీసి సామంజస్యమును కల్పిస్తూ, అనేక వివరణలతో నొక గ్రంథము నభిలిఖించినారు. వారికి మన మందరము సర్వధా సర్వదా కృతజ్ఞులము....

డా॥ శ్రీ భాష్యం,విజయసారధి.

నమశ్శివాభ్యాం వృషవాహనాభ్యాం
విరించి విష్ణ్వింద్ర సుపూజితాభ్యాం।
విభూతి పాటీర విలేపనాభ్యాం
నమోనమ శ్శంకర పార్వతీభ్యామ్॥



# అనుబంధము - 2

## కావ్యాలలో హిమాలయ సౌందర్యము

నమశ్శివాభ్యాం. జగదీశ్వరాభ్యాం
జగత్పతిభ్యాం జయ విగ్రహాభ్యాం ।
జంభారి ముఖ్యైరభి వందితాభ్యాం
నమోనమ శ్శంకర పార్వతీభ్యామ్॥
నమశ్శివాభ్యాం పరమౌషధాభ్యాం
పంచాక్షరీ పంజర రంజితాభ్యామ్।
ప్రపంచ సృష్టి స్థితి సంహృతాభ్యాం
నమోనమశ్శంకర పార్వతీభ్యామ్॥

రచన : డా. కోవెల సుప్రసన్నాచార్య
ప్రో॥ కాకతీయ విశ్వవిద్యాలయము - ఓరుగల్లు.

భారత వర్షానికి నామరూపాలు నిర్దేశించడములో హిమాలయాల ప్రాధాన్యం యెంతో ఉన్నది. ''ఉత్తరం యత్ సముద్రస్య, హిమాద్రేశ్చైవ దక్షిణమ్, తద్వర్షం, భారతం నామ, భారతీ యత్ర సంతతిః.'' అని సముద్రానికి ఉత్తరంగా హిమాద్రికి దక్షిణంగా వున్న దేశము భారతదేశమని, పురాణాలు నిర్దేశించాయి.

ఈ పర్వత శ్రేణులు భౌతికంగానే కాక అధ్యాత్మికంగా ఆదికాలం నుంచి దివ్యదీప్తులను వెల్లడిస్తూవున్నాయి. ఋగ్వేదంలో హిమవత్పర్వతం ప్రసక్తమైనది. సమస్త ఋషుల తపస్సులకు స్థానంగా, హిమాలయాలు నిలిచి వున్నాయి. హిమాలయాలలో ప్రతి చోట ఏదో ఒక పౌరాణిక, ఆర్ష, సాంస్కృతిక, ప్రాధాన్యం ఉండటం తప్పనిసరి. మేరు పర్వతం సర్వ దేవతానివాస భూమి ఈ పర్వత శిఖరాల్లోనే వున్నది.

కైలాసము పరమ శివుని నివాసభూమి. ఆయన వెలసిన దివ్యక్షేత్రాలు ప్రధానంగా ఖాట్మండులోని పశుపతినాథస్థానం, కేదారనాథ పర్వతము, ఉత్తర : కాశీ క్షేత్రం, అమరనాథక్షేత్రం ఇవన్నీ ఈ హిమాచ్ఛాదిత గిరిసానువులలోనివే. శివ పరివారమైన పార్వతీదేవి, దేవాత్మయైన, హిమవన్నగ రాజకుమార్తె, కుమారస్వామి తన బాణం చేత ఛేదించి, మానస సరస్సుకు మార్గం యేర్పరచిన క్రౌంచ పర్వతం, ఈ పర్వత శ్రేణుల్లోనే ఉన్నది.

పరమ పురుషుడైన వాసుదేవుడు వైకుంఠము నుంచి దిగివచ్చి తాను నరుడై, నారాయణుడై రెండుగా, తపస్సును నిర్వహించిన పుణ్యభూమి బదరికాశ్రమము, ఇక్కడనే స్వామి స్వయంగా, అష్టాక్షరీ మంత్రాన్ని లోక ంలో ప్రవర్తింప జేశారు.

పరమ పవిత్రమైన గంగ పుట్టింది. ఈ పర్వతాలలో ఇంకా యమున, సరయు, బ్రహ్మపుత్ర, అలకనంద ఇత్యాది నదులెన్నో ఈ పర్వతాలలో పుట్టి భారతదేశాన్ని సస్యశ్యామలం చేశాయి. బదరీ ప్రయాణ మార్గంలో, యాత్రికులకు అయిదు ప్రయాగలు ఎదురౌతాయి.

ఈ పర్వతం దివ్యాదివ్యలోకాలకు; ఒక త్రెంచరాని లంకె లాగ కానవస్తుంది. హరిద్వారం నుంచి, కైలాస శిఖర పర్వతం దాకా ప్రత్యణువు దివ్యభావసంభావుకమైంది.

సంస్కృత కావ్య సారస్వతములో హిమాలయ వర్ణనలు పుష్కలంగా కానవస్తవి. అందులోను కాళిదాస మహాకవికావ్యాలు కుమార సంభవము, మేఘదూతము. ఈ భూమికలోనే చిత్రింపబడ్డ రమ్యరచనలు. ఆయన వర్ణనలు, ప్రత్యక్షానుభవాన్ని పౌరాణిక గాథాసముచ్చయాన్ని కలబోసి రచియించినట్లుగా గోచరిస్తవి.

కుమారసంభవం ఆరంభంలోనే హిమాలయ వర్ణనమున్నది. ఈ వర్ణన చాలా సహజంగా కానవస్తుంది. ఆయన వర్ణనలలోని కొన్ని అంశాలు.

ఉత్తర దిశలో దేవతాత్మయైన హిమాలయమనే నగాధిరాజు వున్నాడు. పూర్వాపర సముద్రాల దాక వ్యాపించిన ఈ పర్వతం, పృథ్వికి ఒక దండంలాగ భాసిస్తున్నది. భూమిని కామధేనువుగా జేసి, మేరువు పాలుపితికే వాడై అనంతంగా ఓషధులను, రత్నాలను సంపాదించినపుడు, ఈ పర్వతం వత్సరూపాన్ని తాల్చింది. ఈ శిఖరాల మీది ధాతువుల వర్ణం మేఘాల మీద ప్రసరించడంతో అకాల సంధ్యా విభ్రమం కలిగి, అప్సరసలు, త్వరత్వరగా, అలంకారాలు ధరిస్తున్నారు.

ఇంకా ఈ వర్ణనలలో ఈ పర్వత ప్రాంతాలలోని, సింహాలను, ఏనుగులను, చమరీ మృగాలను, దేవదారు వృక్షాలను వర్ణించాడు మహాకవి.వెదురు వనాలలో గాలులు పాటలు పాడే కిన్నరులకు తాళం వాయిస్తున్నట్లుగా వున్న దంటాడు. గుహలలో శృంగార క్రీడలలో వున్న కింపురుషాంగనలకు, గుహా ద్వారాలపై నిలిచిన మేఘాలు, తెరలుగా యేర్పడి సంతోషాన్ని క లిగిస్తూ వున్నవి: ఈ మేఘాలు శిఖరాల నడిమి భాగంలో వుండి వర్షిస్తున్నవి. పైకేమో యెండకాస్తున్నది. ఇలా కాళిదాసు హిమాలయ వర్ణనలు మనోహరమైనవి. మనసులో రూపు కట్టించేవి. దేవదారు వృక్షాలు ఒకటొకటి ఒరుసు కోవడంతో కార్చిచ్చుపుట్టు చున్నదట. ఏనుగులు గండభాగాలతో ఒరసినప్పుడు వస్తున్నది ఆ వృక్షాల నుండి జారిన క్షీర ద్రవం, ఆ లోయలన్నింటా సురభిళం చేస్తూ ఉన్నది.

ఇలాంటి మనోహరమైన దృశ్యాలు కాళిదాసు వర్ణనలలో కోకొల్లలుగా కానవస్తవి. ఇంకా మేఘసందేశంలో ఆ పర్వత శోభ కవి కొల్లగొట్టాడని చెప్పవచ్చు.

''శబ్దాయంతే మధురమనిలై : కీచకాః పూర్యమాణాః'' అన్న శ్లోకములో, హిమాలయాలలోని ధ్వని సామాగ్రి అంతా పరమ శివుని విజయ గాధలు పాడటమే పరమార్ధంగా ఉన్నట్లుగా చిత్రింపబడ్డది. క్రౌంచ రంధ్రాన్ని అనుసరించి వచ్చే మేఘం, బలిమథనం చేసిన, విష్ణుని, నీలమైన పాదంలాగా వుంటుందని వర్ణిస్తాడు. ఇంకా కైలాస వర్ణన దగ్గర, కాళిదాసు దశముఖుని ఉచ్ఛ్వాస నిశ్వాసల చేత ఆ శిఖరం ఎలా కదలి పోతూన్నదీ వర్ణించాడు. ఇంకా త్రిదశ వనితలకు దర్పణంలాగ వున్నది. ఆ మంచు కురిసిన వేళ శివుని అట్టహాసము రాశీ భూతమైనట్లు వున్నదట.

శివునితో విహారానికి వెళ్లేప్పుడు, పార్వతీదేవి పాదాలకు సంభ్రమము కలుగకుండా, లోపలి నీళ్ళను స్తంభింపచేసుకొని, మెట్లుగా యేర్పడమని, మేఘాన్ని ఉద్బోధించుతూనే, మంచు ఎన్ని సొగసులు పోతుందో, మబ్బులు ఎంత విభ్రాంతమైన ఆకారాన్ని ధరిస్తవో వర్ణించాడు కవి.

మానస జలాన్ని గూర్చి, హేమాంభోజ ప్రసవి సలిలమని వర్ణించాడు కవి. అలకానగరాన్ని వర్ణిస్తూ ప్రియుని ఉత్సంగములో స్రస్త దుకూలయైన ప్రియురాలుగా వున్నదని రూపించాడు కవి.

కాళిదాసు వర్ణనలనుబట్టి చూస్తే ఆయన హిందూకుష్ పర్వత శ్రేణులనుకూడ హిమాలయ పర్వత శ్రేణులలో భాగంగానే భావించాడు. కాళిదాసు అభ్రంకషమైన పర్వత శిఖరాలలో కైలాస, గౌరీశిఖర, గంధమాదన, మందర, మేరు, సుమేరు శిఖరాలను తన రచనల్లో పేర్కొన్నాడు. ఈ పర్వతాన్ని కుబేర శైలమని కూడ ఆయన వర్ణించాడు. అది స్ఫటిక నిర్మితమైన దని వర్ణించాడు.

గంధ మాదనం హిమాచల పర్వత శ్రేణులలోనిదే. కాళికా పురాణంలో ఇది కైలాసానికి దక్షిణ భాగంలో వున్నట్లుగా చెప్పబడినది. వరాహపురాణము, భారతమూ ఈ కొండమీద బదరికాశ్రమమున్నట్లు చెప్పినవి. మార్కండేయ, స్కాంద పురాణాలలో అలకనందోద్గమహేతువైన పర్వతమే గంధమాదనమని పేర్కొనబడినది. కాళిదాసు దీన్నే కైలాస శిఖరోద్దేశము, అనగా కైలాస శిఖరము దగ్గర, వున్నట్లు చెప్పాడు. మందాకిని, జాహ్నవి ఈ రెండు గంధమాదనం వెనుకాలనే ప్రవ హిస్తున్నవి.

మందర పర్వతము గంధమాదన సమీపంలో వున్నది. బదరికాశ్రమానికి ఉత్తరంగా ఇది వున్నదని చెప్పవచ్చును. శివుడు వివాహానంతరం మేరు మండలాలపైన, కైలాస గంధ మాదనాలపైన విహరించినట్లు కాళిదాసు వర్ణించాడు. భారతాన్ననుసరించి

మేరు, సుమేరు, శిఖరం గఢ్వాల్‌లో గంగ ప్రవహించే రుద్ర హిమాలయ పర్వతాలే. గఢ్వాల్ ప్రాంతంలో, కేదారనాథ పర్వతాన్ని నేటికి సుమేరువని అంటారు. కాళిదాసు దీన్ని కైలాస గ్రంధ మాదనాల సమీపంలో వున్నట్లు పేర్కొన్నాడు. అందువల్ల అతడు రుద్ర హిమాలయాలనే మేరు సుమేరు పర్వతంగా పేర్కొన్నట్లు చెప్పవచ్చును.

కాళిదాసు తర్వాత భారవి కిరాతార్జునీయంలో హిమాలయ వర్ణనలు కనిపిస్తాయి. ఆదిశేషునివలె తెల్లనై బంగారు సానువుల ప్రకాశముతో కూడినవై ఈ శిఖరాలు తటిద్వంతములైన శరన్మేఘాలను తిరస్కరిస్తున్నాయంటాడు. భారవి, కాళిదాసు వర్ణనలలో యున్న సహజ లక్షణం ఇచట తగ్గి, కాల్పనికత హెచ్చినట్లు కన్పిస్తున్నది.

బాణుని కాదంబరిలో అచ్ఛోద సరోవర్ణనకూడా ఇలాటి కాల్పనికత హెచ్చుగా సూచించినదే.

తెలుగు కావ్యాలలో హిమాలయ వర్ణన ప్రధానంగా అల్లసాని పెద్దన మనుచరిత్రలో సాక్షాత్కరిస్తుంది. అక్కడి శ్యామల, కోమల, కాననములను, హేమాఢ్య దరీ ఝురులను ప్రథమంగా వర్ణిస్తాడు కవి.

మనుచరిత్రలో ద్వితీయాశ్వాసం హిమాలయ వర్ణనలతో ప్రారంభమవుతుంది. ఆకాశాన్నంటే శిఖరాలు, వాటి నుండి పారే నదులు, వాటి తరంగాల నిరంతర ఘోష, మృదంగధ్వని కాగా, దాని కనుగుణంగా నర్తించే పురి విప్పిన నెమళ్ళు, చెట్లను తొండాలతో కదలించే గున్న యేనుగులూ పెద్దన వర్ణించాడు.

పెద్దన వర్ణనలలో యేనుగులు, పెద్దపులులు, అడవి పందులు, మనుబిల్లులు, భల్లుకములు మొదలైన అడవి మృగాలు వర్ణింపబడ్డాయి. పెద్దన ఆ రోజులలో యాత్రార్థమై బదరీ కేదారాలు దర్శించి వుంటాడు. అందువల్ల అతని వర్ణనలు వాస్తవానికి దూరంగా లేవనే చెప్పాలి.

నిడుద పెన్నెరి గుంపు జడగట్ట సగరు ము
    మ్మనుమండు తపము కైకొనినచోటు
జకరకచ్ఛప కులేశ్వరు వెన్నుగానరా
    జగతికి మిన్నేరు దిగినచోటు,
పుచ్చడీకతనంబు పోబెట్టి గిరికన్య
    పతి గొల్వ నాయాస పడిన చోటు
వలచరాచరాచవా డలికాక్షుకనువెట్ట
    కరగిన అల కనికరపు చోటు

తపసి యిల్లాం(డ చెలువంబు తలచి తలచి
మున్ను ముచ్చిచ్చును విరాళిగొన్నచోటు
కనువపులు వేల్పుబడవాలు కన్నచోటు
హర్షమున జూచి (ప్రవరాఖ్యు డాత్మలోన.

ఈ పద్యంలో పేర్కొనబడ్డ (ప్రదేశాలన్నీ పౌరాణిక (ప్రసిద్ధాలు. భగీరథుని తపస్థానం, గంగ పుట్టిన (ప్రదేశం, పార్వతీదేవి తపస్సు చేసినచోటు, మన్మథుడు దహింపబడ్డ (ప్రదేశం, కుమారస్వామి జన్మ స్థలాలు. ఈ (ప్రదేశాలన్ని ఆ సన్నివేశాలను భావుకంగా సాక్షాత్కరింపజేస్తాయి.

(ప్రళయ వేళలో ఆ అగ్ని జ్వాలలో రూపం తొలగి బూడిదయైన ఈ భూమి అంతా మళ్లీ పునః సృష్టిలో రూపంపొంది మళ్లీ ఓషధులను మొలపింపగల స్థితి ఈ హిమాలయాలకు చల్లదనము లేకపోతే సాధ్యమా! యని (ప్రశ్నిస్తాడు కవి. అంటే ఒక విధంగా పునః సృష్టికి యోగ్యమైన చైతన్య సామగ్రి ఈ పర్వతాలలో కేంద్రీకృతమైనదని ఆయన భావించాడు.

యజ్ఞ (ద్రవ్యాలయిన అరుదైన ఓషధులకు స్థానమై దేవతలకు జిహ్వా తర్పణం చేస్తున్న దీ కొండ. ఇంద్రుడు, శచి కిక్కడ నదీ (ప్రవాహంలో జలకేళీ సందర్భాలలో ఈత నేర్పినాడు. శివుడేమో ఒక ఇంటివాడైనాడు ఈ కొండ చలువవల్ల.

ఇట్లా వర్ణిస్తూ వర్ణిస్తూ తుదకు పెద్దన ఈ పర్వతాన్ని వర్ణించడం (బహ్మకైనా తరమా అంటాడు.

నమ శ్శివాభ్యా మతి సుందరాభ్యాం
మత్యంత మాసక్తహృదంబుజాభ్యామ్
అశేష లోకైక హితం కరాభ్యాం
నమోనమ శ్శంకర పార్వతీభ్యామ్॥



# అనుబంధం - 3

## వివిధ పురాణములలో కైలాస మానస తీర్థ ప్రశంస

నమశ్శివాభ్యాం కలినాశనాభ్యాం
కంకాళ కల్యాణ వపుర్ధరాభ్యామ్
కైలాస శైలస్థిత దేవతాభ్యాం
నమోనమ శ్శంకర పార్వతీభ్యామ్
నమశ్శివాభ్యా మశుభాపహాభ్యామ్
మశేష లోకైక విశేషితాభ్యామ్
అకుంఠితాభ్యాం స్మృతి సంభృతాభ్యాం
నమోనమ శ్శంకర పార్వతీభ్యామ్

**రచన :- డా॥ అత్తలూరి మృత్యుంజయ శర్మ M.A., Ph.D.**
ప్రధానాచార్యులు, శ్రీ దుర్గేశ్వర మహిళా సంస్కృతాంధ్ర కళాశాల - వరంగల్.

తరింపజేయునది తీర్థము. దీనికి శాస్త్రము, యజ్ఞము, క్షేత్రము, ఉపాయము, అవతారము, ఋషిజుష్టజలము, పాత్రము, ఉపాధ్యాయుడు, మంత్రి యను అర్థములు వాఙ్మయమున కనఁబడుచున్నవి. తీర్థములు లోకమున నదీనద పర్వత వన ఆశ్రమ కుండ సరోరూపములచే బహువిధములుగా కానవచ్చుచున్నవి. అయినను గంగా గోదావర్యాది నదీ జలములయందు తీర్థ శబ్దమునకు ప్రసిద్ధి కానవచ్చుచున్నది. మనుష్యుని యొక్క మానసిక, వాచిక, కాయిక దోషములను దర్శన సేవనాదులచే పోగొట్టునవి తీర్థములు. ఇవి స్వర్గ మర్త్య పాతాళములయందు దేవ అసుర ఋషి మనుష్య భేదములచే నొప్పుచున్నవి. వీనిలో మనుష్యతీర్థముల కన్న ఋషి తీర్థములు, ఋషి తీర్థముల కన్న అసుర తీర్థములు, అసురములకంటె దేవ తీర్థములు శ్రేష్ఠములు.

శ్లో॥ చతుర్విధాని స్వర్గే మర్త్యే రసాతలే ।
దైవాని మునిశార్దూల ఆసురాణ్యారుషాణిచ ॥
మానుషాణి త్రిలోకేషు విఖ్యాతాని సరాదిభిః ।
మానుషేభ్యశ్చ తీర్థేభ్య ఆర్షం తీర్థ మనుత్తమమ్ ॥
ఆర్షేభ్యశ్చైవ తీర్థేభ్య ఆసురం బహుపుణ్యదం ।
ఆసురేభ్య స్తథా పుణ్యం దైవం తత్సార్వకామికమ్ ॥

(బ్రహ్మ పురా. 70 అ. 16 నుండి 18.)

ఈ తీర్థములయందు స్నాన దాన తపో జపాదులు అత్యల్పముగా నాచరింపబడినవయ్యు అనంత ఫలదాయకములు. అధిక వ్యయ ప్రయాససాధ్యములైన అగ్నిష్టోమాది యజ్ఞ యాగాదుల కంటె విశేష ఫలము తీర్థయాత్రలచే సులభమగును. విశేషించి తీర్థములు స్మరణ మాత్రముననే సర్వ పాపహరములు మోక్షదాయకములును నైనవి.

శ్లో॥ గంగాం గంగేతి యో బ్రూయాత్ యోజనానాం శతైరపి ।
ముచ్యతే సర్వ పాపేభ్యః
శివలోకం స గచ్ఛతి ॥ అని శాస్త్ర వచనము.

కావున ఇట్టి తీర్థములందు ఉపవాస స్నాన ముండన శ్రాద్ధాదు లవశ్యాచరణీయములుగా అనాదిగా వచ్చుచున్నవి.

శ్లో॥ అగ్నిష్టోమాదిభి ర్యజ్ఞై రిష్ట్వా విపులదక్షిణైః ।
న తత్ఫలమవాప్నోతి తీర్థాభిగమనేన యత్ ॥
తీర్థోపవాసః కర్తవ్యశ్శిరసోముండనం తథా ।
శిరోగతాని పాపాని యాంతి ముండనతో యతః ॥
తీర్థం ప్రాప్య ప్రసంగేన స్నానం తీర్థే సమాచరేత్ ।
గత్వైవ తీర్థం కర్తవ్యం శ్రాద్ధం తత్ ప్రాప్తి హేతుకమ్ ॥

వాచస్పత్యమ్. పేజి. 3212; 14

ఈ తీర్థములు జంగమములు, మానసములు, స్థావరములని మూడు విధములు. వీనిలో బ్రాహ్మణులు జంగమ తీర్థములనియు సత్యము, క్షమ, ఇంద్రియ నిగ్రహము, సర్వభూత దయ, ఋజు వర్తనము, దానము, దమము, సంతోషము, బ్రహ్మచర్యము, ప్రియవాదిత్వము, జ్ఞానము, ధృతి, మనో నైర్మల్యములు మానసములనియు, శరీరమునందు పవిత్రావయములున్నట్లుగా భూమి యందు లోకాద్భుతములైన ప్రభావములచేతను సత్పురుష నివాసముచేతను పవిత్రమ్మలైన కొన్ని ప్రదేశములు స్థావర తీర్థములనియు పేర్కొనబడినవి.

శ్లో॥ బ్రాహ్మణా జంగమం తీర్థం నిర్మలంసార్వకామికం ।
యేషాం వాక్యోదకేనైవ శుద్ధ్యన్తి మలినా జనాః ॥
సత్యం తీర్థం క్షమా తీర్థం తీర్థ మింద్రియ నిగ్రహః ।
సర్వభూతదయా తీర్థం సర్వత్రార్జవ మేవ చ ॥
..........................................
ఏ తత్తే కథితం దేవి మానసం తీర్థ ముత్తమమ్ ॥
భౌమానామపి తీర్థానాం పుణ్యత్వే కారణం శృణు ।

యథా శరీరస్యోద్దేశాః కేచి న్మేధ్యతమా స్స్మృతాః ॥
తథా పృథివ్యా ముద్దేశాః కేచిత్ పుణ్యతమా స్మృతా ।
ప్రభావా దద్భుతా ద్భూమే స్సలిలస్య చ తేజసా ।
పరిగ్రహా న్మునీనాంచ తీర్థానాం పుణ్యతా స్మృతా ॥

వాచస్పత్యమ్ పేజి 3308; 9

భూగోళము దానియందలి తీర్థములయొక్క ప్రశంస పురాణ వాఙ్మయమున విస్తృతంగా వర్ణింపబడినది. కొన్ని పురాణములయందు భూమండలము నాల్గు ద్వీపములు కలదిగను మరి కొన్నింటిలో ఏడు ద్వీపములు కలదిగను పేర్కొనబడినది. మేరువు నాధారము చేసుకొని నాలుగు దిక్కులయందు భారత, కేతుమాల, ఉత్తరకురు, భద్రాశ్వము లనెడు నాలుగు వర్షములు కలవు. వీనిలో ప్రతి వర్షమునందు పర్వత నదీ వన సరో దైవ వృక్షములు ప్రత్యేకముగా చెప్పబడినవి. వాని స్థితి యీ క్రింది విధముగా కలదు.



సప్తద్వీప విభాగమున లవణాది సప్త సముద్రములతో వేష్టితములైన జంబూ (మలేషియా), ప్లక్ష (అంటార్టికా విక్టోరియాలాండ్), శాల్మలీ (గ్రీన్‌లాండ్), కుశ (దక్షిణ అమెరికా), క్రౌంచ (ఉత్తర అమెరికా), శాక (ఆస్ట్రేలియా), పుష్కర (ఆఫ్రికా) ద్వీపములు సవిశేషముగా వర్ణింపబడినవి. వానిలో జంబూ ద్వీపము భారతాది నవవర్షములతో కూడియున్నది. హిమవత్పర్వతమునకు దక్షిణ భాగమున సముద్రోత్తర తీరమున నవయోజన సహస్ర విస్తీర్ణముగా స్వర్గాపవర్గప్రదమగు కర్మభూమిగా ఖ్యాతినందినది భారత వర్షము. ఈ వర్షము ఇంద్రద్యుమ్న (అండమాన్ టాప్), కశేరు (మలయ), తామ్రపర్ణ (సింహళము/లంక), గభస్తి, నాగద్వీప (నక్కవరము/నికోబార్ టాప్), సౌమ్య, గంధర్వ, వారుణ (బొరానియోటాప్), భరతములనెడు నవ ఖండములచే నొప్పుచున్నది.

పురాణదిగ్దర్శన్ (పండమాధవాచార్య) పేజి 758

దీనికి పూర్వ భాగమున కిరాతులు, దక్షిణమున యవనులు, పశ్చిమమున కశులు, ఉత్తరమున తపస్వులు నివసింతురు. భరత ఖండమున మహేంద్ర మలయ సహ్య సుదామ ఋక్ష వింధ్య పారియాత్రకములనెడు సప్తకుల పర్వతములు, కృతత్రేతా ద్వాపర కలియుగములనెడు నాలుగు యుగములున్నవి. ఈ పర్వతములనుండి క్రమముగా త్రియామా ఋషికుల్యలు, కృతమాలా తామ్ర పర్ణ్యాదులు, కృష్ణ వేణ్యాదులు, త్రియామా ఋషికుల్యాదులు, గోదావరీ భీమరథీతాప్యాదులు, నర్మదా సురసాదులు, పర్ణాసా చర్మణ్వతీవేత్ర వత్యాదులు నదులుత్పన్నములైనవి.

శ్లో॥ సప్త చాస్మిన్ మహావర్షే విశ్రుతాః కులపర్వతాః ।
మహేంద్రో మలయ స్సహ్య శ్శుక్తిమాన్ ఋక్షవానపి॥

.............................................

సర్వాః పుణ్యాజలాః పుణ్యాః సర్వాగాశ్చ సముద్ర గాః ॥
మత్స్య పురా. 114 అ. 17 నుండి 33.

స్వాయంభువ మన్వంతరమున మొదటి త్రేతాయుగమున ప్రియవ్రతుని పుత్రుడైన అగ్నీధ్రుడు జంబూద్వీపమును పరిపాలించెను. అతనికి నాభి కింపురుష హరివర్ష ఇలావృత రమ్య హరణ్మత్ కురు భద్రాశ్వ కేతుమాలులనెడు తొమ్మండుగురు కుమారులుండిరి. వీరిచే పరిపాలింపబడుటవలన అయా భూభాగములకు వారి నామమములతోడనే కింపురుష వర్షము; ఇలావృతము మున్నగు వ్యవహారము కలిగినది. జ్యేష్ఠుడైన నాభిచే పరిపాలింపబడిన హైమ వర్షమునకు అతని పౌత్రుడగు భరతునిచే పరిపాలింపబడుటచేత భారత వర్షమను ప్రసిద్ధి కలిగినది.

జంబూ ద్వీపమునకు మధ్య బాగమున మేరువనెడి పర్వత రాజము కలదు. అది దేవ గంధర్వ కిన్నర, కింపురుష, యక్ష రాక్షసాదులకు నిలయమై నానా జాతీయ తరుగుల్మలతా శోభితమై వివిధ ప్రత్యంత పర్వతములతో విరాజిల్లుచున్నది ఈ మేరువునకు-

ఉత్తరమున - నీలము దాని కుత్తరమున శ్వేతము ఆ శ్వేతమున కుత్తరమున శృంగి యను పర్వతములు కలవు.

తూర్పున - జఠర దేవకూటములున్నవి

దక్షిణమున - నిషధము దానికి దక్షిణమున హేమ కూటము దానికి దక్షిణమున హిమవంతములనెడి పర్వతములున్నవి

పశ్చిమమున - ఉత్తర దిశకు వ్యాపించి మాల్యవంతము గంధ మాదనము

అనెడు పర్వతములు సిద్ధచారణ సేవితములై యొప్పుచున్నవి.

శ్లో॥ జంబూద్వీపేశ్వరం చక్రే అగ్నీధ్రం చ మహాబలమ్ ।

..............................................

నవ్య పుత్రాబభూవ్వుర్హి ప్రజాపతిసమానవ ।
జ్యేష్ఠో నాభిరితి ఖ్యాతః తస్య కింపురుషోఽనుజః ॥

..............................................

ఇత్యేతానిమయోక్తాని నవ వర్షాణి భాగశః ॥
బ్రహ్మాండ. పురా. 1-2-14-11 నుండి 52
నీల స్తథోత్తరే మేరోః శ్వేతస్తస్యోత్తరే పునః ।
శృంగీ తస్యోత్తరే విప్రాస్త్రయస్తే వర్షపర్వతాః;;

..............................................

ఏతే పర్వతరాజాన స్సిద్ధచారణసేవితాః ॥

లింగ పురా. 1-29-3 నుండి 6

---

## పూర్వ ప్రమాణములు

### యోజనము

1. తిర్యక్ ప్రసారితములైన అంగుష్ఠ-తర్జన్యంగుళ వ్యాసము (పొడవు) నకు ప్రాదేశమని పేరు.
2. మధ్యమాంగుష్ఠ వ్యాసము - తాళము
3. అనామాంగుష్ఠ వ్యాసము - గోకర్ణము
4. కనిష్ఠాంగుష్ఠ వ్యాసము - వితస్తి - ఇది 12'' గలది.

వీనిలో హిమాలయ మధ్యమున (పృష్ఠ భాగమున) యక్ష రాక్షసాది పరివృతుడగు కుబేరునకు నివాస స్థానమైన కైలాస పర్వతము కలదు. ఇది అనేక శిఖరములతో కూడుకొని శంఖధవళమై దేవతానిలయమై శతయోజనముల పొడవు కలిగియున్నది. అట ఏబది యోజనలముల పరిమితమై విశాలమైన కుబేరనగరము కలదు. అతనికివిపులా యను విశాలమైన సభాభవనము, పుష్పకమను విమానము, పద్మ మహాపద్మా ద్యష్ట నిధులు కలవు. అచట సువర్ణమణిసోపానయుత మైన మందాకిని యను వాపి కలదు. (బ్రహ్మాండ పురాణములో పేర్కొనబడిన మందమను సరస్సిదియే కాబోలును). ఇందు నంద అలకనందాది నదులు ప్రవహించుచున్నవి. కైలాస పూర్వ శృంగమున వేయి యోజనముల పొడవు ముప్పది యోజనముల వెడల్పు గల్గి అనేక భవనములచే విరాజిల్లుచున్న సుబాహు, హరికేశ, చిత్ర సేనాది గంధర్వ నగరములు పది కలవు. కుందేందు ధవళమైన పశ్చిమ శృంగమున మిక్కిలి విశాలమైన మహాయక్ష భవనములుకలవు. దానికి దక్షిణమున, నికుంజ, నిర్ఝరానేక, గుహా, సాను, దరీ, తటములతో కూడిన హిమాలయము కలదు. అట్టి హిమాలయ పర్వతము నందు పార్వతీ తపశ్చర్యా ప్రదేశమును, పార్వతీ పరమేశ్వర వివాహస్థలమును, ఈశ్వరుడు కిరాతలీల చూపిన ప్రదేశమును, చిత్రపుష్పఫలములతో కూడిన రుద్ర విహార

---

24 అంగులని పర్వములు రత్ని

24 ''  ''  '' - హస్తము

2 రత్నులు (42'') - కిష్కు

4 హస్తములు (96'') - ధనుర్దండము/రెండు నాళికలు

2000 ధనువులు 1 గవ్యూతి (రెండు క్రోసులు)

8000 ధనువులు - 1 యోజనము (ఎనిమిది క్రోసులు)

అంగుష్ఠస్య ప్రదేశస్య వ్యాసః ప్రాదేశ ఉచ్యతే !
తాళః స్మృతో మధ్యమయా, గోకర్ణ శ్చాపి అనామయా
కనిష్ఠయా వితస్తిస్తు ద్వాదశాంగుళ ఉచ్యతే,
రత్నిరంగుళ పర్వాణి సంఖ్యయా త్వేకవింశతిః.
చతుర్వింశతిభిశ్చై వ హస్తస్స్యా దంగుళానితు
అష్టౌ ధనుస్సహస్రాణి యోజనం తైర్నిరుచ్యతే.

(వాయు పు. పూర్వా. 8-98 నుండి 120)

శ్లో॥ మధ్యే హిమవతః పృష్ఠేకైలాసో నామ పర్వతః ।

(బ్రహ్మాండ పురా 1-2-18-1

భూములును, ఈశ్వరుడు అర్ధనారీశ్వర రూపము దాల్చిన ఉమావనమును, కుమార జన్మస్థానమైన శరవణమును కలవు. దానికి పూర్వభాగమున సిద్ధులు నివసించెడి కలాపమను గ్రామము కలదు. ఆ ప్రాంతములలో మృకండు, వశిష్ఠ, భరత, నల, విశ్వామిత్రాది బ్రహ్మర్షులు, రాజర్షులును, తపమాచరించిరి. హేమధాతుమయమయిన దాని మధ్య కూటమున సిద్ధాప్సరోగణములచే సేవింపబడిన శ్రీ మహావిష్ణువు యొక్క ఆలయము కలదు. (ఇది బదరీ నారాయణము కాబోలును) దానికి ఉత్తరమునందలి త్రిశృంగపర్వతమున హేమ చిత్రమను సుప్రసిద్ధమైన పట్టణము కలదు. అందు పూర్వ మధ్య పశ్చిమ దిక్కులయందు వరుసగా విష్ణు బ్రహ్మ శివాలయములు కలవు. ఉత్తర దిక్కునందలి జారుధమను దేవ పర్వతమున యక్ష కిన్నర నాగ రాక్షస దైత్యాలయములును, కూట మధ్యమున వికసించిన కమలముతో కలువలతో హంస కారండవాది పక్షిగణములతో కూడిన ముప్పది యోజనముల వృత్తముగల ఆనంద జలమను పేరుగల పుణ్య సరస్సు కలదు.

శ్లో॥ వివిక్తచారుశిఖరం పత్రితం శంఖవర్చసమ్ ।
కైలాసం దేవభక్తానా మాలయం సకృతాత్మనామ్ ॥
.......................................
సిద్ధై రుపస్పృష్టజలం జలదోషైర్వివర్జితమ్ ॥
తత్రానందజలం నామ మహాపుణ్యాజలం సరః ॥
వాయు పురా. 1-41-1 నుండి 72

పూర్వోక్తమైన కైలాసమున నున్న మందమను సరస్సు నుండి మందాకినీ నది ఉద్భవించినది. దాని తీరమున నందన వనము కలదు. కైలాసమున కీశాన భాగమున ఓషధీ నిలయమైన రత్న ధాతుమయమైన చంద్ర ప్రభయను పర్వతము కలదు. దానియందు అచ్ఛోదమను సరస్సు కలదు. దాని నుండి అచ్ఛోదమను నది ఉద్భవించినది. దాని తీరమున చైత్ర రథమను ఉద్యానవనము కలదు. దాని యందు యక్ష సేనాపతి మణి భద్రుడు నివసించుచున్నాడు.

కైలాసమునకు ఆగ్నేయమున (ప్రాగ్దక్షిణముల మధ్య భాగమున) లోహితమను పర్వతము కలదు. దానియందున్న లోహితమను సరస్సు నుండి లౌహిత్యమను నది జనించినది. దాని తీరమున నున్న విద్యారణ్యమున మణిధరుడను యక్షుడు నివసించుచున్నాడు.

కైలాసమునకు దక్షిణమున క్రూర మృగములతోడను, ఓషధులతోడను కూడుకొనిన వృత్రాసురుని శరీరమునుండి జనించిన అంజనాచలము కలదు. దాని కెదురుగానున్న వైద్యుతగిరి పాదమునందు సిద్ధ సేవితమైన మానస సరస్సు కలదు. ఇది బ్రహ్మ యొక్క మనః సంకల్ప మాత్రమున సృష్టింపబడినది.

శ్లో॥ తస్య పాదే మహద్దివ్యం మానసం సిద్ధసేవితమ్ ।
తస్మాత్ ప్రభవతే పుణ్యా సరయూ ర్లోకపావనీ ॥
మత్స్య పురా. 121 అ. 16,17

దీని నుండి పవిత్రమైన సరయూనది జన్మించినది. దాని తీరమునున్న వైభ్రాజవనమున ప్రహేతి తనయుడగు బ్రహ్మపేతుడను రాక్షసుడు నివసించుచుండును.

కైలాసమునకు పడమట బంగారు ఛాయతో కూడిన అరుణమను పర్వతముకలదు. అది ఆకాశము నొరయుచున్న బంగారు శిఖరములతో నొప్పుచుండును. అట హిమమయమైన ముంజవంతమను దుర్గము కలదు. అందు ధూమ్రలోచనుడను గిరీశుడుండును. ఆ పర్వతపాదమున శైలోదమను సరస్సు కలదు. దానినుండి జనించినట్టి శిలోదమను నది చక్షూసీతానదములతో కలసి సముద్రగామిని యగును. దాని తీరముననే సురభియను వనమొప్పుచున్నది.

కైలాసోత్తర భాగమున హరితాళవనమున కెదురుగా గౌర మను పర్వతము కలదు. అట భగీరథుడు గంగను తెచ్చుటకై పెక్కుకాలము తపమాచరించెను. ఆకాశమునుండి శివశిరస్సున పడి నిరోధింపబడుటచే కుపితయైన గంగా బిందువులు పడిన కారణమున బిందు సరస్సు యేర్పడినది. భగీరథుని ప్రార్థనచే ధూర్జటి జటాజూటము నుండి వెలువడిన గంగ ఏడు పాయలుగా ప్రవహించినది. అందు నళిని, హ్లాదిని, పావని అను పేర్లతో మూడుపాయలు తూర్పునకు, సీతా, చక్షూ, సింధులను పేర్లతో మూడుపాయలు పటమటకు ప్రవహించినవి. ఏడవపాయ భగీరథుని వెంట దక్షిణదిశగా పయనించి భాగీరథియని ప్రసిద్ధి చెందినది.

శ్లో తతో విసర్జయామాస సప్తస్రోతాంసి గంగయా ॥
త్రీణి ప్రాచీ మభిముఖం ప్రతీచీం త్రీణ్యథైవ తు ।
స్రోతాంసి త్రిపథాయాస్తు ప్రత్యపద్యన్త సప్తధా ॥
నలినీ హ్లాదినీచైవ పావనీ చైవ ప్రాచ్యగాః ।
సీతా చక్షుశ్చ సింధుశ్చ తిస్రస్తావై ప్రతీచ్యగాః ॥
సప్తమీ త్వనుగతా తాసాం దక్షిణేన భగీరథమ్ ।
తస్మా ద్భాగీరథీ సావై ప్రవిష్టా దక్షిణోదధిమ్ ॥
మత్స్య పురా. 121 అ. 38 నుండి 41

గంగోత్పత్తి వరాహ పురాణమున ఇట్లు కలదు: ఆకాశ సముద్రమునుండి నిరాలంబముగా మేరుపర్వతమున పడి అట నుండి నాలుగుపాయలుగా చీలి సీతా అలకనందా, చక్షూ, భద్రా అను నామములతో ప్రవహించినది. అందులో ఒకటి (అలకనంద) పర్వతప్రాంతముల భేదించుచు గంగా భాగీరథ్యాది నామములు కల్గి భారతదేశమును పవిత్రము చేయుచున్నది.

శ్లో॥ ఆకాశ సముద్రో యః ప్రోచ్యతే ... సాచ మేరుకూట
తటాంతేభ్యః ప్రస్థలితా చతుర్ధా సంజాతా ...
సీతా చాలక నందా చక్షుర్భద్రా చేతి నామభిః తాసాం
మధ్యే ఏకాశీతి సహస్ర పర్వతాన్ దారయన్తీ గాం గతా
గంగే త్యుచ్యతే... 82 అధ్యాయము

వాయు మహాపురాణమున లోకపద్మమునకు కర్ణికాస్థానమైన మేరువునకు పూర్వదక్షిణ పశ్చిమోత్తరముల యందున్న శ్వేత పీత కృష్ణరక్త వర్ణములు బ్రహ్మక్షత్రియాది చాతుర్వర్ణములకు సంకేతములుగా చెప్పబడినది. దీనికి దక్షిణ దిగ్భాగమున నున్న మానస సరస్సునకు దక్షిణ భాగము త్రిశిఖర, కళింగ, పతంగ, రుచక, శ్వేతోదర, విషధారా, రత్నధారా, ఏకశృంగ, గజశైల, కైలాస, హిమాలయములనెడు ఉత్కృష్టములై దేవసంచారయోగ్యములైన పర్వతములు కలవు.

శ్లో॥ చాతుర్వర్ణస్తు సౌవర్ణోమేరు శ్చోచ్ఛతమః స్మృతః
1-34-15

సరసో మానసస్యేహ దక్షిణా యే మహాచలాః ।
..............................................
శైల స్త్రిశిఖరశ్చాపి శిశిర శ్చాచలోత్తమః ।
కళింగశ్చ పతంగశ్చ రుచక శ్చైవ సానుమాన్ ॥
.........................................
పంచ శైలో ఽథ కైలాసో హిమవాం శ్చాచలోత్తమః ।
1-36-21 నుండి 24

రామాయణ మహా కావ్యమున సీతాన్వేషణ స్థలముల నిర్దేశించునపుడు సుగ్రీవుడు వానరులతో కుబేరభవనముతో కూడి విశాలనదీయుతమైన కైలాస పర్వతమును, దేవతా పూజ్యులై దేవరూపధారులైన మహర్షులకు నిలయమైన గుహలతో కూడుకొనిన క్రౌంచ పర్వతమును, అందలి పక్షులకు నిలయమై దేవరాక్షస భూతాదులకు సైతము చొరరానిదై వృక్షరహితమైన మానససరోవరము నన్వేషించుడని చెప్పినట్లు కలదు.

శ్లో॥ క్రౌంచం తు గిరి మాసాద్య బిలం తస్య సుదుర్గమమ్ ।
..............................................
అవృక్షం కామ శైలం చ మానసం విహాగాలయమ్ ॥
న గతి స్తత్ర భూతానాం దేవానాం నచ రక్షసామ్ ॥
కిష్కింధా కాండ 43 సర్గ 25 నుండి 28

వామన పురాణమున ప్రహ్లాద తీర్థ యాత్రా ప్రసంగమున ప్రహ్లాదుడు మేరు పర్వతమును దాటి దేవ భోగ్యమై ఆదిమత్స్యమున కాలయమైన మానసమను తీర్థమును ప్రవేశించి స్నాన శ్రాద్ధాది క్రియల నాచరించినట్లు కలదు.

శ్లో॥ సంత్యజ్య మేరుం కనకాచలేంద్రం
తీర్థం జగా మామరసంఘజుష్టం ।
ఖ్యాతం పృథివ్యాం శుభదం హి మానసం
యత్ర స్థితో మత్స్యవపు స్సురేశః ॥
తస్మిం స్తీర్థవరే స్నాత్వా సంతర్ప్య పితృదేవతాః ।
ఆద్యం మత్స్యం మహద్రూపం సంస్థితం మానసే హ్రదే ।

52-3,4; 63-1

కూర్మ పురాణమున దుర్జయుడను రాజు ఊర్వశియందాసక్తచిత్తుడై ఆమె నన్వేషించుచు హిమవత్పర్వతమును హేమకూటమును వెతుకుచు దేవలోకమైన మహా మేరువును ప్రవేశించి అట నున్న మానస సరోవర తీరమున సంచరించుచున్న ఊర్వశిని తిలకించినట్లు మానస సరోవరమున స్నానమాడిన ఇంద్రుని అర్థ సింహాసనము, రుద్రలోకావాప్తియును కలిగినట్లు అభి వర్ణింపబడినది.

శ్లో॥ దేవలోకం మహామేరుం యయౌ దేవపరాక్రమః ।
స తత్ర మానసం నామ సర స్త్రైలోక్యవిశ్రుతమ్ ॥
..............................................

1-22-28 నుండి 32

మానసే సరసి స్నాత్వా శక్రస్యార్ధాసనం లభేత్ ॥ 2-36-41
తతో గచ్ఛేత రాజేంద్ర మానసం తీర్థ ముత్తమమ్ ॥
స్నాత్వా తత్ర నరో రాజన్ రుద్రలోకే మహీయతే ॥

2-40-21

మత్స్యపురాణమున మానసము కుముదా అనుశక్తి (మనసా, భవిష్యపు) నిలయమై పైతృకాది క్రియలకు పవిత్ర తీర్థమైనట్లును కలదు.

శ్లో॥ మానసే కుముదా నామ విశ్వకాయా తథాంబరే. 13-27
తీర్థాని యాని శస్తాని పితౄణాం వల్ల భాని చ ।
..............................................
తథా రుద్రసరః పుణ్యం సరో మానస మేవ చ ।

22-3 నుండి 23

శివ మహాపురాణమున భారద్వాజసగోత్రులు కౌశికుని పుత్రులు నైన క్రోధుడు మొదలగు వారు ఏడుగురు శ్రాద్ధ నిమిత్తమై గురువుగారి గోవును వధించి తత్ఫలితముగా

దశార్ణ దేశమున వ్యాధులుగా కాలాంజన గిరియందు మృగములుగా శరద్వీపమున చక్రవాక పక్షులుగా నటుపిమ్మట మానస సరోవరమున హంసలుగా జన్మించి దీని ప్రభావమున బ్రాహ్మణులై మోక్షము నందినట్లు కలదు.

శ్లో॥ సప్త వ్యాధా దశార్ణేషు మృగాః కాలాంజనే గిరౌ।
చక్రవాకా శ్శరద్వీపే హంసా స్సరసి మానసే ॥
తే ఉభిజాతాః కురుక్షేత్రే బ్రాహ్మణా వేదపారగాః ।
ప్రస్థితా దీర్ఘ మధ్వానం యూయం కి మవసీదథ ॥ ఉమా.సం.42అ.

కైలాసమానసముల వర్ణనము వివిధ పురాణములలో వేరు వేరుగా కనిపించుచున్నది. ఆయా పర్వతశ్రేణుల పేర్లను నదుల పేర్లను భిన్న భిన్నములుగా కనిపించుచున్నవి. కాని ప్రధానాంశములలో భేదము లేదు. ఆయా కల్పముల యందలి వ్యవహార భేదము చేతను భిన్న భిన్న దిశలనుండి దర్శించుట చేతను ఈ మాత్రపు వైవిధ్యము కలిగి యుండవచ్చును. ఏది యేమయినను కైలాసమానసములు అనాది కాలమునుండి ఆదిమములైన శైవ శాక్త సంప్రదాయములకు జనక స్థానములుగా కానవచ్చుచున్నవి. శైవక్షేత్రములలో ఈ రెండే కాక ప్రధానములైన కేదార, పశుపతినాథ, ఉత్తరకాశి మొదలగు క్షేత్రములు హిమాలయ పర్వత శ్రేణులలో కనిపించుచున్నవి. ఇంచుమించు ఈ క్షేత్రములే శక్తి సంప్రదాయమునకు కూడ ఆలవాలములై యున్నవి. పర్వత ప్రాంతీయములైన జీవన పద్ధతులు ముఖ్యముగా హిమచ్ఛన్న భూములలోని వాతావరణ పరిస్థితులు ఈ సంప్రదాయముల యొక్క ఆదిమములైన ఆచారములను రూపొందించ వచ్చును. మధు మాంస మత్స్యాది సేవనము ఈ పరిస్థితులలో ఆచారములుగా అంగీకరింపబడి యుండవచ్చును. లైంగిక విషయములో కూడ కొంత నియమ రాహిత్యము పంచ ''మ'' కారములలో దీని స్థానమునకు కారణమై యుండనోపును. ఈ సంప్రదాయములు పర్వత ప్రాంతముల దాటి దక్షిణాభిముఖమైన కొలదియు వీనిని వామాచారముగ తిరస్కరింపబడి వాని స్థానమున దక్షిణాచారములు నియమింపబడియుండును. శైవములోని కాపాలికాద్యుగ్ర సంప్రదాయములకు కూడ ఈ పర్వతీయ జీవనమే కారణముగానోపును.

శ్లో॥ నమశ్శివాభ్యాం రథవాహనాభ్యాం
రవీందు వైశ్వానర లోచనాభ్యామ్।
రాకాశశాంకాభ ముఖాంబుజాభ్యాం
నమోనమ శ్శంకర పార్వతీభ్యామ్ ॥



# అనుబంధం - 4

## శాక్తాది సంప్రదాయము - ఒక పరిశీలన

శ్లో॥ నమ శ్శివాభ్యాం జటిలం ధరాభ్యాం
జరామృతిభ్యాం చ వివర్జితాభ్యామ్ ।
జనార్దనాబ్జోద్భవ పూజితాభ్యామ్
నమోనమ శ్శంకర పార్వతీభ్యామ్ ॥

ప్రణేత : శాస్త్రుల భార్గవ రామశర్మ, MOL
అధ్యాపకులు, శ్రీ దుర్గేశ్వర మహిళా సంస్కృతాంధ్ర కళాశాల, వరంగల్.

మానవ జన్మ యొక్క లక్ష్యము మా-నవ జన్మ. అనగా పునర్జన్మ లేకుండుట. ఈ స్థితినే మోక్షమందురు. మోక్ష మాత్మజ్ఞాన మూలకము. ఆత్మ జ్ఞానము భాసించుటకు కావలసినది సత్త్వసంశుద్ధి. సత్త్వసంశుద్ధికి మూలము ధర్మానుష్ఠానము. కావుననే ధర్మము పురుషార్థములకు మూలము. ధర్మము వేదచోదితము. వేదము కర్మోపాసనా బ్రహ్మము లనెడు మూడు కాండములుగా విభక్తమైనది. ఋతంభరా ప్రజ్ఞాపూర్ణులైన మహర్షులు వేదములందు ప్రతిపాదితములైన మహార్థముల నవగాహనము చేసికొని శాస్త్రరూపముల వివరించినారు. అవి శిక్ష-కల్పము-వ్యాకరణము-ఛందస్సు-జ్యోతిషము-నిరుక్తము లనెడు షడంగములు, మరియు యోగము-న్యాయ వైశేషికములు-పూర్వోత్తర మీమాంసలు - పురాణములు - ధర్మశాస్త్రములు. వీనిలో పూర్వ మీమాంస తత్ప్రవర్తకుండైన జైమిని మహర్షి చేత అతని యనుయాయులైన ప్రభాకర కుమారిల భట్ట పాదాదులచేతను పరిపోషింపబడినది. ఉత్తర మీమాంస తత్ప్రవర్తకుండైన వ్యాసమహర్షిచే మరియు నతని యనుయాయులైన శ్రీశంకర, నీలకంఠ, మధ్వాచార్య, రామానుజ, నింబార్క,

వల్లభాచార్యాది జగద్గురువులచేతను వ్యాఖ్యానించబడి (పృథక్ దర్శనములుగా) సుప్రతిష్ఠితమైనవి.

ఇట్లు కర్మకాండ - బ్రహ్మకాండములు గతార్థములు కాగా శిష్టమైన యుపాసనా కాండము నారదాది మహర్షులచే వ్యాఖ్యానము చేయబడినది.

శ్లో॥ ''తత్ర సర్వాసు శ్రుతిషు కాండత్రయం కర్మోపాసనా
బ్రహ్మ భేదేన. తత్ర కర్మకాండం జైమిని ప్రభృతిభి ః
సమ్యక్ తయా వివృతమ్. ఇద ముపాసనాకాండం నారదాదిభి

బ్రహ్మ కాండం భగవద్వ్యాసాదిభిరితి ... ఏతదుపాసనాకాం
డమే వాగమ శాస్త్రాత్మకం గరీయ ఇతి సిద్ధమ్.''
(శారదా తిలకం) పదార్థాదర్శవ్యాఖ్య.

ఈ యుపాసనా కాండము నందలి శ్రీరామ పూర్వోత్తర తాపినీ-నృసింహ పూర్వోత్తర తాపినీ - గణపత్యథర్వశీర్ష-కైవల్య-రుద్రాక్షజాబాల-త్రిపురా - సౌభాగ్య లక్ష్మీ-సరస్వతీ-భావనా -అరుణాద్యుపనిషత్తులయందు సూక్ష్మముగా ప్రతిపాదించబడిన విషయములే తంత్ర గ్రంథములయందు ఆగమములయందును విస్తృతముగా ప్రతిపాదించబడినవి. ఇట్లు ఆగమములు - తంత్రములు శ్రుతి మూలకములనుట నిర్వివాదము.

## ఆగమ ప్రామాణ్య విచారము

'' ఈశాన స్సర్వ విద్యానామ్'' నారా. ఉప. 4/47 అని శ్రుతి. వేదాది సర్వ విద్యలకు ఆదికర్త పరమేశ్వరుడు. ఈ విద్యలు ప్రతికల్పాదియందు పరమేశ్వరుని నుండి బ్రహ్మకు సంక్రమించి పరంపరగా జగద్వ్యాప్తము లగును. అట్టి విద్యలలో నంతర్భవించిన యాగములకు ప్రధాన ప్రవర్తకుడు లేక ప్రణేత పరమేశ్వరుడే.

శ్లో॥ యో బ్రహ్మాణం విదధాతి పూర్వం
యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై;
అష్టాదశానా మేతాసాం విద్యానాంభిన్నవర్త్మనాం ।
ఆదికర్తా శివః సాక్షా చ్ఛూలపాణి ర్మ హేశ్వర ః॥
పరశురామకల్ప సూత్రద్విపది పి.నెం. 343.

అస్య మహతో భూతస్య నిశ్వసితమే తద్య దృగ్వేదో యజుర్వేదః
సామవేదోఽథర్వాంగిరసః ఇతిహాస ః పురాణం విద్యా ఉపనిషద

శ్లోకా ః సూత్రాణ్యనువ్యాఖ్యానా నివ్యాఖ్యానాస్యస్యైవైతాని నిశ్వసితాని
బృహదారణ్యా కోపనిషత్ - 2 అధ్యా. 4 బ్రహ్మ.

శివుని మోమునుండి వెలువడి పార్వతి యొక్క శ్రవణేంద్రియముల బ్రవేశించి యామె హృదయమున మగ్నములైనవి (మననము చేయబడినవి) లేదా శివుని ముఖములనుండి వెలువడి గిరిజాముఖమునందు, గిరిజాముఖము నుండి వెడలి వుని శ్రవణములయందు ప్రవేశించి వాసుదేవునకు మతములైనవి యాగమములు - గమములు.

శ్లో॥ ఆగతం శివవక్త్రాచ్చ గతం చ గిరిజా శ్రుతౌ ।
మగ్నంచ హృదయాంభోజే తస్మాదాగమ ఉచ్యతే ॥
ఆగతం శివవక్త్రేభ్యో గతం చ గిరిజాముఖే ।
మతం చ వాసుదేవస్య త.స్మాదాగమ ఉచ్యతే ॥
నిర్గతం గిరిజావక్త్రాత్ గంత చ గిరిశశ్రుతౌ ।
మతం చ వాసుదేవస్య తస్మా న్నిగమ ఉచ్యతే ॥

శ్రీ శక్తి సంగమ తంత్రమ్. ఉపో. పూ. భా. పి.నెం. 5

ఈ త్రివిధములైన వ్యుత్పత్తు లాధారముగా ఆగమ నిగమ పదవాచ్యములైన తంత్రములకు శివపార్వతులు కర్తలనుట స్పష్టము. ఆప్తతములైన జగత్పితరులచే ప్రణీతములైనవి యెట్లు ప్రమాణములు కాకపోవును? కాని, ఆగమ ప్రామాణ్య విషయమున ధార్మికులలో భిన్నాభిప్రాయములు కన్పడుచున్నవి.

(1) తంత్రములు కేవలం లోభైక మూలములు. అవైదికములు, ధర్మ దూరములు: అని భట్టపాదులు తంత్ర వార్తికమున అభిప్రాయపడినారు.

శ్లో॥ తంత్రాణాం కేవలలోభైకమూలత్వేనా ప్రామాణ్యాత్
లోభాదికారణం చాత్ర బహ్వ్యేవాన్యత్ ప్రతీయతే ॥
...................................................
నచ త్రైర్వేదమూలత్వ ముచ్యతే గౌతమాదివత్ ।

(ప.క. సూవ్. 1-1)

(2) శ్రీ మదాది శంకర భగవత్పాదులు బ్రహ్మ సూత్ర భాష్యమున ఉత్పత్త్య సంభవాధికరణమునందు ''కర్తు ర్జీవాత్ సంకర్షణ సంజ్ఞాత్ - మనః ప్రద్యుమ్న సంజ్ఞక ముత్పద్యతే'' అను నాగమోక్త జీవోత్పత్తి ప్రక్రియ శ్రుతి మూలకముగామి, నాలుగు వేదములందు శ్రేయస్సు లభించని కారణమున శాండిల్యుడు పాంచరాత్ర శాస్త్రము నభ్యసించినాడని వేద నింద యుండుట చేతను పాక్షికముగా పాంచరాత్రాగమము ప్రమాణముగాదని భాషించినారు. శ్రీ నీలకంఠ భగవత్పాదులు గూడ పాంచరాత్రాగమ ప్రామాణ్యమును నిరసించినారు. కాని భగవద్రామానుజులు పాంచరాత్రాగమములు సాక్షాత్ శ్రీ మన్నారాయణ ప్రణీతములగుటచే పరమ ప్రమాణములని నుడివి - జీవోత్పత్తి విషయమున సంకర్షణ ప్రద్యుమ్నా నిరుద్ధులు - జీవమనోఽహంకార తత్త్వముల కధిష్ఠాతలని చెప్పుటయే యాగమ తాత్పర్యమని ఇది బ్రహ్మమును ఆకాశ ప్రాణాది శబ్దము చేత చెప్పుట వంటిది. ఇందు శ్రుతి విరోధమేమిగలదని తత్ ప్రామాణ్యమును స్థాపించినారు.

(3) శ్రీ మదభినవ శంకరాచార్యులు ''పథీనాం పతయే నమః'' అను శతరుద్రీయ మంత్రమునకు వ్యాఖ్యానము చేయుచు ''మాయిక గోహత్యాభియోగ్యముచే సంతప్తుడైన గౌతమముని తనయందు గోహత్యాదోషము నాపాదించిన బ్రాహ్మణులను మహాపాతకులైన మీరు వేదబాహ్యులగుదురు గాకయని శపించగా వారెల్లరు శివకేశవులను శరణువేడ వారు వేద బాహ్యులైన పాపిష్ఠులైన వారలను రక్షించుటకు, వేదములయందు విపరీత బుద్ధిని కలిగించుటకు కాపాల-లాగుడ శాక్త భైరవ-పాంచరాత్ర-పాశుపతాద్యాగమ శాస్త్రములను రచించినార''ను కూర్మ పురాణములోని యితిహాసము నుద్ధరించి ఇవియన్నియు వేద విరుద్ధములగుటచే నప్రమాణములని నుడివినారు.

(4) పాంచరాత్ర భాగవత వైఖానసములు మహామాయా శంబరాది చతుష్షష్టి (64) తంత్రములు అవైదికములని పెక్కు గ్రంథములయందు పేర్కొనబడినవి.

శ్లో॥ పాంచరాత్రం భాగవతం తథా వైఖానసాభిదం ।
వేదభ్రష్టాన్సముద్దిశ్య కమలాపతిరుక్తవాన్ ।
(నిత్యాషోడశికార్ణవః) సేతుబంధము పి. నెం. 5
చతుష్షష్టిశ్చ తంత్రాణి మాతౄణా ముత్తమాని చ ।
.............................................
ఏతాని తంత్రాణి జగతాం అతిసంధానకారణాని వినాశ
హేతుభూతాని వైదిక మార్గ దూర్వర్తిత్వాత్.
(సౌందర్యలహరీ శ్లో 31) లక్ష్మీధరవ్యాఖ్యా

ఇట్లు పరస్పర విరుద్ధార్థ ప్రతిపాదకములైన ఆగమ ప్రమాణములచే, దార్శనికుల భిన్నాభిప్రాయములచేతను శాస్త్ర సంప్రదాయ విదులుకాని వారలకు వాని ప్రామణ్య విషయమున భ్రమ ప్రమాద సందేహములు కలుగుచున్నవి. కావున నివి యవశ్య మననేయాంశములు.

వేదము నందలి కర్మ కాండమునకు శేషభూతములైన ''అశ్వలాయన ఆపస్తంబాదులచే ప్రణీతములైన కల్ప సూత్రములు మన్వాదిస్మృతులవలె కాండ ద్వయములను శేష భూతములైన పురాణములవలె ఉపనిషత్ (ఉపాసనా బ్రహ్మ ాండములు ఒకటేయను పక్షమున) కాండశేష భూతములైన పరశురామాది ప్రణీతములైన కల్ప సూత్రములు యామలాది తంత్రములు వేదమూలకములే. కావున ఆగమప్రామాణ్యమునుగూర్చి శంకించ నవసరము లేదు. కాని ప్రత్యక్ష శ్రుతి విరుద్ధాంశములు గల తంత్రముల విషయమున విరోధాధికరణ న్యాయమును పురస్కరించుకొని ఆయా యంశములందు మాత్రమే వాని నప్రమాణములుగా గ్రహించి యనుష్ఠించరాదని గ్రహించవలయును.

శ్లో॥ వేదే చ పూర్వకాండస్య శేషభూతతయా౨౨శ్వలాయనాదికల్ప సూత్రాణాం మన్వాదిస్మృతీనాం చ ప్రవృత్తి వదుపనిషత్కాండ శేషత్వేన పరశురామాది కల్పసూత్రాణాం చ ప్రవృత్తిః; పురాణానాంతు కాండద్వయం ప్రత్యపి శేషత్వేన ప్రవృత్తిః; తతశ్చ స్మృతి తంత్రపురా ణానాం వేదమూలకత్వేనైవ ప్రామాణ్యమ్.

(నిత్యా షో. సేతు. పి.నెం. 5)

మరియు సకల విద్యలు పరమేశ్వర ప్రణీతములే యైనచో వానిలో కొన్ని ప్రమాణములు కొన్ని యప్రమాణములు లేదా యొక యంశమునందు ప్రమాణములు మరియొక యంశమునందు అప్రమాణములనుట యెట్లు పొసగును? అని ప్రశ్నించబడి నాస్తికులకు అర్హతదర్శనములయందు త్రైవర్ణికులకు వైదిక మార్గములందు అధికారము కలదని సూత సంహితలో చెప్పబడినట్లు, వ ర్ణాశ్రమ భేదములను పురస్కరించుకొని ధర్మ వ్యవ స్థ చేయబడినట్లు, మిక్కిలి పిన్నవాడైన బాలుని యాడుకొనుటకు ప్రేరేపించిన తండ్రియే యధ్యయనాధికారము (యోగ్యత) వచ్చినప్పుడు ఆడుకొనుటను నిషేధించి విద్యాభ్యాసము నందు ప్రవర్తింపజేసినట్లు తత్తదధికారి భేద విశేషములను పురస్కరించుకొని సకల విద్యలు పరమేశ్వర ప్రణీతములైనట్లుగా దెలిసికొని స్వస్వయోగ్యతల ననుసరించి శాస్త్ర ప్రతిపాదితములైన ధర్మముల నాచరించుట శ్రేష్ఠము.

శ్లో॥ తతశ్చ జగదాప్త పరమశివ ప్రణీతత్వావిశేషేణ సర్వసాం విద్యానా మధికారి భేదేన ప్రామాణ్యమే వేతి స్పష్టమ్

(నిత్యా షో. సేతు. పి. నెం. 2)

వైదిక-శాక్త-శైవ-వైష్ణవ-గాణపత-సౌర పురాణ - ధర్మ శాస్త్ర - బౌద్ధాది విద్యలయందు కనపడుచున్న పరస్పర నిందకు ''న హి నిందా'' న్యాయమును పురస్కరించుకొని యాయా విద్యలయొక్క ప్రాశస్త్యమును చెప్పుటయందే తాత్పర్యమని గ్రహించవలయును.

శ్లో॥ నహి నిందా నింద్యం నిందితుం ప్రవర్తతే-
అపితు విధేయం స్తోతుమ్.
వైదిక శక్తినింధా చ శైవే వైష్ణవనిందనమ్ ।
ఏవం భిన్నమతాన్యేవం సంజాతాని మహేశ్వరి !

(శ్రీశక్తి. ఉపో. పూ. పి.నెం. 34-35)

దేశభేదము - అధికారిభేదము మున్నగు భేదములను పురస్కరించుకొని ప్రవృత్తములైన సకల విద్యలు, వానియందు ప్రతిపాదితములైన ధర్మములు తత్తద్వ్యక్తి విశేషముల కనుష్ఠేయములే యనుట నిష్కృష్టము.

## తంత్ర పరిగణనము

''అశ్వక్రాంతే రథక్రాంతే విష్ణుక్రాంతే వసుంధరా'' (నారా. ఉప. 4-1-6) అనుమంత్రమున భూమండలము అశ్వక్రాంత-రథక్రాంత - విష్ణు క్రాంతములుగా విభక్తమైనట్లు పేర్కొనబడినది. కాని యీ విభాగము భారతదేశమునకు మాత్రమే పరిమితమని శక్తి మంగళ తంత్ర మాధారముగా కొందరు అభిప్రాయపడినారు. ఆ విభాగమిది.

1. అశ్వక్రాంతము : వింధ్య పర్వతమునుండి ద్వీపకల్ప ప్రాంతము వరకు
2. రథక్రాంతము : వింధ్య పర్వతమునుండి నేపాలు మీదుగా చీనా వరకు
3. విష్ణుక్రాంతము : వింధ్య పర్వతమునుండి చిట్టగాంగువరకు

ఈ మూడు ప్రాంతములకు 64 తంత్రములు ప్రత్యేకముగా (64X3=192) చెప్పబడినవి. ఇవిగాక కామికాద్యాగమములు 28, మిశ్రమార్గమునకు సంబంధించిన చంద్రకళా విద్యాష్టకము - వశిష్ఠ శుకాది శుభాగమ పంచకము మొదలగు ననేక తంత్రములు కలవు.

శ్రీచక్ర విలసనము. పి.నెం. 234 నుండి 237
సౌందర్యలహరీ శ్లో 31 లక్ష్మీధర - డిండిమ - ఆనందలహరీ
శ్రీశక్తి. ఉపో. పూ. పి.నెం. 20-21
ప.క.సూ. పి.నెం. 325 నుండి 333, 338 నుండి 341.

ఏ దేశమునందు - ఏ యాచారములు? ఏ కాలమున నే విద్యలు? ఏ యామ్నాయమున నే యాచారములు? ఇత్యాదిగా ప్రశ్నించబడి వానికి సమాధానముగా దేశ-కాల-అమ్నాయ-విద్యా-దర్శన- ఆయతన - ఆగమ రూపమున పర్యాయ సప్తకము శక్తి సంగమ తంత్రమున చెప్పబడినది.

శ్రీశక్తి. ఉపో. పూ. పి.నెం. 23.

మరియు అగస్త్య లోపాముద్రాదులచే నుపాసించబడిన కాది హాది మొదలైన విద్యా భేదములు కాళీ ప్రభృతి దశ మహావిద్యలు గూడ ప్రసిద్ధములే.

## సంప్రదాయములు

పైన పేర్కొనబడిన విద్యలు వాని సంప్రదాయములు తంత్రము లందు వ్యవహారమునందును రహస్యముగా నుంచబడి గురుశిష్య పరంపరగా ననుస్యూతములైనవి. ఈ రహస్యములను గురు పరంపర నాశ్రయించక పాండిత్యబలముచేత గ్రంథములం జూచి గ్రహించ ప్రయత్నించుట పాపహేతువని, మరియు డాకిన్యాది యోగినీ గణశాపహేతు వని సంప్రదాయ విదుల యభిప్రాయము. ఐనను భక్తి-శ్రద్ధ- ఆస్తిక్యము - జితేంద్రియత్వము మొదలగు శ్రేష్ఠ లక్షణములు గల జిజ్ఞాసువులైన రాబోవు తరములవారి శ్రేయస్సును కోరిన పెద్దలు స్వరచిత గ్రంథములయం దారహస్యములను సూచించుట జరిగినది. వాని మూలమున సంప్రదాయ రహస్యములను దిఙ్మాత్రముగా దెలిసికొనవచ్చును.

శ్లో॥ శ్రీ సుందరీభేదా ః రుద్రయామలే... ఇతి సుందరీభేదా ః.

(శ్రీ విద్యారత్నాకర ః పి.నెం. 210 నుండి 212)

చక్కని జ్ఞానము నొసంగునట్టి గురు పరంపరాచారానుసరణము సంప్రదాయము.

శ్లో॥ సమ్యక్ ప్రదీయతే జ్ఞానం సంప్రదాయః ప్రకీర్తితః (11-14-51)

(శ్రీశక్తి. పి.నెం. 33)

సంప్రదాయః గురుపరంపరాఽఽ చారాను సరణమ్.

(ప.క. సూత్ర. 149)

ఈ సంప్రదాయములు వైదిక - వైష్ణవ-గాణపత-సౌర - శైవ-శాక్త - వామ - దక్షిణ - వీర - అవధూత (కౌలావధూత) ములని పది గలవు. పాశుపతాదులు శైవమునందు పాంచరాత్రాదులు వైష్ణవమునందు పాషండ చీనాదులు శాక్తమునందు అంతర్భవించును.

శైవే పాశుపతాదీనాం.... కేరలేఽన్తర్భవతి.

(శ్రీ శక్తి. ఉపో. పూ. పి.నెం. 34)

ఈ సంప్రదాయ భేదములు ఉపాస్య దేవతా పూజా ప్రక్రియయందు ప్రధానముగా గోచరించును. ఇవి యనేక ప్రభేదములుగా లోకమునందు విస్తరించియున్నవి. ప్రస్తుతము శాక్త సంప్రదాయముల గూర్చి తెలిసికొందము.

## 1) సమయాచారము

సామ్యమును పొందునది పొందువాడును సమయ పదవాచ్యులు. అధిష్ఠాన సామ్యము. అనుష్ఠాన సామ్యము, అవస్థాన సామ్యము, నామ సామ్యము, రూప సామ్యము అని సామ్యము పంచ విధములు. శివశక్తులు ఇట్టి సామ్యములు కలవారు.

సహస్రారము నందలి చతుష్కోణాత్మకమైన బైందవ స్థానమునందు సమయతత్త్వమును (సమయను-సమయుని) పూజించుట; లేదా:

బిందువును పంచవింశతితత్త్వాతీతమైన షడ్వింశాత్మకమైన శివశక్తి మేలనాత్మకమునైన సాదాఖ్యరూపముగ భావన చేయుట; లేదా:

దహరాకాశమునందు శ్రీ చక్రమును భావించి యందుసమయతత్త్వమును పూజించుట;

లేదా: చతుర్విధైక్యానుసంధానమే (మతాంతరమున షోఢా ఐక్యము) భగవతీ సమారాధనము. ఇట్టి చతుర్విధైక్యా (షడ్విధైక్యా) ను సంధాన మహిమచే గురు కటాక్షము వలన కలిగిన మహావేధాఖ్య మహిమచేతను కుండలినీ పరాశక్తి మూలాధార స్వాధిష్ఠాన చక్రములను భేదించుకొని మణిపూరకమున ప్రత్యక్షమగును. అచ్చట అర్ఘ్యాది భూషణ ప్రధాన పర్యంతము ఉపచారముల నిర్వర్తించి దేవతను అనాహతమునకు తీసికొని వచ్చి యచ్చట ధూపాది నైవేద్య హస్త ప్రక్షాళనాంతము పూజించి విశుద్ధమునందు పరాశక్తిని సింహాసనాసీనగా చెలియలతో సల్లాపము చేయుచున్న దానినిగా భావన చేయుచు స్ఫటికసదృశములైన మణులతో (ఈ మణులు పరాంబాశిరో భూషణమైన చంద్రుని షోడశకళలను విషయము రహస్యము) పూజను నిర్వహించి, ఆజ్ఞాచక్రమునకు శ్రీదేవిని తోడ్కొనిపోయి యట నీరాజనా ద్యుపచారములతో సంతృప్తి పరచవలెను.

ఆ పిమ్మట యాపరాశక్తి విద్యుల్లతవలె సహస్రకమలమునందు ప్రవేశించి యచటనున్న సుధాసింధువునందలి పంచ కల్పతురుచ్ఛాయలో మణిద్వీపమున సరఘా మధ్యమునందున్న సదాశివునితో విహరించును. ఆ సమయము నందు ఉపాసకుడు తిరస్కరిణీ విద్యను ప్రసరింపజేసి తద్విహరణ మందిర సమీపమునందుండి సదాశివునితో విహరించుచున్న పరాశక్తి తిరిగి మూలాధారమును ప్రవేశించు సమయమును నిరీక్షించుచుండ వలయును.

అథ సమయితం నిరూప్యతే ... సమయమత తత్త్వమ్.
(సౌందర్య 41 శ్లో॥ లక్ష్మీధర)

97 : సమయాంతస్థా (ల.స.నా.) దహరాకాశావకాజశేచక్రం
విభావ్య తత్ర పూజాదికం సమయ ఇతి రూఢ్యోచ్యతే...
సమయాచారతత్పరా (ల.స.నా 98) రుద్రయామళే-
తావత్తత్రైవ సమయం ప్రతీక్షేతే-వేద్యః.

(సౌభాగ్యభాస్కరము)

ఈ సమయాచారము వశిష్ఠ శుకసనక సనందన సనత్కుమారులచే యనుష్ఠించబడిన శుభాగమ పంచకమునకు సంబంధించినది. ఇది శ్రీ శంకర భగవత్పాదులచే పునః ప్రకాశితమైనది. యోగిజనమాత్ర సాధ్యము. ఈ మతమున బాహ్య పూజావిధులు లేవు.

(సౌందర్య 4 శ్లో॥ లక్ష్మీధర వ్యాఖ్య)

**బాహ్యపూజ**

సమయాచారమునం దనధికృతులైన సాధారణ భక్తజనుల సముద్ధరణార్థమై విహితమైన బాహ్యపూజలో శ్రీ చక్రార్చనము ప్రధానము. ఇందు సాధకునకు కొన్ని యంత రంగములు కొన్ని బహిరంగములును గలవు.

వేదసమ్మతముగా శ్రీ చక్రార్చనాదులు బాహ్యపూజాకలాపము
నందు జరుపుట దక్షిణాచారము.

(శ్రీచక్ర. పి.నెం. 225)

అంతరంగములు: మంత్రవర్ణ సంఖ్య-మంత్రోద్ధారము-మంత్రోచ్చారణ కాలము - వర్ణోచ్చారణము -మంత్రవర్ణోత్పత్తిస్థానములు - బాహ్యాభ్యంతర ప్రయత్నములు - రూపాది త్రయము - వ్యష్టి సమష్టి భేదాత్మకమైన స్వరూపము - మంత్రవర్ణ విశేషములయందు. భావించదగిన జాగ్రదాద్యవస్థాపంచకము - శూన్య షట్కము-విషువత్సప్తకము - గాయత్ర్యర్థాది-పంచాదశార్థములు.

బహిరంగములు : ఋషి-చ్ఛందో దైవత - వినియోగములు - బీజశక్తి కీలకములు -న్యాస. ధ్యాన నియమములు - పాత్రాసాధనాది శాంతిస్తవాంతాత్మకమైన పూజ. ఇది నిత్య - నైమిత్తిక-కామ్యరూపమున - పరా - అపరా - పరా పరా రూపమున - కేవలాది రూపమున దశాధిక భేదములు గలది.

పైన పేర్కొనబడిన యంతరంగ బహిరంగములలో నంతరంగము అంతర్ముఖులకు మాత్రము సాధ్యము. అంతరంగ విహీనమైన బహిరంగము ప్రాణములేని బొమ్మవంటిది.. వృక్ష మూలములు (=వేళ్లు) శాఖోపశాఖలతో విస్తరించిన వృక్షము

- ఈ రెండును స్థూల దృష్టికి సమప్రాధాన్యము కలవిగా గోచరించినను మూలములు నిర్వీర్యములైనప్పుడు వృక్షము నశించుటయు వృక్షము ఖండితమైనను మూలములు సారవంతములైనచో తిరిగి యంకురించుటయు కలదు. కావున సాధకు డంతర్ముఖుడై యంతరంగముల స్వాధీనము చేసికొనుచు బహిరంగములైన మంత్ర జప పూజా తర్పణ హోమాదుల ననుష్ఠించవలయును. ఈ విషయము శ్రీషోడశానందనాథ (కరపాత్రస్వామి) ప్రణీతమైన శ్రీ విద్యా మంత్ర భాష్యమున సవిశేషముగా నభివర్ణితమైనది.

శ్లో॥ విద్యావర్ణేయత్తోద్ధార ః కాల స్తదుచ్చార ః
ఇమాన్యంతరంగత్వాదుపాసకానా మత్యావశ్యకాని
ఋషయ శ్ఛందోదైవత వినియోగా-
బాహ్యాంగమాత్రనా శేఽపి న వృక్షస్య నవాఽంతరంగస్య
నాశః. (వరివస్యా. 2-159 నుండి 2-164)
"జ్యోతిషామపి - రాజరాజేశ్వరీ సుప్రీతాఽస్తు."
(శ్రీ విద్యా పి.నెం. 282 నుండి 305)

ఇట్లు ప్రతిపాదితమైన బాహ్యపూజ (త్రైపుర సంప్రదాయము) సాధ్వసాధు రూపమున ద్వివిధము. ఇందు సాధువు వైదికము-దక్షిణాచారమని యసాధువు - అవైదికము - వామాచార మని శిష్టజనవ్యవహారము. పరమేశ్వరుని వామదక్ష వక్త్రములనుండి యావిర్భవించిన తాంత్రిక సంప్రదాయములే వామ దక్షిణాచారములని యభినవ గుప్తాదుల యభిప్రాయము.

అభినవగుప్త ప్రభృతి ప్రాచీనా చార్య సముద్ధృతౌ దక్షిణ
వామశబ్దౌ భగవతః శివస్య దక్షవామవక్త్రోద్భూతతాంత్రిక
సంప్రదాయవాచకౌ.
(శ్రీశక్తి. ఉపో. పూ.పి. నెం. 33)
ద్వివిధః త్రైపుర ః సంప్రదాయః సాధు రసాధుశ్చ.
(ప్రపంచసారము) ప్రయోగ క్రమదీపికా 9-9.

**దక్షిణాచారము** : ఇందు పూజాతర్పణాదులు దక్షిణ హస్తముతో కేవలోదకాదులతో జరుగును. కామేశ్వరీ కామేశ్వరులు దేవతలు - చక్రము శ్రీ చక్రము.

**వామాచారము** : ఇందు వామహస్తముతో పూజా తర్పణాదులు.

శ్లో॥ వామహస్తాత్పానపూజాక్రమా ద్వామీ ప్రకీర్తిత ః ॥
.... కేరలే సంప్రదాయే పూజా తర్పణాదికం దక్షహస్తేన -
గౌడేచ సంప్రదాయే వామహస్తేన క్రియత ఇతి.
(శ్రీశక్తి ఉపో. పూ. పి.నెం. 32)
నమస్కృత్య బహి ర్గచ్ఛే ద్వామ పాద పురస్సరమ్.
(మహానిర్వాణ తంత్రమ్ పి. నెం. 5-36)

దేవతకు ప్రేతాసన సంబంధము పూజయం దాసనాదుల వినియోగము - సంధ్య యందు త్రైపుర గాయత్రీ ప్రసక్తి యుండును.

శ్లో॥ తత్ర దేవ్యా ః స్థితౌ ప్రేతాసనయంత్రబంధ ః పూజాయా
మాసవాదిసంయోగ ః త్రైపుర గాయత్రీ ప్రవృత్తిరితి
సర్వమస్తి-సోఽసాధుః; శ్రుతిస్మృతి విరోధాత్ ప్రత్యవాయ
కరత్వాచ్చ; యత్ర సరస్వత్యాదిదేవతాంత రోచితమేవ
సర్వం - స సాధుః వైదిక పరిగ్రహాత్. (ప్రయాగ. దీ. 9-9)

త్రికూటా రహస్యమునందు ''వామాచారం ప్రవక్ష్యామి'' యని యారంభించ బడి చెప్పబడిన ''నృదంతమాల మానుషముండపాత్రము-సింహచర్మా ద్యాసనము - స్త్రీకచోద్భవ కంకణము మున్నగు సాధనవిశేషములుండును.

శ్లో॥ మాలా నృదంతసంభూతా పాత్రం మానుషముండక మ్।
ఆసనం సింహచర్మాది కంకణం స్త్రీక చోద్భవమ్ ॥
(ప.క సూవ్ర. 1-30)

భైరవీ భైరవులు దేవతలు; చక్రము భైరవీ చక్రము.

శ్లో॥ శ్రీచక్ర పి.నెం.. 225 నుండి 226

శ్రీ భాస్కరరాయలు ''సవ్యాప సవ్య మార్గస్థా'' అను శ్రీలలితా సహస్ర నామ భాష్యమున-

''సర్వత్ర దేవీ మంత్రేషు వైదికేష్వపి భైరవీం'' మొదలుకొని.

''సర్వాశాపూరకో యస్మాత్ దక్షిణస్తత ఉత్తమః'' అనునంతవరకు కాళికా పురాణ వచనముల నుదాహరించి వామ దక్షిణాచారముల గూర్చి ఇట్లు వివరించినారు.

వర్ణాశ్రమ విహితములైన శ్రౌత స్మార్త తాంత్రికములైన కర్మలయందు ప్రధానముగా, అంగ భూతముగాను వచ్చు దేవతల స్థానమునందుస్వోపాస్య దేవతను నియతముగా భావన చేయుట. అనగా నాయా కర్మలయందు ప్రసక్తమైన దేవతావాచక

పదములకు విశేష్యముగా స్వోపాస్యదేవతావాచక పదము నుంచి '' ఆపః పునంతు పృథివీం త్రిపుర భైరవీం'' ''పితౄన్ భైరవాన్ తర్పయామి'' ''తృప్యతాం భైరవీ మాతః'' అని పూజించుట వామాచారమని;

ఆయా కర్మాంగ ప్రధాన దేవతల స్థానమునందు స్వోపాస్య దేవతను విశేష్యముగా భావన చేయవలయు నను నియమములేక యే కర్మ నాచరించి నపుడా కర్మకు సంబంధించిన దేవతనే ప్రధానముగా నుపాసించుట దక్షిణాచారమని-నుడివి వామమార్గమున భోగలాలసతగల కొందఱు శిష్టు లా మార్గము నవలంబించినను నైహికాముష్మిక భోగములయందు వైరాగ్యముగల ముముక్షువులు దక్షిణ మార్గమునే యాశ్రయించవలయునని స్పష్టము చేసినారు.

**కాళము** : ఇది సమయమత - చంద్రకళాది-తాంత్రికో క్తమిశ్రమత భిన్నము.

శ్లో॥ సమయమతం కౌలమతం మిశ్రమతం చేతి విద్యోపా స్తౌ మత
త్రయం శుకవశిష్ఠాదిసంహితా పంచకోక్తం వైదిక మార్గ
కరంబిత మాద్యమ్; చంద్రకలాదితంత్రాష్టకోక్తం తు చరమమ్
కుల సమయోభయానుసారిత్వాత్; ఏత ద్భిన్నతంత్రోదితం కౌల
మార్గమ్ (కౌళమార్గతత్పర సేవితా. ల.స.నా.)

(సౌభాగ్య భాస్కరము)

బాహ్య త్రికోణ పూజా విధానము గలది. బాహ్య త్రికోణము శ్రీ చక్ర స్థిత నవయోని మధ్యగత త్రికోణము- ప్రత్యక్ష త్రికోణము-అని రెండు విధములు. ఇందు శ్రీ చక్ర మధ్యగత త్రికోణ పూజా విధానము గలది పూర్వ కౌళము. ప్రత్యక్ష యోని పూజావిధానము గలది యుత్తర కౌళము. వామాచార ప్రవృత్తిగల యీ యుభయ మతములలో నాధారస్థిత కౌళినీ (కుండలినీ) ప్రబోధమే ముక్తి. కావుననే కౌళులకు క్షణముక్తులను వ్యవహారము గలదు. ఉత్తర కౌళ ప్రభేదములైన దిగంబర క్షపణాదుల పూజా విధానములు స్మర ణార్హములు గూడ కావు.

అత్రేద మనుసంధేయమ్: తత్ర సురామాంసమధుమత్స్యాది
ద్రవ్యైః సమారాధనం వామాచార ప్రవృత్త్యా. ప్రత్యక్షత్రికోణే
బిందుస్థానం మన్మథచ్ఛత్రం కృత్వా సంపూజయన్తి. అధో
ముఖం త్రికోణ మధోముఖమేవ ఛత్రం పూజయన్తి. దిగంబరక్ష
పణకాదయస్తు స్త్రీయముత్తానాం కృత్వా ఊర్ధ్వం త్రికోణం
పూజయన్తీతి రహస్యమ్. అత్ర బహు వక్తవ్య మస్తి. తత్తు అవై
దిక మార్గత్వాత్ స్మరణార్హ మపి న భవతి.

(సౌందర్య - 41 లక్ష్మీధర)

ఇట్లు శాక్తమునందువలె గాణేశ - రౌద్ర (శైవ) వైష్ణవ - సౌరాదుల యందు గూడ వామ దక్షిణాచారము లున్నవి. ఈ యాచారములు మొదట యసంకీర్ణములుగానే యున్నను క్రమముగా వీనియందు సాంకర్య మేర్పడినది.

దక్షిణవామాచార యోశ్చ సర్వత్ర సాంకర్యం విద్యత ఇతి.
(శ్రీ శక్తి.ఉపో. పూ. పి.నెం. 33)

**మపంచక విచారము**

మద్య మాంస మత్స్య ముద్రా మైధునములకు పంచ తత్త్వములని, మకార పంచకమని సంకేతము.

శ్లో॥ మద్యం మాంసం తధా మత్స్యం ముద్రా మైధున మేవ చ ।
ఏతాని పంచతత్త్వాని త్వయా ప్రోక్తాని శంకర ॥
(మహాని. 1-59)

మద్యము విశేషార్ఘ్యవిధిలో మాంసమత్స్యముద్రలు నైవేద్య విధిలో మైథునము శక్తి పూజలోను ప్రసక్త మగును. పవిత్రమైన దేవతార్చనలో మద్యాదుల ప్రసక్తి యెంతవరకు సమర్థ నీయము? అను విషయమున ప్రాచీనులలో రెండు పక్షములు గలవు.

**ప్రధమపక్షము :** మద్యపానము మాంసాద్యభక్ష్య భక్షణము పరస్త్రీ గమనాదులు శాస్త్ర నిషిద్ధములు. వీనిని బ్రాహ్మణుడు స్వప్నములో గూడ నాచరించరాదు.

మాధిపంచకం న గ్రాహ్యమ్ (బిందుసూత్రమ్ 3-1-21-5)
మాంస భక్షణ నిషేధః శ్రుతికోపాత్. (బిం. సూ. 3-3-21)
తస్మా ద్బ్రాహ్మణః సురాం న పిబేత్ (వే. సూ. 3,4,28-31)
వరాంగనాం నోపగచ్ఛేత్.
న మాగ్ంసమశ్నీయాత్-న స్త్రియ ముపేయాత్-నోపర్యాసీత జుగుప్సేతానృతాత్.
(శ్రీ త్రిపుర సుందరీ పూజాకల్పః పీఠికా.

ఆసవాది ద్రవ్య సేవనమును విధించిన తంత్రములు గూడ తత్సేవనమున బహుధా దూషించినవి. కావున కుల ద్రవ్య స్వీకారమశ్రద్ధేయము.

పరిస్రుతం ఝుష మాజం పలంచ
భక్తాని యోనీ స్సుపరిష్కృతాని

నివేదయన్ దేవతాయై మహత్యై
స్వాత్మీకృత్య సుకృతీ సిద్ధి మేతి

అను త్రిపురోపనిషన్మంత్రము బాహ్యపూజాసంబంధముగల మద్యాదులకు చెందినది కాదు. ఇది యాంతర పూజకు సంబంధించినది. ఈ మంత్రములోని పరిస్రుతమునకు సంవిధానమని ఝష (మత్స్యము) మునకు జీవభావమని ఆజఫలమునకు మూలప్రకృతి ఇంద్రియ సముదాయ మని యోని శబ్ద (సూచితమైధున)మునకు పరశక్త్యాత్మ మిధునసంయోగ మని యర్థముల గ్రహించ వలయునే కాని లోక ప్రసిద్ధార్థములను గ్రహించరాదు. కావున నిష్కాములైన బ్రాహ్మణులు స్వస్వ వర్ణాశ్రమ విహితములైన ధర్మములకు విరోధము లేకుండ క్షీరాదులతోను క్షత్రియులు ఘృతాదులతోను వైశ్యులు మాధ్వీకాదులతోను శూద్రాదు లాసవాధులతోను తర్పణాద్యుపచారముల నాచరింప వలయును.

శ్రీ త్రిపుర పి. నెం. 50-4
చిచ్చంద్రకుండ లీశక్తిసామరస్యసుఖోదయః
వ్యోమపంచకనిష్పన్నసుధాపానరతో భవేత్
మధుపాన మిదం ప్రోక్త మితరే మద్యపాయినః
ధర్మాధర్మపశుం కృత్వా జ్ఞానఖడ్గేన యోగవిత్
పరే లయం నయే చ్చిత్తం పలాశీతి నిగద్యతే
పరశక్త్యాత్మ మిథున సంయోగానంద నిర్భరః
య ఆస్తే మైధునం త త్స్యాత్ ఇతరే స్త్రీనిషేవకాః
నిష్కామధియా యావజ్జీవం స్వపీఠం శ్రీ చక్రం వర్ణాశ్రమాను
రోధేన క్షీరాదిభిః తర్పయంతః సంతః కాలం నయంతి.
త్రైవర్ణికానాం నిష్కామధియా దక్షిణ మార్గాచరణం కర్తవ్య
మిత్యత్ర నిష్కామానామేవ శ్రీ విద్యాసిద్ధి :
న కదాపి సకామానామ్. (శ్రీ త్రిపుర. పీఠిక 36-7.)

**ద్వితీయ పక్షము** : విధినిషేధాత్మకమైన శాస్త్రము రాగప్రాప్తమైన దానిని షేధించును. అట్టి నిషేధమునకు వ్యతిరేకముగా శాస్త్రము విధించి నప్పుడు విధి నిషేధములకు వ్యవస్థ యవసరము ''న బ్రాహ్మణం హన్యాత్.'' ''మాహింస్యాత్సర్వాభూతాని'' మున్నగు నిషేధములకు వ్యతిరేకముగా ''బ్రహ్మణే బ్రాహ్మణ మాలభతే.'' ''వాయవ్యం శ్వేత మాలభేత భూతికామః.'' మొదలగు బ్రాహ్మణ పశ్వాలంభనాదుల విధింపగా పరస్పర బాధకములైన విధి నిషేధశాస్త్రములకు వ్యవస్థ చేయవలసి వచ్చినది. ఆ వ్యవస్థ యిది. రాగ ప్రాప్తమైన దానిని గూర్చి

ప్రవృత్తమైన నిషేధశాస్త్రము విధిప్రాప్తమైన దానిని గూర్చి ప్రవర్తించదు. కావున పశ్వాలంభనాదులు క్రత్వర్థములుగా ననుష్ఠించుట దోషము గాదు.

అట్లే

"పరిస్రుతం ఝుష మాజం పలం చ
భక్తాని యోనీ స్సుపరిష్కృతాని ।
నివేదయన్ దేవతాయై మహత్యై
స్వాత్మీకృత్య సుకృతీ సిద్ధి మేతి ॥

అను త్రిపురోపనిషన్మంత్రముచే క్రత్వర్థముగా విధించబడిన మద్యాదులఁ గూర్చి "న సురాం పిబేత్" మొదలగు నిషేధశాస్త్రములు ప్రవర్తించవు. సకల ప్రమాణ మూర్ధన్యమైన శ్రుతియే వీనిని విధించుటచేత నివి ముఖ్య ద్రవ్యములుగా సంకేతితములైనవి. ఇట్లు శ్రుతి తంత్రములచే విధించఁబడిన ముఖ్యద్రవ్యములను క్రత్వర్థముగా స్వీకరించుట దోషము గాదు. ఐనను ముఖ్య ద్రవ్య స్వీకార యోగ్యత ఊర్ధ్వరేతస్కులు స్థిరచిత్తులు కామక్రోధాద్యరిషడ్వర్గ రహితులు నిషిద్ధ హింసా-స్తేయ లోకవిరుద్ధ లోకవిద్విష్టాచార వర్జితులైన నిరీహులకు మాత్రమే కలదు. అదియు కలియుగారంభమునుండి 3000 సంవత్సరముల వరకే కలదు. తదితరులకు లేదు.

"నను సకలశ్రుతి స్మృతి పురాణేషు -------------
జితేంద్రియస్యైవ అధికారో-నాన్యస్యేతి సూత్రకృదభిప్రాయః.
(ప.క.సూ.3-30 వృత్తి) పి.నెం. 122 నుండి 131
ఆద్యం తత్ర కలౌ దేవి! త్రిసహస్రాన్తమిష్యతే.
(ప.క.సూ. పి.నెం. 278)

కావుననే జితేంద్రియులు కాని సాధకుల శ్రేయస్సును కోరిన పెద్దలు (1) సాధకుడు పూజను నిర్వర్తించిన పిమ్మట సాధారణ జనముతో లౌకిక వ్యవహారము జరుపవలసియుండుట, (2) ధాతువైషమ్యమును కలిగించు దేశ విశేషము. (3) సత్త్వసంపత్తి లేకపోవుట, (4) ప్రాణహాని కలుగుట, (5) సహాయకులనుకూలముగ లేకపోవుట, (6) ప్రతికూలములైన బాల్యాది వయస్సులు - ఇవి దృష్టిలో నుంచుకొని పంచమకారముల కనుకల్పములను నుడివినారు.

వ్యవహార దేశ స్వాత్మ్య ప్రాణోద్వేగ సహాయామయవయాంసి
ప్రవిచార్యైవ తదనుకూలాః పంచమాది పరామర్శాః. (ప.క.సూ. 10-56)

| ముఖ్య ద్రవ్యములు | అనుకల్పములు |
|---|---|
| 1. మద్యము | 1. కంచుపాత్రలోని కొబ్బరినీళ్ళు |
| | 2. రాగి పాత్రలోని పాలు/చల్ల |
| | 3. బెల్లపు నీళ్ళు |
| | 4. అష్ట గంధ మిశ్రిత క్షీరము/జలము |
| 2. మాంసము | అపూపము (భక్ష్యాలు) |
| 3. మత్స్యము | 1. మూలకము |
| | 2. అరటిపండు |
| 4. ముద్రలు | ఘృత తైల పాచితములైన - పర్యుషితములుగాని గోధుమ-తండుల-చణక-మాషాన్యతమపిష్ట నిర్మితములైన వడలు. |
| 5. మైథునము | ఇది మూడు విధములు |

(i) దూతీ యజనము : ఇది యోగి జన మాత్ర గోచరము, సదాశివాదులకు మాత్రమే యధికారము గలది.

(ii) శక్తి పూజానంతరము శక్తి సాధకులకు సమ్మతమైనచో యోనికుండమున శివాగ్నియందు మంత్రపూర్వకముగా రేతో హవిస్సు నర్పించుట.

(iii) శక్తి పూజానంతరము శక్తిసాధకులకు సమ్మతమైనచో మానసికముగా తత్కృత్యమును నిర్వర్తించి దేవతార్పణము చేయుట.

ఈ మూడింటికి యనుకల్పము - స్వభార్యయందు లేదా ఎఱ్ఱ గన్నేరు పుష్పములందు నల్లని యపరాజితా పుష్పములందు చందన కాశ్మీరములను శుక్రశోణితములుగా భావ చేసి యర్పించుట.

శ్లో॥ నారికేలోదకం కాంస్యే తామ్రే క్షీరం తు తక్రకమ్ ।
గుడమిశ్రం జలం వాఽపి జలం చందనమిశ్రితమ్ ॥
ముఖ్యాలాభే చానుకల్పః.......
మాంసానుకల్పోఽపూపః స్యాన్మత్స్యస్యతుకదళ్యపి ।
చణకోత్థా మాషజా వా ముద్రాః స్యుర్ఘృతపాచితాః ।
తైలపక్వా అపి శివే మధురాశ్చ సుసంస్కృతాః ॥
లవణాద్యై స్సంస్కృతా వా గోధుమై స్తండులాదిభిః ।
నిర్మితా రుచిరాకారాః స్వాదుయుక్తా మహేశ్వరి ॥
ప్రథమాది చతుర్థాంతం యామాత్ పర్యుషితం భవేత్ ।

ప్రథమాది చతుర్థాంతం సర్వం త్యాజం సుసాధకైః ॥
ఏతత్పర్యుషితం సర్వ మన్వర్థం పూజనాదిషు ।
తత్పూజయా ప్రకుప్యన్తి యోగిన్య స్త్వతిభీషణాః ॥
పంచముఖ్యస్య ప్రకార స్త్రివిధః తత్రాద్యం దూతీ యజనరూపమ్
తత్రాధికారిణః సదాశివహృదయ ఏవ న మనుష్యాః
త్రిధా తు పంచమం ప్రోక్తం దూతీయాగస్తదాదిమః ।
ఏష ప్రకారో దేవేశి యోగిరాజైకగోచరః ॥
ద్వితీయంతు సమర్చాంతే దూతీపూజ్యాయథావిధి ।
యోనికుండే శివాత్మాగ్నౌ మంత్ర మావర్తయన్ క్రమాత్ ।
రేతోహవిర్ద్రావయిత్వా దేవతాప్రీతి మాప్నుయాత్ ॥
ఆద్యం తత్ర కలౌ దేవి త్రిసహస్రాంత మిష్యతే ।
ద్వితీయం తు భవేత్ దేవి స్వయోషిత్సు సురేశ్వరి ॥
పంచమమస్య తృతీయ ప్రకారో రహస్యార్ణవే;
అథవా శిష్యభూతాం వా చాన్యాం వాఽపి మహేశ్వరి ।
ప్రార్థితో వా తయా స్వేన ప్రార్థితాం వాపి శంకరి ॥
సంపూజయిత్వా పూజాంతే భోగపాత్రం నివేద్యంచ ।
మనసా తాం సమాగచ్ఛన్ దేవతాయై నివేదయేత్ ॥
రక్తం తు కరవీరం వై తథాకృష్ణాఽపరాజితా ।
ఏతత్ప్రోక్తం లింగయోన్యోః పుష్పం తత్ర తు యోజయేత్ ॥
కుసుమే లింగయోన్యోర్వా సకాశ్మీరం చ చందనమ్ ।
శుక్రస్థానే చందనం శోణితస్థానే కాశ్మీరం యోజయిత్వా
తత్ర మైథునబుద్ధిం విభావ్య శ్రీదేవ్యై అర్పణంకుర్యాత్.

(ప.కసూ.వృ.పి.నెం. 275 నుండి 279)

మాంసానుకల్పోఽపూపః స్యాన్మత్స్యస్య చ కదళ్యపి ।
మైథునస్యకళత్రే స్వే తదలాభే తు యత్నతః ॥

(నిత్యోత్సవః 3 పి.నెం. 63)

ఇట్లు వర్ణాశ్రమాదులను జితేంద్రియత్వాది యోగ్యతలను పురస్కరించుకొని శాస్త్రములందు నిర్ణయించబడిన వ్యవస్థ శిశ్నోదర పరాయణులు - కామాంధులు చపలజిహ్వులు నైన యజితేంద్రియులచే తృణీకరించబడి నిత్య వ్యవహారమున భగ్నము చేయబడినది. కావుననే నేటికిని శాస్త్ర విరుద్ధములు శిష్టజన సమ్మతములు కాని మద్య మాంసాది వినియోగము లోకమున గోచరించుటయే గాక సకల విధ దురాచారములు వ్యాప్తములైనవి.

**శైవ సంప్రదాయము** - అనాది-ఆది-మహా-యోగ-జ్ఞాన-వీరములని శైవము సప్తవిధములు. ఆచార భేదమును పురస్కరించుకొని సామాన్య-మిశ్ర-శుద్ధ-వీరములని నాలుగు భేదములు గూడ గలవు. వీనిలో వీరశైవము నందు ప్రత్యేకముగా సామాన్య-విశేష-నిరాభారము అను పేర మూడు భేదములున్నవి.

పతి-పశు-పాశ రూప త్రివిధ జ్ఞానము, షడధ్వశోధన పూర్వక మంత్రోపదేశము శ్రుతి స్మృతి ప్రతిపాదిత ధర్మానుష్ఠాన పూర్వకముగా శైవాగమోక్త శివార్చనము, మంత్ర-స్పర్శ-భావా, భావ-మహాయోగ-జ్ఞాన-క్రియా-భక్తి భేద భిన్నమైన శివ విషయక చేతస్స మాధానాత్మక-యోగములిందుండును.

**శివార్చనమనగా :** స్థూల సూక్ష్మకారణ-దేహములందు-ఇష్ట-ప్రాణ-భావ లింగముల ధరించి, భక్త-మహేశ్వర-ప్రసాది-ప్రాణలింగి-శరణ్యైక్యములను షట్ స్థలములయందు, ఆచార-గురు-శివలింగ-చరలింగ-ప్రసాద లింగ-మహాలింగముల నర్చించుట, భూతి-రుద్రాక్ష-పంచాక్షర మంత్ర - గురులింగ జంగమ-పాద-తీర్థ-ప్రసాదములను- అష్టావరణములు లింగాది పంచాచారములు కలిగి-అరుణోదయ-తపనోదయ సంగవ-మధ్యాహ్న- సాయ-మర్ధ రాత్రములను షట్కాలములయందు శివుని పూజించుట.

ఇట్టి సంప్రదాయము గల శైవము శ్రౌత శైవమని-ఆరాధ్య శైవమని శివాద్వైతము-ద్వైతాద్వైతకల్పము-విశిష్టాద్వైతమనియు వ్యవహరించబడును. ఈ సంప్రాదయము కేవల మాంధ్రదేశమున కలదు.

''శివపురాణానుశీలనమ్'' లో ''శైవభేదః'' ''అష్టావరణాని'' అను శీర్షికలతో వివృతమైనది. గ్రంథమముద్రితము.

లింగధారణము లేని ప్రత్యభిజ్ఞా శైవము కాశ్మీరములో ప్రసిద్ధమైయున్నది.

సర్వదర్శన సంగ్రహములో దీని వివరణ గలదు.

**జంగమ శైవము :** దీనికే యవైదిక శైవమని పేరు. ఈ సంప్రదాయము కర్ణాటకదేశమున మిక్కిలి వ్యాప్తమై యున్నది. ఇందు లింగధారణము తప్ప యజ్ఞోపవీతాదిధారణములు వైదిక కర్మలు నిషిద్ధములు.

''....'' దక్షిణదేశే చ భాషయా జంగమ ఇతి ప్రసిద్ధైరనుతిష్ఠితమ్
... తత్ సంప్రదాయానువర్తినో లింగం దక్షిణబాహౌ గళే వా
ధారయంతి, యస్మిన్తంత్రే లింగధారణం ప్రతిపాదితం
తత్తంత్రం శ్రుతిభ్రష్టానా మిత్యత్ర లింగమ్ (ప.క.సూ.వృ.1-1 పి.నెం.8)

వైష్ణవ సంప్రదాయము : వైఖానసాద్యాగమోక్త దీక్షాదీక్షితులు వైష్ణవులు. వీరిలో వైఖానసులు, రాధావల్లభులు, గోకులేశులు, బృందావనులు, పాంచరాత్రులు, వీర వైష్ణవులు, రామానందులు, హరి వ్యాసులు, నింబార్కులు, భాగవతులని దశ భేదములు కలవు. వీనిలో పాంచరాత్ర-భాగవత-వైఖానసములు ప్రాచీనములని, అన్యములర్వాచీనములని విమర్శకుల అభిప్రాయము.

తిరుపతి క్షేత్రమునందు వైఖానసాగమ పద్ధతి ననుసరించి శ్రీరంగాది క్షేత్రములయందు పాంచరాత్రవిధానముననుసరించి భగవదర్చనాదులు జరుగును.

వైష్ణవాఖ్యః సంప్రదాయః...వైఖానసాదీ దీక్షాద్వై ర్యుక్తో
వైష్ణవ ఏవ చ ... వైఖానసో భవే దాదౌ శ్రీరాధావల్లభస్తథా ।
గోకులేశో మహేశాని తథా వృందావనీ భవేత్ ।
పాంచరాత్రః పంచమః స్యాత్ షష్ఠః శ్రీ వీర వైష్ణవః ।
రామానందీ హరివ్యాసీ నింబార్కశ్చ మహేశ్వరి ॥
తతో భాగవతో దేవిదశ భేదాః ప్రకీర్తితా ;;
..........................................................
ఏవం చ వైఖానసం పాంచరాత్రం భాగవతం చేతి సంప్రదాయ
త్రయమేవద శవిధవైష్ణవేషు ప్రాచీనమ్ -----------------
గోకులనాథేన సంరాజో జహాంగీరస్య రాజ్యకాలే ప్రవర్తితత్వా
దర్వాచీన ఏవ వర్తతే (శ్రీశక్తి.ఉపో.పూ.పి.నెం. 45, 46, 47)

**గాణపత్య సంప్రదాయము** : ఇంచుమించుగా సకల సంప్రదాయములతో నవినాభావ సంబధము కలది. ఇందెనిమిది భేదములున్నట్లు తెలియుచున్నది.

గాణపేఽష్టౌ భేదా భవన్తి త్యత్ర (16-139) కేవలం సూచితమ్)
(శ్రీ శక్తి. ఉపో. పూ. పి.నెం. 41.

**సౌర సాంప్రదాయము** : సూర్యాసక్త మనస్కులు సౌరులు. వీరిలో పంచభేదములు గలవు.

''....సూర్యాసక్తమనా యస్తు ససౌరః పరికీర్తితః .... సౌరే

పంచ మహేశాని! ఇతి చ తస్య పంచ భేదాః సూచితాః---''
(శ్రీశక్తి. ఉపో. పూ. పి.నెం. 47)

**కాపాలిక సంప్రదాయము** : కపాల పాత్ర భోజనము మద్య మాంస నిషేవణము నిత్య నారీ యోనీ దర్శనము ముండ మాలా ధారణము శ్మశానాగ్ని పాచితభోజనాసక్త

గలది. ఇందు ఇంద్రజాలి - దేవజాలి - రుద్రజాలి - విద్యాజాలి - సిద్ధజాలి యని పంచభేదములు కలవు.

కాపాలికః సంప్రదాయః :

కపాలపాత్ర సంభోజీ మద్యమాంసేషు తత్పరః ।
స్త్రీయోని దర్శకో నిత్యం ముండమాలాధరః సదా॥
శ్మశానాగ్ని ప్రబోజీ య స్స చ కాపాలికః స్మృతః।
..........................................
పంచ భేదా ఇత్యుక్త్వా ఇంద్రజాలీ....నామాని ప్రదర్శితాని....
(శ్రీ శక్తి. ఉపో. పూ. పి.నెం. 39-40)

**పాశుపత సంప్రదాయము** : ఇందు శిఖి - ముండి - జటి - ద్వీదండి - త్రిదండి - ఏకదండి - వీరశైవము అని భేదము లేడు గలవు. ఇందలి వీరశైవుడు కేవల శివసంసక్త మనస్కుడు. దేవతాంతర నిందాసక్తుడు.

శ్లో॥ పాశుపతః సంప్రదాయః
శిఖీ ముండీ జటీ చైవ ద్వి త్రిదండీ క్రమేణ చ
ఏకదండీ మహేశాని వీరశైవ స్తథైవ చ॥
సప్త పాశుపతాః ప్రోక్తాః...........జ్ఞేయః''
(శ్రీ శక్తి. ఉపో. పూ. పి.నెం. 44)

**పాషండ సంప్రదాయము** : శ్మశాన భస్మధారణము లోక ప్రతారణార్థమై స్నాన సంధ్యాద్యాచరణము, విష్ణుద్వేషము, పాషండ వ్రతాచరణము గలది.

శ్లో॥ పాషండాఖ్యం వ్రతం ప్రాప్తాః పాషండాస్తే ప్రకీర్తితాః ॥
శ్మశాన భస్మధారీ చ భస్మధారణ సంచయః।
స్నాన సంధ్యాదికం దేవి లౌకికార్థం తు య శ్చరేత్।
విష్ణుద్వేషపరో భూత్వా సర్వం ప్రకురుతే నరః ।
స పాషండేతి కథితః.........................
(శ్రీ శక్తి. ఉపో. పూ. పి.నెం. 44)

**బౌద్ధ సంప్రదాయము** : ఇందు కేశచ్ఛేదులు - వృక్షచ్ఛేదులు - మద్యాశులు - కల్మషులు - ఇచ్ఛాభేదులు మొదలుగాగల భేదములు వంద కలవు. వీనికి దశమహావిద్యలలోని తారా విద్యతో, చీనా మార్గమైన మంజు ఘోషమను సంప్రదాయముతోడను చాలా దగ్గర సంబంధము కలదు.

శ్లో॥ బౌద్ధః సంప్రదాయః--- బౌద్ధానాం శతం భేదాః---
బౌద్ధాన్ సంశృణు యత్నతః॥
కేశచ్ఛేదీ వృక్షచ్ఛేదీ మద్యాశీ కల్మషస్తథా ।
ఇచ్ఛాభేదీ పంచమస్తు ఏవం బహువిధా మతాః ॥
-- దశ మహావిద్యాసు తారాయాః చీన మార్గస్య మంజు ఘోషస్య
చ సంప్రదాయస్య బౌద్ధేన సంప్రదాయేన
సహ ఘనిష్ఠః సంబంధో భవతి----''

(శ్రీశక్తి.ఉపో. పూ. పి.నెం. 54)

**ఆర్హత (జైన) సంప్రదాయము :** తారావతి - భోగవతి - విమలావతి - ప్రజ్ఞావతి - మధుమతి - ఉద్భటాంబావతి మున్నగు దేవతోపాసకులు జైనులు, భోగి - కర్త - హర్త - సర్వస్వము జీవుడేయని వీరి సిద్ధాంతము. వీరిలో కేశ సంలుంచకులు - శ్వేతాంబరులు - రక్తాంబరులు - నీలాంబరులు - బృహద్గురువులు అహింసకులు మొదలగు భేదములు రెండు వందలు కలవు.

శ్లో॥ అర్హత (జైన) సంప్రదాయః జైనే శతద్వయం
భేదా భవన్తీత్యుక్తం తారావతీ - ఉపసకా అర్హతా ఇత్యుచ్యన్తే
---- జీవ ఏవ పరం భోగీ కర్తా హర్తా న ఏవ హి
..........................................
కేశ సంలుంచకా దేవి తథా శ్వేత పటాః ప్రియే ॥
తథా రక్తపటా దేవి తథా నీలాంబరాదయః ।
బృహద్గురురితి భ్యాతా స్తథాఽన్యే పరమేశ్వరి ॥
అహింసకా స్తథాన్యేచ భేదా స్సంక్షేపతో మతాః ।--------''

(శ్రీశక్తి. ఉపో. పూ. పి.నెం. 39)

**చీనా సంప్రదాయము :** ఇందు బ్రహ్మచీనము - దివ్యచీనము - వీరచీనము - మహాచీనము - నిష్కలములని పంచభేదకములున్నవి. వీనిలో మహాచీనము సకల - నిష్కలములని ద్వివిధము. సకలము బౌద్ధగోచరము - నిష్కలము బ్రాహ్మణ గోచరము. మరియు - తారాధీశ పరాధీశ - క్షేమాఖ్య - ప్రేమతారక - సాగరాఖ్య - పరాపన్న - జీవదయాపర - చిరంజీవి - సిద్ధాఖ్యములు మొదలుగాగల భేదములు రెండు వందలు గలవు.

ఈ సంప్రదాయమున స్నాన దానాదులు - శౌచా - శౌచములు - జప తపాది నియమములు లేవు. మోచేతులకు చీలమండలలకు క్రిందుగాను

ముఖప్రక్షాళనము. చీనాస్నానమనబడును. మరియు మోకాళ్ళను తలను భూమికానించుట చీనా నమస్కారము. ఇంకను చీనాదేశ సంబంధియైన వేషధారణము-ఆచారములు చీనా సుందరీ పూజాదులు కలవు.

స్నానదానాదిరహితః శౌచాశౌచ వివర్జితః ।
న జపో న తపస్యా చ న తస్య నియమః క్వచిత్ ॥
ఈ దృగ్విధో భవే చ్చీనః సకలో నిష్కలో ద్విధా ।
..........................................
బ్రహ్మచీనో దివ్యచీనో వీరచీనస్తృతీయకః ।
మహాచీనో నిష్కలస్తు చీనః పంచవిధః స్మృతః ॥
..........................................
మణిబంధా దధః పాణిః పాదౌగుల్ఫా దధః శివే ।
ముఖం ప్రక్షాల యేద్దేవి చీనస్నాన మిదం భవేత్ ॥
జానుభ్యా మవనిం కృత్వా భూమౌ మస్తక మానయేత్ ।
చీనమార్గే నమస్కారాః కీర్తితాస్తే మయా తవ ॥
(శ్రీశక్తి ఉపో. పూ. పి.నెం. 42)

**సమన్వయము** : ఇట్లనేక సంప్రదాయములు దివ్యౌఘ - సిద్ధౌఘ - మానవౌఘములను గురుపరంపరల నాశ్రయించి భూమండలమున విస్తరించియున్నవి. వానిలో నేవి వైదికములు? ఏవియవైదికములు? వేనిలో నెంతభాగము వైదికము ? ఎంత యవైదికము? ఏ సంప్రదాయములు ప్రధానములు? మున్నగు సంశయములను క్షోదక్షమముగా పరిశీలించిన శ్రీ శంకర భగవత్పాదులు శైవ - శాక్త - వైష్ణవ - గాణపత్య - కౌమారములను సంస్కరించి వానిని భరత ఖండము నందు స్థాపించి యుండిరి. కాని వారిచే నిరసింపఁబడిన యనేకములైన వేద విరుద్ధ సంప్రదాయములు దేశాంతరములయందో, లేక; కర్మభూమియైన యీ భారతదేశమందే మారుమూల ప్రదేశములలో గూఢముగా కొన యూపిరితో మనగల్గి తిరిగి తలయెత్తుటచే వైదిక సంప్రదాయములతో పాటు నచ్చటచ్చట యవైదిక సంప్రదాయములు గూడ కన్పడుచున్నవి.

ఏది యేమైనను సకల సంప్రదాయముల వారు తమ సంప్రదాయములు మోక్షదములని యన్యములట్టివి కావని భావించుటయు కలదు. కాని వీనిలో నేదియోయొకటి ప్రధానమై మిగిలినవి యప్రధానములు గావలయునుగాని యన్నియును సమ ప్రాధాన్యము గలవి యని యనుటకు వీలులేదు కదా యను సంశయము నివారణీయము.

ప్రస్తుత మొక నిర్ణయమునకు వచ్చుట కీ క్రింది యాఖ్యాయిక స్మరించఁదగినది. అది యేది యనగా - శాండిల్యుడని ప్రసిద్ధజెందిన కాశ్యపనామధారియైన యొక బ్రాహ్మణుడు సర్వశాస్త్ర విశారదుడయ్యు నవైదికములైన తంత్రముల నాశ్రయించి భగవంతుడైన వాసుదేవు నారాధించుటయేగాక యనేకుల నా మార్గమున ప్రవేశపెట్టినాడు. అట్టి శాండిల్యునకు ప్రత్యక్షమైన విష్ణువు నాచే ప్రణీతములైన తంత్రముల నాశ్రయించి పూజించుటచే నేను ప్రీతిజెందలేదు. కుచ్ఛిత మార్గము నాశ్రయించియైనను నన్నారాధించినావు. అదియే నాకు సంతోష హేతువని యతనితో పలికి వేద విరుద్ధాచారమునునుష్ఠించినందులకు ఫలముగా, నరకమును, కుమార్గములోనైనను భగవంతుడనైన, నన్నారాధించుటవలన నుత్తర జన్మలో వైదిక మార్గమున నన్నారాధించి నన్ను జేరగలవని వరమొసంగినాడు. ఈ శాండిల్యుడే యుత్తర జన్మలో జమదగ్ని మహాముని.

శ్లో॥ మత్తంత్రాశ్రయణేనైవ మత్పూజా చ కృతా త్వయా ।
తయా న ప్రీతవా నస్మి తవ శాండిల్య తే ప్రియః ॥
కుమార్గేణాపి శాండిల్య కృతా పూజా మమ త్వయా ।
అతః కాలేన మహతా వేదమార్గం గమిష్యసి ॥
(శ్రీరుద్ర. "పథీనాం పతయే నమః" మంత్ర భాష్యమ్)

కశ్చిత్ పురా నృపశ్రేష్ఠ కాశ్యపో బ్రాహ్మణోత్తమః ॥
శాండిల్య ఇతి విఖ్యాతః సర్వశాస్త్ర విశారదః ॥

..................................................

అవైదికేన విధినా కృతవాన్ ధర్మసంహితామ్

..................................................

యస్మాదవైదికం ధర్మం ప్రవరయసి మా(త్వం) ద్విజ ।
తస్మా దవైదికం లోకం నిరయం గచ్ఛ దారుణమ్ ॥

..................................................

తత స్స కృపయా విష్ణు ర్భగవాన్ భూతభావనః ॥
దివ్యం వర్షశతం విప్ర భూక్త్వా నిరయయాతనామ్ ॥
ఉత్పత్స్యతే భృగో ర్వంశే జమదగ్ని రితీరితః ॥
తత్రారాధ్య పునర్మాం తు వైదికేనైవ ధర్మతః ।
గచ్ఛ తస్మిన్ మునిశ్రేష్ఠ మమ లోకం సునిర్మలమ్ ॥
(ప.న.సూ. ద్వి పరిశిష్టమ్ పి.నెం. 324)

పై యాఖ్యాయికను పరిశీలించగా వైదిక మార్గము సర్వ శ్రేష్ఠమని, సాధకుడెంత దురాచారుడైనను ఆశ్రయించిన సంప్రదాయ మెంత హీనమైనను,

మోక్షసాధన శ్రేష్ఠమైన భక్తితో జేసిన భగవదారాధనము ప్రధానమని స్పష్టమైనది. భక్త్యుపహృతమైనదేదియైనను భగవంతునికి ప్రీతిని కలిగించును కదా.

అపిచే త్సుదురాచారో భజతే మా మనన్యభాక్ ।
సాధు రేవ స మంతవ్యః సమ్యగ్వ్యవసితో హి సః ॥
(భగ. గీతా. 9-30)

మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ ।
పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।
త దహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః ॥
(భగ. గీతా. 9-26)

కావున వంశపరంపరగా లేదా పూర్వజన్మ కర్మవాసనను పురస్కరించుకొని గురువునుండి సంక్రమించిన సంప్రదాయము విగుణమైనను-సగుణసాధకునకు స్వధర్మమై యనుష్ఠితమై వానికి శ్రేయస్సు ననుసంధించును.

శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥
(భగ.త గీతా. 3-35)

అదియునుగాక సకల విద్యల యొక్క లక్ష్యము మానవుని యుద్ధరించుటయే. బావిలో పడినవాని నుద్ధరించుటకు నిచ్చెనను వాడున్నంతవరకు దించినట్లు మానవులెంత హీనముగా పతనమగుట కవకాశము గలదో, యోచించి వానినా పతనావస్థనుండి యుద్ధరించదలచిన భగవానుడు వివిధయోగ్యతలకు దగినట్లు అనంతములైన విద్యలను సృష్టించినాడు. వానిలో వేదాన్తవిద్య సాక్షాత్సముద్రగామియైన గంగా ప్రవాహము వంటిది. ఇథర విద్యలు సరయూ యమునాది నదుల వంటివని గ్రహించవలయును.

కావున మానవులు స్వస్వయోగ్యతల ననుసరించి వైదికములు-నవైదికములైన ధర్మముల నాచరించి క్రమముగా చిత్తశుద్ధిని సంపాదించుకొనుచు, ఇతోఽధికమైన యోగ్యత గల జన్మములనొందుచు చివరకు మోక్షప్రాప్తికి రాజమార్గమైన వేదాన్తములలోని మహా వాక్యముల యొక్క శ్రవణమనన విధిధ్యాసాదులలో నేదేని యొకదాని నాశ్రయించి మోక్షసామ్రాజ్యమునుఁ చూరగొనవలయును.

శ్లో॥ త్రయీ సాంఖ్యం యోగః పశుపతిమతం వైష్ణవ మితి
ప్రభిన్నే ప్రస్థానే పర మిద మదః । పథ్య మితి చ ।

రుచీనాం వైచిత్ర్యా దృజుకుటిల నానా పథజుషాం
నృణా మేకో గమ్య స్త్వమసి పయసా మర్ణవ ఇవ ॥
"శివ మహిమ్నః స్తోత్రమ్ శ్లో7"

అత్ర మధుసూదనీ వ్యాఖ్యా - హే అమరవర ---------
యథా ఋజు పథ జుషాం గంగా నర్మదాఽఽదీనాం సాక్షాదేవ సముద్రః ప్రాప్యః - యథా వా కుటిలపథజుషాం యమునా సరయ్వాదీనాం గంగాది ప్రవేశద్వారా పరంపరయా - ఏవం వేదాన్తవాక్య శ్రవణ మననాదినిష్ఠానాం సాక్షాత్ త్వం ప్రాప్యః అన్యేషాం త్వంతః కరణశుద్ధితారతమ్యేన పరంపరయా త్వమేవ ప్రాప్యః ------ రుచీనాం వైచిత్ర్యాత్ తస్మింస్తస్మిన్ శాస్త్ర ప్రస్థానే ఇదమేవ శ్రేష్ఠ మిదమేవ మమ హిత మితీచ్ఛా విశేషాణా మనేక ప్రకారత్వాత్ ప్రాగ్భవీయ-తత్తత్కర్మవాసనావశేన ఋజుత్వ కుటిలత్వ నిశ్చయాసామర్థ్యాత్ కుటిలేఽపి ఋజుభ్రాన్త్యా ప్రవర్తన్త ఇత్యర్థ.

...........................................................................

తత్ర తేషాం తాత్పర్య మబుద్ధ్వా వేద విరుద్ధేఽ ప్యర్థే తాత్పర్య ముత్ప్రేక్షమాణా స్తత్తన్మతమేవోపాదేయత్వేన గృహ్ణంతో జనా ఋజుకుటిలనానాపథజోషో భవన్తీతి సర్వేషాం ఋజుమార్గే ఏవ ప్రవేశో న చ విపర్యయేఽపి పరమేశ్వర ప్రాప్తిరంతః కరణశుద్ధివశేన పశ్చాదృజుమార్గాశ్రయణాదేవేత్యర్థః.



# అనుబంధము-5

## సృష్టి క్రమము

నమ శ్శివాభ్యాం పశుపాలకాభ్యాం
జగత్త్రయీ రక్షణ బద్ధ హృద్భ్యయా ।
సమస్త దేవాసుర పూజితాభ్యాం
నమోనమ శ్శంకర పార్వతీభ్యామ్ ॥

రచన : డా॥ అత్తలూరి మృత్యుంజయశర్మ M.A; Ph.D.
ప్రధానాచార్యులు, అధ్యాపకులు,
శ్రీ దుర్గేశ్వర మహిళా సంస్కృతాంధ్ర కళాశాల, వరంగల్.

అచింత్య ప్రభావముగల మహేశ్వరుడు తనయందు నిగూఢముగా నున్న శక్తిని కదిలించి సృజించవలెననెడి సంకల్పము కలవాడాయెను. అంత సమస్త వస్తుపూర్ణమగు హిరణ్మయాండము ఆవిర్భవించినది. అందు పరమేశ్వరుఁడు యోగశక్తితో ప్రవేశించి అట నున్న ప్రధాన పురుషులను ప్రేరేపించెను. దాని వలన రజస్తమ స్సత్త్వము లనెడి త్రిగుణములుదయించెను. తదాత్మకు లగు బ్రహ్మాగ్ని విష్ణువులును జనించిరి. అందు రజఃప్రధానుడగు బ్రహ్మ స్రష్టగను తమఃప్రధానుడగు అగ్ని కాలముగాను (కాలాగ్ని రుద్రుడు) సత్త్వ ప్రధానుడగు విష్ణువు ఉదాసీనుడుగను నియమింపబడిరి. ఈ ముచ్చురు పరస్పర సహాయముచే సృష్ట్యాది వ్యవహారములను చేయుచు త్రిమూర్తులుగా వ్యవహరింప బడుచున్నారు. ఈ కారణముననే సృష్టియంతయు త్రిగుణాత్మకమని చెప్పబడుచున్నది.

మతాంతరమున ఆ యాది దేవుడు తాను నాల్గు విధములుగా విభక్తుడై చతుర్వ్యూహములను కావించినట్లు కలదు. బ్రహ్మచే నుత్పాదింపబడిన ఆ యండమునకు బ్రహ్మాండమని వ్యవహారము కలిగినది. ఇది సగముగా ఛేదింపబడి ఊర్ధ్వాఽధో భేదంబున ఏడేడు లోకములుగా వ్యక్తమయ్యెను. అందు ఊర్ధ్వమున నున్నవానికి భూలోక భువర్లోక సువర్లోక మహర్లోక జనోలోక తపోలోక సత్యలోకములనియును క్రింద నున్నవానికి అతల వితల సుతల రసాతల తలాతల మహాతల పాతాళ లోకములనియును ప్రసిద్ధి. ఇట్టి బ్రహ్మాండములు ఈశ్వర సృష్టిలో వృక్షమునకు కాయలు వలె మేరువు నాధారముగా చేసికొని అనంతములుగా నున్నవి. కనుకనే ఈశ్వరునకు అనంతకోటి బ్రహ్మాండనాయకుడను, వ్యవహారము కలిగినది. ఈ బ్రహ్మాండములు కల్పాద్యంతముల యందు ఈశ్వర సంకల్పమువలన పుట్టుచు గిట్టుచు నుండును. ఈ సృష్టికి ఆద్యంతములు లేవు. ఇది ఈశ్వరుని అసాధారణ వ్యాపారమగుటచే నిరంతరము సాగుచునే యుండును.

సర్గార్థమై ఈశ్వర నియుక్తుడైన బ్రహ్మ తన మనస్సు నుండి ఆత్మ సదృశులైన సనకసనందనాదులను సృజించెను. వీరు వీతరాగులై సృష్టివిముఖులగుటచే బ్రహ్మ పునః స్సృష్టి చేయు సంకల్పముతో దీర్ఘకాలము తపమాచరించెను. అట్లు తపమాచరించినను ఫలము లభించనందున దుఃఖితుడై క్రుద్ధుడైన యాతని నేత్రముల నుండి అశ్రు బిందువులు పడెను. వాని నుండి భూత ప్రేతములు జనించగా వానిని గాంచి మూర్ఛిల్లి పంచత్వము నొందెను. అట్టి బ్రహ్మఫాలభాగమునుండి నీలలోహిత రుద్రుడుదయించి బ్రహ్మను బ్రతికించి తాను ఏకాదశధా విభక్తుడాయెను. ఈశ్వరానుగ్రహమున పునరుజ్జీవితుడైన బ్రహ్మ అతని యనుజ్ఞచే మరీచి భృగు అంగిరస పులస్త్య పులహక్రతు దక్ష అత్రి వశిష్ఠ ధర్మ సంకల్పులనెడి పండ్రెండుగురు ఆది గృహస్థులను సృజించెను.

శ్లో॥ మరీచి భృగ్వంగిరసః పులస్త్యం పులహం క్రతుం ।
దక్ష మత్రిం వశిష్ఠం చ సోఽసృజన్ మనసైవ చ ॥
పురస్తాదసృజ ద్బ్రహ్మ ధర్మం సంకల్ప మేవ చ ॥
ఇత్యేతే బ్రహ్మణః పుత్రాః ద్వాదశాదౌ ప్రకీర్తితాః ।
సహ రుద్రేణ సంభూతాః పురాణా గృహమేధినః ॥

శి. పు. 7-1-12-49,50.

వారివలన దేవగణాన్వితములై క్రియావంతములైన మహర్షులతో కూడిన ద్వాదశ వంశములు వెలసినవి. పిదప ఆ బ్రహ్మ - ముఖము నుండి దేవతలను పార్శ్వమునుండి పితృదేవతలను జఘనము నుండి అసురులను ప్రధానాంగము నుండి మనుష్యులను మూత్రము నుండి రాక్షసులను తమోరజః ప్రధానులైన నిశాచరులను సర్పములను యక్షులను భూతములను గంధర్వులను పశుపక్ష్యాదులను ఇతరావయవములనుండి సృష్టించెను.

శ్లో॥ స సృష్ట్యర్థం సమాధాయ బ్రహ్మాఽఽత్మాన మయూయుజత్ ।
ముఖా దజనయ ద్దేవాన్ పితౄంశ్చైవోపపక్షతః ॥
..............................................
నరకిన్నర రక్షాంసి వయః పశు మృగోరగాః॥

శి.పు. 7-1-12-53 నుండి 63 వరకు.

ఇట్లు సృజించుచున్న బ్రహ్మ కొంత కాలమునకు తన పుత్రుడగు నీలలోహిత రుద్రుని సృజింప నాదేశించెను. అంత నాతడు జరా మరణ రహితులైన తనతో సమానులైన అనేక కోట్ల రుద్రుల సృజింప నారంభించెను. వారిచే బ్రహ్మాండమంతయు వ్యాప్తమాయెను. మరణ ధర్మము కల సృష్టిని చేయుమని కోరగా అట్టి సృష్టి నీవే

గావింపుమని తాను సృష్టినుండి విరమించుకొనెను. మరల బ్రహ్మ సృష్టి సాగించుచుండగా నెంతకును ప్రజావృద్ధి కాని కారణముగా మైథునజ సృష్టిగావింప సంకల్పించెను.

శ్లో॥ తథా మైథునజాం సృష్టిం బ్రహ్మా కర్తు మమన్యత॥

శి.పు. 7-1-15-1.

కాని తత్సాధక మగు నారీ జనము ఇంతవరకు సృజింపబడకుండుటచే తన్నిమిత్తమై ఈశ్వరుని గూర్చి ఘోరతపమాచరించెను. అతని తపస్సునకు మెచ్చి ఈశ్వరుడు అర్ధనారీశ్వరుడుగా సాక్షాత్కరించెను. తదుపరి బ్రహ్మ ప్రార్థనచే దేవిని వేరు చేసెను.

శ్లో॥ ససర్జ వపుషో భాగా ద్దేవీం దేవవరో హరః ।

శి.పు. 7-1-16-6.

అట్టి దేవిని చూచిన బ్రహ్మ నారీ లోకమును సృజించు శక్తి తనకిమ్మని కోరుచు అట్టి సృష్టి చేయుటకుగాను తన పుత్రుడైన దక్షునకు పుత్రికగా జన్మించవలసినదని వేడుకొనెను. దేవి అటులనే యని వర మొసగెను.

శ్లో॥ దక్షస్య మమ పుత్రస్య పుత్రీ భవ భవార్దిని ।
ఏవం సా యాచితా దేవీ బ్రహ్మణా బ్రహ్మయోనినా ॥

శి.పు. 7-1-16-21.

శివ మహాపురాణమునందే రుద్ర సంహిత సృష్టి ఖండములోని 16,17 అధ్యాయములలో బ్రహ్మమానసపుత్రులయిన సనకాదులు వీతరాగులై సృష్టి చేయుట కంగీకరించని కారణమున క్రుద్ధుడైన బ్రహ్మ నేత్రములనుండి అశ్రు బిందువులు స్రవించెను. అప్పుడట ప్రత్యక్షమైన విష్ణువుచే ప్రబోధితుడైన బ్రహ్మ శివుని గూర్చి తపమాచరింప నర్ధనారీశ్వర రూపమున ఈశ్వరుడు ప్రత్యక్షమయ్యెను. అతనిచే ప్రార్థితుడైన ఈశ్వరుడు జరా మరణ రహితమైన సృష్టి గావింపుమని బ్రహ్మ కోరెను. అట్టి సృష్టిని నీవే గావింపుమని ఈశ్వరుడు నుడివెను. బ్రహ్మ పంచీకరణ పద్ధతిన భూత సృష్టిగావించి తన నేత్రములనుండి మరీచిని హృదయమునుండి భృగువును శిరస్సునుండి అంగిరసుని, వ్యానము నుండి పులహుని, ఉదానమునుండి పులస్త్యుని, సమానమునుండి వశిష్ఠుని, అపానమునుండి క్రతువును, శ్రోత్రముల నుండి అత్రిని, ప్రాణమునుండి దక్షుని, ఉత్సంగమునుండి నారదుని, ఛాయనుండి కర్దముని, సంకల్పమునుండి ధర్ముని సృజించెను. తదుపరి తానే స్త్రీ పుం భేదమున ద్విధా విభక్తుడై స్వాయంభువ శతరూపాది స్త్రీ పురుష సృష్టి గావించెను.కల్ప భేదమున దక్షునకు అరువది మంది కన్యలున్నట్లు వారి వలన సృష్టి ఉత్తరోత్తరాభివృద్ధి నొందినట్లు గలదు.

సతీ ఖండమున 13వ అధ్యాయమున బ్రహ్మచే సృజించుటకై ఆదేశింపబడిన దక్షుడు మానస సృష్టి వృద్ధికాని కారణమున ప్రజావృద్ధికై బ్రహ్మను కోరెను. బ్రహ్మ పంచజనాంగభూతయైన ఆసిక్ని అను కన్యను వివాహమాడి మైథునజ సృష్టి గావింపు మనెను. దక్షుడు తన భార్యయందు హర్యశ్వాదులను పుత్రులను కని సృష్ట్యర్థము ప్రేరేపించెను. నారదబోధవలన వారు వీతరాగులై చనిరి. ఆ వృత్తాంతము నెరింగిన దక్షుడు మరల సబలాశ్వాదులను వేయిమంది పుత్రులను సృజించి సృష్ట్యర్థము ప్రేరేపించెను. నారదుడు మరల వారలను వీతరాగుల నొనరించెను. ఆ విషయము తెలిసిన దక్షుడు నారదుని లోక సంచారివి కమ్మని శపించెను. పిదప బ్రహ్మచే నాదిష్టుడైన దక్షుడు దేవిని గూర్చి తప మాచరించి ఆమెను పుత్రికగా బడసెను.

అట్లు దక్షుని యింట జనించిన సతి దక్షునిచే నవమానింపబడి అతని యజ్ఞవాటికయందే యోగాగ్నిచే దేహ త్యాగ మొనర్చినట్లు కలదు.

దేవీ భాగవతమున దగ్ధమగుచున్న సతీ దేహమును భుజమున నిడుకొని యున్మత్తునిగ ఈశ్వరుడు సంచరించుచుండగా విష్ణువు బాణములచే దేవీ అవయవములను ఛేదించెను. అట్లు ఛిన్నములైన ఆ యవయవములు పడిన యెల్ల చోట్లు శక్తి పీఠములయ్యెను.

శక్తి పీఠముల యొక్క పట్టిక పే. 69 నుండి 79 వరకు.

బ్రహ్మ వైవర్త పురాణమున దక్షావమానితయగు సతి జాహ్నవీ తీరమును చేరుకొని శివుని స్మరించుచు దేహమును చాలించెను. అట్టి సతీ దేహమును తిలకించిన శివుడు వక్షస్థలమున ఆ మృత దేహము నిడుకొని పృథ్వినంతయు సంతరించుచు అక్షయ వటచ్ఛాయ యందు రోదించుచుండగా ఆ కన్నీటిచే నేత్ర సరోవరము జనించెను. మరల ఆ మృతదేహము తోడ పరిభ్రమించుచుండ ఆ సతీ శరీరమునుండి రాలి పడిన అవయవములు గల ప్రదేశములే వాంఛితార్థ ప్రదములైన ఆయా శక్తి పీఠములుగా భువిని ప్రసిద్ధి చెందినవి. ఈశ్వరుడు అవశిష్టావయవములకు అగ్ని సంస్కారము గావించి ఆ భస్మము దేహమున నలముకొని అస్థులను కంఠమాలగా నొనర్చుకొనినట్లు గలదు.

శ్లో॥ శేషాంగానాం మహాదేవ స్సంస్కారం వై విధాయ చ ।
అస్థిమాలాం వినిర్మాయ చకార కంఠభూషణం ॥
నిత్యం తద్భస్మ భక్త్యా చ చకార గాత్రలేపనం ।

(బ.వై.పు.కృ.జ.ఖం. 43-26,27.

వరాహ పురాణమున బ్రహ్మచే సృష్టికై ఆదేశింపబడిన రుద్రుడు ప్రళయ జలమున మునిగి తపమాచరించుచుండెను. ఇంతలో బ్రహ్మమానసపుత్రులయిన

దక్షాదులు మరణ ధర్మము కల సృష్టి గావించిరి. తపస్సు నుండి విరతుడైన రుద్రుడు మరణ ధర్మము గల సృష్టిని తిలకించి క్రుద్ధుడై తత్కర్తలను సంహరించు నెపమున తన క్రోధముచే జనించిన భూత ప్రేతాది సైన్య సమేతుడై కనఖల క్షేత్రమున జరుగుచున్న దక్షాధ్వరమునందలి వేద ఘోష విని అటువైపు వెడలెను. రాక్షస భ్రాంతితో దక్షునిచే ప్రేరేపింపబడిన దేవతలకు రుద్రునకు ఘోర సంగ్రామము జరిగెను. బ్రహ్మ ఆ యుద్ధమును శాంతింపజేసి రుద్రునకు యజ్ఞ భాగమును దక్ష పుత్రికయైన గౌరిని ఇప్పించి నట్లు కలదు.

బ్రహ్మచే గావింపబడిన మానసిక అంగిక మైథునజ రూపమున భిన్న భిన్నగా వర్ణింపబడిన ఈ సృష్టి అంతయు పురాణములలో ప్రాకృతాది భేదంబున నవ విధములుగా వర్ణింపబడినది. మొదట సృష్టి ప్రాకృత, వైకృత, ప్రాకృతవైకృత, భేదంబున మూడు విధములు. అందు ప్రాకృతము అబుద్ధి పూర్వకము, అది బ్రహ్మ భూత వైకారిక భేదంబున త్రివిధము. బుద్ధి పూర్వకమైన వైకృతము. ముఖ్య తిర్య గ్దేవ మానుషానుగ్రహ భేదంబున పంచ విధము. ప్రాకృతవైకృత ఉభయాత్మకమైనది కౌమార సర్గమనియు మొత్తము తొమ్మిది విధములుగా సృష్టి పురాణములయందు వర్ణింపబడియున్నది.

1. బ్రహ్మ సర్గము : మహత్తత్త్వసృష్టి.
2. భూత సర్గము : తన్మాత్రల సృష్టి
3. వైకారిక సర్గము : ఇంద్రియ సృష్టి
4. ముఖ్య సర్గము : సృష్ట్యాదియందు బ్రహ్మ పూర్వకల్పము నందలి సృష్టికి వలె సృష్టి గావించవలెనని చింతించుచుండగా తమో గుణ ప్రధానమై తమో - మోహ - మహా మోహ - తామిస్ర, అంధతా మిస్ర రూపమైన అవిద్యా పంచకముత్పన్నమైనది. దాని నుండి జ్ఞాన శూన్యమయిన నగ వృక్షతరుగుల్మ లతాదుల జడ పదార్థముల యుత్పత్తి సంభవించినది. ఇవి భూమి యున్నంతవరకు స్థిరముగా నుండు కారణమున స్థావరములుగా ముఖ్య సర్గములుగా పేర్కొనబడినవి.
5. తిర్యక్సర్గము : బ్రహ్మ పురుషార్థ సాధనవమున ఈ సృష్టి అసమర్థమైనదిగా భావించి మరల తప మాచరించి తిర్యక్సృష్టి గావించెను. అంతః ప్రకాశము కలవై

బహిరావృతములై స్వేచ్ఛా సంచారము గల పశు పక్ష్యాదులు ఆహార నిద్రా భయాది సాధారణ జ్ఞానము కలవి. ఇదియే జంగమ సృష్టి.

6. దేవ సర్గము : పశు పక్ష్యాది సృష్టియును పురుషార్థ సాధకము కానందున సాత్త్వికమైనదేవ సృష్టి జరిగినది. ఈ దేవతలు ఊర్ధ్వలోకవాసులై భోగమాత్రోపజీవులై యుందురు. వీరిలో విద్యాధర, అప్సరో, యక్ష, రక్షో, గంధర్వ, కిన్నర, పిశాచ, గుహ్యక సిద్ధాది భేదములు కలవు.

7. మానుష సర్గము : దేవసర్గమునకు పురుషార్థ సాధనమున కుపకరించనందున సత్యసంకల్పుడగు బ్రహ్మ పృథ్వియందు పరిభ్రమించు నట్టి సత్వ రజస్తమో గుణాధికమైన నూతన ప్రాణి వర్గమును సృజించెను. ఆ ప్రాణి వర్గమే మానవులు. వీరే యుక్తా యుక్త వివేకము కలవారు.

8. అనుగ్రహ సర్గము : ఇది విపర్యాస, శక్తి, తుష్టి, సిద్ధి భేదంబున చతుర్విధము, విపర్యాసము స్థావరముల యందు - శక్తి తిర్యగ్యోనులయందు - తుష్టి దేవతల యందు - సిద్ధి మానవుల యందు బ్రహ్మచే వ్యవస్థీకరింపబడినది.

9. కౌమార సర్గము : ప్రాకృత వైకృత ఉభయాత్మకమైనది సనత్కుమారోదయ కారణమున, దీనికి కౌమార సర్గమని పేరు.

శ్లో॥ ఏవం చింత్య జలేమగ్న స్తతో రుద్రః ప్రతాపవాన్ ॥

..............................................

దదౌ రుద్రాయ మహతే గౌరీం పరమశోభనామ్ ॥

వ.పు. 21-7 నుండి 85 వరకు.

శ్లో॥ ప్రాకృతాశ్చ త్రయః పూర్వే సర్గాస్తేఽబుద్ధి పూర్వకాః ।
బుద్ధిపూర్వం ప్రవర్తంతే ముఖ్యాద్యాః పంచ వైకృతాః ॥

శి.పు. 7-1-12-18.

వేదములలో స్థూలముగా చెప్పబడిన అప్ అన్నా (పృథ్వి) త్మక త్రివృత్కరణ ప్రక్రియయే పురాణములలో కనవచ్చెడి పంచీకరణ పద్ధతికి ఉపలక్షణమని తెలియవలెను. నామ రూపాత్మక మగు ప్రపంచమునకు మూల భూతములైన తత్త్వములు (మూల పదార్థములు) సాంఖ్య సిద్ధాంతమున పంచ వింశతి ప్రకారముగను (ప్రకృతి, మహత్తు, అహంకారము, పంచతన్మాత్రలు, జ్ఞాన కర్మేంద్రియ పంచకము, మనస్సు స్థూల భూత పంచకము, పురుషుడు) శైవ సిద్ధాంతమున ముప్పది యాఱుగను (శివ, శక్తి, సదాశివ, ఈశ్వర, శుద్ధ, విద్యా, మాయా, కళా, విద్యా, రాగ, కాల, నియతి, +25 సాంఖ్య తత్త్వములు = 36) ఆయుర్వేద సిద్ధాంతమున పాంచభౌతికముగను చెప్పబడినవి. సృష్టి యొక చోట స్థావర జంగమాత్మకముగను, మరియొకచో జరాయుజ అండజ ఉద్భిజ్జ స్వేదజ రూపముగను వేరొకచోట దేవతా మానవ మృగ పక్షి జలచర భూచర గిరి తరు గుల్మ తృణ లతాది రూపముననను వర్ణింపబడినది. వర్గీకరణ ప్రక్రియలో భేదము గోచరించుచున్నను ఈశ్వరుని నుండి ఆవిర్భవించుట అను విషయమున విప్రతిపత్తి కానవచ్చుట లేదు.

స్తోత్రం త్రి సంధ్యం శివపార్వతీభ్యాం
భక్త్యా పఠేద్ ద్వాదశకం నరో యః ।
స సర్వ సౌభాగ్య ఫలాని భుక్త్వా
శతాయు రంతే శివలోక మేతి ॥



## శక్తిపీఠముల యొక్క పట్టిక

| ప్రాచీన స్థానము | అవయవము | శక్తి | భైరవుడు | ప్రస్తుత స్థానము |
|---|---|---|---|---|
| 1. హింగళ | బ్రహ్మరంధ్రము | కోటరి | భీమలోచనుడు | హింగ్‌లాజ్: బలూచిస్తాన్‌కు సంబంధించిన లోన్‌బైలాస్థానమున హింగోసీ నది తటముపై కరాచీ నుండి 90 మైళ్ళు ఉత్తర పశ్చిమముగా (పశ్చిమ పాకిస్తాన్) ఒక గుహాంతరాళమున నిప్పుడును జ్యోతిర్దర్శన మగుచుండును. |
| 2. కిరీటము | కిరీటము | విమల | సంవర్తుడు | హవడా ఒరహర్‌నాలైనులో ఖగరాఘాట్ రోడ్ స్టేషన్ నుండి యైదు మైళ్ళ దూరమున లాల్‌బాగ్ కోర్టు రోడ్ స్టేషన్ గలదు. అచటనుండి మూడు మైళ్ళు బద్ నగరము సమీపములో గంగాతటముపై. |
| 3. బృందావనము | కేశకలాపము | ఉమ | భూతేశుడు | బృందావనమున మథురా బృందావన్ రోడ్‌లో బృందావనమునుండి ఇంచుమించు 1½ మైళ్ళ దూరమున భూతేశ్వర మహాదేవ మందిరము నందు. |
| 4. కరవీరము | త్రినేత్రములు | మహిషమర్దిని | క్రోధీశుడు | కోల్హాపుర మహాలక్ష్మి మందిరమే మహిష మర్దినీ మందిరము. దీనిని అంబా |

| | | | | |
|---|---|---|---|---|
| | | | | మందిరమనియు వ్యవహరింతురు. ఇది రాజమహల్ కోశాగారమునకు వెనుకగా ఉన్నది. (మీరజ్ నుండి 36 మైళ్ళు) మహారాష్ట్ర. |
| 5. సుగంధ | నాసిక | సునంద | త్ర్యంబకుడు | బంగ్లాదేశ్‌లోని బులనా రైల్వేస్టేషన్ ద్వారా బరీసాల్‌వెళ్ళవలయును. అచట నుండి 13 మైళ్ళ దూరమున శికార్‌పూర్ గ్రామమున సునందానదీ తటమున ఉగ్రతా యను నావహాంతరము గల సునందాదేవి మందిరము గలదు. |
| 6. కరతోయా నదీతటము | వామపార్శ్వము | అపర్ణ | వామనుడు | బంగ్లాదేశ్‌లోని బొగడా స్టేషన్ నుండి 20 మైళ్ళ దూరమున నిబత్‌లి దిగ్భాగమున భవానీపుర గ్రామమున కలదు. |
| 7. శ్రీ పర్వతము | దక్షిణపార్శ్వము | శ్రీ సుందరి | సుందరానందుడు | లబ్దాఖీ (కశ్మీరు) సమీపమున సిల్‌హట్ (అస్సామ్) నుండి 2 మైళ్ళ నైఋత్య కోణమున జైనపుర స్థానము శ్రీపర్వతము గలదు. |
| 8. వారణాసి | కర్ణకుండలము | విశాలాక్షి | కాలభైరవుడు | కాశీ క్షేత్రమున మణికర్ణికా ఘట్టమునకు సమీపమున శ్రీ విశాలాక్షీమందిరము |

| | | | | |
|---|---|---|---|---|
| | | | | గలదు. ఇది సుప్రసిద్ధము. |
| 9. గోదావరీతటము | వామగండము (కణత) | విశ్వేశి | దండపాణి | రాజమహేంద్రవరము సమీపమునందలి భీమేశ్వర క్షేత్రమున వరాణిక్యాంబ (విశ్వమాతృకా) |
| 10. గండకి | దక్షిణ గండము | గండకి | చక్రపాణి | నేపాలదేశమున ముక్తినాథ క్షేత్రమున గండకీనది ప్రాదుర్భావస్థానమున. |
| 11. శుచి | ఊర్ధ్వదంతపంక్తి | నారాయణి | సంహారుడు/ సంక్రూరుడు | కన్యాకుమారి నుండి 28 మైళ్ళ దూరమున శుచీంద్రములో శ్రీస్థాణు (శివ) మందిరము గలదు. అచటనే నారాయణి స్థానము గలదు. |
| 12. పంచసాగరము | అధోదంత పంక్తి | వారాహి | మహారుద్రుడు | ఈ స్థాన మెచ్చట నున్నదో తెలియదు. (కాశీలో ఉండవచ్చును.) |
| 13. జ్వాలాముఖి | జిహ్వ | సిద్ధిద | ఉన్మత్తుడు | హిమాచల్ ప్రదేశ్ నందలి జ్వాలాముఖీ రోడ్ నుండి 13 మైళ్ళ దూరమున గలదు. |
| 14. భైరవ పర్వతము | ఊర్ధ్వోష్ఠము | అవంతి | లంబకర్ణుడు | అభిదానకోశమున ఉజ్జయినిలో శిప్రా నదీతటమున భైరవ పర్వతమున్నదని కలదు. (గిరానార్ సమీపమున నార్ భైరవ పర్వతము గలదు. మధ్యప్రదేశ్ రాష్ట్రము) |

| | | | | |
|---|---|---|---|---|
| 15. అట్టహాసం | అధరోష్టము | ఫుల్లర | విశ్వేశ్వరుడు | అహమద్ పురము - కటునాలైనులో లాభపూర్ స్టేషన్ నుండి సమీపమున గలదు. |
| 16. జనస్థానము | చిబుకము | భ్రామరి | వికృతాక్షుడు | నాసిక క్షేత్రమున పంచవటీ క్షేత్రము నందీస్థానము భద్రకాళియను పేర ప్రసిద్ధ మైనది. |
| 17. కశ్మీరము | కంఠము | మహామాయ | త్రిసంధేశ్వరుడు | కాశ్మీరమున అమరనాథ గుహలో మంచు దిబ్బలోన శక్తిపీఠము. |
| 18. నందిపురము | కంఠహారము | నందినీదేవి | నందికేశ్వరుడు | హవడా- క్యూల్‌లాయి లైనులో సైంధియా రైల్వే స్టేషన్ గలదు. అచట నుండి ఆగ్నేయ దిగ్భాగమున రైల్వేలైను సమీపమున గల మహావటవృక్షమూలము గలదు. |
| 19. శ్రీశైలము | గ్రీవము (మెడ) | భ్రమరాంబిక (మహాలక్ష్మి) | సంకరానందుడు (ఈశ్వరానందుడు) | శ్రీశైలక్షేత్రములోని భ్రమరాంబికాదేవి |
| 20. నలహాటీ | నలా (ఉదరనాళిక) | కాళిక | యోగీశ్వరుడు | హవడా- క్యూ లైనులో నలహాటీ స్టేషన్ నుండి 2 మైళ్ళు నైరృతి దిగ్భాగమున ఒక దిబ్బపై నీ స్థానము వెలసియున్నది. |
| 21. మిథిలా | వామస్కంధము | ఉమ (మహాదేవి) | మహోదరుడు | ఈ శక్తి పీఠవముయొక్క సరియైన పరిచయువము చిక్కలేదు. ఇచ్చట గల |

| | | | | |
|---|---|---|---|---|
| | | | | ఉగ్రతార - దురాగ - వనదుర్గ - జయ మంగళా దేవీ మందిరములలో ఒకటి కావచ్చును. |
| 22. రత్నావళి | దక్షిణ స్కంధము | కుమారి | శివుడు | బంగ్లాదేశ ప్రసిద్ధమైన శక్తి పంజిన్‌లో నీ పీఠము గలదు. |
| 23. ప్రభాసము | ఉదరము | చంద్రభాగ | వక్రతుండుడు | గిరి పర్వతముపై అంబాజీ, మహాకాళీ శిఖరముపై కాళీ మందిరములు గలవు. వీనిలో నొకటి. |
| 24. జాలంధరము | వామస్తనము | త్రిపురమాలిని | భీషణ భైరవుడు | జాలంధర్ పంజాబ్‌లోని ప్రసిద్ధ మహా నగరము. మహాకాళీ గుడి యిచ్చట ప్రసిద్ధమై యున్నది. |
| 25. రామగిరి | దక్షిణస్తనము | శివాని | చండుడు | చిత్రకూటమునందలి మైసూర్‌లోని శ్రీ శారదా మందిరము. |
| 26. వైద్యనాథము | హృదయము | జయదుర్గ | వైద్యనాథుడు | వైద్యనాథ క్షేత్రమున వైద్యనాథ మందిరమున కెదురుగాగల శ్రీశక్తి (జయ దుర్గ) మందిరము. |
| 27. వక్రేశ్వరము | మనస్సు | మహిషమర్దిని | వక్రనాథుడు | ఓండాలా-సైంథియా లైనులో దుబురాజీపూర్ స్టేషన్ నుండి 7 మైళ్ళు |

| | | | | |
|---|---|---|---|---|
| | | | | ఉత్తరమున శ్మశాన భూమిలో |
| 28. కన్యకాశ్రమము | పృష్ఠము ( వీపు) | శర్వాణి | నిమిషుడు | కన్యాకుమారిలో కుమారీదేవి ప్రధాన మందిరమున కెదురుగా భద్రకాళీ మందిరము గలదు. |
| 29. బహుళ | వామబాహువు | బహుళాదేవి | భీరుకుడు | అహమద్‌పురము నుండి యొక రైల్వే లైను కటువాదరకు వెళ్ళును. కటుదా సమీపమున పశ్చిమ దిగ్భాగమున కేంయాబ్రహ్మ గ్రామములో ప్రకృత శక్తి పీఠము గలదు. |
| 30. చట్టలము | దక్షిణబాహువు | భవాని | చంద్రశేఖరుడు | బంగ్లాదేశ్ చటగాంవ్ నుండి 24 మైళ్ళ దూరమున సీతాకుండమను రైల్వేస్టేషన్ గలదు. దాని సమీపమునందలి చంద్ర శేఖర పర్వతమున ఈశక్తి పీఠము గలదు. |
| 31. ఉజ్జయిని | కూర్పరము | మాంగల్య చంద్రిక | కపిలాంబరుడు | ఉజ్జయినిలో రుద్రసాగర సమీపమున హరసిద్ధి దేవీ మందిరము గలదు. ఈ మందిరమున మూర్తి యేదియు గాన్పింపదు. హిందూ మతద్వేషు లపహరించియో భగ్నము గావించియో యుందురు. ద్వారమునే పూజింతురు. |

| | | | | |
|---|---|---|---|---|
| 32. మణివేదిక | రెండు మణి బంధములు (మోచేతులనుండి ముంజేతుల వరకుండు భాగము) | గాయత్రి | శర్వానందుడు | పుష్కరక్షేత్ర సమీపమున గాయత్రి పర్వతముపై ఈ స్థానము గలదు. |
| 33. మానసము | దక్షపాణి | దాక్షాయణి | అమరుడు | మానససరోవరము త్రివిష్టపము ( టిబెట్) లో నీ స్థానము గలదు. |
| 34. యశోద్ | వామపాణి | యశోదేశ్వరి | చండుడు | బంగ్లాదేశ్‌లో ఖులనాజిల్లా ఈశ్వరీ పురము యొక్క ప్రాచీన నామము యశోహర్. ప్రస్తుతము జసోరా అను పేర ప్రసిద్ధమైనది. |
| 35. ప్రయాగము | హస్తాంగులి | లలితాదేవి | భవుడు | అలోపీదేవి స్థానము : ప్రయాగలో అక్షయ పటము సమీపమునందును ఒక లలితా పరమేశ్వరీ స్థానము గలదు. నతరములోను ఒక లలితాపరమేశ్వరీ స్థానము గలదు. ఇం దేది శక్తి పీఠములో జేరునో సంశయాస్పదము. |
| 36. ఉత్కల విరజా క్షేత్రము | నాభి | విమల | జగన్నాథుడు | పూరీలోని జగన్నాథ మందిరములోని విమలాంబా లేదా యాజపురములోని విరజాంబా మందిరము. |

| | | | | |
|---|---|---|---|---|
| 37. కాంచి | అస్థి కంకాలము | దేవగర్భ | రురుభైరవుడు | శివకంచిలోని శ్రీకామాక్షి మందిరము. |
| 38. కాలమాధ | వామనితంబము | కాళి | అసితాఙ్గభైరవుడు | తెలియదు. |
| 39. శోణము | దక్షిణ నితంబము | నర్మద | భద్రసేనుడు | శోణానదీ సముద్భవ స్థానము నీ శక్తి పీఠము కలదని చెప్పుచున్నారు. డేహరీ-ఆన్‌సోన్ సమీపములో నున్న దందురు. |
| 40. కామగిరి | యోని | కామాఖ్య | ఉమానాధుడు | గౌహతి ( అసామ్) కామాఖ్య తీర్థస్థానము. |
| 41. నైపాల్ | రెండు మోకాళ్ళు | మహామాయ | కపాల భైరవుడు | నేపాల్‌లో పశుపతినాథ క్షేత్రమున భాగమతీ నదీతటమున గల గుహ్యేశ్వరీ దేవి మందిరము. |
| 42. జయంతి | వామజంఘ | జయంతి | క్రమదీశ్వరుడు | అస్సామ్‌లోని శిలాంగ్‌నుండి 33 మైళ్ళ దూరమున జయంతియా పర్వతముపై బౌర్‌భాగ్ గ్రామమున గలదు. |
| 43. మగధము | దక్షిణజంఘ | సర్వానందకరి | వ్యోమకేశుడు | పాట్నాలోని పాటలీ పుత్రేశ్వరీ దేవీ మందిరము. |
| 44. త్రిస్రోతము | వామపాదము | భ్రామరి | ఈశ్వరుడు | బంగాల్‌లోని జలపాయ గుడి జిల్లాలోని బోదా యిలాకాలో శాలవాడీ గ్రామములో తిస్తా నదీతటమున గలదు. |

| | | | | |
|---|---|---|---|---|
| 45. త్రిపుర | దక్షిణపాదము | త్రిపురసుందరి | త్రిపురేశుడు | త్రిపురా రాజ్యములోని రాధా కిశోర్ పుర గ్రామానికి ఆగ్నేయ భాగము 1½ మైలు దూరమున పర్వతముపై. |
| 46. విభాషము | వామగుల్ఫము | కపాలిని | సర్వానందుడు | బంగాల్‌లోని మిదనాపూర్ జిల్లాలో పంచకురా స్టేషన్ నుడి బస్సు తమలుక్ వెళ్ళును. ఈ తమనుక్‌లో కాళీ మందిరము గలదు. |
| 47. కురుక్షేత్రము | దక్షిణగుల్ఫము | సావిత్రి | సర్వానందుడు | కురుక్షేత్రములో ద్వైపాయన సరోవర సమీపమున గలదు. |
| 48. లంక | నూపురము | ఇంద్రాక్షి | రాక్షసేశ్వరుడు | వర్తమాన లంకా ద్వీపమునకు ప్రాచీన పురాణములలో సింహళ ద్వీపము అను పేరు గలదు. ప్రాచీన లంక నింత వరకెవ్వరును గుర్తించలేదు. |
| 49. యుగాద్య | దక్షిణ పాదాంగుష్టము | భూతధాత్రి | క్షీరకంటకుడు | బర్ద్వాన్ స్టేషన్ నుండి 20 మైళ్ళు ఉత్తరాన క్షీర గ్రామమున కలదు. |
| 50. విరాటము | దక్షిణ పాదాంగుష్టము | అంబికా | అమృతుడు | జయపురము ( రాజస్థాన్) నుండి 40 మైళ్ళ దూరమున వైరాట గ్రామమునందున్నది. |
| 51. కాళీపీఠము | వామపాదాంగుళులు | కాళిక | చకులీశుడు | కలకత్తాలోని కాళీ మందిరము ప్రసిద్ధమైనది. |

| | | | | |
|---|---|---|---|---|
| | | | | కాని అనేకులు శాక్త సంప్రదాయజ్ఞులు వాస్తవమున నీ శక్తిపీఠము టాలీగంజునకు వెలుపలనుండు కాళీ మందిరమని చెప్పుచున్నారు. |
| 52.కర్ణాటకము | రెండు చెవులు | జయదుర్గ | అభీరుడు | ఇది కర్ణాటక దేశమున గలదు. సరియైన స్థానము తెలియదు. |

(శ్రీదేవీపూజా-దుర్గా సప్తశతీ పే.నెం. 28 నుండి 288 వరకు)

ప్రకాశకులు

శ్రీరామా బుక్ డిపో-సికింద్రాబాద్.

ఓం ఓం ఓం



అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః ॥

నమోస్త్వనంతాయ సహస్రమూర్తయే ।
సహస్రపాదాక్షి శిరోరుబాహవే ।
సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే ।
సహస్ర కోటి యుగధారిణే నమః ॥

కాయేనవాచా మనసేంద్రి యైర్వా
బుద్ధ్యాత్మనా వాప్రకృతే స్వబావాత్
కరోమియద్యత్సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి

ఓం తత్సత్

# అనుబంధము-6

## హైందవారాధన విధులలో ముద్రల ప్రాధాన్యత

రచన : డా॥ కోవెల సుప్రసన్నాచార్య
డీన్, ఫ్యాకల్టీ ఆఫ్ ఆర్ట్స్, కాకతీయ విశ్వవిద్యాలయము- ఓరుగల్లు.

సనాతనమైన మన సంస్కృతిలో ప్రత్యంశము పరమార్థముతో ముడి పెట్టబడి యున్నది. లౌకిక జీవనమునకు, అధ్యాత్మిక జీవనమునకు ఒక అనుస్యూతమైన ఏకసూత్రము సంబద్ధమై యున్నది. అనాదిగా ఈ దేశములో ప్రచురితములై యున్న ఆచార వ్యవహారములలో, అర్చనాదికములలో, నాట్యాభినయములలో, ఆలేఖ్యములలో, మూర్తి శిల్పములలో, నానావిధములైన హస్త ప్రకారములు, నానాభావ ప్రకటన హేతువులుగా చిత్రింపబడి యున్నవి.

సహజముగనే మానవుని భావప్రకటన సాధకములలో ఆంగికాభినయము ప్రధానమైనది. భాషకన్న ముందే ఈ అభినయము ఏర్పడి భాషకు లోతుగా ప్రవర్తించుచున్నది. ఈ ఆంగికాభినయములలో భ్రూ, నేత్ర, శీర్ష, అధర, గ్రీవ, బాహు, హస్త, కటీ, పాదములు అన్నియు ప్రయోగింప బడ వచ్చును. వీటన్నిటిలో హస్త సంజ్ఞలు బహువిధమైన వైవిధ్యమును విస్తృతిని కల్గియున్నవి. ఈ సహజమైన హస్తాభినయము ఆరాధనాదికమున ప్రయుక్త మైనప్పుడు ముద్రగను, నాట్యాభినయమున ప్రయుక్తమైనప్పుడు కరణముగను పేర్కొనబడుచున్నది.

నిశ్చలమైన విగ్రహముల హస్తముద్రలు చూపరులకు భావప్రతీకలై అభయవరదాది భావములను వ్యక్తీకరించు చున్నవి. అట్లే నాట్యమున పదాకారులైన సంయుతా సంయుతములైన హస్తములు అభినేయమైన కథాంశమును వ్యక్తీకరించుటలో దాని ప్రాశస్త్యమును వ్యాఖ్యానించుటలో తోడ్పడు చున్నవి. అనాదిగా పూజోత్సవములయందు శిల్ప నిర్మాణములందు ప్రయోగింపబడు ముద్రా విశేషములే శాస్త్ర సిద్ధతను పొందినపుడు నాట్యశాస్త్రములోనికి ప్రవేశించి యుండుననుట తర్కదూరమైన అంశముకాదు.

''న తత్ శాస్త్రం న తత్ శిల్పం న సావిద్యా న సాకళా
నా సాయోగో న తత్కర్మ, నాట్యేఽస్మిన్ యన్న దృశ్యతే ''

అని నాట్యశాస్త్రము సర్వశాస్త్రముల విద్యల సంగ్రహముగా చెప్పబడినది. దీనిని బట్టి నాట్యశాస్త్రము, తంత్రాగముల ప్రభావమున ముద్రాదికములను నిశ్చయించినట్లు మనము విశ్వసింపవచ్చును.

ఆగమ శాస్త్రములందు ముద్రల ప్రభావము అనేక విధములుగా పేర్కొనబడినది. దేవతలకు ఇతరోపచారములకన్న ముద్రలే అధిక ప్రీతిని కల్గించునని కూడా శాస్త్రము చెప్పినది. కులార్ణవ తంత్రమున ముద్రలనుగూర్చి "ముదం కుర్వన్తి దేవానాం మనాంసి ద్రావయంతి చ" అనియు చెప్పబడినది. మేరు తంత్రమున "మహాపూజాకృతాతేన యేన ముద్రాష్టకం కృతమ్" అనియు విష్ణు సంహితలో "ముదం కుర్వన్తి దేవానాం రాక్షసాన్ ద్రావయంతి చ" అనియు కాళికాపురాణములో "ముద్రావినాతు యజ్ఞాప్యం, ప్రాణాయామః సురార్చనం యోగోధ్యానాసనంచాపి, నిష్ఫలానితు భైరవ" అనియు ముద్రల ప్రాధాన్యము వెల్లడింపబడినది. ఈ ఆగమముల ప్రకారము ముద్రలు దేవతా సాన్నిధ్యమును కలిగించునవి. "ఇతి ముద్రా నజానాతి గాయత్ర్యానిష్ఫలా భవేత్" అని గాయత్రి గురించి చెప్పబడినది.

శాక్తశైవ వైష్ణవాగమములలో ముద్రల వర్ణనములో అధికసామ్య మున్నను భేదముగల సన్నివేశములు లేకపోలేదు. వైదిక కర్మాచరణమున ముఖ్యముగా యజ్ఞయాగాదులలో, సంధ్యా వందనాదికములలో ముద్రల ప్రయోగములు ఉన్నవి.

ఈ శాస్త్రము ననుసరించి కర్మోపకరణమైన హస్తము సర్వదేవతాత్మకముగా చెప్పబడినది. మణిబంధమునకు పై భాగము ఆత్మ తీర్థమనబడును. కనిష్ఠికవైపుగల కరతల బహిః ప్రదేశము దేవతీర్థమనియు, తర్జనీ అంగుష్ఠముల నడిమి ప్రదేశము పితృతీర్థమనియు, అంగుళులపైని ఊర్ధ్వదేశము, పరమార్థ తీర్థమనియు పేర్కొనబడును. కనిష్ఠిక నుంచి అంగుష్ఠము వరకునుగల వ్రేళ్లు వరుసగా, పృధ్వీ, జల, తేజో, వాయు, ఆకాశముల తత్వములను అభివర్ణించుననిగా చెప్పవచ్చును.

నిత్యవిధియైన సంధ్యావందనముల గాయత్రి మంత్రానుష్ఠానమునకు ముందు ఇరువది నాలుగు ముద్రలును తరువాత ఎనిమిది ముద్రలును విధింపబడినవి.

మంత్రానుష్ఠానమునకు ముందు :- సుముఖము, సంపుటము, వితతము, విస్తృతము, ద్విముఖి, త్రిముఖి, చతుర్ముఖి, పంచముఖి, షణ్ముఖి, అధోముఖి, వ్యాపకాంజలి, శకటము, యమపాశము, గ్రంథితము, షన్ముఖోన్ముఖము, ప్రతిబింబము, ముష్టికము, మత్స్యము, కూర్మము, వరాహము, సింహాక్రాంతము, మహాక్రాంతము, ముద్గరము, పల్లవము యనునవి ఇరువది నాలుగు ముద్రలు.

మంత్రానుష్ఠానము పిదప :- సురభి (ధేను) జ్ఞాన, వైరాగ్య, యోని, శంఖ, పద్మ, అంగ, నిర్వాణము యనునవి 8 ముద్రలు.

ఈ ముద్రలు ప్రదర్శించుట మంత్రదేవతా సిద్ధికి హేతువు. అట్లే దేవాలయములందు దేవతార్చనలో ముద్రాప్రదర్శనము విధింపబడినది. ఆయా దేవతలు

ముద్రా ప్రదర్శనము వలన భక్తుని భావమును గ్రహించి తృప్తులగుదురని తాత్పర్యము. మంత్రభాష యెట్లు బీజాక్షరాదులచేత సంకేతమై గూఢమై ప్రవర్తించునో ముద్రాభాషకూడ సాధనకు దైవతమునకు నడుమ గూఢార్థాభివ్యంజకమై ప్రవర్తించును. లలితా సహస్రనామములలో దశముద్రా సమారాధ్య అనియు, యోని ముద్రలనియు, దేవి పేర్కొనబడినది. దశముద్రలు ఆమె అర్చనలో అత్యంత ప్రాధాన్యం వహించుటెట్లో, యోనిముద్ర దేవీతత్వమును ప్రతీకాత్మకముగా వ్యక్తము చేయునని గ్రహించవలెను.

పాంచరాత్రమున పద్మ సంహితలో కొన్ని ముద్రలు అర్చావేళా ప్రదర్శన యోగ్యములుగా పేర్కొనబడినవి. వానిలోనివి కొన్ని

పాద్మ సంహితలో (పాంచరాత్రము) :- హృదయ, శీర్ష, శిఖా, కవచ, అస్త్ర, నేత్ర, అగ్ని, ప్రాకార, చక్ర, యోగ, యోగసంపుట, సంహార, సృష్టి, తత్వ, న్యాస, దహన, అప్యాయన, సురభి, ఆవాహన, ప్రణామ, పద్మ, శంఖ, గదా, వనమాలా, గరుడ, ధూప, దీప, ప్రతిమా, స్వాగత, ప్రార్థన, గ్రాస, హోమ, ముద్రలు.

ఈ ముద్రలు సంధ్యావందన ముద్రలతో కొంతవరకు సరిపోవుచున్నది. ఇవికాక మరికొన్ని ముద్రలు ఇతర తంత్రాగమోక్తములతో సరిపడును. అయితే ఒకే ముద్రకు భిన్ననామములుండుటకాని, ఒకే నామమునకు భిన్న ముద్రలుండుట కాని, సంప్రదాయ పరంపరల భేదమువలన కలుగుచున్నవి.

నిత్య జపానుష్ఠానములందు చేయు అంగన్యాస కరన్యాసములు పదియును ముద్రలేయని చెప్పవచ్చును. ఇవికాక ఆ యా ప్రయోగ విశేషమును బట్టి వీటికి, జీవన్యాసముద్రలని, మాతృకాన్యాస ముద్రలనీ, హోమ ముద్రలనీ, భిన్నభిన్నముగా విభజించుటకు అవకాశమున్నది.

లక్ష్మీ సహస్రనామములలో అష్టాదశ భుజయైన ఆమె చిన్ముద్ర, ధ్యానముద్ర, ప్రసన్నముద్ర మున్నగు వరదాభయ హస్తములు కలిగియున్నట్లు వర్ణింపబడినది.

నాట్య ప్రయోగములో వేణు, శిఖి, పించ, వీణా, త్రిశూల, శంఖ చక్ర, పద్మ, ధనుర్బాణ, పరశు మొదలైన చిహ్నములు, ముద్రల ద్వారా ప్రదర్శించి, శ్రీకృష్ణ, సరస్వతీ, శివ, విష్ణు, సూర్య, రామ, పరశురామాది దైవతములను ప్రకటించు పద్ధతి యొకటి కలదు.

ఈ విధమైన గూఢ భాషా ప్రయోగము సంక్లిష్టమైన విపులమై భావాంశమును అల్పకాలమున నిశ్శబ్దముగ ప్రకటించు నవకాశము కలుగుచున్నది. ఇదిగాక నాట్య ప్రదర్శనములో భూమ్యాకాశములకు జెందు వివిధ చారులు గూడ కలవు.

తంత్ర శాస్త్రము ఈ ముద్రల ప్రయోజనమును విపులముగా విచారించినది. జలశోధనమునకు, మత్స్య, ధేను, అంకుశ ముద్రల ప్రయోగము గలదు. మత్స్యముద్రవలన జలమునందలి దోషములు తొలగును. ధేను ముద్రవలన వానిలోనికి సుధాంశుతత్త్వము ప్రవహించి అవి అమృతమయమగును. అంకుశ ముద్రవలన దానిలోనికి పవిత్రతాలక్షణము సంక్రమించి అది తీర్థమగును.

తంత్రాగమముల ననుసరించి ఆయా దేవతల అర్చనలో ప్రధానముగా నుపయోగించు ముద్రలు ఇవి.

విష్ణు : శంఖ, చక్ర, గదా, పద్మ, వేణు, శ్రీవత్స, కౌస్తుభ, వనమాలా, జ్ఞాన, బిల్వ, గరు, నృసింహ, వరాహ, హయగ్రీవ, ధనుష, బాణ, పరశు, జగన్మోహినీ, కామ.

శివ : లింగ, యోని, అక్ష, వర, అభయ, మృగ, ఖట్వాంగ, కపాల, డమరు.

గణేశ : దంత, పాశ, అంకుశ, విఘ్న, పరశు, మోతక, బీజాపూర.

సూర్య : పద్మ.

శక్తి : పాశ, అంకుశ, వర, అభయ, ధనుష, బాణ, చర్మ, ముసల, దుర్గ.

మహాకాళి : మహాయోని, ముండ, భూతిని.

మహాలక్ష్మి : లక్ష్మి, చక్ర, పద్మ.

మహాసరస్వతి : అక్షమాల, వీణ, వ్యాఖ్య, పుస్తక.

తార : యోని, భూతిని, బీజ, ధూమిని, లేలిహాన.

త్రిపురసుందరి : సర్వ సంక్షోభిణీ, సర్వనిద్రావిణీ, సర్వాకర్షిణీ, సర్వవశ్యకరీ, సర్వోన్మాదినీ, మహాంకుశ, ఖేచరీ, యోని.

భువనేశ్వరీ : పాశ, అంకుశ, వర, అభయ, పుస్తక, జ్ఞాన, బీజ, యోని.

ఈ విధముగా ఆయా దేవతలకు ప్రీతి కలిగించు ముద్రా విశేషములెన్నియో యున్నవి.

ముద్ర యనగా బంధమని అర్థము. ఆయా ముద్రల ప్రదర్శనములవలన ఆయా భావములు హస్తములయందు బద్ధములైనట్లు భావింపవలయును. అందు వలననే దిగ్బంధ, దిగ్విమోకములు, జపాద్యవసానములయందు నియతములుగా వేయబడినవి.

హస్తకరణములు అభినయమున మిగిలిన కరణములతో కూడి సమిష్టి భావాభినయమునకు తోడ్పడుచున్నవి. రెండు కరణములు ఒక మాతృక, మూడు కరణములొక కలాపకము. నాలుగు కరణములొక మండకము, ఐదు కరణములొక సంఘాతము, ఆరు లేదా అంతకు మించిన కరణముల కలయుత అంగహారము.

హస్తకరణములను వివరించుటలో భరతునకు అభినయ దర్పణకారుడైన నందికేశ్వరునకు భేదము కలదు. ఆ సంయుత హస్తములలో నాట్య శాస్త్రము 24 భేదములను తెలుపగా, అభినయదర్పణము 28 భేదములను చెప్పినది. సంయుత హస్తములలో నాట్య శాస్త్రము 13 భేదములను తెలుపగా అభినయ దర్పణము 23 భేదములను చెప్పినది. నృత్యహస్తమును చెప్పుటలో నాట్య శాస్త్రము ముప్పదింటిని, అభినయ దర్పణము పదమూడు భేదములను మాత్రము వివరించెను. నేటికిని భారతీయ నాట్య ప్రదర్శనలో ఈ హస్తములను మరియు భంగిమలను మనము చూడగలుగుచున్నాము.

ఆరాధనాదికములలో ముద్రల అభినయ ప్రయోగము ప్రచారము క్రమముగా తగ్గిపోవుచున్నది. మరుగున పడబోవుచున్న ఈ విద్యను గూర్చి ఇచ్చుట పాఠకుల కుతూహలమునకు సంగ్రహముగా వివరింపబడినది.

ఉపయుక్త వాఙ్మయము : చండి (మాస పత్రిక) సెప్టెంబరు 83 అలహాబాద్ నాట్య శాస్త్రము (అనువాదము) శ్రీ వి.యన్.ఆర్. అప్పారావు.







కిరీటినం గదినం చక్రిణం చ
తేజోరాశిం సర్వతో దీప్తి మన్తమ్ ।
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమన్తా
ద్దీప్తానలార్క ద్యుతి మప్రమేయమ్ ॥

అనాధి మధ్యాన్త మనన్త వీర్య
మనన్త బాహుం శశి సూర్యనేత్రమ్ ।
పశ్యామి త్వాం దీప్త హుతాశ వక్త్రం
స్వతేజసా విశ్వమిదం తపన్తమ్ ॥

ఈ ''కైలాసదర్శనం'' పుస్తకం గురించి కీ॥ శే॥ డా॥ దాశరధి, శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావుగారు, ప్రొఫెసర్ పి. శ్రీ రామచంద్రుడు గారలు లేఖల ద్వారా వారి అమూల్య అభిప్రాయముల తెలిపిరి. వానిని దిగువన పొందుపరచనైనది.

కళాప్రపూర్ణ
**డాక్టర్ దాశరథి,** డి. లిట్

ఫోన్ : 231701
104-(సి బ్లాక్), మాతృశ్రీ మందిరం,
హైదర్‌గూడా, హైదరాబాదు - 500 029.

14-7-86.

ఆత్మీయులు శ్రీ పి.వి. మనోహర్ రావుగారికి

నమస్కారములు

యెంతో అభిమానంతో మీరు నిన్న మా యింటిదాకా వచ్చి భవద్రచిత ''కైలాస దర్శనం'' అనే గ్రంధాన్ని నాకు ప్రసాదించినందుకు కృతజ్ఞతలు.

మీరు మానస సరోవర యాత్ర విజయవంతంగా నిర్వహించుకుని రావడం ఒక యెత్తు, ఈ గ్రంథం రచించడం మరో యెత్తు. గ్రంధ ప్రచురణ మరింత వ్యయ ప్రయాసలతో కూడుకున్న విషయం.

మీ కృషికి నా అభినందనలు.

ఈ నెల 27వ తేదీ సభకు శతధా రాగలను. అవిష్కరణ సభ అత్యంత విజయవంతంగా జరుగుగాక.

గ్రంథం కొంత పరిశీలించాను. అత్యంత గహనములైన వేదాంత విషయాలను మీరు సులభగ్రాహ్యం చేసినారు. అభినందనలు.

శుభాకాంక్షలతో

భవదీయుడు

**దాశరధి**

కళాప్రపూర్ణ
డాక్టర్ దాశరథి, డి.లిట్

ఫోన్ : 231701
104-(సి బ్లాక్), మాతృశ్రీ మందిరం,
హైదర్‌గూడా, హైదరాబాదు - 500 029.

15-7-86.

ఆత్మీయులు శ్రీ పి.వి. మనోహర్ రావుగారికి

నమస్సుమనస్సులు

నిన్న మీకొక లేఖ వ్రాశాను. ఈ లేఖ వ్రాస్తున్న సమయానికి తమ గ్రంథం కొంత భాగం చదివాను. రచనలో మీరు చూపిన నైపుణ్యం నాకు చాలా నచ్చింది. మీ ప్రయాణ విశేషాలు చెప్పుతూ వాటికి అనుగుణంగా వుండే ప్రాచీన గాథలను, వేదాంత విషయాలను ఉదహరించడం అత్యంత సమంజసంగా వుంది. పాఠకులు మీ యాత్రా విశేషాలను చదవాలనే ఆసక్తితో ఇవికూడా చదివి ఇతోఽధిక విజ్ఞానం పొందుతారు.

ఉదాహరణకు రామకృష్ణన్‌గారి మృతి. ధర్మరాజు తన భార్యను తమ్ములను చనిపోగా వదిలేసి తాను స్వర్గారోహణం చేయడం. సరిగా సరిపోయేలా ఈ ఉదంతం వ్రాశారు. అయితే ధర్మరాజును మించి, మీరు రామకృష్ణన్ గారి శవంతో వెనక్కు నడిచి దాన్ని భారత ప్రభుత్వానికి అందేలా ఏర్పాట్లు చేశారు. అక్కడ మీలోని మానవతా దృక్పథం ధర్మరాజునే మరిపించింది.

మృతదేహాన్ని భద్రపరచడం విషయంలో మీరు పాండురాజు ఉదంతం తీసుకుని రావడం సమయోచితంగా వుంది.

మీ ఆధ్యాత్మిక దృష్టి మీలో నిగ్రహాన్ని, ధైర్యసాహసాలనూ కలిగించింది. మీ అభిప్రాయాలను నిక్కచ్చిగా చెప్పారు ఈ పుస్తకంలో. అభినందనలు. చాలా ఆసక్తికరంగా వుంది మీ యాత్ర. మీ రచన నూతన పద్ధతుల్లో నడిచింది. మీకు గల అపారమైన ఆధ్యాత్మిక పరిజ్ఞానం నాకు ఆశ్చర్యాన్ని కలిగించింది. ఇంకా చాలా చదవవలసి యున్నది. కన్నులకు కట్టినట్లు మీ యాత్రా విశేషాలు మీరు చెప్పగలిగారు. అది గొప్ప విషయం. సందర్భోచితంగా మీరు ఉదహరించిన శ్లోకాలు మీకు గల బహుగ్రంథ పఠనాసక్తినీ, జ్ఞాపక శక్తినీ, వేదాంతానురక్తినీ, భగవద్ భక్తినీ తెలియజేస్తున్నాయి.

మీరు ఎలాగైతే హిమాలయాల్లో జాగ్రత్తగా అడుగులు వేస్తూ యాత్ర సాగించారో నేనూ అలాగే జాగ్రత్తగా మీ గ్రంథం చదువుతున్నాను!

27వ తేదీన వరంగల్లు రాగలననే అనుకుంటున్నాను. మీ ఆహ్వానానికి కృతజ్ఞత.

నా ఆరోగ్యం ఇంకా కుదుటపడలేదు. అంతా ఈశ్వరేచ్ఛ. అభినందనలతో

భవదీయుడు

దాశరథి

ఈ 'కైలాస దర్శనం'' పుస్తకావిష్కరణ ఓరుగల్లులోని భారతీయ విజ్ఞాన జ్యోతిష పీఠంవారు నిర్వహించినారు. సభ గురించి పత్రికలలో వచ్చిన నాటి కొన్ని వార్తలను ప్రచురిస్తున్నాను. - ఆ నాడు అనగా 27-7-1986న హనుమకొండలోని ఆర్ట్స్ & సైన్స్ కాలేజి ఆడిటోరియంలో పై పుస్తకావిష్కరణ జరిగింది. నాటి గా॥ బీహార్ గవర్నర్ కీ॥ శే॥ పెండేకంటి వెంకట సుబ్బయ్యగారు ఆవిష్కరించగా నాటి గా॥ కేంద్ర విద్యాశాఖామాత్యులు శ్రీమతి క్రిష్ణ సాహి ముఖ్య అతిధిగాను, కీ॥ శే॥ డా॥ దాశరధి సభాధ్యక్షులుగాను వ్యవహరించిరి. ఇంకా అనేకపండితులు, సాహితీవేత్తలు, నాయకులు ఆ కార్యక్రమములో పాల్గొనిరి.

## 'కైలాస దర్శనం' గ్రంధావిష్కరణ

(ఆంధ్రప్రభ)

వరంగల్: శ్రీ పి.వి. మనోహరరావు రచించిన, బ్రహ్మ మానస సరోవర యాత్రను వివరించే 'కైలాస దర్శనం' ఉద్గ్రంధాన్ని బీహార్ గవర్నర్ శ్రీ పెండేకంటి వెంకటసుబ్బయ్య ఆవిష్కరించారు. సభకు మహాకవి శ్రీ దాశరధి అధ్యక్షత వహించారు.

గ్రంధంలో రాసిన ప్రత్యక్ష అనుభవాలు చూస్తే దీనిని సాహసయాత్ర అనాలని, శ్రీ మనోహరరావు పాఠకులకు ఆసక్తి కలిగించేలా దీన్ని రాశారని శ్రీ పెండేకంటి వెంకట సుబ్బయ్య అన్నారు. కేంద్ర విద్య సాంస్కృతిక వ్యవహారాల శాఖ సహాయమంత్రి శ్రీమతి కృష్ణసాహి మాట్లాడుతూ మనజాతి ఆధ్యాత్మిక, సాంస్కృతిక వారసత్వం మహోన్నత మైనదని ఈ పవిత్ర భూమిలో ప్రతిరేణువు మనకు ఈ విషయం గుర్తు చేస్తుందని అన్నారు.

టిబెట్‌లో లామాల అతీతశక్తులు, తాంత్రిక యోగశక్తి, మార్మికమైన మహిమలను గురించి ఒకనాడు లాబ్‌సంగ్ రాంపా రాసిన గ్రంధాలలోని అంశాలను ఆంధ్రప్రభ ఎడిటర్ శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు ప్రస్తావించి శ్రీ మనోహర్‌రావు కూడా తన గ్రంథంలో ఈ మిస్టిసిజమ్‌కు సంబంధించి జిజ్ఞాస రేకెత్తించే సమాచారం ఇచ్చారని అన్నారు.

గ్రంథ రచయితతో బాటు మానససరోవరయాత్ర చేసి వచ్చిన పార్లమెంటు సభ్యుడు శ్రీ జె. చొక్కారావు తన అనుభవాలు చెబుతూ ఈ యాత్ర తనకు ఏ విధంగాను కష్టమనిపించలేదని, దీనిలో తాను చేసిన సాహసమేదీ లేదని, అత్యంత ఆనందంతో సుఖంగా ప్రయాణంచేసి అపూర్వానుభూతి పొంది తిరిగి వచ్చామని చెప్పారు.

డాక్టర్ పి.వి. రంగారావు తొలుత రచయితను సభకు పరిచయం చేశారు. ఈ సభను ఏర్పాటు చేసిన భారతీయ జ్యోతిష విజ్ఞానపీఠం అధిపతి శ్రీ వి.బి.ఎన్. శర్మ అతిథులకు స్వాగతము చెప్పారు. చివరన రచయిత శ్రీ పి.వి. మనోహరరావు తన యాత్రానుభవాలను, పుస్తక ప్రచురణ కోసం పడిన కష్టాలను వివరించారు.

## భారతీయతరక్షణకు కవులే కవచం

(ఈనాడు - మంగళవారం, జూలై 29, 1986)

వరంగల్, జూలై 28 (న్యూస్ టుడే) : భిన్న సంస్కృతులు, సాంప్రదాయాలున్న దేశంలోని విభిన్న వర్గీయుల్లో భారతీయతను పెంపొందించేందుకు, భారతీయ సంస్కృతి సాంప్రదాయాలను కాపాడేందుకు కవులు, పండితులు పాటుపడాలని కేంద్ర సాంస్కృతిక వ్యవహారాల శాఖ సహాయమంత్రి శ్రీమతి క్రిష్ణసాహి నిన్న సూచించారు. కాకతీయ విశ్వవిద్యాలయ కళాశాలల ఆడిటోరియంలో నిన్న రాత్రి వరంగల్ భారతీయ జ్యోతిష విజ్ఞాన పీఠం ఏర్పాటు చేసిన ఉత్సవాన్ని ఆమె ప్రారంభించారు.

పౌరుల్లో దేశభక్తి, పరిస్పర ప్రేమానురాగాలు పెంపొందించేందుకు అనువైన సాహిత్యాన్ని అందిచాలని కోరారు. పలు ప్రయాసలకోర్చి బ్రహ్మమానస సరోవరాన్ని దర్శించిన శ్రీ మనోహర్‌రావు రాసిన ''కైలాస దర్శనం'' ఉన్నత ప్రమాణాలున్న గ్రంథమని ఆమె కొనియాడారు.

కవిత్వం పాఠకుడిని విజ్ఞానవంతుడిగా చేసేందుకు దోహదపడాలికాని కాలక్షేపం కోసం కారాదని పుస్తకాన్ని ఆవిష్కరించిన బీహార్ రాష్ట్రగవర్నర్ శ్రీ పెండేకంటి వెంకటసుబ్బయ్య చెప్పారు. సంఘంలోని దుర్ాచారాలను రూపుమాపి నవసమాజ నిర్మాణంలో కవులు సహకరించాలని ఆయన కోరారు.

సమావేశానికి కళాప్రపూర్ణ డాక్టర్ దాశరథి అధ్యక్షత వహించారు. జవహర్ లాల్ నెహ్రూ సాంకేతిక విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షుడు డా॥ జి. లక్ష్మినారాయణ, ఆంధ్రప్రభ సంపాదకుడు శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు, కరీంనగర్ పార్లమెంటు సభ్యుడు శ్రీ చొక్కారావు తదితరులు ప్రసంగించారు.

## కైలాస దర్శనం

(పుస్తక సమీక్ష - ఆంధ్రప్రభ, 17-8-86, ఆదివారం)

శివపార్వతుల నివాసంగా పురాణేతిహాసాలు పేర్కొన్న కైలాస శిఖరం సముద్ర మట్టానికి 22000 అడుగుల ఎత్తులో ఉంది. దానికి సమీపంలోనే మానస సరోవరం ఉంది. ఈ రెండూ హిందువుల ఆధ్యాత్మిక చింతనల్లో యుగయుగాలుగా ప్రముఖస్థానం ఆక్రమిస్తున్నాయి. ఇవి ఒకప్పుడు భారత భూమిలో అంతర్భాగాలుగా ఉన్నా ఇపుడు టిబెట్ భూభాగంలో కలిసిపోయి చైనా ఆధీనంలో ఉన్నాయి. 1962 నుంచి 18 సంవత్సరాలపాటు కైలాస, మానస సరోవరాలను సందర్శించే అవకాశాన్ని భారతీయులు కోల్పోయారు. భారత-చైనాల మధ్య తిరిగ సాంస్కృతిక సంబంధాలు నెలకొనడంతో 1981 నుంచి వీటిని సందర్శించే అవకాశాన్ని మనకు కల్పించారు. కేంద్ర ప్రభుత్వం ప్రతి సంవత్సరం యాత్రికులను ఎంపికచేసి ఐదారు బృందాలుగా వీటి సందర్శనార్థం పంపుతున్నది. కైలాస దర్శనం గ్రంథ కర్త శ్రీ పి.వి. మనోహరరావు 1983లో కైలాస మానస సరోవరాలను

దర్శించారు. తమ యాత్రానుభవాలను, ఇంకా పైన చెప్పిన వివరాలను ఆయన ఈ పుస్తక రూపంలో అందించారు.

'డబ్బు'ంటే ప్రపంచాన్ని చుట్టి రావచ్చునేమోగాని కైలాసదర్శనం మాత్రం చేయలేరు. మానస సరోవరయాత్ర కేవలం డబ్బుతో సాధ్యమయ్యేది కాదు. మనోబలం, మంచి ఆరోగ్యం అవసరం. కైలాసదర్శన యాత్రలో హిమవత్పర్వత ప్రాంతాలను అధిరోహించవలసి వుంటుంది. కాలుజారితేచాలు కబళించివేసే భయంకరమైన లోయలు ఉంటాయి. అడ్డదిడ్డంగా ఉన్నరాతిగుట్టలపై దారిచేసుకుంటూ కొన్ని కిలోమీటర్లు నడువవలసి ఉంటుంది. కొండ అంచులమీద ఒక్క మనిషి మాత్రమే పట్టే ఇరుకుదారిలో నడువవలసి వస్తుంది. ఇంకా అనేక ప్రమాదాలుంటాయి. ఈ ప్రమాదాలను దాటి ముందుకు వుడుతున్న కొద్దీ అద్భుతమైన, అనంతమైన ప్రకృతి సౌందర్యం, ఆవిష్కృతమౌతుంది. ఆ దివ్యానుబూతి జీవితాంతం మరపురానిది.

ఇటువంటి దుర్గమమైన కైలాసదర్శన యాత్రలో ఆనంద విషాదాలు పెనవేసుకుంటూ ఉంటాయి. యాత్రాబృందంలో ఎవరో ఒకరు నేలరాలిన వార్తలు వింటూ వుంటాం. మనోహరరావుగారి బృందంలో దేహదారుఢ్యం, ఆరోగ్యం కలిగిన రామకృష్ణన్ లిపుపాస్ సమీపంలో మంచు దిబ్బల మీదనుంచి క్రిందకు దిగుతూ కాలుజారి నాలుగు మీటర్ల లోతులో పడిపోయి శ్వాస అందక ప్రాణాలు విడిచారట గుండెను కలచివేసే సంఘటన ఇది. అందుకే ప్రాణాలు ఫణంగా పెట్టవలసిన యాత్ర ఇది.

రచయితగా ఇది మనోహరరావుగారి ప్రథమ ప్రయత్నమట. కాని పుస్తకం చదువుతుంటే ఆ భావం కలగదు. నారాయణ రెడ్డి గారన్నట్లు ఆయన కలంలో ' కెమెరా' ఉంది. అంత హృద్యంగా కళ్ళకు కట్టినట్లు తమ అనుభవాలను యాత్రావిశేషాలను వ్రాశారు. పాఠకునికి కూడా కైలాసదర్శన అనుభూతి కలుగుతుంది. మంచు శిఖరాలు, లోయలు, సెలయేళ్ళు, సమున్నతమైన పర్వత సానువుల్లో ప్రజల జీవనం, పట్టణాలు, గ్రామాలు, మార్కెట్లు అన్నీ పాఠకుని కళ్ళముందు కదులుతూ ఉంటాయి.

యాత్రానుభవ వర్ణన ఈ పుస్తకంలో ఒక భాగం మాత్రమే. విద్వత్పరిమళాన్ని వెదజల్లే పెద్దల వ్యాసాలు కూడా ఇందులో ఉన్నాయి. వీటికితోడు సందర్భానుగుణంగా రామాయణ, భారత, భాగవత, పురాణాది గ్రంధాలలోని ఆధ్యాత్మిక, గాథా విశేషాలను, సుభాషితాలను ఉదహరిస్తూ రచయిత దీనినొక ఆధ్యాత్మిక విజ్ఞాన సర్వస్వంగా మలచారు.

కేంద్రమంత్రి శ్రీ పి.వి. నరసింహారావుగారు 'తొలిపలుకు' లో హిందూ సంస్కృతిలోని మౌలిక అంశాలను ప్రస్తావించి పరిశోధనలు జరగవలసిన ఆయా కోణాలను ఆవిష్కరించారు. హిందూ జీవనంలో అతర్నిహితంగా వున్న సమన్వయ శీలాన్ని నిరూపించారు.

పుస్తకానికి అనుబంధంగా చేర్చిన 'హిమాలయము మానస సరోవరము' (డా॥ శ్రీ భాష్యం విజయసారథి), 'హిమాలయ సౌందర్యము' (డా॥ కోవెల సుప్రసన్నాచార్య), 'పురాణాలలో కైలాసమానస తీర్థ ప్రశంస' (డా॥ అత్తలూరి మృత్యుంజయ శర్మ), 'శాక్తాది సంప్రదాయము - ఒక పరిశీలన' (శాస్త్రుల భార్గరామ శర్మ) ఇత్యాది

వ్యాసాలు హిమాలయములు, కైలాస సరోవరాలతో ముడిపడ్డ కావ్య, ఆధ్యాత్మిక, ఆగమ తాంత్రికాది విశేషాలను వివరిస్తూ పాఠకునికి కరదీపికల్లా ఉపకరిస్తాయి.

యాత్రలో తీసిన కలర్ ఫోటోలు రమ్యంగా ఉన్నాయి. కానీ 23 సార్లు కైలాస యాత్ర చేసిన స్వామి ప్రణవానందతో తాము తీయించుకున్న ఫోటో ప్రచురించకపోవడం ఒకింత నిరుత్సాహం కలిగించింది.

తెలుగులో యాత్రా విశేషాలను వివరించే పుస్తకాలు చాలా తక్కువ. ఉన్నవాటిలో ఇది మణిపూస అనడంలో అతిశయోక్తి లేదు. మనోహరరావుగారు పడ్డ శ్రమ చరితార్థం. కైలాస శిఖరం గురించి, మానస సరోవరం గురించి తెలుగులో పుస్తకాలు లేని కొరతను ఆయన తీర్చగలిగారు.

\- భాస్కరం

# కైలాస దర్శనం

\- రస బ్రహ్మ కృష్ణానంద సరస్వతి

(పుస్తక సమీక్ష - జనధర్మ, అక్టోబర్ 5,1986, ఆదివారం)

మానవులకు వలెనే సాహిత్యానికి కూడా ఒక్కో సంవత్సరం అదృష్టదశ ఎత్తుకుంటుందేమో అనిపిస్తుంది అలాంటి అదృష్టం మన తెనుగు సాహిత్యానికీ ఏడు పట్టి రెండు అపురూప మహోత్కృష్టమైన గ్రంధాలు వెలువడినై. ఒకటి మహాకవి శేషేంద్ర ఆధునిక మహాభారతం. రెండవది మహాస్తిక సజ్జనులైన పాములపర్తి మనోహరరావుగారి కైలాసదర్శనం. అధ్యయనయోగ్య స్థాయినందుకున్న ప్రప్రథమాంధ్ర యాత్రా సాహిత్య గ్రంధంగా రూపొందడం తెలుగు వారి అదృష్టమనక తప్పదు. ఆస్తిక్యతా పరినిష్ఠమైన చిత్తశుద్ధితోపాటు అత్యద్భుత మనోహర రచనాశైలిని సంతరించుకున్నది ఈ గ్రంధం.

నలుబదైదు అధ్యాయాల ఈ సాహిత్యసృష్టిలో మనోహర్రావుగారి జీవుని వేదన ప్రతి వాక్యమునందును స్పష్టమగును. కైలాస శిఖర దర్శనమూ మానస సరస్తీర్థమూ వీరికి జన్మధన్యతాసాధనములుగా భాసించినవి. కావున గ్రంధాదిని గణేశవైదిక ప్రార్థనముతోనూ, విశ్వవ్యాప్త శివాకార భావముతోను ప్రారంభమై, గ్రంధాంతము గీతాచార్యుని అమృతతుల్య ధర్మోపదేశశ్లోకముతోనూ, పుష్పదంతుని సర్వదైవస్వరూపమైన వాసుదేవస్మరణముతోనూ సమాహితములైనవి. పరమవాత్సల్యమూర్తియైన తమ మాతృస్మృతి ఈరచయితను యాత్రాంతము వరకు భద్రంకరముగా ఉత్సాహపరచినట్లున్నది. శ్రీ రావుగారు తమకుతాము భక్తి సాహిత్య సంపన్నము చేసికున్న విధానము, ఉపనిషత్సంహితనుండి నీనా దేవతాస్తోత్రములనుండి, లోకానుభవోక్తిచాటువుల నుండి, అసూయపుట్టించు నంత సందర్భశుద్ధి నెరిగి, సూక్తుల నుటంకించుట మరో ఎత్తు.

ఈ గ్రంధము తెలుగు భాషలోని యాత్రా సాహిత్యంలో క్లాసిక్ స్థాయిని సంతరించుకున్నది. ఏ రచనయూ రసవంతము కానిదే పాఠకుని ఆకట్టుకొనలేదు. అట్లాకట్టుకున్న ఈ రచన సంపూర్ణ రసవంతమైనదనుట నిస్సందేహము.

ఈ గ్రంథములో వారు చూపిన చారిత్రక భౌగోళిక ఆధ్యాత్మిక విశేషాలు కోకొల్లలు. శివాపరాధ శ్లోకములను ఉటంకించిన సందర్భంలు మనస్సంస్పృష్టములు. ఇంకొక విశేషమేమనగా సామాన్యముగా ఈ వివరములు పాఠకుని పఠనాసక్తికి హానికరములని బావింతురు. కానివీనిలో హానికర గుణమును తీసివేసి పఠనాసక్తిని ఇనుమడింపచేసిన రచయిత శాబ్దికేంద్ర జాలము నిస్సంశయప్రశంసా పాత్రము.

అధ్యయనయోగ్యతను సంతరించుకున్న ఈ 'కైలాస దర్శనము'ను విద్యాలయాలలోనూ, విశ్వవిద్యాలయాలలోను శ్రేణీవారిగా నియమిస్తే యువతకెంతైనా ప్రయోజనకారియగునేమో!

## FOR BELIVERS IN HINDUISM

(Book Review - Indian Express, Sept. 13, 1986)

TRAVELOGUES there are many under religious propaganda plenty. This book in Telugu on piligrimage to Mansasarovar, now in China is a comibnation of both.

The book comprises a plan of the routes and places besides several good photographs.

Had it been a mere travelogue, a book of about 100 pages would have been sufficient. But the author had a different view altogether. As and when occasion arose he recorded his impressions and added the inforamtion concerning various Hindu ideas, concepts and ways of worship. Nothing was missed.

References from sacred texts religious books and literary works around. There is a deliberate effort to convey all information and knowledge concerning Hinduism. That is why six articles by orthodox pandits occupying high places in educational institutions of Warangal were added as supplements.

The writer's brother Mr. P.V. Narasimha Rao, Union Minster for Human Resources, has written the foreword to this book. It is no wonder that the temple administrations of Tirumala and Vemulavada shoud come to the aid of the author by giving financial assistance. But it may appear strange, at least, to some who set much value by scientific outlook and secular attitude that the Department of Cultural Affairs in the Central Government and the State of Andhra Pradesh should give moneytary help for publishing the book.

One is bound to agree with Swamiji of Courallam that the book is meant for the belivers of Hinduism.

- M.V. Ramamurthy.

వరంగల్‌లో ''భారతీయ జ్యోతిష విజ్ఞానపీఠం'' వారి ద్వారా నాచే రచింపబడిన 'కైలాస దర్శనం'' పుస్తకావిష్కరణ ఉత్సవానికి, కొందరు పెద్దలు సభ దిగ్విజయంకావాలని ఆశీఃపూర్వక ఆకాంక్షలు తెలిపిరి. వానిలో ముఖ్యమైనవి క్రింద పొందుపరిచాను. గమనించ మనవి.

**Pulok Chatterji**
Deputy Secretary

**PrimeMinister's Office**
New Delhi - 110 011.

July 23/24, 1986

Dear Shri Sarma,

The Prime Minister has received your letter of 16th July, 1986. He thanks you for the copy of the book by Shri P.V. Manohar Rao and sends you his good wishes.

Yours sincerely,
sd/-
**(Pulok Chatterji)**

---

**GOVERNOR**
Andhra Pradesh

**RAJBHAVAN,**
Hyderabad-500041.

**MESSAGE**

The Holy Mt. Kailas and the Manasa Sarovar have their own significance in the scriptures of Bharat reflecting the celestial glory. For quite some time, derth and authentic information on the various aspects of Manasa Sarovar and Mt. Kailas, within the reach of the common man and that too in one's own language has created a void.

I am happy that "Kailas Darshanam" - a pilgrimage to Manasa Sarovar, written in Telugu by Shri P.V. Manohar Rao is filling this gap and I am sure the first hand information so vividly presented in his book will open new vistas of knowiedge. On the happy occasion of the inauguration of this volume at the historic City of Warangal to be held on the 27th July, 1986, I send my heartiest felicitations to the author and wish the publication every success.

**(KUMUD JOSHI)**

**Ministry of Human Resource Development** Shastri Bhaw

New Delhi - 100 0

## MESSAGE

I am glad to know that Bharatiya Jyothisha Vignana Peetham organising a function for the release of book "Kailasa Darshanam Brah Manasa Sarovara Yathra" written by Shri. P.V. Manohara Rao.

Trevelogues are rare in Telugu and few have secceeded mentally transporting the reader to places the writer has visited. S Manohara Rao, is his lucid narrative and easily understandable langua has achieved this rare feat of making the readers feel that they we really in those places which Shri Rao has described. More than this t narrative of Shri Rao has also a fund information for those readers with religious bent of mind.

I extend my best wishes and congratulations to the author.

**(P.V. Narasimha Ra**

---

## ANDHRA PRADESH CONGRESS COMMITTEE

Gandhi Bhavan, Hyderabad - 500 001.

మండలి వెంకట కృష్ణారావు 26-7-8

కార్యదర్శి

మిత్రులు శ్రీ పి.వి. మనోహరరావుగారికి

నమస్కారములు.

భారతీయ జ్యోతిష్య విజ్ఞానపీఠం, వరంగల్ ఆధ్వర్యంలో మిత్రులు శ్రీ పి. మనోహరరావు రచించిన 'కైలాస దర్శనము' అను గ్రంధాన్ని బీహారు గవర్నరు శ్రీ పెండేకంటి వెంకటసుబ్బయ్యగారు ఆవిష్కరించుచున్నందులకు చాలా సంతోషము. సందర్భంగా ఆవిష్కరణమహోత్సవము జయ ప్రదంగా జరుగవలెనని కోరుకుంటున్నా గ్రంథకర్తకు మా అభినందనలు.

ఇట్లు

మండలి వెంకటకృష్ణారావు

